మార్పులచేతనైతేనేమి ఆయాకాలములందు కవులవలంబించుచూ వచ్చిన సంప్రదాయ భేదముల చేతనైతేనేమి ఒక్కొకప్పుడు కవులు లాక్షణికులు కూడ తెలిసియో తెలియకయో అవలంబించిన నిరంకుశత్వముచేతనైతేనేమి లక్ష్యలక్షణములలో కొన్ని సందర్భముల వ్యత్యాసములు పొడగట్టుచుండుట, కొందరు మహాకవులు లాక్షణికుల యీ సడింపులకు పాలై అలాక్షణిక కవులుగ పరిగణింపబడుట, కొందరు లాక్షణికులు తాము చేయగడగిన లక్షణము విషయముననే తబ్బిబ్బులుపడి లక్ష్యవిరుద్ధముగా లక్షణము నేర్పరచిన వారుగా తయారగుట తటస్థించుచూ వచ్చినది. అట్లు లక్షణవిరుద్ధములని లాక్షణికులు చెప్పిన అనేక రూపములకు కారణము భాషలో కాలక్రమమున గలిగిన సహజ పరిణామమేనని, అట్టివి ప్రామాణికులగు కవులు ప్రయోగించి యుండుటచే ప్రమాణములుగానే గ్రహింపవలెనని, అట్టివే యిటీవలికాలమునగూడ శిష్టవ్యవహారసిద్ధములైనచో వాని ప్రామాణికత్వము సంగీకరించి, జీవద్భాషయగుటచే యిందలి ప్రయోగపద్ధతిని కాలానుగుణముగ విస్తృతి నొందింపవలసిన ఆవశ్యకతకలదని తొలుత దేశముచే గుర్తింపజేసినవారు శ్రీగిడుగు రామమూర్తిపంతులుగారు. కాని యీ వ్యవహారము జనులనోళ్ళలో అనేకవిధములుగా ఉండేదేగాని గ్రంథస్థముకాకపోవుటచే ఈభాషకుసరియైన హద్దులు ప్రామాణికత్వము ఇంకను సుస్థిరముగా నేర్పడలేదు. దానికై విశేష పరిశ్రమ జరుగవలసియున్నది. ఈ విషయమున శాస్త్రచర్చలు వదలి భాషాతత్వమును గుర్తించి భాషాపరిణామరీతుల ననుసరించి శిష్టవ్యవహారముగా గ్రహింప

శ్రీ రా మ సే వ

# కిష్కింధాకాండము—విషయసూచిక

# విషయసూచిక




శ్రీః.

శ్రీసీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

శ్రీమతే రామచంద్రాయనమః.

శ్రీమతే రామానుజాయనమః.

శ్రీమతే హయగ్రీవాయనమః.

శ్రీశారదాయై నమః.

# శ్రీమదాంధ్రవాల్మీకిరామాయణము



## కిష్కింధాకాండము.



చరణౌజోవికసిత
వాచంయమి హృదయకమల ♦ వారిత శమలా
ఖేచర భూచర వినుత వ
నేచరవరపరమమిత్ర ♦ నీరదగాత్రా! ౧

### మందరము

శ్రీ = ఆశ్రితుల నుభయలోకముల రక్షించు శక్తిసంపద గల, చరణ = భగవంతుని పాదములయొక్క, ఓజః = మాహాత్మ్య మనెడి కాంతిచేత, వికసిత = (౧) పూచిన, (౨) సంతోషించిన, వాచంయమి = మునులయొక్క, హృదయకమల=పద్మాకారముగల హృదయకోశమనెడి 'పద్మకోశప్రతీకాశం హృదయం చాప్యధోముఖమ్'; హృదయము పద్మాకారమని ప్రసిద్ధి. భగవచ్చరణముల తేజస్సుచే మునుల హృదయకమలము వికసించె ననుటచే జరణములకు సూర్యత్వారోపణము

సూచితము. సూర్యుని కిరణములు సోఁకిన బద్మములు వికసించునట్లు భగవంతుని పాదధ్యానముచేఁ గలిగిన భగవదనుగ్రహముచే మునుల హృదయకమలములు వికసించె నని, సంతోషించెనని భావము.

ఓయీ! భగవంతుఁడు సర్వసముఁడుగదా, అందఱిమీఁద నాయన కటాక్షము ప్రసరించి యందఱిహృదయంబులు వికసింపఁజేయరాదా యనిన నెండ సర్వసమముగాఁ గాయుచు లోకములోని యన్ని సరస్సులయందుండు కమలములమీఁద సమానముగాఁ బడుచున్నదికదా, అన్నికమలము లొకకాలమందే వికసించుచున్నవా? లేదు. మొగ్గలు వికసింపవు. ఏ పువ్వు కోరకత్వ ముకుళత్వాది దశలు దాఁటి లోపలఁ దేనె కలది యగునో యట్టి పక్వపుష్పము మాత్రమే వికసించుచున్నది. అట్టులే భగవత్కటాక్ష మందఱియందు సమముగానే ప్రసరించినను వాచంయములుగా నుండు వారి హృదయములను మాత్రమే వికసింపఁ జేయును. వాచంయము లనఁగా వాక్కును నియమించినవారు. వాక్కనునది తక్కిన యింద్రియముల కుపలక్షణము. వాక్కు నియమించుట యనఁగా నోరుమూసికొని యూరకుండుటగాదు. ప్రాకృతవిషయ వ్యర్థ భాషణముల నాడక 'జిహ్వే కీర్తయ కేశవ' మ్మన్నట్లు భగవత్కీర్తన గానములందు నియమించుట - అట్టులే వీనులు హరికథాశ్రవణమందే నియమించుట - ఈ విషయము శ్రీభాగవతమున నంబరీషుని విషయమై యిట్లు చెప్పఁబడెను. స్కంధము - ౯-౮౨. 'సీ. చిత్తంబు మధురిపు శ్రీపాదములయంద పలుకులు హరిగుణ పఠనమంద, కరములు విష్ణుమందిర మార్జనములంద శ్రవములు హరికథాశ్రవణమంద, చూపులు గోవింద రూపవీక్షణమంద శిరము కేశవ నమస్కృతులయంద, పదము లీశ్వరగేహపరిసర్పణములంద కామంబు చక్రికైంకర్యమంద, సంగ మచ్యుతజనతనుసంగమంద, ఘ్రాణ మసురారి భక్తాంఘ్రికమలమంద, రసన దులసీదళములంద, రతులు పుణ్య, సంగతులయంద యా రాజచంద్రమునకు.' ఇట్టి వారు నిజమైన వాచంయములు - యోగులు సర్వకర్మ సన్న్యాసులుగాని యితరులవలె మిథ్యాచారులుగారు - ఇట్టివారి కరణ్యావాసము - వేషధారణ మనావశ్యము - గృహమందుండియే యిట్టి కార్యములు చేయవచ్చునని "విష్ణుభక్తులందు విష్ణువు నందుఁ గ,లంక మెడలి మనసు లంకెపెట్టి, విహితరాజ్యవృత్తి విడువని వాఁడునై, యతఁడు రాచతపసి యనఁగ నెగడె." జనకాదు లట్టివారేకదా! 'కర్మతంత్రుఁ డగుచుఁ గమలాక్షుఁ బొగడుచు నుభయనియతవృత్తి నుండెనేని, జెడును గర్మమెల్ల శిథిలమై మెల్లన ప్రబలమైన విష్ణుభక్తి చెడదు.' భాగ. ౮-౧౨౩. ఈ విధముగ సర్వేంద్రియములు వాని సర్వకర్మములు భగవత్పరములు చేసినవారి హృదయకమలములు వికసించును.

ఓయీ! కమలము కోరకత్వ ముకుళత్వాది దశలుదాఁటి స్వభావముచేతనే పక్వమై తమంతఁదామ వికసించినట్లు హృదయము కాలపక్వమై తనకుఁదానే వికసిం

చును. భగవంతుఁడు చేయు కార్యమేమి? పద్మమెంత పక్వస్థితికి వచ్చినను సూర్య స్పర్శలేక వికసింపదు. ఎండదగులదేని వికసింపక రేకులు ముడుచుకొని ముడుచుకొని లోలోపలనే చెడును. అట్లులే మన మెంత ప్రయత్నముచేసినను భగవత్కటాక్షము లేక మనకార్యము ఫలింపదు. భగవదనుగ్రహముచేతనే జీవులు బాగుపడవలసిన వారైరి. దశకంఠుని జయింప వలయు నని జటాయువు చేసిన ప్రయత్నముకంటె దశేంద్రియముల జయించుట యందే పురుషుఁ డెక్కువ శ్రమింపఁ గలఁడు? భగవత్కటాక్షము లేకుండుటచే వాని ప్రయత్నము వ్యర్థ మయ్యెనుగదా - వ్యర్థ మెట్లయ్యెను? రామానుగ్రహము గలిగెఁగదా యందు రేమో! సత్యము - ఏల కలిగెను? వాఁడు చేసిన కృషి యాత్మలాభార్థముగాదు. శ్రీసీతారామ కైంకర్యముగాఁ జేసెను. ఇది నిర్వంచనముగాఁ జేసిన కారణముచే నచిరకాలమునందే రెండుమూఁడు గంటలలోనే ఫలము చూపించెను. వాఁడే యాత్మార్థమె చేసియుండిన నీ ఫలము గలుగునా? కావున సకామకర్మములు చేయరాదు. నిత్యకర్మములు భగవత్కైంకర్యరూపములుగాఁ జేయనగు. దానివలన భగవదనుగ్రహము వచ్చును. భగవత్సాక్షాత్కారము కలుగును. కైంకర్యపరుడగు జటాయువునకు వచ్చినంత శీఘ్రముగ మోక్షఫల మే యోగికి నే జ్ఞానికి వచ్చెను? దానివలననే తారతమ్య మెఱుఁగనగు. ఈ సందర్భమున- 'అహం స్మరామి మద్భక్తం,' 'పాషాణకాష్ఠ సదృశాయ దదామి ముక్తిం,' 'క్షిప్రం భవతి ధర్మాత్మా' 'స్వయం నయామి మాధవం.' ఇత్యాదివాక్యములును భగవద్గీత యందలి "యేతు సర్వాణి కర్మాణి మయి సంన్యస్య మత్పరాః, అనన్యేనైవయోగేన, మాం ధ్యాయంత ఉపాసతే, తేషా మహం సముద్ధర్తా మృత్యు సంసారసాగరాత్, భవామి నచిరా త్పార్థ మయ్యావేశిత చేతసామ్॥భ. గీ. ౧౨; ౬ - ౭ అను శ్లోకములును 'యమే వైష వృణుతే తేన లభ్య' యను శ్రుతివాక్యమును స్మరించునది.

ఓయీ! భగవంతుని తేజస్సుచే వికసించిన యని చెప్పవచ్చునే చరణముల తేజస్సుచేనని యేల చెప్పవలెను. పాలుత్రాగు దూడలకు చంటిబిడ్డలకుఁ దల్లుల చన్నులతోనే పనిగాని తక్కిన దేహముతో బనిలేదు. అవి దొరకెనా యవితృప్తి వడును, బాగుపడును. అట్లులే భక్తులకు భగవత్పాదములు దొరకెనా భగవంతునితోను బనిలేదు. లక్ష్మణునివలెఁ బాదములురెండు గట్టిగఁబట్టుకొనెనా భగవంతుఁడు నిరాకరింపలేఁడు, తప్పించుకొని పోవనులేఁడు, కదలనులేఁడు.

ఈ పద్యమందలి చరణౌశబ్దము ద్వయము నందలి చరణౌయను పదమును సూచించుచున్నది. ఆ శరణాగత మంత్రమందలి మొదటిపదము నర్థము బాలకాండ మందును రెండవపదము నర్థము అయోధ్యాకాండమందును మూఁడవపదము నర్థము ఆరణ్యకాండమందును వివరింపఁబడెను. ఇందు చరణశబ్దార్థము వివరింపఁబడును.

'నారాయణం సలక్ష్మీకం, ప్రాప్తుం తచ్చరణద్వయమ్' ఉపాయ ఇతి విశ్వాసో,

ద్వయార్థ శ్శరణాగతిః.' లక్ష్మీసమేతుఁడైన నారాయణుఁ జేరుటకు నాయనపాదములే యుపాయ మను విశ్వాసము గల ద్వయార్థమే శరణాగతి.

అరణ్యమందలి ఋషులు భగవంతుని రక్షార్థులై కొందఱు మోక్షార్థులై కొందఱు ధ్యానించుచుండుటయు వారియొద్దకే పోయి శ్రీ రామచంద్రమూర్తి దర్శన మిచ్చి వారిని సంతోషింపఁజేయుటయు దీనివలన సూచితము. దీనివలన వారికి వచ్చిన లాభ మేమి? వారితశమలా = వారింపఁబడిన పాపములు గలవాఁడా, శమలము= పాపము, అనిష్టప్రాప్తికి, నిష్టాప్రాప్తికిఁ బాపములేకదా కారణములు. అట్టివానిని దొలఁగించువాఁడు 'అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి' 'అభయం సర్వ భూతేభ్యో దదామి' యను భగద్వాక్యములు స్మరించునది. ఖేచర భూచర వినుత = ఖేచర=ఆకాశమున సంచరించు దేవతలచేతను. (అలుక్సమాసము) భూచర = భూమి యందుఁ జరించు మనుష్యులచేతను, వినుత = స్తోత్రము చేయఁబడినవాఁడా.

ఆర్తజనరక్షణార్థమై శ్రీరామచంద్రమూర్తి దండకారణ్యమందుఁ జేసిన విరాధ మారీచ కబంధ ఖరాదివధయు, శబరీ జటాయు మోక్షప్రదానములోనైనవి మనుష్యులకే కాక దేవతలకుఁగూడ బొగడఁదగినవి. ఇంతవఱకుఁ బూర్వకాండ వృత్తాంతము చెప్పఁబడెను.వనేచరవర=హనుమత్సుగ్రీవాదులకు,పరమమిత్రా=ఉత్కృష్టస్నేహితుఁడా! ఇది భగవంతుని సౌశీల్య గుణమును సూచించుచున్నది. తాను వాస్తవముగ గొప్ప వాఁడయ్యుఁ దాను గొప్పవాఁ డను నహంకారములేక యల్పులతోఁ గలసి మెలసి యుండుట సౌశీల్య మనఁబడును. దీని కెంతటి యుదారభావ ముండవలెను. ఓయీ, నీవు చెప్పినది సరిగాదు. తన కక్కఱపడి వానరులతో నొకకార్యము కావలసి వారి స్నేహము చేసెనేకాని యితరకారణముచేఁగాదు. పట్టాభిషిక్తుఁడై యుండెనేని యిట్లు వారితో మెలఁగియుండు నని యేమి నమ్మకము?

రామచంద్రమూర్తి తనకార్యము తాను జేసికొనలేక సుగ్రీవునితోఁ జెలిమి సేసెనేకాని సౌశీల్యముచేఁ గాదనికదా మీ యభిప్రాయము? మంచిది. రామచంద్ర మూర్తి యయోధ్యలో నున్నప్పుడే గుహునితో నంత చెలిమి చేయుటచేఁ గదా యిరువురు కౌఁగిలించుకొనిరి. గుహునివలన రామచంద్రమూర్తికిఁ గాఁగల కార్య మేది? శబరిని వెదకుచుఁ బోయి రక్షించె గదా. ఆమెవలనఁ గాఁగల కార్యమేది?

ఇంతకు రామసుగ్రీవ సంధానమునకుఁ గబంధుఁడు కారణభూతుఁడు. వాఁడూరకనే యుండెననుకొందు - రామలక్ష్మణులు సీతాన్వేషణ కార్యము చాలించియుం దురా? జటాయువు చెప్పినట్లు చక్కఁగాఁ బోయి దక్షిణసముద్ర తీరము చేరియుందురు. ఈ త్రోవలో సంపాతివంటి వా రెవరైన రావణు వృత్తాంతముఁ జెప్పియుందురు. రావణాసురుని పేరు తెలియును. వాఁడు దక్షిణముగాఁ బోవుటయుఁ దెలియును. వాఁడుండునది లంక యని పేరుమాత్రము వా రెఱుంగరు. ఆయన కిప్పుడు తెలియఁ

గూడ దనియే యుందఱు దాఁచిరి. ఏల? తెలియవచ్చెనేని వెంటనే వారు లంకకుఁ బయనించియుందురు. 'పద్భ్యాం యాంతు ప్లవంగమాః' క్రోఁతులు కాలినడక సముద్రము దాఁటుదురు గాక యన్నట్లు సముద్రమునఁ ద్రోవ జేసికొని యావలియొడ్డునకుఁ బోయియే యుందురు. లంక నాశముచేసియే యుందురు. ఈ విషయ మిట్లు కాఁగల దని హనుమంతుఁడు సుగ్రీవునకుఁ జెప్పెనుగదా. చూ. కిష్కిం ౭౭౫-౭౭౭-౯౬౫ - శ్రీరామసాహాయ్యము లేకున్న సుగ్రీవుఁడు యావజ్జీవ మిట్లు పడియుండవలసినవాఁడై యుండును. కాని సుగ్రీవుని సాహాయ్యములేకున్న రామకార్యము చెడదు. లంకలో సాహాయ్యము చేయుటకు విభీషణుఁడు సిద్ధపడియున్నాఁడు. ఇంతకు మొదట సంధికై వచ్చినవాఁ డెవఁడు? సుగ్రీవుఁడు కాఁడా' సుగ్రీవుఁడు ప్రత్యుపకారము చేసినవాఁడేకాని ప్రథమోపకారి కాఁడు. క్షత్రియులు సామదానముల సంధుల సహాయసంపత్తి కలిగించుకొనుట రాజనీత్యనుసారమే కాని విరుద్ధము కాదు. సుగ్రీవుఁడు శ్రీరాముని యుత్తమత్వ మంగీకరించెనుగాని శ్రీరామచంద్రమూర్తి సుగ్రీవునిఁ దన తమ్ములలో నొకరినిగా భావించెను. ఏరాజు తన సామంతరాజులను దమ్ములుగా భావించెను? ఈ విధముగఁ గలసి మెలసి యుండెను? ఈ కారణములచే శ్రీరామచంద్రమూర్తి సౌశీల్యమునకు నౌదార్యమునకు నే హానియు రాలేదు. ఖేచర భూచర వినుతుఁడు, వనచర మిత్రుఁడగుట సౌశీల్యముచేఁ గాకున్నను మఱి దేనిచే నగును? నీరదగాత్రా=మేఘమువలె నల్లని దేహముగలవాఁడా,నీరదమనఁగా నీళ్లనిచ్చునది. అట్టి మేఘమును జూచినపుడు లోకులు కాపులు "ఈ మబ్బులు వాన కురియును. మన తాప మాఱును. పైరులు పండును" అని యెట్లు సంతోషింతురో యట్లు రామచంద్రమూర్తిని జూచిన యాశ్రితులును దమ కోర్క లాయనవలనఁ బండునని తమ తాపత్రయము లాఱు నని సంతోషింతురు. నీళ్లులేని మబ్బు సంతోషకరము కాదుగదా.

## అవతారిక.

ఆరణ్యకాండమున దీనసంరక్షణ మను ధర్మమును రామచంద్రమూర్తి యనుష్ఠించి చూపెను. ఈ కాండమందు మిత్రరక్షణము ననుష్ఠించి చూపుచున్నాఁడు. పూర్వకాండమున జటాయువు మొదలగు వారికి మోక్ష మిచ్చి తన పరాత్పరత్వమును వెల్లడిచేసెను. ఈ కాండమున నాయన యసంఖ్యేయ కల్యాణగుణంబులు చెప్పఁబడును. ప్రథమకాండమున శరణాగతి మంత్రమందలి యుత్తరార్థస్థ శ్రీమచ్ఛబ్దార్థము సీతాకల్యాణముచే వివరింపఁబడెను. అయోధ్యాకాండమందు సర్వజనవ్యామోహవిషయత్వముఁ జెప్పి నారాయణశబ్దార్థము వివరింపఁబడెను. ఆరణ్యకాండమందుఁ బంచవటీవాసపర్యంతవృత్తాంతముచే మునిజనులు చేసిన కైంకర్యము చెప్పుటచే 'నారాయణాయ' యను పదమందలి చతుర్థీవిభక్తి యర్థముచెప్పఁబడెను. ఖరాదివధచే మంత్రమందలి యుత్తరార్థమున 'నమ' యను మూఁడవపదము నర్థము

విశదీకరించి మారీచదర్శనము మొదలు జీవుఁ డుజ్జీవించు నుపాయము చెప్పఁబడు చున్నది.

అరణ్యకాండంబున సీతాదేవి లంక ప్రవేశించె నని వ్రాయుచోట ౯౦౧ వ పద్యవ్యాఖ్యయందు 'స్త్రీప్రాయ మితరత్సర్వం, జగ ద్బ్రహ్మపురస్సరమ్'అన్నట్లు సీతాదేవి ప్రకృతి విశిష్టజీవుఁ డనియు 'అచేతనా పరార్థాచ నిత్యా సతతవిక్రియా త్రిగుణా కర్మిణాం క్షేత్రం ప్రకృతే రూప ముచ్యతే'- యని చెప్పఁబడిన ప్రకృతియే రావణాసురు నిమిత్తమై యేర్పడి చిత్ర విచిత్ర వికారములు చూపు మాయామృగ శరీరమనియుఁ దత్కాలమున రామునందలి ప్రేమకంటె నా చర్మమందుఁ గామమధికమై భగవంతుఁ డగు రామచంద్రుని భాగవతుఁడగు లక్ష్మణుని విడనాడుటచే రక్షకులు లేనిదై దశేంద్రియముల (దశకంఠుని) పాలై లంక యను శరీరమందుఁ బ్రవేశించి రాక్షసస్త్రీ లను తాపత్రయములకుఁ జిక్కి దుఃఖించుచుండె ననియుఁ జెప్పఁబడెను.

శ్రీరామచంద్రమూర్తి సీతను వెదకె నను కథచే భగవంతుఁడు జీవు నుజ్జీవింపఁ జేయు నుపాయచింతనము చెప్పఁబడెను.

ఈ కాండమందు నా జీవు నొద్దకు నాచార్యుఁడు పంపఁబడుట చెప్పఁబడును. శ్రీరామచంద్రమూర్తి విలాపము నెపమున నిత్యకైంకర్య పరులైన నిత్యసూరుల జూచి యయ్యో జీవులందఱు వీరివలె భోగమున కర్హులయ్యు నేల కొందఱు నన్నుఁజేర రాకున్నా రను భగవంతుని క్లేశము ప్రథమసర్గమున వర్ణింపఁబడును.

ఆచార్య శిష్యవృత్తము సుందరకాండమున విశదీకరింపఁబడును.

కం. రాజీవేందీవరఝష, రాజీసువిరాజమాన♦రమణీయ శ్రీ
యోజితపుష్కరిణిం,గని యాజిసుతుఁడు తమ్ముతోడ ♦ హాయని వనరెన్. ౨

రాజీవ = కమలములయు, ఇందీవర = కలువలయు, ఝష = మీనములయు, రాజీ = సమూహముచే, సువిరాజమాన = మిక్కిలిచక్కఁగఁ బ్రకాశించు, రమణీయశ్రీ = అందమైన శోభాసంపత్తిచే, యోజిత = కూడిన, పుష్కరిణిన్ = కొలనిని, కని = చూచి, ఆజిసుతుఁడు = రామచంద్రమూర్తి (ఆజ = దశరథుఁడు, అజుని కుమారుఁడు,) తమ్ముతోడన్ = తమ్ముఁడగు లక్ష్మణునితో, వనరెన్ = దుఃఖించెను.

స్మృత్యలంకారము.

పుష్కరిణీం శాంతామ్మన్నట్లుపుష్కరిణిశబ్దము సీతాదేవియందు నన్వయించును. రాజీవ మను ముఖము ఇందీవర మను కన్నులు - ఝష=చేఁపలవంటి తళుకుచూపులు గలదై పుష్కరిణి సీత సౌందర్యమును స్మృతికిఁ దెచ్చెను. తమ్ముతోడన్ = ఊరడించువా రుండినను లక్ష్యముసేయక - హాయని = వావిడిచి - బాహిరముగ దుఃఖించెను. తమ్ముతోడ వనరెన్= అనుటచే నీయన దుఃఖము చూడలేక లక్ష్మణుఁడును వనరె నని భావము.

'స్నిగ్ధజన సంవిభ క్తం దుఃఖం సహ్యం భవతి' యన్నట్లుతనయందుఁ బ్రేమగల వారితోఁ దనదుఃఖము చెప్పుకొనుటచే నా దుఃఖమున సగమువారును బంచుకొందురు గాన సహింప సాధ్యపడుచున్నదన్నట్లు సమానశోకుఁడైన తమ్మునితో నిట్లు చెప్పుచున్నాఁడు.

తాత్పర్యము

కమలములయుఁ గలువలయు మీనములయు సమూహముచే మిగులఁ బ్రకాశించుచు సౌందర్య లక్ష్మితోఁ గూడిన పంపాపుష్కరిణిం జూచి రామచంద్ర మూర్తి తమ్ముఁడగు లక్ష్మణునితోఁ దనదుఃఖము చెప్పుకొని యిట్లు పలవించెను.

ఇందుఁ బంప పుష్కరిణి యని చెప్పఁబడెను. అరణ్యకాండమున - పుష్కరిణీం పంపాం (73-10) శీతోదకో హ్రదః (73-40) పుష్కరిణ్యాః పంపాయాః (74-4) పంపాం పానీయవాహినీం (75-11) ఉదకవాహినీ (75-13) జగామ పరమం హ్రదః (75-21) స్ఫటికోపమతోయాఢ్యాం శ్లక్ష్ణవాలుకసంతతాం పంపాం (75-24) ఇమాం నదీం శుభజలాం (కిష్కింధ, 3-7) ఈ ప్రయోగములు పంప యనునది సరస్సా నదియా యను సందేహమును గలిగించుచున్నవి. ఏదయ్యెనను నిప్పుడిది యెందున్నది యని విచారింపవలసియున్నది దీనికి సమీపమందే కిష్కింధయు నుండవలెను.

పంప సరస్సా నదియాయని రామాయణమునుబట్టి పరిష్కరింప సాధ్యపడదు. కాని రెండు విశేషణము లొకదానికే ప్రయోగించుటచేఁ బంపయనునది కొంతనది యనియుఁ గొంతమడుఁగుగా నున్నదనియు నిశ్చయింపనగు. స్థలము పరిశోధించితిమేని యీ యూహయే నిశ్చయపడుచున్నది.

సంస్కృతాంధ్ర పకారములు కన్నడమున హకారమగును. పండు = హణ్ణు, పాలు = హాలు, పాడు = హాడు, ఇట్లు పంప హంపియై యుండవలెను. ఈ హంపి యిప్పుడు బళ్లారిమండలమున హాస్పేట తాలూకాలో నున్నది. ఇప్పుడు తుంగభద్ర యనునదియే పూర్వము పంప యనఁబడుచుండెనని చెప్ప సాధనములు గలవు.

౧. ఈ తుంగాభద్రాతీరమున నీ స్థలమున శివక్షేత్ర మొండుగలదు. ఈ యీశ్వరునకుఁ బంపాపతి యనియే పేరు.

౨ If legendary history and local tradition be credited, there was a town on this site many centuries before the Vijayanagar Kings selected it for their capital Some of the great dramatic scenes in the great epic of Ramayana occurred at a place called Kishkindha and it is asserted by the local Brahmins and generally acknowledged * by the learned in such matters that this Kishkindha was close to Hampi. * * * * * * Pampa saras or Pampa thirtham is the name of a tank on the Nizam's side of the Tungabhadra near Anegondi and Pampa is also said to be the ancient and

* See Reie's Mysore 1. 277 and the authority there quoted. Also Dr. Bhandarkar in Bombay Gazetteer, Vol I. pt 2. p 142.

Puranic name of the river; Rishyamuka is the hill on the Nizam's side of the narrowest of the gorges in the river already mentioned; Matanga parvatam or Mantaga's hill, has been referred to above; Malyavanta hill lies to the East of it; the cave where Sugriva kept Sita's Jewels and the marks made on the rocks by her garment as it fell to earth are pointed out to the pious piligrim near the river bank; while a curious mound of cinders near the neighbouring hamlet of Nimbapuram is shown as the cremated remains of Vali;" Hampi ruins pages 8, 9. "The Kingdom of Vanara or monkey racewasin the north and west of the Mysore,their chief City being Kishkindha near the village of Hampi on the Tungahadra" Mysore & Conty, Vol I page 178. Mysore—Reie Vol I. page 146.

This river is formed by the union at Kudali of Tunga and the Bhadra of which the former runs most of its course within this (Shimoga) District in N. E. direction.

From this point of confluence of the united stream, the river runs north to the frontier which it follows N E. to beyond Harihara receiving on the left bank Choradi and on the right the Haridra. Thence leaving Mysore it runs North separating Madras and Bombay until joined on the left by the Varada when again turning N. E. it marks the boundary between Madras and Nizam's dominions and receiving on the right the Haggari or the Vedavati flows past Hampi, the site of the ancient cities of Kishkindha, Anegondi and Vijayanagar into the Krishna beyond Kurnool Part II. page 427.

There are four copper plate inscriptions in the (Shimoga) District claiming to be grants made by the Pandava Emperor Janamejaya son of Parikshit of the lunar line. This is the monarch to whom the Maha Bharata was originally recited. The grant at the Bhiman Katta ratha near Thirthahalli is dated in the year 89 of the Yudhistara era or B. C. 3012. The king is stated to be ruling at Kishkindha and to have made the grant in the presence of the God Harihara on the spot where his great grand father Yudhistara had rested on the bank of the Tungabhadra.

Page 487. From the point where Varada enters (Tungabhadra) it on the left, the river turns N. E. and flowing past the village Hampi between the sites of the celebrated cities of Kishkindha etc. Vol. I Page 345 Vijayanagar.

The site selected for the new capital was a remarkable one on the banks of the Pampa or Tungabhadra where the ancient Kishkindha had stood. Vijayanagar the last Hindu Sovereignity of the South was founded in 1336 and brings us back after a lapse of more than two

thousand five hundred years to the site of Kishkindha whose annals engaged our attention near the beginning of this historical survey.

3. హంససందేశమందు శ్రీ వేదాంత దేశికులవారు 'అంగీకుర్వన్ స్మృతరుచిరాముత్పతిష్ణో స్సలీలం ఛాయామంతస్తనమణిమయో మాల్యవా నేష శైలః' అని శ్రీ రామచంద్రమూర్తి తా నుండునది మాల్యవంత మను పర్వత మని చెప్పెను. ఇచ్చటి నుండి హంసకు లంకకుఁ బోవుమార్గము చెప్పుచు నా పర్వతము విడువఁగానే "ఇక్షుచ్ఛాయే కిసలయ మియం తల్పమాత్రస్థుషీణాం సల్లాపై స్తై ర్ముదితమనసాం శాలిసంరక్షకాణాం కర్ణాటాంధ్ర వ్యతికరవశా త్కృశ్రే గీతిభేదే, ముహ్యంతీనాం మదన కలుషం మార్గ మాసాధయేథాః." కర్ణాటాంధ్రభాషాసంకరముచే శబళితమైన పాటలు పాడుచు మళ్లకుఁ గాపుండు పడుచులఁ జూడఁగల వని చెప్పెను. కన్నడము తెలుఁగు మిశ్రమము బళ్లారి మండలమునందు గలదు. కావున మాల్యవంతము బళ్లారి మండలమందే కలదని యేర్పడెను. ఇది చూచుకొని నీవు తూర్పుపర్వతముల వెంటఁ బోవునపుడు నీకు శ్రీ వేంకటాద్రి గానవచ్చు నని హంసతో రామచంద్రమూర్తి చెప్పినట్లు చెప్పెను.

"విష్ణోర్వాసా దవనివహనా ద్బద్ధర త్నైశ్శిరోభి శ్శేష స్సాక్షా దయ మితి జనై స్సమ్యగున్నీయమానః" అని చెప్పెను. కావున శ్రీరామచంద్రమూర్తి యుండిన పంపాతీరస్థ మాల్యవంతము బళ్లారి మండల మందలిదే యని నిశ్చయింపవచ్చును.

మఱియును తుంగభద్రాప్రశస్తి శ్రీ పాదుకా సహస్రంబున ౨౦౩ వ శ్లోకమందు వేదాంత దేశికులవారే "దినకరకులజానాం, దేవి! పృథ్వీపతీనాం నిరుపధి మధికారం ప్రాప్నువత్యాం భవత్యాం। అజనిషత సమస్తాః పాదుకే తావకీన స్నపన సలిలయోగా న్నిమ్నగా స్తుంగభద్రాః॥" అని శ్లేషగా వర్ణించెను. కిష్కింధానగర మొక్కటి నేఁడు లేదుగాని, తక్కిన వన్నియుఁ గిష్కింధాకాండమునఁ జెప్పఁబడినవి పర్వతములు, గుహలు, నదియు స్పష్టముగ గుర్తింపవచ్చును. ఈ విషయమున భవభూతివాక్యమే ప్రమాణము.

'పురా యత్ర స్రోతః పులిన మధునా తత్ర సరితాం విపర్యాసం యాతో ఘన విరళభావః క్షితిరుహామ్ బహోర్దృష్టం కాలా దపరమివ మన్యే వన మిదం నివేశః శైలానాం తదిదమపి బుద్ధిం ద్రఢయతి.'

ఉత్తర. రా. ౨-౨౭.

కం. పంపాలోకనసమ్ముద, కంపితసర్వేంద్రియుండు ♦ కంజాతశరా౽౽
కంపితహృదయుఁడు రాఘవుఁ, డింపుగ లక్ష్మణునితోడ ♦ నిట్లని పలికెన్. 3

పంపాలోకన = పంపను జూచుటచేఁ గలిగిన, సమ్ముద = నిండు సంతోషముచే, కంపిత = చలించుచున్న - సర్వేంద్రియుండు = సకలమయిన యింద్రియములు గల

వాఁడు- కంజాతశర= కమలములు బాణములుగాఁ గల మన్మథునిచే- ఆకంపిత=మిగుల చలించునట్లు చేయఁబడిన - హృదయుఁడు = హృదయము కలవాఁడు-

శ్రీరామచంద్రమూర్తి పంప నాలోకించి మిగుల సంతోషించె ననుటచే భగవంతుఁడు నిత్యులు ముక్తులు నానందరసమున మగ్నులై యుండుటను జూచి సంతోషించె నను నర్థము స్ఫురింపఁజేయుచున్నది. ఆ వెంటనే సీతను దలఁచి యార్తుఁడయ్యె ననుటచే జీవులందఱిట్లుండక కొందఱు విషయాసక్తులై దుఃఖించుచున్నారే యని వారిని దలఁచి కరుణామయుఁడైన భగవంతుఁడు పరితాపపడుట సూచితము.

లక్ష్మణునితోడ ననుటచే లక్ష్మణశబ్దమునకుఁ జిహ్నమనియు నర్థము గలదు. చిహ్ననామ్నోస్తులక్ష్మ కేతౌ సారస స్త్రియాం॥ నానా॥ ౪॥ సమానశోకుఁడగుటచేఁ దనశోకమువంటి శోకముగలవాఁ డని భావము.

తా త్ప ర్య ము.

పంపను నవలోకించుటచేఁ గలిగిన సంతోషాతిశయముచేఁ జలించు నవయవములు గల శ్రీరామచంద్రమూర్తి సీతాదేవి స్మృతికిరాఁగా సీతకై తానెంత శోకించుచు వెలవెలఁబోయి యున్నాఁడో తనకై యట్టి ముఖచిహ్నములు గల లక్ష్మణునితో నిట్లనెను.

కం. విరిదమ్ములుఁ జెంగల్వలు, సురుచిరవైడూర్యవిమల♦శోభనజలముల్
పరిసరవివిధద్రుమములు, బరఁగెడి సౌమిత్రి! కంటె ♦ పంప తెఱంగున్. ౪

విరిదమ్ములు=వికసించిన కమలములు, చెంగల్వలు= చెన్ను+కలువలు సమీపంబునఁ జెన్నుశబ్దమున కెఱుపని యర్థముకావున నెఱ్ఱకలువలు, సురుచిర = మిగుల మనోహరమైన, వైడూర్య= వైడూర్యము కాంతిగల, విమల=నిర్మలమైన- పరిసర= ప్రాంతములనున్న, వివిధ=పలుతెగలగు, ద్రుమములు = చెట్లు, సౌమిత్రి=సుమిత్రానందనా,లక్ష్మణా; ఇట్లు చెప్పుటచే భక్తిచేఁ గరఁగిన మనస్సు గలిగి దానిని సూచించు ముఖప్రసాద పరికరములు గల పురుషుఁడు సూచింపఁబడెను.

తా త్ప ర్య ము.

వికసించిన కమలములు, ఎఱ్ఱగలువలు, వైడూర్య కాంతిగల నిర్మల జలములు, ఆ నీటియొడ్డున నానావిధములైన వృక్షములు గలదగు పంపవిధము సౌమిత్రీ! సూచితివా!

కం. కొండలు శిఖరంబులతో, నుండుగతిం గొమ్మలెసఁగు♦నుర్వీజంబుల్
మెండుకొనఁ బంపచుట్టును, గొండాడఁగఁ దగిన వనులు ♦ గొరలెడిఁ గంటే. ౫

ఉర్వీజంబులు=చెట్లు, కొండాడఁగన్=స్తోత్రము చేయుటకు, వనులు=అడవులు.

తా త్ప ర్య ము.

శిఖరములతోఁ గొండ లుండు విధముగ నెత్తగు కొమ్మలతోఁ బంపచుట్టుగల యడవులందలి చెట్లు నుతింపఁ దగియున్నవి.

కొండలకు వృక్షములకు శిఖరములకు నెత్తుకొమ్మలకు నుపమానము. చెట్లు లీలావిభూతిని - కొండలు నిత్యవిభూతిని సూచించుచు నిచ్చట నెట్లు గురుశిష్య న్యాయము కలదో పరత్వమందును 'సత్రపరత్ర చాపి' యను న్యాయమున నాచార్య శిష్యన్యాయము గలదని భావము. దీనిచే నాచార్యులు భగవద్దయారసోపజీవులనియు వారి నాశ్రయించి శిష్యులు జీవింతు రనియు సూచితము.

కం. భరతుని దుఃఖంబున సతి,హరణంబున శోకతప్తుఁడై వనరెడి నన్
గురుతరదుస్సహపీడా,భరమున మాధవుఁడు ముంచుపగిదిం దోఁచెన్. ౬

శోకతప్తుఁడై = శోకముచేఁ దపింపఁబడినవాఁడై, వనరెడి = దుఃఖించెడి, గురుతర = మిగుల గొప్పదియగు, దుస్సహ = సహింపరాని, పీడాభరమునన్ = అతిశయించిన బాధయందు, మాధవుఁడు = వసంతుఁడు, ముంచుపగిదిన్ = ముంచెడి వానివలె-ఇచ్చట వలె ననుటచే వసంత ఋతువలనఁ గలుగు బాధలే దనియు సీతాభరతు లకుఁ గలిగిన దుఃఖమునకై దుఃఖించెద ననియు భావము.

తాత్పర్యము.

ఊరివెలుపలఁ గుటీరమందుండి యుపవాసాది వ్రతములఁ గృశించు భరతుని నిమిత్తమునను సీత రాక్షసులచేఁ జిక్కి బాధపడుచున్న దను కారణమునను శోకపీడి తుఁడ నగు నన్ను వసంతుఁడు నధికదుఃఖమున ముంపఁ జూచుచున్నాఁడు భరతుని విషయ మైన కామబాధలేనట్లు, సీతావిషయమైన కామబాధయు లేదని భావము. ఇరువురకుఁ గష్టము కలిగెననియే తనకు దుఃఖము.

కం. శోకార్తుఁడ నగు నాకును, నీ కాసారంబు మిగులనిం పొనగూర్చెన్
బ్రాకటవిచిత్రవనమై, శ్రీకరశీతోదకంబు చిత్రసుమంబై. ౭

కాసారము = కొలను- శ్రీకర = శోభకలిగించు - శీతోదకంబు = చల్లనీళ్లు- సుమంబు=పుష్పము-విరహులకు వసంతకాలము, ఉద్యానవనము- సరస్సులు-పద్మాది సుమములు - విరహసంతాపోద్దీపకారణము లయినను నవి తన్నుఁబీడింపక సంతోషమే కలిగించె ననుచున్నాఁడు.

తాత్పర్యము.

'దుఃఖితే మనసి సర్వమసహ్యం' మ్మనఁగా దుఃఖించువానికి సర్వమసహ్య మగును అన్నట్లు సీతాభరతులకై యేడ్చు నాకుఁగూడ నీ కొలను విచిత్రవనముచేఁ జుట్టఁబడి తాపము హరించి దేహకాంతి కలిగించి చల్లని నీరు గలదై-యట్టి చల్లఁదనమునకుఁ గారణములగు మేలి పువ్వులు గలదై మిగుల సంతోషమే కలిగించుచున్నది.

కాసారము- కం = జలము- సుఖము, దానిని బొందునది కాసారము; పరమ పదమువలె ముక్తులకు భోగ్యస్థాన భోగోపకరణములు కలదై సుఖస్థానమై సంతోషము కలిగించెడిని - ముక్తజీవుల సుఖము దలఁచి సంతోషము, బద్ధజీవుల దుఃఖము దలఁచి దుఃఖము.

క. ఉరగానుచరిత మయ్యును, సరసి మృగశకుంతనికర♦సంకుల మయ్యున్
సరసీరుహనీలాబ్జో,త్కరసంఛన్నంబు నయ్యుఁ ♦ దతము వెలింగెన్. ౮

ఉరగ + అనుచరితము = పాములచేఁ గూడియుండునది- సరసి = కొలను- మృగ = మృగములయొక్కయు- శకుంత = పక్షులయు- నికర = సమూహముచే- సంకులము = కూడినది- సరసీరుహ = కమలములయు- నీలాబ్జ = నల్లకలువలయు- ఉత్కర = సమూహముచే- సంఛన్నంబు = కప్పఁబడినది.

తాత్పర్యము.

పాములచేఁ జుట్టఁబడి, మృగములచేఁ బక్షులచేఁ గూడినదై కమలములు కలువలు వీనిచేఁ గప్పఁబడి కొలను గానవచ్చుచున్నది చూచితివా?

పాములు చుట్టుకొనియుండుట, మృగాదులు సంకులపెట్టుట, నీళ్ళు కానరాకుండఁ బూవులు కప్పుకొనియుండుట యివి యన్నియు దోషములే యయినను నిది శుభదర్శనముగా నున్నది.

"తేషాం తేజోవిశేషేణ ప్రత్యవాయో న విద్యతే" తేజోవంతులను వారి తేజోవిశేషముచే దోషముంటదు అను స్మృతి వాక్యము ప్రకారము జ్ఞానులయందు నేదే దోష మున్నను నది వారిని బాధింపఁజాలదు అనిభావము.

కం. రమణీయనీలపీతము, లమలినశాద్వలము లవిగో ♦ నతులితశోభన్
ద్రుమసుమసమర్పితము లై, కమనీయము లయ్యె రత్న♦కంబళము లనన్. ౯

రమణీయ = మనోహరమైన- నీలపీతములు = నలుపు పసుపుగలవి- అమలిన= మలినములేని- శాద్వలములు = పచ్చికపట్టులు- అతులిత = అసమానమైన- శోభన్= కాంతిచే- ద్రుమ= చెట్ల - సుమ = పూవులచే- సమర్పితంబులై = అర్పింపఁబడినవై- అవిగో: దీనిని ద్రుతప్రకృతికముగఁ బింకళిసూరన కళాపూర్ణోదయమునఁ బ్రయోగించినాఁడు. సు. వ్యా. ఆచ్ఛిక ౩౨ సూ. చూడుఁడు. ఇదివరకే చర్చితము.

తాత్పర్యము.

లక్ష్మణా! అవి పచ్చికపట్టులు, నీలము పసుపురంగుకలవై వానిమీఁదఁ జెట్ల నుండి పూవులు రాలుటచే రత్నకంబళముల వలె నున్నవి.

దీనివలన నానాగురువుల వలన జ్ఞానము సంపాదించుకొనుటచే భగవద్ధ్యానయోగ్యుఁడగు పురుషుఁడు సూచితము.

కం. సుమభరసమృద్ధములు కొన, కొమలు విరాజిల్లు తరులఁ ♦ గుసుమవిలసితా
గ్రము లగు లతాళు లాద్యం,తము గాఁగిటఁ గ్రుచ్చినట్లు ♦ తనరెడిఁ గంటే. ౧౦

సుమభరసమృద్ధములు= పూలయతిశయము చే వృద్ధిబొందినవి, కొనకొమలు = కొనకొమ్మలు, తరులన్=చెట్లను, కుసుమ=పూలచే, విలసిత=ప్రకాశించు, అగ్రములన్=కొనలచే, లతాళులు=తీఁగగుంపులు, ఆద్యంతము = మొదటినుండి తుదివఱకు,

తాత్పర్యము.

దండిగఁబూచిన పూలచే వృద్ధిపొందిన కొనకొమ్మలు గల చెట్లను వికసించిన పూవులుగల కొనలుగల తీఁగెలచే నాపాదమస్తకము కౌఁగిలింపఁబడినవి, చూచితివా?

పుష్పించిన తీఁగలు పుష్పించిన చెట్లను బూర్ణముగఁ గౌఁగిలించె ననుటచే నలంకరించుకొనిన స్త్రీలు అలంకరించుకొన్న పురుషులఁ గౌఁగిలించుట సూచితము. దీనివలన గృహస్థులగు పురుషులందుఁగూడ జ్ఞానవికాసము గలవారు కలరని సూచితము.

సీ. పరిమళభరితుఁడై ♦ వరసుఖానిలుఁడయి,ప్రచురమన్మథుఁడయి ♦ ప్రసవఫల మ
నోహరుండయి వసం♦తుండు చెన్నారెడిఁ, దోయదజాలంబు ♦ తోయములను
గురియుభంగిని బుష్ప ♦ తరువులు సుమముల, వర్షించుచున్నవై ♦ భవముఁగంటె
కఱకురానేలలఁ ♦ గాననద్రుమములు, రాలిచెఁ బూవులు గాలి ♦ విసర
తే. రాలు రాలినపూవుల ♦ లీల బెరసి, యాడెఁ గరువలికొమరుండు ♦ చూడ వయ్య
యలరు లలరిన కొమ్మల ♦ ననిలుఁ దూఁచి,స్థానచలితాళిమిషను గీ♦తంబు నెఱపెఁ

పరిమళభరితుఁడై = సువాసనచే నిండినవాఁడై, వర = ఇంపైన, సుఖానిలుఁడై = సుఖకరమైన స్పర్శగలవాయువు గలవాఁడై, ప్రచురమన్మథుఁడయి = వ్యాపించినమన్మథుఁడు గలవాఁడయి, వసంతుఁడు, ప్రసవఫల మనోహరుఁడయి = పూలచేఁ బండ్లచే మనస్సుహరించువాఁడయి, ఐశ్వర్యము గలవాఁడైనను, జనకాదుల వలె భగవత్ జ్ఞాన రతుఁడగు పురుషుఁడు సూచితము, తోయదజాలంబు = మేఘసమూహము, తోయములను = నీళ్లను, ఇది పరోపదేశ ప్రవృత్తులైన యాచార్యుల సూచించుచున్నది. కరువలికొమరుండు = పిల్లగాలి, అలరులు = పుష్పములు, స్థానచలితాళిమిషను = తమస్థానమునుండి లేచిన తుమ్మెదల నెపమున, మిష : కంథరాదులలోఁ జేరుటచే మిష, మిష మని రెండురూపంబులు గలవు. సు. వ్యా. తత్సమ ౨౩ వసూ. 'భీష్మునిపై మిషపెట్టనగునె' భార. ఉద్యోగ. ౩. ఆ. ౧౯౫ ప.

తాత్పర్యము.

సువాసనతో నిండినవాఁడై సుఖము కలుగునట్లు స్పృశించు వాయువుగలవాఁడై విజృంభించిన మన్మథుఁడు కలవాఁడై ఫలములచేఁ బూలచే మనస్సు నాకర్షించువాఁడై వసంతుఁడు ప్రకాశించుచున్నాఁడు. మేఘములు నీళ్లను గురియు విధముగఁ బూలచెట్లు పువ్వులవర్షించు సౌభాగ్యము చూడుము. కఠినమైన శిలలయందును నడవిచెట్లు పూవులు రాల్చెను. గాలి వీవఁగా రాలుచున్నట్టి రాలినట్టి పూవులతోఁ గలిసి పిల్లగాలి యాడుకొనుచున్నది. వాయువు పూలచే నందమైన కొమ్మల నూఁచి వానినుండి ధ్వనించు తుమ్మెదల ఝుంకారము నెపమునఁ బాటలు పాడుచున్నాఁడు.

కం. పరభృతలలితరవంబుల, నరుసంబుగఁ దరుల కొమల ♦ నాడించు నటుల్
గిరికందరమును వెడలుచు, వరగానము సేయునట్లు ♦ పవనుం డొప్పెన్. ౧౬

పరభృత=కోవెలల, లలితరవంబులన్ = మనోహరధ్వనులచే, అరుసంబుగన్ = సంతోషముగ, గిరికందరము=కొండగుహ, పవనము=వాయువు,

తాత్పర్యము.

కోవెలల మనోజ్ఞమైన పంచమధ్వనిచేత సంతోషముగఁ జెట్లకొమ్మల నాడించు విధముగఁ గొండగుహ వీడి బయలుదేఱి పాటపాడుచున్న వానివలె వాయువొప్పెను.

కం.కరువలి బెట్టుగ వీచిన, బెరయఁగ నొండొంటితోడ ♦ విరిసిన కొమ్మల్
సురుచిరగతి మాలిక లనఁ, బరిఢవిలెం గంటె వృక్ష♦వారములందున్ ౧౩

కరువలి=గాలి, పరిఢవిలెన్=ఒప్పుచున్నవి.

తాత్పర్యము.

గాలి తీవ్రముగ వీచుటచేఁ బూచిన కొమ్మలొకదానితో నొకటి పెనసికొని యింపైన పూలదండలవలెఁ జెట్లసమూహమందుఁ బ్రకాశించుచున్నవి.

కం. చందనశీతలుఁ డగుచును, మందానిలుఁ డిపుడు పుణ్య♦మహితామోదం
బెందును వెలయఁగ బడలిక, కుందఁ సుఖస్పర్శుఁ డగుచుఁ ♦ గొమరుగ వీచెన్.౧౪

చందనశీతలుఁడు=శ్రీగంధమువలెఁ జల్లనివాఁడు, మందానిలుఁడు=మెల్లనిగాలి, ఆమోదము = సంతోషము; వాసన;

తాత్పర్యము.

మందానిలుఁడు శ్రీగంధమువలెఁ జల్లనివాఁడై మంచిపరిమళము సర్వత్ర కలియఁగ స్పృశించినవారికి గాసి దొలఁగునట్లు సుఖస్పర్శుఁడై యింపుగ విసరెను.

కం. తేనియ వలపులు వెలసెడి,కాననముల మదమిళింద♦కమ్రారవసం
తానమిషంబున ద్రుమములు, గానము లొనరించె నాఁడెఁ ♦ గరువలి పేర్మిన్. ౧౫

వలపులు=వాసనలు, మద=మదించిన, మిళింద=తుమ్మెదలయొక్క, కమ్ర = మనోహరమైన, ఆరవసంతాన=ధ్వని సమూహముయొక్క, మిషంబునన్=నెపముచే, మిష, మిషము రెండు రూపములు గలవు. 'బంభరశ్చ మిళిందశ్చ హిందోళ భసలౌ సమా॥' నిఘంటువు.

తాత్పర్యము.

తేనెలవాసనలు గొట్టుచున్న యడవులందు మదించిన తుమ్మెదల మనోహర ధ్వనుల నెపమునఁ జెట్లు గాలి యతిశయముచే నాడెను - పాడెను.

కం. నెత్తములఁ బుట్టి పూవుల, గుత్తులచే నిండియున్న♦కొమరగు చెట్టుల్
హత్తఁగ నొక్కటిగ మహీ,భృత్తతి పెనుపూలరాసి♦విధమునఁ దోఁచెన్. ౧౬

నెత్తములన్=కొండపేఁటులయందు, హత్తఁగన్=కలియఁగ, మహీభృత్తతి = పర్వతముల సమూహము.

తా త్ప ర్య ము.

కొండలచఱులలోఁ బేటులలోఁ బుట్టిన నిండారు పూలగుత్తులచే నిండిన చెట్లొక్కదానితో మఱియొకటి కలిసికొనఁగాఁ గొండ లన్నియుఁ బూల కుప్పవలెఁ గాన వచ్చుచున్నవి.

కం. సుమసంఛన్న శిఖరములు, సమీరణోత్క్షేపగాఢ♦సంచలితములున్
భ్రమరావతంసితంబులు, ద్రుమములు గానం బొనర్చ♦ దొరఁకొన నయ్యెన్. ౧౭

సుమ=పూలచే, సంఛన్న=కప్పఁబడిన, సమీరణ=గాలిచే, ఉత్క్షేప=ఎగురఁగొట్టఁబడుటచే, గాఢ=మిక్కిలి, సంచలితంబుల్=కదలుచున్నవి, భ్రమర=తుమ్మెదలచే, అవతంసితంబులు = అవతంసములు గలవి, అవతంసమనఁగా తలయందుఁ బెట్టుకొను పూవు. అనఁగాఁ దుమ్మెదలు, ద్రుమములు=చెట్లు.

తా త్ప ర్య ము.

పూలచేఁ గప్పఁబడిన కొనలు గలిగి గాలిచే నెగురఁ గొట్టఁబడిన వగుటచే మిగులఁ గదలునవై భ్రమరము పైభాగము కప్పఁగాఁ దలయందుఁ బుష్పములు ధరించి నల్లగుడ్డ ముసుగు వేసికొని యాడుచుఁ బాడుచున్న స్త్రీలవలెఁ బెట్లుండెను.

కం. నిలు వెల్లఁ బూచి గోఁగులు, లలిమెయి నపరంజితొడవు♦లం దాలిచి పై
వలెవాటుగఁ బైఁడిజరీ,వలువలు ధరియించు జనుల♦వడువున నమరెన్. ౧౮

తొడవులు=ఆభరణములు.

తా త్ప ర్య ము.

బంగారుసొమ్ములు ధరించి, సరిగవస్త్రము, వల్లెవాటుగ వైచికొని, యున్న జనులవలె నిలువెల్లఁ బూచిన గోఁగులున్నవి.

కం. వింతశకుంతరవంబుల, నెంతయు నాక్రాంత మగుచు ♦ నెసఁగి వసంతఁ
బంతస్తాపముఁ గూర్చెడిఁ, గాంతాహీనునకు నాకుఁ ♦ గడు దుస్సహమై. ౧౯

వింత = ఆశ్చర్యకరములైన, శకుంతరవంబులు = పక్షుల ధ్వనులు, ఆక్రాంత మగుచున్ = ఆక్రమించినదై, అంతస్తాపము = మనోవేదన, దుస్సహమై = సహింప రానిదై.

తా త్ప ర్య ము.

వసంతము క్రొత్తక్రొత్త పక్షుల ధ్వనులచే నాక్రమించినదై భార్యలేని నాకు సహింపరాని మనోవేదన కలిగించుచున్నది.

కం. భామావియోగదుఃఖో, ద్దాముఁడ నగు నన్ను మిగులఁ ♦ దపియింపించెన్
కాముఁడు; జయఘోషంబున, వేమఱు కోవెలలు నన్నుఁ ♦ బిలిచెడిఁ దుష్టిన్. ౨౦

భామావియోగ = భార్యను విడిచియుండుటవలన గలిగిన; దుఃఖోద్దాముఁడన్ = దుఃఖాతిశయము గలవాఁడను;

తా త్ప ర్య ము.

భార్యనెడఁబాసిన తీవ్రదుఃఖము ననుభవించు నన్ను మన్మథుఁడు మిగుల బాధించుచున్నాఁడు. కోవెలలు జయఘోషముల నన్ను సంతోషముతోఁ బిలుచుచున్నవి.

కం. రమ్యావననిర్ఝరంబుల, సమ్యగ్హృష్టంబు లగుచుఁ ♦ జారురవంబుల్
సౌమ్యగతి నించి నాకు న, శౌమ్యత్పరితాప మిడియె ♦ జలకుక్కుటముల్. ౨౧

నిర్ఝరంబులన్ = కొండవంకలందు; సమ్యక్ = మిగుల; హృష్టంబులు=సంతోషించినవి; అశామ్యత్ = చల్లారని; పరితాపము = వేదన; జలకుక్కుటములు=నీటికోళ్లు; సౌమ్యగతిన్ = ఇంపుగా

తా త్ప ర్య ము.

రమ్యములయిన యడవివంకల యందలి నీటికోళ్లు మిగుల సంతోషము గలవై మనోహర ధ్వనులు నిండించుచు సహింపరాని పరితాపము నాకుఁ గలుగఁజేసెను.

కం. తమ్ముఁడ మన మాశ్రమ దే,శమ్మున ము న్నుండ నిట్టి♦చారురవమ్ముల్
క్రమ్మిన జానకి విని కడు,సమ్మదమున నన్నుఁ బిలిచి ♦ సంతోషించెన్. ౨౨

తా త్ప ర్య ము.

లక్ష్మణా! మనము పంచవటి యాశ్రమమున నున్నప్పుడిటువంటి మనోహరములైన ధ్వనులు విన వచ్చెనేని జానకి సంతోషముతో నన్నుఁ బిలిచి యా ధ్వనులెంత రమ్యములుగా నున్నవో వినుఁడని చెప్పి సంతోషించెను. తనకు సంతోషకరమైనది కూడ నేను సంతోషించు వఱకు సీతకు సంతోషకరము గాదు.

కం. నానామంజులరవము ల,నూనంబుగ బహువిధనీడ♦జోత్కరములు త
మ్మాన లతికాకుడుంగవి, తానంబులు వ్రాలు నవ్వి♦ధంబును గనుమా. ౨౩

అనూనంబుగన్=కొఱఁతలేక; నీడజ+ఉత్కరములు=పక్షులసమూహములు; లతికా+కుడుంగ = తీఁగపొదలయొక్క; వితానంబులన్ = సమూహములందు.

తా త్ప ర్య ము.

అనేకము లయిన పక్షులగుంపులు నానావిధములయిన మనోహరధ్వనులు కలుగఁగాఁ దీఁగపొదలమీఁద వ్రాలుచున్నవి చూడుము.

కం. కమ్మనియెలుఁగులు నించుచుఁ, బమ్మినతమి జాతిపురుష ♦ పక్షులతోడన్
సమ్మదమునఁ గ్రీడించె ఖ,గమ్ములు భ్రమరమ్ములు బయ♦కాఱులు గాఁగన్. ౨౪

ఎలుఁగులు = ధ్వనులు, బయకాఱులు = పాటగాండ్రు, గాయకులు; ఏకవ. బయకాఁడు.

తా త్ప ర్య ము.

ఇంపైనధ్వనులు చేయుచు నతిశయించిన యాశచేఁ దమ జాతికిఁజేరిన పోతు పక్షులతోడ నాఁడుపక్షులు తుమ్మెదలు పాటను పాడుచుండఁగాఁ గ్రీడించెను. దీనివలన

నెంతకామోద్రేక మున్నను స్త్రీలు స్వజాతిపురుషులతోఁ దప్ప బరజాతిపురుషులతోఁ గ్రీడింపరాదని సూచితము.

కం. పాదపములు నత్యూహచ, యోదితరవముల వనప్రియోత్తమకలస
న్నాదంబుల నా మది సుమ, కోదండానలము మిగుల ♦ గుర్వొనరించెన్. ౨౮

పాదపములు = చెట్లు, నత్యూహచయ = నీటికోళ్ల సమూహముల వలన, ఉదిత = పుట్టిన, రవములన్ = ధ్వనులచే, వనప్రియ = కోకిలలయొక్క, ఉత్తమ = శ్రేష్ఠమైన, కల = అవ్యక్తమధురమైన, సన్నాదంబులన్ = మంచిధ్వనులచే, సుమకోదండానలము = మన్మథాగ్ని, మన్మథునకు విల్లు, బాణములుకూడఁ బూవులే, గుర్వు = అధికము.

తాత్పర్యము.

నీటికోళ్లగుంపుల ధ్వనులచేతను, కోకిలల యింపైన స్వరములచేతను చెట్లు నాకు మన్మథతాపమును మిక్కిలి యతిశయింపఁజేసెను.

తే. నెఱి నశోకగుళుచ్ఛము ♦ ల్నిప్పులుగను, షట్పదధ్వని మంటల ♦ చప్పుడుగను
దొగరుఁజిగురులు కీలల ♦ పగటుఁ దాల్ప, నిదిగొ నామనిచిచ్చు న ♦ న్నేర్చెనిపుడు.

అశోకగుళుచ్ఛముల్ = అశోకపుష్పముల గుత్తులు, షట్పదధ్వని = తుమ్మెదల ఝుంకారము, తొగరుఁ జిగురులు = ఎఱ్ఱచిగుళ్లు, కీలల = జ్వాలల, పగటున్ = విధమును, ఆమని = వసంతుఁడు అను, చిచ్చు = అగ్ని, ఇది శుచిశబ్దభవము; తద్భవమున వర్ణవ్యత్యయము; ఏర్చెన్ = కాల్చెను.

తాత్పర్యము.

అందములైన యశోకపుష్పముల గుత్తులు నిప్పులుగను, తుమ్మెదల ధ్వనులు మంటల చిటపట ధ్వనులుగను, ఎఱ్ఱచిగుళ్లు జ్వాలలవలెనై వసంతాగ్ని నన్నుఁ గాల్చుచున్నది.

మత్తకోకిలము. ఈ మనోహరకోకిలారవ ♦ మీ సుపుష్పితకాననం
బై మహిం జెలువొ వసంతము ♦ హర్షదం బిల సీతకున్
వామలోచన మంజుభాషిణి ♦ బంభరాలకఁ బాసి యిం
కేమికార్య మనుంగుఁదమ్ముఁడ ♦ యేను జీవముఁ దాల్చియున్. ౨౯

హర్షదంబు = సంతోషము కలిగించునది, బంభరాలక = తుమ్మెదలవంటి ముంగురులు గలది.

తాత్పర్యము.

ఈ వినవచ్చు నింపైన కోకిల ధ్వనులు, ఈ చక్కఁగాఁ బూచిన వనములు, ఈ వసంతకాలము సీతకుఁ జాల సంతోషకరములు; అందమైన కన్నులు గలదియు, నింపైన వాక్కులు గలదియుఁ దుమ్మెదలవంటి ముంగురులు గలదియు నగు సీత నెడఁబాసి తమ్ముఁడ! నేను బ్రాణముతోడ నుండియు నేమి ప్రయోజనము? సగము దేహము పోయినఁ దక్కిన సగము దేహ మేమి పని చేయఁగలదు? మత్త. రసజజభరగణములు ౧౧ వ స్థానమున యతి:

మత్తకోకిలము. ఏచి పూచినపూవుటీరము ♦ లెల్లెడం గన నొచు నా
యా చకోరవిలోచనం గను♦లారఁ గానమిఁ బుష్పనా
రాచజాత వసంతవర్ధిత♦రాగకారణ శోకశు
క్రాచితాత్ముఁడనై కృశించెద ♦ నయ్యొ యెట్లు సహింతునో. ౨౭

ఏచి=అతిశయించి, పూవు + ఈరము = పూవుటీరము = పూఁబొద, పుష్ప నారాచ=మన్మథునవలన, జాత=పుట్టిన వసంతవర్ధిత=వసంతునిచే వృద్ధిచేయఁబడిన, రాగకారణ=అనురాగము కారణముగాఁగల, శోకశుక్రి = శోకాగ్నిచే, ఆచిత= క్రమ్ముకొనఁబడిన, ఆత్ముఁడనై = మనస్సుగలవాఁడనై, కృశించెదన్ = శుష్కించు చున్నాను.

తాత్పర్యము.

విస్తారముగఁబూచిన పూవుపొద లెల్లచోటులఁ గాన వచ్చుచున్నవి. చకోరమువంటి కన్నులు గల సీత మాత్రమే కన్నారఁ గానరాకున్నది. అనురాగము కారణముగా మన్మథునిచే జనించి వసంతునిచేఁ బెంపఁబడిన యీశోకాగ్నిచేఁ గ్రమ్ముకొనఁ బడిన మనస్సు గలిగి శుష్కించుచున్న నే నెట్లు సహించియుండఁ గలను?

మత్తకోకిలము. కానరాక విదేహకన్యక ♦ గ్రాలఁజేసెను శోకముల్
కానవచ్చి వసంతుఁడున్ శ్రమ♦కాండబిందుల మాన్చెడిన్
మానినీమణిఁ బాసి వేదన ♦ మాఁడుచుండఁగ నీ వసం
తానిలుం డెటువంటి క్రూరుఁడో ♦ యయ్యొ నన్ను దహించెడిన్. ౨౮

శ్రమకాండ బిందుల=చెమట నీటిబొట్టులను,

తాత్పర్యము.

సీతాదేవి కానరాక నాకు శోకము గలిగించెను, ఈ వసంతుఁడు కానవచ్చి చెమట బిందువులను మాన్పుచున్నాఁడు. సీతాదేవిని వదలి తాపముచేత మాఁడు చుండు నన్ను నయ్యో, యెంతనిర్దయుఁడో కదా, యీవసంతకాలమందలి వాయువు దహించుచున్నాఁడు.

చం. పవనము వీచినన్ రెపరె♦పన్ స్ఫటికంపుగవాక్షముల్ వలెన్
మివులఁ బురుల్ లసింపఁగ నె♦మిళ్లు నటించెడిఁ దమ్మిఁ బెంటులన్
దవిలి భజింపఁ జుట్టుకొని ♦ తద్దయు మత్తున సొక్కుచున్ మనో
భవపరిపీడితాత్మ నను ♦ బంచశరార్తి మఱింత వేఁచుచున్ 30

పవనము=గాలి, గో+అక్షము=గవాక్షము = గాలి వచ్చుటకై యావుకంటి వలె గోడలయందు నేర్పరచిన రంధ్రము, ఇచ్చటనెమిళ్లు పురివిచ్చియాడఁగా నా పింఛ ములో గాలిదూఱి కంటివెండ్రుకలఁ జెదరఁగొట్టఁగా నీనెలు తెల్లగాఁ గానవచ్చుటచే స్ఫటికపుగవాక్షము లని చెప్పఁబడెను. అంచులు తీర్చిన స్ఫటికము నెమలికన్నులవలె నానాకాంతులు దోఁపఁజేయుచుండును గాన స్ఫటిక గవాక్షము లనియైనఁ జెప్ప

వచ్చును, మిఫులన్=మిగుల, పెంటులు=ఆఁడుపక్షులు, వేఁచుచున్=తపింపఁజేయుచు,

తా త్ప ర్య ము . 33

రెపరెప గాలివీవఁగా స్ఫటికపు గవాక్షములవలె విచ్చిన పురులు ప్రకాశింపఁగా, నాఁడు నెమిళ్ళు దమ్ముఁ జుట్టుకొని సేవింపఁగా, మత్తుచేఁ బరవశములయి మగనెమిళ్ళు సీతావియోగముచే మన్మథపీడితుఁడనైన నన్ను మఱింత మన్మథార్తికిఁ బాలుచేసి నాట్యమాడుచున్నవి.

ఉ. ఆడెడి నెమ్మిఁ జూచి కెలఁ♦వార మయూరియుఁ దాను నాడఁగా,
వీడని మన్మథార్తి నడె ♦ పేటులపంచల రెక్కలార్చుచుం
గూడఁగఁ బోవుచున్ మృదుల♦కూజితముల్ వెలయంగ బర్హి నా
జాడను జూచె నన్నగెడి♦చందముగాఁ గనుఁగొంటె లక్ష్మణా! ౩౧

నెమ్మిన్ = మగనెమలిని, కెలవు = సంభోగేచ్ఛ, ఆరన్ = అతిశయింపఁగా, మయూరియు, ఆఁడునెమలికూడ, మృదుల=కోమలములైన, కూజితముల్=ధ్వనులు, బర్హి= మగనెమలి.

తా త్ప ర్య ము . 34

ఆడుచున్న మగనెమలిని జూచి యాఁడునెమలి సంభోగేచ్ఛ యతిశయింపఁగా మగనెమలితోపాటు దానునాడఁగా, వదలని మదనతాపమునఁ గొండలపేటుల ప్రక్కల రెక్కలు విచ్చి యాడించుచు నాఁడుపక్షిని జేరఁబోవుచు మెల్లని ధ్వనులు చేయుచు మగనెమలి భార్యలేని నన్నుఁ బరిహాసము చేయుదానివలె, నావంక లక్ష్మణా! చూచెను. చూచితివి గదా.

కం. కానల శిఖావలము ప్రియ,మానిని నసురుండు కొనుచు ♦ మఱుగండు సుమీ
కానఁ గదా యిది ప్రియుశో,మానుగ వేడుకలఁ గ్రీడ ♦ మరగెడు దమిచేన్.౩౨

కానలన్ = అడవులందు, శిఖావలము = నెమలి.

తా త్ప ర్య ము . 35

ఈ మగనెమలి ప్రియురాలిని రాక్షసుం డడవులందు హరించి దాఁగినవాఁడు కాఁడు. ఆ కారణముచే నిది ప్రియురాలితో వేడుకగా వినోదక్రీడ లాడుచున్నది.

ఉ. ఔర! వసంతకాలమహి♦మాతిశయంబు శకుంతజాతులన్
ధారిణి జన్మమందియును ♦ దద్దయు రాగభరంబునం బతిన్
జేరియ నిల్చె నా శిఖని,♦ సీతయు రక్కసుచేతఁ జిక్కదే
గూరిమి లోలనేత్ర ననుఁ ♦ గూడఁగ రాదె ససంభ్రమాత్మయై. 33

శకుంతజాతులన్ = పక్షిజాతులందు, శిఖని = ఆఁడునెమలి.

తా త్ప ర్య ము . 36

అవురా! యీ వసంతకాల మహిమయొక్క గొప్పఁదనము. దాని మహిమ చేతఁగదా పక్షిజాతులందుఁ బుట్టియు నా యాఁడునెమలి యనురాగాతిశయముచే

మగనెమలి సమీపమందే యున్నది. రావణాసురుఁడు హరింపకుండిన నా సీతయు నీ ప్రకారము తత్తరపాటుచే నన్నుఁ జేరరాకుండునా ?

మత్తకోకిలము. అట్టి నాప్రియురాలి జానకి ♦ హారికుంతలఁ బాసి నే
నెట్టు లక్ష్మణ సంతరింతునో ♦ యీ వసంతముఁ గంటివే
తోట్టుతేనెల మేలిపూవుల♦తో వనంబులు నిండి యి
ప్పట్టునన్ సుమపాళి నాయెడ ♦ వ్యర్థమయ్యెడి నయ్యయో. ౩౪

హారికుంతల = మనోహరములైన తలవెండ్రుకలు గలది.

తాత్పర్యము.

అటువంటి నా ప్రియురాలిని జానకిని తలనిండఁ గాంతులీను వెండ్రుకలుగల దానిని వదలిపెట్టి యీ వసంతము నెట్లు దాఁటఁగలను. తేనెలు స్రవించుచున్న పూల గుంపులతో నడవులు నిండియు నా పూవులు సంతోషము గలిగింపఁ జాలమిచే నా పాలికి వ్యర్థము లయినవి.

మానిని. ఎంతయుఁ గాంతులు దొంతరలారియు ♦ నీకుసుమంబులు తేఁటిగముల్
రంతులు సేయుచు వెన్కొన ధారణి ♦ రాలెడి నాయెడ వ్యర్థములై;
కాంతకలారవముల్ నిగిడించుచుఁ ♦ గామము నా కెసఁగింపఁ బత
త్సంతతి సల్పెడి నొక్కొక పరస్పర♦సల్లపనంబులు పిల్వులచేన్. ౩౫

కాంతకలారవముల్=మనోహరములైన యవ్యక్తమధుర ధ్వనులు; దొంతరలారియున్=అతిశయించియును, పతత్ సంతతి = పక్షులసమూహము, సల్లపనంబులు= సల్లాపములు.

తాత్పర్యము

ఈ పుష్పములు మిక్కిలికాంతులు గలవయ్యుఁ దేనెనిమిత్తమై తుమ్మెదలు వెను వెంట వచ్చుచున్నను నా విషయమున వ్యర్థములై నేలరాలుచున్నవి. పక్షుల గుంపులో నాకుఁ గామ మభివృద్ధి చేయుటకై మనోహరములైన యవ్యక్తములైన ధ్వనులు చేయుచు నొకదాని నొకటి పిలుచుటచే సల్లాపము లాడుచున్నవి.

మానిని ఏడుభగణములు, గురువు. పదుమూఁడవది యతిస్థానము.

కం. ఎచ్చట నాప్రియ యున్నదొ, యచ్చట నీ పుష్పసమయ ♦ మమరిన నిక్కం
బచ్చపలాక్షియు నావలె, ముచ్చిరుఁ గందర్పదర్ప♦మూర్ఛిత యగుచున్. ౩౬

పుష్పసమయము = వసంతకాలము, ముచ్చిరున్ = శోకించును, కందర్ప = మన్మథుని, దర్ప = పరాక్రమాటోపముచే, మూర్ఛిత = మూర్ఛపోయినది.

తాత్పర్యము.

నా ప్రియురాలు సీతాదేవి యెచ్చట నున్నదో యచ్చట నీ వసంతకాల ముండెనా యామెయు నా వలెనే మదనతాపాతిశయముచే వియోగ కారణమునఁ దపించుచుండును.

ఉ. జానకి యున్నచోటను వ ♦ సంతము కల్గమి, నన్నుఁ బాసి యా
చాన సహించు నెట్టులది ♦ జానగు నేనియుఁ, గల్గెఁ బో యయో
దానవకోటి చుట్టుకొని ♦ తర్జనముల్ పలుకంగఁ బూర్ణచం
ద్రానన యేమి సేయఁగల ♦ దార్త్తిని వెల్వెలఁబాఱు మోమునన్. 32

చాన = స్త్రీ, జానగు = మనోహరమగు, తర్జనముల్ = బెదరింపుమాటలు.

తా త్ప ర్య ము . 40

జానకి యున్నచోట వసంతకాలము లేదు. రావణుఁ డెందో రహస్య స్థలమున దాఁచినచోట వసంత మెట్లువచ్చును. అక్కడఁగూడ నిట్టులే యుండినా యామె యెట్లు విరహతాపము సహింపఁగలదు? ఒకవేళ యిట్టులే వసంత మందును నుండినను రాక్షసులు చుట్టుకొని చంపెదము, కోసెదము, నిన్నుఁ బీఁకి తిందు మని బెదరిఁపుమాట లాడుచుండగా ముఖము వెల్వెలఁ బోఁగా నేమి చేయఁగలదు? శృంగారరసానుభవ మెటులుఁ గలుగును?

కం. శ్యామ మృదుపూర్వవచనో, ద్దామ మనోజ్ఞాభిరూప్య♦ ధామ దళచ్ఛ్రీ
ధామదళనేత్ర యుద్య, త్కామ యగుచు సురభివేళఁ ♦ గాయము విడదే! 33

శ్యామ = నడియౌవనమున నుండునది 'శ్యామా యౌవనమధ్యస్థా.' సీతాదేవి కిప్పుడు ముప్పదిరెండేండ్ల వయస్సు, మృదుపూర్వవచనోద్దామ=మృదుత్వము ముందుగాఁగల మాటలచే నతిశయించినది. మనోజ్ఞ=మనస్సున కింపైన, అభిరూప్య= సౌందర్యమునకు, ధామ = స్థానమైనది, దళత్ = వికసించుచున్న, శ్రీధామ = లక్ష్మీదేవికి స్థానమగు, కమలముల యొక్క, దళ = రేకులవంటి, నేత్ర = కన్నులు గలది, ఉద్యత్కామ = ఉదయించు కామముగలది, సురభివేళ = వసంతసమయమున, కాయము = దేహము, విడదే = వదలిపెట్టదా.

తా త్ప ర్య ము . 41

నడిమి వయస్సుది, మెల్లగా మృదువుగా మాట్లాడు కోమల హృదయము గలది. సౌందర్యమునకు స్థానమైనది, క్రొత్తగా వికసించు తామరరేకులవంటి కన్నులు గలది. కావున నీ వసంతసమయమునఁ గామ ముదయింపఁగా సహింపలేక దేహము వదలిపెట్టదా? ఇది మన్మథావస్థలలోఁ గడపటి యవస్థ.

కం. ఇట్టులు నా మదిఁ దోఁచెడిఁ, బట్టుగ నీవేళ జనక♦భవ కొమిరెయుఁ దా
నెట్టన మగనా లగుటను, నెట్టును మద్విరహమును స♦హింపదు తాల్మిన్. 34

కొమిరె = యౌవనవతి, మగనాలు = పతివ్రత.

తా త్ప ర్య ము .

సీతాదేవి ప్రాయమునందున్నది. అందుఁ బతివ్రత కావునఁ గామము దీర్చుకొను నదుపాయములేక నా వియోగము సహింపలేదు.

కం. తమ్ముఁడ సీతారమణి మ,నమ్మెప్పుడు నిలిచియుండు ♦ నా యందే నా
కమ్మదిరాక్షీమణియం, దిమ్ముగ భావంబు నిలుచు ♦ నెల్లపుడుఁ దమిన్. ౪౦

తా త్ప ర్య ము.

లోకమున భార్యాభర్తలులేరా? ఏల యింతదూరము భార్యకై పరితపించెద వందువా? సీతాదేవి మనస్సు నాయందే సర్వదా నిలిచియుండును. నామనస్సుకూడ నామెయందే సర్వదా నిలిచియుండును. ఏదశయందును వానికి వేఱుపాటులేదు. ఆ కారణముచే స్మరణమునకు రాక యెట్లు తప్పును? నన్ను నేను మఱవఁగలనా? స్నేహ రజ్జువు దూరము సాగుకొలఁది దృఢము స్థూలము నగును. సమీపించెనేని సూక్ష్మ మగును. దీనినే భవభూతి 'అద్వైతం సుఖదుఃఖయో రనుగుణం, సర్వాస్వవస్థాసు య ద్విశ్రామో హృదయస్య యత్ర జరసా,యస్మి న్నహార్యో రసః। కాలేనావరణాత్యయా త్పరిణతే య త్స్నేహసారే స్థితం।భద్రం తస్య సమానుషస్య కథ మ ప్యేకం హి త త్ప్రా ప్యతే॥ ఉత్తర ౧. ౩౯. 'సీ॥ అన్నియవస్థల ననుగుణ మగుచును। సుఖదుఃఖముల నొక్క చొప్పు గలిగి। ముదిమియందేనియు వదలక హృదయ విశ్రామంబు గలిగించు ప్రేమగలిగి। పరిణయ మాదిగా ధర దేహమును వీడు నందాఁకఁ బరిణయమైననాఁటి। స్నేహంబుఁ బోలిన స్నేహసారంబునఁ గలఁ గనిస్థిరమైన కలిమి కలిగి। పరఁగుచుండెడి మేలిదాంపత్యమునను। గలుగు నైక్యంబు ముఖ్యమై వెలయుచున్న। క్షేమమెయ్యదో దానిచేఁ జెలఁగుచుండఁ గోరువాఁడను సర్వప్రకారములను'.

ఉ. ఈసుమసౌరభానిలుఁ డ♦హీనసుఖావహాశీతలుండు నై
భాసిలు చుండియుఁ బ్రకియ ♦ పజ్జను లేమిని నగ్నికల్పుఁడై
గాసిలఁ జేయఁజొచ్చె ననుఁ ♦ గామినిఁ గూడి చరించువేళ నెం
తే సుఖదుండు నేఁ డిటు ద♦హింపఁగఁ జూచెడి నేమి పాపమో! ౪౧

సుమసౌరభానిలుఁడు = పూలవాసనలతోఁ గూడినవాయువు. అహీన=తక్కువ గాని, సుఖావహ = సుఖముకలిగించు, శీతలుండు = చల్లఁదనము గలవాఁడై, పజ్జను = ప్రక్క, అగ్నికల్పుఁడై = అగ్నితోనించుక తక్కువగా సమానుఁడై, కల్ప ప్రత్యయము కొంచెము తక్కువగా సమానత్వము దెలుపును. అగ్నివలె దేహమును గాల్చి భస్మము చేయుటతప్పఁ గక్కినదంతయుఁ జేయుచున్న దని భావము. సుఖ దుండు = సుఖము గలిగించువాఁడు. ఇంతవఱకు వసంతుని యుద్దీపకత్వముఁ దెలిపి యిఁకమందమారుతము యొక్క యుద్దీపకత్వము చెప్పుచున్నాఁడు.

తా త్ప ర్య ము

పూలవాసనలతోఁ గూడిన యీ వాయువు మిక్కిలిసుఖము గలిగించు చల్లఁదన ముగలవాఁడయ్యు సీత నా యొద్దలేని కారణమున నగ్నిహోత్రునివలెమిగుల బాధగలి గించుచున్నాఁడు. ఇది యాయునకు స్వభావగుణ మందమా యనిన సీతాదేవి నాచెంత నున్నప్పుడు మిగుల సుఖము గలిగించు చుండెనుగాని యిప్పు డిట్లు కాల్పఁ

జూచుచున్నాఁడు. ఏమిపాపమో? అప్పటి రాముఁడను నే నిప్పుడు గానా? అప్పటిగాలి యిదికాదా? సీతాదేవి నా యొద్ద నున్నప్పుడు కష్టములు సుఖములుగానే తోఁచుచుండెను. ఇప్పుడో సుఖకరములుకూడ దుఃఖకరములుగానే యున్నవి. కావున నా సుఖదుఃఖములకు సీతాదేవియే కారణము.

వాస్తవార్థమున లక్ష్మీయుక్తుఁడు దుఃఖమెఱుఁగఁడు, అలక్ష్మీయుక్తుఁడు సుఖమెఱుఁగఁడు.

ఉ. ఈ పలుగాకి కాకి మును ♦ యేము సుఖంబుగ నుండఁ బేరిమిన్
జూపుచు మింటిపైఁ జెవులు ♦ చూఁడెడి భంగిని గూయుచుండు, ని
ప్డో పువుఁబోఁణి లేమి ముద ♦ మూరఁగ ఱెక్క విదుర్పుచోడ శా
ఖాపటలంబులం గునియఁగాఁ ♦ గడఁగెన్ ముదమూరఁ దమ్ముఁడా! ౪౨

పలుగాకి కాకి=నీచపుఁగాకి, ఏము=సీతయు నేను, పేరిమిన్=ప్రేమను, చూఁడెడి=కాల్చునట్టి, శాఖాపటలంబులన్=కొమ్మలసమూహమందు, గునియఁగాన్=కులుకుచు శబ్దింపఁగా, కాకి చెట్టుపైనుండి కూసెనేని భార్యాభర్తల వియోగము తొలఁగును. ఆకాశమునుండి కూసిన నవలక్షణము కీడు సూచించును.

తాత్పర్యము. ౪౪

ఈ నీచపుఁ గాకి నేను సీతాదేవి పంచవటియం దున్నప్పుడు మా వియోగమును సూచించుచు నాకాశమున నుండి మా చెవులు కాల్చెడునట్లు కఠోరముగఁ గూయుచుండెను. ఇప్పుడో మఱల మా సంయోగమును సూచించుచుఁ జెట్టు కొమ్మపై వ్రాలి ఱెక్కలు విదుర్చుచు గునిసి గునిసి కూయుచున్నది.

క. మహిళావియోగమును నీ, విహగమె సూచించె నాఁడు ♦ వెండియు నవలా
మిహియోగము సమ్మోదా, వహరుతముల నిప్పు డెఱుక♦పఱిచెడి నెమ్మిన్. ౪౩

దానినే వివరించి చెప్పుచున్నాఁడు. నవలామిహి = స్త్రీలయందు శ్రేష్ఠురాలు.

తాత్పర్యము. ౪౫

ఈ పక్షియే పంచవటి యందున్నవేళ సీతావియోగమును సూచించెను. అదియే యిప్పుడా స్త్రీరత్నముయొక్క సంయోగమును సూచించుచున్నది.

ముందటి పద్యంబునందు 'ఈ పలుగాకి కాకి' యనియు, నీపద్యంబున 'ఈ విహగమె' యనియు నిర్దేశించి చెప్పఁబడెను గాని పంచవటిలోఁ గూసిన కాకియే యిచ్చటి కిప్పుడు వచ్చెనని కాని, యిదియే యచ్చటికి వచ్చెనని కాని చెప్పుట యతిసాహసము.

కావున జీవాత్మలన్నిటికి నైక్యము చెప్పునపుడు గుణరూపములచేఁ జెప్పినట్లు కడను సమానజాతి, సమాన గుణము, సమాన రూపము, గలవని గ్రహింపవలెను. కాకులన్నియు నొక్కటేయనిన నెట్లో జీవాత్మలన్నియు నేకమన్నప్పు డట్లే గ్రహింపవలెను.

కం. విరులం గొనలన్ వెలసెడి, తరులం గూర్చుండి పక్షి♦తతి రమ్యముగా
దెరలన్ ధైర్యము కామము, పెరుఁగం గావించె వింటె ♦ వివిధరుతంబుల్. ౫౭

తరులన్ = చెట్లయందు, తెరలన్ = వదలిపోవునట్లు, వివిధరుతంబుల్ = నానావిధ ధ్వనులు.

తా త్ప ర్య ము.

పుష్పముల కొనలయందుఁ గల చెట్లయందు మనోహరముగాఁ గూర్చుండి పక్షులసమూహము నా ధైర్యము చెడునట్లు కామము పెరుఁగునట్లు నానావిధధ్వనులు చేయుచున్నవి వింటివా!

కం. లలిఁ బవనక్షిప్తంబుం, దిలకపు మంజరిని వెన్కొ♦నెన్ షట్పద మా
సలలిత కామమదోద్ధుత, జలజాక్షిం బ్రియుని మగని ♦ చందము దోఁపన్. ౫౮

లలిన్ = మనోహరముగ, పవనక్షిప్తంబున్ = గాలిచేఁ గదలింపఁ బడినది, మంజరిన్ = పూలగుత్తిని, షట్పదము = మగతుమ్మెద, సలలిత = మనోజ్ఞతతోఁ గూడిన, కామ మదోద్ధుత = కామము వలని మదముచే నెగురఁగొట్టఁ బడినది, జలజాక్షిన్ = స్త్రీని.

తా త్ప ర్య ము.

కామ మదముచేఁ గంపించిపోవుచున్న ప్రియురాలిని దాని మగఁడు వెనుకొని పోవునట్లు గాలిచేఁగదలుచున్న తిలకపుఁ బూలగుత్తిని మగతుమ్మెద వెంబడించి తిరుగుచున్నది చూచితివా!

కం. పేర నశోకం బయ్యు న,వారిగఁ గామిజనశోక♦వర్ధన మిది యా
మారుతధుతగుచ్ఛంబుల, సారెకు నను భయము పఱచు♦చందము నొందెన్. ౫౯

అవారిగ = దండిగ, కామిజన = కామముగల మనుష్యులయొక్క, శోక వర్ధనము = శోకమును వృద్ధిచేయునది, మారుత = గాలిచే, ధుత = కదలింపఁబడిన, గుచ్ఛంబులన్ = గుత్తులచే.

తా త్ప ర్య ము.

ఇది పేర నశోకమే కాని వాస్తవమునఁ గాముకజనుల శోకమును వృద్ధిచేయునది. ఇప్పుడది యేమిచేసెనందువా, గాలిచేఁ గదలింపఁబడిన పూలగుత్తులచే బలుమాఱు నన్నుఁ గొట్టెడుదానివలె భయపెట్టునట్లున్నది.

శ్లో. అరవింద మశోకంచ చూతంచ నవమల్లికా
నీలోత్పలంచ పంచైతే, పంచబాణస్యసాయకాః.

కమలము, అశోకము, మామిడి, నవమల్లిక, నల్లకలువ - ఈ యైదు మన్మథుని బాణములు. ఇవి చేయుపని యేమనిన,

కం. కూడుడిగించు నశోకము, వాడించును మల్లె, మఱి వి♦వర్ణతఁజేయున్
జూడఁగఁ జూతము, తలఁపులు జోడించున్ దమ్మి,చంపఁ♦జూచున్ గలువల్.

అశోకము ఆహారము దిననియ్యదు. మల్లె వాడిపోవు నట్లు చేయును. మామిడి వన్నె మార్చును. కమలము తలఁపు లనేకము చేయును. కలువలు చంప యత్నించును.

ఉన్మాదన స్తాపనశ్చ, శోషణ స్తంభన స్తథా
సమ్మోహనశ్చ కామస్య పంచ బాణాః ప్రకీర్తితాః

ఉన్మాదనము, తాపనము, శోషణము, స్తంభనము, సమ్మోహనము; ఈయైదు మన్మథుని బాణములు.

కం. పూవులు నిండం బూసిన, మావులు గనుఁగొంటె విభ్రమ స్మయమతు లౌ
పావనవిలేపనకసం, భావిత మానవులఁ బోలి భాసిలె రుచులన్. ౪౭

మావులు=మామిడిచెట్లు, విభ్రమస్మయమతులు = శృంగారచేష్టలచే గర్వించిన చేష్టలు గలవారు, పావన = పవిత్రములైన, విలేపనక = గంధపుఁబూఁతలచే, సంభావిత = గౌరవింపఁబడిన.

తాత్పర్యము.

శృంగారచేష్టలచే గర్వించిన మనస్సులు గలిగి నిర్మలమైన చందనాదులు పూసి కొనిన మనుష్యులవలె నిండారఁబూసిన మామిడిచెట్లు కాంతులచేఁ బ్రకాశించు చున్నవి.

సీ. పంపావనంబుల సొంపార నట నటఁ, గిన్నరుల్ దిరిగెద రన్న! కంటె
ప్రతిఫలించిన బాల భాస్కరుఁ బోలిన, కోకనదంబుల కొమరుఁ గంటె
యాహ్లాదకర మగు కహ్లారహల్లక, హంససారసరాజి తాంబుఁ గంటె
తరుణార్కనిభషట్పదచ్ఛదాహత కేస, రాబ్జావృతజలాశ యంబుఁ గంటె
ఆ. చక్రవాకయుతము చారువనీపరి, ధానరంజితంబు దప్పికలిమిఁ
జేరియున్న లేళ్ల గౌరులపిండు నై, పంప యింపుసొంపు పెంప వెలసె. ౪౮

కోకనదంబులు=ఎఱ్ఱకమలములు, ఎఱ్ఱకలువలు, 'భవేత్కోకనదం రక్తపద్మే రక్తోత్పలేప్యథ॥' నానా॥౮॥ ఆహ్లాదకర=సంతోషకరమగు. కహ్లార=ఇంచుకయెఱుపును మిక్కిలి పరిమళము గల కలువ. హల్లక= చెంగలువలచేతను. రాజితాంబు=ప్రకాశించుజలము. తరుణార్కనిభ=ఉదయకాల సూర్యునివంటి, షట్పదచ్ఛదాహత = తుమ్మెదల ఱెక్కలచేఁ గొట్టఁబడిన, కేసర = కింజల్కములు గల, అబ్జ = కమలములచే, ఆవృత = ఆవరింపఁబడిన, జలాశయంబు = మడుఁగు, చారువనీ = మనోహరమైన యడవియనెడి, పరిధాన = వస్త్రముచే, రంజితంబు= మనోహరమైనది, గౌరుల పిండు = ఏనుగుల గుంపు, ఐ = కలిగి.

తాత్పర్యము.

లక్ష్మణా! పంపాతీరవనములందు విలాసముగ నచ్చటచ్చటఁ గిన్నరులు తిరుగు చున్నారు చూచితివా? నీటి యలలయందుఁ బ్రతిఫలించిన యుదయకాల సూర్యునివలె నుండు నెఱ్ఱకమలములఁ జూచితివా? సంతోషకరము లైన కహ్లారములు నెఱ్ఱకలువలు

హంసలు బెగ్గురులు వీనిచే నందమైన నీళ్ళను జూచితివా? శ్వేత సూర్యునితో సమానమైన తుమ్మెద రెక్కలచేఁ గొట్టఁబడిన యకరువులు గల మడుఁగు చూచితివా? చక్రవాకములతోఁగూడి మనోహరమైన వన మను వస్త్రమును గప్పుకొనినదై దప్పి దీర్చుకొన వచ్చిన లేళ్ళయు నేనుఁగులయు సమూహములు గలదై పంప మిగుల నానందకరమై యున్నది.

క. కరువలితాఁకున రేఁగిన, తరఁగలచేఁ దాడితములు♦తామరపూవుల్
సరసత నుయ్యేల లూఁగెడి, సరణిఁ రహిమీఱెఁ గంటె♦ సౌమిత్రి యటన్. ౬౯

కరువలి = గాలి, తరగలచే = అలలచే, తాడితములు = కొట్టఁబడినవి.

తా త్ప ర్య ము.

గాలితాఁకున విజృంభించిన యలలచేఁ గొట్టఁబడిన తామరపూవులు నల లను నుయ్యేలల మీఁద నూఁగుచున్నవా యన్నట్టు లింపుగా నున్నవి చూచితివా?

కం.శతపత్రపత్రలోచన, శతపత్రప్రియను ఫుల్ల♦సారసగంధిఁ
క్షితికన్యకఁ గన లేమిని, బ్రతుకఁగ నే నొల్ల నేల ♦ బరువుగ ననుజా! ౭౦

శతపత్ర పత్రలోచన = తామర రేకులవంటి కన్నులుగలది, శతపత్రప్రియను = కమలములందుఁ బ్రీతి గలదానిని, ఫుల్లసారసగంధిఁ = వికసించిన కమలముల వాసన వంటి వాసన గలదానిని.

తా త్ప ర్య ము.

తామరఱేకులవంటి కన్నులు గలదియుఁ,గమలములందుఁ బ్రీతిగలదియుఁ గమల గంధియు నగు సీతను జూడలేక బ్రతుకుటవలన నేలకు భారమాత్ర ప్రయోజనమేకాని మఱి యే ప్రయోజనము లేదు.

కం.ఔరా కాముని కుటిలత, దూరగతం బ్రాణతుల్య ♦ దుర్లభ భద్రన్
జారుతరభద్రవాదిని, స్ఫారగతిం దెచ్చె నిపుడు ♦ స్మరణంబునకున్. ౭౧

కుటిలత=వక్రగుణము; దూరగతఁ=దూరమం దున్నదానిని, ప్రాణతుల్యఁ= ప్రాణముతో సమానురాలైనదానిని, దుర్లభఁ=కష్టముచే లభింపవలసిన దానిని, చారుతర=మిగుల మనోహరమైన, భద్రవాదిని=శుభ వాక్యములు చెప్పుదానిని.

తా త్ప ర్య ము.

లక్ష్మణా!యీ మన్మథుని కుటిలబుద్ధిని నే నేమని చెప్పుదును. ఎందో దూరముగ నుండు దానిని నా ప్రాణముతో సమాన యగుదానిని గష్టముచే సాధింపఁదగు దానిని శ్రేష్ఠములైన గుణములు గలదానిని, ప్రియమై శుభములైన వాక్యములు చెప్పుదానిని నా స్మృతికి వచ్చునట్లు చేసెఁ గదా.

కం. పూచినతరువుల కలిమిని, నేచి వసంతుండు నన్ను ♦ నేఁపఁడ యేఁ నే
నేచందంబున నైనను, నేచుదు సౌమిత్రి కాము♦నిఁ సహియింపన్. ౭౨

ఏచి = విజృంభించి, ఏఁపఁడయేఁ = బాధింపక పోయెనా, నేచుదుఁ=నేర్తును, నేతును; నేరుచుదుఁ అను శబ్దములో రేఫము లోపించును.

తా త్ప ర్య ము .

లక్ష్మణా! మన్మథుఁడు న న్నేమియుఁ జేయఁ జాలఁడు. వాని వలని భయము నాకు లేదు కాని యీ వసంతుఁడు వానికిఁ దోడై బాధించుచున్నాఁడు. శత్రు బాహుళ్య మేర్పడినది.

కం. రమణీసంగతి నెయ్యవి, రమణీయము లగుచు నాకు ♦ రాగముఁ గూర్చెఁ
రమణి నెడఁబాయ నవియే, రమణీయతఁ బాసి కడు వి♦రాగముఁ గూర్చెన్. ౫౩

రమణీసంగతిఁ = సీతాదేవి సాంగత్యముచే.

తా త్ప ర్య ము .

అందగత్తె యగు సీతాదేవి సాంగత్యముచే నందము లగు నేవేవి నాకనురాగము ఘటించెనో యవియే యామె నెడఁబాయుటచే వాని యందము చెడి నాకు వైరాగ్యము కలిగించెను. సంసారమందు సుఖబుద్ధికి స్త్రీలే కారణ మనియు వారిని విడిచిన వైరాగ్యసుఖము కలుగు ననియు భావము. 'కాంతలు సంసారకారణములు' భాగ.

కం. తామర మొగ్గల రేకుల, నామోదముతోడఁ గందు♦నా యన నవి నా
భామిని దృక్కోశంబుల,తో మాదిరి గానుట వానిఁ ♦ దోఁపం జేయున్. ౫౪

ఆమోదము = సంతోషము, దృక్కోశంబులతోఁ = కంటి తెప్పలతో, మాదిరి = సమానము - స్మృత్యలంకారము.

తా త్ప ర్య ము .

తక్కిన వన్నియు నేల? తామర మొగ్గల రేకులను జూచియైన సంతోషింత మనిన నవి సీతాదేవి కంటి రెప్పలతో సరిపోలుటచే వానిని స్మృతికి దెచ్చును.

తే. పద్మ కేసరస్పృష్టుఁడై ♦ వసుమతీరు,హాంతరవినిస్సృతుండు నై ♦ యదిగోఁ బవనుఁ
డంగనామణి నిశ్వాస♦భంగినొంది, యసమగతి వీచెడిని మనో♦హరుఁడునగుచు. ౫౫

పద్మకేసరస్పృష్టుఁడై = తామరపూవుల యకరువులఁ దాఁకినవాఁడై, వసుమతీరుహాంతర = చెట్లలోనుండి, వినిస్సృతుఁడై = బయలు దేరినవాఁడై.

తా త్ప ర్య ము .

అది పోనిమ్ము, కమ్మనిగాలిని జూచియైన సంతోషింత మనిన సర్వప్రాణాధారకమైనను వాయువు నన్ను బాధపెట్టుచుఁ దామరలయకరువులఁ దాఁకినవాఁడై యా వాసనయుఁ బుష్పాడియు గ్రహించి చెట్లలోనుండి బయలువెడలి వచ్చి సీతాదేవి విడుచు నిశ్వాసమును బోలి నా మనస్సు నాకర్షించుచున్నాఁడు. 'పద్మకేసరస్పృష్టుఁడై = పద్మకేసర స్పర్శ లేకుండ దాని నెగురఁజిమ్మినవాఁడై; యందఱకుఁ బ్రాణధారకమైన వాయువు నేఁడు సర్వము దుమ్ముగా నెగురఁగొట్టి సర్వసంహారకార్యమునకుఁ బూను కొనినవాఁ డయ్యెను. (౨) లక్ష్మియవతారమైన సీత నన్ను విడిచిపోయిన పిమ్మట

నామెను రక్షింపనైతి నను కోపముచేఁ గాఁబోలుఁ దామరపూవులలోని యకరువులు రాజసస్వభావము కలవి కావున (రజస్సు - పుప్పొడి- రజోగుణము.) వాయువుతోఁడఁ జేరికొని నన్ను బాధించుచున్నవి. వీని కిట్టి దుర్గుణము కలుగుటకుఁ గారణము కంటకి యగు తామరపువ్వు సంబంధమే- అటు గాకున్నను వీఁడును ధూళిధ్వజుఁడే. అందఱ కన్నుల దుమ్ముకొట్టువాఁడే. మఱియు 'పాదారుంతుద మేవ పంకజరజ' యన్నట్టు లిది తనవారినే బాధించుచుండఁగా మాబోంట్లను బాధింపకుండునా? (3) ఈ వీచు నది గాలికాదు, సింహము, అని కేసరపద స్వారస్యముచే నేర్పడెడిది ధ్వని - కేసర ములు = సింహముమీఁది వెంట్రుకలు. కనుకనే ఘాతుకవృత్తి నవలంబించినది. (౪) ఉత్తమ మలయమారుతమే యందఱను బాధించునది. అది యెటువంటి దన:— "కాలాంతఃపుర కామినీ కుచతటీ కస్తూరికా సౌరభశ్రీలుంటాకము చందనాచలతట శ్రీఖండ సంవేష్టనవ్యాళ స్ఫారఫణాకఠోర విషనిశ్వాసాగ్నిపాణింధమం బేలా నాపయి దక్షిణానిలము పక్షీ చేయు దాక్షిణ్యముల్." శృం. నైష. ఇంతక్రూరమైన దక్షిణా నిలము నా మీఁద దయతలఁచునా ? ఇట్టి దానికిఁ దోడు పద్మకేసరముల సాహా య్యము లభించినది. ఇఁక నేమని చెప్పను? (మిరపకాయ నమలి వేఁడినీళ్లు తాగి నట్లు). (౫) లోకమున రూపవంతుఁడుగదా యసహాయశూరుఁడై యుండును. ఈ రూపశూన్యుఁ డగు (నిరాకారుఁడగు) వాయువు తా నితరసాహాయ్యము లేక యేమి చేయఁగలఁడు? రూపవంతుఁ డనఁగా ఆకారవంతు డనియు బలవంతుఁడనియు నర్థములు. ఇది ధ్వని-

ఈ మలయ మారుతుఁడు నీకుమారుతుఁడై పీడించువాఁడగునేని ముందుగానే వాని బారిఁ బడకుండ దూరముపోయి యుండవచ్చునుగదా. అట్లేల చేయవైతి వందువా? వసుమతీరుహాంతరనిస్సృతుండు,వీఁడు చెట్లసందులనుండి బయలు వెడలివచ్చిన వాఁడు. ఇట్లు దొంగవలె వచ్చుటచే వీఁ డిట్లు వచ్చునని తెలిసికొనలేక పోయితినిగాని యందఱకుఁ గానవచ్చునట్లు బయలుమెఱసి వచ్చియుండిన నా జాగ్రత్తలో నేనుండనా? అట్లుగాక తన మలిమ్లుచ నామము సార్థకముగా (మలిమ్లుచుఁ డనఁగా దొంగ, వాయువు) నింతవఱకుఁ జెట్లసందున దాఁగియుండి యిపుడు బయట వచ్చినవాఁడు అని భావము. (౨) రాజపుత్రుఁ లెండ కోర్వలేక చెట్లనీడలయందే యెట్లు వత్తురో గాలియు నట్లే వచ్చుచున్నది. (3) మన్మథ తాపము పడలేక చెట్లచాటున విశ్రమింత మన్నను నచ్చటను నీ దుర్మార్గుఁడు నన్నుఁ జేరనీయకున్నాఁడని భావము. ఈ గాలి నీకు బాధాకరమయ్యె నేని నీవేల దూరముగాఁ బోరాదందువా? 'అంగనామణి నిశ్వాస భంగి నొందె' సీత నిశ్వాసమువలె నుండుటచే దీనిని విడువలేక యున్నాను.

(౨) ఇది సీతా నిశ్వాసమువలె నుండుటచే సీత యిందే యీ చెట్ల మఱుఁగున నున్నదేమో? ఇదె వచ్చునో యదె వచ్చునో యని యెదురు చూచుచుఁ గదలలేక

యున్నవాఁడను. ఆమె నిశ్వాసవాయువు నిట్టి తామర పూలవాసనగలది. 'సురభి నిశ్వసితే దదత స్తృషా'మ్మని కవులచే వీఁడు వర్ణింపఁ బడువాఁడుకదా.

3. ఈ వాయువు పద్మకింజల్కముల సాహాయ్యముచే నన్నుఁబీడించుట మాత్రమే కాదు. నా భార్యను స్మరింపఁజేసికూడ నన్ను బాధించుచున్నాఁడు.

వీచెడిని=వీచుచున్నాఁడు, నన్నెంత బాధించినను సీతానిశ్వాన సామ్య ముండుటచే నాకు సంతోషకరుఁడే. ఆకారణముచే సర్వదా నాయొద్దనేయుండిన నాస్మరణము చేనైన సంతోషింత మనిన నెప్పుడో యొకసారి నాయొద్దకు వచ్చును.దూరదూర మందచ్చటఁ నచ్చట దిరుగుచున్నాఁడు (౨) తానొకఁడే నన్నేమియుఁ జేయఁజాలఁ డని యెఱిఁగి కాఁబోలు నన్నిపుష్పముల నాశ్రయించి వాని వాసననుగైకొని యందఱ మనస్సులు హరించి తనకు లోపఱుచుకొని నా పైనెత్తి వచ్చుచున్నాఁడు. ఇట్లు బాధించువాఁడెవఁడు?'భీషాస్మాద్వాతః పవతి'యని యింతవఱకు నాకుభయపడి భయపడి విసరుచుండినవాఁడు. పవనుఁడు=అన్నిటిని శుద్ధముచేయునంతటి శుద్ధాత్మ, అట్టివాఁ డిప్పుడు కాలబలమున నన్నే బాధించుచున్నాఁడు.

ఈ మలయపవనుఁడు పద్మకేసర సంస్పృష్టుఁ డనుటచే శైత్యమును, వసుమతీ... నిస్సృతుం డనుటచే మందమును, అంగనామణి...నొంది యనుటచే సౌరభ్యమును సూచితము.

ఈ వాయువు దొంగవంటివాఁ డనియు నర్థము స్ఫురించును. ఎట్లన:—పద్మకేసర నిస్సృష్టుఁడనుటచే దొంగ తన్నితరులు గుర్తింపరాకుండుటకుఁ బరులు భయపడుటకు రంగుపొడి రాచికొని వచ్చునట్లు వీఁడును బుప్పొడి రాచుకొనివచ్చుచున్నాఁడు. అంగనా...నొంది - బహుకాల పరిచితునివలె దొంగ దగ్గఱకు వచ్చి ప్రాణములోఁ బ్రాణమువలె మచ్చిక కుదుర్చుకొని మీ దేయూరు మీపేరేమి; ఎందుండి యెందుఁ బోవుచున్నా రని ప్రశ్నించుచు వార ధనము తనచేతఁ జిక్కువఱకు బైటికిఁబఱిశుద్ధుని వలె నటించును. అది దొరకెనేని (వీచెడిని) యెత్తుకొని దూరముగఁ బోవును.

భగవత్కరుణారసప్రవాహ మీ పద్యమునఁ జెప్పఁబడె ననియుఁ జెప్ప వచ్చును. ఎట్లన:—

పద్మ...సృష్టుఁడై=పద్మ=లక్ష్మీదేవియొక్క'జ్యాపోహ్రస్వః సంజ్ఞాచ్ఛందసో'యను సూత్రము ప్రకారము నదసుతగురుకర్ణశల్యు లన్నట్లు పద్మా శబ్దము పద్మయయ్యె. కేసర=కింజల్కములవంటి రంగు గల యనురాగముచేత,అనురాగ మెఱ్ఱనిరంగని కవి సమయము, కావునఁ బద్మకేసర మనఁగా లక్ష్మీదేవి యనురాగమని యర్థము. పురుషకారభూతయగు లక్ష్మీదేవి యనుగ్రహమునకుఁ బాత్రుఁడైనవాఁడు తల్లీ నీదయకుఁ బాత్రుఁడైనవాఁ డనేకాపరాధములు చేసినవాఁడైనను నాకారణముచే వీఁడు నాయాజ్ఞ మీఱి వర్తించెనని నీ భర్త వీనిపైఁ గోపించినను లోకములో నపరాధముచేయనివాఁ డెవఁడు, రక్షించుట మన కార్యముగాని, శిక్షించుటగా దని శాంతిపఱిచి నీ ప్రియుల

రక్షింపఁజేయుచుండును. ఇట్టిది లక్ష్మి. వసుమతీ...వినిస్సృతుండు='ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయ'మ్మనన్నట్లు, సంసారము వృక్షముగాఁ జెప్పఁబడెను. అట్టి జనులపై దయగలది,

అంగనా.. నొంది 'స్త్రీప్రాయ మితరత్సర్వం జగద్బ్రహ్మ పురస్సర' మ్మనన్నట్లు స్త్రీలవలె భగవంతునికిఁ బరాధీనులైన జీవులకుఁ బ్రాణధారక ముజ్జీవకమునై యున్నది. వీచెడిని=ఈకాల మాకాల మనక సర్వకాల సర్వావస్థలయందు దా దయ యందఱపైనఁ బ్రసరించును.

పవనుఁడు లింగవ్యత్యయముచేఁ బావనముచేయునది. ద్రవిడోపనిషద్వ్యాఖ్యాత వ్రాసినదాని ననుసరించి వ్రాయఁబడెను.

కం. పంపాదక్షిణతటమున, నింపగు నెత్తములఁ గంటివే సౌమిత్రీ
పెంపార విరియుగోఁగుల,సొంపగు కాండములఁ బరమశోభాఢ్యములన్. ౫౬

పంపాదక్షిణ తటమునన్ = తుంగభద్రానది దక్షిణపు వైపున, దీనివలన రామలక్ష్మణులు శబరి యాశ్రమము విడిచినది మొదలు తుంగభద్రకు నుత్తరపు టొడ్డున నుండియే మాటలాడుచున్నారు. నెత్తములన్ = కొండలమీఁది విశాల ప్రదేశములందు, కాండములన్ = కాఁడలను.

తా త్ప ర్య ము .

లక్ష్మణా! పంపానదీ దక్షిణతీరమున విస్తారముగఁ బూచిన గోఁగుకాఁడ లెంత ప్రకాశవంతములై యున్నవో చూచితివా!

చ. పురుతరధాతురాగచయభూషితుఁ డీ గిరిరాజు కంటె ము
త్కరముగ వాయువేగసువిఘట్టిత సాంద్రరజంబుఁ జిత్రవై
ఖరులను రేపుచుండెడిని గ్రమసుపుష్పిత పత్రహీనసుం
దరవరకింశుకంబులను దద్దయు సానులు ప్రజ్వరిల్లెడిన్. ౫౭

పురుతర = మిగుల గొప్పయగు, ధాతురాగచయ = కావిరాల రంగుల సమూహముచే, భూషితుఁడు = అలంకరింపఁబడినవాఁడు, ముత్ +కరముగన్ = సంతోషకరముగ, వాయువేగ సువిఘట్టిత = గాలివేగముచేఁ జక్కఁగా ఘట్టింపఁబడిన, సాంద్ర = దట్టమైన, రజంబు = దుమ్మును, రేపుచుండెడిని = లేవఁదీయుచున్నాఁడు, ఎగఁజిమ్ముచున్నాఁడు, కర్త, గిరిరాజు = ఋశ్యమూకము, దీనివలన నిప్పుడు రామలక్ష్మణులు ఋశ్యమూకమునకు నెదురుకట్లగా నేఁటికి నుత్తరపు వైపు వచ్చి రని యేర్పడు చున్నది. ఇంతవఱకు రామలక్ష్మణు లేఱు దాఁటి దక్షిణము రాలేదు, ఋశ్యమూక మేటికి దక్షిణమున నున్నది, క్రమసుపుష్పిత = మనోహరముగఁ బూచిన, పత్రహీన = ఆకులు లేని, యనఁగా (ఆకులు కానరాకుండునట్లు) సుందరవర = మిగుల సుందరములైన, కింశుకంబులను = మోదుగుచెట్లను, సానులు= చఱియలు.

తాత్పర్యము.

లక్ష్మణా! విశ్లేషించిన కావిరాలు లోనగు వానిచే నలంకరింపఁబడిన యీ పర్వతరాజు వాయువేగముచే నెగురఁగొట్టఁబడిన దుమ్ములను జిత్రవిధముగ సంతోషకరముగ లేవఁదీయుచున్నాఁడు. మనోహరముగఁ జెట్ల యాకులు గానరాకుండునట్లు పూచి యందమైన మోదుగులచేఁ గొండచఱియలు ప్రకాశించుచున్నవి. రామచంద్రమూర్తి తన సమీపమునకు వచ్చిన కారణమున నాయనను బహూకరింప గిరిరాజు తా నలంకరించుకొని యలంకరించుకొనిన వేశ్యలతోడ ధూపహస్తముల నాయన కెదురుగ వచ్చె నని భావము. (సానులు = వేశ్యలనియు నర్థముగలదు.) ఇది శుభశకునము కావుననే సంతోషకర మనఁబడెను.

సీ. మాలతీ కరవీర ♦ మాధవీ మల్లికా, వల్లికావేల్లిత ♦ వరతలముల
సిందువారక బృంద♦కుంద వాసంతికా, సంతానగుల్మినీ ♦ చారుతటుల
వంజుళ మంజుళ ♦ వకుల చంపక నీప, చిరిబిల్వ కేతకీ ♦ వరణములను
నారంగ మధురంగ ♦ నాగరంగ కురంట, పాటలార్జున చూత♦పటలములను
తే. శింశుపోద్దాల కేతక♦కింశుకములఁ, జందనస్పందనవరక్త♦ సంతతులను
గురువక శిరీష తినిశ కే♦సర సువర్ణ, శాబరాగములను గంటె ♦ సానువులను. ౫౭

మాలతీ = జాజి, కరవీర = గన్నేరు, మాధవీ = పువ్వుల గురివింద, మల్లికావల్లిక = మల్లెతీఁగలచేత, వేల్లిత = చుట్టబడిన, వరతలములన్ = ఇంపైన ప్రదేశములను, సిందువారక = వావిలిచెట్లు, బృంద = సమూహములయు, కుంద = మొల్లలయు, వాసంతికా సంతాన = పచ్చని పూలమొల్లల సమూహములయు, గుల్మినీ = పొదలచేతను, వంజుళ = అశోకవృక్షములచేతను, మంజుళ = మనోహరమయిన, వకుల=పొగడలను, చంపక=సంపెఁగలను, నీప=కడపచెట్లను, చిరిబిల్వ=కానుఁగులను, కేతకీ=మొగలిచెట్లను, వరణములను=వరణవృక్షములను, నారంగ=నారింజచెట్లను, నాగరంగ=మఱియొకదినుసు నారింజచెట్లను, కురంట = గోరంటలను, పాటల=పాదిరిచెట్లను, అర్జున = ఏఱుమద్దులను, చూత = మామిడులను, శింశుప = ఇరుగుడు చెట్లను, ఉద్దాల=విరిగిచెట్లను, కేతక=పసుపురంగు పూలుగల మొగలి (తెల్లనిపూలను గేదఁగియందురు) చెట్లను, కింశుకము=మోదుగులను, రక్త= కుంకుమపువ్వు చెట్లను, కురవక=ఎఱ్ఱగోరంటలను, శిరీష=దిరిసెనలను, కేసర=పొన్న చెట్లను, సువర్ణ = నల్లయగురుచెట్లను, శాబర+అగములను=లొద్దుగ చెట్లను.

అన్నియుఁ జెట్లపేరులే కావునఁ దాత్పర్యము వ్రాయలేదు.

కం. పూచినశిఖలను గల లతి,కాచయములు చుట్టుకొనఁగఁ ♦ గంటే పంపన్
బూచినద్రుమములు సాంద్రమ,రీచుల నిగిడించు చూఁచెఁ ♦ గ్రీడం గొమ్మల్. ౫౮

శిఖలు=కొనలు, లతికాచయములు=తీఁగలగుంపులు, సాంద్రమరీచులన్=దట్టపుగాంతులను.

తా త్ప ర్య ము.

పూచిన కొనలు గల తీఁగల గుంపులు దమ్ము జుట్టుకొనఁగాఁ బంపయొడ్డున బూచినచెట్లు దట్టపుఁగాంతులఁ బ్రసరింపఁజేయుచుఁ దమకొమ్మల నూగులాడించు చున్నవి. ఇచ్చటఁ బంపయందలిచెట్లనుటచేఁ బంపాతీరమందలి చెట్లని లక్షణచే గ్రహింపవలెను. ఇట్టిచోట్ల లక్షణ గ్రాహ్యము.

క. కరువలి కాడెడు విటపోత్కరములతో నెలమిఁ దమ్ముఁ ♦ గదియఁగ రాఁగఁ
దరువులు వాని మదించిన, వరతరుణులువోలె లతలు ♦ పరిరంభించెన్. ౬౦

విటపోత్కరములతోఁ = కొమ్మల సమూహములతో, విట+ప+ఉత్కర ములు = విటపతుల సమూహములు, పరిరంభించెఁ = కౌఁగిలించెను.

తా త్ప ర్య ము.

వృక్షములు గాలికిఁ గదలుచున్న కొమ్మలతో సంతోషముగఁ దమ్ము సమీపింపఁగాఁ గామమదముగల యువతులవలెఁ దీఁగలు కౌఁగిలించెను

మలయమారుతము ధాకకు వణఁకుచున్న విటపశ్రేష్ఠులు తమ్ము సమీపింపఁగాఁ గామమదము గల స్త్రీలు వారిని గౌఁగిలించినట్లు తీఁగలు చెట్లకొమ్మలఁ గౌఁగిలించెను.

క. తరువుం దరువుఁ ధరణీ,ధరముఁ ధరముఁ వనంబు ♦ తత వనముం గా
మరుతుఁ డనేక రసజ్ఞత, నరుసించెడి నరునిమాడ్కి ♦ నరిగెడుఁ గంటే. ౬౧

మరుతుఁడు=వాయువు, అనేక రసజ్ఞతఁ=లెక్కలేని రుచులజ్ఞానముచే, ఋత్వి గాదులు గుణవర్ధనంబు విభాష నగు, (సు. వ్యా. సూ. తత్స ౮ర) మరుత్తు-మరుతుఁడు;

తా త్ప ర్య ము.

వాయువు నానారసముల జ్ఞానము గలవానివలెఁ జెట్టు చెట్టు కొండ కొండ యడవి యడవి తిరుగుచున్నాఁడు.

కం. పెల్లుగ విరిసిన పూవుల, మొల్లము నై మధురగంధ♦ములు కొన్నితరుల్
సల్లలిత కుట్మలంబుల, మొల్లమిచే వెలిగె నీల♦ములు కొన్నితరుల్. ౬౨

సల్లలితకుట్మలములు = అందమైన మొగ్గలు గలవి.

తా త్ప ర్య ము.

విశేషించి పూచిన పూవుల యాధిక్యము గలవై కొన్ని వృక్షములు తియ్యని వాసన గలవై యున్నవి. కొన్ని పూలు ఆకులు కానరాకుండ మొగ్గలచే నిండినవై యున్నవి. కొన్నియాకులు విశేషించి నీలములై యున్నవి.

కం. అదె రాగమత్త మధుకర, మిది రమ్యం బిదియె స్వాదు♦విదియో యిపుడే
కద విరిసిన దని మెంచుచు, ముదమున ఝంకృతులఁ గుసుమ♦ములఁ దాఁదవిలెన్.

తా త్ప ర్య ము.

క్రొత్తక్రొత్త పూవులయం దనురాగము గల మదించిన తుమ్మెదలది యింపు.

ఇది తీపు. ఇది యిపుడే వికసించిన దని యెంచుచు సంతోషముతో ఝుంకారములు చేయుచుఁ బూలయం దాసక్తము లయ్యెను. దక్షిణనాయకుఁడు వర్ణింపఁబడెను.

కం. మాటుగొని భూరుహముల న,దాటున వెలివచ్చి తేనెఁ ♦ దవిలిన రక్తిన్
జాటుగ మఱియొక భూరుహ,కూటముఁ జేరంగఁ దేఁటి♦గొబ్బునఁ జనియెన్. ౯౪

తాత్పర్యము

ఒకతుమ్మెద చెట్లలోని పూవుల చాటుననుండి తేనెమీఁది యాశచేఁ దటాలున దానివిడిచి వెలుపలికి వచ్చి మఱి వేఱుచెట్లయందుఁ దేనె విస్తారముగ నుండుటచే వానిని జేరఁ బోయెను.

కం. తఱచుగఁ దమకుం దామిల, నెఱసిన యొఱపైన విరుల ♦ నెఱిగల నేలల్
తెఱకొనుచు హాయిగా నిటఁ, బఱవని పూఁబఱపు లగుచు ♦ భాసిలెఁ గంటే ౯౫

ఒఱపు = అందము, తెఱకొనుచున్ = తెఱకొని బయలుపడుచు, నెఱి = అందము.

తాత్పర్యము.

విశేషముగ మేలిపూలు తమంతటఁదామే రాలుటచే నందమైన నేలలు సుఖముగ మనుష్యులు పఱువని పూలపాన్పులై ప్రకాశించుచున్నవి.

కం. పలుపలువన్నెల యలరులు, గలయఁగ సానువుల రాలి ♦ కమనీయములై
విలసించెఁ బసిమి జేవుఱు, వెలిపాన్పులలీలఁ గంటి♦వే సౌమిత్రీ. ౯౬

అలరులు = పూలు.

తాత్పర్యము.

నానావిధములగు రంగులుగల పూలు చఱులయం దంతట రాలి మనోహరములై బంగారెఱుపు తెలుపు గలిగి పఱచిన పఱుపులవలెఁ బ్రకాశించుచున్నవి. లక్ష్మణా! చూచితివా?

కం. కుసుమసమయంబునన్ ద్రుమ, విసరంబుల సుమచయంబు ♦ విరివిం గంటే
కుసుమోత్తంసితతరువులు, పసమీఱెఁ గదన్న యెట్టి♦ప్రక్కలఁ గనినన్. ౯౭

ద్రుమ విసరంబుల=చెట్లసమూహముల, సుమచయంబు=పూలగుంపులయొక్క, విరివిన్=విస్తారమును, కుసుమోత్తంసితతరువులు=పూలు కొనలయందుఁగల చెట్లు.

తాత్పర్యము.

లక్ష్మణా! యీ వసంతసమయంబునందుఁ జెట్ల సమూహములం దెంత విస్తారముగఁ బూలున్నవో చూచితివా? అన్నా! యేప్రక్కఁజూచినను బూవులు కొమ్మల కొనలయందుఁ బసగలిగియున్నవి.

కం. సాటికి నన్యోన్యంబును, బోటికివలెఁ బూచి లెస్స ♦ భూజములు పరీ
పాటిగఁ దేఁటులమ్రోఁతల, మాటికి నొండొంటి గేలి♦మాటలఁ జీరెన్. ౯౮

అన్యోన్యంబును = పరస్పరమును.

5

తా త్ప ర్య ము .

ఈ వృక్షములు దానివలె నేను బూచవలెనని యొకదానిమీఁద నొకటి పోటి వై చికొని చక్కఁగాఁ బూచి తుమ్మెదల ఝుంకారముల నెపమున నొకదానిని నొకటి నీవు కొంచెమే పూచితివే, నేనెంత పూచితినో చూడుమని పరిహాసము లాడుచున్నవి.

కం. ఈ కారండవశకునము, ప్రాకటశుభవారి మునిఁగి ♦ రమణియుఁ దాను౯

నా కతనుతాప మొదవ ర,తీకేళిం గూడెడిం గ♦దే సౌమిత్రీ. ౯౯

కారండవశకునము=నీటికోడి పక్షి, రమణి=ఆఁడు నీటికోడి, అతనుతాపము= మదన తాపము. రతి, రతీయని రెండు రూపములుగలవు. అథో రతిః రతీ కామ ప్రియా ప్రీత్యోః॥ నానా ॥౮॥

తా త్ప ర్య ము.

ఈ నీటికోడి తన భార్యతో నీళ్ళలో మునిఁగి స్నానముచేసి నాకు మదన తాపము కలుగునట్లు రతికేళిఁ గూడుచున్నది.

కం. మందాకినితటినికి నీ,యందంబు మనోజ్ఞభంగి ♦ యలవడుట జగం

బందు మనోరమగుణముల, నెందును విఖ్యాతిఁ గాంచె ♦ హృష్టిప్రదమై. ౭౦

మందాకిని తటినికి౯ = గంగయనెడు నదికి, ఈ యందంబు = ఈ పంపానది యందము, మనోజ్ఞభంగి = మనోహరమైన విధముగ, అలవడుట౯ = లభించుటచే, హృష్టిప్రదమై = సంతోషకరమై.

తా త్ప ర్య ము.

గంగానదికి నీ పంపానదియొక్క యందము లభించుటచేఁగదా మనోహర గుణములచే లోకమునఁ బ్రసిద్ధికెక్కెను. గంగానదికంటె నిదియేమిటను దక్కువ గాదని భావము.

కం. కనులారఁ గనుచు నా సతి, మనసారఁగ నిందు నుండ ♦ మరగితి మేని౯

విను స్వర్గ మా యయోధ్యయు,మనమున స్మరియింపఁజాల ♦ మాన్యచరిత్రా. ౭౧

తా త్ప ర్య ము .

నా భార్యను నేను గన్నులారఁ జూచుచు నిండుమనస్సున మనముండఁగలిగె నేని నా కా స్వర్గముమీఁదను అయోధ్యమీఁదను మనస్సుపోదు. పరిపూర్ణానందాను భవము ప్రధానము. అది యెందుఁగలుగునో యాస్థలమే సేవ్యము. స్వర్గవైకుంఠము లం దానందానుభవమే ప్రధానమయినపుడు, చేతనుండు దీనిని విడిచి వానికై పరువు పాఱనేల ? కనుకనే భగవత్కైంకర్యమువలనఁ గలుగు నానంద మీ లోకమునందే కలిగెనేని భక్తునకుఁ బ్రపన్నునకు వైకుంఠముతోఁ బనిలేదు. 'మరగితిమి' అని బహు వచనము ప్రయోగముచే 'ఉర్వీజ నీవునుగూడి యీడుచు౯ గొండలపేటుల న్నిదుర గూరియు యున్నను మేలుకొన్నఁ గోదండ ధరుండనై మెలపుఁదాలిచి సర్వము నేన తీర్చెదఁ' అనిచెప్పిన నీవును అని భావము.

ఆ. వాని మాటలేల ♦ వసుమతీసుతతోడ, డంబుమీఱు శాద్వ♦లంబులందు
నే రమింపఁ గలుగ ♦ నేటికిఁ జింతింతు, నుబుసుపోక కైన ♦ నున్నవాని. ౭౨

ఉన్నవానిన్ = తక్కిన వానిని, శాద్వలము = పచ్చికనేల.

తా త్ప ర్య ము.

స్వర్గము వైకుంఠము ముచ్చట లటుండనిమ్ము. సీతను జూచుచు నీ మిసమిస మెఱయు పచ్చికపట్టులందు మన ముండఁగలిగిన చోఁ బ్రొద్దుపోవుట కైనను దక్కిన వాని నేల చింతింతును? మన ముప్పురము దప్పఁ జింతింపవలసిన వేఱుతత్త్వము లేదు.

ఉన్నవాఁడు- అన్యుఁడనుటకు- 'మ॥ అతివా సిద్ధము నాఁటి బాలకున కీ యాకార మీవర్ణ మీ-।గతి యీహాస విలోకనస్వరము లీ గాంభీర్య మీకాంతి వీఁ। డతఁడే కాఁదగు నన్నవారలకు నా యాత్మేశు సారూప్యసం। గతి సిద్ధింపదు వీని యందు మిగులం గౌతూహలం బయ్యెడిన్. భాగ. ౧౦ ఉత్తర.

కం. ఇవురుల మొగడలఁ దలిరుల, సవు రగు నాకులను మిగుల♦సంపన్నములై
ఛవి మీఱు తరులవనముల, రవరవలన్ వేఁదు రెత్తె♦రా! నా కనఘా! ౭౩

ఇవురులన్=చిగుళ్లచేతను, మొగడలన్=మొగ్గలచేతను, తలిరులన్=పూవుల చేతను, సంపన్నములై =పూర్ణములై, ఛవి = కాంతి, వేఁదుఱు = ఉన్మాదము, రవ రవలన్ = కాంతులచే.

తా త్ప ర్య ము.

తమ్ముఁడా! చిగుళ్ళచేతను మొగ్గలచేతను పువ్వులచేతను అందమైన యాకుల చేతను మిక్కిలి పూర్ణములై కాంతిచే నతిశయించిన యీ చెట్లుగల వనముల కాంతు లచే నాకుఁ బిచ్చి యెత్తినట్లున్నది. సీతాదేవియొక్క పదములు రదములు నవ్వులు మొదలగు వానిని స్మృతికిఁ దెచ్చుటచే నాకీ వనము లున్మాదకరములై నవని భావము.

కం. జక్కవలు బెగ్గురులు జల, కుక్కుటములుఁ గ్రౌంచములును ♦ కూజద్ద్విజముల్
పెక్కులు జింకలుఁ బందులు, మిక్కుట మగు పంపఁ గంటె♦మిక్కిలి వెలిఁగెన్. ౭౪

జక్కవలు = చక్రవాకములు, జలకుక్కుటములు = నీటికోళ్లు, కూజత్ = ధ్వనించుచున్న, ద్విజముల్=పక్షులు.

తా త్ప ర్య ము .

చక్రవాకములు బెగ్గురులు నీటికోళ్లు క్రౌంచములు కూయు పక్షులు అనేకము లగు జింకలు పందులు మితిమీఱి యున్నవి. ఈ పంపానదిని చూచితివా? ఇది నదీ వర్ణనమే కాని సరోవరవర్ణనము కాదు. ఇందు జింకలు పందులు నీళ్లు ద్రావ వచ్చెనని గ్రహింపనగు.

కం. నా మోదద్విజచయములు, శ్యామామణిఁ జంద్రముఖిని ♦ సారసనేత్రన్
నా మనమునకుం దెచ్చియుఁ, గామము నాలోనఁ గొలఁది♦గడవం జేసెన్. ౭౫

సామోద = సంతోషముతోఁగూడిన, ద్విజచయములు = పక్షులగుంపులు, కొలఁది గడవన్ = మితిమీఱునట్లు.

తాత్పర్యము.

యువతీరత్నము చంద్రముఖి కమలలోచన యగు సీతాదేవిని నీ సంతోషముతోఁ గూడిన పక్షిసమూహములు నాకు స్మృతికిఁ దెచ్చి నాకు మితిమీఱిన కామమును గలిగించుచున్నవి.

కం. హరిణీచయసంగతముల, హరిణంబుల సానుభూములందుం గనుమీ
హరిణీశాబకనయనా, విరహీకృతు నన్ను దీను వీక్షింపవనా. ౭౬

హరిణీచయ = ఆఁడుజింకల గుంపులతో, సంగతములన్ = కూడినవానిని, హరిణంబులన్ = మగజింకలను, సానుభూములందున్ = చఱియల ప్రదేశములందు, హరిణీశాబకనయనా = జింకపిల్లకన్నులవంటి కన్నులుగలదానిచే, విరహీకృతున్ = వేఱుగాఁ జేయఁబడినవానిని.

తాత్పర్యము.

ఆఁడుజింకలతోఁగూడి చఱియలందుఁ దిరుగు మగజింకలను జూడుము. ఆఁడుజింకపిల్లకన్నులవంటి కన్నులుగల సీతను విడిచియుండెడి నన్నుఁజూడుము. అవి యెంత సంతోషముతో నున్నవో, నే నెట్టు లేడ్చుచున్నానో!

కం. మత్తద్విజసంఘంబులు, నెత్తమ్ముల మొత్తములను నెమ్మదిఁ దిరుగన్
హత్తిన తమి నట నిట నా, చిత్తము తహతహల నేమి చెప్పుదు ననుజా! ౭౭

మత్త = మదించిన, ద్విజ = పక్షుల.

తాత్పర్యము.

మదించినపక్షిగుంపులు పర్వతమందలి బయళ్ళఁ గామముచే సంతోషముతోఁ దిరుగఁగా నిచ్చట నా తత్తఱపాటు నేనుని చెప్పుదును.

కం. కాంతాసహితుఁడ నై యీ, కాంతసుకాంతారమున నికామము దీరన్
జింతాచ్యుతిఁ జరియించిన, యంతఁ గదా నాకు స్వస్తి యగు సౌమిత్రీ. ౭౮

సుకాంతారమునన్ = అందమైన వనమునందు, నికామము = అధికకామము, చింతాచ్యుతిన్ = చింత వదలిపెట్టి.

తాత్పర్యము.

సీతాదేవితోఁ గూడినవాఁడనై యీ మనోహరమైన వనమునందు నధిక కామము చక్కఁబడున ట్లితర విచారములేక సంచరించినఁగదా నా మనస్సు కుదుటఁ బడును.

కం. పావనపంపావనములఁ, బావఁపోతముల నేను బావని సీతా
భావినితో సేవించిన, జీవము మెయి నిలుచు నొంట సేమము గలదే. ౭౯

పావన పోతములన్ = పిల్లగాలులకు.

తా త్ప ర్య ము.

పావనములయిన పంపానదీ జలములను, పిల్లగాలులను నేను పావని యగు సీతాదేవితో సేవించునంగదా నా దేహమునందుఁ బ్రాణములు నిలుచును. అటు గాకున్న నాకు క్షేమముగలదా?

కం. పంపోపవనసమీరము, సొంపుగ బిససూనకుసుదసుమసురభితము౯
లంపటము దీఱఁగా సేవింపంగల వారె పో భువి౯ ధన్యతముల్. ౮౦

పంపా + ఉపవన + సమీరము = పంపాసమీపమున నున్న వనములనుండి వచ్చుగాలి, బిససూన = కమలములచేతను, కుముదసుమ = కలువపుష్పములచేతను, సురభితము = సువాసనగలదిగాఁజేయఁబడినది, లంపటము = గాసి, రూ—లంపట. సొంపుగ౯ = ఆనందముగ, ఇతరపదార్థసాంగత్యము లేనిది.

తా త్ప ర్య ము.

కమలములచేతను గలువలచేతను పరిమళముగలదిగాఁ జేయఁబడిన పంపా సమీపమందలి వనములగాలి తమ గాసి శమించునట్లు సేవింపఁగలవారే మిక్కిలి ధన్యులు.

కం. ఆ నీరేజవిలోచన, యా నవయౌవనవిలాస యా రాకాచం
ద్రానన యే గతి విరహాధీనత వివశాత్మ యగుచు ధృతి మన నోపున్. ౮౧

ఆ నీరేజవిలోచన = ఎందో దూరమునందున్న కమలములవంటి కన్నులుగలది, నవయౌవనవిలాస = నూతన యౌవనమువలనఁ గలుగు సౌందర్యముగలది, రాకా చంద్రానన = నిండుపున్నమనాఁటి చంద్రునివంటి ముఖముగలది, విరహ + అధీనత = వియోగమునకు వశపడుటచే - వివశాత్మ = పరవశమైన మనస్సుగలది, ధృతి౯ = ధైర్యముచే.

తా త్ప ర్య ము.

ఆ కమలాక్షి, యా క్రొత్తప్రాయంపు సుందరి, యా నిండుచందురుఁబోలు నెమోమ్ముగలది, యేవిధముగ వియోగపాటునఁ బరవశమై ధైర్యముతోఁ బ్రాణము నిలుపుకొనఁగలదు. దానికై నేను దుఃఖించెదను.

శ్రీరామచంద్రమూర్తికిఁ గామ మొకటియే కారణముగాదు. దానికంటెఁ బ్రబలకారణములు గలవని వాని నీకమీఁద వాల్మీకి చెప్పుచున్నాఁడు.

చం. అనఘుఁడు సత్యవాది మహితాత్ముఁడు ధర్మరతై కశీలుఁ డా
జనకుఁడు గోష్ఠి మా కుశలసంపద ప్రశ్నము చేసి యల్లుఁడా!
తనయకు సేమమా? యనిన దానికి నే మని చెప్పువాఁడ మా
నిని నెవఁడో హరించెను వసిస్థలి నంచు వచించువాఁడనే. ౮౨

తాత్పర్యము.

వియోగము నెట్లులైన సహింతు ననుకొమ్ము. అవమాన మెట్లు సహింతును? ఏమి యవమానము వచ్చెనందువా? సీతాదేవి తండ్రి జనకరాజు పాపరహితుఁడు, యథార్థము పలుకువాఁడు, గొప్ప పూజ్యమగు మనస్సు గలవాఁడు, ధర్మమందే యాసక్తిగల యాచారముగలవాఁడు, యిట్టివాఁడు నేను మరలిపోయినపుడు నిండుసభలో 'అల్లుఁడా! నాకూఁతురు సేమముగా నున్నదా' యని కుశలప్రశ్నము సేయఁగా నే నేమని ప్రత్యుత్తర మియ్యఁగలను. నీ కూఁతునెవఁడో యెత్తికొని పోయినాఁడని చెప్పుదునా? ఇంతకంటె నవమానప్రసంగము మఱియొకటి కలదా.

కం. ననుఁ గన్నతండ్రి నన్నుం, వనములఁ బడు పొమ్మటన్న ♦ వనజాక్షియు న
న్ననుగమనం బొనరిచె స, జ్జననుతమార్గమున నట్టి♦సతి గతి యేమో. ౮౩

తాత్పర్యము.

నన్నుఁగడుపారఁ గన్నతండ్రియే నా యందుఁ బ్రేమ వదలి రామా! నీవడవుల పాలై పొమ్మని చెప్పఁగా సీతాదేవి సజ్జనులచే స్తోత్రముచేయఁదగినమార్గము ననుసరించి భర్తవెంట భార్యయను న్యాయమును బురస్కరించుకొని నా వెంట వచ్చెను. దానివెంట నేను బోనైతినిగదా? నేనేమి మగఁడను? ఏమికృతజ్ఞుఁడను? అట్టిది యెక్కడ నేగతిఁ బట్టెనో!

తే. రాజ్యహీనునిఁ గృపణు ని♦ర్భాగ్యతముని
వెంటనంటియు నడవుల ♦ జంట విడక
యున్న రన కరుదెంచిన♦యువతిఁ బాసి
యేమి గని మేనఁ బ్రాణంబు ♦ లేను నిలుప. ౮౪

రాజ్యహీనునిన్ = రాజ్యము లేనివానిని, కృపణు=దీనుని, నిర్భాగ్యతమునిన్= దరిద్రులలో శ్రేష్ఠుని.

తాత్పర్యము.

లక్ష్మణా! 'గడనగల మగనిఁజూచిన నడుగడుగున మడుఁగు లిడుదు రతివలు తమలో, గడనచెడు మగనిఁజూచిన నడపీనుఁగు వచ్చెనంచు నగుదురు సుమతీ'యను నట్లు రాజనని పేరే కాని రాజ్యమా లేదు. అందఱు పట్టాభిషిక్తులే యున్నారా? సంతోషముగ లేరా యనిన నావలె సంతోషహీనులై యేడ్చుచుండువారెవరు గలరు? నవ్వుచునో యేడ్చుచునో కలది దిని కొంపలోఁబడియుండ మనిన దరిద్రులందు శ్రేష్ఠుఁడను. ఇట్టి నావెంటఁ దన పుట్టినింటికిఁ గాదు, బంధువుల యింటికిఁగాదు, అడవులకు నన్ను వదలిపెట్టక, గట్టిగ శ్వాస విడిచిన నే నాయాస పడుదునేమో యని గట్టిగ శ్వాసము విడువక వచ్చిన పడుచును వదలి మఱిదేనిఁ జూచి ప్రాణములు దేహమున ధరింపఁగలను?

సీ. కందునా నేఁ గొమ్మ ♦ ఘుమ్మను కమ్మని, యద్దంపునిద్దంపు♦ముద్దుమోము
వీందునా వీనుల♦విందుగాఁ దులలేని, మెలనవ్వు హాస్యంపు♦గలికిపలుకు
ఉందునా తాఁ గుందు♦నొంద నట్లంగజ, బాధితు నను దేఱ♦బలుక మరల
మందునా నేనిక ♦ మందయానను బొంది, డెంద మానందాన ♦ నందడింప
తే. నేమిరా సేయువాఁడ నే ♦ నేగఁ బురికిఁ,దల్లి కౌసల్య మృదుభావ ♦ తనయ! రామ!
యేది నాకోడ లం చన ♦ నే మటంచుఁ, జెప్ప మనెదవురా నన్నుఁ ♦ జిన్నికుట్టి.

మందునా=జీవింతునా.

తాత్పర్యము.

లక్ష్మణా! సీతాదేవియొక్క ఘుమఘుమ కమ్మవాసనలు వెదచల్లు నద్దము వంటి నును పైన ముఖమును జూడఁగలనా? చెవులపండువుగా నసమానమైన చిఱునవ్వుతోడ హాస్యముగాఁ బలుకు సుందరిమాటలు వినఁగలనా? తనకు మనస్సులో బాధ యున్నను నేమియు లేని దానివలె నా మదనతాపము చల్లారఁ బలుకఁగా జీవింపఁగలనా? మెల్లని నడకగల సీతాదేవిని గూడి సంతోషముతోడి హృదయముతో జీవింపఁగలనా? తమ్ముఁడా! నేనేమిరా చేయుదును! అయోధ్యకుఁబోఁగా నే కల్లకపటము తెలియని మృదు స్వభావ మాతల్లి కౌసల్య యెదురుగావచ్చి, కుమారా! నాకోడలేదిరా యని యడుగునే, ఏమని ప్రత్యుత్తర మిమ్మనెదవురా?

క. చనుమా లక్ష్మణ పురికిని, గనుమా సౌభ్రాత్రతరతునిఁ ♦ గైకతనూజుా
మనుమాట కల్ల నే నిఁక, ననుమానము లేదు జనకు♦నాత్మజ లేమిన్. ౧౬

మనుమాట = బ్రతుకుదు ననువార్త.

తాత్పర్యము.

లక్ష్మణా! నీ వూరికిఁబొమ్ము, నీగతి యేమియందువా? సీతను విడిచి నేను బ్రతుకలేను. ఒక్క బాధయైన నెట్లైన సహింపవచ్చును. నా సుఖకారణమైనది, తన సుఖములక్ష్యముసేయక నాకు సుఖముగూర్ప నేవిధముగను నిష్ప్రయోజకుఁడగు నావెంట నడవులకు నన్నునమ్మి వచ్చినది. అట్టిదానిని విడిచి నే నేమని బ్రతుకుదును. సీతాపతి, సీతాభర్త, సీతాప్రియుఁడు. సీతామనోహరుఁడు, సీతాప్రాణేశుఁడని యెవరైన ననిరా, యేమని వారి ముఖముఁ జూతును. మొండి బ్రతుకు బ్రదికి యయోధ్యకు వచ్చితి ననుకో; మామగారి కేమి చెప్పుదును. కన్నతల్లి కేమి చెప్పుదును. వారు పిలుచుకొని పోవలదనినను పెద్ద మగవానివలెఁ బౌరుషశాలివలెఁ బిలుచుకొని వచ్చితినే! ఇప్పుడు వా రేమందురు? కామమున కేడ్తునా! నా యనాథత్వమున కేడ్తునా? అవమానమున కేడ్తునా? దేనికని యేడ్తును. కావున నిన్ని దుఃఖములతో నీదేహము నిలువదు. నీవూరికిఁబోయి భరతునొద్దఁ జేరుకొనుము. ఆయన కైక కొడుకయినను సోదరప్రీతిగలవాఁడు. నిన్ను నలక్ష్యముసేయఁడు. పొమ్ము.

కం. అని యనదవోలెఁ బరిదేవనముం గావించుచున్న ♦ వలనుం గని యి
ట్లను సమయోచితహితగతి, సనయోక్తుల లక్ష్మణుండు ♦ సంతాప మఱన్. ౮౭
అనదవోలె = అనాథువలె, పరిదేవనము = ఏడుపు, అఱన్ = క్షీణింపఁగా.

తాత్పర్యము.

ఈ ప్రకారము శ్రీరామచంద్రమూర్తి యెంతో సమర్థుఁడయ్యు దీనునివలె నేడ్చుచుండుటఁ జూచి సమయమునకుఁదగిన హితము నీతితోఁగూడిన మాట లాయన సంతాప ముపశమించునట్లు లక్ష్మణుఁ డిట్లనెను.

లక్ష్మణుఁడు రామునకు ధైర్యోక్తులు చెప్పుట.

కం. అన్నా! ధైర్యము పూనుము, చన్నే నినుఁబోటి ధీర♦సత్తముఁడును నా
పన్నతఁ గుందఁగ వగవకు, మన్నా! నామనవి వినఁగ♦దన్నా! యన్నా! ౮౮

తాత్పర్యము.

అన్నా! ధైర్యము వహింపుము. నీవంటి ధీరజనోత్తముఁడుకూడ నాపద్దశ దుఃఖింప వచ్చునా? శోకింపకుమన్నా! అన్నా! నా మనవి దయయుంచి వినుము.

ఉ. ఇట్టిది గాదె లోకమున ♦ నిష్టజనంబులఁ బాసినంతటన్
బుట్టెడిఁ దీవ్రదుఃఖ మని ♦ బుద్ధిని లెస్స యెఱింగి యాత్మలోఁ
జుట్టములందు స్నేహమును ♦ జొన్పకు, స్నేహబలంబునం గదా
నెట్టన వత్తి మండఁగను♦ నేర్చెడి నీళుల నాని యుండియున్. ౮౯

తాత్పర్యము.

ఈ లోకమందుఁ దనకు నిష్టులైన వారు నదలిపోఁగాఁ దీవ్రదుఃఖము కలుగును. ఇది లోకధర్మము అని నీ మనస్సునకుఁ దెచ్చుకొనుము. తెచ్చుకొని యేమిచేయు మనె దవా? ఎవ్వరిమీఁదను, ఏ బంధువులమీఁదను స్నేహభావ ముంచకుము. అన్నిదుఃఖములకు స్నేహభావమే కారణము. నీళ్లలో నానిన వత్తియైనను స్నేహము (చమురు) సాంగత్యముచే మండుచున్నదికదా. నీళ్లలో నానినవత్తి మండదు. చమురులో నాని నది మండును-వత్తిని గాల్చునది స్నేహమేకదా (చము రేకదా) 'వైరాగ్యమే వాభయ' మ్మనట్లు స్నేహము వదలుము. అటయిన సీతపోయినఁ బోనీలే యని యూరకుండు మందువా?

ఉ. వార్త యొకింతయేన్ దెలియ♦వచ్చిన పిమ్మట ధారిణీసుతా
హార్త తనంతటం జెలియ ♦ నర్పణ సేయును నీకుఁ, జేయఁడేన్
ధూర్తత భోగిలోకమునఁ ♦ దూఱిన జానకితోడ మాంసభు
గ్భర్త హరిప్రసూజఠర♦భాగముఁ జొచ్చినఁ జించి చెండెదన్. ౯౦

ధారిణీసుతాహర్త=సీతను హరించినవాఁడు, ధూర్తత=దుర్వృత్తిచేత, భోగిలోకమునన్=పాతాళమునందు, హరిప్రసూ=ఇందుని తల్లియగు నదితియొక్క,జఠరభాగము=ఉదరప్రదేశము.

తా త్ప ర్య ము.

సీతను బోఁగొట్టుకొని యూరకుండు మని నేను జెప్పలేదు. ముందు మనము సీత యెం దున్న దా యను విషయము తెలియవలె. దానికై మనము కృషి చేయవలె. అట్టు లామె యునికిస్థానము మనకుఁ దెలిసెనా యిఁక వారు చంపుదు రని భయపడి సీతను హరించినవాఁడు సీతాదేవిని దనంతటఁ దానే తెచ్చి నీకు సమర్పించును. అట్టు లీయక జానకితోఁ బాతాళలోకమునఁ దూఱినను ఇంద్రుని తల్లి కడుపులో దాఁగినను వానిని జీల్చి చెండాడెదను. నీవు శ్రమింపవలసిన పనిలేదు. సీతాహరణమువలన దుఃఖము నాకు లేదా? అవమానము నాకు లేదా? నీవు సీతకు మాత్రమే దుఃఖించుచున్నావు. నేను మీ యిరువురకై శోకింపవలసి యున్నది. కావున 'గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితా' యన్నట్లు కానవచ్చు నీకుఁగా నేడ్వను. కానరాని యా మెకు నేడువను. కార్యము సాధించు నుపాయము వెదకుచున్నాను.

౪౦. పత్నికి నై ధీజనతా,రత్నమ వగవకుము ధృతిని ♦ గ్రాలుము సతి నే
యత్నమునను సాధింతము, యత్నింపక చెడినకార్య ♦ మగుటయుఁ గలదే. ౯౧

పత్నికినై =భార్యకై, ధీజనతారత్నమ=బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడా, ధృతిని= ధైర్యముచే.

తా త్ప ర్య ము.

భార్యనిమిత్తమై యేల యెంతో బుద్ధిగలవాఁడ వయ్యు బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడవయ్యు నాలోచన తెలియని వానివలె నేడ్చెదవు? ఏడువకుము. ఏడ్చుచు నూరక కూరుచుండిన నే కార్యము గాదు. నీ కేడుపు ప్రధానమా? సీతను మరలఁ బొందుట ప్రధానమా? రెండవది ప్రధానమేని దానికై కృషి చేయుదము. ఆ కృషికి ధైర్యము ముఖ్యము. కావున ధీరుఁడవు కమ్ము. ఏవిధముగనైన సరియే సీతను మరల సాధింతము. ప్రయత్నము చేయకుండినచోఁ జెడిన కార్యము చక్కఁబడునా?

శా. ఉత్సాహంబునకంటె లేదు బల మా♦యుత్సాహమే శక్తి యా
సోత్సాహుం డగువాని కియ్యవని లే ♦ దొక్కండు దుస్సాధముల్
సోత్సాహుం డగు వానికార్యములఁ బ్ర♦త్యూహంబు లేవెందు నే
నుత్సాహం బొకఁ డూనుమీ కనఁగ నౌ ♦ నుర్వీసుతన్ రాఘవా! ౯౨

దుస్సాధముల్ = సాధింపరానిది- ప్రత్యూహము = విఘ్నము-

తా త్ప ర్య ము.

అన్నా! నీ వుత్సాహము విడనాడుట తగదు. ఉత్సాహమునకంటె బలము లేదు. ఉత్సాహమే శక్తి. ఉత్సాహవంతునకు సాధింపరానిది లేదు. ఉత్సాహముతోఁ బనిసేయువాని కార్యమును విఘ్నములు చెఱుపలేవు. రామచంద్రా! నీ వొక యుత్సాహము కలవాఁడవైతివా సీతను దప్పక మరలఁ జూడఁగలవు.

6

కం. వెనుకకు నెట్టుము శోకము, గొనియాడకు కామవృత్తిఁ ♦ గోవిదుని మహా
త్మునిఁ సుకృతాత్ముని రామా, నిను నీవ యెఱుంగ కున్న ♦ నే నే మందున్? ౯౩

తా త్ప ర్య ము.

శోకమును వెనుకకుఁ ద్రోయుము· కామవృత్తి వదలుము. నీవు కోవిదుఁడవు. మహాత్ముఁడవు· సుకృతాత్ముఁడవు· రామచంద్రా! యిట్టి నిన్ను నీవే తెలిసికొనలేకున్న నే నేమని చెప్పుదును?

కోవిదుఁడు = శాస్త్రమర్యాద తెలిసినవాఁడు- మహాత్ముఁడు = మహాధైర్య శాలి- సుకృతాత్ముఁడు = చక్కఁగా శిక్షింపఁబడిన మనస్సు గలవాఁడు.

అతి వాత్సల్యమును వదలుము, 'సాధుకర్మకారీ సాధు ర్భవతి పాపకర్మకారీ పాపీ భవతి' యను ధర్మశాస్త్రమర్యాదను నీవు నాకుఁ బూర్వమెన్నియో తడవలు చెప్పియున్నావే! దానిని దలంపు మని భావము. గోవిందరాజీయము.

'మహాత్మానం మహాధృతిం పరమాత్మానం వా' యని తీర్థీయము. ఇచ్చట లక్ష్మణుఁడు చెప్పిన యీ 'మహాత్మానం కృతాత్మాన మాత్మానం నావబుధ్యసే' యను వాక్యములే యుద్ధకాండమున ౮౩ వ సర్గము ౪౩ వ శ్లోకంబునఁ జంపఁబడిన మాయాసీతకై రామచంద్రమూర్తి దుఃఖించుసమయంబున లక్ష్మణుచేఁ జెప్పఁబడెను?

చం. అనవుడు బోధితాత్ముఁ డయి♦ యా యనఘుండును శోకమోహముల్
మనమున మాని ధీరత స♦మంచితరీతి వెసన్ ఝరీదరీ
వనములఁ జూచుచున్ సమద♦వారణగామి చనన్ సుమిత్రనం
దనుఁడును నప్రమత్తుఁ డయి ♦ ధర్మబలంబులఁ గాచుచుం జనెన్. ౯౪

అనవుడున్ = అని చెప్పఁగా, బోధితాత్ముఁడయి= హెచ్చరిక గల మనస్సు గలవాఁడై, ధీరతన్ = ధైర్యముచే, ఝరీ = కొండవంకలను, దరీ = గుహలను, సమద = మదముతోఁ గూడిన, వారణగామి=ఏనుఁగు నడకవంటి నడక గలవాఁడు. అప్రమత్తుఁడయి=హెచ్చరిక తప్పనివాఁడయి, 'అన్నా! ధైర్యము పూనుము; ఉత్సాహంబు వహింపు'మని రాజధర్మము చెప్పుటచేతను, వార్త యొకింతయేని దెలియ వచ్చిన నేనే వానిఁ జంచి చెండాడెదనని బలముచెప్పుటచేతను, ధర్మబలంబులన్=వింటి బలము చేతను దేహబలముచేతను; సుమిత్రనందనుఁడు అనుటచే "ఏమఱెదవు సుమీ యెప్పుడైన నీ మనంబున నేని రాముఁడేగ వనాళి" నని కదా సుమిత్ర కొడుకునకు బోధించెను. ఆ మాట స్మరణమునకుఁ దెచ్చుకొన్నాఁడనుటకు సుమిత్రనందనుఁ డని చెప్పఁబడెను.

తా త్ప ర్య ము.

అని యీ ప్రకారము లక్ష్మణుఁడు చెప్పఁగా నాయన చెప్పినమాటలు సత్యమని దుఃఖము విడిచి హెచ్చరికఁ గలవాఁడై వాత్సల్యాతిశయమునఁ గలిగిన శోకమును దానివలనఁ గర్తవ్యము నుపేక్షించుటయు రెండును వదలి వాస్తవశోక మో

హము లను దోషములులేని శ్రీరామచంద్రమూర్తి ధైర్యము వహించి శీఘ్రముగా సెలయేళ్లు గుహలు అడవులు చూచుచు మదించిన యేనుఁగువలె నిర్భయముగా నడచుచుఁ బోఁగా సుమిత్రపుత్త్రుఁడును హెచ్చరికతో ధర్మవాక్యములు చెప్పుటచేతను, తన భుజబలము గుఱించి చెప్పుటచేతను రక్షించుచుఁ బోయెను.

—♦ ౨ వ సర్గము. సుగ్రీవుఁడు రామలక్ష్మణులను జూచి భయపడుట ♦—

ఉ. ఈవహి ఋశ్యమూకకుధ♦రేంద్రసమీపతలంబునందు నా
భూవరనందనుల్ దిరుగ ♦ భూరితరాద్భుతదర్శనీయులన్
దేవసమానవిక్రములఁ ♦ దేఁకువ గన్గొని కొండమీఁది సు
గ్రీవుఁడు చేష్టలం దొఱఁగి ♦ కీడ్పడఁ జొచ్చెను భీతచిత్తుఁడై. ౯౫

ఇఁక సీతాప్రాప్తికై బీజము ప్రారంభించుచున్నాఁడు. ఈ వహిన్=ఈ విధముగ, కుధరేంద్ర=పర్వతశ్రేష్ఠముయొక్క, భూరితర=మిగుల గొప్పయగు, అద్భుత=ఆశ్చర్యకరమైన, దర్శనీయులన్=చూడఁదగిన సుందరులను, తేఁకువన్=భయముతో.

తా త్ప ర్య ము.

ఈ విధముగ ఋశ్యమూక పర్వతము దాపునందు నా రాజకుమారులు సంచరింపఁగా మిగుల నాశ్చర్యకరమై చూడఁదగిన సౌందర్యముగలవారిని దేవతల విక్రమముతో సమానమైన విక్రమముగలవారిని గొండమీఁద నున్న సుగ్రీవుఁడు భయపడుచుఁ జూచి చేష్టలు మాని భయముచే బాధపడఁ జొచ్చెను.

హ్లాదిని. కనుఁగొనినంతనె ♦ క్ష్మావరసుతులన్
వనచరవర్యులు ♦ వారని వెఱచేఁ
జనిరి వనాటని♦శాంతము సుఖదం
బును నగు నాశ్రమ♦ముల్ వడిఁ దఱియన్. ౯౬

వనాటనిశాంతము=సుగ్రీవాది వానరు లుండు గుహ, సుఖదము=సంతోషకరము, తఱియన్=సమీపింపఁగా, హ్లాదిని: నజజనగలు గణములు; ఎనిమిదింట యతి.

తా త్ప ర్య ము.

సుగ్రీవుఁడే కాక తక్కిన వానరులు కూడ రామలక్ష్మణులఁ జూచినంతనే భయాతిశయమున వాలిపంపున నెవరో తమ్ముఁ జంప వచ్చినారని తలఁచి తాము దాఁగియుండు మతంగాశ్రమ గుహ యొద్దకుఁ బోయిరి. పంపానది కుత్తరపు వైపున రామలక్ష్మణులు దక్షిణమున సుగ్రీవాదులు నున్నవారు.

కం. వీరుల గురుతరభద్రా, కారుల సోదరులఁ జాప♦కాండకృపాణీ
ధారుల రాఘవులను బల,సారుల రవిసూతి చూచి ♦ శంకితుఁ డగుచున్. ౯౭

గురుతరభద్రాకారులన్=మిగుల గొప్పవియు మనోహరములు నగు రూపములు గలవారిని, చాప, కాండ, కృపాణీ ధారులన్=విల్లు బాణము కత్తి ధరించినవారిని, బలసారులన్ = సారవంతమైన బలముగలవారిని, శంకితుఁడు=సందేహించినవాఁడు-

తాత్పర్యము.

వీరులను మిగుల మనోహరములగు నాకారములు గలవారిని, అన్నదమ్ములను, విల్లు బాణము ఖడ్గము ధరించిన వారలను, రఘువంశమునఁ బుట్టిన రామలక్ష్మణులను సారవంతమైన బలము గలవారలను సుగ్రీవుఁడు చూచి సందేహించిన వాఁడై.

చం. తటతటలాడ గుండియలు ♦ దద్దయు దిక్కుల నెల్లఁ జూచుచున్
దటుకున నిప్పు ద్రొక్కినవి♦ధంబుగఁ దత్తఱఁ బాద మొక్కచోఁ
ద్రుటియును నిల్ప కా కలుష♦దూరులఁ జూచుచు వీడి స్వస్థలం
బటమట నందు నిల్వక భ♦యార్దితుఁడై భృశశోకతప్తుఁడై. ౯౮

కలుషదూరులన్ = నిర్మలమనస్సుగలవారిని, తనయందెట్టి పాపబుద్ధి లేనివారిని, భయార్దితుఁడై = భయముచే బాధపడువాఁడై, భృశ = అధికమగు, శోకతప్తుఁడై = శోకముచేఁ దపించినవాఁడై.

తాత్పర్యము.

గుండియలు భయముచేఁ దటదట కొట్టుకొనఁగా నాలుగు ప్రక్కల నెక్కెవరైన నే ప్రక్కలనైన వచ్చుచున్నారేమో యేప్రక్క పరువెత్తుదమని చూచుచు నిప్పుద్రొక్కిన క్రోఁతివలె నొకచో నిలువక యొకనిమిషమైన రెండు కాళ్లొకచోఁ బెట్టక యే పాప మెఱుఁగని వారలఁ జూచుచుఁ దామున్న స్థలమువదలి యందు నిల్వక భయపీడితుఁడు, శోకతప్తుఁడై.

సీ. ఉండినచోటన ♦ యుండుట మేలొ ప,లాయనం బౌట య♦త్యంతశుభము
యని తలపోసి తా ♦ ననుచరయుతుఁ డయి, సచివుల కనియె నీ♦చందమునను
గంటిరే వారల ♦ ఘనశుభాకారుల, వీరులఁ గాసార♦తీరమునను
వా రెవ్వరో కాని ♦ వంచనామతిఁ జేసి, నారచీరలు దాల్చి♦నారు గాక
తే. వాలికిని నాకు విడువని♦వైర ముంట, వాలిపంపున వచ్చిన♦వారు వారు
కపటమునిరూపముల నటు♦గాక యున్నఁ, దాపసుల కేల శరచాప♦ధారణములు.

అనుచరయుతుఁడు = మంత్రులతోఁగూడినవాఁడు - కాసారతీరమునను = మడుఁగునొడ్డున- పలాయనంబు = పరువెత్తుట.

తాత్పర్యము.

ఈ పర్వతమందే యుందమా - యనిన వీరిచ్చటికి వత్తురేమో - వారికి శాపభయములేదా- ఇది విడిచి వీరికిఁ జిక్కక మఱియొకచోటికిఁ బోదమా యనిన నచ్చట వాలి పైఁబడివచ్చును. అని యాలోచించి తనతోడఁ దిరుగు వానరుల మంత్రులను జూచి యిట్లనెను. మంత్రులారా! మడుఁగునొద్ద మిగుల శుభకరమైన రూపములు గల వారిని వీరులను జూచితిర కదా- వా రెవ్వరో యేమో నిజమైన మునులు గారు. వంచించుటకై నారచీరలు కట్టినారు. ఎవరిని వంచింప నిట్లు వచ్చినా రందురా? నన్నే- ఏలన- వాలికి నాకుఁ బ్రాణాంతకమైన విరోధ ముండుటచేత వానికి నేను వశ

పడలేదని నాపై వైరము సాధింప నిచ్చటికి వాఁడు రారాదు. కావున నెవరినో మనుష్యులఁ బిలుచుకొని వచ్చినాఁడు. మును లని మనము సమీపించితిమేని వెంటనే వధింతురు. ఇది వారి యుపాయము. అటుగాదేని తపస్సుచేసికొనువారికి విల్లు బాణము లేల ?

చం. అనవుడు వార లా వరశ♦రాసనహస్తులఁ జూచి గుండె ఝ
 ల్లన శిఖరంబునుండి శిఖ♦రాంతర మల్లలనాడ దూఁకుచుఁ
 వనగతజీవజంతులు ఘ♦నంబుగ బెగ్గిలి పాఱ దుర్గభూ
 జనితకుజాళి ద్రెళ్ళఁ జెయి♦జాఱిన పాదరసంబు నట్టులై. ౧౦౦

వరశరాసనహస్తులఁ=గొప్ప విండ్లను జేతియందుఁ గల వారిని, శిఖరాంతరము=వేఱొకశిఖరము, అల్లలనాడఁ=వడఁకఁగా, వనగత జీవజంతులు=అడవియందుండు మృగములు, బెగ్గిలి=భయపడి, దుర్గభూజనిత=కొండలమీఁదఁ బుట్టిన, కుజాళి=చెట్ల పంక్తులు.

తాత్పర్యము.

సుగ్రీవుఁ డిట్లు చెప్పఁగా వారును పెద్దవిండ్లను జేతులందు ధరించినవారిని జూచి గుండె లదరఁగా నొక కొండ పేటు నుండి మఱియొక కొండ పేటున కది వడఁకాడునట్లు దూఁకుచు నడవిజంతువులు భయపడి పరువెత్తఁగాఁ గొండమీఁది చెట్లు విఱిగిపడఁగాఁ జేయి జాఱిన పాదరసము బిందువులు చెదరి మూల కొక్కటిగాఁ బోయినట్లు.

కం. ఒక్కఁడు పోయినత్రోవ మ,ఱొక్కఁడు చన కెల్లవార ♦ లుఱుకుచు వడిమై
 నక్కొండ కొండు ప్రక్కన, యొక్కటియై సూర్యపుత్రు♦నొద్దను నిలువన్. ౧౦౧

తాత్పర్యము.

ఒక్కఁడు పోయిన త్రోవ మఱియొక్కఁడు పోక యొక రొక్క రొక్కొక త్రోవగా నుఱుకుచు నందఱు నొక కొండ చాటునఁ జేరి సుగ్రీవు నొద్ద నిలువఁగా,

—♦ హనుమంతుండు సుగ్రీవుని భయకారణ మడుగుట ♦—

ఉ. తామరసాప్తసంభవుని ♦ డాయుచు వాయుసుతుండు పల్కు నీ
 కేమిటి కయ్య యీ వెఱ పి♦కేటికిఁ బాఱెదు వాలిభీతిచే
 నీ మల ఋశ్యమూకము గ♦దే యిట వాలిభయంబు నున్నె? శా
 ఖామృగనాథ! వాలియును ♦ గానఁగ రాఁ డిటు లేల త్రొట్రిలన్. ౧౦౨

తామరసాప్తసంభవుని=సూర్యపుత్రుండైన సుగ్రీవుని, డాయుచుఁ=సమీపించుచు, వాయుసుతుండు=వాయుకుమారుఁడు, హనుమంతుఁడు, శాఖామృగనాథ=కోఁతిఱేఁడా.

తాత్పర్యము.

ఆంజనేయుఁడు సుగ్రీవునొద్దకుఁ బోయి వానరరాజా! నీ కేల యీ భయము కలిగెను? వాలిభయముచే నీ విధముగ నేల పరువెత్తెదవు? ఈ పర్వతము ఋశ్యమూ

కముగదా! ఇక్కడ వాలివలన భయముకలదా? ఒకవేళ భయపడుటకైన వాలి యెక్కడను గానరాలేదు. కావున నేల తొట్రుపాటు పడెదవు?

ఉ. క్రూరుని బాపకర్ము నల♦క్రోతులజేనిని గాన నెందు నీ
భీరుత కేమి హేతువు, క♦పిత్వ మహాో! చరితార్థ మయ్యె నే
డారయ లేవు పూర్ణముగ ♦ హా లఘుచిత్తత, సర్వభూతసం
వారము నెట్లు బ్రోచు నృప♦వర్యుడు జ్ఞానమతీంగితచ్యుతిన్? ౧౦౩

భీరుతకు=భయపాటునకు, కపిత్వము=క్రోతి గుణము, వాస్తవముగా ననుష్ఠింపఁబడినది, లఘుచిత్తతన్=గొప్పబుద్ధి లేమిచేత, సర్వభూత సంవారమున్=సమస్తభూతసంఘమును, జ్ఞానమతీంగితచ్యుతిన్ = జ్ఞానము, మతి ఇంగితము వదలుటచే, జ్ఞానము=సామాన్యజ్ఞానము, మతి=విశ్లేషించి యాలోచించి తెలిసికొనునది. ఇంగితము= అభిప్రాయము సూచించెడి దేహచేష్టల జ్ఞానము.

తా త్ప ర్య ము.

క్రూర కర్మములు చేయువాఁడును బాపపుఁ బనులు చేయువాఁడును నగు వాలి నాకెక్కడఁ గనఁబడలేదు. నీ పిఱికితనమునకు నేమి కారణము? నీ క్రోతి స్వభావము సార్థకమయ్యెను. గొప్ప మనస్సులేనివాఁడ వగుటచే ముందువెనుకలు సాధక బాధకములు పూర్ణముగ నాలోచింపలేవు. జ్ఞానము, బుద్ధి, యింగితము లేని రాజు ప్రజల నెట్లు రక్షింపఁ గలఁడు?

కం. మతి విజ్ఞానేంగితసం,చ్యుతిలేక యొనర్పవయ్య ♦ సుగ్రీవ క్రియా
తతి యనుచు శుభము పల్కిన,హితు మారుతి శుభతరోక్తి♦నిననుతుఁ డనియెన్.

మతి, విజ్ఞాన, ఇంగిత సంచ్యుతి=మతికి, జ్ఞానమునకు, ఇంగితమునకు లోపము.

తా త్ప ర్య ము .

సుగ్రీవా! మొట్టమొదట నేది తోఁచునో దానినే నమ్మి తటాలునఁ గార్యము చేయకుము. ఆ విషయమై చక్కఁగ నాలోచింపుము. ఎదుటివారి ముఖనయన చేష్టల వలన నీ యభిప్రాయము సాధువో యసాధువో నిశ్చయించుకొనుము. కార్యము లన్నియు నీ ప్రకారము చేయుచు రమ్మని హితము శుభము బోధించిన హితుఁడగు నాంజనేయునితో సుగ్రీవుఁడు శుభతరోక్తుల నిట్లనెను.

హనుమంతుఁడు శుభవాక్కులు చెప్పఁగా సుగ్రీవుఁడు శుభతర వాక్కులఁ బ్రత్యుత్తర మిచ్చుచున్నాఁ డనుటచే నీవు చెప్పినట్లు జ్ఞానము మతిలేక నేను వర్తింపలేదు. ఇంగిత మెదురుగా నుండు వారి విషయమేకాని దూరమున నుండు వారి విషయము కాదు కదా, నా యభిప్రాయము నేను జెప్పెదను. ఆవల నీవు పోయి యింగితమును బట్టి కార్య నిశ్చయ మెఱిఁగి రమ్మనుచున్నాఁడు.

మ. హనుమా! భీతి జనింప కుండెడిన యా♦యజ్ఞాతపత్రాక్షులన్
గనదాజానుసుదీర్ఘబాహుల మహా♦కాండాసికోదండులన్

వినుతోత్తేజుల దేవపుత్రనిభులన్ ♦ వీక్షించితిన్, వాలియే
పనుపన్ వా రిట కేఁగుదెంచి రనుచున్ ♦ భావించితిన్ నా మదిన్. ౧౦౫

అబ్జాతపత్రాక్షులన్ = తామరరేకులవంటి కన్నులుగల వారిని, కనత్= ప్రకాశించు, ఆజాను=మోఁకాలివఱకుఁ గల, సుదీర్ఘ బాహుల=మిక్కిలి నిడివియైన చేతులు గలవారిని, మహాకాండాసి కోదండులన్=పెద్దకత్తి బాణములు విల్లును గల వారిని, వినుతోత్తేజులన్=పొగడఁబడిన విశేష తేజస్సుగలవారిని, దేవపుత్రనిభులన్= దేవ కుమారులతో సమానులైన వారిని.

తాత్పర్యము.

హనుమంతా! నా యాలోచన విధము చెప్పెద వినుము. కమలముల రేకుల వంటి కన్నులు గలవారిని, మోఁకాలి నంటు చేతులు గలవారిని, గొప్ప విల్లు బాణములు కత్తులు గలవారిని స్తోత్రము చేయఁబడిన యధికమైన తేజస్సు గలవారిని, దేవకుమారులతో సములుగా నుండు వారినిఁ జూడఁగా భయము కలుగకుండునా? వారు శత్రువు లని భయపడనేల? వారికి నీకు విరోధ మున్నదా? లేదు కదా! ఏదో వారి కార్యార్థమై వారు వచ్చినా రనుకోరాదా యందువేమో? వీరు ఋషులా, రాజవీరులా? రాజవీరు లయినచో నారచీర లేలకట్టవలెను? ఋషీశ్వరు లయిరా. విల్లు బాణము లేల? నేనా వారి నెఱుఁగను, వారి సాహాయ్యము కోరలేదు. కావున నాపక్షమున వచ్చినవారుకారు. కావున దీనిలో నేదో వంచన యున్న దని నిశ్చయించితిని. ఏమివంచన యందువా? వాలి యిచ్చటికి రారాదు. నేనా దీనిని విడిచిపోను. కావున నిచ్చటికి రాఁగలిగి నన్నుఁజంపఁగలిగిన వారి నెవరినో యిచ్చటికిఁ బంపె నని నిశ్చయించితిని. కావున భయపడితిని.

ఉ. మేదిని రాజు లెల్ల బహు♦మిత్రులు, వారల నమ్మరాదు వ్యా
పాదక గూఢచారులను ♦ వంచనబుద్ధిని బంత్రు, కానివా
రాద దొలంగి యున్న సమ♦యంబున రంధ్రము రోసి తారు ప్ర
మాదికబుద్ధి పొందక ప్ర♦మాపణమున్ ఘటియింత్రు వారికిన్. ౧౦౬

బహుమిత్రులు = అనేకమిత్రులు గలవారు, వ్యాపాదక గూఢచారులను= రహస్యవేషములతో హింసచేయువారిని, కానివారు=విరోధులు- ఆద దొలంగి=మై మఱచి, రంధ్రము=సందు, రోసి=వెదకి, ప్రామాదికబుద్ధి = పొరపాటభిప్రాయము, ప్రమాపణము=హింస, వారికిన్=ఎదుటివారికి.

తాత్పర్యము.

రాజులకు మిత్రు లనేకు లుందురు. కావున రాజుల నమ్మరాదు. వంచనబుద్ధిచే రహస్యముగాఁ దమ శత్రువులను జంపఁబంపుదురు. వచ్చినవారో శత్రువు లేమఱి యుండు సమయంబున సమయము కనిపెట్టి సందుదొరకినప్పుడు తాము ప్రమాదపడక తమ గుట్టు బయటికి రానీయక శత్రువుల వధింతురు. ఇది రాజధర్మము.

ఉ. వాలి యుపాయశాలి నిర♦పాయకశీలియు దీర్ఘదర్శి భూ
పాలకు లెల్ల రట్లు కద ♦ వైరులఁ ద్రుంతురు తచ్చరిత్రము
తేలఁగఁబోదు యెఱుంగ నెటు ♦ లేనియుఁ బ్రాకృతు నంపుఁ బంచి, యా
వేళను నీవు ప్రాకృతుని♦వేషముఁ గైకొని వారి డాయఁగన్. ౧౦౭

నిరపాయక శీలి = అపాయములేని శీలముగలవాఁడు- దీర్ఘదర్శి = దూరాలోచనము గలవాఁడు- ప్రాకృతుఁ = అధమ మనుష్యుని.

తాత్పర్యము.

వాలి యనిన సామాన్యుఁడు గాఁడు. ఉపాయము లన్నియుఁ దెలిసినవాఁడు. అపాయములేని నడవడి గలవాఁడు. దూరాలోచనము గలవాఁడు. రాజు లందఱు తమ శత్రువులను నుపాయముచేతనే కదా చంపుదురు. అట్టులే వాలియుఁ జేయ యత్నించి యుండును. అయినను నిది యిట్టిదే యని నేను జెప్పఁజాలను. నా జాగ్రత్తలో నే నుండుట మంచి దని యిచ్చటికి వచ్చితిని. నా యాలోచన సరియగునా కాదా యని తెలియవలసియున్నది. దాని నిమిత్తమై యెవఁడో యొక సామాన్యుని బంపవల యును. వాస్తవముగ నధముఁ డగువాఁడు పోయినఁ గార్యము పాడుచేయును. కను కనే నీవే సామాన్య మనుష్యవేషము వేసికొని వారియొద్దకుఁ బొమ్ము.

—♦ సుగ్రీవుఁడు హనుమంతుని రామలక్ష్మణుల యొద్దకుఁ బంపుట. ♦—

క. పొమ్మా! వ్యాభాషణరూ,పమ్ముల నింగితము భేద♦భంగులఁ దద్భా
వమ్ము నిజమ్మును శుద్ధియు, నమ్మకముగఁ దెలిసి యంజ♦నాసుత! రమ్మా. ౧౦౮

వ్యాభాషణ = వారి మాటలచేతను, రూపమ్ములను = వారు మాటలాడు నపుడు వారి యాకారస్థితిని బట్టియు, ఇంగితము = ముఖనయనవికారాదుల, భేద భంగులఁ = మార్పుల చేతను.

తాత్పర్యము.

ఆంజనేయా! నీవుపొమ్ము. మాటలచేత, ఆకారములచేతఁ బలువిధములయిన ముఖ నయన వికారములచేత నిజముగా వారి మనస్సెట్టిది? శుద్ధమైనదా, వంచనతోఁ గూడినదా? ఇది యున్నదున్నట్టు తెలిసికొని రమ్ము.

చం. పలుకుల నేర్పు పెంపునను ♦ భావసుబోధకనేత్రవక్త్రచే
ష్టల నెద వారు నమ్మఁగఁ బ్ర♦శంస యొనర్చి మదాభిముఖ్యమై
వెలయఁగఁ జేయు మిట్టు లట♦వీస్థలి చాపశరాసిధారులై
కలయఁగ సంచరించుటకుఁ ♦ గారణ మే మని ప్రశ్న సేయుమీ. ౧౦౯

మదాభిముఖ్యమై = నాకు నభిముఖమగునట్లు, నా కనుకూలమగునట్లు, అటవీ స్థలిఁ = అడవి ప్రదేశమందు, చాపశరాసిధారులై = విల్లు బాణములు కత్తులు ధరించినవారై.

తాత్పర్యము.

ఆంజనేయా! నీవు తొలుతఁ జేయవలసిన పని చెప్పెద వినుము. నీమాటల నేర్పుచేతను, నీ భావము వారికి సులభముగాఁ దెలియ నగు కన్నులు ముఖము వీని చేష్టల చేతను, వారు నిన్ను నమ్మునట్లు ముచ్చటలాడుము. ఇట్లు నీయందుఁ దొలుత నమ్మకము పుట్టించుకొని యావల నాయందు వారికి ననుకూలాభిప్రాయము కలుగు నట్లు చేయుము. ఇట్లు చనవు కుదిరిన పిమ్మట మీరు విల్లు బాణములు కత్తులు కటారులు ధరించి యడవులలోఁ దిరుగఁ గారణ మే మని యడుగుము.

ఉ. వారలు నిర్మలాత్ము లని ♦ వాయుసుతా! మది నీకుఁ దోఁచినన్
సారెకు వెండియుం బలుకు♦చందములం బరికింపు వారి వ్యా
పారములందు సత్యము న♦బద్ధము నావుడు నట్లుగాక యం
చా రఘువీరు లున్నెడ మ♦హాత్ముఁడు వాయుజుఁ డేగ నెంచుచున్. ౧౧౦

నిర్మలాత్ములు=వంచనలేని మనస్సు గలవారు.

తాత్పర్యము.

వారు నిర్మలమగు మనస్సులు గలవారు, వంచనము లేనివా రని నీకుఁదోఁచినా, వారు మీఁద మీఁదఁ బలుమాఱు మాటలాడు విధము గమనింపుము. వారి మాటల యం దెంత సత్యమో యెంత మోసమో తెలిసికొనుము అని చెప్పఁగా నట్లులే చేసెదనని మహాత్ముఁడు హనుమంతుఁడు రామలక్ష్మణు లున్న చోటికి నేవిధముగాఁ బోవు దము, ఈ రూపముతోనే పోయితినా, నేను సుగ్రీవు నొద్దనుండి వచ్చితి నని గ్రహించి వారు వంచకు లయిరా పట్టి యియ్యరు. పోయిన పని వ్యర్థమగును. సామాన్యు లగు నడవి మనుష్యుల వేషముతోఁ బోయితినా, వీఁ డెవఁడో పామరుఁ డని యప్పుడును మన్న నీయరు. ఎట్లు పోదునా యని యాలోచించెను.

ఇది మొదలు హనుమంతునియొక్కయు సుందరకాండమందు సీతాదేవి యొక్కయు భాషణములు చేష్ట లర్థవంతములై యుండును. పూర్ణభావము గ్రహించు టయే తొలుత దుష్కరము. తెలిసినంతయు విపులముగ విశదీకరింత మనిన గ్రంథ విస్తరభీతి మిగుల బాధించుచున్నది. శ్రీరామచంద్రమూర్తి యేమి వ్రాయింపఁ దలఁచినాఁడో!

—♦౩వ సర్గము. హనుమంతుఁడు భిక్షువేషంబున రామలక్ష్మణులయొద్దకుఁ బోవుట♦—

ఉ. వంచకబుద్ధిచేతఁ గపి♦వర్యుఁడు వానరరూపు మాని య
భ్యంచితభిక్షురూపమున ♦ నగ్గిరినుండి నృపాలు రందు వ
ర్తించుచు నున్నచోటికిని ♦ దెప్పున దాఁటియుఁ జేరఁబోయి ని
శ్చంచలవృత్తిమై వినయ♦సంపద వారల కర్థి మ్రొక్కుచున్. ౧౧౧

అభ్యంచిత భిక్షురూపమునన్=చక్కఁగా నొప్పుచున్న సన్న్యాసివేషముతో, నిశ్చంచల వృత్తిమైన్=చపలత లేని వ్యాపారముచే.

తాత్పర్యము.

నిజస్వరూపమునఁ బోయినఁ గార్యము నిజము తెలియ దని తలఁచి వంచనబుద్ధి చేత వానరరూపము విడిచి సన్న్యాసివలెనై తానున్న కొండనుండి రామలక్ష్మణు లున్న చోటికిఁ దటాలున దాఁటి వారియొద్దకుఁ బోయి యేకాగ్రచిత్తముతో మిగుల వినయముతో వారికి నమస్కరించి,

మొదటిసర్గమునందు భగవంతుఁడు వైకుంఠలోకమునుండి జీవులలోఁ గొందఱు తనకు సేవ చేయుచుండుటయు, మఱికొందఱు సంసారమగ్నులై యుండుటయుఁ జూచి యా సంసారులకై వ్యసనపడుచు వారియెడ దయచేయు విషయము చెప్పఁబడెను. రెండవసర్గమునందు అపుడు సంసారి, చేతనుఁడు, తాను జేసిన నేరములకై భగవంతుఁడు శిక్షించునేమో యని కొంతసేపు భయపడియుండి, పిదప భగవంతుని కభిముఖుఁడాయె నని చెప్పెను. ఈ మూఁడవసర్గమునందు నిట్టి సంసారి, చేతనుఁడు తనకుఁ జక్కఁగ దొరకుటకై భగవంతుఁ డేర్పఱిచిన యాచార్యుని వృత్తాంతముఁ జెప్పుచున్నాఁడు.

ఇచ్చట సన్న్యాసిరూపము ధరించిన హనుమంతుఁడు గృహస్థుఁడైన రామచంద్ర మూర్తికి ముందుగఁ దానే నమస్కరించుటచేత సర్వత్రి యిట్టియాచారము యుక్తమని తోఁచుచున్నది. బ్రాహ్మణజాతియందు జ్ఞానాధికులే యధికులుగాని వైదిక కర్మాధికులు అధికులుగారు. 'విప్రాణాం జ్ఞానతో జ్యైష్ఠ్య'మ్మని మనువచనము చెప్పుచున్నది. సన్న్యాసి గృహస్థునికి నమస్కరింపరా దని యొకానొక వచన మున్నది గాని యది మనువాక్యముగాదు. మఱియును మనుశాస్త్రవిరుద్ధము. దానికి మూలముగాని కర్తగాని తెలియలేదు. ఇట్టి వచనమును బట్టి మనువచనము దోసివేయుట యుత్తమము గాదు. ఇంతియగాక యీ రెండు వాక్యముల కైకకంఠ్యము చేయుట బాగు. ఎట్లనఁగా 'జ్ఞానాధికుఁడైన గృహస్థునికి సన్న్యాసి నమస్కరింపవలయును.' అని మను వాక్యాభిప్రాయము. నిర్మూలమైన యొకవచనమునకు సన్న్యాసి యజ్ఞుఁడైన గృహస్థునికి నమస్కరింప రా దని యర్థము, అని.

హనుమంతుఁ డత్యద్భుతములైన రామలక్ష్మణుల యాకారము చూచిన తోడనే యధికానందపరవశుఁడై తాను ధరించిన సన్న్యాసి యాకారమును గూడ మఱచి 'అవశాః ప్రీతివేదినః' యన్నట్లు అవశముగా నమస్కరించెను. ఇది సర్వత్రి ప్రమాణము కాదు, అని కొందఱ యభిప్రాయము. ఇది యుక్తముగాదు. హనుమంతుఁడు నిపుణమతి. గొప్ప మంత్రి. రాముని యభిప్రాయమును జాగ్రత్తగా నెఱిఁగి రమ్మని సుగ్రీవునిచే బోధింపఁబడినవాఁడు. అట్టివాఁడు మొదటి ముద్దలోనే యీఁగ చచ్చిన దన్నట్లు ప్రప్రథమమందే తన్నుఁ దాను మఱచెనేని తక్కిన కార్యము నెట్లు చేయఁగలఁడు? రామచంద్రమూర్తి యెట్లు నమ్మఁగలఁడు? కావున నీ యభిప్రాయము పూర్వోత్తర సందర్భములకు విరుద్ధము- "రూపమేవా స్యైతన్మహిమానం వ్యాచష్టే" యన్నట్లు శ్రీరామచంద్రమూర్తి దివ్యమంగళవిగ్రహము చూడఁగానే

వీరు సుగ్రీవునికి మేలు చేయువారే కాని పగవారు కారని నిశ్చయించి హనుమంతుఁడు తాను వేసికొన్న వేషమును మాఱువేష మనియుఁ, దాను చారుఁ డనియు సూచించుటకై నమస్కరించెను. కావున నిది సర్వత్ర యాదర మెట్లగు నని మఱి కొందఱ యభిప్రాయము. అదియు యుక్తము గాదు. హనుమంతునికి వీ రిట్టివా రని తెలిసినచోఁ దాను వారితో మాటలాడ మొదలు పెట్టినపుడే సుగ్రీవుని వృత్తాంతమే చెప్పవలయును గాని రామవృత్తాంత మడుగ నేల?

ఇచ్చట భిక్షు వనఁగా సన్న్యాసి గాఁడు, బ్రహ్మచారి యని కొందఱు చెప్పిరి. అదియు యుక్తముగాదు. ఇతఁడు మొదటినుండి బ్రహ్మచారియే కాని యిప్పుడు బ్రహ్మచారి వేషము క్రొత్తగా వేయలేదు. ఇతఁడు వేసికొన్న మాఱువేషము మానుష బ్రహ్మచారి వేషమే యైనచో మనుష్యవేషము ధరించె నని చెప్పినంతనే చాలును. భిక్షు రూప మని ప్రత్యేకించి చెప్పనక్కఱలేదు. 'భిక్షుః పరివ్రాట్ కర్మందీ పారాశర్యపి మస్కరీ' యని సన్న్యాసినే భిక్షు వని నిఘంటువులు చెప్పుచున్నవి. కావున హనుమంతుఁడు సన్న్యాసి వేషము ధరించె ననియు జ్ఞానాధికుఁడైన రామగృహస్థునికి నమస్కరించె ననుట తప్పు గాదనియుఁ జెప్పవలెను. ఇదియే యుక్తము. అని గోవింద రాజీయము.

మందరాభిప్రాయ మేమన:—

హనుమంతుఁడు పగటి వేషగాండ్రవలె సన్న్యాసి వేషమును వేసికొనెనా? లేక కామరూపి గావున మనుష్యసన్న్యాసి వలె నయ్యెనా? మొదటి యభిప్రాయము సరిగాదు. ఏలన బారెఁడు కాపిగడ్డతో దేహము నిండ నెండ్రుకలు, తోఁకగల కపి రూపము నెట్లు దాఁపఁగలఁడు? కావున మనుష్య సన్న్యాసియే యై యుండవలెను.

సన్న్యాసము బ్రాహ్మణవిషయము మాత్రమే కావున బ్రాహ్మణ సన్న్యాసియే యయ్యె నని గ్రహింపవలయును. సన్న్యాసి బ్రాహ్మణుఁడు కావున నట్టి వానితో నసత్య మాడరా దని సీతవలెనే గౌరవించి మాటలాడుదు రనియు అప్పుడు సత్యాసత్యములు వెలువడు ననియు హనుమంతుని యభిప్రాయము. రావణుఁ డెట్టి సన్న్యాసియో హనుమంతుఁ డట్టి సన్న్యాసియే కాని యుద్దేశము భేదము. 'విప్రాణాం జ్ఞానతో జ్యైష్ఠ్య'మ్మనుట యంగీకరింపవలసిన విషయమే కాని శ్రీరామచంద్రమూర్తి బ్రాహ్మణుఁడు కాఁడు. హనుమంతుఁడు సన్న్యాసి కావున బ్రాహ్మణుఁడు కావున గోవిందరాజమత ప్రకారము బ్రాహ్మణ సన్న్యాసి క్షత్రియ గృహస్థునకు నమస్కరించెను. కావున సర్వత్ర గ్రాహ్య మనుట వర్ణాశ్రమ ధర్మమూలకుఠార మగుచున్నది. 'క్షత్ర వైశ్యాభివాదేన, ప్రాయశ్చిత్తం కథం భవేత్ బ్రాహ్మణానాం దశాష్టౌ వా, అభివాద్య విశుద్ధ్యతి' ఇట్లు గృహస్థుఁ డగు బ్రాహ్మణుఁడే క్షత్రియాదులకు నమస్కరింపరా దను వాక్యము లుండ నిర్నమస్కారుఁ డగు సన్న్యాసి క్షత్రియాది గృహస్థుల కెట్లు నమస్కరింపనగు?

వారును బ్రాహ్మణు లని నమస్కరించె నందమా యనిన శస్త్రధారణము-చిహ్నములు వారు క్షత్రియు లని స్పష్టముగఁ దెలుపుచున్నవి గదా!

ఈ విషయము గోవిందరాజ స్మృతికి వచ్చినట్లులేదు. వచ్చియుండినచో శ్రీరామచంద్రమూర్తి జ్ఞానాధిక బ్రాహ్మణుఁ డని యా కారణమున హనుమత్సన్న్యాసి నమస్కరించె నని చెప్పియుండఁడు. విదుర జనకాదులకు బ్రాహ్మణ సన్న్యాసులు నమస్కరించినట్లు గ్రంథములందుఁ గానము.అట్లు చేయవచ్చు నను ప్రమాణము మృగ్యము. స్వధర్మానుష్ఠాన పరుఁడుకాని భ్రష్టసన్న్యాసికి గృహస్థుఁడు నమస్కారముచేయరాదు. జ్ఞానవంతుఁడైన గృహస్థునకు నిట్టి పతితసన్న్యాసులే నమస్కరింపవలెను గాని విపర్యయము కూడదు.

సన్న్యాసు లితరాశ్రమముల వారికి నమస్కరింప రా దనుట నిర్మూల మని వ్రాసిరికాని విశిష్టాద్వైతియై శ్రీరామానుజాచార్య శిష్యుఁడైన యాదవ ప్రకాశులు తమ యతిధర్మ సముచ్చయమందు:—

స్వధర్మస్థాన్ యతీన్ వృద్ధాన్, దేవాంశ్చ ప్రణమేద్యతిః నాన్య మాశ్రమిణం కించిత్, ప్రశ స్తమపి తం నమేత్॥ స్వధర్మమం దుండు వృద్ధులగు యతులకు దేవతలకు యతి నమస్కరింపవలెను. ప్రశస్తులైనను నితరాశ్రమములవారికి నమస్కరింపరాదు. ఈ గ్రంథమందే,

భూమిర్గావో హిరణ్యం వా యతే ర్యస్య పరిగ్రహః
తాదృశం కశ్మలం (స్పృ) దృష్ట్వా, సవాసా జల మావిశేత్॥

భూమిని గాని- ఆవునుగాని- బంగారుగాని యే యతి పరిగ్రహించునో యటువంటి పాపాత్ముని జూచిన వెంటనే కట్టుగుడ్డలతో స్నానము చేయవలెను.

యతి ర్ద్వయేన పతతి, బ్రహ్మజ్ఞానయుతోపిసన్
ధీ పూర్వ రేతోత్సర్గేణ, తథా ధాతు పరిగ్రహాత్॥

బుద్ధిపూర్వకముగా రేతస్సు విడుచుటచేత, వెండి బంగారు మొదలగు లోహములను సంగ్రహించుటచేత నీ రెంటిచే యతి పతితుఁ డగుచున్నాఁడు.

యతి హ స్తగతం ద్రవ్యం, యోగృహ్ణాతి నరః క్వచిత్
సమూఢో నరకం యాతి, తేన పాపేన కర్మణా॥

యతిచేతి నుండి యెవఁడైన ద్రవ్యము గ్రహించెనో యా మూఢుఁ డాపాప కర్మముచే నరకము పాలగును.

రా త్ర్యధ్వానం చ యానంచ, స్త్రీ కథాలౌల్య మేవచ
మంచకం శుక్లవస్త్రం చ, యతీనాం పతనంహి షట్॥

రాత్రి ప్రయాణము- వాహన మెక్కి తిరుగుట-స్త్రీల ముచ్చటలు- మంచము, తెల్లవస్త్రము- ఇవి యాఱు యతినిఁ బతితుని జేయును.

యానారూఢం యతిం దృష్ట్వా, సచేల స్నాన మాచరేత్॥

వాహన మెక్కిన సన్న్యాసిని జూచినఁ గట్టుబట్టలతో స్నానముచేయవలయును.

కాష్ఠ దండో ధృతో యేన, సర్వాశీ జ్ఞాన వర్జితః
సయాతి నరకాన్ ఘోరాన్, మహారౌరవసంజ్ఞితాన్॥

కాష్ఠదండము ధరించి, జ్ఞానహీనుఁడై సర్వము స్వధర్మవిధినిషేధములు పాటింపక భుజించునో వాఁడు మహారౌరవ మను ఘోరనరకముల పాలగును.

ఏకదండం సమాశ్రిత్య, జీవంతి బహవో నరాః
నరకే రౌరవే ఘోరే, కర్మత్యాగా త్పతంతి తే।

అనేకు లేకదండము నాశ్రయించి జీవించుచు మేము సన్న్యాసుల మని కర్మభ్రష్టులగుచున్నారు. వీరు ఘోరరౌరవ నరకములలోఁ బడుదురు.

ఇట్టి భ్రష్ట సన్న్యాసు లెట్టివారికిని వందనార్హులుకారు. కాని స్వధర్మనిష్ఠులై శుద్ధచరిత్రు లగు సన్న్యాసులు వందనార్హులు గాక పోరు.

అష్టాదశకలాయుక్తాన్, బ్రహ్మజ్ఞానేన మండితాన్
వానప్రస్థగృహస్థాదీన్, ననమస్యే ద్యతిః క్వచిత్॥
యతిభ్యో వందనం పూజాం, గృహస్థో యది వాంఛతి
చండాలత్వ మవాప్నోతి, మృతో నిరయ మాప్నుయాత్
త్రిదండధారిణం భిక్షుం, నమస్కారత్రయేణచ
అర్ఘ్యాద్యై స్తోషయే ద్విద్వాన్, బ్రహ్మభావేన సర్వదా
అనేక సప్తతంతుర్వా, వేదవేదాంగ పారగః
యతే ర్దర్శనమాత్రేణ, నమస్కార త్రయం చరేత్
విష్ణో ర్యతేస్తు మనునా మూలేన మహతాపి యః
నమస్కారత్రయం కుర్యా చ్ఛాశ్వతీం ముక్తి మాప్నుయాత్ ॥సంగ్రహే॥
పాంచరాత్ర రక్షాయామ్.

దేవతాప్రతిమాం దృష్ట్వా, యతిం చాపి త్రిదండినమ్
నమస్కార మకుర్వాణ, ఉపవాసేన శుద్ధ్యతి॥

పదునెనిమిది కళలతోఁగూడి బ్రహ్మజ్ఞాన సంపత్తిగల వానప్రస్థ గృహస్థాదులకు యతి నమస్కరింపరాదు. ఏ గృహస్థుఁడు యతిచే వందన పూజాదులు పొందఁ గోరునో వాఁడు చండాలుఁడై, చచ్చి నరకముపా లగును. త్రిదండధారియగు సన్న్యాసిని బ్రహ్మభావముచే నర్ఘ్యాదులచేఁ బూజింపవలయును. మూఁడుమార్లు నమస్కరింపవలెను. అనేకయాగములు చేసినవాఁడైనను వేదవేదాంగ పారగుఁడైనను యతిని జూచినవెంటనే మూఁడుమార్లు నమస్కరింపవలెను. ఎవఁడు విష్ణువునకు, సన్న్యాసికి మూల మంత్రముచే మూఁడుమార్లు నమస్కరించునో వాఁడు ముక్తుఁడగును. దేవతా విగ్రహమును జూచినను, త్రిదండి సన్న్యాసిని జూచినను నమస్కరింపని వాఁడొకదిన

ముపవాసముండిన శుద్ధుఁ డగును. భ్రష్టసన్న్యాసులకు నమస్కరించిన నెంతదోషమో శిష్టసన్న్యాసులకు నమస్కరింపకుండిన నంత దోషము.

ఈప్రకారము పాతిత్యాది దోషములు లేని త్రిదండసన్న్యాసులకు నెవరైనఁ జూచిన వెంటనే నమస్కరింపవలయును. అని వాక్యములుండఁగా యతి యేక్షత్రియున కైన నమస్కరింపవలయు ననుట నిరాకరము. ఈ వివాద మెట్లుండినను హనుమత్సన్న్యాసి క్షత్రియుఁడు గృహస్థుఁడు నగు రామచంద్రునకు నమస్కరించె ననుట సత్యము. ఇది యెట్లు సముచితము? వర్ణాశ్రమ సామాన్య ధర్మముల కిం దెడములేదు. హనుమంతుఁ డత్యంత భక్తుఁ డనుట నిర్వివాదము. ఆయనకు శ్రీరామచంద్రమూర్తి యాచార్యపీఠ మీయఁ బోవుచున్నాఁడు. అట్లాచార్యపదవి యందుండువాఁడు భగవత్సాక్షాత్కారము గలవాఁడుగా నుండవలెను. అట్టియోగ్యత హనుమంతునకుఁ గలిగించి తన వాస్తవతత్త్వమాయన కెఱుకపఱుప హనుమంతునకు నాలుగుచేతులతో దర్శన మిచ్చెను. పరమపదనాథుఁడే చతుర్బాహువు కావునఁ బండితుఁడైన హనుమంతుఁడు వాస్తవతత్త్వము నెఱింగినవాఁడై మీఁదఁజెప్పినట్లు యతియైనను దేవతను జూచి నపుడు నమస్కరింపవలయు నను విధి ననుసరించి నమస్కరించెను. ఇట్టి మహాపురుషు లీ వేషములతో నిచ్చటికి రావలసిన పనియేమి కలిగెనని వారినిఁ బ్రశ్నించు చున్నాఁడు. (౧౧౫ వ పద్యవ్యాఖ్య చూచునది.)

క౦. సుమనోజ్ఞము సౌమ్యము నగు, విమలోక్తుల ముచ్చటించి ♦ విధిహితగతి భూ
రమణులఁ దనుపుచు నిట్లను, స్వమతంబును సూర్యతనయ ♦ సమ్మత సూక్తిన్. ౧౧౨

సుమనోజ్ఞము = (౧) మిగుల మనోహరమైనది. (౨) పండితు లెఱుఁగఁదగినది. (3) మంచి యర్థమును దెలుపుటచే రమ్యమైనది. (౪) పువ్వులవలె మృదువైనది, సౌమ్యము = కఠినమైన వాక్కుగానిది. (౨) మనస్సునకుఁ బ్రసన్నత గలిగించునది, విమలోక్తులన్ = మలినములేని యనఁగా వంచనలేని మాటలను, విధిహితగతిన్ = శాస్త్రమున విధింపఁబడిన ప్రకారము, స్వమతంబును = తన యభిప్రాయమును, సూర్యతనయ సమ్మతసూక్తిన్ = సుగ్రీవుని యభిప్రాయమునకు సరిపోవు మాటలచే- స్వమతంబు ననునది తన యిష్టము వచ్చినట్లు మాటలాడె నను నర్థము రాకుండుటకై సుగ్రీవుని యభిప్రాయమునకు సరిపోవునట్లు, అని చెప్పఁబడెను. దూత ప్రభువు మాటలకు భిన్నముగా మాటలాడరాదు గదా.

తా త్ప ర్య ము.

సుమనోజ్ఞముగను సౌమ్యముగను వంచనలేని మాటల ముచ్చటించి రాజకుమారులఁ దృప్తులఁ జేసి సుగ్రీవు నభిప్రాయమున కవిరోధముగఁ దన యభిప్రాయముఁ దెలుపుచున్నాఁడు.

సీ. ఎవ్వార లయ్య! మీ♦రివ్వన దేశంబు, నకు వచ్చుటకుఁ గార♦ణం బ దేమొ
రాజర్షి దేవతా♦ప్రతిమానులరు ముని, రాజవేషులరు సు♦వ్రతుల రరయ

వరవర్ణులరు సరో♦వరతీరకుజముల, నొప్పుగాఁ జూచుచు ♦ నున్నవారు
మిముఁ జూచి వనిలోని♦మృగములు పక్షులు, కనుకని పఱచెడిఁ గడుభయమున
తే. మీ తనూశోభ నీనదీ♦పూతజలము, మెఱుఁగు పెట్టినయట్టులు ♦ నెఱి వహించె
ధీరులరు తప్త హాటక ♦ దేహులరును, మంచిప్రాయంపువారలు ♦ మాన్యులార!

వరవర్ణులరు=అందమైన యాకారము గలవారు, కనుకని=తత్తఱపాటుచే, పఱచెడిఁ=పరుగెత్తుచున్నవి. తనూశోభ=దేహకాంతి, నెఱి=అందము, తప్తహాటక దేహులరు=పుటము వేసిన బంగారు వంటి దేహకాంతి గలవారు, లక్ష్మణుఁ డొక్కఁడే యిట్టిచాయ గలవాఁడు, రాముఁడు మేఘశ్యాముఁడు, అయినను లక్ష్మణుఁడు ముందు నిలచి యుండుటచే నేకముగ సంబోధించెను. లేదా బంగారువలె నందమైన దేహకాంతి గల వా రన్నచో నే యాక్షేపము లేదు.

తాత్పర్యము.

అయ్యలారా? మీ రెవరు? ఈ యడవి ప్రదేశమున కేల వచ్చితిరి ? మీవంటి వారు సంచరింప యోగ్యమైన స్థలమిది గాదే? ఏలన మీరు రాజర్షులతోను దేవతల తోను సమానులుగా నున్నారు. అట్టివారి కిట్టిచోట నేమి పనిగలదు? మేము రాజర్షుల మని నీకెట్లు తెలిసె నందురా ? మీరు ధరించిన మునిరాజుల వేషము దానిని దెలుపు చున్నది. మీ యందు మునివేషము రాజవేషము రెండును గలిసియున్నవి. అటయిన మేము సంకరు లని నీయభిప్రాయమా యందురేమో? కాదు, మీరు మంచివ్రతము పూని యిట్లున్నారు. కాని యాలోచించిన దొంగవేషములు గావు. ఇట్టి వ్రతము మీరు పూనఁ గారణమేమో నే నెఱుఁగను. ఏమీ మేము వ్రతనిష్ఠులము కాఁ గూడదా యందురేని మీ దేహకాంతి చూచిన నది వ్రతములచేఁ దపింపఁదగినది కాదు. నే నింతదూరము మాటలాడించు చున్నను, నాతో మాటలాడక కొలని యొడ్డున నుండు చెట్లను జూచుచున్నారు. ఇట్టి చెట్లను మీ రీయడవులందుఁ జూడ లేదా? మిమ్ముఁ జూచి యీ యడవిలోని పక్షులు, మృగములు భయపడి సంభ్రమ మునఁ బరువెత్తు చున్నవి. మీ దేహకాంతి యీ నిర్మలనదీజలంబులపై పడి దానికి మెఱుఁగు పెట్టుచున్నది. ఇంత ఘోరారణ్యమున మీ రిరువురే తిరుగుచుండుటచే మీరు భయ మెఱుఁగని ధైర్యవంతులరు. మీ దేహములు బంగారు చాయగలవై యున్నవి. మంచివయస్సున నున్నవారు.

సీ. హర్యక్షవీక్షణుల్ ♦ హర్యక్షవిక్రముల్, హరిచాపనిభచాప♦హస్తులరును
శ్రీమంతులరు వృష♦శ్రేష్ఠవిక్రములరు, హస్తిహస్తాభ భు♦జాన్వితులరు
సుందరాకారులు ♦ బృందారకాభులు, శత్రుసంహారణసు♦క్షములు మీరు
పొరిఁబొరి నిశ్వాస♦ములు పుచ్చుచున్నారు, భయపెట్టుచున్నారు ♦ పక్షిగణము
తే. భద్రసింహాసనార్హులు ♦ ప్రాజ్ఞులార! నారచీరంబులను గట్టి ♦ వీరులార!
జడల ధరియించి యీ రీతి♦జటులఁబోలి, తిరుగ నేటికిఁ జెప్పరే♦కరుణమీఱ. ౧౧౮

హర్యక్షవీక్షణుల్ = సింహముల చూపులవంటి చూపులుగలవారు, హర్యక్ష పరాక్రముల్=సింహము పరాక్రమమువంటి పరాక్రమము గలవారు, హరిచాపనిభ= ఇంద్రధనుస్సుతో సమానమైన, చాప=విండ్లను, హస్తులరు = చేతియందుఁ గలవారు, శ్రీమంతులరు = కాంతిగలవారు, వృషశ్రేష్ఠవిక్రములరు = గొప్ప యెద్దులవలె నడచువారు, హస్తిహస్తాభ = ఏనుఁగు తొండములతో సమానములైన, భుజాన్వితులరు = భుజములతోఁ గూడినవారు, బృందారకాభులు= దేవతలతో సమానులు, శత్రుసంహారణసక్షములు = విరోధుల సంహరించుటయందు మిగుల సమర్థులు, పొరిఁ బొరిఁ = మిక్కిలి, భద్రసింహాసనార్హులు = బంగారు సింహాసనముల నుండ యోగ్యులు.

తాత్పర్యము.

సింహముల చూపులవంటి చూపులు, సింహముల పరాక్రమమువంటి పరాక్రమము గలవారు. ఇంద్రచాపమువంటి పెద్దవిండ్లను జేతధరించి యున్నారు. దానివలె గాక స్థిరకాంతి సంపదగలవారు. బలసిన యాఁబోతులవలె నడచువారు. మీభుజము లేనుఁగు తొండములవలె నున్నవి. ఇట్లుండియుఁ జూడ నందమైనవారు. మహిమయందు దేవతలతో సమానులు. కావుననే యెట్టి శత్రువునైనఁ జంప మిగుల సమర్థులు. నడచిన గాసిచేతనా యేమి మీఁద మీఁద నిట్టూర్పులు విడుచుచున్నారు. మిమ్ముఁ జూచి పక్షులు భయపడుచున్నవి. ప్రాజ్ఞులారా! మీ చిహ్నములు చూడ బంగారు సింహాసనముల నుండఁ దగినవారు. ఇట్టివీరులు మీరేల నారచీరలు కట్టి జడదారులవలె జడలు ధరించి తిరుగుచున్నారు? మీ యోగ్యతకు మీ యిప్పటిస్థితికిఁ బరస్పర విరుద్ధముగ నున్నదే యేమి కారణము?

కం. అనుపమ తేజంబున గిరి,వనులన్ వెలిఁగించు చున్న♦వా రన్యోన్యం
బును సములు విపులవక్షులు, ఘనబాహార్గళులు దివ్య♦కాంతిస్ఫీతుల్. ౧౧౫

అనుపమ తేజంబునన్=అసమానకాంతిచే, గిరివనులన్=కొండల నడవులను, అన్యోన్యంబును=ఒకరితోనొకరు - విపులవక్షులు=విశాలమైన ఱొమ్ములు గలవారు. ఘనబాహార్గళులు=గడియమ్రాఁకులవంటి గొప్ప బాహువులు గలవారు. దివ్యకాంతి స్ఫీతుల్=దేవతా సంబంధకాంతిచేఁ బ్రకాశించువారు.

ఇచ్చట మూలమున 'ఆయతాశ్చ సువృత్తాశ్చ బాహవః పరిఘోపమాః॥ అని బహువచనము ప్రయోగింపఁబడెను. ఇంతకు ముందు వెనుక ద్వివచనమే ప్రయోగింపఁబడెను. ఆంధ్రమున ద్వివచనములేదు గావున ద్వివచనముగూడ బహువచనముగానే చెప్పవలసియున్నది. ఆ కారణముచే సంస్కృతమున బాహవ యను మాటకు రెంటికి మించిన, ననఁగా నిచ్చట నాలుగు బాహువు లున్నట్టు లర్థము చేయవలెను. దీనికి గోవిందరాజీయమందు మూఁడు సమాధానములు వ్రాయఁబడినవి. లక్ష్మణుఁడు రామునకు దక్షిణ బాహువు గావున రాముని రెండుచేతులు లక్ష్మణుఁ డొకచేయి

కావున రాముఁడు మూఁడు చేతులు గలవాఁడయ్యెను. కావున బహువచనము. ఈ సమాధానము సరికాదు. హనుమంతుఁ డిరువురిని గలిపి మాటలాడుచున్నాఁడు గాని రాముని మాత్రమే యుద్దేశించి మాటలాడలేదు.

రెండవ సమాధానము. ఇరువురకుఁ గలపి నాలుగు చేతులు కావున బహువచన ప్రయోగము. ఇది సరిగాదు. ఇరువురిని గలిపినప్పుడు నాలుగని బహువచనము ప్రయోగించుటకు మాఱు - సుభుజౌ - హస్తిహస్తోపమభుజౌ - పద్మపత్రేక్షణౌ అని ద్వివచనమే ప్రయోగింపఁబడెను. ఇరువురకుఁ గలిపి రెండు కన్నులు రెండు చేతు లని యర్థము కాదు కదా! ఇచ్చట మాత్రమే బహువచన ప్రయోగము.

మూఁడవ సమాధానము హనుమంతుఁడు భక్తుఁడు కావున నాయనకుఁ జతుర్భుజవేషముతో సాక్షాత్కరించెను. ఇది యంగీకరింపఁ దగినది.

తాత్పర్యము.

అసమాన కాంతిచేఁ గొండలను అడవులను బ్రకాశింపఁ జేయుచున్నారు. ఒకరికొకరు సములుగా నున్నారు. విశాలములైన వక్షములు గలవారు. పెద్ద గడియ బ్రాఁకులవంటి బాహువులు గలవారు. దేవతాకాంతిచేఁ బ్రకాశించు చున్నారు.

కం. ఆకాశంబును విడి యల,వోకగ భూతలముఁ జూచి ♦ పోవచ్చిన యా
లోకహితశీతకిరణుల, రేకను దోఁచెదరు చెప్ప ♦ రే మీ రెవరో! ౧౧౬

అలవోక = క్రీడ, లోకహిత శీతకిరణుల = లోకమునకు మేలుచేయు సూర్య చంద్రుల, రేకను = విధముగ.

తాత్పర్యము.

ఆకాశమును విడిచి యీలోకమును జూచి పోవఁ గ్రీడార్థ మరుదెంచిన సూర్య చంద్రులవలె నున్నారు. నిజముగ మీ రెవరు ?

నాలవ పాదంబునఁ బ్లుతయతి.

కం. పరిఘోపమానములు సుం,దరములు నాజానువులును ♦ దగవృత్తంబుల్
వరభూషార్హంబులు మీ,కరములు సువిభూషితములు ♦ గా వేమిటికో.

పరిఘోపమానములు=గుదియలతో సమానములు,ఆజానువులును=మోఁకాటి వఱకు నుండునవి. వృత్తంబుల్ = గుండ్రనివి, వరభూషార్హంబులు = శ్రేష్ఠములైన సొమ్ములు ధరింపయోగ్యమైనవి. సువిభూషితములు=చక్కఁగా నలంకరింపఁబడినవి.

తాత్పర్యము.

మీ హస్తము లినుపకట్లగుదియలవలె గట్టిగను, సుందరములుగను మోఁకాటి నంటినవియు గుండ్రములునై యాభరణములు ధరింప యోగ్యములై యున్నవి. ఏల మీ రాభరణములు ధరింపలేదు ? ఆభరణములచేఁ గప్పిపెట్టకున్న మీ యవయవములకు దృష్టి తాఁకునే? మీ రాభరణములు ధరించితి రేని యవియే

లోకమును వశపఱచికొనును. నిరావరణమైన మీ దేహసౌందర్య మేల కనుపఱుపవలె? ఆభరణములు ధరింపక యాయుధములు మాత్రము ధరించుట చూడ మీ శేషో శత్రుసంహారకార్యమునకై పూనినట్లున్నది. మీరాభరణములు ధరింపనిమొడల మీకుఁ గలుగు సౌందర్య హానిలేదు. గాని యవి తేజోహీనములై పడియున్నవి గదా మిమ్ము నాశ్రయించిన వానిని దేజోహీనులఁ జేయవచ్చునా?

కం. సవనంబు ససాగరముఁ, దివిజాలయ విన్ధ్యశైల◆దీపితమగు నీ
యవని సమస్తము నేలఁగఁ, దవువారలు నిరువు రిట్టి◆దశ గననేలా? ౧౧౮

సవనంబు=అడవులతోఁగూడినది. ససాగరముఁ = సముద్రములతోఁ గూడినది దివిజాలయ=మేరుపర్వతము, 'మేరు స్సుమేరు ర్హేమాద్రీ రత్నసాను స్సురాలయః' అమర.

తాత్పర్యము.

అడవులతోను సముద్రములతోడను మేరు విన్ధ్యశైలములచేఁ బ్రకాశించు నీ భూమి నంతయుఁ బరిపాలింపఁ దగిన వారలయ్యు నిట్టి దీనదశయం దేల యున్నారు?

కం. చిత్రంబులు శ్లక్ష్ణంబులుఁ, జిత్రవిలేపములు హేమ◆చిత్రిత మగు నా
సుత్రామపవికి సమములు, గోత్ర నదృష్టంబు లిట్టి◆కోదండంబుల్. ౧౧౯

శ్లక్ష్ణంబులు=మినమిన మెఱయునవి, హేమచిత్రితములు=బంగారు పూలు మొదలగు వానిచేఁ జిత్రింపఁబడినవి. గోత్రఁ=భూమియందు, అదృష్టంబులు=కనరానివి, సుత్రామపవి=ఇంద్రుని వజ్రాయుధము.

తాత్పర్యము.

మీవిండ్లు చూచుటకుఁ జిత్రములుగ ననుపారి నిగ నిగ మెఱయుచు గంధాదులచేఁ బూయఁబడి బంగారుపూలు మొదలైన వానిచేఁ జిత్రింపఁబడి యింద్రుని వజ్రాయుధమునకు సమానములుగా నున్నవి. ఇట్టివి లోకంబునఁ గానరావు.

క. తూణంబులు శత్రుజన, ప్రాణాంతకనిశ్వసన్మ◆హాహిస్ఫాయ
ద్బాణంబులఁ బూర్ణంబులు, నాణెంబులు భద్రదర్శ◆నంబులు చూడన్. ౧౨౦

తూణంబులు = అమ్ములపొదులు- శత్రుజన= పగవారి- ప్రాణాంతక= ప్రాణములు దీయునవియైన- నిశ్వసత్ = బుసలు కొట్టుచున్న- మహాహిస్ఫాయత్ = పెద్ద పాములవలెఁ బ్రకాశించు, బాణంబులఁ = బాణములచే- పూర్ణంబులు = నిండినవి భద్రదర్శనంబులు = చూచుటకు మేలైనవి.

తాత్పర్యము.

మీ యమ్ములపొదులు పగవారి ప్రాణములఁదీయ బుసకొట్టు పాములవంటి బాణములచే నిండియున్నవి. చూచుటకు నాణెములై శుభకరములై యున్నవి.

క. కడు నిడుదలు కడుఁబఱపులు, బెడిదంబులు నుదిరి పసిఁడిఁ◆బెనుపరులును మీ
యడిదంబులు కుప్పసముఁ, విడిచిన విసదారు లనఁగ ◆ వెలసెడి నౌరా! ౧౨౧

కడు నిడుదలు = మిక్కిలి పొడుగాటివి- పటుపులు = వెడలుపాటివి- బెడిదంబులు = భయము కలిగించునవి, ఉదిరిపసిఁడిన్ = అపరంజి బంగారును- పెనుపరులు= వృద్ధిచేయునవి- అడిదంబులు = కత్తులు- కుప్పసమున్ = కుబుసమును- విసదారులు= పాములు.

## తా త్ప ర్య ము.

మిక్కిలి నిడివి వెడలుపు గలిగి చూచుటకు భయంకరములై యపరంజి బంగారుచే వృద్ధిచెంది మీ కత్తులు కుబుసము విడిచిన పాములవలె నున్నవి.

ఉ. ఈవిధి నింతపల్కిన న ♦ దేటికి మాఱు వచింప రయ్యె? సు
గ్రీవుఁడు ధర్మచిత్తుఁడు హ♦రిప్రభు వొక్కరుఁ డుండునార్య సం
భావితవీరలోకుఁడును ♦ భ్రాతృనిరాకృతుఁడై మహావ్యథన్
ద్రావలయంబునం దిరుగుఁ గా♦తరభావముతోడ దీనుఁడై. ౧౨౨

హనుమంతుఁ డిన్ని ప్రశ్నలు వేసినను రామలక్ష్మణులు లాయన మాటల సొంపు పెంపు వినుచు నూరకుండిరిగాని యొక్కదానికైనఁ బ్రత్యుత్తర మిచ్చినవారు గారు. ఏల? ౧ ఆయనమాటలు వినుట యందాసక్తిచేత. నడుమఁ దాము మాటలాడించినచో నాయనమాటలు విన నవకాశము తప్పునే యని ౨. ఇది సన్న్యాసులు దిరుగవలసిన స్థలము కాదు. గ్రామముల సమీపమందుఁ దిరిగిన భిక్ష దొరకును. ఇక్కడ నెవరు భిక్షపెట్టువారు? ఇట్టిచోట నీసన్న్యాసి తిరుగనేల? కావున నితఁడు నిజమైన సన్న్యాసియా? ౩. అర్థియైవచ్చిన సన్న్యాసి యాయైనా తన స్థితిగతులు చెప్పుకోవలెనుగాని మన స్థితిగతుల విచార మితని కేల? ఎంతసేపు మాటలాడినను మన మర్మమెఱుంగఁ గోరుచున్నాఁడుగాని తన వృత్తాంతముఁ జెప్పఁడు. ౪. కావున నితఁడు సన్న్యాసి గాఁడు. వేగులవాఁడై యుండవవలెను. ఎవరి వేగులవాఁడు? ఇచ్చట వాలి సుగ్రీవులిరువురు పరస్పర శత్రువు లున్నారు. వారిలో నితఁడెవరివేగో? ఒకవేళ వాలివేగైనచో వీనితో మనము మర్మమువిడిచి మాటలాడుటెట్లు? కావున ముందు తానెవరో చెప్పనీ తరువాత నాలోచింతము, (౫) ముందు మనమే ప్రస్తావింత మనిన వేగులవాఁడు తన విషయమై సత్యము చెప్పునా? యని యాలోచించుచు వా రూరకుండిరి.

హనుమంతుఁ డిట్లు లాలోచించెను. నే నెంత మాటలాడించినను వీరు బదులాడక నావంకనే తెప్ప వాల్పక చూచుచున్నారు. నాయందు వీరికి సందేహము కలదు. ఆ సందేహముదీర నేను సంభాషించినఁగాని వీరు నమ్మి నాతో మాటలాడరు. నాయందు వంచనయుండెనా వారియందును వంచనయేయుండును. అప్పుడు మనస్సులు కలియవు. వీరు చాల గొప్పవారుగ నున్నారు. వీరి చెలిమి తప్ప నీయరాదని యాలోచించి తన వృత్తాంతము మర్మము విడిచి హనుమంతుఁడు చెప్పుచున్నాఁడు. ఈవిధిన్ = ఈ ప్రకారము, హరిప్రభువు=కోఁతులరాజు, సంభావిత వీరలోకుఁడు=వీరలోకసంభావి

తుఁడు=పీరులగు జనులచే గౌరవింపఁబడినవాఁడు, భ్రాత్రానిరాకృతుఁడై=అన్నచే వెడలఁగొట్టఁబడినవాఁడై, మహావ్యథః=మిగుల దుఃఖముతో, కాతరభావముతోఁ=భీతిచే.

తా త్ప ర్య ము.

ఆర్యులారా! నేనింత దూరము మాటలాడినను మీరొక మాటన్నైన బదులిడినవారుగారు. ఇఁక నావృత్తాంతము చెప్పెద వినుఁడు. ఇచ్చట నొక ధర్మాత్ముఁడు క్రోఁతిరాజు పీరులచే గౌరవింపఁబడినవాఁడు సుగ్రీవుఁడనువాఁడు కలఁడు. అతఁడన్నచే వెడలఁ గొట్టఁబడి నిలువనీడలేక ప్రాణభయముచే మిగుల బాధపడుచు దేశముఁ దిరుగుచున్నాఁడు.

సీ. మీచెల్మిఁగోరి ధర్మిష్ఠుఁడా హరిపతి, పనుప మీయొద్దకు ♦ వచ్చినాఁడ
నాతని సచివుండ ♦ వాతతనూజుండ, హనుమంతుఁ డనుపేరి♦యగచరుండఁ
గామరూపధరుండఁ ♦ గామసంచారుండ, హరితనూజు హితంబు ♦ నాత్మఁ గోరి
మస్కరియాకృతి ♦ మాఱువేషముఁ దాల్చి, ఋశ్యమూకమునుండి♦యిటకువచ్చి
ఆ. తెమ్యె నని వచించి ♦ యతఁ డూరకుండిన, నతని నుడికిఁ జిత్త♦మలరుచుండఁ
దనదు చెంత నున్న♦తమ్మునిఁ గనుఁగొని, కౌసలేయుఁ డనియె ♦ గారవమున. ౧౨౩

సచివుండ = మంత్రిని, వాతతనూజుండ = వాయువు కుమారుఁడను, అగచరుఁడను = క్రోఁతిని, కామరూపధరుండః = కోరిన రూపము ధరింపఁగలవాఁడను, కామసంచారుండః = కోరినట్లు సంచారము చేయఁగలవాఁడను, హరితనూజు హితంబు = సుగ్రీవుని మేలు, మస్కరియాకృతి = సన్న్యాసి రూపముతో, నుడికి = మాటకు, కౌసలేయుఁడు = కౌసల్యా కుమారుఁడు.

తా త్ప ర్య ము.

మీ స్నేహము గోరి ధర్మాత్ముఁడైన సుగ్రీవుఁడు పంపఁగా మీయొద్దకు వచ్చినవాఁడను. నే నాయన మంత్రిని. వాయుపుత్రుఁడను, నాపేరు హనుమంతుఁ డందురు. నేను వానరుఁడను. కోరిన రూపము ధరించి కోరిన స్థలములందుఁ గోరిన విధముగ సంచరింపఁ గలవాఁడను. సుగ్రీవు మేలు గోరి సన్న్యాసియాకారము ధరించి ఋశ్యమూకమునుండి యిచ్చటికి వచ్చితిని, అని చెప్పి యూరకుండెను. అంత నాయన మాటకు మనస్సు సంతోషించుచుండఁ దన సమీపమున నున్న తమ్మునిఁ జూచి రామచంద్రమూర్తి యిట్లనెను.

దీనితో రామ లక్ష్మణుల సందేహము తీరెను. వాలి సుగ్రీవుల పేర్లు, వాలి సుగ్రీవుని వెడలఁగొట్టుట వాలి ఋశ్యమూకమునం దుండుట యివన్నియు వారెఱిఁగిన విషయములే కావున సందేహింపఁ గారణములేదు. ఆవల సుగ్రీవుని మంత్రిననుటచే సుగ్రీవుని పక్షమువాఁ డనియు గొప్ప పదవియందున్నాఁ డనియు నేర్పడెను.

—♦ శ్రీరాముఁడు లక్ష్మణుతో హనుమంతునిఁ బ్రశంసించి చెప్పుట. ♦—

క. ఘనమతి యగు సుగ్రీవుని, యనుఁగుం బ్రెగ్గడయ యీతఁ ♦ డనఘా మన మె
వ్వనిఁ దలఁచు చుంటి మారవి, తనయుఁడె తా నిట్లు మనల ♦ దాయఁగ వచ్చెన్.

ఘనమతి = గొప్ప మనస్సు గలవాఁడు- అనుఁగుం బ్రెగ్గడయ = ప్రియుఁడగు మంత్రి- ప్రగడ —అపశబ్దము.

తాత్పర్యము.

లక్ష్మణా! యీయనను సామాన్యునిఁగా నెంచవలదు. గొప్ప మనస్సుగల సుగ్రీవునికిఁ బ్రీతిపాత్రుఁడైన మంత్రి ఈతనియం దెంత నమ్మకము లేనిదే మనయొద్ద కిట్టి కార్యమునకై పంపునా? మన మే సుగ్రీవునిఁ జూడఁ బోవఁదలఁచుచుంటిమో యతఁడే తన మంత్రిరూపమున నిచ్చటికే వచ్చెను. అనఁగా సుగ్రీవునితో నే కార్యము కాఁగలదో యది యీయన వలననే యగును. ఆయనను మనమెట్లు నమ్మవచ్చునో యీయనను అట్లు నమ్మవచ్చును. ఆయనకు నీయనకు భేదములేదని భావము.

సీ. నెయ్యంబుఁ దియ్యంబు ♦ నేర్పు దీపింప నీ, వాక్యజ్ఞునకుఁ బ్రతి♦వచన మిమ్ము
ఋగ్వేదమును జక్క♦ నెఱుఁగనివాఁడు య, జుర్వేదధారణా♦శూన్యబుద్ధి
సామవేదమునఁ బ్రా♦జ్ఞత్వంబు లేనివాఁ, డీరీతి భాషింప ♦ నేరఁ డెపుడు
వ్యాకృతి యంతయు ♦ వల్లించె నిజముగ, నెన్ని మాటలొ యీతఁ ♦ డింతసేపు
ఆ. మాటలాడ నొక్క♦మాట యేనియు నప,శబ్దితంబు గాదు ♦ చక్షువులనొ
ముఖముననొ లలాట♦మున బొమలందునొ, దోషమొక్కఁడైనఁ ♦ దోఁపదెందు.

నెయ్యంబు=స్నేహము, నాకు సుగ్రీవునికి స్నేహము కుదురునట్లు; తియ్యము=ప్రియము, నేర్పు=ఏదిచెప్పవలెను? ఎట్లు చెప్పవలెనను వివేకము, వాక్యజ్ఞునకుక్= (1) వ్యాకరణపండితునకు, (౨) మాటలాడు విధముఁ దెలిసినవానికి, ప్రతివచనము= ప్రత్యుత్తరము, ప్రభువు లితరుల మంత్రులతోఁ దామే ప్రత్యక్షము మాటలాడరా దను రాజనీతి ననుసరించి నీవు మాటలాడుమని లక్ష్మణుని రామచంద్రమూర్తి నియోగించుచున్నాఁడు. భగవంతుఁడు చేతనుని నాచార్యుమూలమున నుజ్జీవింపఁ జేయును. గాని ప్రథమమందే తానై పూనుకొనఁడు. కావున సుగ్రీవు నుజ్జీవనార్థ మాచార్య లాభము సూచించుచున్నాఁడు.

హనుమంతుఁ డాచార్యపదవికిఁ దగినవాఁ డని శ్రీరామచంద్రమూర్తి యీయన యోగ్యతను గుఱించి చెప్పుచున్నాఁడు. 'ఆచార్యో వేదసంపన్నో, విష్ణుభక్తో, విమత్సరః, మంత్రజ్ఞో, మంత్రభక్తశ్చ, సదామంత్రార్థద, శ్శుచిః, గురుభక్తి సమాయుక్తః, పురాణజ్ఞో విశేషతః ఏవం లక్షణ సంపన్నో గురు రిత్యభిధీయతే॥' అని యాచార్యలక్షణము. అనఁగా నాచార్యుఁడు వేద మెఱిఁగిన వాఁడుగను, విష్ణుభక్తుఁడుగను, మాత్సర్యము లేనివాఁడుగను, విష్ణుమంత్రము తెలిసినవాఁడుగను, ఆమంత్రమందు

భక్తిగలవాఁడుగను,మంత్రార్థమును బరులకుఁ జెప్పఁగలవాఁడుగను, బాహ్యాభ్యంతరము లందు నిర్మలుఁ డగు గురుభక్తిగలవాఁడుగను పురాణముల జ్ఞానముగలవాఁడుగను నుండవలెను. ఇట్టివాఁ డాచార్యుఁ డనఁబడును. ఈగుణములు హనుమంతుని యందుఁ గల వని శ్రీరామచంద్రమూర్తి చెప్పుచున్నాడు. యజుర్వేద ధారణాశూన్య బుద్ధి= యజుర్వేదమును దృఢముగ మనస్సున నిలుపలేనివాఁడు, ఋగ్వేదమున నొక్కొక్క యక్షరమునకుఁ బెక్కు స్వరములు గావున నెప్పు డే స్వరము నుపయోగింప వలయునో చక్కఁగఁ దెలిసియుండవలెను. యజుర్వేదమున నొక్కొక్క యనువాకముతో మఱియొక్క యనువాకమును సాంకర్యము గలుగకుండ ధారణ చేయుట దుష్కరము. అట్టి ధారణ కలవాఁడు, సామవేదమున = సామవేదమునందు, ప్రాజ్ఞత్వము = పాండిత్యము, సామగానమున గానము బహు కష్టసాధ్యము, అందును బాండిత్యము గలదు. ఇం దూహరహస్యాది గర్భిత విశేష ములు సులభముగఁ దెలియ సాధ్యపడునవికావు. అథర్వణమునకుఁ బ్రత్యేకించి యధ్య యనము లేదు. కావున దానిని జెప్పలేదు. 'సవనంబు ససాగరముగ దివిజాలయ వింధ్యశైలదీపిత మగు నీయవని సమస్తము నేలఁగఁ దవు వారలు' అని ఋగ్వేద మెఱుఁగనివాఁడు చెప్పలేఁడు. ఏలయన 'బ్రహ్మావా ఇద మేక ఏవాగ్ర ఆసీ' త్తనికదా ఋగ్వేద సంబంధమైన యైతరేయోపనిషత్తునందు మొదటఁ జెప్పఁబడెను. 'సుందరా కారులు బృందారకాభులు' అనుమాట యజుర్వేద మెఱుఁగనివాఁడు చెప్పఁజాలఁడు. 'అజాయమానో బహుధా విజాయతే' యని యవతార రహస్యము యజుర్వేదమందు గదాగలదు. 'తప్తహాటక దేహులరు' అనునది సామవేద మెఱుఁగని వాఁడు చెప్పలేఁడు. సామసంబంధ మగు ఛాందోగ్యమందు 'అథ య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే' యని చెప్పఁబడెను. వ్యాకృతి = వ్యాకరణము, వ్యాకరణము వేదాంగము కావున దానినిగూడ జదివినాఁడు, కావున వేదముమాత్రి మెఱింగిన ఛాందసుఁడు, వీఁ డేమి లౌకిక కార్యములు చేయఁగలఁడని తలఁపవలదు. వ్యాకృతియంతయు = వ్యాకరణమునకు సం బంధించినదంతయు, నవవ్యాకరణము లందొక్కటియైనఁ గొంచెమైన విడువక (ఉత్తర. ప ౮౩౭ చూడు) ఇక్కడ వ్యాకరణము తక్కినవేదాంగముల కుపలక్షణము. అపశబ్ది తంబు=అపరిశుద్ధముగా=వ్యాకరణవిరుద్ధముగ, అనఁగాఁ బ్రకృతి ప్రత్యయ సమాస సంధ్యాదులం దొక్కచోనైనను దప్పులేక మాటలాడెను. లలాటము=నొసలు భ్రూమలు=కనుబొమ్మలు, దోషము=వికారము, ఒకవిధముగా నుండవలసినదానిని మఱియొక విధముగా నుంచుట, కొందఱు మాటలాడునపుడు ముఖము కన్నులు కనుబొమ్మలం దేదో యొక వికారచేష్ట కనఁబడును. అట్టిదోష మితనియందులేదు. ఎందుఁగ= ఏ యవయవమందైనను, తోఁపదు=నేనెంతో పరీక్షించిచూచితిని గాని నాకుఁ గానరాలేదు. దీనివలన నీయన శిక్షయు వచ్చించెనని యేర్పడుచున్నది.

'గీతీ శీఘ్రీ శిరః కంపీ తథాలిఖిత పాఠకః అనర్థజ్ఞోల్పకంఠశ్చ షడేతే పాఠకాధమాః నశిరః కంపయే ద్గాత్రం, భ్రువౌచా ప్యక్షిణీ తథా తైలపూర్ణ మివాత్మానం, తత్త ద్వర్ణేన యోజయేత్॥ అని శిక్షయందుఁ గలదు.

## తాత్పర్యము.

లక్ష్మణా! యీయన యడిగిన ప్రశ్నములకు నీవు ప్రత్యుత్తర మిమ్ము. ఈయన మాటల పొందిక శాస్త్రసరణి తెలిసినవాఁడు. ఆయన యోగ్యతకుఁ దగినట్లు నీవు మాటలాడకున్న మనము మూఢుల మని తలఁచును. కావున నీవు మాటలాడు మాటలు స్నేహము కుదుర్చునవియై వినఁ బ్రియములై యుండవలెను. ఏవిషయ మెట్లు చెప్పవలయునో యట్లే చెప్పుము. ఏల యింత హెచ్చరిక చెప్పెద వందువా ఋగ్వేదము యజుర్వేదము సామవేదము చక్కఁగా వల్లించి దృఢముగ మనస్సున నిలిపినవాఁడు, గాని యీయనవలె మాటలాడ లేఁడు. అట్లని ఛాందసుఁడనుకొనకుము. శిక్షావ్యాకరణాదులు చక్కఁగఁ బఠించినవాఁడు వ్యాకరణమంతయు నెన్నిమార్లు వల్లించి కంఠస్థము చేసెనో! కాని నేనెంత పరీక్షించి చూచినను నీయనమాటలందు వ్యాకరణ విరుద్ధమైన ప్రయోగ మొక్కటియైనఁ గానరాలేదు. అంతియకాదు. మాటలాడుతీరు చూచిన శిక్షయుఁ బఠించినవాఁడుగా నున్నాఁడు. ఎంతసేపు మాట లాడినను కన్నులందుఁ గాని ముఖమందుఁగాని నొసటఁగాని కనుబొమలందుఁగాని యొక దోషమైనఁ గానరాలేదు. ఇఁక నుచ్చారణమందో,

చ. కొతుకులు లేక విస్తరముఁ గూడక శంకకు సందునీక య
ద్రుత మవిళంబితంబు నయి తొస్సులు పోవ కురోగళైకసు
స్థిత మయి మధ్యమస్వరముచే నలరారెడి వీనివాక్కు సం
స్కృతమును సక్రమంబు శుభ మెంతయు హృద్యము నై రహించెడిన్. ౧౨౬

కొతుకులు = వర్ణలోపములు - సగముమాట పలికి సగము పలుకకపోవుట- విస్తరముఁగూడక = చెప్పఁదలఁచిన విషయ మెన్నిమాటలఁ జెప్పవచ్చునో యన్ని మాటలచేతనే చెప్పుట, వ్యర్థముగ మాటలు పెంచక- శంకకుఁ = అర్థవిషయమందు గాని పదవిషయమందుఁ గాని సందేహమునకు, సందునీక = ఎడమీయక, అద్రు తము = మెల్లఁగా, ఎదుటివారు పూర్ణముగా గ్రహింపరా నటు లతివేగములేనిది- అవిలంబితము = మాటకు మాటకు నడుమ వ్యర్థ కాలవిరామము లేక, నీళ్ళు నము లుచు గడియ కొకమాట యాడకుండుట- తొస్సులు పోవక = పండ్లులేనివారు మాటలాడునట్టు లుచ్చారణలోపము లేక- ఉరోగళైకసుస్థితమయి = రొమ్మునందుఁ గంఠమునందును నూని పలికినది- మధ్యమస్వరము = బిగ్గఱగాఁ గాక యితరులకు వినఁబడనట్లు మెల్లగా గొణుగక యుండునది- ఇక్కడఁ జెప్పిన పదునాలుగు పాఠదోషముల కుపలక్షణము. 'శంకితం భీత ముద్ఘుష్ట మవ్యక్త మనునాసికం, కాకుస్వరం

శీర్షగతం తథా స్థానవివర్జితం, విస్వరం విరసంచైవ విశ్లిష్టం విషమాన్వితం, వ్యాకులం తాలుభిన్నంచ పాఠదోషా శ్చతుర్దశ' యని పాఠదోషములు.

ఉపాంశుదష్టం త్వరితం నిరస్తం, విలంబితం గద్గదికం ప్రగీతం, నిష్పీడితం గ్రస్త పదాక్షరంచ వదే న్నదీనం నతు సానునాస్యమ్. ఇట్లు మఱియొకచో నీదోషములు చెప్పఁబడినవి. ఇట్టి దోషములు హనుమంతుని మాటలయందు లేవు.

మాధుర్య మక్షర వ్యక్తిః । పదచ్ఛేద స్తథాత్వరా, ధైర్యం లయ సమత్వంచ షడేతే పాఠగా గుణాః

తాత్పర్యము.

ఈయన మాటలయందుఁ గొతుకులు లేవు. వ్యర్థపదములు లేవు. ఈయర్థమా, యీ యర్థమా, ఇది యీపదమా ఆపదమా, యను సందేహమున కెడము లేదు. గబగబ పరువులెత్తుటయు లేదు. మెల్లగ నీళ్లు నములుచు మాటలాడుటయు లేదు. తొస్సులు లేవు. ఉరము కంఠము వీని నూని మాట వెడలుచున్నది. బిగ్గయఱచుట లేదు. వినవచ్చి వినరాకుండునట్లు గొణుఁగుట, పెదవులతోనే మాటలాడుట లేదు. ప్రతిపదము వ్యాకరణ శుద్ధము క్రమము ననుసరించి యున్నది. శుభము మనోహరమై యున్నది.

తే. అనఘు యీతని త్రిస్థల♦వ్యంజనస్థ, మైన చిత్రవచోగతి ♦ యాగ్రహమునఁ
జంపఁగత్తిని బై కెత్తు♦శత్రునైన, నెలమిఁ బొందింపఁ జాలక ♦ యేలపోవు. ౧౨౭

త్రిస్థలవ్యంజనస్థము = త్రిస్థల = శిరస్సు, కంఠము, ఱొమ్ము, అను మూఁడు చోట్లనెడి, వ్యంజన=శబ్దోత్ప త్తిస్థానములందు, స్థము=ఉన్నది. ఆస్థానములందుండుట యనఁగా నచ్చటఁ బుట్టుటగాదు. శిరమునఁ బుట్టు నట్లు మాటలాడుట శీర్షగత మను దోషమని ముందు చెప్పఁబడెను. కాఁబట్టి యీ మూఁడు స్థానములలో నుండుట యనఁగా ఉదాత్తానుదాత్తస్వరితస్వరంబులఁ గలిగి యుండుట. ఇట్లే శిక్షయందును జెప్పఁబడినది. అనుదాత్తో హృది జ్ఞేయో మూర్ధ్న్యుదాత్త ఉదాహృతః । స్వరితః కంఠమూలీయః సార్వాస్యే ప్రచయస్యతు॥ అని యందలి పద్యము, చిత్రవచోగతి= ఆశ్చర్యకరమైన మాటలజాడ.

తాత్పర్యము.

ఉదాత్తానుదాత్తస్వరితములతోఁ గూడిన యీతని చిత్రమైన మాటలజాడ వీనిపైఁ గోపించి చంపఁగత్తి పైకెత్తిన వానినైన సంతోషపఱుపఁగలదు. ఇఁక నను కూలుర విషయము చెప్పనేల ?

క. భూతలనాథుం డీదృశ,దూతను గడియింపఁ డేని ♦ తొడఁగినపని యే
రీతిని గడ గనఁ గాంచును? ఖ్యాతిం గను నెట్లు సిద్ధ♦కార్యపరుం డై ? ౧౨౮

ఈ దృశదూతను = ఇటువంటి దూతను- గడియింపఁడేని = సంపాదించుకొనక పోయెనా.

తాత్పర్యము.

రాజగువాఁ డిటువంటి దూతను సంపాదింపఁడేని వాఁడు ప్రారంభించిన పని యెట్లు నెఱవేఱఁగలదు? వాఁడెట్లు కార్యసాధకుఁ డని కీర్తి సంపాదింపఁగలఁడు?

క. ఏతాదృగ్గుణగణసము, పేతుం డగుదూత నిలుచు ♦ నెవ్వనికడ నా
భూతలపతికార్యంబులు, దూతముఖంబున నె తీరు ♦ ధ్రువ మని యన్నన్. ౨౯

ఏతాదృక్ = ఇటువంటి, గుణగణ = గుణసమూహములతో, సముపేతుఁడు= కూడినవాఁడు.

తాత్పర్యము.

ఇటువంటి గుణసమూహములు గల దూత యేరాజు నొద్దనుండునో వాని కార్యము లన్నియు దూతవలననే సఫలము కాఁగలవు.

దీనివలనఁ దాను సుగ్రీవునితోఁ జెలిమిచేసినచోఁ దనకార్య మీతని వలననే సఫలము కాఁగల దని రామచంద్రమూర్తి నిశ్చయించుకొనెను.

మ. అల వాక్యజ్ఞుఁడు లక్ష్మణుండు వెస వా♦క్యజ్ఞున్ హనూమాను నిన్
బలికెం బండితవర్య సూర్యజప్రభా♦వంబున్ గుణామేయతన్
దెలియన్ వింటిమి యాతనిన్ వెదకుచున్ ♦ ధీవర్య మే మిందు రాఁ
గలిగెం జుమ్ము, త్వదుక్తకీశపతివా♦క్యం బేము హర్షంబునన్. ౩౦

వాక్యజ్ఞుఁడు లక్ష్మణుఁడు, వాక్యజ్ఞుఁడు హనుమంతుఁడని శ్రీరామచంద్రమూర్తి చెప్పుటచే హనుమంతునందుఁ గలవని శ్రీరామచంద్రమూర్తి చెప్పిన గుణము లన్నియు లక్ష్మణునందును గలవనియు నిరువురును సమాను లనియు భావము.

గుణామేయతన్ = గుణముల గొప్పతనము, త్వదుక్త = నీచేఁ జెప్పఁబడిన, కీశపతి వాక్యంబు = సుగ్రీవునిమాట, హర్షంబునన్ = సంతోషముతో, పండితవర్య= పండిత శ్రేష్ఠుఁడా! ఈ యొక్కమాట నీ శక్తిసామర్థ్యములు మేము తెలుసుకొంటిమని తెలుపుచున్నది.

తాత్పర్యము.

అని యీ ప్రకారము శ్రీరామచంద్రమూర్తి చెప్పఁగా వాక్యజ్ఞుఁడైన లక్ష్మణుఁడు వాక్యజ్ఞుఁడైన హనుమంతునితో నిట్లనియె. అయ్యా! పండితుఁడా! సుగ్రీవుని ప్రభావము, అతని గొప్ప గుణములు, మే మిదివఱకే వినినారము. కావుననే యాయనను వెదకుచు వచ్చితిమి. నీవు చెప్పిన సుగ్రీవుని కార్యమును మేము సంతోషముతో,

కం. నీవు వచించిన విధముగఁ, గావింపంగల మటన్న ♦ గాలికొడుకు సు
గ్రీవునిజయంబుఁ గోరుచు, వావిరి సఖ్యంబుఁ గూర్ప ♦ వారికి నెంచెన్. ౩౧

తాత్పర్యము.

నీవు చెప్పినట్లు చేయఁగలము అని చెప్పఁగా హనుమంతుఁడు సుగ్రీవుని జయముఁ గోరుచు రామ సుగ్రీవులకు స్నేహము గూర్పఁదలఁచెను.

—♦ ౪ వ సర్గము. లక్ష్మణుఁడు హనుమంతునితోఁ దమ వృత్తాంతముఁజెప్పుట. ♦—

చం. పనివడి సూర్యపుత్త్రుఁ గన ♦ వచ్చిన వారలు వీరలంచుఁ దా
హనుమయుఁ బొంగి సంతసము♦నన్ రవిపుత్త్రుఁ దలంచి యింక నా
తనిపని యెల్లఁ జక్కఁబడుఁ ♦ దథ్యము యిట్టిరు కార్యమూని యా
తనిఁ గనఁగోరువార లఁట ♦ తప్పునె యాతని రాజ్యలబ్ధియున్. ౧౩౨

పనివడి = కార్యముగలిగి, తథ్యము = నిజమే, ఇట్టిరు = ఇట్టివారు.

తాత్పర్యము.

కార్యార్థమై సుగ్రీవునిఁజూడ వచ్చినారని హనుమంతుఁడు సంతోషపడి సుగ్రీవుని మదికిఁ దెచ్చుకొని యితనికార్యము చక్కఁబడినట్టే, ఆయనకు రాజ్యము లభించుటయు సత్యమే. ఇట్టివారు పూనిన కార్యము తప్పిపోవునా? ఎన్నటికిఁ బోదు.

చం. అని తలపోసి యా ప్లవగుఁ ♦ డా జగతీపతిఁ జూచి ఘోర మా
వనులను బంపతీరమున ♦ భ్రాతయు నీవును గ్రుమ్మరంగ నే
లన రఘురామనోదితుఁడు ♦ నై హనుమంతున కా సుమిత్రనం
దనుఁ డనియెన్ రఘూత్తముక♦థం దెలియన్ మొదలింటినుండియున్. ౧౩౩

ప్లవగుఁడు = వానరుఁడు, చోదితుఁడు = ఆజ్ఞాపింపఁ బడినవాఁడు.

తాత్పర్యము.

ఆంజనేయుఁ డీప్రకార మాలోచించి సుగ్రీవునివలన వీరికిఁ గాఁగల కార్యమేదో యది సుగ్రీవునికి సాధ్యమో యసాధ్యమో తెలిసికొందమని రామచంద్రమూర్తిని జూచి, యయ్యా నీవు తమ్మునితోఁడ నీ భయంకరములైన యడవులందుఁ దిరుగఁ గారణమేమి కలిగె ననిన రామచంద్రునిచే నాజ్ఞాపింపఁబడి లక్ష్మణుఁడు శ్రీరామచంద్ర మూర్తి చరిత్ర మాదినుండి యిట్లు చెప్పసాగెను.

సీ. ద్యుతిమంతుఁడును మహా♦మతిమంతుఁడును నగు,దశరథుం డనుపేర♦ధరణివిభుఁడు
ధర్మవత్సలుఁడు స్వ♦ధర్మంబునను జతు,ర్వర్ణపాలన మనా♦రతము సలిపెఁ
బగతుఁ డేరికిఁ గాక♦పగ యొక్కఁడును లేక, భూతాళి మాఱట♦ధాత యగుచు
నియతిఁ దప్పకయ య♦గ్నిష్టోమముఖమహా,క్రతు లాప్తదక్షిణల్ ♦ గాఁగఁజలిపె

తే. నతనికొడుకుల లోపల ♦ నగ్రజుండు, రామనాముండు వినుతప♦రాక్రముండు
సర్వభూతశరణ్యుండు ♦ జనకవాక్య,పారగుఁడు రాజచిహ్నసం♦పన్నుఁ డితఁడు.

ద్యుతిమంతుఁడు=తేజస్సుగలవాఁడు, మహామతిమంతుఁడు=గొప్ప బుద్ధియాలోచన గలవాఁడు, ధర్మవత్సలుఁడు=ధర్మమందుఁ బ్రీతిగలవాఁడు, చతుర్వర్ణ పాలనము=నాలుగువర్ణముల రక్షించుట, అనారతము=ఎల్లవేళల, పగ=విరోధి "మనకుం బగ యిందుఁ డెడ కాఁడె యెల్లభంగులఁదలఁపఁగ'' నిర్వ. రా ౫ ఆ. మాఱటధాత=బ్రహ్మకుఁ బ్రతినిధి, సర్వభూతశరణ్యుండు=సర్వభూతముల రక్షించు యోగ్యతగలవాఁడు.

తాత్పర్యము.

తేజోవంతుఁడును గొప్పమతిమంతుఁడు నగు దశరథుఁడనురాజు ధర్మమందుఁ బ్రీతిగలవాఁడై బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను నాలుగు వర్ణములవారిని వారి వారి స్వధర్మమునుండి చెడకుండ సర్వదా రక్షించెను. ఆయన యెవరికి విరోధిగాక యెవరియందు నాయనకు విరోధభావములేక రెండవ బ్రహ్మవలెనే రక్షించెను. నియమము చెడకుండ నగ్నిష్టోమము మొదలైన యజ్ఞములను దక్షిణలతోఁ గావించెను. ఆయన కొడుకులలోఁ బెద్దవాఁడు రాముఁడను పేరుగలవాఁడు. పరాక్రమమందుఁ బ్రసిద్ధికెక్కినవాఁడు. సర్వభూతముల రక్షించు యోగ్యత గలవాఁడు. తండ్రివాక్యమును సాంతముచేసినవాఁడు. రాజచిహ్నములతోఁ గూడినవాఁడు. ఆయనయే యీయన.

మ. ధరణీరాజ్యముఁ గోలుపోయి వనికై ♦ తర్లంగ వెన్నంటితిన్
ధరణీకన్యక భార్య సీతయు దినాం♦తంబందు మార్తండునిన్
భరమాకాంతులభంగి వెన్కొనియె నీ♦ప్రాజ్ఞానుజాతుండఁ ద
ద్వరధీసద్గుణరాజికిన్ వశుఁడనై ♦ దాస్యంబుఁగావించెదన్. ౧౩౫

దినాంతంబందు=సాయంసమయమందు, ఈ ప్రాజ్ఞానుజాతుండ=ఈ ధీమంతుని తమ్ముఁడను, తత్=ఆయనయొక్క వరధీ=గొప్పబుద్ధికి, సద్గుణరాజికిన్=మంచిగుణముల సమూహమునకు.

తాత్పర్యము.

ఈయనరాజ్యముఁ బోఁగొట్టుకొని యడవులకై ప్రయాణము సేయఁగా నేను గూడ వచ్చితిని. నే నొకఁడనేకాను. ఈయనభార్య భూపుత్రి సీతాదేవియును సాయంసమయమున సూర్యుని నాయన కిరణములవలె నీయనవెంట వచ్చెను. ఆమె భార్య, కూడ వచ్చుట న్యాయమే, నీవెవ్వఁడ వేల వచ్చితి వందువా? ఈమతిమంతునకు నేను జన్మముచేఁ దమ్ముఁడను. ఈయన గొప్పబుద్ధికి సద్గుణసంపదకు వశపడి దాస్యము చేయుచున్నాను.

దినాంతంబందు మార్తాండునిం బరమాకాంతుల భంగిన్ = ఓయి, సంపదవేళ బంధువులుకూడ వత్తురే కాని యాపదవేళ వత్తురా యందువేమో! అస్తమింపఁ బోవు సూర్యుని వెంట నాయన కిరణములు పోవుటలేదా? ప్రాజ్ఞానుజాతుండన్ = ఈయన ప్రాజ్ఞుఁడు కావున నన్నుఁ దమ్ముఁ డనుకొనుచున్నాఁడు. అది యీయన యభిప్రాయము. నా యభిప్రాయంబున నే నాయనకు దాసుఁడను, లక్ష్మణుఁడు మీకుఁ బరతంతుఁడనెను గదా- (అరణ్య ౨౩౬) ఓయీ లక్ష్మణుదాస్యము స్వాభావికమని యుండఁగా నిచ్చట గుణములఁబట్టి దాస్యము చేసెద ననుట స్వభావ విరుద్ధము గాదా యనిన దాస్యము స్వభావసిద్ధమైనను స్వామియందు మంచిగుణములు కూడ నుండెనేని మిక్కిలి శోభించునుగదా- ఇక్కడ గుణప్రశస్తి చెప్పఁబడెను.

ఉ. పేరున లక్ష్మణుండఁ గృత♦విజ్ఞు సుఖార్హు మహార్హు భూతర
క్షారతు రాజ్యహీను ప్రియ♦కాంతను సీతను గామరూపి కాం
తారమునం దెవండొ యొక♦దానవుఁ డోడక ముచ్చిలింప మే
మారమణీలలామ గహ♦నావళులన్ వెదకంగ నొక్కెడన్. ౧౩౬

కృతవిజ్ఞు = చేసినమేలు చక్కఁగా నెఱిఁగిన వానియొక్క.

తాత్పర్యము.

నాపేరు లక్ష్మణుఁడందురు. నా యోగ్యత కది తగిన పేరు. చేసినమేలు మఱవని వాఁడును సుఖపడ నర్హుఁడును గొప్ప యోగ్యతగలవాఁడును ప్రాణికోటుల రక్షించుట యం దాసక్తి గలవాఁడును రాజ్యములేనివాఁడును నగు నీయనయొక్క ప్రియురాలిని సీతను కామరూపి యగు రాక్షసుఁ డెవఁడో యడవులందు భయములేక దొంగిలింపఁగా మే మామెను వెదకుచు నడవులందుఁ దిరుగుచో నొకచోట.

లక్ష్మణుఁడు హనుమంతునితో శ్రీరాముఁడు సుగ్రీవసాచివ్యము గోరియుండుట చెప్పుట-

క. శాపముకతమున దానవ,రూపము గనినట్టి దనుఁడు ♦ రూఢిగ మాతో
భూపుత్రి జాడ దెలియఁగ, నోపెడి సుగ్రీవుఁ డను వ♦నౌకోవిభుఁడున్. ౧౩౭

వనౌకోవిభుఁడు = క్రోఁతిరాజు.

తాత్పర్యము.

శాపముచే దానవుఁడైన దను వనువాఁడు మీ సీతాదేవి యున్నజాడ దెలియుటకు సుగ్రీవుఁడను వానరరాజు సమర్థుఁడని గట్టిగాఁ జెప్పెను.

క. అని చెప్పి యతఁడు స్వర్గముఁ, జనియె యథాసుఖముగా ని♦జం బిది నాకున్
జనవినుతుఁడు రామునకున్, దినకరతనయుండె యింక ♦ దిక్కు కపీంద్రా. ౧౩౮

తాత్పర్యము.

ఇట్లు చెప్పి యతఁడు స్వర్గమునకు సుఖముగాఁ బోయెను. ఇది వాస్తవము- ఈ కారణముచే నాకును, జనులచేఁ బొగడ్తగన్న రామచంద్రమూర్తికి వానరేంద్రా! సుగ్రీవుఁడే యిఁక దిక్కు.

క. లోకాధినాథుఁ డై మును, ప్రాకటబహువిత్తదాన♦పటిమంబున సు
శ్లోకుం డగు రాముండు ది,వాకరసుతు నాథుగాఁగ వాంఛించె నయా. ౧౩౯

లోకాధినాథుఁడు= లోకమునఁ బ్రభువులకుఁ బ్రభువైనవాఁడు- ఇది రాముని పరత్వమును సూచించును- ప్రాకట బహువిత్తదానపటిమంబునన్ = ప్రసిద్ధముగ విస్తారధనము దానముచేయు సామర్థ్యముచే- సుశ్లోకుండు = మంచికీర్తి సంపాదించిన వాఁడు.

తాత్పర్యము.

సర్వలోక రక్షకుఁడై పూర్వమునేక దానములఁ జేసి దాత యని ప్రసిద్ధికెక్కిన రామచంద్రమూర్తి యిప్పుడు తానే సూర్యునికొడుకు తనకు దిక్కుగాఁగోరుచున్నాఁడు.

కం. దీనశరణ్యుఁడు ధర్మవి, తానైకసువత్సలుండు ♦ దశరథుఁ డా భూ
జానిసుతుండు శరణ్యుఁడు, వానరపతి శరణుఁ జొచ్చె ♦ వాయుతనూజా. ౧౯౦
ధర్మవితానైక = ధర్మసమూహములందే - వత్సలుఁడు = ప్రేమగలవాఁడు-

తాత్పర్యము.

దీనరక్షకుఁడు, అనేకధర్మములు రక్షించినవాఁడు దశరథుఁడు - అట్టివాని కుమారుఁడు రక్షకుఁడు నగువాఁడు హనుమంతా! కీశరాజు శరణుజొచ్చెను-

కం. లోకంబుల కన్నింటికిఁ, బ్రాకటశరణంబునగు శ♦రణ్యుం డగు నీ
కాకుత్స్థుఁడు మద్గురువు ది,వాకరసుతు శరణుఁ జొరఁగ ♦ వచ్చెం జుమ్మా. ౧౯౧

తాత్పర్యము

లోకంబుల కన్నింటికి రక్షకుఁడు శరణు చొర యోగ్యుఁడును నా గురువు నగు నీ రామచంద్రమూర్తి సూర్యపుత్రుని శరణుజొరఁగ వచ్చెను. ఇందును బరత్వము సూచితము. లోకముల కన్నిటికి రక్షకుఁడు సుగ్రీవునకు రక్షకుఁడేకదా యనిభావము.

కం. ఎవనిప్రసాదంబున నీ, కువలయమున జనము లెల్లఁ ♦ గొఱలు సుఖిత నా
యవనీవిభుఁ డగు రాముఁడు, సవినయముగఁ గిశపతి ప్రి♦సాదముఁ గోరెన్ ౧౯౨
కువలయమునన్ = భూచక్రమునందు

తాత్పర్యము.

ఎవని యనుగ్రహముచే నీ భూలోకమునఁ గల జనులకెల్ల సుఖము గలుగునో యట్టి ప్రభువు శ్రీరామచంద్రమూర్తి వినయముతోఁ గోతిరాజు ననుగ్రహము కోరుచున్నాఁడు.

ఉ. మానితసర్వసద్గుణస♦మంచితు లౌ ధరణీవరాగ్రిణుల్
మానుగ వేనిచేత బహు♦మానము గౌరవ మందు చుండి రా
దానివరేణ్యుఁ డౌ దశర♦థప్రభుపుత్రుఁడు లోకవిశ్రుతుం
డీ నయశీలుఁ డిప్పుడు క♦పీశ్వరునిన్ శరణంబుఁ జొచ్చెడిన్. ౧౯౩

మానిత = గౌరవింపఁబడిన, సర్వసద్గుణ = సమస్తములైన మంచి గుణములచే, సమంచితులు = ప్రకాశించువారు, దానివరేణ్యుఁడు = దాతలయందు శ్రేష్ఠుఁడు, లోకవిశ్రుతుండు = ప్రపంచమునఁ బ్రసిద్ధికెక్కినవాఁడు, నయశీలుఁడు = నీతితోఁ గూడిన యాచారము గలవాఁడు.

తాత్పర్యము.

సమస్త సద్గుణ సంపత్తిచేఁ బూజ్యులైన రాజు లెవ్వనిచే గౌరవింపఁబడు చుండిరో యట్టియుత్తమదాత దశరథ నందనుఁడు రాముఁడని లోకమునఁ గీర్తిగాంచిన వాఁడు క్రోఁతితేని శరణు చొచ్చుచున్నాఁడు.

ఈ పద్యంబులం దన్నిట భగవత్సౌశీల్యము వర్ణితము.

౪౦. శోకాభిభూతుఁ డగు సుశ్లోకుఁడు సుగ్రీవు శరణుఁ ♦ జొచ్చెను గరుణా
లోకనముల నతఁ డీతనిఁ, జేకొను టర్హం బటంచుఁ ♦ జెప్పుచు జాలిన్. ౧౪౪

శోక + అభిభూతుఁడు = దుఃఖమునకు లోపడినవాఁడు, సుశ్లోకుఁడు = మంచి కీర్తిగలవాఁడు. కరుణాలోకనములన్ = దయతోఁగూడిన చూపులచే, జాలిన్ = శోకముచే.

తా త్ప ర్య ము.

మంచికీర్తి సంపాదించిన యీయన శోకవశుఁడై సుగ్రీవు శరణుఁజొచ్చెను. ఆయన యీయనను దయార్ద్ర దృష్టులచేఁ జేపట్టఁదగును అని శోకముచే,

ఉ. కన్నుల బాష్పపూరములు ♦ గార్చెడి లక్ష్మణుతోడ వాయుజుం
డిన్నెఱి యీ జితేంద్రియత ♦ యీ మతివైభవ మిట్టి శీలసం
పన్నత గల్గు మిమ్ముఁ దన ♦ భాగ్యమునన్ రవిజుండు గన్గొనెన్
సన్నుతశీలురార! హరి♦సత్తము వృత్తము నాలకింపుఁడీ. ౧౪౫

బాష్పపూరములు = కన్నీటిప్రవాహములు, నెఱి = పరాక్రమము, మతివైభవము = బుద్ధిసంపద, శీలసంపన్నత = సదాచారసంపత్తి, హరిసత్తము వృత్తము = వానర శ్రేష్ఠుఁడైన సుగ్రీవు చరిత్రము.

తా త్ప ర్య ము .

రెండుకన్నుల నీళ్ళు కాలువలుగాఁ గార్చుచున్న లక్ష్మణుఁ జూచి హనుమంతుఁడు ఈ పరాక్రమము ఈ యింద్రియజయము ఈ బుద్ధిసంపద యిట్టి సదాచారసంపత్తి గల మిమ్ముఁ దన యదృష్టముకొలఁది సుగ్రీవుఁడు చూచెను. సజ్జనస్తోత్ర పాత్రమగు నడవడి గలవారలారా! యిఁక సుగ్రీవుని చరిత్రము చెప్పెద వినుఁడు.

ఉ. అన్నగు వాలి సూడు గొని ♦ హావడి పెట్టి పురంబు వెల్వడన్
దన్ని తదీయభార్యను న♦ధర్మమునన్ హరియింపఁ గాన నా
పన్నతఁ గుందె మీ కిపు డ♦వశ్యము సాయముఁ జేయు జానకిం
బన్నగ రోయుకార్యమున ♦ మాదృశకీశసహాయసంపదన్. ౧౪౬

సూడు = పగ, హావడి = బాధ, ఆపన్నతఁ గుందెన్=దుఃఖించుచున్నాఁడు. రోయుకార్యమునన్ = వెదకుపనియందు మాదృశ = మావంటి, కీశ=క్రోఁతులను, సహాయసంపదన్ = తోడుపడువారి బలిమిచే.

తా త్ప ర్య ము.

తనయన్నయగు వాలి పగపట్టి బాధపెట్టి యూరువెడలఁగొట్టి యతనిభార్యను నధర్మపద్ధతిని హరించుటచే నడవులందుఁ గీడుదశ ననుభవించుచున్నాఁడు. సీతాదేవిని వెదకు కార్యమునందు మా వంటిక్రోఁతులను సహాయులుగాఁ దీసికొని మీకుఁ దప్పక సాహాయ్యము చేయఁగలఁడు.

క౦.అని తేనె లొలుకు పలుకులు, హనుమయు రాఘవునిఁ జూచి ♦ యనియెఁ మరలన్
జనుదెండీ సుగ్రీవునిఁ, గనుఁగొన నన లక్ష్మణుండు ♦ కపిపుంగవునిన్. ౧౪౭

తా త్ప ర్య ము.

అని తియ్యనిమాటలు చెప్పి లక్ష్మణునిఁ జూచి మఱియు సుగ్రీవునిఁ జూడఁ బోదము రండు అనఁగా లక్ష్మణుఁడు, హనుమంతుని,

చం.అలరుమనంబుతోడుత స♦మర్హ విధిం గొనియాడి రాముతోఁ
బలికె మరుత్తనూభవుఁడు ♦ భవ్యమనస్కుఁడు సత్య మాడెడిన్
గలదు వనాటనాథునకుఁ ♦ గార్యము నీ వొనరింపఁ గానఁ బే
రెలమిని బొందు మింకఁ గృత♦కృత్యుఁడ వైతివి నీవు రాఘవా. ౧౪౮

మరుత్తనూభవుఁడు = వాయుపుత్రుఁడు, భవ్యమనస్కుఁడు = మేలుచేయు మనస్సుగలవాఁడు, సత్యమాడెడిన్ = నిజము చెప్పుచున్నాఁడు, వనాటనాథునకున్ = వానరపతికి, ఎలమిని = సంతోషము, కృతకృత్యుఁడవైతివి = నెఱవేఱిన కార్యము గలవాఁడవైతివి.

తా త్ప ర్య ము.

సంతోషము తోడి మనస్సుతోఁ దగినరీతి హనుమంతుఁ బొగడి యన్నా! హనుమంతుఁడు యథార్థము చెప్పుచున్నాఁడు. సుగ్రీవునకు నీ వలనఁ గావలసిన కార్యము గలదు. కావున సంతోషపడుము. నీకార్యము నెఱవేఱిన దని తలంపుము.

ఇంతవఱకు వీరి నొక సందేహము బాధించుచుండినది. ప్రత్యుపకారము లేక సుగ్రీవుని వలన నుపకారము పొందవలసి వచ్చునేమో, అప్పుడు కార్యము చేయుట చేయకుండుట యతని చిత్తవృత్తి సందర్భానుసారముగా నుండునుగదా! నేనే కష్ట దశలో నుండఁగా నేనేమి మీకు సాహాయ్యము చేయఁగల నను నేమో యను సందేహము బాధించుచుండినది. ఇప్పుడు హనుమంతుని వలన నా కొఱకు దీఱినది. ఉప కారమునకుఁ బ్రత్యుపకారముగ నైనది కావున నుభయుల కార్యములు చక్కఁబడె నని లక్ష్మణుఁడు సంతోషించెను.

ఉ. మోము ప్రసన్నభావమును ♦ మోదమునం బలుకాడు భంగులన్
సామము మీఱ వ్యక్తముగఁ ♦ జల్పుప్రసంగముభంగిఁ జూడఁగా
నేమియు మోస మీ కపికు♦లేశ్వరునందుఁ గనంగరాదు రా
మా! మన మిప్పు డందుఁ బద♦మా హనుమంతుఁడు కోరునట్లుగన్. ౧౪౯

తా త్ప ర్య ము.

వీఁడు చెప్పునది యెంతమాత్రము నిజమో నమ్మకెట్లందువా! మోసగాండ్ర యం దుండ వలసిన తీరొక్కటియు వీనియందులేదు. మాటలు మోసపు మాటలు చెప్పినా యింగితమువలన వాస్తవ విషయము తెలిసి కొనవచ్చును. ముఖవికారా దులు దోఁపలేదు. (యుద్ధ 3౪౯-3౬౦ పద్యములు చూడుఁడు.) ఒకవేళ నితఁడు

చెప్పినది యసత్యమే యనుకొందము? దానివలన మనకు రాఁగలనష్ట మేమియులేదు. వీనివలనఁ గార్యమైనఁ గానిమ్ము. కాకుండినఁ బోనిమ్ము. మనమున్నదశకంటెఁ దక్కువ దశ రాఁబోదు. అయినను మాటలాడు నపుడు ముఖమొక విధముగాఁ బ్రసన్నముగా నున్నది. మాటలా సంతోషముతోఁ గార్యమును సాధించిన వానివలె మాటలాడు చున్నాఁడు. సందేహింప నెడము లేకుండునట్లు స్పష్టముగ సాధుభావముతోఁ బ్రసంగించు చున్నాఁడు. ఈ యింగితాదులనుబట్టి చూడ నితఁడు మోసగాఁడు కాఁడని నా యభిప్రాయము. కావున హనుమంతుఁడు కోరినట్లు మనము సుగ్రీవునొద్దకుఁ బోదము.

చం. అనవుడు రామచంద్రుఁడు త♦థాస్తన మారుతి భిక్షురూపుఁ జ
య్యన విడి నైజరూపమున ♦ నయ్యినవంశ్యుల నంసదేశమం
దునిచి ప్రహృష్టుఁడుౙ సుమతి♦యుగ్రజవుండు యశస్వి సూర్యనం
దనుఁడు చరించు చున్నెడ కు♦దారగతిం జని డించె వారలన్. ౧౫౦

తథా+అస్తు=అట్లులే యగునుగాక, భిక్షురూపు=సన్న్యాసియాకారము, చయ్యన విడి=వెంటనే వదలిపెట్టి, నైజరూపమునౙ=స్వభావమైన తనయాకారముతో, అంసదేశమందుౙ=భుజములమీఁద, ప్రహృష్టుఁడు=తాను వచ్చినపని సుగ్రీవుకార్యము నెఱవేఱెఁగదా యని మిగుల సంతోషించినవాఁడు, సుమతి=వంచనలేని మనస్సుగలవాఁడు, ఉగ్రజవుండు = మిగుల వేగముగఁ బోఁగలవాఁడు, యశస్వి = కీర్తిమంతుఁడు, ఉదారగతిౙ = గమనమం దాలస్యము లేక, దీనిచే భగవత్ప్రాప్తి యాచార్యాధీన మని యేర్పడుచున్నది.

తాత్పర్యము.

అని లక్ష్మణుఁడు చెప్పఁగా రామచంద్రమూర్తియు నట్టులే కానిమ్మనెను. అంతట నాంజనేయుఁడు తన సన్న్యాసిరూపము వెంటనే వదలి తన క్రోఁతిరూపము ధరించి యా యిరువురను భుజములపై నెక్కించుకొని తాను వచ్చినకార్యము సుగ్రీవుని కార్యము నెఱవేఱెఁ గదా యని మిగుల సంతోషించినవాఁడై నిర్మలమైన మనస్సుతో రామునికృపచేఁ గీర్తి సంపాదించినవాఁడై మహావేగముతో గమనవిలంబనము లేక తీసికొనిపోయి సుగ్రీవుఁడు తిరుగుచున్న చోట దించెను.

## —{ ౫-వ సర్గము. హనుమంతుఁడు రామలక్ష్మణులను సుగ్రీవుకడకుఁ దీసికొని పోవుట. }—

ఉ. ఆయెడ వారి డించి దివ♦సాధిపనందనుఁ జేరి సూర్యజా!
యీ యనఘుండు రాముఁడు సు♦మీ మతిమంతుఁడు నిన్ను డాయ మి
త్రాయితతేజుఁ డౌ ననుఁగుఁ♦దమ్ముఁడు లక్ష్మణుతోడ వచ్చె వి
న్నాయతసత్యశౌర్యుఁడు మ♦హాత్ముఁడు సూర్యకులప్రజాతుఁడున్. ౧౫౧

ఆయెడన్ = ఋశ్యమూకమునందు, ఋష్యమూకమునుండి రామలక్ష్మణులఁ జూచి సుగ్రీవుఁడు ఋశ్యమూకములో నొకభాగ మగు మలయపర్వతమునకుఁ

బోయెను. హనుమంతుఁడు ఋశ్యమూకమందు రామలక్ష్మణుల డించి సుగ్రీవు నొద్దకుఁ బోయి యతనిని బిలిచికొని వచ్చెను. దివసాధిపనందనుః = సుగ్రీవుని, అనఘుండు = నీవు సందేహించిన పాపములేనివాఁడు, రాముఁడు పరులను సంతోష పెట్టుటే ముఖ్యకార్యముగాఁ గలవాఁడగుటచే రాముఁడని పేరుపొందినవాఁడు, మతి మంతుఁడు = ఆలోచనపరుఁడు, నీవలెఁ దొందరపడువాఁడు కాఁడు. మిత్రాయిత తేజుఁడు = సూర్యుని వంటి తేజస్సుగలవాఁడు, అనుఁగుఁ దమ్ముఁడు = కూరిమిగల తమ్ముఁడు, ఆయత = విస్తారమైన, సత్యశౌర్యుఁడు = సత్యము, శౌర్యము; సత్యమైన శౌర్యము; సత్యమే శౌర్యముగాఁ గలవాఁడు, మాటచెప్పనఁ దప్పువాఁడుగాఁడు, మహాత్ముఁడు = గొప్ప మనస్సు ధైర్యము, స్వభావము,బుద్ధిగల పరమాత్మ, 'ఆత్మా యత్న ధృతి స్వాంత స్వభావపరమాత్మసు జీవబుద్ధి శరీరేషు,' నానా. కావున మహాత్ముఁడనఁగా గొప్ప ప్రయత్నము గలవాఁడు. పూనిన ప్రయత్నము సాధింపక విడుచువాఁడుకాఁడు. ఆశ్రిత జీవరక్షణమందు దృఢప్రయత్నము గలవాఁడు.

మహాత్మ = గొప్పధైర్యముకలవాఁడు, కార్యము పూనుకొనిన పిమ్మట నెన్ని విఘ్నములు వచ్చినను భయపడి కార్యము చాలించుకొనువాఁడు కాఁడు.

మహాత్మ = గొప్ప మనస్సుగలవాఁడు. ఆశ్రిత ఆర్తజనరక్షణ మందే మనస్సు గలవాఁడు, క్షుద్రాలోచనలు లేనివాఁడు. మహాత్మ = గొప్ప స్వభావముగలవాఁడు, పరత్వదశయందుఁగాని యవతారదశయందుఁగాని పరంభావము విడుచువాఁడుకాఁడు.

మహాత్మ = జీవాత్మలకెల్ల నాత్మయైయుండు పరమాత్మ.

మహాత్మ=గొప్పబుద్ధిగలవాఁడు. సత్యకాముఁడని సత్యసంకల్పుఁడని చెప్పఁ బడినవాఁడు.

మహాత్మ= మన ప్రాకృత శరీరమువంటి శరీరము గలవాఁడుకాఁడు. అప్రాకృత దివ్యమంగళ విగ్రహుఁడు కావున నీవు 'అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రిత' మ్మన్నట్లు శరీరము చూచి మోసపోవలదు.

సూర్యకుల ప్రజాతుఁడు = సూర్యవంశమున బుట్టినవాఁడు. కావున నీవును సూర్యపుత్రుఁడవు కావున మీకు స్నేహముచేయ యోగ్యుఁడు.

## తాత్పర్యము.

సుగ్రీవుఁడు తిరుగుచోట నొకప్రదేశమున వారిని డించి సుగ్రీవునొద్దకుఁ బోయి సుగ్రీవా! యీ రాముఁడే పాప మెఱుఁగనివాఁడు సుమా! నీవు సందేహించిన దోష మితని యందు లేదు. మిగుల నాలోచనపరుఁడు. సూర్యతేజస్సుగల తమ్ముఁడు లక్ష్మణు నితో నీయన నీ యొద్దకు వచ్చెను. ఈయన సామాన్యుఁడని తలఁపకుము- విస్తార మైన సత్యము శౌర్యము- సత్యమైన శౌర్యము, సత్యమే శౌర్యముగాఁ గలవాఁడు ఈయన సాక్షాత్తు పరమాత్మ యనుకొమ్ము. సూర్యవంశమునఁ బుట్టినవాఁడు.

క. రాముఁడు తేజోజితసు, త్రాముఁడు దశరథసుతుండు ♦ ధర్మమతిఁ ని
స్సీముఁడు పితృవాక్కరణో, ద్దాముఁడు సతితోడ విపిన♦ధరఁ దిరుగు నెడన్. ౧౫-౨

తేజోజితసుత్రాముఁడు=తేజస్సుచే జయింపఁబడిన యింద్రుఁడు గలవాఁడు- నిస్సీముఁడు = మేరలేనివాఁడు- పితృవాక్కరణోద్దాముఁడు=తండ్రి వాక్యము పరిపాలించుటయందు గొప్పవాఁడు- విపినధరఁ = అడవిప్రదేశమందు.

తాత్పర్యము.

ఈ రామచంద్రమూర్తి యింద్రుని జయించిన తేజస్సు గలవాఁడు. దశరథుని కొడుకు. ధర్మబుద్ధియందు మేరలేనివాఁడు. పితృవాక్య పరిపాలనమందు దక్షుఁడు. ఇట్టివాఁడు భార్యతో నడవులలోఁ దిరుగుచుండఁగా.

రామలక్ష్మణులఁ జూచి సుగ్రీవుఁడు భయపడె ననుటచే భగవంతుఁడు మనము చేయు కర్మములకొలఁది ఫలమిచ్చునే మన మాయన యాజ్ఞమీఱి యపరాధములే చేసితిమే! మనల నేమి దండించునో యని భయపడిన జీవుని చరిత్రము చెప్పఁబడెను. అప్పుడాచార్యుఁ డా జీవుని జూచి నిష్కారణముగా నేల భయపడెదవు, అనిధైర్యము చెప్పి భగవదనుగ్రహము సంపాదించుకొని జీవునొద్దకు వచ్చి భగవంతుని గుణముల వర్ణించి చెప్పి నీవుపోయి వారిని బూజించిన నిన్నురక్షించునని యాచార్యుబోధ యిందుఁ దెలుపఁబడెను.

కం. రావణ హృతనిజదారుఁడు, పావనతర రాజసూయ♦వరమఖముఖ దీ
క్షావిధిని శతసహస్రము, గోవుల దక్షిణల నిచ్చి ♦ గురుమతితోడన్. ౧౫3

రావణహృత = రావణాసురునిచే హరింపఁబడిన, నిజదారుఁడు = తన భార్య గలవాఁడు, ఇఁకఁ జెప్పఁబోవు నవి దశరథుని గుణములు, పావనతర = మిగులఁ బవిత్రములైన, రాజసూయ...విధిని=రాజసూయము మొదలగు గొప్ప యజ్ఞములందు దీక్ష వహించి, శతసహస్రము = నూఱువేలు.

తాత్పర్యము.

ఈయన రావణాసురునిచేఁ దన భార్యను గోలుపోయెను. ఈయనతండ్రి దశరథుఁడు, పాపహరములైన రాజసూయాది యాగములు చేసి వేలకొలఁది నావుల దక్షిణలతో దానముచేసెను.

కం. తపమున సత్యబలంబున, విపులాచక్రంబు నేలి ♦ విపులయశుం డౌ
నృపతితనూజుం డీ యెడఁ గపివర! నీ శరణుఁ జొరఁగ ♦ గమకించెఁ జుమీ. ౧౫౪

విపులాచక్రంబు = భూచక్రము, విపులయశము = విస్తారకీర్తి, నృపతి =దశరథునియొక్క, తనూజుఁడు = కొడుకు, గమకించెఁ = యత్నించెన్. మీఁదఁ జెప్పబడిన విశేషణము లీ నృపతిశబ్దంబుతో నన్వయింపవలెను. ఇట్టి రాజుయొక్క కుమారుఁడని యన్వయము. ఇది యేకదేశి సమాసముగాదు.

తా త్ప ర్య ము.

తపముచేతను సత్యముయొక్కబలముచేతను భూచక్ర మంతయుఁ బాలించి విస్తారముగఁ గీర్తి సంపాదించిన రాజుయొక్క కుమారుఁడు. ఇట్టివాఁ డిప్పుడు నీ రక్షణముఁ గోరి నాలోచించుచున్నాఁడు.

ఆ. పూజనీయతముఁలు♦పురుషోత్తములు రామ, లక్ష్మణులు కపీంద్ర ♦ లలితయశులు
నీదు చెలిమిఁ గోరి♦ నేఁ డిట వచ్చిరి, చేరఁ జనుము పూజ ♦ సేయు మనిన. ౧౫౫

తా త్ప ర్య ము.

వీరు పూజ్యులలో నుత్తములు. ఇంతకు మించినవారు లేరు. పురుషులకంటె నుత్తములు. మనకు గోచరించు జీవులవంటివారు గారు. అందమైన కీర్తిగలవారు. నీ స్నేహము గోరి యిచ్చటికి వచ్చిరి. కావున నీవు పోయి వారిని బూజింపుము. ఇది యాచార్యకృత్యము. ఇఁక జీవకృత్యము చెప్పఁబడుచున్నది.

—♦ సుగ్రీవుఁడు శ్రీరామలక్ష్మణులతో సంభాషించుట ♦—

కం. పావని వాక్యంబుల సు,గ్రీవుఁడు రాఘవులవలని♦ కెరలిడి భీతిన్
బో విడిచి సంతసంబునఁ, బావనమగు మనుజరూపు ♦ పరఁగఁగ వచ్చెన్. ౧౫౬

పావని = ఆంజనేయుని, పవిత్రుఁడు.

తా త్ప ర్య ము.

ఆంజనేయుని మాటలు విని సుగ్రీవుఁడు రామచంద్రమూర్తివలనఁ గలిగిన భయము వదలి సంతోషముతో మనుష్యస్వరూపము ధరించి త్వరగా వచ్చెను. నిర్మలమనస్కుఁడై న గురువుచెప్పినమాట విని యా మాటలయందు శ్రద్ధగలవాఁడై శిష్యుఁడు జీవుఁడు తన కిఁకఁ గర్మములవలనఁ గలుగు శిక్ష భయములే దని సంతోషించి స్వామిని సమీపించుట యిందుఁ జెప్పఁబడెను.

కం. వచ్చి రఘూత్తములకుఁ దా,నచ్ఛపుమతి నర్చ లిచ్చి ♦ యనురాగము పెం
పెచ్చఁగ రామునిఁ గనుఁగొని, యచ్చండకరాత్మజాతుఁ ♦ డను నీ రీతిన్. ౧౫౭

అచ్ఛపుమతిన్ = నిర్మలమైన మనస్సుతో, అర్చలు=పూజలు, చండకరాత్మజాతుఁడు=సూర్యునికొడుకు, సుగ్రీవుఁడు.

తా త్ప ర్య ము.

ఇట్లు రామలక్ష్మణుల సమీపించి యనురాగ మతిశయింపఁ బూజించి రామచంద్రమూర్తిని జూచి సుగ్రీవుఁ డిట్లనియె.

దీనివలన భగవంతుని నిర్మలమనస్సుతో సమీపింపవలయు ననియు సమీపించి నిద్రాతివలె నిలఁబడక వందనారాధనలచే నర్చింపవలయు ననియు, నది యనురాగయుక్తముగ నుండవలె ననియు, భగవంతుఁడు పరిచారయుక్తుఁడై యుండునపుడు వారిని బూజింపవలయు ననియు నేర్పడుచున్నది. స్వామి నాకుఁజాలు, పరిచారకులతో నేమిపని యనరాదు.

కం. వీరుల రని ధర్మగుణో,దారుల రని సర్వభూత♦తతవాత్సల్యా
ధారుల రని చెప్పెను సా,మీరి యథార్థంబు భవద♦మేయగుణాళుల్. ౧౫౮

ధర్మగుణోదారులు = ధర్మగుణమందు గొప్పవారలు - సర్వభూతతతవాత్స ల్యాధారుల రని = అన్నిజీవకోట్లయందు వ్యాపించియుండు వాత్సల్యమునకు నాధార భూతు లని- సామీరి=సమీరు కుమారుఁడు - అపత్యార్థకతద్ధితము - ఆంజనేయుఁడు -

తా త్ప ర్య ము.

మీరు వీరు లని, గొప్పధర్మగుణము గలవారని, సమస్తజీవకోటులందు వాత్స ల్యము గలవారలని, మీలెక్కింపరాని గుణములను హనుమంతుఁడు సత్యము చెప్పెను.

ఇది గురువాక్యము నందలి శ్రద్ధయును దానిని దృఢపఱుచు కొనుటయుఁ దెలుపుచున్నది.

ఉ. మానవలోకపాలకకు♦మారకులార! మహాత్ములార! యీ
వానరుతోడ సఖ్యమును ♦ వారక మీరు ఘటింప నెంచినన్
మానుగ నింతకంటె బహు♦మానము నుత్తమలాభ మెందు న
న్నానునె? నేనె ధన్యుఁడను ♦ నొక్కటి చెప్పెద విన్ము రాఘవా! ౧౫౯

తా త్ప ర్య ము.

ఓరాజకుమారులారా! మహాత్ములారా! యీకోఁతితోడ మీరు స్నేహము చేయ నభిప్రాయము గలదేని నా కింతకంటె గౌరవ ముత్తమలాభము వేఱొకటి యుండునా? నేనే కృతకృత్యుఁడను. అయినను నొకటి చెప్పెద వినుము.

రామా! నీవు నాతో స్నేహము చేసినచో రాముని స్నేహితుఁడు సుగ్రీవుఁడని గౌరవలాభములు నాకేకాని, నావలన నీకు గౌరవలాభములు గాఁబోవు-ఆకారణముచే నేనే ధన్యుఁడను - నా జన్మమే సార్థకము.

—♦ శ్రీరాముఁడు సుగ్రీవునితో సఖ్య మొనర్చుట ♦—

క. నాతోడ నెయ్య మూనఁగ, భ్రాతలవర! నీకు నిండు♦సమ్మతి మేనిన్
జేతను జెయి వైవుము నా చేతిని నిదె సాఁచినాఁడ ♦ స్థిరమర్యాదన్. ౧౬౦

నెయ్యము = స్నేహము.

తా త్ప ర్య ము.

రామచంద్రా! నాతో స్నేహముచేయ నీకు సంపూర్ణాభిప్రాయము గలదేని నా చేతిలో నీ చేతిని వైవుము. ఇదే నాచేతిని స్నేహధర్మమర్యాదప్రకారము చాఁచి నాఁడను. ఇది యుభయహస్తప్రదాన ప్రార్థనము.

సంసారావర్తవేగ ప్రశమన శుభదృగ్దేశిక ప్రేక్షితోహం
సంత్యక్తోన్యై రుపాయై రనుచిత చరితేష్వద్య శాంత్యాభిసంధిః
నిశ్శంకం తత్త్వ దృష్ట్యా నిరవధికదయం ప్రాప్య సంరక్షకం త్వా
న్యస్య త్వ త్పాదపద్మే వరద నిజభరో నిర్భయో నిర్భరోస్మి.

అను శ్లోకార్థ మిచట ననుసంధించునది.

అభయహస్తము గోరఁ గారణమేమన నేనా యల్పుఁడను, చపలచిత్తుఁడను-సర్వదా దోషములే చేయుచుండువాఁడను- నీవు రక్షకుఁడ వని నీయొద్దఁ జేరితిని- నా దుర్గుణములు స్మరించి ఛీ యిది నీచసహవాసము, మన యోగ్యతకుఁ దగినది కాదు, అని నీవు చేయి విడిచిన నే నన్నిటఁ జెడినవాఁడ నే కావున నా దోషముల క్షమించి నా చేతిని బట్టుకొమ్ము, అని భావము.

కం. ఆ వచనము విని రాముఁడు, భావంబున నలరి తనదు♦పాణితలము సు

గ్రీవుకరంబున నిడి సం,భావించెను హృద్యమైత్రిఁ ♦ బరిరంభించెన్. ౧౬౧

తా త్ప ర్య ము.

ఆ మాట విని రామచంద్రమూర్తి వీఁడు నిర్మలమనస్కుఁ డని మనస్సున సంతోషించి తన యరచేతిని సుగ్రీవు నరచేతియం దుంచి గౌరవించి నిండు మనస్సు గల స్నేహముతోఁ గౌఁగిలించెను.

కౌఁగిలించుకొనుట సాయుజ్యముక్తిని సూచించుచున్నది. దీనివలన శ్రీరామచంద్రుఁ డనన్యభక్తిగలవారిని భగవంతుఁ డనుగ్రహించి సాయుజ్య మిచ్చునని యేర్పడుచున్నది.

కం. భిక్షుకరూపం బంతట, వృక్షచరవరుండు హనుమ ♦ వీడి సమిధలన్

సాక్షాత్కపిరూపంబున, నా క్షణ మొడఁగూర్చి నగ్ని♦ నందు రగిల్చెన్. ౧౬౨

భిక్షుకరూపము = సన్న్యాసివేషము, రామలక్ష్మణులను వానర రూపముతోనే ఋశ్యమూకమునకుఁ దెచ్చి మరల సుగ్రీవుని విశ్వాసమునకై యతఁడు చూచియుండిన సన్న్యాసిరూపము ధరించి యతని యొద్దకుఁ బోయి యతనిని బిలుచుకొని రామలక్ష్మణులయొద్దకుఁ బోయెను. ఇట్లు చేయుటవలన సుగ్రీవుఁడు తాను జెప్పినట్లు చేసెనని విశ్వసించు టేకాక యితఁడు మనలను మోసగింప నీవేషము వేసినవాఁడు కాఁడు. తన స్వామియొద్ద నిట్లుండఁ గలడు. ఇది మోసకృత్యము కాదని రామలక్ష్మణులును విశ్వసించిరి. వృక్షచరవరుండు=వానరశ్రేష్ఠుఁడు, సమిధలన్ = చంద్రకట్టెలను.

తా త్ప ర్య ము.

ఆంజనేయుఁ డంతట సన్న్యాసిరూపము వదలి క్రోఁతిరూపము ధరించి చంద్రపుల్లలను దెచ్చి మంట చేసెను.

కం. గనగన మండెడి వహ్నికి, వనసుమముల నర్చ లిచ్చి ♦ వారినడుమఁ బా

వని నిలుప రామరవిజులు, నినుమారు తమిం బ్రదక్షి♦ణించిరి యర్థిన్. ౧౬౩

తా త్ప ర్య ము.

గనగన మండెడు నగ్నిహోత్రమును వారి యిరువుర నడుమ హనుమ నిలుపఁగా రామ సుగ్రీవు లడవిపూలచేఁ బూజించి యొకరిచేతి నొకరు పట్టుకొని యానక్తితో నగ్నికిఁ బ్రదక్షిణించిరి.

'పాణిం గృహీష్వ పాణినా' యన్నట్లు సుగ్రీవునిపాణిని రామచంద్రమూర్తి పట్టుకొనుట, యిరువురు గలసి యగ్నిహోత్రునిఁ బూజించుట, యిరువురు చేతులు పట్టుకొని ప్రదక్షిణించుట, యివియన్నియు భార్యను విడువనని ప్రమాణముచేసిన భర్త కర్మములుగా నున్నవి, కావున, రామచంద్రుఁడును సుగ్రీవుని నిన్ను నేను జేయి విడువను. భార్య భర్తకు వలె నీవు నాకు భర్తవ్యుఁడ వని గ్రహించినట్టు లాయెను.

కం. నీవాఁడని యొకపరియే ♦ యేవాఁడేఁ శరణు వేఁడెనేని సకల భూ
తావళి కభయంబును నే♦వావిరి ఘటియింతు నిదియ వ్రతమగు నాకున్॥

యుద్ధ. ౩౮౭ ప.

గీ. మైత్రి భావించి తాన సం♦ప్రాప్తుఁడైన, వాని నెటులేని చేపీడు♦వాఁడఁగాను,
వానియెడ నుండెనేని నే♦దేని దోష, మద్ది గర్హ్యాంబుగాదు స♦దాళులకును.

యుద్ధ. ౩౬౫ ప.

ఇట్టి స్నేహముచేసి యిట్టి వ్రతముగల రామచంద్రమూర్తి వాలి సుగ్రీవుల పట్ల నెట్లు వర్తింపవలయునో బుద్ధిమంతు లాలోచింపఁదగు.

ఈ యర్థమునే హనుమంతుఁడు సుగ్రీవునకు

'తరలుము పుత్రమిత్ర సహితంబుగ నాతనిఁ జేరఁబోయి నీ, కరములు మోడ్చి మ్రొక్కు, సతి కాంతువశంబున నిల్చునట్లుగా హరివర నిల్వు' (కిష్కింధ ౮౯ ౧ప.) యిట్లు బోధించెను. దీనివలన సీతారక్షాభారమువలె సుగ్రీవరక్షాభారమును శ్రీరామచంద్రమూర్తి యెంతవహించెనో యెఱుఁగ నగు. ఈ కారణము చేత నే సీతాద్రోహివలె సుగ్రీవద్రోహియు రామునకు వధ్యుఁ డయ్యెను.

కం. నేస్తం బిటు ఘటియించి మ,నస్తాపముఁ బాసి వారు ♦ నందిత మతులై
శస్తశుభాలోకనముల, నిస్తుగ నొండొరులఁ గనుచుఁ♦ జెందరు తృప్తిన్. ౧౬౪

నేస్తంబు = స్నేహము, నందితమతులై = సంతోషించిన మనస్సులు గలవారై, శస్తశుభాలోకనములన్ = ప్రశస్తములై శుభకరములైన చూపులచే, ఇందును నూతన వధూవర ధర్మము సూచితము.

## తాత్పర్యము.

ఇటు రామసుగ్రీవులు స్నేహముచేసి వారి వారి హృదయంబులఁగల యారాటము విడిచి యిరువురు తమ కార్యములైనట్లు సంతోషించి యొకరి నొకరు ప్రేమపూరితములైన చూపులచేఁ జూచి చూచి తృప్తి పడరైరి.

చ. కలవునఁ బడ్డయట్లు రఘు♦కాంతుఁడు వానరకాంతుఁ డిట్లు పె
న్నుఱ వగు సంతసంబుమెయి ♦ నొండొరులన్ మెయిపుల్కజాదుకో
నెఱమతిఁ జూచు చుండఁ గపి♦నేత రఘూత్తముతోడ ని ట్లనున్
దొఱసితి నీదు చెల్మి మన♦దుఃఖసుఖంబులు పొందె నైక్యమున్. ౧౬౫

ఉఱవు = గొప్పది, మెయిపుల్కు జాదుకోఁ = దేహమునందు గగ్గురుపాటు నిండఁగా, ఐక్యము = సమానము, అనఁగా నీ సుఖమే నాసుఖము, నీదుఃఖమే నా దుఃఖమని భావము. రాముని దుఃఖము సుగ్రీవుని దుఃఖము కాఁజాలదు. రాముని సుఖము సుగ్రీవుని సుఖము గాఁజాలదు. ఎవరి సుఖదుఃఖములు వారివారివే- అయినను నొకరికి సుఖము వచ్చినపుడు వారెంత సంతోషింతురో రెండవ వారంత సంతోషింతు రనియు ఒకరికి దుఃఖము వచ్చినపుడు దానిచే వారెంత బాధపడుదురో రెండవ వారంత బాధపడుదురనియు భావము. సంతోషానుభవము దుఃఖానుభవము సమాన ములు. ఇది నిదర్శనాలంకారమువలె నని యెఱుంగునది చూ. ప. సుందర ౮౩౯. ఈ విషయ మచ్చటఁ జర్చింపఁబడును. పరమసామ్య ముద్దిష్టము.

తాత్పర్యము.

కఱవునఁ బడినవారివలె రామసుగ్రీవులు నిండారు సంతోషముచే దేహమునఁ బులకలెత్తుచుండ మనసారఁ జూచుచుండు సమయంబున సుగ్రీవుఁడు రామచంద్ర మూర్తితో నిట్లనియె. రామచంద్రా! నీ స్నేహము సంపాదించితిని. మన సుఖ దుఃఖ ములు సమానము లయ్యెను.

క. అని బహుపర్ణం బగు నొక, ఘనపుష్పితశాఖ విఱిచి ♦ కపికులపతి యు
ర్విని వైచి రాముతో నొ, య్యనఁ గూర్చుండె దాని♦యం దమలమతిన్. ౧౬౬

బహుపర్ణము = విశేషముగ నాకులు గలది, ఘనపుష్పిత శాఖ=విశేషించి పూచిన కొమ్మ.

తాత్పర్యము.

ఇట్లు చెప్పి యాకులు విశేషముగఁ గల నిండారపూచిన కొమ్మ నొక దాని విఱిచి నేలమీఁద వైచి దానిపై రామచంద్రమూర్తితోడఁ గూర్చుండెను.

కం. హనుమంతుండును నొకచం,దనశాఖం దేర రాము♦తమ్ముఁడు ప్రీతిన్
సనయముగ నందుఁ గూర్చుం,డెను నప్పుడు రాముతో వి♦నీతుండగుచున్. ౧౬౭

వినీతుఁడు = వినయముగలవాఁడు.

తాత్పర్యము.

అప్పుడు వా రట్లు గూర్చుండఁగా హనుమంతుఁడు చందనశాఖ నొకదాని విఱిచి తెచ్చివేయఁగా లక్ష్మణుఁడు దానిపైఁ గూర్చుండెను. అప్పుడు సవినయముగ సుగ్రీవుఁడు రామునితో నిట్లనియె.

—♦ సుగ్రీవుఁడు రామునితోఁ దనకు వాలి చేసిన యపకారముఁ జెప్పుట. ♦—

ఉ. నీరజమిత్రనందనుఁడు ♦ నెమ్మిఁ దలిర్పఁగ నిట్లు పల్కు నీ
తారమణా! మదగ్రజుఁడు ♦ దారుణవిక్రముఁడైన వాలి న
న్నీరస మెత్తి రాజ్యమున ♦ కెంతయుఁ బాపి, హరించి మత్సతిన్
గ్రూరత నెట్టఁ గొండలను ♦ గుట్టల నిట్టులు ప్రాణభీతి మై. ౧౬౮

మదగ్రజుఁడు = నాకు జ్యేష్ఠ భ్రాత, నాయన్న, ఈరసము = కోపము.

తాత్పర్యము.

రామచంద్రా! నాయన్నయగు వాలి భయంకరమైన పరాక్రమము గలవాఁడు, వాఁడు నాపైఁ గోపించి రాజ్యమునుండి పాపి నాభార్యను హరించి నన్ను నిర్దయుఁడై వెడలఁ గొట్టఁగఁ బ్రాణభయముచేఁ గొండలందు గుట్టలందు నిట్లల్లాడుచున్నాఁడను.

క. అల్లాడుచు నున్నాఁడను, జల్లనికరుణార్ద్రదృష్టి ♦ జనకసుతాహృ
ద్వల్లభ! వాలిభయం బెడఁ, బొల్లువడం బ్రాణదాన♦మును నా కిమ్మా. ౧౯

తాత్పర్యము.

నన్నుఁ గరుణార్ద్రదృష్టులఁజూచి వాలిభయము నా మనస్సున లేకుండఁజేసి నా ప్రాణముల రక్షింపుము.

జనకసుతాహృద్వల్లభ యనుటచే నీ భార్యను బరుఁ డపహరించుటచే నీ వెట్లు బాధపడుచున్నావో నాభార్య పోవుటచే నే నట్లు బాధపడుచున్నాను. ఇది సుఖదుఃఖములయైక్యము. సీతాదేవిని గోలుపోవుటవలనఁ గలిగిన దుఃఖము సుగ్రీవునకు లేదు. సుగ్రీవుని భార్యను వాలి హరించుటచే సుగ్రీవునకు గలిగిన దుఃఖము రామునకు లేదు. భార్యావియోగదుఃఖ మిరువురయందు సమానము. నా దుఃఖమువంటి దే కదా యెదుటివారి దుఃఖ మని భావము. ౧౨౦

క. అనవుడు ధర్మజ్ఞుండును, ఘనధర్మసువత్సలుండు ♦ కాకుత్థ్సుం డా
ననమున నెలన వ్వొలయఁగ, వనచరనాథునకుఁ బ్రీతి ♦ వఱలఁగఁ బలికెన్.

ఎలనవ్వు= చిఱునవ్వు- ఎంతో గొప్పకార్య మని తలఁచితినే, యింతటి యల్ప విషయమా, నావలన వీఁడు కోరు సాహాయ్య మని చిఱునవ్వు.

తాత్పర్యము.

అని సుగ్రీవుఁడుచెప్పఁగా స్నేహధర్మము తెలిసినవాఁడును అంతకంటెగొప్పది యగు శరణాగత రక్షణ ధర్మమందు మిగులఁ బ్రేమగలవాఁడును దేవతల రక్షించు కకుత్థ్సుని వంశమునఁ బుట్టినవాఁడునగు శ్రీ రామచంద్రమూర్తి నేను జేయవలసిన దీ యల్పకార్యమా యని చిఱునవ్వునఁ బ్రీతితో సుగ్రీవున కిట్లనియె.

—♦ శ్రీ రాముఁడు సుగ్రీవునితో వాలిం జంపఁ బ్రతిజ్ఞఁ జేయుట. ♦—

కం. ఉపకారఫలము మిత్రము, కపినాయక! నేను జక్కఁ♦గా నెఱుఁగుదు నీ
చపలాక్షిని హరియించిన, విపరీతచరిత్రుఁ డ్రుంతు ♦ వెఱనకు వాలిన్. ౧౨౧

ఉపకారఫలము = ఉపకారమే ఫలముగాఁగలది, విపరీతచరిత్రుఁ = ధర్మవిరుద్ధకార్యమును జేసినవానిని.

తా త్ప ర్య ము.

మిత్రుఁడను వాఁ డుండుటకు ఫల మేమనఁగా నుపకారము చేయుట. ఇది నేను బక్కఁగా నెఱుఁగుదు. కావున నీ భార్యను హరించిన ధర్మవిరుద్ధచరిత్రుని వాలిని జంపెదను, భయపడకుము,

ఈ పద్యమునందు వాలివధకు బీజము వేయఁబడెను. దానికిఁ గారణములు రెండు. నీవు నాకు మిత్రుఁడవు కావున నే నే విధముగనైన నిన్ను రక్షింపవలసినది యొకటి. ఇరువురకు సంధిచేసి రక్షింపరాదా, వాలి నేల చంపవలయు ననిన, వాఁడు మఱఁదలినిఁ జెఱచిన ధర్మవిరుద్ధ చరిత్రుఁడు కావున వాలినిఁ జంపుటవలన నీకు మేలుండినను లేకుండినను వాఁడు వధ్యుఁ డగుట వానిని జంపవలయును. కావున వాలిని జంపినయెడల నధర్మచరిత్రుని శిక్షించినవాఁడ నగుదును - నీప్రాణము కాపాడిన వాఁడ నగుదును - ఈ విషయము వచ్చినపు డంతయుఁ బాఠకులు కొంచెము హెచ్చరికతో రామవాక్యముల శోధింపవలెను.

తే. కంకపత్రప్రతిచ్ఛన్న♦కంబు లైన, మచ్ఛరంబు లమోఘముల్ ♦ మహితశితము
ఖములు ఋజుపర్వముల్ దుర్గిం చుఁ♦గష్టచరితు,గాఢరోష భుజంగమ♦గణము లట్లు.

కంకపత్ర ప్రతిచ్ఛన్నకంబులు, కంకపత్ర = గ్రద్దఱెక్కల చేత, ప్రతిచ్ఛన్నకంబులు = కప్పఁబడినవి - స్వార్థకప్రత్యయాంతము - మత్ + శరములు=నా బాణములు - శితముఖములు = పదునైన కొనలుగలవి - ఋజుపర్వముల్ = చక్కనికణుపులు గలవి -అమోఘముల్ = వ్యర్థముగాఁ బోనివి - గాఢ = అధికమైన - రోష = కోపముగల - భుజంగమ గణములు = పాములగుంపులు.

తా త్ప ర్య ము.

వాలినెట్లు చంపెద వనెదవా - ఇవిగోఁ జూడుము - గ్రద్దఱెక్కలు కట్టఁబడి నా బాణములు గుఱిభేదింపక వ్యర్థముగఁ బోవునవికావు - మిగులవాఁడియైన మొనలు గలవి - వంకరలేక చక్కని కణుపులు గలవి - నీచపునడవడి గలవాలినిఁ గోపించిన పాముల గుంపులవలెఁ జంపును.

మ. ఇదిగోఁ జూడుము వాలి నేల హతుఁడై ♦ యీ ఘోరబాణంబులన్
ముద మేదంగ వికీర్ణ పర్వత మనన్ ♦ వ్రాలంగఁ గన్గొని నా
ముదితుండై హరిసూతి పల్కు రఘురా♦ముణ్ నీ ప్రసాదంబునన్
మదిరాక్షీమణి పూజ్యరాజ్యరమ సం♦ప్రాప్తింప మోదిల్లెదన్ ౧౭౩

ముదమేదంగన్ = సంతోషము నశింపఁగా- వికీర్ణపర్వతమనన్ = తునుకలైన కొండవలె- ముదితుండు = సంతోషించినవాఁడు- హరిసూతి = సూర్యుని కొడుకు- సుగ్రీవుఁడు- మదిరాక్షీమణి = స్త్రీరత్నము- నా భార్య.

ఇదిగోఁ జూడుము- అనఁగా శీఘ్రకాలమందే యీ కార్యము కాఁగలదని భావము.

తాత్పర్యము.

పిడుగులతాఁకున పగిలిన కొండవలె నా బాణములచేఁ జచ్చిపడిన వాలి నిదిగోఁ జూడుము అని చెప్పఁగా సుగ్రీవుఁడు సంతోషించి రామచంద్రా! నీ యనుగ్రహంబున నా భార్యయు రాజ్యలక్ష్మియు లభించెనేని సంతోషించెదను. వాలి చచ్చుటవలననే యీ రెండు నాకు లభించు నని భావము.

క. ఎటు నా పగతుని వాలిని, దటుకున వధియింప వచ్చుఁ ♦ దత్పద్ధతి వే
చటులాంబక యొనరిచి నా, పటుసంకటములను బాపి ♦ పాలింపు మనన్. ౧౭౮

పగతుని =విరోధుని- తటుకున = శీఘ్రముగ- చటులాంబక = శత్రువధకై యెగురుచున్న బాణములు కలవాఁడా.

తాత్పర్యము.

ఏ విధముగ నా విరోధి యగు వాని శీఘ్రముగఁ జంపవచ్చునో యా విధముగ నీ బాణములచే నొనరించి నా తీవ్రదుఃఖములను దొలఁగించి రక్షింపుము అని చెప్పఁగా.

కం. సరసిజసువర్ణ వైశ్వా, నరసమములు జానకీవ♦నాటేశనిశా
చరనాథుల డాకన్నులు, సరవిం జలియించెఁ దత్ప్ర♦సంగము జరుగన్. ౧౭౯

సరసిజ = కమలములతోను, సువర్ణ = బంగారుతోను, వైశ్వానర = అగ్నిహోత్రముతోను, సమములు = సమానములైనవి, జానకీ = జానకియొక్కయు, వనాటేశ = వాలియొక్కయు, నిశాచరనాథ = రావణునియొక్కయు, క్రమాలంకారము, డాకన్నులు = ఎడమ కన్నులు, రామ సుగ్రీవు లట్లు సంభాషించు సమయంబున సీతాదేవికి, వాలికి, రావణునకు నెడమకన్ను లదరెను. సీతాదేవికి నెడమ కన్నదరుట శుభశకునము, వాలి రావణులు పురుషు లగుట వారికి నెడమ కన్నదరుట యశుభసూచకము. ఇందు సీత కన్నులు కమలములవలె, వాలి కన్నులు పింగాక్షములు కావున బంగారువలె, రావణుని కన్నులు నిప్పుమంటలవలె నున్నవని చెప్పఁబడెను.

తాత్పర్యము.

కమలముతోను బంగారుతోను నగ్నితోను సమములైన సీతాదేవియొక్కయు, వాలియొక్కయు రావణునియొక్కయు నెడమకన్నులు ఆ ప్రసంగము జరుగు సమయమున నదరెను. క్రమాలంకారము.

౬-వ సర్గము. సుగ్రీవుఁడు శ్రీరామునితో సీతను దాను గొనివచ్చునట్లు చెప్పుట.

సీ. వెండియు నిట్లనుఁ ♦ జండాంశునందనుం, డా రామచంద్రుతో ♦ హర్షమునను
మత్సచివాగ్రణి ♦ మారుతపుత్త్రుండు, తెలిపె మీ రడవి కే♦తెంచినట్టి
హేతువు మైథిలి ♦ సీతతోఁ దమ్ముఁడో, సౌమిత్రితో వన♦స్థలులయందుఁ
గ్రుమ్మర నీ జాయఁ ♦ గూళనిశాటుండు, చెంత మీరలు లేని♦యంతరంబు

తే. నెఱిఁగి హరియించి పోవుచు♦ గృధ్రనేత, నా జటాయువు వధియించి♦యరిగె ననుచు
ననఘ భార్యావియోగజ ♦ మైనదుఃఖ, మేను బాపెద వగవనీ♦ కేల యింక. ౧౭౬

జాయన్=భార్యను, కూళ=దుష్టుఁడు, క్రూరుఁడు, నిశాటుఁడు=రాక్షసుఁడు, చండాంశునందనుఁడు=సుగ్రీవుఁడు. తా త్ప ర్య ము.

మఱియు రామచంద్రుతో సుగ్రీవుఁ డిట్లనియె, నామంత్రులందు గొప్పవాఁడగు హనుమంతుఁడు మీరడవికి వచ్చిన కారణము తెలిపెను. నీవు మిథిలరాజు కూఁతురగు సీతతోను తమ్ముఁడగు లక్ష్మణుతోను నడవులందుఁ దిరుగుచుండఁ గ్రూరరాక్షసుఁడు మీరు సమీపమందు లేని సమయము కనిపెట్టి నీ భార్యను హరించి కొనిపోవుచోఁ ద్రోవలో గ్రద్దరాజగు జటాయువును వధించె ననుచుఁ జెప్పెను. రామచంద్రా! నీకు భార్య నెడఁబాయుటవలనఁ గలిగిన దుఃఖమును నేను దొలఁగించెదను. నీవు వ్యసనపడ వలదు. లక్ష్మణాంజనేయులు సంభాషించినపుడు లక్ష్మణుఁడీ సంగతులు చెప్పినట్లచ్చటఁ దెలుపలేదు. (చూ. ౧౩౭) వాల్మీకి యిచ్చటఁ జెప్పుచున్నాఁడు. అక్కడఁ జెప్పిన కబంధ వృత్తాంత మిచటఁ జెప్పలేదు. వాల్మీకి శైలి పరిపాటి నెఱుంగని వారంతయు నొకచోటఁ జెప్పలేదే. అప్పుడే జరిగియుండిన నప్పుడే చెప్పియుండఁడా? ఇది ప్రక్షిప్త మని యిట్టి యసంగత ప్రలాపములు గావింతురు. వాల్మీకిశైలివిధానము ముందు ముందు తెలియఁగలదు. ఎక్కడ నేది యెంత చెప్పవలయునో యంతయే చెప్పును.

కం. శిష్ట యగు నా తలోదరిఁ, గష్టాత్ముఁ డతండు దాఁచు♦గా కెయ్యెడనే
నష్టామ్నాయశ్రుతి యన, స్పష్టంబుగ నామెఁ దెత్తు ♦ వగవకు మయ్యా! ౧౭౭

శిష్ట = పతివ్రత - తల + ఉదరి = అరచేయివంటి కడుపుగలది - నష్టామ్నాయ శ్రుతి = మధుకైటభులు, సోమకాసురుఁడు దొంగిలించిన వేదశ్రుతి, శ్రుతి యనునది శాస్త్రసామాన్యనామము - వేదశాస్త్ర మనియర్థము.

తా త్ప ర్య ము.

పతివ్రత యగు సీతాదేవిని నీచుఁడగు రాక్షసుడే ప్రదేశమందు దాఁచినను సరియె - హయగ్రీవమూర్తియో మత్స్యమూర్తియో, రాక్షసులు హరించిన వేదమును దెచ్చినట్లు తెచ్చెదను-ఇచ్చట శ్రుతికి సీతాదేవికి నుపమానము చెప్పఁబడెను. శ్రుతి తర్కయుక్తులచే భేదింప శక్యమగునది కాదు - అట్లులే సీతయు నని యర్థము.

కం. ఉండిన రసాతలంబున, నుండిన నాకాశమునను ♦ నుగ్గలిఁ దెత్తుం
జండాంశువంశదీపక, ఖండేందునిటాల నీకుఁ♦గా నర్పింతున్. ౧౭౮

రసాతలము = పాతాళము - చండాంశువంశదీపక = సూర్యవంశమును వెలిఁగించువాఁడా - ఖండేందు= బాలచంద్రునివంటి - నిటాల = నొసలు గలది.

తా త్ప ర్య ము.

సీతాదేవి పాతాళంబున నుండినను ఆకాశమున నుండినను రామచంద్రా! యామెను నేను దేఁగలను. వ్యసనపడకుము.

ఉ. నమ్ముము నాదు సత్య♦వచనమ్మును రాక్షస దానవాద్యనీ
కమ్ములు నొక్కటౌచు నెస♦కమ్మునఁ బూనియు భూతనూజ జీ
ర్ణమ్మును జేసికోఁ గలవె ♦ రామ! విషాన్వితభక్ష్య మెందు జీ
ర్ణమ్మగునయ్య భక్షకుల ♦ నాశముఁ జేసెడిఁ గాక తూర్ణమున్. ౧౭

రాక్షస దానవాద్యనీకమ్ములు = రాక్షసులయు దానవులయు సేనలు, ఎస కమ్మునన్ = విజృంభణములతో, విషాన్విత భక్ష్యము = విసముతోఁగూడిన తిండి, తూర్ణమున్ = శీఘ్రముగ.

తాత్పర్యము.

రామచంద్రా! నేను సత్యము చెప్పుచున్నాను. నమ్ముము రాక్షసులు దానవులు సేనలతోడ విజృంభించియు సీతను జీర్ణము చేసికోలేవు. విషముతోఁగూడిన యప్పచ్చులు తినినవారిని జంపునేకాని జీర్ణమగునా? అట్టులే సీతను హరించువాఁడు చచ్చునే కాని యామె ననుభవింపలేఁడు.

చం. విడువుము దుఃఖమున్ వినుత♦వీర్య! భవత్సతి నేను దెచ్చెదన్
దొడితొడిఁ బంక్తికంఠుఁ డొక ♦ తొయ్యలి లక్ష్మణ! రామ! రామ! యం
చడలున విస్వరంబున ని♦జాంకతలంబున నేడ్చు చుండఁగా
విడివడి పాఱె మింట, నల ♦ బిత్తరి సీతయు, నేఁ దెలిసిఁగితిన్. ౧౮

తొడి తొడి = మిగుల వేగమున, అడలున = భీతిచే, విస్వరంబునన్ = రాపెక్కిన గొంతుతో, నిజాంకతలంబునన్ = తన చంకయందు.

తాత్పర్యము.

రామచంద్రా! నీవు దుఃఖము వదలుము. నీ భార్యను నేనుదెచ్చెదను. నా భార్య ముఖము నీ వెఱుంగవు. ఆమె యెక్కడనున్నదో తెలియదు. అట్లుండియు నే నింత ధైర్యముగాఁ జెప్ప నేమికారణ మందువా రావణాసురుఁ డొక స్త్రీని జంక నిఱికించుకొని యాదరబాదర యాకాశమునఁ బరువెత్తెను. ఆమె గద్గద స్వరముతో రామా రామా యని యేడ్చుచుండెను. ఆమెయే సీతాదేవి యని యిప్పుడు తెలిసికొంటిని.

కం. దర్వీకరభామినివలె, సుగ్రీవర! వ్రేలి కంప ♦ మొందెడి భామన్,
బర్విడు దశముఖునొడిలో, నుర్వీధరగతుల మేను ♦ నున్న నలువురున్. ౧౯

దర్వీకర భామినివలెన్=ఆఁడుపామువలె, పామును నడుమఁబట్టుకొని యెత్తిన నిప్రక్క నాప్రక్క వ్రేలాడుచుండును గాని కట్టెవలె నుండదు. సీతయు నట్టులే దక్షిణపువైపు పాదములు ఉత్తరపువైపు శిరస్సుగా వ్రేలఁబడియుండెను. ఇట్లుండుటచేత నే యామె రావణాసురునకుఁ దెలియకుండ నాభరణము లొలిచి యుత్తరీయము కొంగున మూట గట్టి వ్రేయఁగలిగెను. ఉర్వీధరగతులము=పర్వతమం దుండు వారము, నేను, ఉన్న నలువురు = నేను, తక్కిన నలువురు.

తా త్ప ర్య ము.

రామచంద్రా! యీయాకాశమునఁ బరువెత్తిపోవుచున్న రావణాసురు నొడిలో నాఁడుపామువలె వ్రేలాడి భయముచే వడలకున్న స్త్రీని, నేనొకఁడనే కాదు తక్కిన యీ నలువురుకూడఁ జూచిరి.

—♦ సుగ్రీవుఁడు శ్రీరామునకు సీతాదేవి వైచిన భూషణంబులఁ జూపుట ♦—

ఉ. కంటిమి మచ్చెకంటియును ♦ గాంచి మముం దన యుత్తరీయమం
దంటఁగఁ గట్టి భూషణచ♦యంబులఁ బాఱఁగ వైచె నేను, న
న్నింటిని దాఁచినాఁడ నవ♦నీధరకందరమందు, నీదువా
ల్గంటివొ యేమొ చూడు మవి ♦ గ్రన్నన తేరఁగఁ బంతు నావుడున్. ౧౮-౨

మచ్చెకంటి = చేఁపవంటి కన్నులు గలది- అవనీధరకందరమందున = కొండ గుహయందు- నీదు వాల్గంటివో = నీ భార్యవో- గ్రన్నన = శీఘ్రముగ.

తా త్ప ర్య ము.

మే మామెను జూచుటయే కాదు. ఆమెయు మమ్ముఁ జూచి పై యుత్తరీయంబున సొమ్ముల మూటఁగట్టి విసరివైచెను. వాని నన్నింటిని నేను గొండగుహయందు హనుమంతునిచేత నిచ్చి దాఁచిపెట్టితిని. వానిని ద్వరగాఁ దెప్పించెదను. నీ భార్యవో యేమో౦ చూడుము.

ఈ యాభరణములను జూపిన కారణముననే సీతాదేవి సుగ్రీవు ననుగ్రహించెనని గ్రహించి యతని యందు విశేష ప్రేమగలవాఁ డయ్యెను.

క. ఏలా! కాలవిలంబన, మీలీలం దేరఁ బనుప♦వే మిత్రమ నా
హేలితనూజుఁడు చని భూ,పాలిం గొని తెచ్చెనివిగొ ♦ నని కనఁబఱిచెన్. ౧౮-౩

హేలితనూజుఁడు = సూర్యునికొడుకు- సుగ్రీవుఁడు.

తా త్ప ర్య ము.

అని సుగ్రీవుఁడు చెప్పఁగా రామచంద్రమూర్తి సుగ్రీవా! యేల యిట్లు ముచ్చటలతో జాగుచేసెదవు- మిత్రుఁడా! వానిని వేగముగఁ దెప్పింపుము. అనఁగా సుగ్రీవుఁడు హనుమంతునితోడఁ బోయి సొమ్ములు గొనివచ్చి యివిగో నని చూపెను.

సుందరకాండము ప. ౮౩౨ చూడుము.

ఇరువురు పోయిరి. దాఁచినవాఁడు హనుమంతుఁడు కావున నాయన తెచ్చియీయఁగా సుగ్రీవుఁడు తీసికొనివచ్చి రామచంద్రమూర్తి కిచ్చెను,అని యన్వయింపవలెను. ఈ సొమ్ములు దాఁచిన గుహయందొక రేయి పగ లీ వ్యాఖ్యాత వసించెను.

ఉ. చీరచెఱంగు భూషలును ♦ జేతను గైకొని శోకవారి నీ
హారము సారసారి నన ♦ నశ్రులు గప్పఁగ రుద్ధదృష్టి యై
హా రమణీ, ప్రియా! యనుచు ♦ నారటపాటున నూర్చె నా యలం
కారము ఱొమ్ము నొత్తి కినుకం బిలపన్నగ మూర్చునట్లుగన్. ౧౮-౪

శోకవారి = కన్నీళ్లు, నీహారము = మంచు, సారసారిఁ = చంద్రుని, అక్షులు = కన్నులు, రుద్ధదృష్టియై = అడ్డగింపఁబడ్డ చూపులు గలవాఁడై, ఊర్చెఁ = శ్వాసము పుచ్చెను, కినుకఁ = కోపముచే, బిల పన్నగము = పుట్ట లోని పాము.

తాత్పర్యము.

చీరచెఱఁగును సొమ్ములును రామచంద్రమూర్తి చేతికిఁదీసికొని చంద్రునిమంచు గప్పినట్లు కన్నీళ్ళు కన్నులఁగప్పి చూపుల నడ్డగింపఁగా, హా ప్రియురాలా రమణీ యని యారాటముచే అొమ్మున కా భూషణము నొత్తికొని పుట్టలోని పాము బుస కొట్టినట్లు పెద్ద శ్వాసము పుచ్చెను.

కం. ఘనమూర్ఛ వ్రాలి తమ్మునిఁ, గని క్రూరుఁడు రాక్షసుండు ♦ గ్రహియించి చనఁ
దన మేనిపరిష్కారము, లను ధారిణి వైచి సీత ♦ లక్షణ! చనియెన్. ౧౯

ఘనమూర్ఛఁ = పెద్దమూర్ఛచే, మేని=దేహముయొక్క, పరిష్కారంబులు= సొమ్ములు,

తాత్పర్యము.

రామచంద్రమూర్తి చాలసేపు మూర్ఛపోయి పడిలేచి తమ్మునిఁ జూచి దయలేని రాక్షసుఁడు తన్నెత్తికొని పోఁగాఁ దన శరీరమందున్న యాభరణములను సీత భూమి మీఁదఁ బాఱవైచి, లక్ష్మణా! పోయెను.

కం.వీనిని బచ్చికపట్టుల, జానకి పడవైచె నిజము ♦ సకలవిభూషల్
మానుగను జెక్కుచెదరక, నూనములయి తొల్లియట్ల ♦యున్నవి కనుమా! ౨౦

తాత్పర్యము.

వీనిని సీతాదేవి కొండఱాలపై వైచినదికాదు - పచ్చికనేలపైఁ బడవైచినది-కావుననే యన్నిసొమ్ములు శరీరము మీఁద నున్నప్పుడెట్టి మంచిస్థితిలో నుండెనో యిప్పుడట్టులే యేమియుఁ జెడక కొఱఁత లేక యున్నవి - లక్ష్మణా నీవును జూడుము - ఇవి సీతవేకదా.

చం.అనవుడు లక్ష్మణుండును ని♦జాగ్రజుతోడుత నిట్లు పల్కు నో
యనఘ! యెఱుంగఁజాల వని♦తాంగదముల్, గుఱితింప లేన యీ
గొన బగు కుండలంబులను ♦నోమలి కేను దినంబుఁ బాదపం
దన మొనరించుచుం గనుట ♦నాతివ యందియ లే నెఱుంగుదున్. ౨౧

నిజాగ్రజుతోడుతఁ = తనయన్నతో - వనితాంగదముల్ = స్త్రీ బాహు పురులు - కుండలంబులును = చెవులకమ్మలు -'కనిష్ఠం నాభివాదయే' త్తని శాస్త్రవాక్య ముండఁగాఁదనకంటెఁ జిన్నవయస్సుగల స్త్రీకెట్లు లక్ష్మణుఁ డభివాదముచేసెను. 'భ్రాతృ భార్యోపసంగ్రాహ్యా సవర్ణాహన్యహన్యపి,' సవర్ణస్త్రీయయ్యోనేని యన్నభార్యకు దిన దినము ఉపసంగ్రహణము గావింపవలయును - ఉపసంగ్రహణమనఁగా స్మృత్యర్థ సారము-

అముకగోత్రో దేవదత్తశర్మా అహంభో అభివాదయే త్యుక్త్వా కర్ణౌ స్పృష్ట్వా దక్షిణోత్తానపాణినా గురో ర్దక్షిణపాదం సవ్యేన సవ్యం గృహీత్వా శిరోవనమన మితి. గోత్రముపేరు తనపేరు, చెప్పుచు 'అహంభోఽభివాదయే' యని తన చెవులు దాఁకికొని కుడికాలిని కుడిచేత,నెడమకాలిని నెడమచేతనంటి,తలవంచుట. ఇట్టి నమస్కారములకుఁ దల్లి, చనుఁబాలిచ్చి సాకిన తల్లి,తండ్రి, తండ్రితండ్రి, తల్లితండ్రి అన్నదాత, భయత్రాత, ఆచార్యుఁడు, ఉపనయనము చేసి బ్రహ్మోపదేశము చేసిన వాఁడు, మంత్రవిద్య నుపదేశించినవాఁడు, వారి భార్యలు నర్హు లగుదురు.

తాత్పర్యము.

అని రామచంద్రమూర్తి చెప్పఁగా లక్ష్మణుఁ డిట్లనియె· అన్నా! యీ బాహుపురులు నీ కమ్మలు సీతాదేవివి యవునో కావో నేను జెప్పఁజాలను· ప్రతిదిన మామెకుఁ బాదవందనము చేయు సమయంబునఁ జూచుచుండిన వాఁడ నగుట నీ యందియలు సీతాదేవివే. నే నెఱుఁగుదును. దీనివలన లక్ష్మణుఁడు సీతాదేవిని నామె మోఁకాటి మీఁద దృష్టి పఱపి చూచినవాఁడుకాఁడని యేర్పడుచున్నది. ముగ్వురుమాత్రమున్న యడవిలో నిట్టి నియమము జరుప లక్ష్మణునకుఁ జెల్లెనుగాని యితరులకుఁ జెల్లదు. (ఉత్తరకాండమున ౧౦౧౦ వ పద్యముఁ జూచునది)

—♦ శ్రీరాముఁడు సుగ్రీవుని రావణవృత్తాంతము నడుగుట· ♦—

ఉ. అంచు వచింపఁ బెంపుగొను♦నారటపాటున సూర్యనందనుఁ
గాంచి హితుండ! ప్రాణములకంటెఁ బ్రియం బ్రియురాలి నెందు వీ
క్షించితి వయ్య రాక్షసుని♦చేపడి పోవఁగ? దుఃఖదాత యా
వంచకుఁ డెందునుండుఁ? బరి♦వారయుతంబుగఁ గూల్తు నాతనిన్· ౧౮౮

తాత్పర్యము.

అని చెప్పఁగా నతిశయించు నారాటమున సుగ్రీవునిఁ జూచి మిత్రమా! నా ప్రాణములకంటెఁ బ్రియమైన నా ప్రియురాలిని రాక్షసుఁ డెత్తికొనిపోవ సీతను నీ వెందుఁ జూచితివి. నాకు దుఃఖము కలిగించిన యా వంచకుఁ డుండు తావేది చెప్పుము. వానిని వాని పరిచారకులతోడ వధించెదను.

రాక్షసునిచేపడి = చేపడు ఏకశబ్దమే కాని- చేన్ + పడు అని విచ్ఛేదింపఁ దగినది కాదు. విరాటపర్వము ౧ ఆ 'ఒరుచేపడ నెన్నఁడును' 'నా పతులగు గంధర్వుల చేపడి' ౩ ఆ. లోచెయి- లోచూపు- లోకడుపు లోచేసికొను లోతక్కువ పైపడు తోపాటు: ఇట్టి శబ్దము లందనుస్వారముగాని దానిపరముగ సరళముగాని లేదు. లోఁబాటు లోనగునవి దుష్టములు.

ఉ. జానకి మ్రుచ్చిలించి, పెను♦సంకటముం గలిగించి, దోష మ
న్యూనముగాఁగఁ బెంచి, తన♦యుద్ధతిఁ దానుగ నాత్మమృత్యుదే
వీనిలయారరార్గళము ♦ వీకునఁ బాయఁగఁ దట్టినట్టి యా

దానవుపాంటె లోకము న♦దానవముగ్ ఘటియింతుఁ జెప్పుమా. ౧౮౯

మ్రుచ్చిలించి=దొంగిలించి, అన్యూనముగాఁగన్=లోపము లేకుండ, ఉద్ధతిన్=గర్వముచే, ఆత్మమృత్యుదేవీ=తన మృత్యుదేవియొక్క, నిలయ=ఇంటియొక్క, అరరార్గళమును=తలుపునకు వేసిన యడ్డగడియను, దానవుపాంటన్=రాక్షసుని కొఱకై, అదానవమున్=రాక్షసులు లేనిదానిఁగా, ఘటియింతున్=చేయుదును.

తా త్ప ర్య ము.

రామచంద్రా! రావణాసురుఁ డెక్కడ? నీవెక్కడ? ఎక్కడనో యుండువాని నిక్కడనుండి యెట్లు చంపఁగలవు? అందు వేమో చెప్పెద వినుము. జానకిని దొంగిలించి మాకుఁ జెడ్డసంకటము గలిగించి, పాపము సంపూర్ణముగా వృద్ధిచేసికొని తన గర్వముచేఁ దన మృత్యుదేవత యుండు నింటివాకిలి గడియలను విఱుగఁదన్ని దానిని దనమీఁదికిఁ దెచ్చుకొని నట్టి యా రాక్షసుని కోసరమై లోకమున రాక్షసుఁ డనువాఁడు లేకుండఁ జేసెదను.

ఎవఁడో యొకఁడు దోషముచేసిన నా కులమువారి నెల్ల జంపవచ్చునా యందు వేని 'ప్రల్లదుఁడైన యొక్కకుల పాంసను చేసిన దానఁ దత్కులంబెల్లను దూషితం బగుట యేమి యపూర్వము' భార. ఆది. దోషము చేసిన వానినిబట్టి యిర్వురు తక్కిన వా రందఱు వానిని దాఁచి కేని వానివలె వారందఱు దండ్యులే.

కం. చెప్పుము వనమునఁ దస్కరు,చొప్పున బలవంతముగను ♦ సుగ్రీవా! నా
కప్పురగందిని మ్రుచ్చిలు, నప్పాలసుఁ బట్టి యిపుడ ♦ హాతుఁ గావింతున్. ౧౯౦

తస్కరుచొప్పునన్ = దొంగవలె, మ్రుచ్చిలు = దొంగిలించిన, పాలసున్ = దుష్టుని, కప్పురగంది = పచ్చకర్పూరమువంటి వాసనగల దేహము గలదానిని.

తా త్ప ర్య ము.

మిత్రమా! వా డెందున్నాఁడు చెప్పుము! దొంగవలె, నడవులం దుండు నా భార్యను బలవంతముగ దొంగిలించిన యా దుష్టుని నిప్పుడే చంపెదను.

—♦ ౭-వ సర్గము. సుగ్రీవుఁడు శ్రీరామునకు ధైర్యముఁ జెప్పుట. ♦—

మ. అన సుగ్రీవుఁడు బాష్పరుద్ధగళుఁడై ♦ యయ్యా! నిజం బేను ద
ద్దనుజాధీశునివాసమున్ బలముఁ ద♦త్సామర్థ్యమున్ శక్తి యే
నిని నానీచుని దుష్కులం బెఱుఁగఁ, గా♦నీ, యైన నే మాయె, నీ
వనితారత్న మెటేని నిస్తలయు ద్రో♦వల్ చేసెదన్ నమ్ముమీ. ౧౯౧

బాష్పరుద్ధగళుఁడై = కన్నీటిచే నడ్డగింపఁబడిన కంఠము గలవాఁడై.

తా త్ప ర్య ము.

శ్రీరామచంద్రమూర్తియొక్క వ్యసనముఁజూచి సుగ్రీవుఁడును గన్నీళ్లు కుత్తుక నడ్డగింప నిట్లనియె. అయ్యా! రామచంద్రమూర్తీ! యా రాక్షసుని కాఁపురముండు దేశముగాని బలముగాని శక్తిగాని సామర్థ్యముగాని యా నీచపుఁగులముగాని నేను

నిజముగా నెఱుఁగను. అయిన మ ఱేమాయె. అంతతో నీవు నెట్లని విచారపడకుము. ఏ విధముగానైన నీ భార్య సీతోఁ గలియు మార్గము చేసెదను, నామాట నమ్ముము.

ఇచ్చట సుగ్రీవుఁడు స్పష్టముగా నసత్యము చెప్పెను. హనుమంతుఁ డెఱుఁగఁడు గాని రావణాసురుని సుగ్రీవాదులు చక్కఁగా నెఱుఁగుదురు. రావణాసురుఁడు వాలిచే దెబ్బ దిని సంధి కుదుర్చుకొని పోయినవాఁడే. అప్పుడు సుగ్రీవుఁడుకూడ నుండెను. (ఉత్తర ౩౪-౩౫అ) వాస్తవ మిట్లుండఁ దెలిసి తెలిసి యసత్యమాడుట మిత్రద్రోహము కాదా? కాదు. రామచంద్రమూర్తి తొందరపాటు చూచిన నిప్పుడు రావణాసురుని వృత్తాంతము చెప్పితినా, యిప్పుడే లంకమీఁదికి బయలుదేఱును. వాని బలాతిశయ మీయన యెఱుఁగఁడు. నేనా వాలి జీవించియుండువఱకు నీస్థలము విడిచి పోవుటకు లేదు. అథవా పోయినను మే మ్మైదుగుర మేమి చేయఁగలము? మేము బయలుదేఱినచో వాలి మావెంటనే సేనలతో మామీఁదికిఁ బరువెత్తి వచ్చును. వాలి రావణు లేక మగుదురు. అప్పు డీయన యెవరితో నని యుద్ధము చేయును? వేగిరపాటువలనఁ గార్యములు విషమించును, గాని యనుకూలింపవు. ఆయనకార్యము చెడును. నాకార్యము చెడును. వాలిని జంపి రాజ్యము నాకు వచ్చునట్లు చేసెనా సర్వాధికారి నగుదును. గావున నిర్భయముగ లంకపై దండెత్తి వచ్చును. అని కార్య భారము సాధనమార్గము నాలోచించి యసత్యమాడెను. దీనివలన రామచంద్రుని కార్యమేమియుఁ జెడలేదు. మిత్రధర్మ మనుసరించి రాముని మేలునకై యాడిన యసత్య మసత్యము కాదు. సుగ్రీవుఁ డసత్య మాడుచున్నాఁ డని యిప్పుడు రామచంద్రమూర్తి యెఱుఁగఁడు. నిజమే కాని దక్షిణమునకు హనుమదాదులను బంపుచు "అదియతలంబు వధ్యుఁడు దురాత్ముఁడు శక్రసమప్రభుండునా నదితిసుతారినేత వసుధాత్మభవాప్రతిరోధి రావణుం డదయుఁడు గ్రాలు పట్టన (కిష్కింధా ౧౦౬ వ ప) మని సుగ్రీవుఁడు చెప్పినప్పుడైనను వీఁడు నాతోఁ దనకార్యార్థమై యసత్య మాడెను గదా యని తలంపఁడా యను సందేహము కలుగవచ్చును. కాని యట్లు చెప్పుటకు ముందు తార లక్ష్మణునితో "నూఱువేల్ కోటులు నూఱువేల్ ముప్పదియాఱు యుతంబులు నసురవరులు గలరయ్య లంకను గలన వారలనెల్లఁ జంపక రావణుఁ జంపరాదు గీ॥ తోడులేని యొక్కతో యజాహతనూజు చేతఁ జచ్చునెట్లు ఖ్యాతబలుఁడు దశముఖుండటంచుఁ దత్త్వ మెఱింగిన వాలి చెప్పె దానిఁ బలుకుదాన" (కిష్కింధ ౯౫౭ వ ప) అని చెప్పుటచే లక్ష్మణుఁడీవార్త రామచంద్రమూర్తికిఁ జెప్పియుండును. కావున సుగ్రీవుఁడును దారవలనఁ దెలిసికొన్న విషయము వానరులకుఁ జెప్పె నని తలఁచుటచే రామచంద్రమూర్తి సుగ్రీవుని సందేహింపఁ గారణము కలుగదు. వాలి బలపరాక్రమములు రామచంద్రమూర్తితోఁ జెప్పునపుడు వాలి రావణు జయించిన వార్తమాత్రము చెప్పక దాఁచెను. వాలికి భయపడి భూమండలమంతయుఁ దిరిగితి నని చెప్పినపుడు వీఁ డీదేశము లన్నియుఁ జూచినవాఁడు, లంకమాత్రముఁ జూడకున్నాఁడా,

యని యేల రామచంద్రమూర్తి సంశయించి యుండరా దనిన నదియుఁ దారవాక్యము వలననే పరిష్కారమైయుండును. ఎట్లన మీఁది తారవాక్యములు విని రావణు చరిత్రము వాలి కేమని తెలియునని లక్ష్మణుఁడు ప్రశ్నించియుండవచ్చును. వాలికి రావణునకు స్నేహము గలదని యామె చెప్పియుండవచ్చును. కావున శత్రువు తఱుముకొని వచ్చు నపుడు పగవాని మిత్రు నూరికి నెవఁడైనఁ బోవునా, కానఁ బోలే దని రామచంద్ర మూర్తి తలఁచియుండవచ్చును. అప్పుడును సుగ్రీవుని సందేహింపఁ గారణములేదు. కాని సుగ్రీవుఁడు తెలిసి తెలిసి కార్యార్థమై రామహితార్థమై యసత్యమాడుట సత్యము.

ఇచ్చటఁ గొందఱు రావణుగుఱించి నాకేమియుఁ దెలియ దని చెప్పినమాటకు నిప్పుడు వాఁడెచ్చటనుండునది నాకుఁ దెలియదని యర్థమని వ్రాసిరి. అది సరిగాదు. ఏలన రావణుఁ డుండు నగరము లంక- అది దక్షిణసముద్రమం దున్నది. రావణాసురుఁడు సీతనెత్తికొని దక్షిణముగాఁ బరువెత్తెను. గాని సీత నందే యుంచెనో మఱి యెందే నుంచెనో నే నెఱుఁగనని చెప్పి యుండినచో లంకమీఁదికిఁ బోయి దానిని ధ్వంసము చేయఁబూని నపుడు సర్వవృత్తాంతము వెలువడి యుండును గదా- ఆ మాత్రము దెలిసినను రామచంద్రమూర్తి యూరకుండువాఁడు కాఁడు. దిక్కుకూడఁ దెలియని కారణముచేఁ జిక్కుపడెను.

ఇప్పుడు నాకుఁ దెలియదని చెప్పినాఁ డనుట సరిగాదు. వాఁడట్లు స్పష్టముగా జెప్పలేదు- గాని వాని భావ మది యందమా, యిప్పుడును ధర్మరా జసత్యమాడి నట్లు సుగ్రీవుఁడు నసత్యమాడె ననియే యంగీకరింపక తప్పదు. మనస్సులో నొకటి యుంచుకొని వేఱొక యర్థమగునట్లు మాటలాడుట యసత్యము కాదా? మోసము గాదా.

రావణవృత్తాంతము తారవలనఁ దెలిసినవాఁడు లంకయందు వెదకఁ గపిసేనలఁ బంపక నాలుగు దిక్కులకుఁ బంపనేల? ఇది మోసకృత్యముగాదా? కాదు. తార రావణాసురుఁ డుండు నూరిపేరు బలము చెప్పెనే కాని యిప్పుడు సీత లంకయందున్న దని చెప్పలేదు. అది యామెకుఁ దెలియదు. వాలికిని దెలియదు. ఆఱునెలలలోపల సీతాదేవిని వాఁ డెందెందు దాఁచెనో, దొంగ దొంగసొత్తును దన యింటిలోనే దాఁచునా? కావున నలువైపుల సేనలఁ బంపవలసి వచ్చెను.

కొందఱు సుగ్రీవునకు రావణువృత్తాంతము వానరులతో నెంత చెప్పెనో యంతయేకాని యంత కెక్కువ తెలియదనిరి. రామున కిప్పు డేమి చెప్పినను గార్యము చెడు నను నభిప్రాయము సుగ్రీవునకు లేదేని వానరులతోఁ జెప్పినంతమాత్రము రామచంద్రునితోను జెప్పి యింత కెక్కువ నాకుఁ దెలియ దని చెప్పియుండవచ్చును. ఏమి కొంచె మవకాశ మిచ్చినను రామచంద్రమూర్తి యూరకుండఁడని సుగ్రీవుఁడు చక్కఁగా గ్రహించెను.

కొందఱు రావణుఁడు శివపూజాధురంధరుఁడు. సంవత్సరమువఱకు వాఁడు సీతను హరించిన ఫల మనుభవింపఁబోఁడు. కావున నీలోపల వాని కపాయము రాకుండుటకై శివపూజాఫలము రావణు విషయమై సుగ్రీవునకు మఱపు గలిగించె నందురు. వీరి యభిప్రాయమున శివపూజాఫలము నిర్విఘ్నముగ వ్యభిచారము కొన సాగుటయే కాఁబోలు దృష్టవిషయమందు నదృష్టవిషయమును దెచ్చిపెట్టుటసరిగాదు శివుఁడు రావణాది రాక్షసపక్షపాతియైనను (ఉత్తర ౯౯-౧౦౦) రామావతార తత్త్వము చూడుఁడు) రామభక్తుఁడు- రావణవధార్థమై సురలు శరణాగతి చేసి నపుడు వారితోడ నపుడం దుండిన వాఁడు- రావణవధానంతరము రామసందర్శనార్థమై వచ్చినవాఁడు కావున రావణుచేష్ట శివునకు సమ్మతమనరాదు- కావున సుగ్రీవుఁడెంత చెప్పెనో యంతయె గ్రహింపనగును. గాని విపరీతకల్పనలు చేయరాదు. గోవిందరాజీయానుసారము.

రోగి మేలుగోరిన వైద్యుఁడు రోగి యిష్టప్రకారము చికిత్సచేయఁడు. వాని మేలాలోచించి చేయును.

మ. వినుమీ నాదుప్రతిజ్ఞ నీయనుఁగు దే♦విం గోసి యెం దున్న నా
దనుజుం బాంధవపుత్రమిత్రయుతు యు♦ద్ధక్షోణి భంజించి నీ
మన ముల్లాసముమీఱఁ బౌరుషము సం♦భావించి నీప్రేయసిం
నినుఁ గూడం ఘటియింతు శీఘ్రమునఁ దం♦డ్రీ! నమ్ము నా వాక్యముల్. ౧౯-౨

రోసి = వెదకి- బాంధవపుత్రమిత్రయుతుం = చుట్టాలతో, కొడుకులతో స్నేహితులతోఁ గూడిన వానిని- యుద్ధక్షోణిం = యుద్ధభూమియందు, ప్రేయసిం = ప్రియురాలిని.

తా త్ప ర్య ము.

రామచంద్రా! నా ప్రతిజ్ఞ వినుము. సీతాదేవి యెందున్నదో వెదకి యా రాక్షసుని బంధువులతోఁ, గొడుకులతో, స్నేహితులతో యుద్ధమునందుఁ జీల్చివైచి నీ మనస్సునకు సంతోషముఁ గలుగునట్టు పౌరుషము పాటించి నీ ప్రియురాలిని నీతోఁ గూడునట్లు చేసెదను. తండ్రీ నామాట నమ్ముము.

చ. అడలకు మయ్య, తెంపు విడ♦నాడకు మయ్య, దిటంబు తేజముం
విడువకు మయ్య, పెంపు సెడ ♦ వేదనఁ గుందకు మయ్య, దేవ! యీ
వడువునఁ గుందు వారలె భ♦వద్విధు లైనమహాత్ము! లయ్యొ నీ
యెడఁద నెఱుంగవే వగపె ♦ హేతువు లాఘవవృత్తి కెయ్యెడన్. ౧౯-౩

అడలకుము = వ్యసనపడకుము, ఈ వడువునం = ఈవిధముగ, భవద్విధులు = నీవంటివారు, ఎడఁదం = హృదయమందు, లాఘవవృత్తికిం = పలుచని తనమునకు.

తా త్ప ర్య ము.

అయ్యా! వ్యసనపడకుము, సాహసము వదలకుము, ధైర్యము తేజము వదలి

పెట్టకుము. గౌరవము చెడునట్లు పరితాపపడకుము. దేవా? నీవంటి మహాత్ము లీవిధముగ దుఃఖింతురా? అయ్యో గౌరవము చెడుటకు వ్యసనమే కారణమని నీవెఱుఁగవా?

ఉ. చేడియఁ గోలుపోయి పెనుఁ♦జిక్కుల నేనును జిక్కి స్రుక్కనే?
యేడుచు చున్నవాఁడనె? మ♦హీశ్వర ధైర్యముఁ బాసినాఁడనే?
మూఢుఁడఁ గ్రోఁతి నే నయిన ♦ ముద్దియకై వగవన్, సునీతులన్
బ్రోడవు ధైర్యవంతుఁడవు ♦ పోలునె నీ కిటు లో మహాత్మకా! ౧౯౪

తాత్పర్యము.

నా దుఃఖము నీకేమి తెలియు నందువేమో? నీవలె నేనును భార్యనే బోఁగొట్టుకొని యనేక కష్టము లనుభవించుచున్నవాఁడనే కదా! అయినను నీవలె నే నేడ్చుచున్నాఁడనా? ధైర్యము వదలినాఁడనా? నే నాకోఁతిని, మూఢుఁడను, అయినను నాఁడుదానికై నేను దుఃఖింపను. నీవో మంచి నీతులందుఁ బండితుఁడవు. ధీరుఁడవు నీవు మహాత్మా! యిట్లు సేయుట తగునా?

సీ. తొరఁగెడికన్నీరు ♦ తోరంపుధృతిచేత, నరికట్టి మరలింప ♦ నర్హమయ్య
సత్త్వవంతుఁడు వ్యవ♦స్థారూపకంబైన, ధైర్యంబు విడనాడఁ ♦ దగు నటయ్య
వ్యసనార్థనష్టులఁ ♦ బ్రాణార్తి వెఱ నిజ,బుద్ధిమై ధీరుండు ♦ పొలుచు నయ్య
యెప్పుడు వగచు ధీ♦హీనుఁడు శోకాబ్ధి, బరువోడ నీట నా ♦ సురుఁగు నయ్య
తే. హస్తములు మోడ్చి వేఁడెద ♦ ననఘచరిత
నెయ్య మెద నెంచి నన్ను మ♦న్నింప వయ్య
యింతయును వగవున కెడ ♦ మీకు మయ్య
పౌరుషం బూఁత గొనవయ్య ♦ సూరివర్య. ౧౯౫

తొరఁగెడి = కాఱెడి. తోరంపుధృతి = అధికధైర్యము, అరికట్టి = అడ్డగించి సత్త్వవంతుఁడు = సత్త్వగుణములుగలవాఁడు, కార్యము చేయఁబూనినవాఁడు, వ్యవస్థారూపకంబైన = కుదురుపాటు అనెడి; వ్యసన+అర్థనష్టులన్ = వ్యసనమందు, ధననష్టియందు, ప్రాణార్తిన్ = ప్రాణాపాయ దశయందు, వెఱన్ = భయమందు, నిజబుద్ధిమై = తన బుద్ధిప్రకారము; ధీరుఁడు = ధైర్యముగలవాఁడు, పండితుఁడు; ధీహీనుఁడు = బుద్ధిహీనుఁడు, బరువోడ = భారముగలయోడ; సురుఁగును = మునిఁగిపోవును; ఇంతయున్ = కొంచెమైనను; సూరివర్య = పండిత వర్యుఁడా.

తాత్పర్యము.

రామచంద్రా! కాఱుచున్న కన్నీటి నధికధైర్యముచే నడ్డగింపుము, కార్యము చేయఁబూనినవాఁడు నిలుకడ గల ధైర్యంబును విడనాడఁ దగునా? వ్యసనమునందు ధననష్టియందుఁ బ్రాణాపదయందు భయమునందుఁ దన బుద్ధిబలముచే ధీరుఁ డొప్పుచుండును. ఎప్పుడు నేడుచు బుద్ధిహీనుఁడు శోకముచే భార మధికమైన నావ సముద్రములో మునుఁగునట్లు మునిఁగిపోవును చేతులు రెండు జోడించి నిన్నుఁ బ్రార్థించెదను.

నాయందు స్నేహభావ ముంచి మన్నింపుము. కొంచెమైనను దుఃఖమునకు సందీయకుము. పౌరుషము సహాయముగాఁ బండితాగ్రణీ! గ్రహింపుము.

ఉ. శోకపరాయణాత్మునకు ♦ సూర్యకులాగ్రణి! లేవు సౌఖ్యముల్
శోకవిలీనచిత్తునకు ♦ లోప మగున్ ఘనతేజ మంతయున్
శోకభరాభిపన్నునకుఁ ♦ జొప్పడు జీవితసంశయంబునున్
శోకము నుజ్జగింపు రిపు♦సూదన! కేవలధైర్య మూనుమీ. ౧౬

శోకపరాయణాత్మునకున్ = శోకమే పరమగతి యను మనస్సుగలవానికి, శోకవిలీనచిత్తునకున్ = శోకమున మునిఁగిన మనస్సుగలవానికి; శోకభరాభిపన్నునకున్ = శోకాతిశయముగలవానికి, జీవిత సంశయంబు = బ్రతుకుపాటునందు సందేహము, ఉజ్జగింపు = వదలుము, రిపుసూదన = శత్రుసంహారకుఁడా;

తాత్పర్యము.

రామచంద్రా! శోకమే పరమగతి, అంతకుమించి మనమేమి చేయఁగల మను వానికి సుఖములేదు. శోకమునందు మునిఁగిపోయినవానికిఁ దేజస్సే చెడిపోవును; శోకవంతునకు బ్రదుకుపాటు దుర్ఘట మగును. కావున శత్రుసంహారకా! ధైర్యము నొక్కదానినే యవలంబింపుము.

ఉ. స్నేహముచే హితం బిటులు ♦ చెప్పఁ గడంగితిఁ గాని రామ సం
దేహము లేదు నీకు నుప♦దేశము చేయఁగ నెంతవాఁడ, నా
స్నేహము గౌరవించి యిటు ♦ చెప్పినవాక్యము లాదరించి యీ
మోహముఁ జిత్తదాహమును ♦ మోడ్పడఁ జేయుము రాజనందనా! ౧౭

తాత్పర్యము.

స్నేహవశమున నీకు హితమైన దానిని నేను జెప్పుచున్నాను గాని నీకుఁ దెలియనిదాని నుపదేశము చేయఁదలఁపలేదు. నీకుఁ జెప్పునంతటి వాఁడనా నేను? కావున నా స్నేహమును గౌరవించి నేను జెప్పిన మాటలయం దాదరముంచి మన మేలునకే కదా చెప్పుచున్నాఁడని యెంచి యీమోహము మనస్తాపము నణఁపుము.

ఉ. నెయ్యముఁ దియ్యముల్ వెలయ ♦ నీరజబాంధవసూనుఁ డాడినన్
గ్రయ్యలనెయ్యులై విడక ♦ కాలెడు నగ్నివులం జెరంగునన్
జయ్యన నొయ్యనం దుడిచి ♦ సాజపుఁజిత్తముతోడఁ గ్రోఁతిరా
జియ్యను నయ్యినాన్వయుఁడు ♦ చేరఁగఁ దీసి ప్రియంబు నెక్కొనన్. ౧౮

నెయ్యము = స్నేహము- తియ్యము = ప్రియము- నీరజ బాంధవసూనుఁడు= సుగ్రీవుఁడు- క్రయ్యల నెయ్యులై = కాలువలకు స్నేహితులై- కాలువలవంటివై- చయ్యనన్ = త్వరగా; ఒయ్యనన్ = మెల్లఁగా; సాజపుఁజిత్తము = స్వాభావికమైన మనస్సు; రాజియ్య = రాజశ్రేష్ఠుఁడు ఇనాన్వయుఁడు = సూర్యవంశమునఁ బుట్టినవాఁడు- రామచంద్రమూర్తి.

తా త్ప ర్య ము.

స్నేహము ప్రియము ప్రకాశించునట్లు సుగ్రీవుఁడు చెప్పఁగాఁ గనులనుండి కాలువలై పాఱు నీటిని మెల్లగాఁ దుడుచుకొని యొప్పటి మనస్సుతో సుగ్రీవునిఁ జూచి రామచంద్రమూర్తి యిట్లనెను.

ఉ. క్రుచ్చి కవుంగిటం బలికెఁ ♦ గూరిమిమీఱ వయస్యుఁడైనయా
యచ్చపుమేలు కోరు సుగు♦ణాధికుఁ డెయ్యది చేయ నర్హమాఁ
బొచ్చెము లేక తీఱములఁ ♦ బూనిక నీవును నిప్పు డట్టులో
నచ్చెలి యుక్తకార్యమును ♦ నెమ్మి నొనర్చితి నన్నుఁ దేర్చుటన్. ౧౯

వయస్యుఁడు = స్నేహితుఁడు. తీఱములన్ = కష్టములందు;

తా త్ప ర్య ము.

కౌఁగిట నొత్తి ప్రేమతో మిగులఁ బ్రేమముగల గుణసంపన్నుఁడు మిత్రుఁడు తనమిత్రున కాపదవేళ నెట్లు వర్తింపవలయునో నీవు నన్ను సమాధాన పఱుచుటచే నట్లు వర్తించినవాఁడవైతివి.

ఉ. అక్కఱవేళ నాదుకొను♦నట్టిరు బంధువు లన్న మిత్రమా!
యెక్కడ నాకు లభ్యపడు ♦ నిట్టి హితాత్ముఁడు చుట్ట మందులో
నిక్కరణిన్ విపద్దశల ♦ హీనత నొందినవేళ, నక్కటా
నిక్కపుఁజుట్ట మీవు, మది ♦ నిర్మలతం గనె నీదువాక్కులన్. ౨౦౦

ఆదుకొను = సహాయపడు, అట్టిరు = అట్టివారు.

తా త్ప ర్య ము.

మిత్రుఁడా! బంధువు లనఁగా రక్తసంబంధము మాత్రము గలవారు కారు. అట్టి సంబంధమున్నను లేకున్నను తనయక్కఱల నవసరములఁ దనకు సహాయపడు వారెవరో వారు నిజమైన బంధువులు. ఇటువంటి హితముఁ గోరువాఁడు నక్కఱకాదు కొనువాఁడు నా కెక్కడ లభించును? సంపదలోఁ దులఁ దూఁగు వానికి లభించిన లభింతురేమో కాని యాపదనొంది నీచస్థితియందు నీవా యనువారు లేని కాలంబున నీవంటి వా రెక్కడ లభింతురు? కావున నీవు నిజమైన చుట్టమవు, నీ మాటలచేత నా మనస్సు నిర్మల మయ్యెను.

సుగ్రీవుఁడు "మన దుఃఖసుఖంబులు పొందె నైక్యమున్" (౧౯ ౫ వ ప) అని చెప్పెను. ఇది యెంతమాత్రము నిజమో పరీక్షించుటకై రామచంద్రమూర్తి యీ వగలేడ్పులేడ్చెనని తోఁచుచున్నది. ఇది రాజనీతి లక్షణము. నిజమైనప్రీతి సుగ్రీవునకు లేదేని యాయన కంట నీరు కాఱియుండదు. ఇట్టిమాటలు చెప్పియుండఁడు, సుగ్రీవుఁడు నిజముగాఁ గడుపులోఁబెట్టికి చెప్పెను. రామచంద్రమూర్తి యీ ప్రకారము సీతాలక్ష్మణ భరతులను బరీక్షించెను గదా! ఈ వగలమారి విద్య రామచంద్రునకు బాగుగ వచ్చును. రాజనీతి వేశ్యానీతి సమానములు. "ఏతా హసంతి చ రుదంతి చ విత్త

హేతోః విశ్వాసయంతి పురుషం న చ విశ్వసంతి'' మృచ్ఛక. రాజు లనేక విధములఁ బరీక్షించి కాని క్రొత్తవారిని విశ్వసింపరు. దీనివలన నెవరినైనఁ బరీక్షింపక వారితో మైత్రి చేయరాదు అని యేర్పడుచున్నది.

ఉ. చేయుము యత్న మింక సరసీరుహనేత్రిను దుష్టబుద్ధి యై
 తేయుని రౌద్రకర్మునిఁ ♦ దెప్పున రోయుఁగ, నిప్పు డేను నన్
 జేయు మటంచుఁ బల్కెదవు ♦ చెప్పుము జంకక, వానకారునం
 దాయిత మైన మేలిమడి ♦ యట్లు దలంపుము నన్ను మిత్రమా. ౨౦౧

రౌద్రకర్మునిని = క్రూరకార్యములు చేయువానిని, ఆయితము = ఎత్తుటకు సిద్ధపడిన

తాత్పర్యము.

సుగ్రీవా! నీవు నాయందింత నిజమైన ప్రేమము గలవాఁడవుగనుక నిఁక "నీవట్లు చేయుము, ఇట్లు చేయుము" అని నేను చెప్పను. దుష్టబుద్ధియుఁ గ్రూరకార్యములు చేయువాఁడునగు రాక్షసుని వెదకుటకుఁగాను జేయవలసిన యత్నము నీవే చేయుము, ఇఁక నేనా విషయమై ప్రశంసింపను గాని యిప్పుడు నన్నేమి చేయు మనెదవో చెప్పుము. వానకాలమునందు విత్తుటకు సిద్ధము చేయఁబడిన మడికయ్యగా నన్నెంచుము. నీవు వేయు విత్తనముకొలఁది నీకు ఫలముండును. ఆలోచన చెప్పవలసినది నీవంతు అది ఫలింపఁ జేయునది నావంతు. ఈ సందర్భమున నీ శ్లోకార్థ మనుసంధించునది.

నమాతరి నదారేషు నసోదర్యే నచాత్మని
విశ్వాస స్తాదృశః పుంసాం యావ న్మిత్రే స్వభావజే॥

స్వభావసిద్ధ మైత్రిగలవాని యందుఁ బురుషుఁ డుంచు విశ్వాసము తల్లియందుఁ గాని భార్యయందుఁగాని సోదరులందుఁగాని తనయందుఁగాని యుంచరాదు.

కం. విపులాభిమానమున నే, నిపు డాడినభాషణంబు ♦ లెల్లను నీవో
 కపివర! యేమో లే యని, యుపకర్షింపకుము తత్త్వ♦మని నమ్ము మిఁకన్. ౨౦౨

విపులాభిమానమునన్ = (౧) స్నేహభావముచే నీ యందుఁగల యభిమానముచే (౨) నా శౌర్యమునందుఁగల గొప్ప యభిమానముచే, అపకర్షింపకుము = తక్కువగాఁ జూడకుము. తత్త్వము = సత్యము.

తాత్పర్యము.

సుగ్రీవా! యిప్పు డీయన చెప్పిన మాటలు నా యందుఁగల గొప్ప స్నేహభావముచేత ముఖప్రీతిచేతఁగాని తన శౌర్యమునందుఁగల యభిమానముచేఁ గాని చెప్పినే కాని నిజముగా నీయన చెప్పినంత చేయఁబూనినాఁడా యని యుపేక్షింపకుము. నేను జెప్పినది సత్యమని నమ్ముము.

కం ఆడ నసత్యముఁ బూర్వం, బాడుటలే దింక నెన్నఁ♦డైనను హితుఁడా
 వీడుము శంకను శపథం, బాడెద సత్యంబుమీఁద ♦ నమలచరిత్రా. ౨౦౩

శపథంబు = ఒట్టు- ప్రమాణము- అమలచరిత్రా = దోషరహితమైన నడవడిగలవాఁడా.

తా త్ప ర్య ము.

ఇంతవఱకు నే నసత్యమాడినది లేదు. ఇఁక నాడఁబోవునది లేదు. మిత్రమా! సందేహము వదలుము. సత్యముపైఁ బ్రమాణముచేసి చెప్పెదను.

కం॥ హిత మగు రామునివాక్యముఁ, బ్రీతినయు నాలించి కీశ♦పతియుఁ సచివుల్
వితతముదంబును గొని రీ,గతులం దలపోసికొనిరి ♦ కపినృపవర్యుల్. ౨౦౪

తా త్ప ర్య ము.

రామచంద్రమూర్తి చెప్పిన హితవాక్యములు ప్రతిజ్ఞ విని సుగ్రీవుఁడు మంత్రులు నధికముగ సంతోషించిరి. ఈ విధముగ రామ సుగ్రీవులు వారి వారి సుఖదుఃఖము లొకరితో నొక రేకాంతమునఁ జెప్పిరి.

కం॥ ఏకాంతంబునఁ దమ యు,స్తోకసుఖవ్యథల; నంత ♦ సూర్యతనూజుం
డేకాంత మలరెఁ దనపని, చేకూరె నిజం బటంచుఁ ♦ జిత్తములోనన్. ౨౦౫

ఏకాంతంబునన్ = ఇతర విచారములేక, ఏకాగ్రమనస్సుతో = ఏక నిశ్చయముతో, ఇప్పు డిచ్చట నేఁకుగు రున్నారు. కావున నీయర్థము వ్రాయఁబడెను. ఏకాంత మలరెన్ = మిగుల సంతోషించెను.

తా త్ప ర్య ము.

ఏకనిశ్చయముతో రామసుగ్రీవు లిట్లు తమ సుఖదుఃఖములు చెప్పఁగా విని సుగ్రీవుఁడు తన కార్యము సఫలమాయె నని మిగుల సంతోషించెను.

---♦ ౮-వ సర్గము. సుగ్రీవుఁడు శ్రీరామునితోడి మైత్రిని గొనియాడుట. ♦---

సీ॥ సౌమిత్రి వినుచుండ ♦ జానకీజానితోఁ, బలికె ని ట్లని కపి♦పరివృఢుండు
నిర్జరతతికైన ♦ నే ననుగ్రాహ్యుండ, నైతి నీ యట్టి మ♦హానుభావుఁ
డొదవుట మిత్రుఁడై ♦ యొక యింత దలఁచిన, నీదుసాయంబున ♦ నెఱలభించు
స్వారాజ్యమైనను ♦ బలుకంగ నేల, స్వరాజ్యంబు మాటను ♦ బ్రభువరుండ
ఆ॥ రాఘవాన్వవాయ♦రత్నంబుతోడుత, నేస్త మొనరు కతన ♦ నేఁడు నేను
బంధుకోటులకును ♦ బ్రాణమిత్రులకును, బూజ్యతముఁడ నైతిఁ♦బుణ్యశీల. ౨౦౬

పరివృఢుండు = శ్రేష్ఠుఁడు, నిర్జరతతికిన్ = దేవతల సమూహమునకు, అనుగ్రాహ్యుండన్ = అనుగ్రహింప యోగ్యతగలవాఁడను, స్వారాజ్యము = స్వర్ + రాజ్యము = స్వర్గరాజ్యము, స్వారాజ్యము =సొంతరాజ్యము, కపిరాజ్యము, నేస్తము= స్నేహము.

తా త్ప ర్య ము.

లక్ష్మణుఁడు వినుచుండఁగా వానరరాజగు సుగ్రీవుఁడు రామచంద్రుతో నిట్లనియె. నీవంటి గొప్ప మహిమగలవాఁడు నాకు మిత్రుఁడుగా లభించుటచే దేవతల

యందఱ యనుగ్రహామునకు నేను యోగ్యుఁడనై తిని. ఇంతవఱకుఁ గొండ కోతి యని తలఁచిన వారికమీఁద రామస్నేహితుఁడని యెంతో గౌరవింతురు. నీవు కొంచె మాలోచించితి వేని నీసాహాయ్యముచే నాకు నీకపిరాజ్యము మాటయేల స్వర్గప్రభుత్వమైన లభించును. రఘువంశంబునఁ బుట్టినవారిలో శ్రేష్ఠుఁడ వగు నీతో నాకు స్నేహము లభించుటచే నా చుట్టముల కందఱకుఁ బొత్రమిత్రులకు మిగులఁ బూజనీయుఁడనైతిని. నీకారణమున నీఁక నందఱు నన్ను విశేషముగ గౌరవింతురు.

దీని వలన "నీచాశ్రియం నక ర్తవ్యం, క ర్తవ్య మ్మహదాశ్రియ" మ్మన్నట్లు నీచుల నాశ్రియింపరాదు, గొప్ప వారినే యాశ్రియింపవలెను.

ఉ. నీ కనురూపమిత్రుఁడను ♦ నే నని నీవ క్రమక్రమంబుగా
నాకినుతా! యెఱింగెదవు ♦ నామది గొల్పదు నా గుణంబులం
బ్రాకటలీలఁ జెప్పుకొనఁ ♦ ద్వద్విధధన్యకృతాత్మపాళి క
స్తోకపుఁ బ్రీతి నిశ్చలము♦సూ ధృతి జ్ఞానుల యందునుం బలెన్. ౧౦౭

అనురూప = తగిన, నాకినుతా = నాకి = నాకమునందుండువారు, దేవతలు, వారిచే స్తోత్రము చేయఁబడినవాఁడా, త్వద్విధ = నీవంటి, ధన్య = పుణ్యులఁను, కృతా త్మ = శాస్త్రశిక్షితమై పరిపక్వమైన మనస్సు గలవారలయు, పాళికిన్=సమూహామునకు, నిశ్చలము = చలనము లేనిది, ధృతి = ధైర్యము.

తా త్ప ర్య ము.

నీకుఁ దగిన మిత్రుఁడను నే నని రామచంద్రా! కాలక్రమమున నీవే యెఱుంగఁ గలవు. నాగుణములగుఱించి నేనే చెప్పుకొన మనస్సు గొల్పదు. ఆత్మప్రశంస మరణ ప్రాయ మని పెద్దలు చెప్పుదురుగదా. ఇది నా విషయము. నీ విషయమునందును నాకు సందేహములేదు. నీవంటి ధన్యులు కృతకృత్యులు స్థిరచిత్తము గలవారుగా నుందురేకాని చపల చిత్తులుగా నుండరు. జ్ఞానులయందు ధైర్యమువలె వారియందుఁ బ్రీతి నిశ్చంచలమై యుండును.

కం. సాధువు లగు స్నేహితుల మ,హాధనమును వెండి పైఁడి ♦ యాభరణంబుల్
సాధువు లగువారలు ని,ర్బాధముగ నభేదబుద్ధి ♦ భావింతు రయా. ౧౦౮

పైఁడి = బంగారు, నిర్బాధముగన్ = జంకులేక, అభేదబుద్ధి= తనదే యను భావములో, మహాధనము = గొప్ప వెలగలవి.

తా త్ప ర్య ము .

ఇరువురు స్నేహితులు సాధువులైననో మిగుల వెలగల పదార్థములు వెండి-బంగారు సొమ్ము లొకరివి మఱియొకరు తమ సొంతపదార్థములవలెనే జంకు లేక పర ద్రవ్య మను భేదబుద్ధి లేక యుపయోగింతురు.

కం. అతిధనికుఁడో నిఱుపేదయొ, తతదుఃఖతుఁడో సుఖై క♦తత్పరుఁడో నిం
దితదోషుఁడొ నిర్దోషియొ, హితుఁ డొక్కఁడె పరమగతి య♦హీనగుణాఢ్యా.

సుఖైక తత్పరుఁడో = సుఖమునందే యాసక్తిగలవాఁడో, నిందిత దోషుఁడు= నిందింపఁబడిన దోషములుగలవాఁడు, నిర్దోషి = దోషములేనివాఁడు. అహీన గుణాఢ్యా=గొప్ప గుణము లను సంపద గలవాఁడా! దీనివలన స్నేహితులయందలి గుణదోషములు విచారణీయము గావనుచున్నాఁడు. కలిసి తెలియరాదు తెలిసి కలియరాదు. అని సామెత.

తా త్ప ర్య ము .

తన స్నేహితుఁడు ధనవంతుఁడు కానీ కేవల దరిద్రుఁడు గానీ, దుఃఖములో మునిఁగియుండనీ, సుఖభోగము లనుభవించుచుండనీ, దోషిగానీ, దోషరహితుఁడుగానీ స్నేహితుఁడే యుత్తమగతి స్నేహితులందలి గుణదోషము లెంచరాదు.

కం.ధనములు పోయినఁ గానీ, ఘనసుఖములు నాశ మైనఁ ♦ గానీ తనకుఁ
దనువే పోయినఁ గానీ, తనమిత్రుని కార్యమునను ♦ దగు వర్తింపన్. ౨౧౦

తా త్ప ర్య ము .

ధనము పోయినను సుఖము లన్నియు నాశనమైనను తన దేహమే పోయినను తన మిత్రుని కార్యము నెఱవేర్ప వలయును. దాని నిమిత్తమై మనమేల చెడవలె ననరాదు.

మైత్రి బంధ మెంత బలిష్ఠమైనదో తెలిసినఁగాని రామచంద్రమూర్తి సుగ్రీవు విషయంబున జరపిన చర్య సుబోధముగాదు. కావున నా విషయమైన కొన్ని వాక్య ములు వ్రాయఁబడుచున్నవి.

కరా వివ శరీరస్య, నేత్రయో రివ పక్ష్మణీ ।
అవిచార్య ప్రియం కుర్యా, త్తన్మిత్రం మిత్ర ముచ్యతే॥

శరీరమును జేతులవలెఁ గన్నులను రెప్పలవలె నెవరు తమ మిత్రులకు నితర మేమియు నాలోచింపక కార్యము చేయుదురో వారు మిత్రులు.

ఇది యెట్లన్నను విభీషణశరణాగతి యందలి రామచంద్రమూర్తి వ్రతవాక్య ములు చూచునది.

కం.అని ప్రియము లాడు సుగ్రీవునివచనము లాలకించి ♦ పురుహూతవిభా
ఖుని యగు సుమిత్రతనయుఁడు, వినుచుండఁగ నౌ నటంచు ♦ విభుఁడుం బలికెన్.

పురుహూతవిభాఖుని = ఇంద్రుని తేజస్సుతో సమానమైన తేజస్సునకు గని యగువాఁడు.

తా త్ప ర్య ము.

అని యీ ప్రకారము హితము ప్రియముశైన వాక్యములు సుగ్రీవుఁడు పలు కఁగా శ్రీరామచంద్రమూర్తి లక్ష్మణుఁడు వినుచుండఁగా 'నౌను. నీవు చెప్పినది సత్య'మని చెప్పెను.

లక్ష్మణుఁడు వినుచుండఁగా స్నేహితధర్మములు సుగ్రీవుఁడు చెప్ప నారంభించెను

ననియు శ్రీరామచంద్రమూర్తి లక్ష్మణుఁడు వినుచుండఁగా నౌనని యంగీకరించె ననియుఁ జెప్పుటచే లక్ష్మణుఁ డిరువురకు మధ్యవర్తి యగు సాక్షియని సూచితము. దీనివలన మన మిరువుర మిఁక మీఁద నిట్లు నడచుకొనవలయు నని యంగీకరించి నట్ల య్యెను.

సీ. అంత సూర్యాత్మజుం ♦ డవనీరుహాము శాఖ, నప్పటినుండి యు♦న్నట్టిరామ
లక్ష్మణులను గని ♦ లలితశాఖార్థంబు, నలుదిక్కు లొయ్యనఁ ♦ గలయఁ జూచి
యనతిదూరంబున ♦ నలరులచే నిండి, యాకులు మిక్కిలి ♦ లేక సమద
షట్పదాంచిత మైన♦సాలశాఖ నొకండు, గొనివచ్చివైవఁ గాఁ ♦ గువలయేశ్వ
ఆ. రుండు గూరుచుండ ♦ నొండట్టిశాఖను, హనుమ దెచ్చి లక్ష్మ♦ణునకు వైచె
నంద ఱిట్లు తతసు♦ఖాసీను లై యుండ, భానుకులున కనియె ♦ భానుజుండు. ౨౧౨

అవనీరుహాము శాఖ = చెట్టుకొమ్మ, అప్పటినుండి = సీతసొమ్ములను జూచి నప్పటినుండి, లలిత శాఖార్థంబు=మనోహరమైన కొమ్మకొఱకు, అనతి దూరంబునన్= సమీపమందు, అలరులచేన్ = చిగుళ్ళచే, సమద= మదముతోఁ గూడిన, షట్పద= తుమ్మెదలచే, అంచితమైన = ఒప్పుచున్న, సాలశాఖ = మద్దిచెట్టుకొమ్మ, ఒండు = మఱియొకటి.

లలితశాఖ యనుటచే నంతకు ముందున్న శాఖయందలి ఆకులు చిగుళ్ళు పూలు వాడిపోయి కూర్చుండుటకు మెత్తనగా లేకుండెనని భావము, మరల నాసనము కల్పించుట చెప్పుటచే నిది మఱునాఁటి వృత్తాంతమని తోఁచెడిని.

తాత్పర్యము.

ఆ పిమ్మట సుగ్రీవుఁడు పూర్వము రామలక్ష్మణు లుండిన శాఖలు వాడిపోయి యుండుటచేఁ గ్రొత్తగా మనోహరమయిన దానికై నలువైపులఁ జూచి సమీప మందే యుండఁగా నొక కొమ్మను జిగుళ్లు పూలు దండిగాను ఆకులు కొంచెముగా నుండు దానిఁ దెచ్చి రామచంద్రమూర్తికి వేయఁగా నాయన యందుఁ గూర్చుండెను. ఆవల హనుమంతుఁడు వేఱొకటి యట్టిదానినే తెచ్చి వేయఁగా లక్ష్మణుఁడు గూర్చుండెను. అందఱిట్లు సుఖముగఁ గూర్చుండిన పిమ్మట సుగ్రీవుఁడు శ్రీరామచంద్ర మూర్తితో నిట్లనియె.

ఉ. వేరము మై మదగ్రజుఁడు ♦ వీడు నన్ వెడలంగఁ గొట్టి నా
దార హరింపఁగాఁ దలను ♦ దాఁపఁగఁ బ్రాణభయార్తి ఋశ్యమూ
కోరుధరాధరాన నిటు ♦ లుండెద సంకటపాలునై జగ
ద్వారభయాపనోది! ననుఁ ♦ బాలన సేయు మనాథు దీనునిన్. ౨౧౩

వేరము = విరోధము, వైరశబ్దభవము. "వీరును బాండుపుత్త్రులును వేరము దక్కి పొసంగి మన్కికై" భార- ఉద్యో- 3 ఆ. మదగ్రజుఁడు = మా యన్న, వీడు= ఇల్లు, దారన్ = భార్యను, ఋశ్యమూకోరుధరాధరానన్ = ఋశ్యమూకమను

పేరుగల గొప్ప పర్వతమందు- జగద్వారభయాపనోది = ప్రపంచ సమూహ భయమును బోఁగొట్టువాఁడా, అనాథుఁ = దిక్కులేని వానిని- దీనునిఁ = దరిద్రుని, బాధ చెందియుండు వానిని.

తాత్పర్యము.

మా యన్న యగు వాలి నామీఁదఁ గటువహించి నన్నిల్లు వెడలఁగొట్టి నా భార్యను హరింపఁగా నీక నచట నుండినఁ జంపునను భయముతో నీ ఋశ్యమూక పర్వతమునందు బాధ పడుచున్నాను. సమస్త జీవుల భయము పోఁగొట్టఁగలవాఁడవు నీవు. రక్షకుఁడు లేనివాఁడును దుఃఖించువాఁడును నగు నన్ను రక్షింపుము.

చం. అన విని పిన్ననవ్వు దొలఁక కాఁడఁగ నిట్లను రామభద్రుఁ డో
యనఘుఁడ! మేలు సేయుట వయస్యునిచిహ్నము, శత్రులక్షణం
బనఁ బడుఁ గీడుసేఁత, భవదబ్జముఖిం హరియించి నట్టి మూ
ర్ఖుని వధియింతుఁ జూడు మిదిగో నిపుడే మదిఁ గుంద నేటికిన్. ౨౧౮

భవదబ్జముఖిం = నీ స్త్రీని - ఇల్లాలిని.

తాత్పర్యము.

ఇట్లు సుగ్రీవుఁడు చెప్పఁగా శ్రీరామచంద్రమూర్తి నే నిదివఱకే చెప్పితినే, మరల నది యొక గొప్ప విషయముగాఁ జెప్పుచున్నాఁడే యని చిఱునవ్వుతోఁ బుణ్యాత్మా! సుగ్రీవా! మేలు సేయుట మిత్రలక్షణము, కీడు సేయుట శత్రులక్షణము, కావున నీవు నాకు మిత్రుఁడవు, నీభార్యను హరించిన మూర్ఖుని నిపుడే యిదిగో వధించెదను. దీనికై యేల విచారపడెదవు

చం. అతులమహాజవంబులు మహాద్యుతిమంతము లుగ్రరూపసం
గతములు హేమపుంఖములు స్కందవనోద్భవముల్ హరిస్వరు
ప్రతిమము లుగ్రరుష్టఫణిభంగిని శాతతరాగ్రముల్ సుమీ
ధృతియుత! నా శరంబులు వధించును వాలిని భీతి మానుమీ. ౨౧౯

అతుల = అసమానమైన, మహాజవంబులు = మిగుల వేగముగలవి, మహాద్యుతి మంతములు=విశేషకాంతి గలవి, ఉగ్రరూపసంగతములు = భయంకరములైన యాకారములుగలవి. హేమపుంఖములు=బంగారు పిడులుగలవి, స్కందవనోద్భవముల్ = కుమారస్వామి పుట్టిన తెల్లువనంబునఁ బుట్టినవి, హరి=ఇంద్రుని, స్వరుప్రతిమములు =వజ్రముతో సమానములు - ఉగ్రరుష్ట ఫణి భంగిని=భయంకరమైన కోపించిన పాములవలె, శాతతరాగ్రములు=మిగులఁ బదునైన ముఖములు గలవి, ధృతియుత = ధీరుఁడా.

తాత్పర్యము.

సుగ్రీవా! నాబాణము లెట్టివని తలఁచితివో, మిగుల వేగముగఁ బోవునవి, మిఱుమిట్లు గొలుపు కాంతి గలవి, చూచుటకు భయంకరములగు నాకారములుగలవి,

బంగారు పింజలుగలవి, కుమారస్వామి వనమునఁ బుట్టినవి, ఇంద్రుని వజ్రాయుధము తో సమానములైనవి, భయంకరమై కోపించిన పాములవలె మిగుల వాఁడియైన ముఖములు గలవి సుమా. నీవు వీనిని జూచి ధైర్యము దెచ్చుకొమ్ము. వాలిని దప్పక వధింతును, భయపడకుము.

కం. పవిధారాహతిఁ గూలిన, యవనీధర మనఁగ వాలి ♦ యఘుమతి ద్రెళ్లన్
దివసాధిపనందన! హర్ష వికాసము దోఁపఁ జూచి ♦ సంతసపడుమీ. ౨౧౬

పవిధారాహతి = వజ్రాయుధము వాఁడియంచుదెబ్బచే, అవనీధరము = కొండ, అఘమతి = జారత్వమందుఁ బాపపు మనస్సుగలవాఁడు. దివసాధిపనందన= సూర్యపుత్రా.

తా త్ప ర్య ము.

వజ్రాయుధము దెబ్బచేఁ బడిన కొండవలె వ్యభిచారమందుఁ బాపపు మనస్సు గల వాలి నేలఁబడఁగా, సుగ్రీవా! సంతోషముతోఁ జూడఁగలవు.

కం. అను రామునివచనంబులు, విని సుగ్రీవుండు హర్ష ♦ వికసితముఖుఁడై
వనజాక్షు మేలు మే లని, సనయంబుగఁ బ్రీతిమైఁ బ్ర ♦ శంసించి మఱిన్. ౨౧౭

హర్ష వికసితముఖుఁడై = సంతోషముచే వికసించిన మనస్సుగలవాఁడై

తా త్ప ర్య ము.

ఈ ప్రకారము చెప్పిన రామచంద్రమూర్తి పలుకులు విని సంతోషముచే ముఖము వికాసము నొందఁగా సుగ్రీవుఁడు శ్రీరామచంద్రమూర్తిని మేలు మేలని ప్రస్తుతించి మఱియు నిట్లనియె.

కం. దేవా శోకార్తులకును, నీవే గతి యగుట శోక ♦ నిహతుఁడ నగుటన్
నీవు చెలి వౌట నేఁ బరి, దేవన మొనరింతు నిట్లు ♦ దేవురు దోఁపన్. ౨౧౮

శోకార్తులకున్ = శోకముచేఁ బాధపడువారికి, శోకనిహతుఁడన్=శోకముచేఁ గొట్టఁబడిన వాఁడను, చెలివి = మిత్రుఁడవు, పరిదేవనము = రోదనము, దేవురు = దైన్యము.

తా త్ప ర్య ము.

దేవా! శోకపీడితులకు నీవే గతివి, నేనో శోకపీడితుఁడను, కావున నీవే నాకును గతివి, అంతమాత్రమే కాదు, నీవు నాకు మిత్రుఁడవు కావున నన్ను రక్షింపవలసిన భారము నీయందెక్కువగఁ గలదు. ఈ కారణములచే దీనుఁడనై యేడ్చెదను.

ఉ. పావకసాక్షికంబుగను ♦ బాణిని బాణిని వైచి మైత్రి సం
భావనఁ బ్రాణదానమును ♦ స్పష్టముగాఁగ నొసంగుటన్ ధృతిన్
దేవర ప్రాణమిత్ర మని ♦ నెమ్మది నమ్మి మదీయచిత్తముం
బావకుభంగి నెల్లపుడు ♦ మాడ్చెడి దుఃఖముఁ జెప్పఁ బూనితిన్. ౨౧౯

పావక సాక్షికంబుగన్ = అగ్నిహోత్రుఁడు సాక్షిగ, పావకుభంగిన్ = అగ్నివలె, మాడ్చెడి = మాఁడుచులో నర్ధానుస్వారమున్నను సంయుక్తాక్షరమునకు ముందర్ధానుస్వారము లేదు కావున లుప్తము.

తాత్పర్యము.

అగ్నిసాక్షిగ నా చేతిలో నీవు చేతిని వైచి మైత్రి గావించి నాకుఁ బ్రాణదానమును నిస్సందేహముగా నిచ్చిన కారణముచే ధైర్యముగలవాఁడనై దేవుఁడవగు నిన్ను నా ప్రాణమిత్రుఁడవని నిండు మనస్సున నమ్మి నా మనస్సును సర్వదా యగ్నివలెఁ గాల్చు దుఃఖము నీతోఁ జెప్ప యత్నించితిని. అల్పవిషయమైన యెడల నేను జెప్పియుండను.

కం. అని యింతవట్టు పలికియుఁ, గనుఁదమ్ముల వెల్లివిరియఁ♦గా బాష్పంబుల్
 పెనుడగ్గుత్తిక పడి యా, వనచరపతి పలుకలేఁడ ♦ వాక్యం బొకఁడున్. ౨౨౦

ఇంతవట్టు = ఇంతమాత్రము, ఇప్పుడు చెప్పినంతవఱకు.

తాత్పర్యము.

ఈ మాత్రము చెప్పి కన్నులనిండ నీళ్ళు కాల్వలు పాఱఁగా డగ్గుత్తికతో సుగ్రీవుఁ డొక్కమాటయైనఁ జెప్పలేఁడయ్యెను.

కం. ధీరుఁడు సుగ్రీవుఁడు త,ద్వారిని వారించి తుడిచి ♦ బాష్పములు మహో
 దారధృతి నూర్చుచును రఘు,వీరునితో నిట్లు లనియె ♦ వెండి నిజకథన్. ౨౨౧

తద్వారిని = ఆకన్నీళ్ళను, మహోదార ధృతిన్ = మిగుల గొప్పదగు ధైర్యముతో, ఊర్చుచును = శ్వాసపుచ్చుచు.

తాత్పర్యము.

ధీరుఁడగు సుగ్రీవుఁడు తన కనులవెంటఁ గాఱుచున్న నీళ్ళను నాకు బుద్ధిచెప్పి తానే యేడ్చుచున్నాఁడని రాముఁడనునో యను భయముచే నిలిపి కాఱిన వానిని దుడిచి మిగుల ధైర్యముతో దీర్ఘశ్వాసము బుచ్చుచు రామచంద్రునితోఁ దనకథ మఱియు నిట్లు చెప్పెను.

—♦ శ్రీరామునితో సుగ్రీవుఁడు వాలి దన్నుఁ బరిభవించినవిధంబుఁ జెప్పుట ♦—

సీ. రామ యావాలి తా ♦ రాజయి యేలఁగ, యువరాజనై నేను ♦ నుంట నాఁడు
 పెలుచ నుచ్చావచం♦బులు దూషణములాడి, క్రూరుఁడై వెడల నర్ ♦ద్రోచినాఁడు
 నాప్రాణములకంటె ♦ నా కతిప్రియ యైన, యిల్లాలినిన్ హరి♦యించినాఁడు
 నా ప్రియమిత్రుల ♦ నాదుసంబంధులఁ, జెఱసాలలందు దాఁ ♦ జేర్చినాఁడు
తే. విడక నా ప్రాణములఁ గన్ను ♦ వేసినాఁడు, చంపఁగా నన్నుఁ బెక్కురఁ♦బంపినాఁడు,
 చెనఁటి యుక్తుల నెన్నియో ♦ చేసినాఁడు, చెప్ప శక్యంబె యాతఁడు ♦ చేయు కీడు

ఉచ్చావచంబులు = నానా విధములు.

తా త్ప ర్య ము .

రామచంద్రా! వాలి నాకుఁ జేసిన కీడు చెప్పెదవినుము, వాలి రాజయి యుండఁగా నేను యువరాజనై యుంటిని. అప్పుడు నన్ను నానావిధములఁ దిట్టి దయలేక నన్ను వెడలఁగొట్టినాఁడు. నా ప్రాణములకంటెఁ బ్రియురాలగు నా భార్యను హరించినాఁడు. నాయందుఁ బ్రీతిగల మిత్రులను బంధువులను జెఱసాలలోఁ ద్రోచినాఁడు. ఇంతతో వదలక నా ప్రాణములు దీయఁ గనిపెట్టియున్నాఁడు. నన్నుఁ జంపుటకుఁ బెక్కుమందిని బంపినాఁడు. ఇంకను నన్ను మోసగించి వధింపఁ జెడ్డయుక్తు లెన్నియో చేసినాఁడు. అతఁడు చేసిన కీడులు చెప్ప సాధ్యమా ?

ఉ. ఆతఁడు పంపఁ బంప మఱి ♦ యందఱ నేనును జంపఁ జంప ని
ట్లో తరణీద్యువంశ్య చను♦చున్నది కాలము, దాన నే కదా
యీ తరుచారివర్గమును ♦ నేనును మిమ్ములఁ జూచినంతనే
భీతిని దత్తరిల్లితిమి ♦ భీతి నెవండు కలంగ కుండెడున్. ౨౩

తరణీద్యువంశ్య = సూర్యునిప్రశస్తవంశమునఁ బుట్టినవాఁడా! తరుచారివర్గమును = వానర సమూహమును.

తా త్ప ర్య ము.

నన్నుఁ జంపుటకై వాలి యెవరినో పంపఁగాఁ బంపఁగా నేను వారిని జంపఁగాఁ గాల మిట్లుపే పోవుచున్నది. వాఁడో నేనో పోవువఱకుఁ గాలమిట్లు గడవ వలసినట్లే యున్నది. ఆ కారణముచేతనే కదా నేను నీ శ్రోత్రులు మిమ్ముఁ జూచినపుడు మరల నెవరో మనలఁ జంప వాలిచేఁ బంపబడి వచ్చినవారే యని భయముచేఁ దత్తఱిల్లితిమి. భయకారణము కలిగినపు డెవఁడు వ్యాకుల పడకుండును.

కం. కేవల మీ హనుమత్ప్రిముఖావనిరుహచరులు తగుసహాయులుగా నే
జీవించి యున్నవాఁడను, దేవా పలుకష్టములను ♦ దేవురుపడుచున్. ౨౪

తా త్ప ర్య ము .

ఈ హనుమంతుఁడు మొదలగు వానరులు మాత్రమే నాకుఁ దగిన సహాయులుగాఁ గొని దీనుఁడనై యెన్ని కష్టములో పడుచుఁ బ్రాణముతో నున్నాఁడను.

కం. నే నిలువఁ దారు నిలుతురు, నే నడచినఁ దారుఁ గూడ♦నే నడచెద రీ
మానితచరిత్రు లిటు నా, ప్రాణముఁ గాచెదరు చూవె ♦ బంధువతంసా. ౨౫

బంధువతంసా = బంధువులందు శ్రేష్ఠుఁడా.

తా త్ప ర్య ము.

నేను నిలచితినా, వీరును నా వెంటనే వచ్చి చుట్టు నిలుతురు. నేను నడచితినా వారును నడతురు. ఈ గౌరవయోగ్యమగు నడవడి గలవారలు నా ప్రాణము నీరీతిగాఁ గాపాడుచున్నారు.

ఉ. ఏ లతివిస్తరంబు జగ • దీశ్వర చెప్పెద సంగ్రహంబుగా
వాలిన విక్రమంబు గల • వాఁడు పరాక్రమహేళి వాలి రి
ప్వాళులపాలి కీలి హతుఁ • డై ధరఁ గూలిన గాక నాదు దుః
ఖాలి యడంగునే కడుపు • హోయి యొనర్చునె నిద్ర వచ్చునే. ౨౬

అతివిస్తరంబు = ఎక్కువ మాటలతోఁ జెప్పుట, పరాక్రమహేళి = పరాక్రమమందు సూర్యుఁడు, రిప్వాళులపాలి = శత్రుసమూహముల పాలిటికి; కీలి = అగ్నిహోత్రుఁడు.

తాత్పర్యము.

రామచంద్రా! యెక్కువమాటలేల? సారాంశము సంగ్రహముగాఁజెప్పెదను, వాలి మహాపరాక్రమశాలి, సూర్యునివంటివాఁడు. శత్రువు లను నడవులకుఁ గాఱుచిచ్చువంటివాఁడు. అట్టివాఁడు చచ్చి నేలఁబడినఁగాని నా దుఃఖములు పోవు. అన్నము సుఖమియ్యదు, కంటికి నిద్రరాదు.

క. అలమిన నా వనటలకుం, బలికితిఁ గడపలను దుఃఖ • పాటున రామా
యిల దుఃఖితుఁడో సుఖయో, చెలికానికి నెపుడు దిక్కు • చెలికాఁడె సుమీ.

అలమిన = కలిగిన, వనటలకున్ = బాధలకు, కడపలను = తుదిని.

తాత్పర్యము.

రామచంద్రా! నాకు సంభవించిన దుఃఖము లేమిచేసిన సమయునో దానిని జెప్పితిని, కష్టదశయందుండువాఁడు గానీ, సుఖ మనుభవించువాఁడు గానీ మిత్రునకు మిత్రుఁడే దిక్కు.

ఉ. అంతయు నాలకించి వసు • ధాధిపుఁ డిట్లను వాలితోడ నీ
కింతవిరోధ మెట్లొదవె • నెల్ల వచింపుమ యాలకించి నే
నంత బలాబలంబులను • నారసి కార్యము చక్కఁబెట్టెదన్
జింతిలఁబోకు ధైర్యమును • జేకొని పల్కుమ యానుపూర్విగన్. ౨౭

ఆనుపూర్విగన్ = మొదటినుండి, బలాబలంబు లారసి = విరోధము గొప్పదా విరోధకారణము గొప్పదా యని యాలోచించి.

తాత్పర్యము.

ఇట్లు సుగ్రీవుఁడు చెప్పినదంతయు విని రామచంద్రమూర్తి యిట్లనియె. వాలి నీ కన్నగదా, అతనితోడ నీ కింత విరోధము కలుగఁ గారణమేమి? నీవేమి దోషము చేసితివి? సమస్తము చెప్పుము. మీ దోషంబులందలి బలాబలములు విచారించి కారణ మల్పము, విరోధము ప్రబలమైనచో వాని నిప్పుడే వధించెదను. కారణము గొప్పదై విరోధమల్పమైనచో సమాధానము కుదిర్చి కార్యముఁ జక్కఁబెట్టెదను. నీవు విచారపడకుము. ధైర్యము వహించి మొదటినుండి మీ చరిత్రముఁ జెప్పుము.

ఉ. నీయవమానపాటుకథ ♦ నే విని నంతన నా మనంబునన్
బాయనితీవ్రమా కినుక ♦ ప్రజ్వరిలెన్ జలదాగమంబునం
దాయతవేగ మా జలము♦నట్టులు చిత్తము కంపమొందె నీ
దాయయ నాదు దాయ యని ♦ తథ్యము నమ్ముము వానరేశ్వరా! ౨౭

కినుక=కోపము- ప్రజ్వరిలెన్=మండెను. జలదాగమంబునన్=వానకాలమందు. ఆయతవేగము = విస్తారవేగము, దాయ = విరోధి.

తా త్ప ర్య ము.

నీకుఁగలిగిన యవమాన చరిత్రము విన్నమాత్రముననే నాకు మనంబునఁ గోధాగ్ని మండుచున్నది. వానకాలమందు మిగుల వేగము గల ప్రవాహమువలె మనస్సు చలించుచున్నది, నీవిరోధి నావిరోధి యని సత్యముగ నమ్ముము.

ఇచ్చట రామచంద్రమూర్తి యిట్లుచెప్పుట తప్పు. ఈ కలహమునకు మూల కారణ మేదో కలహకారకు లెవరో రామచంద్రునకుఁ దెలియదు. సుగ్రీవుఁడు తన కనుకూలముగ నుండు దానినే చెప్పును గాని వాలి కనుకూలమైనది చెప్పఁడు, వాలి పక్షమునఁ జెప్పెడువారు లేరు. ఇట్లుండ నీ శత్రువే నాశత్రు వనవచ్చునా? రామ చంద్రమూర్తి యనాలోచితముగఁ జెప్పలేదు. అన్నదమ్ములలోఁ గలహము వచ్చుట సహజము. దాని కర్థము మూలము. అట్లు కలహము వచ్చినపుడు ధర్మాత్ము లగు వారు దాయభాగప్రకారము పంచుకొని పరిష్కరించు కొనవచ్చును. లేక యొకఁడు బలవంతుఁ డాయెనా? సర్వము దానే ధన కాముకుఁడై హరించుట సహజము అయి నను నిది ధర్మవిరుద్ధము కావున వాలి రాజ్యకాంక్షచే సర్వము హరించినను గట్టు వస్త్రముతో వెడలఁగొట్టుట మొదటి తప్పు. సుగ్రీవుఁడు యువరాజయినపుడు రాజ్య మున భాగమున కర్హుఁడగు చున్నాఁడు. అంతతోఁ బోనీయక సుగ్రీవుని బంధువుల నందఱఁ జెఱసాలలో నిష్కారణముగ నుంచుట రెండవ తప్పు. ఇది రాజనీతి యందు రేమో. ధర్మవిరుద్ధమైన రాజనీతి యంగీకార్యముకాదు:- భారతయుద్ధమున కిదియేకదా కారణము. అంతియగాక యతని భార్యను హరించుట మూఁడవ ప్రబల దోషము. ద్రౌపది చీరల నొలుచుటయే దోష మని చెప్పఁబడినపుడు మఱఁదలిని జెఱుచుట ఘోర పాప మనుట యందు సందేహమేమి? ఇవన్నియు సుగ్రీవుఁడు చెప్పినమాటలే కదా యందు రేమో, సత్యము. అయినను రాజ్యము బోఁగొట్టుకొ యుల్లాడుచుండుట ప్రత్యక్షము. వాలి సుగ్రీవుని భార్యను హరించెనని సుగ్రీవుఁడు చెప్పకముందే యీవిచారము రాకముందే రామ సుగ్రీవులకు సంబంధము లేకముందే ప్రథమ దర్శనముననే హనుమంతుఁడు చెప్పెను. పద్యము. ౧౮౬ చూచునది. హను మంతుఁడసత్యమాడ నవశ్యకములేదు. ఆయన యాడఁడని రాముని నమ్మకము. దాని కారణము లందే చెప్పఁబడెను. మొదటిది ప్రత్యక్షము, రెండవదానికిఁ బ్రబలమైన విశ్వాసి సాక్ష్యము గలదు. రామచంద్రుఁడు పొరపాటుపడె ననుటకుఁ జాలినసందర్భము

లేవియు వెనుకఁ గలుగలేదు. కావున వాలి ద్రోహి యని నిశ్చయించియే యీమాట చెప్పెను.

కం. విలు మోపెట్టకమున్నే, యెలమిని నీకార్యఁ దెలుపు♦మీ గుణలతికా
వెలలినచో నా బాణం, బిలఁ గూలె నలంచు నమ్ము♦మీ నీవైరిన్. ౨౩౦

మోపెట్టు = ఎక్కుపెట్టు, ఎలమిని = సంతోషముతో, గుణలతికా = తీఁగవంటి యల్లెత్రాటియందు, వెలలినచో = వెలువడెనా, వెడలినచో, పాఠాంతరము వెలలినచో, "కం. వెలలి బలరిపుఁడు చలమునఁ గలహమునకుఁ జొచ్చి" భార. ఉద్యో. ౧ ఆ. "కం. వెలిశుచియై మఱి తీర్థం,బులు సొచ్చుటమేలు నియమములు తీర్చి తగన్ వెలలినయెడ దేవార్చనములు విప్రార్చన లవశ్యమును గృత్యంబుల్" అను. శ్రీ. ౧౮౫ ఇట్టివే శాంతి ౬-౨౩౧ పద్యముఁ జూచునది.

తా త్ప ర్య ము.

నేను విల్లెక్కుపెట్టకముందే నీ సమాచారమంతయుఁ దెలుపుము. నావింటినుండి బాణము వెలువడెనా వాలి చచ్చి నేలఁబడినాఁడని నమ్ముము.

కం. అని రామవిభుఁడు పలికిన, నినజుఁడు నిజసచివయుక్తి ♦ హృష్టుండగుచున్
దనకును దనయన్నకు నొద,విన వైరముకథఁ దొడంగె ♦ వినిపింపంగన్. ౨౩౧

తా త్ప ర్య ము.

అని శ్రీరామచంద్రమూర్తి చెప్పఁగా విని సుగ్రీవుఁడు మిత్రులతోడ సంతోషించినవాఁడై తనకు దన యన్నకు విరోధము వచ్చిన విధము వివిపింపఁ బ్రారంభించెను.

—♦ { ౯-వ సర్గము. సుగ్రీవుఁడు శ్రీరామునితో వాలికిఁ దనకు విరోధము వచ్చిన కారణముఁ జెప్పుట. } ♦—

సీ. మహితగుణుండైన♦మా తండ్రికిని వాలి, జ్యేష్ఠసుతుండు నేఁ ♦ జిన్నవాఁడఁ
దండ్రికి నాకును ♦ దద్ద ప్రేమాస్పదుఁడై, వర్తిల్లు వాలి; పూ♦ర్వంబునందు
మా తండ్రి గడచన ♦ మంత్రులుఁ బౌరులు, పరమసమ్మతముగఁ ♦ బట్టభద్రుఁ
జేసిరి వాలిని ♦ భాసుర మగు కపి, రాజ్యంబునందు నో♦రామభద్ర
తే. నిజకులాగతరాజ్యంబు ♦ నిపుణముగను, నియతిఁ బాలింప వాలినే ♦ హితసుబుద్ధి
వినయ మేపారఁగా బంటు♦విధము దోఁప, నేమఱక కొల్చుచుంటిని ♦ నెల్లవేళ.

మహితగుణుండు = పూజ్యములైన గుణములు గలవాఁడు, కడచనన్ = మరణింపఁగా, నిజకులాగతరాజ్యంబు = తనవంశపరంపరగా వచ్చిన రాజ్యము.

తా త్ప ర్య ము.

పూజ్యము లయిన గుణములు గల మాతండ్రికి మే మిరువురము కొడుకులము. అందు వాలి జ్యేష్ఠుఁడు. నేను జిన్నవాఁడను. మా తండ్రికి నాకును మిగులఁ బ్రేమాస్పదుఁడై వాలి వర్తిల్లుచుండెను. మా తండ్రి మరణింపఁగాఁ దొలుతఁ బౌరులు

మంత్రులు సమ్మతించి కపిరాజ్యమందు వాలికిఁ బట్టాభిషేకముఁ జేసిరి. వంశపరంపరగా వచ్చిన రాజ్యమును వాలి పాలింపఁగా నేను నాయన హితము గోరి వినయముగ బంటువలె నాయన సేవలఁ జేయుచుండితిని.

ఉ. ఈవిధిఁ గొంతకాలము సు♦రేశ్వర సాగినయంతమీఁద మా
యావి యనంగ దుందుభికి ♦ నన్న మయుం డనువాని పుత్త్రుఁడుఁ
వావిరి వైర మొక్క మెల♦నాఁగ నిమిత్తము కల్మి వాలిపైఁ
జేవను బొబ్బపెంచెను ని♦శీథమునన్ జను లెల్లఁ గూర్కఁగన్. ౨౩౩

ఈ విధిన్ = ఈరీతిగ.

తాత్పర్యము.

ఇట్లు కొంతకాలము జరుగఁగా రామచంద్రా యావల మయుని కుమారుఁడును దుందుభికి నన్నయు నగు మాయావి యనువాఁడు స్త్రీ నిమిత్తమై వాలికి వానికి నున్న విరోధము కారణమున నర్ధరాత్రమునఁ బ్రజలు నిద్రించు సమయంబున బలోన్మత్తుఁడై వాలి మీఁదికి యుద్ధమునకు వచ్చెను.

కం. కిష్కింధాద్వారమునన్, నిష్కంపితవృత్తి నతఁడు ♦ నిలిచి ధ్వనింపన్
బుష్కరధర మన దవశో, చిష్కేశునిఁబోలె వాలి ♦ చిటచిటపడుచున్. ౨౩౪

నిష్కంపితవృత్తిన్ = భయముచేఁ జలింపని వ్యాపారముచే, పుష్కరధరము = మేఘము, దవశోచిష్కేశునిన్ = కాఱుచిచ్చును.

తాత్పర్యము.

కిష్కింధాపురము వాకిట నిలఁబడి నిర్భయుఁడై మేఘము ఱుఱిమినట్లు సింహనాదములు చేయసాగఁగా వాలి కాఱుచిచ్చువలె రేఁగినవాఁడై.

ఉ. నిద్దురవీడి మండుచు ధ్వ♦నిన్ విని దిగ్గన లేచి రోషియై
యద్దిర పాన్పు దూఁకి సర♦యంబుగ నాతనిమీఁదఁ బోవఁగా
ముద్దియ లేనునున్ వినతి ♦ మ్రొక్కుచుఁ గా దిది వేళ నిల్వు మం
చొద్దికఁ జెప్పఁగా వినక ♦ వాయుమ్మని త్రోసి చనెన్ రయంబునన్. ౨౩౫

తాత్పర్యము.

నిద్రవదలి కోపముచే మండుచు నాతని ధ్వని విని లేచి రోషించి పానుపునుండి దూఁకి వేగముగ మాయావి మీఁదికిఁబోవఁగా నాఁడువారు నేను వణఁకుచుతో నమస్కరించి యుద్ధమునకు దానిలో రాక్షసులతోఁ బోరుట కిది సమయముగాదు. ఉదయము కాఁగానే పోవచ్చు నని ప్రేమతోఁ జెప్పినను వినక వాయుమ్మని ధిక్కరించి మమ్ముఁ బడఁద్రోచి త్వరగ వాని మీఁదికిఁ బోయెను.

ఉ. ఒంటిగఁ బోవువానిఁ గని ♦ యుల్లమునం గల భక్తిపేర్మి వె
న్కొంటిని, దవ్వునం గల న♦నుం బయివచ్చెడి వాలిఁ జూచి లో

నంటినభీతి నోఁకుఁడు జ♦వాతిశయంబునఁ బాఱఁజొచ్చినన్
మింటను దోఁచుచున్న యల♦నీరజవైరి వెలుంగు దోడ్పడన్. ౨౩౬

నోఁకుఁడు = రాక్షసుఁడు, జవాతిశయంబునన్ = అతివేగముగ, మింటను = ఆకాశమందు.

తాత్పర్యము.

నడిరేయి యొంటిగ రాక్షసులమీఁదికి యుద్ధమునకుఁ బోవుచున్న యన్నను జూచి యాయనయందుఁ గల భక్తి యతిశయముచే నేనును వెంటఁబోయితిని. ముందుగాఁ దనమీఁదికి వచ్చు వాలిని నాయనకు వెనుకఁ గొంతదూరమందు వచ్చు నన్నుఁ జూచి యా రాక్షసుఁడు భయపడి మిగుల వేగముగఁ బరుగెత్తెను. వెన్నెల మాకు సహాయపడఁగా.

ఉ. వెన్నడి మేము పోయితిమి ♦ పీఁకుఁడు దానవుఁ డంత వల్లరీ
చ్ఛన్నము దుర్గముం బిలము ♦ క్ష్మాగతముం గని యందుఁ జొచ్చె మా
యన్నయుఁ బోవఁ బూని యిటు ♦ లాడె ననుం గని రాకు మించి నిం
దు న్నిలు మీ నిశాచరునిఁ ♦ ద్రుంచి వెసం జనుదెంతు నావుకున్. ౨౩౭

వల్లరీచ్ఛన్నము = తీఁగలచే గప్పఁబడినది, దుర్గముం = పోవరానిది, క్ష్మాగతముం = భూమిలో నుండునది.

తాత్పర్యము.

మేము వానివెంటఁ బోయితిమి. పీఁకుఁ డగు నా దానవుఁడు పరువెత్తిపోయి భూమిలోఁ దీఁగలచేఁ గప్పబడి పోవుటకుఁ గష్టసాధ్యమగు బిలముఁగని యందుఁ బ్రవేశించెను. అప్పుడు మాయన్న నన్నుఁ జూచి యిఁక నీవు రాకుము. ఇందు నిలువుము, దానవుని జంపి వత్తు నని చెప్పెను.

ఉ. ఎంతయు వేఁడుకొంటి సెల ♦ విమ్మని తోఁ జనుదేర నాతఁ డా
వంతయు నొప్పఁడయ్యెఁ, దన♦యంఘ్రులపై శపథంబు సేసె, నే
నంత బిలంబువాకిట నృ♦పా నిలుచుండఁగ వాలి చొచ్చె దు
ర్దాంతపరాక్రమంబునఁ గ్రు♦ధామతి నాతనితోడఁ బోరఁగన్. ౨౩౮

తాత్పర్యము

నేను వెంటవచ్చెద సెల విమ్మని యెంతయో ప్రార్థించితిని. ఆయన యంగీకరింపక తన పాదములమీఁద నొట్టుపెట్టెను. అప్పుడు నేనేమి చేయునది లేక బిలము వాకిట నిలుచుండితిని. వాలిమాత్రము రోషముతో వానితో యుద్ధముచేయ మిగులఁబరాక్రమంబున బిలములోఁ బ్రవేశించెను.

మ. ఒకయేఁడాది నరేంద్ర యే నటుల శ్వ♦భ్రోపాంతమం దుండితిన్;
వికటంబై బిలమందు నుండి వెడలెన్ ♦ నెత్తురు సఫేనంబుగాఁ

ప్రకటంబై వినవచ్చె రాక్షసులగర్జల్ యుద్ధనిర్ఘాతుఁడై
వికలారావము వాలి చేయునటు పృథ్వీనాథ వచ్చెన్ ధ్వనుల్. ౨౦

ఏఁడాది సంవత్సరము, శ్వభ్రోపాంతమందున్ = బిల సమీపమందు, సఫేనంబుగా = నురుగుతో, ప్రకటంబై = స్పష్టముగ, యుద్ధనిర్ఘాతుఁడై = యుద్ధమాదు నెగురఁగొట్టఁబడినవాఁడై, వికలారావము = చెదరిన కంఠధ్వని.

తా త్ప ర్య ము.

ఒకసంవత్సరము నే నా బిలము సమీపమున నుంటిని. బిలమందునుండి నెత్తురు భయంకరముగా నురుగుతో వెడలెను. రాక్షసుల సింహానాదములు స్పష్టముగ వినవచ్చెను. వాలియేడ్చినట్టు దీనధ్వని వినవచ్చెను.

కం. ఏపు చెడి వాలి దైత్యుని- చేపడి మరణించె ననుచుఁ జింతించి మన
స్తాపార్దితమతి నయి బిల, మేపాటిదొ కొండ మూసి యెత్తినయార్తిన్. ౨౧

ఏపు = పరాక్రమము, దైత్యునిచేపడి = రాక్షసునిచేతిలోఁ జిక్కి, మనస్తాపార్దిత మతిని = మనస్సునందలి తాపముచే బాధనొందు మనస్సు గలవాఁడనై, ఏపాటిదొ = కొంచెమైనది.

తా త్ప ర్య ము.

పరాక్రమము క్షీణించి వాలి రాక్షసుని చేతిలోఁజిక్కె నని తలఁచి మనస్సునఁ దాప మతిశయిల్లఁగాఁ గొంచెముపాటి కొండ యా బిలమున కడ్డము వేసి దుఃఖముచే,

తే. ఉదకకృత్యంబుఁ దీర్చినే నొయ్యఁ బురికి, వచ్చి యవ్వాలి కథ వెలివుచ్చనైతి
నెట్టకేలకు సచివు లెట్టెట్టొ తత్త్వ, మంతయు నెఱింగి నన్ను రాజ్యంబునందు. ౨౨

ఉదక కృత్యంబు = నీళ్లు విడుచుకార్యము, తర్పణము. ఎట్టకేలకు=ఎట్లెట్లో, తత్త్వము = వాస్తవము.

తా త్ప ర్య ము.

వాలి మరణించె నని తలఁచి నే నాయనకు నీళ్ళు విడిచి మెల్లగాఁ బురికి వచ్చి వాలి కథ యెవ్వరికిఁ జెప్పక దాఁచితిని. మంత్రు లెట్టెట్లో పోబడి తీసి యున్న వాస్తవము నెఱిఁగి.

కం. నిలిపిరి న్యాయము దప్పక, యిల నేలుచు నుంటి; దైత్యునే పడచి మహా
బలుఁ డగు వాలియు వచ్చెం, గలఁకను నభిషిక్తు నన్నుఁ గన్గొని కినుకన్. ౨౨౨

ఏపు = విజృంభణము, కలఁకను = కళంకముతో, కినుకన్ = కోపముతో.

తా త్ప ర్య ము.

నన్ను రాజ్యంబునందు నిలిపిరి. ఇట్లు పట్టాభిషిక్తుఁడనై న్యాయ్యపద్ధతి రాజ్యము చేయుచుంటిని. మహాబలశాలి వాలియును దైత్యుని వధించి పురికి వచ్చి రాజ్యముఁ గోరి తన్ను విడిచి వచ్చితి నని సందేహించినవాఁడై పట్టాభిషేకము గొని యున్న నన్నుఁ గోపముతోఁ జూచి.

శా.ఏరా దుర్మతి నీవు తమ్ముఁడ వటం ♦ చే నెంచి కాదే బిల
ద్వారం బం దటు నిన్ను నిల్పితి? బలి♦ప్రత్యర్థితోఁ బోరు న
న్నారతిం దిగనాడి రంధ్రము మహా♦హార్యంబుచే వెల్పలన్
నే రాకుండఁగ మూసి వచ్చి యిచటన్ ♦ శ్రీభోగలోలుండ వై. ౨౪౩

ఏరా = ఏమిరా, దీనిలో 'మి' లోపింపఁగా 'ఏరా' మిగిలెను. దుర్మతి = చెడుమనస్సుగలవాఁడా! బలిప్రత్యర్థితోన్ = బలవంతుఁ డగు విరోధితో, మహాహార్యంబుచేన్ = పెద్దకొండచే, శ్రీ భోగలోలుండవై = సంపద, భోగములయం దాసక్తి గలవాఁడవై.

తా త్ప ర్య ము.

దుష్టబుద్ధీ! యేమిరా! యిటు చేసితివి? నీవు తమ్ముఁడ వని నమ్మికదా నిన్ను బిలము వాకిట నిలిపితిని. నేను బలవంతునితోఁ బోరు సమయంబున న న్నావిధముగ నొంటిగా విడిచి వచ్చుటయే కాక నేను వెలికిరాకుండునట్లు బిలము ముఖముఁ బెద్ద కొండచే మూసి యిచ్చటికి వచ్చి రాజ్యసంపద భోగముల ననుభవించుచున్నావా ?

కం.ఉన్నాఁడవు తమ్ముఁడవే? చెన్నఁటి యని నన్నుఁ దిట్టి ♦ చెచ్చెరగను మదా
సన్నసచివాళి నందఱఁ గన్నఱపడఁ బట్టి త్రోచెఁ ♦ గారాశాలన్. ౨౪౪

ఆసన్న సచివాళిన్ = నా సమీపమున నున్న మంత్రులను, కన్నఱపడన్ = దుఃఖపడునట్లు; కారాశాలన్ = చెఱసాలయందు.

తా త్ప ర్య ము.

దుష్టుఁడా! నీవు తమ్ముఁడవా యని నన్నుఁ దిట్టి నా యొద్దనున్న మంత్రుల నందఱను బట్టి వారు దుఃఖించుచుండఁ జెఱసాలలోఁ ద్రోచెను.

కం.అన్నటు రేఁగెడి యతనిన్,బన్నుగ నే నిగ్రహింప ♦ బల ముండియు మా
యన్న గదా యని భక్తిని, బున్నెంబుఁ దలంపఁ బ్రాణ♦ములపై వచ్చెన్. ౨౪౫

అన్నటన్ = ఆ విధముగ; రేఁగెడి = విజృంభించెడి.

తా త్ప ర్య ము.

ఈ విధముగ విజృంభించిన యతని నప్పుడు మంత్రి మిత్రి బంధు జనసహాయుఁడనైన నేను నిగ్రహింపఁ గలిగి యుండియు నయ్యో! యన్నగదా పోంపా టభిప్రాయపడి యిట్లు చేయుచున్నాఁడు. నిజము చెప్పిన మన్నింపక పోవునా యని పుణ్యవిచారము చేయుటచే నిప్పుడు నాకుఁ బ్రాణాపదయే సంభవించెను.

ఉ. ఉక్కున రాక్షసాధముని ♦ ను క్కడఁగించి పురంబుఁ జేరు నా
యుక్కరి కే నెదు ర్చనుచు ♦ నుక్కివ మేది నమస్కరింపఁ దా
నొక్కఁడు మంచిమా టనఁడ ♦ యుట్టని మూతి బిగించికొంచు నా
దిక్కును జక్కఁ జూడఁడ మ♦దిం గొనఁ డింత ప్రసాదబుద్ధియున్. ౨౪౬

ఉత్కర్షన్ = పరాక్రమముచే, ఉత్కు=బలము, ఉత్కరి=బలశాలి, ఉక్కీవమేది = వంచనలేక.

తాత్పర్యము.

తన భుజబలముచే దానవాధముని జంపి యూరుచేరఁవచ్చుచున్న యీ బలశాలికి నూరిలోకి రాకముందే నే నెదురుగఁ బోయి వంచనలేని భక్తిని నమస్కరింపఁగా నతఁడు నాతో నొక మంచిమాటయైన ననినవాఁడు కాఁడు. క్షేమమా యనియైన నడుగలేదు. మూతి బిగించుకొని నావంకనైనఁ జూచినవాఁడు కాఁడు. కొంచెమైనఁ బ్రసన్నమైన మనస్సు గలవాఁడు కాఁడు.

౧౦-వ సర్గము.

కం. వెండియు దురాగ్రహంబున, మండెడు కపిమండలేశు ♦ మానితభాషా
కాండముల విన్నవించితి, దండమువలెఁ బడితిఁ దత్పదంబుల భక్తిన్. ౨౮౭

దురాగ్రహంబునన్ = చెడ్డకోపముచే, మానిత భాషాకాండముల = గౌరవముతోఁ గూడిన మాటల సమూహముచే.

తాత్పర్యము.

అంతియగాక దురాగ్రహముచే మండుచున్న యాకపిరాజును గౌరవపు మాటలచే నున్న విషయము విన్నవించితిని. కట్టెవలె నాయన పాదములపై భక్తితోఁ బడితిని.

సీ. మా యదృష్టంబున ♦ దాయ మాయావిని, మడియించి వచ్చితే ♦ మహితశౌర్య
దిక్కులేనివారి ♦ దిక్కైన నీవహో, యీ యనాథునకును ♦ నెపుడుదిక్కు
బహుశలాకము చంద్ర ♦ భాసురచ్ఛత్రంబు, నేను బట్టెదఁ గొమ్ము ♦ నిర్మలాత్మ
యొక్కయేఁడాది నే ♦ నుంటి బిలద్వార, మందార్తితోడ నో ♦ యనఘనాథ

తే. యంత నెత్తురు వెల్లువ ♦ లంత కంత, కెక్కుడై పాఱ సాగె నా ♦ రక్కసుల ర
వంబు వినవచ్చెఁగాని నీ ♦ ధ్వని యొకింత,యైన వినకుంటి దుఃఖాబ్ధి ♦ నడలుచుంటి.

దాయన్ = పగవాని, బహుశలాకము=పెక్కుకమ్ములు గలది, చంద్రభాసురచ్ఛత్రంబు = చంద్రునివలెఁ బ్రకాశించు తెల్లగొడుగుమీఁద, సంగ్రహముగఁ జెప్పిన తన మాటలు వివరించి చెప్పుచున్నాఁడు.

తాత్పర్యము.

మహాశౌర్యశాలీ! యన్నా! మాభాగ్యము కొలఁది నీవు శత్రువైన మాయావిని జంపివచ్చితివి. దిక్కులేనివారికి దిక్కైన నీవే యీ దిక్కులేనివానికిని దిక్కు. పెక్కుకమ్ములు గలిగి చంద్రునివలెఁ బ్రకాశించు తెల్లగొడుగు నేను బట్టెదను. నిర్మలమనస్సుతో నంగీకరింపుము. ఒక్క సంవత్సరము నేను బిలముఖమున దుఃఖముతోఁ గాచియుంటిని. అంత నెత్తురు ప్రవాహము లంతకంత కెక్కువై పాఱఁ

జొచ్చెను. రాక్షసుల సింహనాదములు వినవచ్చెను గాని నీ కంఠధ్వని వినరాదయ్యె నని చాల దుఃఖపడుచుంటిని.

తే. కొండనొక్కటిఁ గొనివచ్చి♦గుహాముఖంబు,నందు బడవైచి శోకంబు♦నంది కుంది
డెందము కలంగియు నలంగి♦ యందు నిలక,పురముఁజేరితి నిక్కంబు ♦పురుషవర్య!

తా త్ప ర్య ము.

అంత నిన్నుఁ జంపి రాక్షసులు నాపైకి వత్తురేమో యని భయపడి కొండ నొక్కటి బిలద్వారమున వైచి యేడ్చుచు మనస్సు కళవళ పడుచుండ నూరువచ్చి చేరితిని. అన్నా ! యిది యథార్థముగ జరిగిన విషయము.

కం. వనట ముఖంబునఁ దోఁపఁగఁ, జనుదెంచిన నన్నుఁ జూచి ♦ సచివులు రాజ్యం
బును ననుఁ బూంచిరి వలదో, యని నే వాదాడఁ గరుణ♦నరయుము దేవా! ౨౭౦

వనట = శోకము.

తా త్ప ర్య ము.

శోకముచే ముఖము వ్రేలవైచికొని వచ్చిన నన్నుఁ జూచి మంత్రులు నాకు వలదు వలదని వాదించుచున్నను వినక బలవంతముగ రాజ్యాభిషిక్తునిఁ జేసిరి. దేవా నన్ను దయచూడుము.

ఉ. రాజవు నీవ కమ్ము, యువ♦రాజుగ నుండెద మున్నువోలె నే
రాజును లేమి రాజ్యము న♦రాజక మౌ నని మంత్రిసత్తముల్
యోజన చేసి నన్నిటు ని♦యుక్తునిఁ జేసిరి, నేను గోర నీ
రాజితనంబు, నిక్క మిది ♦ క్రమ్మఱఁ గొమ్ము, ననుం క్షమింపుమీ. ౨౭౧

తా త్ప ర్య ము.

అన్నా! నీవే రాజుగానుండుము. మునుపటివలె నేను యువరాజుగా నుండెదను. రాజు లేకున్న రాజ్య మరాజక మగు నని మంత్రులీ పనిచేసిరి. రాజుతనంబు నేను గోరినది కాదు. ఇది నిజము. నీ రాజ్యము నీవే గైకొనుము. నను క్షమింపుము.

శా. అన్నా! తమ్ముఁడ నేను, నీయెడల ద్రో♦హం బేమియే నెంచ,నం
మన్నింపం దగు, వ్రాలెదం బదములం ♦ హ స్తంబులం మోడ్తు నాఁ
గన్నెత్తం విడనాడఁ డింతయును ధి♦క్కారంబు మానండు న
న్నన్నో చెప్పఁగరాని వన్ని యనె ధా♦త్రీశా! యతం డావలన్. ౨౭౨

తా త్ప ర్య ము.

అన్నా! నీకు నేను దమ్ముడను. శత్రువునుగాను. నీ విషయమున నే నేమియు ద్రోహ మెంచలేను నన్నుక్షమింపుము. నీపాదములందుఁ బడెదను. చేతులు జోడించి నమస్కరించెదను. అని యింతదూరము నేను వినయముతోఁ జెప్పుకొన్నను గోపము వదలినవాఁడు కాఁడు. ధిక్కారము మానినవాఁడుకాఁడు. ఇన్ని యని చెప్పరానన్ని తిట్లు తిట్టెను.

చం. ప్రకృతుల మంత్రివర్గము స♦భం జతగూర్చి నన్నుఁ జూపి వా
రికి నిటుపల్కె, నొక్క నడు♦రేయి నిశాటుఁడు యుద్ధకాంక్షమై
వికటముగాఁగ నన్బిలువ ♦ వేగమ నే నిలు వీడి పోవ నీ
నికృతిరతుండు నా వెనుక♦నే చనుదెంచుట మీ రెఱుంగరే! ౨౪౩

నికృతి రతుండు = పాపమునం దాసక్తి గలవాఁడు. ప్రకృతులను = పుర జనులను.

తాత్పర్యము.

పురజనులను మంత్రుల సమూహమును సభయందుఁ జేరిచి నన్నుఁ జూపి వాలి యిట్లనియె. ఒకానొక యర్ధరాత్రిమున నొక రాక్షసుఁడు యుద్ధమునకు నన్నుఁ బిలువగా నేను వెంటనే యిల్లు వదలి పోయితిని. ఈ మోసగాఁడు నా వెంటనే వచ్చెను. ఇది మీకుఁ దెలిసిన విషయమే.

కం. మా యిరువురఁ గనుఁగొని యా, మాయావియు భీతిఁ బఱచె ♦ మానక యాద్రై
తేయుని వెన్నడి పఱచితి, నీ యఘశీలుండు వెంట ♦ నే తెంచెఁ జుఁడీ- ౨౪౪

వెన్నడి = వెంబడి, పఱచితిని = పరువెత్తితిని, అఘశీలుండు = పాపస్వభావుఁడు.

తాత్పర్యము.

మమ్మిద్దఱఁ జూచి మాయావి భయపడి పరువెత్తెను. నేను వాని వెంటఁ బరువెత్తితిని. ఈ పాపచారి నా వెంట వచ్చెను.

ఉ. అట్టులు పర్వి పాఱి గహ♦నాంతరభూవివరంబులోని కా
దిట్టఁడు చొచ్చె, నేనును మ♦దిం బగ డింపక పోవఁ బూని యా
కట్టిఁడితోడ నే నసురఁ ♦ గాలునిఁ గూర్చి వచ్చుదాఁక ని
ప్పట్టున నిల్వు, మేను మన♦పత్తనముం జొర నొల్ల శాత్రవున్. ౨౪౫

గహనాంతర = అడవిలోనుండు, భూవివరంబులోనికి = నేలలోనుండు బిలము లోపలికి, దిట్టఁడు = ధీరుఁడు, కట్టిఁడి = మర్యాదాహీనుఁడు.

తాత్పర్యము.

ఇట్లు పరువెత్తి వాఁ డడవిలో భూమిలో నుండు బిలములోనికిఁ దూఱెను. నేను విరోధము మానక వానివెంటఁ బోవఁబూని యా నీచునితో నిట్లంటిని. నేను రాక్షసునిఁ జంపి వచ్చువఱకు నీ వీ స్థలమందే యుండుము. విరోధిని సంహరించి కాని మన యూరు ప్రవేశింపనొల్ల.

కం. పొరిగొనక యంచు బిలముఖ,ధరణిని నీతనిని నిలిపి ♦ తడయక నేనుఁ
సరభసముగఁ జొచ్చి బిలం, బరసితి నరసితిని దుష్టుఁ♦డౌ నా యసురన్. ౨౪౬

పొరిగొనక = చంపక, బిలముఖధరణిని = బిలద్వారప్రదేశమందు, సరభసముగ = తొందరగా.

తా త్ప ర్య ము.

అని యితని బిలము వాకిట నిలిపి యాలస్యములేక శీఘ్రముగ లోపలఁ బ్రవేశించి రాక్షసుని వెదకితిని.

కం. ఏఁ డొక్క టి చనె నంతట; వాఁడును గనఁబడియె నాహవంబున వానిన్
వాఁడిమి గలబంధులతోఁ, బోఁడిమి చెడఁ ద్రుంచి మరలి ♦ పురి కరుదేరన్. ౨౫౭

తా త్ప ర్య ము.

ఒక్క సంవత్సరము గడచెను. అంతట వాఁడు కనఁబడెను. వానిని యుద్ధమందు బలవంతులగు బంధువులతోడఁ జంపి మరలి మన యూరికి రావలయుననియత్నింపఁగా,

కం. త్రోవఁ గననేర నైతిని, భూవివరము శైలపిహితభూతం బగుటన్
వావిరి సుగ్రీవా! సుగ్రీవా! యని యఱవ నఱవఁ ♦ గి మ్మనఁ డొకఁడున్. ౨౫౮

భూవివరము = నేల బిలము, శైల = పర్వతముచే, పిహితభూతంబు = కప్పఁబడినది, కిమ్ = ఏమి.

తా త్ప ర్య ము.

కొండ ద్వారమున కడ్డముగా నుండుటచేఁ ద్రోవ గానరాదయ్యెను. నేనును గట్టిగా పలుమాఱు సుగ్రీవా! సుగ్రీవా! యని యఱచితిని. ఏమి యన్నవాఁ డెవఁడు లేఁడయ్యె.

కం వెడలఁగఁ ద్రోవయుఁ గానమి, విడివచ్చిన యతని యెల్గు ♦ వినరామిని నేఁ
బడునడలు నేమిచెప్పుదుఁ, గడుపునఁ జేపెట్టి కలఁచు♦కైవడి నయ్యెన్. ౨౫౯

తా త్ప ర్య ము.

వెలుపల వచ్చుటకుఁ దోవ తెలియలేదు. విడిచి వచ్చిన సుగ్రీవుని కంఠధ్వనియు వినరాలేదు. అప్పుడు నేను బడిన వ్యసన మే మని చెప్పుదును. కడుపులోఁ జేయిపెట్టి కలిపిన ట్లయ్యెను.

కం. ఇ ట్టడలుచు బిలముఖమున, గుట్టను బదఘాతములను ♦ గూలిచి నే నె
ట్టెట్టో వచ్చితి; సిరికై, యెట్టి మహాఘంబుఁ జేసె ♦ నితఁ డెఱిఁగితిరే? ౨౬౦

పదఘాతములను = కాలిదెబ్బలచే, సిరికై = లక్ష్మికై, మహాఘంబు = ఘోరపాపము,

తా త్ప ర్య ము.

ఇట్లు సంకటపడుచు బిలద్వారమున నున్న గుట్టను గాలితో నెగసి తన్ని తన్ని బడఁగొట్టి యెంతో కష్టముమీఁద వచ్చితిని. రాజ్యలక్ష్మినిమిత్తమై యెంత ఘోరపాపము వీఁడు చేసెనో చూచితిరా.

కం అన్నగదా యని యెంచక, యిన్నిచుం డెంతసేయ ♦ నెత్తెను; వీఁడున్.
మన్ననకుం బాత్రుఁడై? యని, నన్నేకాంశుకముతోడ ♦ నగరము వెడలన్. ౨౬౧

ఎత్తెను = ప్రయత్నించెను, ఏకాంశుకము తోడన్ = ఒంటి గుడ్డతో.

తాత్పర్యము.

నా కన్నగదా. ఈయన విషయములో నే నిట్లు ప్రవర్తింపవచ్చునా యని యాలోచింపక యీ నీచుఁ డెంత చెడ్డపని చేయఁ బ్రయత్నించెనో చూడుఁడు. వీనిని మన్నింపవచ్చునా యని కట్టుకొన్న గుడ్డతో నన్ను నూరు వెడలఁగొట్టెను.

కం.కొట్టెను నాభార్యను జే,పట్టెను నేఁ బ్రాణభీతి ♦ బహుభూములలో
నెట్టిన తిరిగియుఁ దుద కీ,గుట్ట నతఁడు చేరరామిఁ ♦ గొనితి నెలవుగన్. ౨౮

చేపట్టెను = గ్రహించెను.

తాత్పర్యము.

నా భార్యను గ్రహించెను. అంతతోఁబోక నన్నుఁ జంపుటకు రాఁగాఁ బ్రాణ భయముచే ననేక దేశములలోఁ దిరిగి కడపట నీగుట్ట కతఁడు రాకుండు కారణమున నిచ్చట స్థాన మేర్పఱుచుకొంటిని.

కం.అపరాధము చేయకయును, విపరీతపుఁగష్టములను ♦ వేఁగెదఁ గంటే
కృప సర్వభూతరక్షక! కృపణుని రక్షించి యతుల♦కీర్తిం గనుమీ. ౨౯

వేఁగెదన్ = తపించెదను. సర్వభూతరక్షక = సమస్త జీవములను రక్షించు వాఁడా! కృపణుని = దీనుని, దిక్కులేనివానిని, అతులకీర్తిన్ = అసమానమైన కీర్తిని.

తాత్పర్యము.

బుద్ధిపూర్వకముగ నే నే యపరాధము చేసినవాఁడఁగాను. అట్లుండియుఁ బడ రాని కష్టములచేఁ దపించుచున్నాను. నాయందు దయయుంచి సర్వభూతరక్షకుఁడవగు నీవు నన్ను దీనుని దరిద్రుని రక్షింపుము. దీనరక్షకుఁడను కీర్తి నార్జింపుము.

సుగ్రీవుఁడు జరిగిన వృత్తాంత మంతయు సత్యముగనే చెప్పెను గాని తాను రాజుగా నున్నకాలమునఁ దారను దాను గ్రహించిన విషయము చెప్పలేదు. సభలో వాలి యీవృత్తాంత మంతయుఁ జెప్పినపు డవమానప్రసంగ మని తారా వృత్తాంతము చెప్పలేదు. గనుక సుగ్రీవుఁడును జెప్పలేదేమో. వాలి చెప్పినను జెప్పకున్నను సుగ్రీవుఁడు తారను గ్రహించుట వాస్తవ మని యంగదుని వాక్యముల వలన స్పష్టపడుచున్నది. (చూ. కిష్కి౦. ౧౨౮) ఈ కలహమందుఁ దొలుత సుగ్రీవుఁడు ప్రమాదపడుట సత్యము- అటుగాక వాస్తవముగ రాజ్యకాంక్షచే వాలియెడ ద్రోహమే తలఁచియుండెనా యతఁడు కిష్కింధకు వచ్చినపుడు సహాయ సంపత్తి పూర్ణముగఁ గలవాఁడై యుండుటచే వాలిని నిగ్రహించియుండును. వాలి సుగ్రీవు లించుమించు సమాన బలశాలులే. వాలియొద్ద నిండ్రిదత్తహార ముండుట వలన నెక్కుడయ్యెను. హనుమంతుఁడు నీలుఁడు మొదలయినవారు సుగ్రీవుని సహాయులు. సుగ్రీవుఁడు వాలితో యుద్ధమునకే పూనియుండిన హనుమంతుఁ డొకఁడే వాలిని మట్టులోఁతునఁ ద్రొక్కియుండును. కావున సుగ్రీవునందు ద్రోహబుద్ధి లేదనుట

సత్యము. సుగ్రీవు విషయమున వాలియుఁ బ్రమాదపడిన వాఁడే. బిలద్వారము మూయుట, రాజ్యగ్రహణము ద్రోహబుద్ధిచేఁ జేసెననియే వాలినమ్మెను. లేక తారను గ్రహించినాఁ డనిన క్రోపముతో దాని కిది యనుబంధముగాఁ జేసి దీనికిఁ బ్రాముఖ్య మిచ్చెనో-నేపమిది. వాస్తవ మిదిగా నుండవచ్చును: తాను జీవించి యుండఁగాఁ దన భార్యను సుగ్రీవుఁడు గ్రహించె నను కోపముతో సుగ్రీవుని భార్యను దాను గ్రహించెను. కాని నేఁటికిని నెఱుకలు లోనగు క్షుద్రజాతులందు సోదరుఁడు మరణించిన పిమ్మట వాని భార్యను జీవించియుండు సోదరుఁడు గ్రహింపవచ్చు ననియు వాఁడు జీవించియుండఁగా గ్రహింపరాదనియు మర్యాదగలదు. దీనిని బూర్వు లంగీకరించి యున్నారు. వాస్తవముగ వాలి మరణించెనని నమ్మి సుగ్రీవుఁడు తారను గ్రహించెను. సుగ్రీవుఁడు జీవించియుండుట తెలిసి తెలిసి వాలి గ్రహించెను. ఇరువురందు నిదిభేదము. ఈ కులమర్యాదను రామచంద్రమూర్తియు నాదరించెను. ఎటులన వాలి మరణానంతరము సుగ్రీవుఁడు తారను గ్రహించె నని తెలిసియు రామచంద్రుఁ డూరకుండెను. వాలి కుల మర్యాదను శాస్త్రమర్యాదను రెంటిని నుల్లంఘించుటచే వధ్యుఁడయ్యెను.

చం. అనవుడు రామచంద్రుఁ డిటు ♦ లాడెను మిత్రమ! చింత మానుమీ
సునిశితమచ్ఛరంబులను ♦ నూడు దొలంచెద, నెంతదాఁక నా
యనుపమపాపచారుఁడు మ♦దక్షులకుం గనరాక యుండు నం
దనుక సుఖించుఁగాక పర♦దారరతాభిరతిన్ విమూఢుఁడై. ౨౬౪

సునిశిత మచ్ఛరంబులన్ = మిగుల వాఁడిగల నా బాణంబులచే నూడు=పగ; అనుపమ = అసమానమైన; పాపచారుఁడు = పాపముల నాచరించువాఁడు, మదక్షులకున్ = నా కన్నులకు, పరదారరతాభిరతిన్ = ఇతరుల భార్యలయందలి కామముచే, విమూఢుఁడై = బుద్ధిలేనివాఁడై.

తాత్పర్యము.

అని సుగ్రీవుఁడు చెప్పఁగా రామచంద్రమూర్తి యిట్లనెను. మిత్రమా! వ్యసనపడకుము. నా పదునైన బాణములచే నీపగ దీర్చెదను. ఆ పాపచారుఁ డెంత దాఁక నా కనులకుఁ గానరాకయుండునో యంతదాఁకఁ బరస్త్రీలతో సుఖించుచుండును గాక.

క౦. నా దుఃఖమువంటిదె కా, నీ దుఃఖం బంచు లెన్న ♦ నెఱుఁగుదు నేనున్
నీదుఃఖం బడఁగించెద, మోదింపుము నిచ్చఁ గపి♦ముఖ్యా! యనినన్. ౨౬౫

కా = కదా, మోదింపుము = సంతోషింపుము.

తాత్పర్యము.

భార్యను గోలుపోయిన నా దుఃఖమువంటిదే కదా నీ దుఃఖ మని చక్కఁగా ననుభవముచే నే నెఱుఁగుదును. నీ దుఃఖ ముపశమింపఁ జేసెద. కపీశ్వరా! సంతోషింపుము.

౧౧-వ సర్గము. సుగ్రీవుఁడు శ్రీరామునకు వాలి బలపరాక్రమంబులఁ దెలుపుట. ◆-

ఉ. హర్షవికాసభాసురము◆ఖాంబుజుఁ డంబుజమిత్రసూతి రా
జర్షభుఁ బల్కె నిస్తులయ◆శా! నిజ మియ్యది లోకపాళి సా
మర్షభవద్విముక్తశిత◆మార్గణకోటి యుగాంతభాస్కరో
దర్షకరాళిపోలెఁ దృటిఁ ◆ గాల్చి యొనర్చును బూదిప్రోవుగన్. ౨౬౬

హర్షవికాస= సంతోషముచే వికసించుటచే, భాసుర= ప్రకాశించు, ముఖాంబుజుఁడు = కమలమువంటి ముఖము గలవాఁడు, అంబుజమిత్రసూతి = సూర్యుని కుమారుఁడు, రాజర్షభుః = రాజశ్రేష్ఠుని, రామచంద్రమూర్తిని, నిస్తులయశా= అసమానమైన కీర్తి గలవాఁడా, లోకపాళిః = లోకములసమూహములను, సామర్ష = కోపముతోఁగూడిన, భవత్ + విముక్త = నీవలన విడువఁబడిన; శిత = పదునైన, మార్గణకోటి= బాణసమూహము, యుగాంతభాస్కర=ప్రళయకాలమందలి సూర్యుని యొక్క; ఉద్ఘర = మిగులవేడిమిగల; కరాళిపోలెః = కిరణసమూహమువలె; త్రుటిః = అల్పకాలములో, బూదిప్రోవు = బూడిదరాశి.

తాత్పర్యము.

శ్రీరామచంద్రమూర్తి యిట్లు చెప్పఁగా సంతోషముచే వికాసము నొందిన ముఖముగలవాఁడై సుగ్రీవుఁడు రామచంద్రమూర్తితో నిట్లనియె. అసమానకీర్తీ! నీవు కోపముచే బాణములను విడిచితివేని లయకాలమందలి సూర్యకిరణములవలె లోకముల నన్నిటిని నల్పకాలములోఁ గాల్చి బూడిచేయును.

ఉ. ఐనను వాలిపౌరుషమ◆హాద్భుతవిక్రమధైర్యసంపదల్
మానక యేకచిత్తమున ◆ మానవపాలక! యాలకించి యా
పై నయశీల! యెయ్యది యు◆పాయమొ యయ్యది సేయ వయ్య, వృ
త్థానసగంబు లెత్తి భుజ◆దర్పితుఁ డమ్మనకాయ లాడెడిన్. ౨౬౮

వృత్థానసగంబులు = ఎగఁజిమ్మఁబడిన పర్వతములు; అమ్మనకాయలు = క్రీడా విశేషములు.

తాత్పర్యము.

అయినను వాలియొక్క ధైర్యము, అద్భుత విక్రమము గుఱించి చెప్పెదను. ఏకాగ్రచిత్తమున వినుము. విని యావల నే యుపాయము చేయవలయునో యట్లు చేయుము. వాఁడు పెద్దకొండలను పైకి జిమ్మి బాలకు లమ్మనకాయ లాడినట్లాడును.

ఉ. తూరుపువార్ధినుండి యల◆ తోయపుదిక్కున వారిరాశికిః
సారబలుండు దక్షిణపు◆సంద్రమునుండి యుదగ్గిశాబ్ధి కా
చారపరుండు నిత్యమును ◆ సారసమిత్రుఁడు రాకమున్న తా
వారువ పోయి వచ్చును జ◆వంబున నుస్సని యూర్పు కింతయున్. ౨౬౭

ఉదగ్దిశాబ్ధికిన్ = ఉత్తరపు సముద్రమునకు, వారువన్ =సంధ్యవారువ; ఆచార పరుఁడు = బ్రాహ్మముహూర్తమున లేచి స్నానముచేసి సంధ్య వార్చవలయు నను సదాచారము తెలిసినవాఁడు. పూర్వము సుగ్రీవుఁడు తర్పణము విడిచినట్లు చెప్పఁబడెను. ఇచట వాలి సంధ్యవార్చినట్లు చెప్పఁబడెను. వానరు లెవరనుటయుం దివి యాలోచింపవలసి యుండును.

తా త్ప ర్య ము.

ప్రతి దినము సూర్యోదయము కాకముందే సంధ్యవార్చుటకై తూర్పు సముద్రమున స్నానమాడి దక్షిణ సముద్రమున నాచమించి పడమటి సముద్రములో నర్ఘ్యమిచ్చి మఱియొక సముద్రమున జపముచేసి సూర్యోపస్థాన మొనరించును. ఇట్లు నాలుగు సముద్రములందు నతఁడు ప్రతిదినము సంధ్యవార్చును. ఇంత తిరిగి వచ్చి యున్నని యనిమైన శ్యాసపుచ్చఁడు.

క౦. తనబలముం బ్రకటింపఁగ, ఘనతర వనతరుచయంబుఁ ♦ గరదండమునన్
దునుకలుగాఁ బడ నడుచును, ననఘాత్మక చెప్పఁజిట్ట ♦ లాతనిబలముల్. ౧౯

ఘనతర = మిగుల గొప్పనగు, వనతరుచయంబున్ = అడవిచెట్ల సమూహమును, కరదండమునన్ = కట్టెతుండువంటి చేతితో, చిట్టలు = చిత్రములు.

తా త్ప ర్య ము.

తన బలము ప్రసిద్ధి పఱుపఁగోరి యడవియందలి పెద్దచెట్లను జేతిదెబ్బతో విఱుఁగఁ గొట్టును నిర్మల చిత్తా! యతని బలము చెప్పఁ జిత్రములు.

—♦ సుగ్రీవుఁడు శ్రీరామునకు దుందుభివృత్తాంతముఁ జెప్పుట. ♦—

సీ. దుందుభినాముండు ♦ దుంతిసోఁకుఁ డొకండు, కైలాసశిఖరని♦కాశ తేజుఁ
డమర సహస్రనా♦గాధిక బల ముగ్ర,వరదానబలమున♦ వార్ధిఁ జూచి
తోయధినాథ నా♦తో యుద్ధమునకు వ,చ్చెదవె యం చనఁగను ♦ జేటుకాల
మటు మూఁడి పలికెదు♦నాతని కని నబ్ధి, యసురేంద్ర నీతోడ ♦ నని యొనర్ప
ఆ. నెంతవాఁడ నేను ♦ నీశ్వరుమామ శై,లాధినేత తాప♦సాశ్రయుండు
బహుదరీఝరీవి♦భాసితుఁ డగు హిమ,వంతుఁ డతఁడు నీకు ♦ వంతు వచ్చు- ౨౦

దుంతసోఁకుఁడు = దున్నపోతు ఆకారము ధరించిన రాక్షసుఁడు, కైలాస శిఖర = వెండికొండ శిఖరముతో, నికాశ = సమానమైన, తేజుఁడు = తేజస్సుగల వాఁడు, సహస్ర నాగాధికబలము = వెయ్యి యేనుఁగుల మించిన బలము, ఉగ్ర = భయంకరమైన, వరదానబలమునన్ = వరము పొందుటచే వచ్చిన బలముచే, వార్ధిన్ = సముద్రమును, తోయధినాథ = సముద్రుఁడా! మూఁడి = దాపరించి, బహుదరీఝరీవిభాసితుఁడు = అనేక గుహలు, సెలయేళ్లు వీనిచేఁ బ్రకాశించువాఁడు, వంతు = సాటి.

తాత్పర్యము.

దుందుభి యను మహిష స్వరూపముగల రాక్షసుఁడు, వెండికొండ శిఖరము వంటి తేజుగలవాఁడు వరముబలమున వేయి యేనుఁగుల బలముకంటె నెక్కువ బలముగలవాఁడై సముద్రునిఁ జూచి సముద్రా! నాతో యుద్ధమునకు వచ్చెదవా, యనిన వీనికిఁ జేటుకాలము చేరువనే యున్న దని తలఁచి సముద్రుఁడు ఓరీ నీతో యుద్ధముచేయ నే నెంతవాఁడను, ఈశ్వరునికి మామ, కొండలరాజు, తపస్వుల కాశ్రయమైనవాఁడు, అనేక గుహలచేఁ గొండవంకలచేఁ బ్రకాశించువాఁడు హిమవంతుఁడు నీకు సరియైనవాఁడు.

కం. అను నతని భీతునిం గా,దనుజుఁడు దలపోసి చనియెఁ ♦ దద్ద వడి శరా
సనముక్తశరముభంగిని, ఘను హిమవంతునిఁ గనంగఁ ♦ గలహప్రియుఁడై. ౨౧

భీతునింగా = భయపడినవానిఁగా; శరాసనముక్త = వింటినుండి విడువఁబడిన, శరముభంగిని = బాణమునవలె, కలహప్రియుఁడై = యుద్ధమందుఁ బ్రీతిగలవాఁడై.

తాత్పర్యము.

అని చెప్పెడు సముద్రరాజును జూచి వీఁడు భయపడె నని తలఁచి వింటినుండి వెలువడు బాణమువలె మిగుల వేగముగా యుద్ధాసక్తుఁడై హిమవంతుని మీఁదికిఁ బోయెను.

కం. చని తనశృంగాగ్రంబులఁ, బెనుగండోపలము లెల్లఁ ♦ బృథివిం ద్రెళ్లం
గను బెకలించిన గిరి సిత,ఘనరూపముతోడ శృంగ♦గత మై పలికెన్. ౨౨

శృంగాగ్రంబులన్ = కొమ్ములకొనచే, గండోపలములు = పెద్ద గుండ్రాలను, గిరి = హిమవంతుఁడు, సిత = తెల్లనగు, ఘనరూపముతోడన్ = గొప్పయాకారముతో, శృంగగతమై = శిఖరముమీఁదనుండి.

తాత్పర్యము.

ఇట్లు పోయి తన కొమ్ములకొనలచేఁ బెద్ద పెద్ద బండలను నేలమీఁదఁ బడఁ బెకలింపఁగా హిమవంతుఁడు తెల్లని రూపముతో శిఖరముమీఁద నుండి యిట్లనియె.

మ. దనుజేంద్రా! నను నేల యేఁచెదవు ని♦త్యం బెంతొ ధర్మజ్ఞుఁడవే
మునిసంఘంబుల కాశ్రయుండ నన దు♦ర్మోహాత్ముఁడై యాతఁడున్
విను భీతుండవ యేని యుద్ధమును గా♦వింపంగ లేవేని నా
కని చేయంగల వీరుఁ జెప్పు మన నీ♦హారాద్రి యమ్మాటకున్. ౨౩

ఏఁచెదవు = బాధించెదవు, దుర్మోహాత్ముఁడై = చెడ్డమోహము గల మనస్సు గలవాఁడై, నీహారాద్రి = మంచుకొండ.

తాత్పర్యము.

రాక్షస శ్రేష్ఠుఁడా! నన్నేల నీవు బాధించెదవు? నీవెంతో ధర్మాత్ముఁడవే, నేను మునుల గుంపుల కాశ్రయుండను. నీ విట్లు చేసిన వారికి హానికదా, యనిన

మోహముచేఁ గూడిన మనస్సు గలవాఁడవై నీవు భయపడితివేని నాతో యుద్ధము చేయఁగలవానిఁ జెప్పు మనిన మంచుఁ గొండ యా మాట కిట్లనియె.

మ. చెలఁగున్ వాలి యనంగ వానరుఁడు కి♦ష్కింధన్ మహాధీరుఁడున్
బలియుం డాతఁడు శక్రతుల్యుఁడు మహా♦ప్రాజ్ఞుండు దైత్యోత్తమా!
యెలమిన్ ద్వంద్వరణంబు నీకొసఁగు యు ద్ధే♦చ్ఛామనస్కుండ వేన్
జలమారం గనఁ బొమ్ము వాని నిపుడే ♦ సర్వంబు చక్కంబడున్. ౨౪

శక్రతుల్యుఁడు = ఇంద్రునితో సమానుఁడు, మహాప్రాజ్ఞుండు = మిగుల గొప్ప బుద్ధిగలవాఁడు, యుద్ధేచ్ఛామనస్కుండవేన్ = యుద్ధమునందుఁ గోరికగల మనస్సు గలవాఁడవేని,

తా త్ప ర్య ము.

మహాధైర్యవంతుఁడును బలవంతుఁడును, ఇంద్రునితో సమానుఁడు, మిగుల బుద్ధిమంతుఁ డగు వాలి యను వానరుఁడు, కిష్కింధ యందున్నాఁడు. అతఁడు నీతో సంతోషముతో ద్వంద్వయుద్ధము చేయఁగలఁడు. చలముచే యుద్ధము చేయ నీకు మనస్సు గలదేని యతనిఁ జూడఁబొమ్ము. అతఁడు వెంటనేఁ నిన్ను జక్కఁజేయును పొమ్ము.

కం. నముచికి వాసవుపోలిక, నమరారీ! నీ కొసంగు ♦ నాహవభిక్షన్
నముచినిషూదనసుతుఁ డని, హిమశైలము కోపయుక్తి ♦ నిటు లాడుటయున్.

ఆహవభిక్ష = యుద్ధభిక్ష- నముచినిషూదన = ఇంద్రునియొక్క- సుతుఁడు = కుమారుఁడు.

తా త్ప ర్య ము.

నముచికి నింద్రుఁ డిచ్చినట్లు నీకు యుద్ధభిక్ష నతఁ డొసఁగును, పొమ్మని హిమవంతుఁడు కోపముతోఁ బలుకఁగా

——♦ దుందుభి వాలిమీఁదికి యుద్ధంబునకు వచ్చుట. ♦——

ఉ. బంధురవిక్రమాఢ్యుఁ డగు♦పాపపురాక్షసుఁ డంత రోషగ
ర్వాంధతఁ బాదఘట్టనల ♦ నల్లలనాడ ధరిత్రి యేగి కి
ష్కింధకుఁ గానరాకృతిని ♦ జీరె నిశాతవిషాణధారలన్
సింధురభంగి వృక్షములఁ ♦ జీల్చెను ద్వారకవాటదేశమున్. ౨౬

బంధురవిక్రమాఢ్యుఁడు = అధికమయిన బలసంపద గలవాఁడు- రోషగర్వాంధత = రోషముచేతను గర్వముచేతను గన్నులు గానక- పాదఘట్టనలన్ = కాళ్లత్రొక్కుడులచే- కానరాకృతిని = దున్నపోతు నాకారమున- నిశాతవిషాణధారలన్ = పదునైన కొమ్ములకూచియైన భాగములు- సింధురభంగి = ఏనుఁగువలె-

తా త్ప ర్య ము.

విశేషబలసంపదగల యా పాపి రాక్షసుఁడు రోషముచేతను గర్వముచేతను

గన్నులు గానక కాళ్ల త్రొక్కుడులచే భూమి నడంకఁగాఁ గిష్కింధకుఁ బోయి మహిష స్వరూపము ధరించి వాఁడిగల కొనకొమ్ములచే నేనుఁగువలెఁ జెట్లను బురము వాకిటి తలుపులను జీల్చెను.

కం. జడికారునఁ బఱ మొగులన, విడివడి రక్కసుఁడు కర్ణ♦భేదనముగ దం
దడి దుంగుభి దుందుభివలె, నెడనెడ ధ్వనియించుచున్ ర♦హించుచు నున్నన్.

జడికారునన్ = వానకాలమందు, పఱ మొగులనన్ = విస్తారమైన మబ్బ నఁగా, కర్ణభేదనముగన్ = చెవులు పగులునట్లు, దుందుభివలె = నగారావలె, ఎడనెడన్ = నడుమ నడుమ.

తా త్ప ర్య ము.

వానకాలమున వ్యాపించిన పెద్దమబ్బువలె విచ్చలవిడిగా నా రాక్షసుఁడు చెవులు పగులునట్లు నగారావలె నడుమ నడుమ ధ్వనిచేయుచు నుండఁగా,

కం. అంతఃపురగతుఁ డగు పా,కాంతకసుతుఁ డాలకించి ♦ యా నాదు నిశా
కాంతుఁడు తారలతోఁబలె, నింతులతో వచ్చి యసుర♦కిట్లు వచించెన్. ౨౭

పాకాంతకసుతుఁడు = వాలి- నాదు = ధ్వని.

తా త్ప ర్య ము.

అంతఃపురమందున్న వాలి యా చప్పుడు విని చంద్రుఁడు నక్షత్రములతోడ వచ్చినట్లు స్త్రీలతోడ వచ్చి యా రాక్షసున కిట్లనియె.

ఉ. దుందుభి వీవు నే నెఱుఁగు♦దున్ దనుజోత్తమ యేల యీ గతిన్
మందమతిన్ ధ్వనించెదవు ♦ నా నగరంబున ద్వారసీమఁ, బో
మ్మెందుల కేని భూమిపయి ♦ నింకను నూపిరితోడ నుండఁగా
డెందము గల్గెనే ననఁ గ♦డిందిబలాఢ్యుఁడు దైత్యుఁ డిట్లనున్. ౨౮

మందమతిన్ = బుద్ధిలేక; కడింది బలాఢ్యుఁడు = అధికమైన బలముగలవాఁడు.

తా త్ప ర్య ము.

ఓయీ! నీవు దుందుభివి, నే నెఱుఁగుదును, దనుజశ్రేష్ఠుడా! యేల యీప్రకారము బుద్ధిలేక నా పట్టనము వాకిట ధ్వనిచేయుచున్నావు? నీ వింకను నూపిరితోడ జీవించి యుండవలయు నను నాశ యుండెనా, మఱి యెక్కడనైనఁ బొమ్ము. అనిన మిగుల బలవంతుఁడగు రాక్షసుఁ డిట్లనియె.

ఉ. గోలలమున్న దంభములు ♦ గొట్టినయంతనె మేలు వచ్చునే
వాలినవిక్రమంబు గల♦వాఁడవయే నరుదెమ్ము పోరికిన్
వాలి భవద్భుజాబలము ♦ నాఁ డెఱుఁగం దగు నట్లు కాదయేన్
దాళెద వేగుదాఁకఁ బ్రియ♦దారలతో రమియింపు మంతకున్. ౨౯౦

గోలలమున్న = స్త్రీల యెదుట, వాలిన=అతిశయించిన.

### తాత్పర్యము.

వాలీ! యాఁడువారియెదుట పౌరుషపు బింకములు పలుకఁగానే వచ్చిన లాభ మేమి? నీవు పరాక్రమముగల వాఁడవైతివేని యుద్ధమునకురమ్ము! నీభుజబల మెట్టిదో యప్పుడు తెలియఁగలదు. అట్లు కాకపోయెనా యుదయము మగు వఱకుఁ గాచి యుండెదను. నీ యిష్టభార్యలతో నంతవఱకు సుఖింపుము.

ఉ. పొమ్ము భవద్గృహమ్మునకుఁ ♦ బొంపిరివోవఁగ మిత్రకోటికై
యిమ్ము ధనమ్ము దానముగ ♦ నెల్ల యనుంగుజనాళి కౌఁగిలిం
గొమ్ము, విలాసినీజనులఁ ♦ గూడుము, చూడుము పట్న మెల్ల, రా
జ్యమ్మున నీ సమున్ నిలుపు ♦ మావల రమ్ము మదం బణంచెదన్. ౨౫౧

పొంపిరిపోవఁగన్=సంతోషించునట్లు, దానముగన్=మరణించువారు ముందు చేయుదానములుగ, అనుఁగు=ప్రియు లగు, విలాసినీ జనులన్=స్త్రీలను, నీ సమున్= నీతో సమానుఁడగువానిని.

### తాత్పర్యము.

నీ యింటికిఁబొమ్ము. పరలోకమున నీకు సుఖము కలుగుటకై చేయవలసిన దానములు మిత్రుల కిమ్ము. నీకుఁ బ్రియులగు వారి నెల్లఁ గౌఁగిలింపుము. నీ స్త్రీలతో భోగింపుము. పట్నమంతయు నొకసారి కడపటఁ బాఱఁజూడుము. నీతో సముఁడగు వానిని రాజ్యమునఁ బట్టాభిషిక్తుఁ జేయుము. ఆవల రమ్ము. నీ పొగ రణఁగించెదను. పట్టనశబ్దభవము పట్నము. 'సీరంగపట్నంబు బొరిసమురె' వరాహ. ౧-౩౦

కం. మత్తుఁ బ్రమత్తుని సుప్త న,నాత్తాయుధు నిన్నుఁ బోలె ♦ నసమాయుధమో
హాత్తుని మిత్తిం గూర్చిన, హత్తును జుమి భ్రూణహత్య♦ యగచరవర్యా! ౨౫౨

మత్తున్ = మద్యపానముచే నొడ లెఱుఁగని వానిని, ప్రమత్తున్ = హెచ్చరిక దప్పియుండు వానిని, సుప్తున్ = నిద్రపోవువానిని, అనాత్తాయుధున్ = ఆయుధము ధరింపని వానిని, అసమాయుధమోహాత్తునిన్ = కామమోహముచే నొడలు తెలియని వానిని, మిత్తిన్ = మృత్యువును, హత్తును = కలుగును, భ్రూణహత్య = గర్భస్థ శిశువును జంపిన పాపము, అగచరవర్యా = క్రోఁతులందు శ్రేష్ఠుఁడా.

### తాత్పర్యము.

మత్తుపదార్థములు దినుటచేఁ ద్రాగుటచే దేహ మెఱుఁగని వానిని, ప్రమాద పడి యుండువానిని, నిద్రించువానిని, ఆయుధము లేనివానిని, నీవలెఁ గామముచే నొడలు దెలియని వానిని జంపిన భ్రూణహత్యాదోషము వచ్చును.

చం. అన విని మందహాసరుచి♦రాననుఁడై నిజదారఁ దారఁద
క్కిన మృగలోచనావళుల ♦ గేహముఁ జేరఁగఁ బంచి రక్కసుం
గని యసురోత్తమా పిఱికి♦కండ యెసంగద యేని మత్తుగన్
ననుఁ దలఁపంగఁ బోకుము ర♦ణంబున కియ్యది వీరపాన మా. ౨౫౩

మందహాస = చిఱునవ్వుచే, రుచిర = మనోహరమైన, ఆననుఁడై = ముఖము గలవాఁడై, నిజదారన్ = తన భార్యను, మృగలోచనావళులన్ = స్త్రీల సమూహమును, గేహమ్మున్ = ఇల్లును, వీరపాణమా = యుద్ధమునకు ముందు వీరులు చేసెడి పానము.

తా త్ప ర్య ము.

వాఁడిట్లు చెప్పఁగా విని చిఱునవ్వు నవ్వి తన భార్యఁ దారను దక్కినస్త్రీలను నిండ్లకుఁ బొండని పనిచి రాక్షసునిఁ జూచి యసురశ్రేష్ఠుఁడా! నీవు పిఱికివి గావేని నన్ను మత్తునిఁగఁ దలంపకుము. నేను ద్రాగినది వీరపాణ మనుకొమ్ము.

కం. పరికింపు మనుచు జనకుఁడు, సురనాథుఁ డొసంగినట్టి ♦ సుందరకార్త
స్వరమాలిక మెయిఁ దాలిచి, సరభసముగఁ దాఁకె రాక్ష♦సప్రాగ్రసరున్. ౨౦౪

కార్తస్వరమాలిక = బంగారుదండ, ప్రాగ్రసరున్ = ముఖ్యుని.

తా త్ప ర్య ము.

చూడుమని చెప్పి తన తండ్రి యిచ్చిన బంగారు దండను మెడలో ధరించి త్వరగాఁబోయి రాక్షసశ్రేష్ఠుఁ డగు దుందుభిని దాఁకెను.

ఇది మొద లీ దండ మహిమను బాఠకులు గమనింపవలెను. ఈ విషయము ముందు వ్రాయఁబడును.

ఉ. పైపడి వాని బిట్టదిమి ♦ పౌరుషమారఁగ వాని శృంగముల్
చేపడ ఱివ్వుఱివ్వునను ♦ జెచ్చెర నాతనిఁ ద్రిప్పి హీనుఁడై
లోపడ నేల మోఁదుటయు ♦ లొల్లిగ వీనుల నెత్రు గాఱఁగాఁ
బైపయి వాఁడు ద్రెళ్లియు న♦పారబలంబున లేచె ధీరుఁడై. ౨౦౫

లొల్లిగన్ = అధికముగ.

తా త్ప ర్య ము.

ఇట్లు దాఁకి వానిపైపడి గట్టిగ నదిమి పౌరుషముచే వాని కొమ్ములు పట్టుకొని ఱివ్వు ఱివ్వున వానిని దిప్పి తిప్పి వాఁడు బలహీనుఁడై లోపడి పోవఁగా నేలమీఁదఁ గొట్టఁగా విశేషముగఁ జెవులనుండి మీఁద మీఁద నెతురు గాఱుచుండ వాఁడు నేలఁబడియు ధీరుఁడై లేచెను.

ఈ పద్యమునందుఁ బ్రాసాక్షరములు నిర్బిందు పూర్వకములే.

కం. మోఁకాళ్ళుల మోచేతుల, మ్రాఁకులఁ బెనుశిలల వాలి ♦ మహిషాసురునిన్
వీఁకమెయిఁ దాఁచె దానికి, సోఁకుఁడు జంకక యెదిర్చె ♦ సురపతిసుతునిన్. ౨౦౬

సోఁకుఁడు = రాక్షసుఁడు.

తా త్ప ర్య ము.

మోఁకాళ్ళచేతను మోచేతులచేతను మ్రాఁకులచేతను బెద్దఱాలచేతను వాలి మహిషాసురుని బలముచేఁ గొట్టెనుగాని దానికి శంకింపక వాఁడు వాలి నెదిర్చెను.

తే. ఒండొరుల గెల్చుకోరికి ♦ యుద్ధమాడ, నంతకంతకుఁ గపిబల ♦ మతిశయిల్లె
సైంధవద్వేషిదనుజుని♦సత్త్వమెల్లఁ, దోడుతోడుత క్షీణించెఁ♦దోయజాక్ష. ౨౮
సైంధవద్వేషిదనుజుని = మహిషాసురుని, సత్త్వము = బలము.

తా త్ప ర్య ము.

ఒకరి నొకరు గెలువవలయు నని యుద్ధము చేయఁగాఁ గ్రమక్రమముగా నంతకంతకు వాలి బలము హెచ్చెను. రామచంద్రా! దుందుభి బలము తగ్గెను.

దీనికిఁ గారణము బంగారు దండ. అది శత్రువు దేహమునకుఁ దాఁకినపు డంతయు వాని బలమును లాగి వాలి దేహమునఁ బ్రవేశపెట్టుచుండును. అది దండ యందలి యంత్రబలము.

—♦ మతంగుఁడు వాలిని శపించుట. ♦—

సీ. హీనబలుం డౌట ♦ యెఱిఁగి యువ్వాలియుఁ, బిడికిటిపోటులఁ ♦ బీచ మడఁచి
దనుజకళేబరం♦బును గేలఁ బైకెత్తి, వెస యోజనంబున ♦ విసరి వైచె
విబుధారినోట స్ర♦వించునెత్తురు మతం,గాశ్రమమునఁ బడె ♦ ననిలుకతన
నది గని మౌని మ♦హాగ్రహాయుక్తుఁడై, పరమదురాత్ముండు ♦ బాలిశుండు
ఆ. జ్ఞానహీనుఁ డెవ్వఁ ♦ డీ నెత్తు నావయి, వైచె దుష్టబుద్ధి ♦ పాపి యనుచు
వెలికి వచ్చి చూచె ♦ నిల గతాసుం డయి, పర్వతంబువోలెఁ♦బడినవాని. ౨౯
పీచమడఁచి=చంపి, విబుధారి=రాక్షసుని, అనిలు కతన = వాయు వశమున, బాలిశుండు = మూఢుఁడు, గతాసుండయి=ప్రాణము పోయినవాఁడై,

తా త్ప ర్య ము.

మహిషాసురుఁడు బలహీనుఁడౌట యెఱిఁగి వాలి వానిని బిడికిటిపోటులచేఁ జంపి వాని కళేబరమును జేతులతోఁ బైకెత్తి విసరి యామడదూరమునఁ బడునట్లు వైచెను. అప్పు డా రాక్షసుని నోటఁ గాఱుచున్న నెత్తురు గాలికిఁ గొట్టుకొని వచ్చి మతంగాశ్రమమునఁ బడెను. అదిచూచి మునీశ్వరుఁడు మిగులఁ గోపించి దుష్టబుద్ధి పాపి బుద్ధిలేనివాఁడు జ్ఞానహీనుఁ డెవ్వఁడిట్లు నెత్తురు నాపైఁ బడజేసె నని యాశ్రమము విడిచి వెలుపల వచ్చి ప్రాణముపోయి కొండవలెఁ బడియుండు రాక్షసుని జూచెను.

కం. మహిషాసురుఁ గని యెవఁ డీ,వహిఁ జేసె నటంచుఁ జూచి ♦ స్వతపశ్శక్తిఁ
మహిజాటుఁడు బలమదధూ,ర్వహుఁడై పొనరించినట్టి♦పని యంచు మదిన్. ౩౦
ఈ వహిఁ = ఈ ప్రకారము, మహిజాటుఁడు = వాలి, బలమదధూర్వహుఁడై = విశేష బల మదము గలవాఁడై.

తా త్ప ర్య ము.

మహిషాసురునిఁ జూచి యెవఁ డీ ప్రకారము చేసినవాఁడని యాలోచించి తన తపశ్శక్తిచే బలోన్మత్తుఁడైన వాలి చేసిన పని యని.

కం. తెలిసి యది విసరి చిమ్మిన,బలియుని వాలిని గణించి ♦ పటురోషమునన్
ఖలబుద్ధి యసురతనువుం, బలిమిని నిట వైచి యాశ్ర♦మస్థలితరువుల్. ౨౯౦

తా త్ప ర్య ము.

తెలిసికొని యది విసరివైచిన బలవంతుఁడగు వాలి నుద్దేశించి కోపించి దుష్ట బుద్ధిచే రాక్షసు దేహమును దన బలముచే నిటవైచి యాశ్రమ మందలి చెట్లను,

కం. విఱిచి యిల నెల్ల నల్ల యు, నెఱచియుఁ బడవైచి వనిని ♦ హేయంబుగఁ దాఁ
జెఱిచిన చెఱుపనచేట యు,సుఱు పాయుం గాక దీనిఁ ♦ జొచ్చినమాత్రన్. ౨౯౧

నల్ల=నెత్తురు, ఎఱచి = మాంసము, చెఱుపన చేట = దుష్టుఁడు, నాశకుఁడు.

తా త్ప ర్య ము.

విఱిచి భూమిమీఁద నెత్తురు మాంసము పడవైచి యడవిని జూడ నసహ్యముగఁ జెఱిచిన దుష్టుఁడు దీనిఁ జొచ్చెనా చచ్చునుగాక.

కం. ఒక యోజనదూరము మా,మకమహితాశ్రమము దీని ♦ మర్కటపతి యో
డక చేరినఁ దత్క్షణమే, ప్రకటంబుగ యమునిమంది♦రంబుం జేరున్. ౨౯౨

మామక = నాయొక్క, మహితాశ్రమము = పూజ్యమైన యాశ్రమము- మర్కటపతి = క్రోఁతిరాజు- వాలి- ఓడక = భయపడక.

తా త్ప ర్య ము.

నా యాశ్రమ ప్రదేశ మొక యామడ విరివి గలది. దీని లోపల వాలి ప్రవేశించెనా వెంటనే చచ్చును.

ఉ. వానికి నైనవారలు జ♦వంబున దీనిని బాసి పొండు, పో
రేనియు రేపు సూర్యుఁ డుద♦యించిన పిమ్మట నిందుఁ గ్రోఁతి నీ
గానఁగఁ గల్గునేనియు ని♦కారము గాదు శపించితిం జుఁడీ
మానక వేనవే లగు స♦మల్ శిల లై పడియుండ నియ్యెడన్. ౨౯౩

ఐనవారలు = వానికిఁ గావలసిన బంధువులు మిత్రులు లోనగువారలారా, నికారముగాదు = మోసముగాదు- సమల్ = సంవత్సరములు.

తా త్ప ర్య ము.

ఎవ రెవరు వాని పక్షమువారో వారందఱు దీనిని వదలిపోవలయును. రేపు సూర్యోదయమైన పిమ్మట నెవ్వఁడైన నట్టి క్రోఁతి గనఁబడెనా వేలకొలఁది సంవత్సరము లిందు శిలలై పడియుండ శపించితిని, ఇది మోసముగాదు. నిజము.

కం. బిడ్డవలె నేను సాఁకిన,దొడ్డవనంబందుఁ గపులు ♦ దుడుకుతనమునన్
గడ్డలుఁ బండ్లును నాకులు, మడ్డితనంబునను రూపు♦మాపఁగఁ జన్నే. ౨౯౪

తా త్ప ర్య ము.

బిడ్డను గాపాడినట్లు నేను గాపాడిన యీ పెద్దవనమును గ్రోఁతులు దుడుకుతనముచే బుద్ధిలేనివారై గడ్డలు - పండ్లు - ఆకులు నాశము చేయఁదగునా ?

కం. అని యిల్లు మాని తిట్టున, వనచరవర్గంబు వెఱచి ♦ వాలిని డాయఁ
జన నిట్లను నాతండుం, బని యేమీ యిట్లు మీరు ♦ పరువున రాఁగన్. ౯౫
వనచర వర్గంబు = క్రోఁతిగుంపు.

తాత్పర్యము.

అని యీ ప్రకారము మునీశ్వరుఁడు శపింపఁగా నందుండిన క్రోఁతులు భయపడి వాలి యొద్దకుఁ బరువెత్తిపోయిరి. వారిని జూచి వాలి యేల యిట్లు పరువెత్తి వచ్చితి రని యడిగెను.

కం. హరిమతంగాశ్రమసం, చారవనేచారులార ♦ సౌఖ్యము లే దేఁ
గారణ మే మన వాలికి, వారలు మునిశాపవిధము ♦ వాక్రుచ్చుటయున్. ౯౬
హరి = మనోహరమైన, వనేచారులార = క్రోఁతులార, వాక్రుచ్చుటయుఁ = చెప్పఁగా.

తాత్పర్యము.

మనోహరమైన మతంగాశ్రమ మందు సంచరించు వానరులార! మీ కందు సుఖము లేదాయెను. ఏల లేదు? అనిన మునిశాపవిధము వారు వాలికిఁ జెప్పిరి.

చం. అది విని వాలిభీతి ముని♦యంతికముం జని కేలు మోడ్చి యో
సదయ క్షమింపుమీ యనుచు ♦ సాగెకు వేఁడినఁ గిన్కఁ బాయ కే
సదనములోని కేగె, ముని♦శాపభయంబున నేగి యార్తుఁడై
యది మొద లిందు రాఁడు కన♦నైనను నోడును వాలి యీ గిరిన్. ౯౭
అంతికముఁ = సమీపము, ఓడును = భయపడును.

తాత్పర్యము.

వారు చెప్పినమాట విని వాలి మునీశ్వరునొద్దకుఁబోయి నమస్కరించి దయాశాలీ క్షమింపుము, అని పలుమాఱు ప్రార్థించినను ఆయన కోపము వదలక తన గృహములోనికిఁ బోయెను. ఇఁకను బలవంతపెట్టిన మఱేమి తిట్టునో యని భయపడి పోయి యది మొద లిందు రాఁడు. దీని ప్రక్కఁ గన్నెత్తియైనఁ జూడఁడు.

కం. అతఁ డిటఁ జొరఁగ రామిని, ఖ్యాతయశా తెలిసియుండు♦కారణమున ని
ర్భీతిఁ జరియింతు నిం దదె, దైతేయుని యస్థిరాశి ♦ ధరమున కెనయై. ౯౮
ఖ్యాతయశా = ప్రసిద్ధికెక్కిన కీర్తిగలవాఁడా! ధరమునకుఁ = పర్వతమునకు, ఎనయై = సమానమై.

తాత్పర్యము.

వాలి యిచ్చటకు రాఁగూడ దను విషయము తెలిసిన కారణముచే నేను భయములేక యిందుఁ జరించుచుందును. అదిగో నా రాక్షసుని యెముకలగూఁడు పర్వతమువలె.

కం. నేలఁ బడి యున్నయది పర,కాల! మహాసాలస ప్తకంబును గంటే
వ్రాలినకొమ్మలు నిండఁగఁ, బాలించి కనంగఁ గానఁబడను మహాత్మా. ౨౯౯
మహాసాల స ప్తకంబును = పెద్దమద్ది చెట్ల నేడింటిని.

తా త్ప ర్య ము .

నేలఁబడియున్నది చూడుము, ఇవిగో నేడు మద్దిచెట్లు కొమ్మలు నేలఁ దగులు నట్లు వ్రాలియుండుటచేఁ బాలించి చూచినను మొదళ్ళు కానరాకున్నవి.

కం. ఈమహితసాలముల సు,త్రామసుతుం డొక్కఁ డొకటి తనభుజశక్తిన్
వేమఱు నిష్పత్త్రంబుగ, నామిక ఘటియించు నిస్సహాయుం డగుచున్. ౩౦౦
సుత్రామసుతుఁడు =ఇంద్రుని కొడుకు, వాలి, నిష్పత్త్రంబుగ = ఆకులు లేన ట్లుగ, ఆమిక = అహంకారముచే, నిస్సహాయుండు= ఏ యాయుధము సహాయము లేక కేవలము చేతులతోనే.

తా త్ప ర్య ము .

ఈ యేడు చెట్లుల నొక్కటొక్కటి యే యాయుధ సహాయములేక తన భుజ బలముతో నహంకారముచేఁ బలుమాఱు ఆకులన్నియు రాలునట్లుగఁ జేయును.

అనఁగా వాలి వింటినహాయము లేక కేవల బాణమునే చేతఁబ్రీసికొని యొక్క చెట్టులో గ్రుచ్చి శరపత్రములు లేకుండఁజేసి మరల వెలుపల లాగి మరలఁ బొడిచి యిట్లు చెట్టులన్నియు బొక్కలు పడఁజేయును

చేతితో నొక బాణమంతయుఁ బిడిదాఁక మద్దిచెట్టులోఁ గ్రుచ్చుటయు దానిని మరల లాగుటయు నిట్లు పలుమాఱు చేయుట యత్యంత బలవంతుఁడు చేయు కార్యము గాని యితరులకు సాధ్యమగునది కాదు.

కం. చెప్పితిఁ జుమి యాకపివరు, గొప్పభుజాబలము విధముఁ గొనకొని నీ కే
చొప్పున నాతనిఁ జంపఁగఁ, జొప్పడునో చెప్పు మన్న సుగ్రీవునితోన్. ౩౦౧

తా త్ప ర్య ము.

రామచంద్రా! వాలి భుజబలము విధము నీకుఁ జెప్పితిని. అటువంటి మహాబల శాలిని వాలిని నీ వే విధముగఁ జంపఁగలవో చెప్పుము.

కం. ఎలనగవున లక్ష్మణుఁ డనుఁ, గలితయశా యేమిసేయఁగా నింద్రసుతున్
బొలియింపఁ జాలు రఘుకుల,తిలకుం డని నమ్మెదనినఁ దీవ్రాంశుజుఁడున్. ౩౦౨
ఎలనగవు = లేనవ్వు- తీవ్రాంశుజుండు = సుగ్రీవుఁడు.

తా త్ప ర్య ము.

వాలివంటి యల్పుని రామచంద్రమూర్తి చంపఁగలఁడో చంపలేఁడో యని సందేహించుచున్నాఁడే 'యేమి వీని మూఢత్వ మని లక్ష్మణుఁడు చిఱునవ్వు నవ్వి యిట్లనియె. కీర్తిమంతుఁడా! రామచంద్రమూర్తి యేమిచేసినచో వాలిని జంపఁ గలఁ డని నీవు నమ్మెద వనిన సుగ్రీవుఁ డిట్లనియె.

ఉ. భద్ర గుణా! పురందరుని♦పట్టి బలంబున నేడుసాలముల్
ఛిద్రము లొందఁజేసె నవ♦లీలఁగ వేమఱు నొక్క టొక్కటిన్
రౌద్రశరాన నొక్కటను ♦ రాముఁడు వీనను నొండు ద్రుంప న
క్షుద్రబలుం డటంచు హరి♦సూనుని ఁ జంపు నటంచు నమ్మెదన్. 303

పురందరునిపట్టి=ఇంద్రునికుమారుఁడు- వాలి, భద్రగుణా=సుగుణవంతుఁడా, ఛిద్రములు=తూటులు, రౌద్రశరానన్=భయంకరమైన బాణముచే,వీనను=వీనియందు ఒండు=ఒకటి.

తాత్పర్యము.

సుగుణశాలీ, వాలిభుజంబున నేడు మద్దిచెట్లకుఁ బలుమఱు రంధ్రములు పొడుచుచుండెను. తీవ్రబాణముచే నీ చెట్లలో నొకదాని రామచంద్రమూర్తి ఖండింపఁ గలిగెనేని వాలిని జంపఁగలఁడని నమ్మెదను.

కం. వెండియు లక్ష్మణ రాముఁడు, కొండనఁదగు నసురయెమ్ము♦గూఁడును గాలన్
బెండుగ నిరుసూర్ధనువులు, చండగతిం జిమ్మ నమ్మఁ♦జాలుదు ననుచున్. 304

ఇరు నూర్ధనువులు=రెండువందల ధనువుల దూరము,ధనువనఁగా నాలుగుమూరల కొలఁత, బెండుగన్=తేలికగా.

తాత్పర్యము.

లక్ష్మణా! మఱియొకటి, కొండవలెనుండు నీ రాక్షసుని యెముకలగూఁడును బెండువలె నిన్నూఱు బారల దూరముఁ జిమ్మెనేని వాలిని రామచంద్రమూర్తి చంపఁ గలఁడని నమ్మెదను.

కం. పలికియుఁ దనలోఁ గొండొక, దలపోసి వచించె నిట్లు ♦ దశరథసుతుతో
బలవంతుఁడు భువి విశ్రుత, బలపౌరుషశాలి వాలి ♦ ప్రధనములందున్. 305

కొండొక = కొంత, ప్రధనములందున్ = యుద్ధములందు.

తాత్పర్యము.

ఇట్లు చెప్పి యిట్లు పరీక్ష యడిగితినే, రామచంద్రమూర్తి యేమనుకొనునో యేమో యని కొంచె మాలోచించి రామచంద్రమూర్తితో వాలి యుద్ధములందు మిగుల బలవంతుఁడు, ప్రఖ్యాతములైన బలము పౌరుషము గలవాఁడు.

ఉ. దుర్జయుఁ డార్యవర్య గురు♦దోర్బలనిస్తుల శౌర్యరాశి సం
భర్జితశూరలోకుఁడు సు♦పర్వులచేత నసాధ్య మంచు సం
వర్జిత మైనకార్యముల ♦ వాలి ఘటించె న టౌటచేఁ గదా
యూర్జితభీతి నిమ్మెడ ర♦ఘూత్తమ డాఁగి చరింతు నెప్పుడున్. 306

దుర్జయుఁడు = జయింపఁ గష్టసాధ్యమైనవాఁడు, గురు = గొప్పదగు, దోర్బల = భుజబలముయొక్కయు, నిస్తులశౌర్య = అసమానశౌర్యముయొక్కయు, రాశి = కుప్పయగువాఁడు, సంభర్జిత=పీడింపఁబడిన, శూరలోకుఁడు=శూరజనములు

గలవాఁడు, సుపర్వులచేత = దేవతలచే, సంవర్జిత = వదలిపెట్టఁబడిన, ఊర్జితభీతిః= వృద్ధియయిన భయముచే.

తాత్పర్యము.

సులభముగ జయింపరానివాఁడు, గొప్ప భుజబలము శౌర్యము గలవాఁడు, శూరుల ననేకులఁ బీడించినవాఁడు, దేవతలకు సాధ్యముకాని పనులఁ జేసినవాఁడు. ఈ కారణముచేతఁగదా యధికమైన భయముచే నీ చోట డాఁగి తిరుగుచున్నాఁడను.

ఉ. వాని యజయ్యవిక్రమము ♦ వానియధృష్యపుఁ బౌరుషంబునుఁ
వాని యుదగ్రరోషమును ♦ వాని మహాజవసత్త్వసంపదల్
మానవనాథ! యెంచి యను♦మానముతో వెనువెంట నీ మహా♦
వానరు లోలి రాఁగ నెడఁ♦బాయఁగ నొల్లను ఋశ్యమూకమున్. ౩౦౭

అజయ్య = జయింపరాని- అధృష్యపు = తిరస్కరింపరాని- జవ = వేగము- సత్త్వ = బలము-

తాత్పర్యము.

జయింపరాని పరాక్రమము, తిరస్కరింపరాని పౌరుషము, తీవ్రకోపము, మహా వేగము- బలము ఇవి యన్ని యాలోచించి గదా రామచంద్రా యేవేళ కేమో యను సందేహముతో నీ వానరులు వెనువెంట రాఁగా ఋశ్యమూకము వదలక యున్నాను-

కం. మిత్రుని సుజనశ్లాఘా, పాత్రుని నినుఁబోల్ మహాను♦భావునిఁ గనుటన్
మిత్రజనవత్సలా! హిమ, గోత్రము ప్రాపబ్బినట్లు ♦ కుందు దొఱఁగితిన్. ౩౦౮

శ్లాఘాపాత్రునిన్=స్తోత్రమునకు యోగ్యుఁ డగు వానిని-మహానుభావునిన్= గొప్పమహిమ గలవానిని- హిమగోత్రము = హిమవత్పర్వతముయొక్క- ప్రాపు = ఆశ్రయము- కుందు = వ్యసనము- తొఱఁగితిన్ = విడిచితిని.

తాత్పర్యము.

మిత్రుని సజ్జనస్తోత్రయోగ్యుని నీ వంటి మహామహిమ గలవానిని సంపాదించు కొనుటచే మిత్రజనులందు దయగలవాఁడా- హిమవత్పర్వతము యొక్క యాశ్రయము దొరికినట్లు వ్యసనము వదలితిని.

ఉ. నీదు సమగ్రధైర్యమును ♦ నీదుస్వరూపము నీదు ప్రజ్ఞయున్
నీ దగుమాటచందమును ♦ నీదు గభీరత యిన్ని చూచినన్
బూదిమఱుంగు నిప్పనఁగఁ ♦ బోలెద వైనను యుద్ధమేదినిన్
నీదు పరాక్రమంబు నృప ♦ నేఁ గనులారఁగఁ గాన నెన్నఁడున్. ౩౦౯

గభీరత = గాంభీర్యము.

తాత్పర్యము.

నీ పరిపూర్ణధైర్యము నీ యాకారము నీ బుద్ధిబలము నీ మాటతీరు నీ గాంభీ

ర్యము ఇవన్ని చూడఁగా నిపుణు గప్పిన నిప్పువలె నున్నావు. ఐనను యుద్ధభూమి యందు నీ పరాక్రమము నే నెన్నఁడు చూచి యెఱుఁగను.

చం. అతిబలశాలి వాలి సుమ♦హాద్భుతకర్మము లెన్నొ నేను జూ
చితి, నటు తొట పెన్నిగులు ♦ చెందెద నంచు వచింప రాముఁడుక్
స్మితలసితాననాబ్జుఁ డయి ♦ నెచ్చెలి కిట్లను నా బలంబు నీ
మతి నిటు నమ్మవేని కను♦మా నిను నమ్మఁగ నే నొనర్చెదన్. ౩౧౦

స్మిత = చిఱునవ్వుచే- లసిత = ప్రకాశించు- ఆననాబ్జుఁడయి = కమలము వంటి ముఖముగలవాఁడై.

తా త్ప ర్య ము.

మిగుల బలవంతుఁడగు వాలి చేసిన యాశ్చర్యకరకార్యముల నే నెన్నో చూచితిని. ఆ కారణముచే భయపడెదను. అని చెప్పఁగా రామచంద్రమూర్తి లోలో నవ్వుకొనుచు నా బలము నీ వీ ప్రకారము నమ్మవేని నీవు నమ్మునట్లు చేసెదను, చూడుము అని స్నేహితుఁ డగు సుగ్రీవునితో ననెను.

—♦ శ్రీరాముఁడు దుందుభి కళేబరమును బొటనవ్రేల జిమ్ముట. ♦—

తే. అనుచు సుగ్రీవు నూరార్చి♦దినపకులుఁడు, దుందుభి శరీరమును జిమ్మెఁ♦దూలవోలెఁ
గాలి యుంగుటమున నవ♦లీలగాఁగ, యోజనంబులు పది దాఁటి ♦ యుర్విఁ గూల.

దినపకులుఁడు = సూర్యవంశమునఁ బుట్టినవాఁడు, శ్రీరామచంద్రమూర్తి, తూల=దూదియేకు, ఉంగుటమునన్=అంగుష్ఠముచే, బొటనవ్రేలిచే,

తా త్ప ర్య ము.

అని సుగ్రీవుని సమాధానపఱిచి రామచంద్రమూర్తి దుందుభి శరీరమును దూది యేకునువలె మడిమనేల మోపి యెత్తక వ్రేలిచే నవలీలగఁ బదియోజనముల కావలఁ బడునట్లు చిమ్మెను.

చం. అది గని సూర్యసూతి మను♦జాధిపవహ్ని వచించు రాఘవా
యిది మును వాలి చిమ్మినపు ♦ డెంతయు మాంసయుతంబు నూత్నమ
య్యదియును గాక వాలి రణ♦మందు శ్రమంపడి యుండె మత్తుఁడుక్
గొదకెద నిన్ను నమ్మ రఘు♦కుంజర నేఁ డిది శుష్క మౌటచేన్. ౩౧౧

సూర్యసూతి=సుగ్రీవుఁడు, కొదకెదన్=సందేహించెదను.

తా త్ప ర్య ము .

అది చూచి సుగ్రీవుఁడు రామచంద్రమూర్తితో నిట్లనియె. రామచంద్రా! యిది పూర్వము వాలి చిమ్మినపుడు పచ్చిది, నెత్తురు మాంసముగలది, క్రొత్తది. అంతియు గాక వాలి యెంతో శ్రమపడి యుండినవాఁడు. దేహము దెలియక యుండినవాఁడు ఇప్పు డెండి యెముకలు మాత్రము మిగిలినది. నీవేమియు గాసిపడినవాఁడవుకావు. కావున నీవు వాలికంటె బలశాలి వను విషయమున సందేహము పోలేదు.

కం. అప్పుడు పచ్చిది యెండిన, దిప్పుడు మీ యిర్వురం ద♦హీనబలమునన్
గొప్ప యెవండో నమ్మికఁ, జెప్పఁగలే నయ్య నిజము ♦ చెప్పితి నీకున్. ౩౧౩

తా త్ప ర్య ము.

అప్పుడు పచ్చిది, ఇప్పు డెండినది. కావున మీ యిరువురయం దెవరు బల వంతులో నేను జెప్పఁజాలకున్నాను. నిజము చెప్పితిని.

కం. మోపెట్టి యీ శరాసము, తూపొక్కటి గూర్చి తిగిచి ♦ తోరపుశక్తిన్
భూపాల యొక్కసాలం, బేపునఁ బడ నడిచి తేని ♦ యెక్కువ నీవే. ౩౧౪

మోపెట్టి=మోపు+పెట్టి,=ఎక్కుపెట్టి, శరాసము=విల్లు, తూపు=బాణము, తిగిచి = లాగి, సాలంబు = మద్దిచెట్టు, ఏపునన్ = పరాక్రమముచే. అడిచితేని = కొట్టినపక్షమున.

తా త్ప ర్య ము.

నీ విల్లెక్కుపెట్టి బాణము సంధించి లాగి భుజబలముచే నీ మద్దిచెట్టు నొక్క దానిఁ బడఁగొట్టితివేని వాలికంటె నీవే బలవంతుఁడవు.

కం. నమ్మెద నిన్నుఁ బరీక్షార్థముగ నేఁ గోర నాదు♦ప్రత్యయమునకున్
జుమ్మిది నిం కేది విమర్శమ్ముం గాంక్షింపఁ జుమ్ము ♦ రాజవతంసా! ౩౧౫

పరీక్షార్థము = నిన్నుఁ బరీక్షించుటకు, ప్రత్యయము = నమ్మకము.

తా త్ప ర్య ము.

అని నమ్మెదను. నిన్నుఁ బరీక్షింపఁగోరిన వాఁడనుగాను. నాకు నిజముగ నీవే వాలికంటె బలవంతుఁడవు, నిన్ను నమ్మి వాలిమీఁదికి యుద్ధమునకుఁ బోయినను భయములేదు, అను నమ్మకము నాకు దొరకుటకై కోరుచున్నాను. ప్రాణము తీపు గదా. ఇది తప్ప నింకేమియు నడుగను.

కం. ఈ కరికరనిభచాపము, నీకున సజ్యంబుఁ జేసి ♦ వికటకలంబం
బాకర్ణాంతము లాగి జవైకగతిన్ విడు మవశ్య ♦ మగ మిలఁ గూలున్. ౩౧౬

కరికరనిభ = ఏనుఁగు తొండముతో సమానమైన, నీకునన్ = బలముచే, సజ్యంబు = అల్లెత్రాటితోఁ గూడినది, ఎక్కుపెట్టినది, వికటకలంబంబు=భయంకరమైన బాణము, ఆకర్ణాంతము = చెవివఱకు, జవైకగతిన్ = వేగము ముఖ్యముగాఁ గల విధముగా, అగము = చెట్టు.

తా త్ప ర్య ము .

ఏనుఁగు తొండముతో సమానమైన యీ చాపదండ మెత్తి యెక్కుపెట్టి, బాణము సంధించి చెవివఱకు లాగి త్వరగ విడిచితివేని చెట్టు తప్పక నేలఁగూలును.

కం. బలితపుఁ దేజున రవివలె, నిలఁ గల ధరణీధరముల ♦ హిమవంతువలెన్
నలుగాళ్ళన్ సింగము వలె, నళినాక్షా! నీవె మిన్న ♦ నరసంఘములన్. ౩౧౭

బలితపుఁదేజునన్ = బలిష్ఠమైన కాంతియందు - రవివలెన్ = సూర్యునివలె ధరణీధరములన్ = పర్వతములందు, నలుగాళ్ళన్ = నాలుగు కాళ్లు గలవానియందు.

ఇచ్చట నజడంబు సప్తమికి ద్వితీయ. అనిన నలుగాళ్ళలోన గోవును నశేష శబ్దముల మంతర్యమును. శాంతి ౧-౭౧.

తాత్పర్యము.

ఈ ప్రకారము చేసితివేని తేజస్సునందు రవి, పర్వతములందు హిమవంతుఁడు నాలుగు కాళ్ళ జంతువులందు సింహమువలె రామచంద్రా! మనుష్యులందు నీవే శ్రేష్ఠుఁడవు - నిన్ను మించినవాఁడు మఱియొకఁడు లేఁడు.

—♦ ౧౨-వ సర్గము. శ్రీరాముఁడు సాలసప్తకంబు భేదించుట. ♦—

చం. అనవుడు రామచంద్రుఁడు దినాధిపనందను నమ్మఁజేయఁగా
ఘనతరకార్ముకంబు వెసఁ గైకొని కాంచనపుంఖమార్గణం
బును దొడి సాలముం గుఱిచి పోవిడిచెన్ గుణఘోరటంకృతి
స్వనము కలంబపక్షజరవంబు దిగంతములందు నిండఁగన్. ౩౧౮

దినాధిపనందనున్ = సుగ్రీవుని, కాంచనపుంఖ = బంగారు పింజగల, మార్గణము = బాణము, తొడి = తొడిగి -సంధించి, గుణ=అల్లెత్రాటి యొక్క, ఘోర = భయంకరమైన, టంకృతిస్వనము=టమ్మను ధ్వని, కలంబ=బాణముయొక్క, పక్షజ = ఱెక్కలవలన గలిగిన, రవంబు=ధ్వని, దిగంతములందున్=దిక్కుల కొనలందు.

తాత్పర్యము.

సుగ్రీవుఁ డిట్లు చెప్పఁగా రామచంద్రమూర్తి యాయనకు నమ్మకము కలిగించు కొఱకు మిగుల గొప్పదగు విల్లు చేతఁ దీసికొని బంగారు పిడిగల బాణమును సంధించి టమ్మను నల్లెత్రాటి మ్రోతయు బాణము ఱెక్కలధ్వనియు దిక్కుల వ్యాపించుచుండ గా మద్దిచెట్టును గుఱిచూచి వైచెను.

కం. ఆ సాయక మురువడిఁ జని, యా సాలము లేడు నఱికి యగ మగలంగా
దూసి చని భూమిఁ జొచ్చియుఁ, దా సరగున వెడలి చేరెఁ దన స్థానంబున్. ౩౧౯

ఉరవు + వడిన్=మిగుల వేగముతో, సాయకము=బాణము, అగము=పర్వతము, అగలంగాన్=చీలునట్లు. తాత్పర్యము.

రామచంద్రమూర్తి వైచిన బాణము త్వరగాఁబోయి, యా యేడుచెట్లను నఱికి, కొండ బ్రద్దలగునట్లు భేదించి, భూమిలోఁ దూఱి, మరలఁ ద్వరగా బయలు వెడలి యంబుల పొదిలోఁ జేరెను.

ఈ బాణమున కీ శక్తి మంత్రబలముచేఁ గలిగెనని యెంచవలయును. కేవల శస్త్రమున కీజ్ఞాన ముండదుగదా. ఈ విషయము బాలకాండమున ౧౨౭ వ పద్య మందును జెప్పఁబడెను.

కం. సాలమ్ము లేడు బెడిదపు,వాలమ్మున బిఱుసు దఱిఁగి ♦ వ్రాలఁగఁ గడు నా
భీలముగ నది గని కపి,జాలమ్ములతోఁడు బాణ♦జవగరిమకు నై. ౩౨౦

బెడిదపు వాలమ్మునన్=భయంకరమైన బాణముచే, ఆభీలముగ=దిగులగునట్లు జాలమ్ము = గుంపు, బాణజవగరిమకునై = బాణము యొక్క వేగాతిశయమును గుఱించి.

తా త్ప ర్య ము.

ఏడు చెట్లు భయంకరమైన బాణముచే వాని దార్ఢ్యము చెడి చూచువారు భయపడునట్లు దభాలునఁ గూలఁగా సుగ్రీవుం డా బాణవేగమునకు.

కం. అచ్చెరుపడి మెడఁ గ్రుచ్చిన, యచ్చపుహారములు వ్రేల ♦ నవనిని దలచే
సచ్చరితుఁ డంటి మ్రొక్కుచుఁ, బొచ్చెము లే నట్టిప్రీతిఁ ♦ బునరుత్థితుఁడై. ౩౨౧

పునరుత్థితుఁడై = మరల లేచినవాఁడై.

తా త్ప ర్య ము.

ఆశ్చర్యపడి మెడలో ముత్యాల హారములు నేలఁ దగులు నట్లు దల నేలవ్రాలిచి మ్రొక్కుచుఁ బరమప్రీతిచే మరలలేచి - ఇందు భగవన్నమస్కార క్రమము చెప్పఁబడెను.

చం. కరములు మోడ్చి పల్కు మహి♦కాంతునితోడ భవచ్ఛరావళిన్
హరిహయయుక్తమైన యమృ♦తాశనకాండము దైత్యదండమున్
బొరిగొనఁ జాలు దీవు, రణ♦భూమిని వాలియు గీలి లెక్కయే,
వరుణబలారితుల్యు హిత♦వత్సలు నిన్గనఁ దీఱె దుఃఖముల్. ౩౨౨

హరిహయయుక్తము = ఇంద్రునితోఁగూడినది. అమృతాశన కాండము = దేవతాసమూహము, దైత్య దండమున్ = రాక్షస సమూహమును, పొరిగొనన్ = చంపుటకు, చాలుదు = సమర్థుఁడ వగుదువు - వరుణ బలారి తుల్యున్ = వరుణేంద్రులతో సమానుని - ఇరువురు గలసినను రామునికి సరిరా రని భావము.

తా త్ప ర్య ము.

రెండు చేతులు జోడించి రామచంద్రునితో నిట్లనియె. నీ బాణములచేత నింద్రునితోడి దేవకోటులను రాక్షససమూహములను నేక కాలమునఁ జంపఁగలవు. ఇఁక యుద్ధమందు వాలి గీలి నీకేమి లెక్క. వరుణేంద్రులతో సమానుఁడవు. మిత్రప్రీతిగల నిన్నుఁ జూడఁగానే నా దుఃఖములు నశించెను.

కం. సాలంబుల నేడిటి గురు, శైలంబు రసాతలంబు ♦ శర మొక్కంటన్
జీలిచి వైచిన నిన్నును, నాలంబున నెదురు నెవ్వఁ ♦ డా దాశరథీ! ౩౨౩

ఆలంబునన్ = యుద్ధమందు.

తా త్ప ర్య ము.

ఆ దాశరథీ! ఏడు మద్దిచెట్లను పర్వతమును పాతాళమును నొక బాణముచే భేదించిన నీకు యుద్ధమం దెదురెవరు ?

ఉ. అంజలి మోడ్చి వేఁడెద మ♦హాత్మక రాఘవవంశదీప నా
నెంజిలిఁ బాపుమీ యహితు ♦ నిర్దయు సోదరరూపు వాలి వీఁ
కం జెముఁ గూర్పు నా కొఱకుఁ♦గా నని దీనత వేఁడ సూర్యపు
త్రుం జేనవారఁ గౌఁగిటను ♦ గ్రుచ్చి వచించెను భ్రాతృసమ్మతిన్. ౩౨౮

నెంజిలి = మనస్తాపము, అహితుఁ = విరోధిని, జముఁ = యముని.

తాత్పర్యము.

రామచంద్రమూర్తిని రెండు చేతులు జోడించి ప్రార్థించెదను. మహాత్మా! నా దుఃఖముఁ దొలఁగఁద్రోయుము. దయ లేనివాఁడును విరోధియు నన్న యను పేరు గలవాఁ డగు వాలిని నా నిమిత్తమై చంపుము, అని దీనుఁడై ప్రార్థింపఁగాఁ బ్రేమచే సుగ్రీవుఁ గౌఁగిలించి లక్ష్మణుఁడు సమ్మతింపఁగా నిటు లనెను.

నా కొఱకుఁగా ననుటచే వాలి చచ్చినను బ్రిదికినను నీకు రాఁగల బాధనష్టములు లేవు. నీ కార్యమును జెఱుపఁజాలఁడు. నా స్థితి యట్టిది కాదు- కావున నా నిమిత్తమై వాలిని జంపు మని ప్రార్థన.

పై పద్యమునందలి ఆర్తశరణ్యా యను పదము ఈ పద్యమందలి అంజలి మోడ్చి వేఁడెద మహాత్మక యను పదములు సుగ్రీవుఁడు శరణాగతుఁ డయ్యె నని తెలుపుచున్నవి.

లోకంబున నలువిధముల మనుష్యులు గలరు. కొందఱెదుటివారి ముఖము చూచినంత మాత్రముననే లేదా పదిమాటలు మాటలాడినంత మాత్రముననే యెదుటివారి గొప్పతనము తెలిసికొనఁగలవారు- రామాంజనేయు లీ తరగతిలోఁ జేరినవారు- వీ రుత్తమమనుష్యులు.

రెండవరకమువారు పరీక్షించిగాని తెలిసికొనలేరు. వీరు సుగ్రీవుని వంటివారు, వీరు మధ్యములు.

మూఁడవరకమువారు- తామై తెలిసికొనలేరు. పరులు చెప్పినను దెలిసికొనలేరు. పూర్ణానుభవమునకు వచ్చిన పిమ్మటఁ దెలిసికొందురు- వీరు రావణునివంటి యధములు- తన్నుఁ జెఱఁబెట్టిన కార్తవీర్యార్జునుని సంహరించిన పరశురాముని నిమిషములో జయించి తన్ను నాలుగు సముద్రములలోఁ జంకలో నిఱికించుకొని ముంచిన వాలిని నొక బాణముతోఁ జంపెనని యట్టివాని దూత కన్నుల కెదురుగఁ దన నగరమంతయుఁ గాల్చె నని తెలిసి తెలిసి రాముని మాహాత్మ్యము దెలిసికొనలేకపోయి యందఱు చచ్చినపిమ్మట 'తం మన్యే రాఘవం వీరం నారాయణ'మ్మని చెప్పెను. ఇట్టివా రధములు. ఇదంతయుఁ దెలిసి రామచంద్రమూర్తిని నిందించువారు పరిహాసమాడువారు అధర్ముఁ డని యనువారు నేఁడు నూర్లకొలఁది రాక్షసాంశసంభూతులు గలరు. వీ రే తెగలోఁ జేరవలెనో వారిని బుట్టించిన వానికే యెఱుక.

——♦ సుగ్రీవుఁడు తొలిసారి వాలిమీఁదికి యుద్ధమునకుఁ బోవుట. ♦——

కం. పోదము పద కిష్కింధకు, లే దిఁక నాలంబు హాళహా♦ళిం జని మును నీ
సోదరు సోదరహింసకు, మోదంబునఁ బిలుము యు♦ద్ధమునకున్ రవిజా. ౩౨౫

ఆలంబు=జాగు, ఉపేక్ష, హాళహాళిన్=త్వరగా, హా-హాళహాళిక, లీలా హాళహాళికఁ జెంగలించెం బలికిన్ వను. హాళాహాళి.

తాత్పర్యము.

కిష్కింధకుఁ బోదము పద. ఇఁక నుపేక్షతోఁ బనిలేదు. త్వరగా నీవు ముందు పోయి నీ సోదరు సోదరహింసకు సంతోషముతో యుద్ధమునకుఁ బిలువుము. భయపడకుము.

చం. అని రఘురామలక్ష్మణులు ♦ నా నగచారిగణంబుతోడఁ జ
య్యనఁ జని వృక్షజాలముల ♦ నావృత మైన మఱుంగుఁదావునన్
వనమున నిల్చి రంతఁ గపి♦వర్యుఁడు మున్నుగఁ బోయి గర్జిలన్
నినిచి నభంబు పూరటిల ♦ నిష్ఠురు వాలిని బిల్చె దొమ్మికిన్. ౩౨౬

వృక్షజాలములన్=చెట్లగుంపులచే, ఆవృతమైన=ఆవరింపఁబడిన, కప్పఁబడిన, నభంబు=ఆకాశము, పూరటిలన్=నిండునట్లు, దొమ్మికిన్=యుద్ధమునకు.

తాత్పర్యము.

ఇట్లు చెప్పి రామలక్ష్మణులు లా క్రోఁతిమూఁకతోడ శీఘ్రముగఁ జని యందలి చెట్లచాటున నుండిరి. సుగ్రీవుఁడు ముందుగాఁ బోయి దిక్కులు నిండ సింహనాదము చేసి వాలిని యుద్ధమునకుఁ బిలిచెను.

కం. ఆ నినదము విని బలరిపు, సూనుం డస్తాద్రిఁ దోఁచు♦సూర్యునిపగిదిన్
దా నరుగుదెంచెఁ జివ్వకు, మానవికోపమున రేఁగి ♦ మండుచు సరగన్. ౩౨౭

నినదము = ధ్వని, బలరిపుసూనుండు = వాలి - చివ్వకున్ = యుద్ధమునకు- సరగన్ = త్వరగా.

తాత్పర్యము.

ఆధ్వని విని వాలి పడమటి కొండపైఁ దోఁచు సూర్యుని వలె శీఘ్రముగ మండిపడుచు యుద్ధమునకు వచ్చెను. అస్తమించు సూర్యునితోఁ బోల్చుటచే వాలికిఁ జావు సమీపించిన దని సూచన.

ఆ. అంత ఘోరతుముల ♦ మైన కయ్యము సాగె, నన్నదమ్ములకు భ♦యావహముగ
నంబరంబునన్ బు♦ధాంగారకగ్రహములకుఁ బోలె నలుకు ♦ కలఁక లేక. ౩౨౮

ఘోర = భయంకరమైన, తుములము = దొమ్మి, ద్వంద్వము- కయ్యము = యుద్ధము, భయావహముగన్ = భయంకరముగ - అంబరంబునన్ = ఆకాశమందు, అలుకు = భీతి - కలఁక = కలవరపాటు.

తాత్పర్యము.

అప్పు డాకాశమున బుధాంగారక గ్రహములకువలె వారి యిరువురకు బెదరు కలఁకలేక ఘోరమైన ద్వంద్వయుద్ధము జరిగెను.

కం. పిడుగులఁ గేరడ మాడెడి, పిడికిళ్లను దలములం బ్ర♦భీకరగతి వా
రడుచుచు నుడుగక పోరిరి, పిడిగ్రుద్దులకయ్య మిట్లు పెరుఁగుచు నుండన్. ౩౨౯

కేరడము = పరిహాసము- తలములన్ = అరచేతులతో-

తాత్పర్యము.

పిడుగులతో సమానమైన పిడికిళ్లతోడను అరచేతులతోడను- భయంకరముగ విడువక యుద్ధము చేసిరి- పిడిగ్రుద్దుల యుద్ధమట్లు పెరుఁగుచుండఁగా-

ఉ. చే విలు దాల్చి రాఘవుఁడు ♦ చెచ్చెర సజ్యముఁ జేసి యశ్వినీ
దేవతనూజు లట్టు లయి ♦ తేజమునందు సురూపశౌర్యసం
భావనలందుఁ దుల్యు లయి ♦ భాసిలు వారలఁ గాంచి వీఁడు సు
గ్రీవుఁడు వీఁడ వాలి యని ♦ కీసయు భేద మెఱుంగఁజాలమిన్. 330

సజ్యముచేసి = అల్లెత్రాడెక్కుపెట్టి- కీసయు = అల్పమైనను-

తాత్పర్యము.

రామచంద్రమూర్తి చేత విల్లు దీసికొని యెక్కుపెట్టి యశ్వినీదేవతలవలెఁ దేజమునందు శౌర్యమునందు నాకారము నందు సమానులుగ నుండువారిని జూచి వీఁడు సుగ్రీవుఁడు వీఁడు వాలి యని కొంచెమైన భేదము తెలియక పోవుటచే-

ఇప్పుడు వాలి తన బంగారు మాలిక ధరించి రాలేదు- ఆ కారణముచే రామచంద్రమూర్తి భేద మెఱుంగఁ జాలఁ డయ్యెను.

రాజ్యచిహ్నములను బట్టి గుర్తించి యుండరాదా యనిన ఛత్రచామర కిరీటాదులతో వాలి రాలేదు. కూర్చుండినవాఁడు కూర్చున్నట్లు లేచివచ్చెను. దూరము నుండి చెట్లచాటునుండి చూచి సాముద్రిక చిహ్నములను బట్టి చంప సాధ్యపడునా?

హనుమదాదుల నడిగియుండరాదా? యుద్ధముచేయుచుండువారు నిట్రాలవలెఁ గదలక మెదలక నిలఁబడి యుండరు- గిర గిర తిరుగుచుఁ బెనఁగులాడుచుండువారిని నితరులమాట నమ్మియా కొట్టవలెను? 'అరయంగాఁ గర్ణుఁ డీల్గె నార్గురిచేతన్' అను సామెత నిజమగును. ఏమి కొంచెము ప్రమాదపడినను సర్వనాశకమగు సందర్భములలో నిశ్చయకమైన ప్రత్యక్షాంశమును వదలి యూహలచేతను నన్యులమాటఁ బట్టియుఁ గార్యము చేయరాదు. తరువాత నింద నష్టిపడువా రెవరు?

భిన్నవర్ణవస్త్రములు ధరించియుండిన భేదము తెలిసియుందునేమో- ఆ విషయమేమియుఁ జెప్పఁబడదయ్యెను.

సుగ్రీవుఁడు పరువెత్తెనుగదా- ఓడిపోయినవాఁడు మావాఁడని రామచంద్రమూర్తి వాలిని గొట్టియుండవచ్చును గదా-

సుగ్రీవుఁడు పరువెత్తఁగానే వాలి యూరు ముఖుఁడయ్యెను. వెనుకనుండి కొట్టు టెట్లు? ఊరకున్నవానిఁ గొట్టు టెట్లు?

ఉ. అంతకరాశుగంబు లులి♦తాత్ముఁడు రాముఁడు వీడఁ డయ్యెఁ, దా
నింతటిలోన నింద్రసుతు ♦ నేటుల నొచ్చి దినేశసూతి యం
తంతల నున్న రామునెడ ♦ నైనను జూడక పాఱిపోయె స
క్లాంతిగ రక్తసిక్తుఁ డయి ♦ గాటపుఁగింకను వాలి తోలఁగన్. ౩౩౧

అంతకర + ఆశుగంబు=ప్రాణము దీయఁగల బాణము, లులితాత్ముఁడు=సందేహముచేఁ గూడిన మనస్సుగలవాఁడు, దినేశసూతి=సుగ్రీవుఁడు, అంతంతలన్=సమీపమందు; సక్లాంతిగ=శ్రమముతోఁ గూడినవాఁడై, రక్తసిక్తుఁడయి=నెత్తుటితోఁ దడిసినవాఁడై తోలఁగన్=తఱుమఁగా.

తాత్పర్యము.

ప్రాణము తీయఁజాలిన బాణమును సందేహముతోఁ గూడిన మనస్సుగలవాఁడై రామచంద్రమూర్తి విడిచినవాఁడు కాఁడయ్యె. ఇంతలో వాలిదెబ్బలచే బాధపడి సుగ్రీవుఁడు సమీపమందున్న రామచంద్రుప్రక్కనైనఁ గనక శ్రమపడి నెత్తుటఁ దడిసి వాలి వెనువెంటఁ దఱుముచుండఁగాఁ బరువెత్తిపోయెను.

శ్రీరామచంద్రమూర్తి యున్నస్థలము సుగ్రీవుఁడెఱుఁగును గదా! ఏల యచ్చటికిఁ బోలేదు? రామచంద్రమూర్తి మోసముచేసె ననియు నచ్చటికిఁ బోయినను దనకుఁ జావు తప్పదనియు, ఋశ్యమూకమునకుఁ బోవుటే క్షేమ మనియుఁ దలఁచి చక్కఁగ నచ్చటికే పరువెత్తెను. సుగ్రీవుఁడు రామువంకఁ జూడక పోయినది యొకవిధమున మేలైనది, వాఁడా ప్రక్క చూచుచుఁ బోయిన వాలికి సందేహముదయించి యచ్చట నెవ రున్నారో చూత మని వారియొద్దకుఁ బోయి యుండును. తరువాత నేమైయుండునో? ఎవరు చెప్పఁగలరు? భవితవ్య మిట్లుండ నట్లేల యగును?

చం. పరువిడి ఋశ్యమూకగిరి♦భాగవనాంతముఁ జేరెఁ జేరినన్
హరిహయపుత్రుఁ డందుఁ జొర ♦ నాత్మఁ దలంకుచు శాపభీతిమైఁ
బురు రుమఁ బల్కె ఛీ బ్రతికి ♦ పోయితి పోర యటంచు గ్రక్కునన్
మరలి పురంబుఁ జేరె, నట ♦ మానవపాలుఁడు లక్ష్మణుండునున్. ౩౩౨

హరిహయ పుత్రుఁడు = వాలి- ఆకుపచ్చని గుఱ్ఱములు గలవాఁడు = హరిహయుఁడు - ఇంద్రుఁడు.

తాత్పర్యము.

సుగ్రీవుఁడు పరువెత్తిపోయి ఋశ్యమూక పర్వతమునకుఁ జేరిన యడవి ప్రదేశమునఁ జేరెను. వాలి యచ్చటికిఁబోవ శాపభయమునఁ గొంకుచు మిగులఁ గోపముతో ఛీ బ్రతికితివి పో పొమ్మని చెప్పి మరల కిష్కింధకుఁ బోయెను. అచ్చట దాఁగియుండిన రామచంద్రమూర్తియు లక్ష్మణుండును,

—♦ వాలిని జంపమికి సుగ్రీవుఁడు శ్రీరాముని నిష్ఠుర మాడుట. ♦—

కం. హనుమయుఁ దోఁ దోఁ దేరఁగ, వనచరపతి దీనుఁ డగుచు ♦ వర్తిలునెలవుం
జని యెదుర నిలువ వారలఁ, గని సిగ్గున మోము వాంచి ♦ కపివరుఁ డనియెన్. 333

తోఁ = తమతోడ - తోఁదేరఁగఁ = రాఁగా;

తాత్పర్యము.

హనుమంతుఁడు తమతోడరాఁగా సుగ్రీవుఁడు దుఃఖపడుచున్న స్థలమునకుఁ బోయి యతని యెదుర నిలువఁగా వారిని జూచి సుగ్రీవుఁడు సిగ్గుచేతఁ దలవంచుకొని యిట్లనియెను.

ఉ. నమ్మఁగ నీ పరాక్రమము ♦ నా కటు చూపియు వాలిఁ బిల్వఁ బో
పొమ్మ్ము రణమ్ము సేయు నని ♦ భూవర నన్ బెర రేచి వైరిచే
నిమ్మెయిఁ జంపఁజేయఁ దలఁ♦పెత్తుట కేమి కతంబొ? యేమి లా
భమ్మును బొందెదో పగతు♦ వాతను నన్బడఁ ద్రోసి రాఘవా? 334

పెర రేచి = ప్రేరించి, కతంబొ = కారణమో.

తాత్పర్యము.

నీ పరాక్రమము నేను నమ్మునట్లు ప్రకారము నిదర్శనము చూపి, యంతతోఁ బోక పోపొమ్ము యుద్ధమున కని ప్రేరించి శత్రువుచే నన్నిట్లు చంపఁజేయ నాలోచించుట కేమి కారణము. నా శత్రువువాత నన్నుఁ బడఁద్రోయుటచే రామచంద్రా! నీకు వచ్చిన లాభమేమి?

ఉ. చంపుము వాలి నంచు నిను ♦ సత్త్వధనా యటు వేఁడినప్డు నొ
ప్పింపను వాలి నంచు మును♦పే వచియింపఁగ రాదె? యిట్టు లే
నింపుగ నెప్పటట్ల యిట♦నే పడియుండ నె? యేటికయ్య నన్
బంపుట చావుదెబ్బలకుఁ ♦ బా లొనరించుటకా మహామతీ! 335

తాత్పర్యము.

బలవంతుఁడా! మహాబుద్ధిమంతుఁడా! నీవు వాలిని జంపుమని నేను గోరినపుడు వాలిని నేను జంపనని ముందే చెప్పియుండరాదా? నీ వట్లు చెప్పియుండిన నే నెప్పటి యట్ల యిందే హాయిగాఁ బడియుండనా? నన్నేల యుద్ధమునకుఁ బంపితివి. నన్నుఁ జావు దెబ్బలపాలు చేయుటకా?

'పరోక్షే కార్యహంతారం । ప్రత్యక్షే ప్రియవాదినమ్
వర్జయే త్తాదృశం మిత్రం । విషకుంభం పయోముఖమ్॥

పరోక్షమునఁ గార్యమును జెఱిచి యెదుటఁ బడినపుడు ప్రియములు మాటలాడునట్టి మిత్రుని లోపల విషము పైనఁ బాలు గల కుండవలె వదలవలెను.

—♦ శ్రీరాముఁడు సుగ్రీవునితోఁ దాను వాలిం జంపమికిఁ గారణము దెల్పుట.♦—

కం. అని కరుణంబుగ దీనతఁ, బనవు రవిజు ననియె రామ♦భద్రుం డోనా
యన! యేటికిఁ గోపించెదు, వినుమీ నే దివ్యశరము ♦ విడువనికతమున్. 33౬

కరుణంబుగన్ = శోకముతో, పనవు = దుఃఖించు,

తా త్ప ర్య ము.

అని కన్నీరు కార్చుచు నేడ్చుచున్న సుగ్రీవునిఁజూచి రామభద్రుఁడు, నాయనా యేల నాపైఁ గోపించెదవు? నా దివ్యబాణమును విడువని కారణము చెప్పెద వినుము.

కం. రూపున వయసునఁ బొడువునఁ, జూపున వేషమున నడక♦సొంపునఁ గాంత్యా
లాపంబుల స్వరమున ధృతి, రూపింపఁగఁ దుల్యు లిరువు♦రున్ మీ రనఘా! 33౭

తా త్ప ర్య ము .

రూపమునందు- వయస్సునందు- ఎత్తునందుఁ జూపునందు, వేషమునందు, నడకయందు, కాంతియందు, మాటలయందు, కంఠస్వరమునందు, ధైర్యమునందు, మీరిరువురు సమానులుగా నున్నారు.

కం. కావున మీ యిరువురిలో, నేవాఁడో యింద్రతనయుఁ ♦ డెఱుఁగఁగలేమిన్
జీవాంతక ఘోరాశుగ, మే విడువన చుమ్మి నిక్క ♦ మియ్యాది హితుఁడా! 33౮

జీవాంతక = చంపునట్టి, ఘోరాశుగము = భయంకర బాణము.

తా త్ప ర్య ము.

ఈ కారణముచే మీలో వాలి యెవఁడో నేను గుర్తింపఁజాలక ప్రాణము దీయు బాణమును నేను విడిచినవాఁడఁగాను. ఇది నిక్కము.

ఉ. ఎప్పుడు రిత్త వోవదు క♦పీశ్వర మత్కరముక్తసాయకం
బిప్పుడు మీపయిన్ విడువ ♦ నెవ్వరిఁ ద్రుంచునొ మూలనాశనం
బుప్పతిలంగ నిద్దగుల ♦ నొప్పమి పుట్టును గాదె యంచు నే
నప్పుడు బాణమున్ విడువ♦నైతి శమింపుము మిత్రరత్నమా. 33౯

రిత్తవోవదు = వ్యర్థముగాదు.

తా త్ప ర్య ము .

మిత్రరత్నమా! నా చేతినుండి విడువఁబడిన బాణ మెప్పటికి వ్యర్థముగాదు. ఊరక విడిచితినేని యది నీకుఁ దగలెనా మూలనాశ మగునుగదా యని నే నప్పుడు బాణము విడిచిన వాఁడఁగాను.

కం. అరయమి లాఘవమున మ,చ్ఛరమున నినుఁ గూల్తునేని ♦ జగముల నెల్లన్
హరివర! శాశ్వతముగ నా,గురుమౌర్ఖ్యము పిల్లతనము ♦ కుదురుగ నిలుచున్. ౩౪౦

అరయమి=ఆలోచనలేక. తా త్ప ర్య ము.

ముందు వెనుక కార్యభారము నాలోచింపక నిశ్చయించుకొనక తటాలునఁ బనిచేసి నా బాణమున నిన్నుఁ జంపియుండిన యెడలఁ బ్రపంచములం దన్నిట

గొప్ప బుద్ధిలేనితనము పిల్లతనము శాశ్వతముగ నిలచియుండునుగదా! కార్యము పాడు చేయుటయేగాక శాశ్వతమైన యపకీర్తి సంపాదించియుండును.

కం. దత్తాభయఘాతంబు మ,హాత్తరపాపం బటంచు ♦ నందురు ప్రాయ
శ్చిత్తంబు లేదు దానికిఁ, జిత్తంబునఁ దలఁపు మింత ♦ స్నిగ్ధజనాఢ్యా. ౩౪౧

దత్తాభయఘాతంబు = అభయమిచ్చినవారినిఁ జంపుట- మహాత్తరపాపంబు= మిగుల గొప్పదగు పాపము- స్నిగ్ధజనాఢ్యా = స్నేహితులలో శ్రేష్ఠుఁడా.

తాత్పర్యము.

మిత్రరత్నమా! తా నభయమిచ్చినవాఁడు తన యెదుట నితరులచేఁ జంపఁబడ నిచ్చిననే మహాపాపము. అట్లుండఁ దానే చంపినచో నిఁక వాని పాపమున కంత మేది? దానికిఁ బ్రాయశ్చిత్తము లేదు. దీనిని నీ వాలోచింపుము.

కం. ఓ మిత్ర నీకు వశులము, సౌమిత్రియు నేను సీత ♦ సత్యము నీవే
యీ మహితవనంబున మా, కో మహితగుణాఢ్య దిక్క ♦ వ్వాఱడు మాత్మన్.

తాత్పర్యము.

నేను వాలితో నేకమై నిన్నుఁ జంపింప యత్నించితి నని తలఁచితివేమో- అట్లు ప్రమాదపడకుము. ఈ మహారణ్యమున నేను లక్ష్మణుఁడు సీతయును నీకు వశపడి యున్నారము. మా క్షేమము నీ చేతిలో నున్నది. కావున నీకు నేను ద్రోహము చేయను. సమాధానపడుము.

ఉ. నమ్ముము నన్ను మిత్రమ మ♦నంబున సందియ మందఁబోకుమీ
పొమ్మిఁక మఱొక్కమాటు సుర♦పుంగవపత్త్రునితోడఁ బోరఁగా
నిమ్మరి యేదియేని గుఱుతు ♦ నే నెఱుఁగంగ ధరింపు మేన, మూ
ర్తమ్మున మచ్ఛరాభిహతి ♦ ధారిణిఁ గూలఁగఁ జూచె దాతనిన్. ౩౪౩

మచ్ఛరాభిహతిన్ = నా బాణము దెబ్బచే,

తాత్పర్యము.

సుగ్రీవా! నామాట నమ్ముము. సందేహింపకుము. మఱియొకసారి వాలితో యుద్ధముచేయఁబొమ్ము. నాకుఁ దెలియఁగలగుఱుతు నేదైన నీవు ధరింపుము. ఆమాత్రము నీవు చేసెదవేని నాబాణము దెబ్బచే నతఁడు క్రిందఁబడఁ జూచెదవు.

కం. పెల్లుగను బూచియున్నది, యల్లదె గజపుష్పలతిక ♦ యది సౌమిత్రీ!
తెల్లముగా నీ వానర, వల్లభుకంఠమున నిడ ♦ వైవుము యిపుడే. ౩౪౪

తాత్పర్యము.

లక్ష్మణా! గజపుష్పమాల తీఁగె దఁడిగఁ బూచియున్నది. అదిగోఁ జూడుము. అది స్పష్టముగాఁ దెలియునట్లు తెచ్చి యిపుడే యితని మెడయందు వైవుము.

కం. అనవుడు సౌమిత్రియు దా, నిని గొని చనుదెంచి వైచె ♦ నీరజహితపు
త్త్రుని మెడ విపరీతంబుగ, ఘనతారాయుక్తసూర్య♦కరణిఁ వెలుఁగన్. ౩౪౫

నీరజహితపుత్రుని = సుగ్రీవుని- విపరీతంబుగన్ = తాఱుమాఱుగ- ఘనతారాయుక్త- సూర్యకరణిన్ = గొప్ప నక్షత్రములతోఁ గూడిన సూర్యునివలె.

ఈ విషయము ముందు వివరింపఁబడును. (చూ. ౩౬౫ ప)

తా త్ప ర్య ము.

అని రామచంద్రమూర్తి చెప్పఁగా లక్ష్మణుఁడు దానిని దెచ్చి సుగ్రీవుని మెడయందు వైచెను. అప్పుడు సుగ్రీవుఁడు గొప్పనక్షత్రములతోఁ గూడిన సూర్యుని వలె విపరీతముగ వెలిఁగెను. పగలు చంద్రుఁడు రాత్రి సూర్యుఁడు కనఁబడుట విపరీతముగదా,

తే. సంజవేళ బలాకసం♦చయముతోడ, నొప్పు మబ్బు విధంబున ♦ నొప్పి యతఁడు
రామవాక్యంబునను ధృతి♦ రాజిలంగఁ, జనియెగిష్కింధకును రామ♦చంద్రుతోడ. ౩౮౬

సంజవేళన్ = సంధ్యాకాలమందు - బలాకసంచయముతోడన్ = కొక్కెర గుంపుతో - సాయంకాలము మబ్బు క్రమక్రమముగా వృద్ధియగును. కొక్కెరలకు గజపుష్పములకు (మొల్ల లని కొందఱు) నుపమానము.

తా త్ప ర్య ము.

సాయంకాలమందుఁ గొంగలతోఁగూడిన మేఘమువలె నతఁడొప్పి రామ వాక్యంబులచే ధైర్యము గొని రామచంద్రుతోడ మరలఁ గిష్కింధకుఁ బోయెను.

—♦౧౩-వ సర్గము. శ్రీరాముఁడు సుగ్రీవాదులతోడఁ గిష్కింధయొద్దకుఁ బోవుట.♦—

సీ. మిత్రిసుతుండు సు♦మిత్రాసుతుండును, దనకు మున్మున్నుగాఁ ♦ జనుచునుండ
నలనీలవాయునఁ♦దనతారనామక, వానరుల్ వెన్నంటి ♦ వచ్చుచుండఁ
గాంచనభూషిత♦ఘనశరాసనమును, నర్కాభబాణంబు ♦ లమరఁ గేల
నట నటఁ బుష్పభా రావలంబికుజాళి, నిర్మలోదకధునీ♦నికరములను
తే. సుందరములైనకందర♦బృందములను, మంజుసుమపుంజరంజిత ♦ కుంజములను
వికిరనికరసమాకులో♦ర్వీధ్రములను, వాటములునైన గిరికూట♦వాటములను. ౩౮౭

మిత్రిసుతుండు = సుగ్రీవుఁడు - నల నీల తార హనుమంతు లీ నలువురు సుగ్రీవునితోనుండు వానరులు, సుగ్రీవునితోడ నైదుగురు. ఈ యైదుగురినే సీతాదేవి చూచెను. కాంచనభూషిత = బంగారుచే నలంకరింపఁబడిన, ఘనశరాసనము=గొప్ప విల్లు, అర్కాభబాణంబులు = సూర్యునివలెఁ బ్రకాశించు బాణములు, పుష్పభార= పుష్పముల బరువుచే, అవలంబి = వ్రేలాడు, కుజాళి = చెట్లవరుసలను, నిర్మలోదకధునీ నికరములను = తేటనీటిని గల నదులసమూహములను, కందరబృందములను = గుహల సమూహములను, మంజు = మనోహరమైన, సుమపుంజ = పూవుల గుంపుచే, రంజిత = మనోహరములైన, కుంజములను = పొదలను, వికిర=పక్షుల, నికర = సమూహముచే, సమాకుల = కలఁపఁబడిన, ఉర్వీధ్రములను = పర్వతములను.

తాత్పర్యము.

ముందు లక్ష్మణసుగ్రీవులు వెనుక నల నీల తార హనుమంతులు రాఁగా రామచంద్రుండు బంగారు రేకులచే నలంకరించిన పెద్దవింటిని, సూర్యకాంతిగల బాణములను గేల ధరించి యచ్చటచ్చట పూల బరువుచే వంగిన చెట్లను తేటనీటి నదులను, నందములైన గుహలను, పూల గుంపులచే నొప్పు పొదలను, పక్షులసమూహముల వ్యాకులపడఁజేయు వృక్షములను వాటముగా నున్న పర్వత ప్రదేశములను.

కం. మొగడలతో వైడూర్యపు, జిగియాకులతోడఁ దమ్మి ♦ సెంగల్వలతో
నగ మీఱెడి యంకురలతోఁ, దగు తూఁడుల నొప్పు కొలఁకు ♦ దాఁటులఁ గనుచున్.

మొగడలతో = మొగ్గలతో, జిగి = కాంతి, తమ్మి+చెంగల్వలు = తమ్మి సెంగల్వలు-ద్వంద్వ సమాసము కావున చకారమునకు సకారము-దాఁటులు= సమూహములు.

తాత్పర్యము.

మొగ్గలతోను వైదూర్యపుఁ గాంతిగల యాకులతోను కమలములతోను జెంగల్వలతోను గాంతి గల యంకురువులతోను నొప్పు కాఁడలుగల కొలఁకులఁ జూచుచు, ప్రయాణసమయమునఁ బూలు పచ్చని యాకులు మొదలైనవి శుభశకునములు.

కం. కారండవకాండంబులు, సారసములు వంచులములు ♦ జలకుక్కుటసం
వారములుఁ జక్రవాకము, లారఁగ ధ్వనిచేయఁ గని జ♦లాశయతతులన్. ౩౪౯

కారండవ = కన్నెలేళ్ళయొక్క, కాండంబులు = సమూహములు, సారసములు = బెగ్గురులు, హంసలు, జలకుక్కుట సంవారంబులు = నీటికోళ్ళ సమూహములు, చక్రవాకములు = జక్కవలు, జలాశయ = మడుఁగుల, తతులన్ = సమూహములను.

తాత్పర్యము.

కన్నెలేళ్లు హంసలు బెగ్గురులు వంచులములు నీటికోళ్లు చక్రవాకములు విశేషముగ ధ్వనించు మడుఁగులను జూచి.

కం. గుట్టల మెట్టల మదిలోఁ, దట్టిన దిగు లింత లేక ♦ తమిఁ బచ్చికను
న్నట్టుల మేయుచు లేళులు, నెట్టన విహరింపఁ గనుచు ♦ నిండుముదమునన్. ౩౫౦

నున్నట్టులన్ = నును+పట్టులు = నునుపైన ప్రదేశములు.

తాత్పర్యము.

గుట్టల మెట్టలందు దిగు లనునది లేక మనసార లేఁతపచ్చిక మేయు జింకలు విహరించుచుండఁ జూచుచు.

చం. వనమున జంగమాద్రు లన ♦ వారిధరాభము లై తటాకముల్
గొనకొని వే కలంచుచును ♦ కూలములం దమ తెల్లకొమ్ములన్
దునియలు గాఁగఁ ద్రోయుచును ♦ దుమ్ములు నెత్తినఁ జల్లుకొంచు నొం
టిని విహరించుచుండెడి యు♦నేకపరత్నము లుండఁ జూచుచున్. ౩౫౧

జంగమాద్రులు = నడచుకొండలు- వారిధరాభములై = మేఘములతో సమానములై- కూలములు = గట్టులు- ఒడ్డులు- అనేకపరత్నములు = శ్రేష్ఠములైన యేనుఁగులు- అనేకపము = నోటితో ముక్కుతోఁ బానము చేయునది- గనుకనే దీనికి ద్విపమనియుఁ బేరు.

నాలవపాదంబున నుభయ యతి· 'ంటి' 'నే'కును యతి.

తా త్ప ర్య ము .

అడవియందు నడగొండలవలెఁ గారుమబ్బులవలెనై తటాకములను గలఁతి పెట్టుచు గట్టును దమ తెల్లని కొమ్ములచేఁ బెళ్లలు గూలఁద్రోయుచు ఆ దుమ్ములు నెత్తిమీఁదఁ జల్లుకొనుచు నొంటరిగా నేనుఁగులు తిరుగుచుండఁగాఁ జూచుచు,

క. చనుచు హుటాహుటినడకలఁ, గని ద్రుమషండంబు వనముఁ ♦ గాకుత్స్థుం డ
 రుగ్నిపట్టి కిట్టు లనియెం, దనమది కవ్వని మహాద్భు♦తంబు ఘటింపన్. ౩౫౨

హుటాహుటి నడకల = మిగుల వేగమైన నడకలచే- ద్రుమషండంబు = చెట్లగుంపు-

తా త్ప ర్య ము .

మిగుల వేగముగ నడుగులు పెట్టుచుఁ బోవుచు నందొక చెట్లు గుంపుగ నుండు వనముఁ జూచి యాశ్చర్యముఁ గొని రామచంద్రుఁడు సుగ్రీవునితో నిట్లనియె.

ఉ. ఉప్పరవీదిఁ గార్మొగులు♦నొప్పున మిక్కిలి కారుకొంచు నా
 చొప్పున నెల్లెడన్ నిగిడి ♦ సుందరమైన యనంటిచెట్లులున్
 దొప్పలుదోరలై కడుఁ గు♦తూహలమున్ సమకూర్చె మిత్రమా
 చెప్పఁగదయ్య యే మిది వి♦చిత్రము నా కుతుకంబు దీరఁగన్. ౩౫౩

ఉప్పరవీది = ఆకాశమార్గము, కార్మొగులు = వానమబ్బు, కారుకొంచు = నల్లనై, దొప్పలు దోరలై = విశేషించినవై, రాసులై, కుతుకంబు = కోరిక.

తా త్ప ర్య ము .

ఆకాశమున వానమబ్బువలె మిగుల నల్లనై నాలుగు ప్రక్కల వ్యాపించి సుందరమైన యరఁటిచెట్లు రాసులు రాసులై మిగుల సంతోషము గలిగించుచున్నది. ఈ యాశ్చర్యమేమో నాకుఁ జెప్పుము.

కం. అని యడిగిన నడచుచునే, యినజుం డి ట్లనియెఁ ద త్మ♦హిష్ఠారామం
 బునకథ యిది శ్రమనాశన, మనఘమునివనంబు సత్ఫ♦లాంబుయుతంబున్. ౩౫౪

తత్ = ఆ, మహిష్ఠారామంబున = గొప్పతోఁటయొక్క కథ = చరిత్రము శ్రమనాశనము = గాసి దొలఁగించునది, అనఘమునివనంబు = పాపరహితులైన మునుల వనము, సత్ఫలాంబుయుతంబున్ = మంచి పండ్లు నీళ్లు గలది.

తా త్ప ర్య ము ·

అని యడుగఁగా సుగ్రీవుఁడు నిలువక దారి నడచుచునే యాతోఁట కథ యిట్లు చెప్పెను.

ఉ. సప్తజనాఖ్యులైన ముని♦సత్తము లేడ్వు రధశ్శిరస్కులున్
దప్తులు నేడునాళ్ళఁ బవ♦నంబును మెక్కుచు నంబుశాయులై
సప్తశతంబు లేండ్లిచటఁ ♦ జల్పి మహావ్రత ముగ్రనిష్ఠచే
సప్తహయద్యుతుల్ చనిరి ♦ స్వర్గముఁ జేర శరీరయుక్తులై. ౩౫౫

సప్తజనాఖ్యులు=సప్తజనులను పేరుగల, అధశ్శిరస్కులున్=తలక్రిందుగఁ దపస్సు చేయువారు, తప్తులు = తపముచేయువారు, పవనంబును = గాలిని, అంబుశాయులై నీళ్లయందుఁ బండుకొనువారై, సప్తశతంబులు = ఏడునూర్లు, సప్తహయద్యుతుల్ = సూర్యునితో సమానమైన కాంతిగలవారు, సప్తహయుఁడు = ఏడు గుఱ్ఱములు గల వాఁడు, లేక సప్త యను పేరుగల యొక్క గుఱ్ఱముగలవాఁడు, శరీరయుక్తులై = దేహములతోఁ గూడినవారై.

తా త్ప ర్య ము.

సప్తజను లను పేరుగల ఋషీశ్వరు లేడ్వురు నేలపైఁ దలమోపి దపస్సుచేయుచు నేడుదినముల కొకసారి గాలి నాహారముగాఁ గొనుచు నీళ్లలోనుండి యిచ్చట నేడు నూర్ల సంవత్సరములు మహానిష్ఠచే ఘోరతపస్సుచేసి దేహములతోనే స్వర్గమునకుఁ బోయిరి.

కం. వారలమహిమను ద్రుప్రా, కారావృత మివ్వనంబుఁ ♦ గానఁగనే బృం
దారకదనుజచయంబులు, నేరవు సుమ్మీ నృపాల ♦ నిర్భరభీతిన్. ౩౫౬

ద్రుప్రాకారావృతము = ప్రాకారమువలెఁ జెట్లచే నావరింపఁబడి యుండినది. బృందారక దనుజచయంబులు = దేవతల రాక్షసుల సమూహములు- నిర్భరభీతిన్ = అధికమైన భయముచే.

తా త్ప ర్య ము.

వారి తపోమహిమచేఁ బ్రాకారమువలెఁ జుట్టఁబడిన చెట్లుగల యీ వనమును దేవతలుగానీ రాక్షసులుగానీ చూచుటకైన భయపడుదురు.

కం చొర విందుఁ బక్షులేన్ వన, చరములునేన్ జొచ్చె నేని ♦ సంభ్రమమతిచేఁ
దిరుగుచు నుండెడు నందే, నరవర వెలి రా వెన్ని♦నాళ్ళకు నైనన్. ౩౫౭

తా త్ప ర్య ము.

ఈ వనమునందుఁ బక్షులైనను నడవిమృగములైనను బ్రవేశింపవు. ప్రవేశించెనా కలవరపాటున నిందే యెన్నాళ్లైనఁ దిరుగుచుండునే కాని వెలుపలఁ బోఁజాలవు ఇప్పుడీ స్థలము కానరాదు - మునీశ్వరులతోడ దాని మహిమయుఁ బోయినది కాఁబోలు.

కం. భూషణశింజితముం బరి, తోషణకరగీతవాద్య♦తూర్యంబులు స
ద్భాషణములతో శాత్రవ, శోషణ! వినవచ్చు దివ్య♦సురభియు వీచున్. ౩౫౮

భూషణ శింజితము=ఆభరణముల ధ్వని - పరితోషణకర=మిగుల సంతోషము గలిగించు- గీతావాద్యతూర్యంబులు = పాటలయు, మర్దలాది వాద్యములయు, తుత్తురాలు మొదలైనవాని ధ్వనులు- సద్భాషణములు=వారి సల్లాపములు, శ్రోత్రవశోషణ = పగవారి నెండించువాఁడా, దివ్యసురభియు = దేవతాసంబంధమైన పరిమళముతోఁగూడిన గాలియు.

తా త్ప ర్య ము.

ఆభరణధ్వనులు సంతోషకరములైన గీతములయు వాద్యములయు తూర్యములయు ధ్వనులు వారి సల్లాపములు వినవచ్చును. దేవతాసంబంధమగు పరిమళవాయువు వీచును.

కం త్రేతాగ్నులు వెలిఁగెడి నట, వాతచయోద్ధూతధూమవారము కుజసం
జాతాగ్రంబుల నడిగొఁ గ,పోతాంగారుణరుచిం బ్రభూతం బయ్యెన్. ౩౫౯

త్రేతాగ్నులు = గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని, ఆహవనీయాగ్ని, వాతచయ= గాలి సమూహముచే, ఉద్ధూత = ఎగురఁ గొట్టఁబడిన, ధూమవారము = పొగల గుంపు, కుజసంజాతాగ్రంబులన్ = చెట్లయందుఁ బుట్టిన కొనలచే, కపోతాంగారుణ రుచిన్ = పావురాళ్ల మెడల కాంతివంటి యెఱ్ఱని కాంతులతో, ప్రభూతం బయ్యెను= విస్తారమయ్యెను.

తా త్ప ర్య ము.

అచ్చటఁ జూడుము - త్రేతాగ్నులు వెలుఁగుచున్నవి- గాలిచే నెగురఁ గొట్టఁబడిన పొగగుంపు చెట్ల కొనకొమ్మల యందుఁ బావురాళ్ల మెడలవంటి యెఱ్ఱని కాంతితో నతిశయించెను.

కం. ధూమచయావృతమస్తక, సీమల నేతద్వనీవిశిష్టావనిజ
స్తోమంబులు ధారాధర,ధామయుతవిదూరజాతధరములఁ బోలెన్. ౩౬౦

ధూమ = పొగయొక్క, చయ = సమూహము చేత, ఆవృత = కప్పఁబడిన, మస్తక సీమలన్ = తలలయందు - ఏతత్ = ఈ, వనీ = అడవియొక్క, విశిష్టావనిజ = సమస్త వృక్షముల యొక్క, స్తోమంబులు = సమూహంబులు, ధారాధర ధామయుత = మేఘముల కాంతితోఁగూడిన - విదూర జాత = వైడూర్యముల, ధరములన్ = పర్వతములను.

తా త్ప ర్య ము.

పొగచేతఁ గప్పఁబడిన పైభాగములు గలవై యీ యడవియందుండు వృక్షములన్నియు మేఘముల కాంతిచేఁ గప్పఁబడిన వైడూర్య పర్వతమువలె నున్నవి.

పైకప్పిన పొగ- మేఘము,లోపలి పచ్చని యాకుల కాంతి వైడూర్య కాంతి- ఇట్లెత్తుగఁ బర్వతములవలె నున్నవని భావము.

౩౫౫ వ పద్యమందు మునులు స్వర్గమునకు శరీరముతోఁ బోయిరని చెప్పఁబడెను. ఈపద్యములం దిం దున్నట్లు చెప్పఁబడెను. దీనివలన వారు స్వర్గమునకు శరీరములతోఁ బోయి యం దుండి కావలసినపుడు మరలి యిచ్చటికి వచ్చుచుందురని భావము. ఇది యోగబలముచేఁ బోవుట యేగాని మరణించినవారు పోయినట్లు పోవుట గాదు.

చం. అనుజునితోడ నమ్మునుల ♦ కంజలి సేయుము ధర్మశీల యి
మ్మునులకు మ్రొక్కువారలకు ♦ మూఁడ దొకింతయు దేహరోగ మం
చన ననుజుండుఁ దానును స♦మంచితభక్తి నమస్కరించి చ
య్యన నది దాఁటి దవ్వగు ప్ర♦యాణము పోయి యటం గనుంగొనెన్. ౩౬౧

మూఁడదు = కలుగదు.

తాత్పర్యము.

రామచంద్రా ! నీవు తమ్మునితో మునీశ్వరులకు నమస్కరింపుము. ఈ మునులకు మ్రొక్కువారలకు వ్యాధులంటవు. అని చెప్పఁగా రామచంద్రమూర్తి లక్ష్మణునితో నమస్కరించి త్వరగా నా ప్రదేశము దాఁటి దూరపుఁ బ్రయాణము పోయి యచ్చటఁ జూచెను.

దీనివలన మార్గమధ్యమునఁ బెద్దలు కనఁబడిరేని వారికి నమస్కరింప వలయు నని భావము.

తే. వాలిపాలితకిష్కింధ ♦ భద్రసూక్తి, యిట్లు రామానుజాగచ♦రేశయుక్తి
నుదితసముదగ్రతేజుం డ♦నూనశక్తి, మరలఁ జనుదెంచె శత్రుసం♦హారణరక్తి. ౩౬౨

భద్రసూక్తి = శుభకరమైన మాటలుగలవాఁడు. రామానుజాగచరేశయుక్తి = లక్ష్మణ సుగ్రీవులతోడ - ఉదిత = పుట్టిన - సముదగ్రతేజుండు = తీవ్రమైన తెజస్సు గలవాఁడు, మహాత్ములకు నమస్కరించిన ఫల మిది, అనూనశక్తి = కొఱఁతలేని శక్తి, శత్రు సంహారణ రక్తి = పగవానిఁ జంపుటయందలి యాసక్తి.

నాలుగవ పాదంబున, మవర్ణవిరామము చెప్పినను జెప్పవచ్చును. ప్రాసయతి జెప్పినను జెప్పవచ్చును.

తాత్పర్యము.

శుభకరములైన మాటలు చెప్పువాఁడగు రామచంద్రమూర్తి లక్ష్మణ సుగ్రీవులతో విస్తార తేజోవంతుఁడై వాలి సంహారమందుఁ గల యాసక్తిచే వాలి పాలించు కిష్కింధను జూచెను.

కం. ఈరీతి నెల్లకును బా,కారితనూజాతపత్త♦నాంతికమున దు
ర్గారణ్యతలమునన్ భూ,మీరుహపాళీపినద్ధ♦మేదిని నిలువన్. ౩౬౩

పాకారితనూజాత = వాలియొక్క, పత్తనాంతికమునన్ = పట్టనము సమీపమున, దుర్గారణ్యతలమునన్ = చొరగాని యరణ్య ప్రదేశమందు. భూమిరుహపాళీ = చెట్లగుంపులచే, పినద్ధ = కప్పఁబడిన, మేదినిన్ = భూమియందు.

తాత్పర్యము.

ఈ విధముగ నందఱు వాలి పాలించు నగరము సమీపమున దట్టమైన యరణ్యప్రదేశంబునఁ జెట్లగుంపులచే మఱుఁగైన స్థలమునందు నిలువఁగా.

మొదటిసారి కిష్కింధకు వచ్చినపుడు మార్గవర్ణనములేదే. ఇది వేఱు మార్గమా? వాల్మీకిశైలివిధ మిట్టిదని ముందే చెప్పఁబడెను. ఇప్పుడు వర్ణించుట సమయోచితము. శుభశకునములు, మహాత్ముల యభివాదనము కార్యసాఫల్య సూచకములు. తొలుత నివి చెప్పుట వ్యర్థము. రావణుఁడు మారీచునొద్దకుఁ బోయినపుడు మొదటిసారి యేవర్ణనము చెప్పలేదు. రెండవసారి మార్గము వర్ణింపఁబడెను. ఇది వేఱు త్రోవయై యుండిన నుండవచ్చును. కాకుండినఁ గాకుండవచ్చును. ఔచిత్యము గ్రాహ్యము.

-౧౪-వ సర్గము. శ్రీరాముఁడు సుగ్రీవునకు భయము పాయ నుత్సాహోక్తులు చెప్పుట.-

సీ. అంత సుగ్రీవుఁ డ♦త్యంతరోషంబున, నలుగడ లఱ్ఱెత్తి ♦ కలయఁ జూచి
ఝంఝూతరఃపుర♦స్సరవారిధరగర్జ,లను బోలు గర్జలు ♦ నినిచి బాల
తరణితుల్యుఁడు క్రియా♦దక్షు రామునిఁజూచి, హరివాగురావృత♦యంత్రరక్షి
తంబు కిష్కింధప♦ త్తన మిద్దియే సుమ్మి, వచ్చితి మిందు నో ♦ వాసవాభ
తే. మున్ను వాలిని జంపెద ♦ నన్నప్రతిన
సఫలముగఁ జేయ నిదియ చూ ♦ సమయ మయ్య
లతికలకు వసంతాదికా♦లంబురీతి
ననిన రఘురాముఁ డిట్లను ♦ నర్కజునకు.   ౩౬౪

నలుగడలు = నాలుగు + కడలు = నాలుగుదిక్కులు- అఱ్ఱు = మెడ- ఝంఝూ = వానతోఁగూడిన గాలియొక్క (తుపాను) తరస్ = వేగము- పురస్సర= ముందుగాఁగల- వారిధర = మేఘముల- గర్జలను = ఉఱుములను- గర్జలు = సింహనాదములు- నినిచి = నిండించి- బాలతరణితుల్యుఁడు = ఉదయకాలమందలి సూర్యునితో సమానుఁడు- దీనివలనఁ దేజోభివృద్ధి సూచితము, క్రియాదక్షుఁ = కార్యము చేయుటయందు సమర్థుని, ఈ విశేషణ మీ సారి రామచంద్రమూర్తి వాలిని వధించు నని సూచితము, హరి = కోఁతులనెడి, వాగురా = వలచేత, ఆవృత = చుట్టఁబడిన, యంత్రరక్షితంబు = యంత్రములచే రక్షింపఁబడినది· (౨) విరోధి క్రోఁతులు రాకుండుటకై వలచేఁ జుట్టఁబడి యంత్రములచే రక్షింపఁబడినది. వాసవాభ = ఇంద్రసమానుఁడా, ప్రతిన = ప్రతిజ్ఞ, లతికలకు = తీఁగలకు, వసంతాది కాలంబురీతి = వసంతము మొదలైన ఋతువులవలె, అనఁగా నే యే తీఁగ లే యే ఋతువుల నెట్లు తప్పక పూచునో యట్లు నీవు చెప్పిన మాట ఫలించుటకు నిదియే సమయము.

తాత్పర్యము.

అంత సుగ్రీవుఁడు మిగుల రోషముచే మెడయెత్తి నాలుగు వైపులు చూచి గాలి వాన విసరునప్పుడు మేఘములు గర్జించునట్లు సింహనాదములు చేసి లేఁతసూర్యునితో సమానుఁడు, కార్యసాధన సమర్థుఁడగు రామచంద్రమూర్తిని జూచి రామచంద్రా! యిదిగో వానరులను వలచేఁ జుట్టఁబడి యంత్రములచే రక్షింపఁబడు కిష్కింధా నగరము, దీనిని వచ్చి చేరితిమి. ఆయా శీఁగ లాయా బుతువులఁ దప్పక పుష్పించు చందమున నీవు పూర్వము చెప్పినమాట సఫలముచేయుట కిదియే తగిన సమయము. అనిన సుగ్రీవునకు రామచంద్రమూర్తి యిట్లనియె.

సీ. సౌమిత్రి సీకంఠ♦సీమను గూర్చిన,గజపుష్పచిహ్నంబు♦కతన నీవు
చుక్కచాలుల నొప్పు♦సూర్యుచే భాసిల్లు,విపరీతగగనంబు♦విధముగాఁగ
వెలిఁగెదు వాలిచేఁ ♦ గలుగు నీభయ మెల్ల, బాణ మొక్కంటన ♦ పాపువాఁడఁ
గానిపింపుము భ్రాతృ♦కంటకు నవ్వాలి, నంతతో వాఁ డంత ♦ మందుఁ జుమ్ము
తే. నుడు లి వేటికి నా కంటఁ♦ బడియు వాఁడు, మరల జీవంబుతోఁడుత ♦ మరలెనేని
యప్పు డేమైన దూషింపు♦మనఘ చరిత,యంతకును గర్వసేఁత న్యా♦య్యంబు గాదు.

చుక్కచాలుల......విధముగాఁగ...నక్షత్రములు ప్రకాశించు రాత్రులందు సూర్యుఁడు ప్రకాశించుట పగటఁ జంద్రుఁడు ప్రకాశించుట విపరీతములు.

౧. "పరీతంతు దివా ప్రోక్తా, విపరీతంతు శర్వరీ, రాకామధ్యగతశ్చంద్రః సూర్య ఇత్యభిధీయతే" పరీతమనఁగాఁ బగలు,విపరీత మనఁగా రాత్రి, పదునారు కళలతోఁ గూడిన చంద్రునిగల నాఁటిరాత్రి చంద్రునకు సూర్యుఁడని పేరు, అను ప్రమాణము చొప్పున షోడశకలాయుక్తుఁడైన చంద్రుఁడు గల యాకాశము.

౨. విపరీత గగనంబు=నక్షత్రములచే, విపరీత=విశేషముగ నావరింపబడిన యాకాశము, సూర్యుచేఁ జంద్రునిచేత- ఒకనిపేరు మఱియొకనికిఁ జెప్పవచ్చునా యందురేని, 'నవోనవోభవతి' యను శ్రుతియందు "అహ్నాంకేతు" అని సూర్యుఁడు చెప్పఁబడుచుండఁగా జంద్రునికి నాప్యాయకుఁ డగుటవలనఁ జంద్రుడనియే చెప్పఁబడెను. సూర్యకిరణములు చంద్రబింబముపైఁ బడి యదియే మనకు వెన్నెలగా నగుచున్నది, చంద్రప్రకాశము సూర్యునివలననే కావునఁ జంద్రుఁడే సూర్యుఁ డని చెప్పఁబడెను. కనుక రాత్రివేళ నక్షత్రమాలికలచేఁ జుట్టఁబడిన చంద్రునివలె నని యర్థము.

(3) నక్షత్రమాలచేఁ జుట్టఁబడిన సూర్యునివలెఁ బ్రకాశించెద వని యర్థము. ఇది యభూతోపమ. అనఁగా సూర్యునికాంతికిఁ దోడు నక్షత్రములుకూడఁ బ్రకాశించెనా సూర్యుఁ డెట్లు విశేషముగ వెలుఁగునో యట్లు ప్రకాశించు చున్నావని యర్థము.

(౪) విపరీతకాలమందు సూర్యుఁడు నక్షత్రములచేఁ జుట్టఁబడి ప్రకాశించునట్లు నీవీ పుష్పమాలచేఁ బ్రకాశించుచున్నా వని యర్థము "రాత్రా వింద్రధనుర్దర్శే,

దివా నక్షత్రదర్శనే, తద్రాష్ట్రనాథనాశ స్స్యా దితి గర్గస్య భాషితమ్" రాత్రియందు ఇంద్రధనుస్సు కనఁబడినను పగటఁ జుక్కలు కనఁబడినను ఆ రాజ్యముయొక్క రాజు నశించును.

కావున వాలి నశించు నని సూచితము. నీవు గజపుష్పమాలికచేత విపరీత కాలమున రాజనాశనము తెలుపుటకుఁ బగలు చుక్కలతోఁ గూడి సూర్యుఁడు ప్రకాశించునట్లు నీవు ప్రకాశించుచున్నావు. వాలి నశించును, భయపడకు మని రామచంద్రమూర్తి యభిప్రాయము. గోవిందరాజీయము, మహేశ్వరీయమందు నిట్లే యున్నది. చంద్రునికిఁ గాంతి సూర్యుని వలనఁ గలుగుచున్నదని విష్ణుపురాణమం దుఁగలదు. "క్షీణం సోమం సురైః పీత మాప్యాయయతి దీప్తిమా నేత్రే నైక కళం సంతం రశ్మి నైకేన భాస్కరః" వి. పు. గర్హా సేఁత= నిందించుట.

తా త్ప ర్య ము .

సుగ్రీవా ! నీమెడయందు లక్ష్మణుఁడు వైచిన గజ పుష్ప మాలికచే నక్షత్ర ములచేఁ జుట్టఁబడిన నిండుచంద్రునివలెఁ బ్రకాశించుచున్నావు. మఱియుఁ బగలు చుక్కలతోఁగూడిన సూర్యుఁడెట్లా రాష్ట్ర ప్రభువును వధించునో యట్లు నీవును పుష్ప మాలికచే వెలుఁగుచు వాలివలన జంపఁగలవు, భయపడకుము. వాలివలన నీకుఁ గలిగిన భయ మొక్క బాణముచేతనే తొలఁగించువాఁడను. సోదరుని బాధించువానిని నాకుఁ గనులఁబడఁజేయుము. అంతతో వాఁడు చచ్చినాఁడని నమ్ముము. ఈ మాటలతో నేమి ప్రయోజనము? వాఁడు నాకుఁ గనఁబడి మరల జీవించెనా యప్పుడు నన్ను నిందింపుము. అంతవఱకు నీవు నన్ను నిందించుట ధర్మము గాదు. దీనివలన సుగ్రీవుఁడు రామచంద్రమూర్తిని పోయినసారి చేసినట్లు చేయకు మని చెప్పినాఁడని తోఁచు చున్నది.

క. కన్నారఁ జూచితివిగా, ము న్నా సాలంబు లొక్క ♦ మొగి నే డిలపై
మన్నారాచంబునఁ బడ, నన్నెఱిఁ దలపోయు వాలి ♦ హతుఁ డౌట కెటన్. ౩౬౬

తా త్ప ర్య ము.

పూర్వ మేడు మద్దిచెట్లొక్క బాణముచే నొక్కసారిగ నేలమీఁద బడుట నీవు కన్నులారఁ జూచితివిగదా, వాలియు నిప్పు డట్లే చంపఁబడు నని నమ్ముము.

కం. ఎన్ని విపత్తుల మునుఁగుచు,నున్నను వరధర్మలోప ♦ మొల్లమిఁ గల్లను
ము న్నెన్నఁ డాడ నిఁక నే, నెన్నం డాడంగఁ బోవ ♦ నిది నిజ మనఘా! ౩౬౭

తా త్ప ర్య ము.

నే నెన్ని యాపదలలో మునుఁగుచున్నను నుత్తమధర్మము విడుచుటకు మన స్సంగీకరింపదు. కావున నింతకుముందు నే నసత్య మాడినది లేదు. ఇఁక నాడఁబోవు నది లేదు. ఇది నిజము.

చ. విడువుము సంభ్రమంబు నెఱ♦వేర్చెద నాదుప్రతిజ్ఞ వానచే
మడులను సస్యవంతముగ ♦ మానుగ నింద్రుఁ డొనర్చుభంగి, లో
జేడియకు మెట్టిగర్జ బల♦శాసనసూనుఁడు విన్నమాత్రనే
యుడుకుచుఁ బోరికై నడచు♦నో యొనరింపుము యట్టిగర్జలన్. ౩౬౮

ఉడుకుచున్ =కోపముచేఁ దపించుచు, బలశాసనసూనుఁడు = ఇంద్రుని కుమారుఁడు-వాలి.

తాత్పర్యము.

నీవు భయమువలని తొట్రుపాటు వదలుము. వానచే వరిమళ్లను నింద్రుఁడు పంటలచే నిండించునట్లు నా ప్రతిజ్ఞ నేను నెఱవేర్చెదను. మనస్సునందలి భయము వదలుము. ఎట్టి సింహనాదము వాలి విన్నమాత్రమునఁ గోపముచే మండిపడుచు యుద్ధమునకై వచ్చునో యట్టి సింహనాదము సేయుము.

ఉ. క్రచ్చఱ ధైర్యశాలి జిత♦కాశి పరాక్రమరాశి వాలి మ
న్నొచ్చినవాఁడు గాఁడు త్వద♦నూనబలంబున నట్లు గావునన్
వచ్చు నవశ్య మిందు, నవ♦వారిజనేత్రిలగోష్ఠి నున్నచో
హెచ్చును గాదె దుర్మద మ♦దెట్టి వివేకికి వానరోత్తమా. ౩౬౯

క్రచ్చఱన్ = శీఘ్రముగా, వచ్చునను శబ్దముతో నన్వయము- జితకాశి = జయముచేఁ బ్రకాశించువాఁడు- నొచ్చినవాఁడు = దెబ్బతినినవాఁడు- త్వదనూన బలంబునన్ = నీ పూర్ణబలముచే.

తాత్పర్యము.

ధైర్యవంతుఁడు = ఎప్పుడును జయమే పొంది వెలుఁగువాఁడు. ఓడిపోవుట యెట్టిదో యెఱుఁగనివాఁడు, పరాక్రమవంతుఁడు. నీచే నెప్పుడు దెబ్బతినినవాఁడు కాఁడు. కావుననే నీ గర్జ విన్నంతమాత్రముననే శీఘ్రముగ యుద్ధమునకు వచ్చును. ఏమి నిజమందువా? ఆఁడువారితోఁ గూడియుండునపు డెంత వివేకికైనను దుర్మద మెచ్చును గదా- తన యోగ్యతకంటె నెక్కువ యోగ్యతగలవాఁడ నని తలఁచును.

క. శూరులు వైరికృత తిరస్కారంబును సైఁపలేరు ♦ స్వబలము పేర్మిన్
నారీజనసన్నిధి నిఁక, వారి దురాగ్రహముఁ జెప్ప♦వలయునె చెపుమా. ౩౭౦

తాత్పర్యము.

శూరు లగువారు స్వభావముగనే తమ బలముపెంపున శత్రువులుచేయు తిరస్కారమును సహింపలేరు. ఇఁక స్త్రీల సమక్షమందు నవమానము కలుగున ట్లుండెనా వారి దురాగ్రహమునకు మేరలేదు.

ఇప్పుడు స్త్రీలతోడ వాలి యున్నాఁ డని యెట్లూహించె ననిన "ప్రాతర్మూత్ర పురీషాభ్యాం । మధ్యాహ్నే క్షుత్పిపాసయా । సాయం కామేన పీడ్యంతే । జంతవో నిశినిద్రయా" యని నీతివచనము.

జంతువు లుదయకాలమున మలమూత్రముల చేతను, మధ్యాహ్న మాఁకలి దప్పులచేతను సాయంకాలము కామముచేతను, రాత్రులు నిద్రచేతను బీడింపఁబడును. దీనివలన నిది సాయంకాల మని తోఁచుచున్నది. (౩౮౦ న ప. చూడు)

ఇచట భారతమందలి,

ఇంతుల గోష్ఠినున్న నతఁడెంత వివేకము గల్గెనేని న
త్యంతమదాభిభూతుఁడగు ధర్మువు దప్పి ప్రియం బెఱుంగఁ డే
నెంత వివేకి నయ్యును సహింపక యింతులయొద్దఁ బల్కితిన్
వింతయె కాముశక్తి యుదిలింపఁగ శక్యమె యెట్టివారికిన్.

ఆదిపర్వము.

సుప్రాకృతోఽపి పురుషః సర్వః స్త్రీజనసంసది
స్తౌతి గర్వాయతేచాపి, స్వ మాత్మానం నసంశయః.

భార. ౧౨-౨౨-౧-౧౪

స్త్రీలంగోడ నున్నప్పుడు మిగుల సామాన్యుఁడైన మగవాఁడు కూడఁ దన్నుఁ దాను బొగడుకొనును, గర్వించును, సందేహము లేదు.

—♦ సుగ్రీవుఁడు వాలిని రణంబునకుఁ బిల్చుటకై సింహనాదముఁ జేయుట. ♦—

కం. ఇటు పలికిన రాముని ప్రస్ఫుటవాక్యము లాలకించి ♦ సుగ్రీవుఁడు ది
క్స్ఫుటలస్ఫోటముగా గళ,రటనము స్ఫూర్జధునిభంబు ♦ రహి నెసఁగించెన్. ౩౭౧

దిక్స్ఫుటల స్ఫోటముగాన్=దిక్కుల సమూహములు పగులునట్లుగ, గళరటనము = కంఠధ్వని, స్ఫూర్జధునిభంబు = ఉఱుమువంటిది.

తాత్పర్యము.

ఈ ప్రకారము రామచంద్రమూర్తి స్పష్టముగాఁ జెప్పిన మాటలు విని సుగ్రీవుఁ డుఱుమువలెఁ గంఠధ్వనిని దిక్కులు పగులునట్లు చేసెను.

ఉ. గుండె లగల్చు కీశవరు♦గ్రూరవిరావము నాలకించి గో
కాండ మరాజకావనిని ♦ గర్వితదుష్టులు పట్టరాఁగ వే
తండసుయాన లార్తిని య♦థాయథలై పరువెత్తునట్లుగా
రెండొకతోవఁ బోవక గ♦రిష్ఠజవంబునఁ బాఱె దిగ్భ్రమన్. ౩౭౨

అగల్చు = పగిలించు - విరావము = ధ్వని - గోకాండము = ఆవుల సమూహము, అరాజక+అవనిని = రాజులేని భూమియందు, గర్వితదుష్టులు = మదించిన చెడు నడవడి గలవారు, వేతండ సుయానలు = స్త్రీలు, యథాయథలు = చెల్లాచెదరులై, సంస్కృతమున యథాయథ మ్మనియే యవ్యయము. ఆంధ్రమున యథాయథ లనియె ప్రయుక్తము, వృథలు అని యిట్లే మఱియొక శబ్దము గాననయ్యెడి.

గరిష్ఠ జవంబునన్ = మిగుల వేగముతో, దిగ్భ్రమన్=దిక్కు తెలియక, ఆవులు వచ్చుచున్న వనుటయు సాయంకాలమును సూచించుచున్నది.

తాత్పర్యము.

గుండెలు పగిలించు సుగ్రీవుని కఠోరమైన కంఠధ్వని విని మేయఁబోయి యూరికివచ్చు నావులు రాజులేని దేశమున దుష్టులు మదించి పట్టుకొనరాఁగాఁ గల స్త్రీలు చెల్లాచెదరై నలుప్రక్కలఁ బరువెత్తునట్లు రెండొక్క తోవఁ బోవక మిగుల వేగముగఁ దా మెక్కడికిఁ బోవునది తెలియక పరువెత్తెను.

కం. సంగరభగ్నము లైన తు, రంగంబులగతిని బఱచె ♦ రయమున మృగముల్
నింగి విడిపడియె ధరణిఁ బ, తంగంబులు క్షీణపుణ్య♦తన్ గ్రహము లనన్. ౨౩

సంగరభగ్నములు = యుద్ధమునందు గాయపడిన, తురంగంబుల గతిని = గుఱ్ఱములవలె, రయమునన్ = త్వరగా, పఱచెన్ = పరువెత్తెను, నింగి = ఆకాశము విడి=విడిచి, పతంగంబులు = పక్షులు, క్షీణపుణ్యతన్ = పుణ్యము క్షయించుటచే.

తాత్పర్యము.

యుద్ధమునందు దెబ్బలు తిని విఱిగిన గుఱ్ఱములు పరువెత్తునట్లు మృగములు పరువెత్తెను. పక్షు లాకాశముననుండి పుణ్యక్షయమున గ్రహములు నేలఁగూలునట్లు పడెను.

గొప్పపుణ్యము చేసినవా రాకాశమున నక్షత్రములు గ్రహములునై యుందురు. ఆ పుణ్యము క్షయింపఁగానే భూలోకమునకు వత్తురు. "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" భ. గీ.

కం. జీమూతభయదగర్జో, ద్దామగళార్భటుని రవిజు♦ధ్వానం బెసఁగెన్
భీమానిలహతిచంచలి, తామితకల్లోలవార్ధి ♦ కామ్రేడితమై. ౨౪

జీమూత = మేఘములయొక్క- భయద = దిగులు గలిగించు- గర్జా = ఉఱుమువలె- ఉద్దామ = గొప్పది యగు- గళార్భటునిన్ = కంఠధ్వనిగలవాఁడగు- రవిజు = సుగ్రీవునియొక్క, ధ్వానంబు = ధ్వని, భీమానిల = భయంకరమైన గాలి యొక్క, హతి=దెబ్బచే, చంచలిత = కదలుచున్న, అమిత = విస్తారమైన, కల్లోల = పెద్ద యలలుగల, వార్ధికి = సముద్రమునకు, ఆమ్రేడితమై = రెండవదియై, సమానమై, ఒకశబ్దము రెండుమా ర్లుచ్చరించితిమేని రెండవసారి యుచ్చరించిన దాని కామ్రేడిత మనిపేరు. ఉ॥ ఔర = ఔర+ఔర=ఇందు రెండవ యౌర ఆమ్రేడిత మనబడును. ఇది వైయాకరణ మతము.

తాత్పర్యము.

మేఘముయొక్క భయంకరమైన యుఱుమువలె గొప్ప దగు కంఠధ్వనిగల సుగ్రీవుని ధ్వని యతిశయించెను. అది భయంకరమైన గాలిచేఁ గొట్టఁబడుటచేఁ జలించు పెద్ద యలలు గల సముద్రధ్వనిని బోలి యుండెను.

—♦ ౧౫-వ సర్గము. యుద్ధమునకుఁ బోవువాలిని దార యడ్డగించుట. ♦—

తే. సర్వభూతపరికంపన♦శక్తమైన తరణిసంభవు గర్జ శు♦ద్ధాంతగతుఁడు
వాలి వినినంత మద మెల్లఁ♦దూలిపోయె, దుస్సహం బైన కినుక ప్రా♦దుర్భవించె.

సర్వభూత = సమస్త జీవజంతువులను, పరికంపన శక్తము = వణఁకించు శక్తిగలది. తరణిసంభవు గర్జ=సుగ్రీవుని సింహనాదము, శుద్ధాంతగతుఁడు=అంతఃపుర స్త్రీలతో నున్నవాఁడు. శుద్ధాంతశబ్దము అంతఃపురమందును, అంతఃపుర స్త్రీలయందును వర్తించును. దీనికి సరియయిన తెనుఁగుశబ్దము రాణివాసము-ఇది రామచంద్రుని యూహ సరి యని తెలుపుచున్నది. ప్రాదుర్భవించెక్ = పుట్టెను.

తా త్ప ర్య ము.

సమస్త జీవములను గడగడ లాడింపఁగల సుగ్రీవుని సింహనాదము అంతఃపురమందున్న వాలి వినినంతనే యతనిమద మణఁగిపోయెను. సహింపరాని కోపము పుట్టెను.

తే. అధికరోషపరీత స♦ర్వాంగుఁ డగుట, సంజకెంజాయ లీనెడు♦శక్రసుతుఁడు
సోపరాగసహస్రాం♦శుతే♦జ నపుడు, కానఁబడియెను దేజోవి♦హీనుఁ డగుచు.

అధికరోషపరీత సర్వాంగుఁడు = మిక్కుటమైన కోపముచే వికారమైన యవయవము లన్నియుఁ గలవాఁడు. కోపాగ్నిచే దగ్ధుఁ డగుటచేఁ బూర్వపుఁగాంతి మాత్రె నని భావము. సంజకెంజాయలు = సాయంకాలమునందలి యెండలు, వీనికి వేఁడిమి తక్కువ, త్వరలోనే రూపుమాయును. సోపరాగ = గ్రహణముతోఁగూడిన, సహస్రాంశునోజక్ = సూర్యునివలె.

తా త్ప ర్య ము.

విపరీతపుఁ గోపముచే రూపుమాఱిన యవయవములు గలవాఁ డగుటచే సంధ్యాకాలమందలి సూర్యకాంతులు గలిగించు వాలి గ్రహణముపట్టిన సూర్యునివలెఁ హీనుఁ డయ్యెను.

సంధ్యాకాలసూర్యునకు గ్రహణము పట్టినఁ దేజోహీనుఁ డగునట్లు కోపాగ్నిచే మండుచున్న వాలి సుగ్రీవుని ధ్వనిచే మఱింత గాంతివాసినవాఁ డయ్యెను. సాయంవేళ సూర్యునికి వేఁడిమి కాంతి తగ్గును. దానికిఁదోడు గ్రహణము సోఁకిన మఱింత తగ్గును.

తే. వికటదంష్ట్రాకరాళుఁడు ♦ ప్రకటకోప, భారమునఁ బ్రజ్వలద్వహ్ని ♦ భాతి వెలిఁగి
నలినములు పీఁకివైవ మృ♦ణాళయుక్త, మైన మడుఁ గన నుండె వి♦హీనకాంతి.

వికటదంష్ట్రాకరాళుఁడు = క్రూరములైన కోఱలచే భయంకరుఁడు, ప్రజ్వలత్ + వహ్ని = మండెడు నగ్ని, మృణాళయుక్త=తామరతూఁడులతోఁగూడిన,

తా త్ప ర్య ము.

క్రూరములైన కోఱలచే భయంకరుఁడైన వాలి కోపాతిశయముచే మండుచున్న యగ్నివలె వెలుఁగుచుఁ దామరలు పీఁకివేయఁగా మిగిలిన తామరతూఁడులు గల మడుఁగనఁ గాంతిచెడి యుండెను.

చం.చటులమహారవంబు తన♦ జానుల నించుక సోఁకినంతనే
పటపట పండ్లు గీఁటుచును ♦ పాదతలాహతి భూమి బ్రద్దలై
త్రుటితము గాఁగ వాలి చనఁ ♦ దోయజలోచన తార యడ్డమై
స్ఫుటతరసౌహృదంబు మదిఁ ♦ బొంపిరిపోవఁగఁ గౌఁగిలించుచున్. ౩౭౮

జానులన్ = చెవులను, గీఁటుచున్ = కొఱుకుచు, పాదతలాహతిన్ = కాళ్ళదెబ్బలచే, త్రుటితముగాఁగన్=తునుకలుగాఁగ, పగిలిపోఁగా, సౌహృదంబు= స్నేహము, పొంపిరిపోవఁగన్ = అతిశయింపఁగా.

తా త్ప ర్య ము.

భయంకరమైన సుగ్రీవుని కంఠధ్వని తన చెవులలోఁ బడినంతనే పటపట పండ్లు గొఱికి కాలి త్రొక్కుడులచే భూమి బ్రద్దలుకాఁగా సుగ్రీవుని మీఁదికిఁ బోవుచుండఁగాఁ దార యడ్డమై స్నేహాతిశయంబునఁ గౌఁగిలించుచు.

కం.కల్యాణోదర్కంబుగఁ, గల్యాణి వచించె భీతి ♦ ఘనసంభ్రాంతిన్
గల్యంబున రే ముడిచిన,మాల్యమువలె విడు ఝరస♦మాగతరుషనున్. ౩౭౯

కల్యాణి = మేలగునది చెప్పునది, కల్యాణోదర్కంబుగన్ = మీఁద మేలు కలుగునట్లు, కల్యంబునన్ = ఉదయమున, ఝరసమాగతరుషనున్ = కొండవంక వలె వచ్చిన కోపమును.

తా త్ప ర్య ము.

శుభకరమైన వాక్యములు చెప్పుతార వాలికి మేలు గలుగునట్లుగ భయము చేతను దొట్రుపాటుచేతను నిట్లు చెప్పెను. రాత్రి ముడిచినపూ లుదయమునఁ దీసి వేయునట్లున్నట్టుండి సెలయేటివలె వచ్చిన యీ కోపమును వదలిపెట్టుము.

కం.అరుణోదయ మైనను నీ, వరుగంగా వచ్చుఁగాని ♦ యనికై యిపుడే
యరుగమి నీ కవమానము, నరికిని గౌరవము కల్గ ♦ దరయుము బుద్ధిన్. ౩౮౦

అరుణోదయమైనను = సూర్యోదయమైన పిమ్మట, దీనివలన నిప్పుడు సాయంకాల మని యేర్పడెను - అనికై = యుద్ధమునకై, అరికి = విరోధికి.

తా త్ప ర్య ము.

సూర్యోదయము కాఁగానే నీవు యుద్ధమునకుఁ బోవచ్చును. ఇప్పుడే పోకున్న నీకు రాఁగల యవమానముగాని నీ విరోధికి రాఁగల గౌరవముగాని లేదు. ఆలోచింపుము.

చం.కదనము సేయ నిష్ట చనఁ ♦ గార్యముగా, దిటు లంటకుం గతం
బిది యని చెప్పెదన్ రవిజుఁ ♦ డింతకు మున్న భవద్బలోద్ధతిన్
నదమద మయ్యెఁ జాతియును ♦ సత్త్వవిహీనత, నింతలోననే
కొదుకక నిన్ను యుద్ధమున♦కున్ ధృతిఁ జీరుట శంక తోఁచెడిన్. ౩౬౧

కదనము = యుద్ధము, కతంబు = కారణము, నదమదము = నలిగులి.

తాత్పర్యము.

ఇప్పుడే పోయిన రాఁగల నష్టియేమి యనెదవా? ఇప్పుడు యుద్ధమునకుఁ బోరాదు. దానికిఁ గారణ మేమందువా? ఇంతకు నల్పకాలముముందే నీ భుజ బలముచే నదమదమై బలహీనుఁడై పరువెత్తిపోయెను. ఇంతలోననే మరల యుద్ధము నకు నిన్నుఁ బిలుచు ధైర్యము సాహసమెందుండి వచ్చెను? కావున నాకేదో సందే హము తోఁచుచున్నది.

కం.ఆ రొప్పువిధముఁ జూడఁగఁ, బె రొప్పుబలంబు చలము ♦ పెనుజతనము సా
ధారణముగఁ దోఁపదు పెనుఁ,గారణ మొది యేని గలుగఁ♦గా నోపుఁ జుమీ.

రొప్పువిధము = ధ్వనించువిధము, పెనుజతనము = పెద్ద ప్రయత్నము.

తాత్పర్యము.

అతఁడు చేయు సింహనాదము మునుపు చేయునట్టిదిగాదు. బలము, చలము, బలమైన ప్రయత్నము మిగుల గొప్పదిగా నున్నది. ఇట్లగుటకుఁ గారణమేదో యుండవలెను. కారణములేక కార్యము పుట్టునా?

కం.ప్రా పెవ్వఁడు లేకయె యి, ట్లోపునఁ జనుదేరఁ డనుచు ♦ నెంతు బలితపుం
బ్రాపు దొరకొనక యుండిన, నా పగిదిన్ గళనినాద ♦ మడరించెడినే. ౩౬౩

తాత్పర్యము.

ఏదియో బలిష్ఠమైన సాహాయ్యము లభింపకున్న నిట్లు బలమున రాఁ డని నా యభిప్రాయము. బలిష్ఠసాహాయ్యము దొరకకుండిన నటువంటి సింహనాదము చేయునా?

కం. తెలివియు నేరుపు నతనికిఁ, గలిగినయవి పుట్టుతోన ♦ కానఁ బరీక్షా౽
తులశుద్ధుని తోడుతఁ గా, కలఁతుల మది నమ్మ యాతఁ ♦ డరుదేఁ డనికిన్.౩౬౪

పరీక్షా౽తుల శుద్ధునితోడుతన్ = పరీక్షయందు నసమానముగఁ దేటిన వానితోఁగాని, అలఁతులన్ = అల్పులను, అనికిన్ = యుద్ధమునకు.

తాత్పర్యము.

తెలివి నేరుపు సుగ్రీవునకుఁ బుట్టువుతోడనే వచ్చినవి. బాగుగఁ బరీక్షించి నిస్సందేహముగఁ బలిష్ఠుఁడని తోఁచినవానితోడ వచ్చునుగాని యల్పులతోఁగలసి యుద్ధమునకు రాఁడు.

తార వానరస్త్రీయైనను నెంత యుక్తియుక్తముగ మాటలాడుచున్నదో చూడుఁడు.

సీ. ఆ కథ యంతయుఁ ♦ బ్రాణేశ మున్న నే, మన యంగదునిచేత ♦ వినినదాన
నతఁ డరణ్యంబున ♦ కరిగి తా వచ్చుచు, వేగులు చెప్పఁగా ♦ వినియె నంట
విను మయోధ్యాధిపు♦తనయులు వీరులు, రాఘవుల్ సమరదు♦ర్జయులు వారు
రామలక్ష్మణులు దు♦రాసదం బగు ఋశ్య,మూకంబు నీదు త♦మ్మునికిఁ దోడు
తే. పడఁగ వచ్చినవా రఁట ♦ వారిలోన, రాముఁ డహితసమూహవి♦రాముఁ డతుల
విలయసమయత్రిధాముఁడు ♦ వినుతకీర్తి,ధాముఁ డుచితానుచితకళా♦సీముఁ డధిప.

ఇదంతయు నీ యూహయేకాని సత్యము గాదందువా, దురాసదంబు = నీవు పోరానిది, విరాముఁడు = చంపువాఁడు, అతుల = అసమానమైన, విలయసమయ= ప్రళయకాలమందలి, త్రిధాముఁడు = సూర్యుఁడు, ఉచిత+అనుచిత కళాసీముఁడు= ఉచితము, అనుచితము అనునది యాలోచించు విద్యయందు మేర యగువాఁడు.

తా త్ప ర్య ము.

ప్రాణేశ్వరా! యిది నా యూహామాత్రముకాదు. వాస్తవముగ జరిగిన విషయమే. ఇంతకుముందే నే నీ వృత్తాంతము విన్నదానను. మనయంగదుఁడే నాతోఁ జెప్పెను. అతఁ డరణ్యమునకుఁబోయి మరలివచ్చునపుడు మన వేగులవారు చెప్పిరఁట. అయోధ్యాధీశుకుమారు లిరువురు రఘువంశమునఁ బుట్టినవారు, యుద్ధమున జయింపరాని వారు, రామలక్ష్మణులను వారు నీవు పోరాని ఋశ్యమూకంబునకు నీ తమ్మునికి సహాయపడ వచ్చినారఁట, వారిలో రాముఁ డనువాఁడు శత్రువులపాలి కాలాంతకుఁడు. ప్రళయకాలాగ్నివంటి వాఁడు, పొగడఁబడుచుండు కీర్తిగలవాఁడు. ఉచితానుచిత విద్యలయందు సమర్థుఁడు.

ఉ. సాధుల వాసవృక్షము, ప్ర♦శస్తమహాగతి యార్తకోటికిన్,
బాధితపాళి కాశ్రయము ♦ బంధురకీర్తికి నేకపాత్ర, మా
రాధితశాస్త్రలౌకికవ♦రప్రతిపచ్ఛుభశీలి, వల్లభా
భూధర మెల్లధాతులకుఁ♦బోలె గుణంబుల కెల్ల నిక్క యా. ౨౦

సాధులవాసవృక్షము = సాధువు లగువారికి వాసయోగ్యమగు వృక్షము. తన నీడ యపేక్షించిన యనుకూలురకు నివాసార్హమైన వృక్షము. ఇల్లో పందిలో చెప్పరాదా, వృక్షమేల యని చెప్పవలయు ననిన నిల్లన్నచో దాని కొకఁడు నాది యను నాథుఁ డుండును. అతఁడు తన కిష్టమైనవారిని లోపల రానిచ్చును. ఇతరుల రానీయఁడు. అడవిలోని వృక్షములో, బాటవెంటనుండు వృక్షములో, నాది యనువాఁడు లేమిని సర్వజనసేవ్య మగును. అట్టులే శ్రీరామచంద్రమూర్తి సర్వజన సేవ్యుఁడు. వీ రాశ్రయింపవచ్చును. వీరాశ్రయింపరాదను నియమములేదు. చెట్టుక్రిందికి నొక తెగవారే పోవచ్చును. మఱియొక తెగవారు పోరా దను నిర్బంధము లేదుగదా.

అట్లైనచో సుగ్రీవునికి రక్షకుఁడైనవాఁడు నాకు మాత్ర మేలకాఁడు. నన్నేల శిక్షించునందువా? సాధువులకు వాసవృక్షము. చెట్టు తానై నీకు నీడ నిచ్చెద

రమ్మని యనదు. తనయందు ననుకూలభావముండి తన నీడ గోరినవారికి మాత్రమే నీడనిచ్చును. సుగ్రీవుఁ డాశ్రయించినాఁడు. కావున నతనికిఁ బ్రాపగును. నీవు ఆశ్రయింపలేవు. కావున నీకుఁ బ్రాపు కాఁజాలఁడు. అంతమాత్రమే కాదు. ఆయనను ఆశ్రయించిన సుగ్రీవునకు నీవు విరోధివి. ని న్నెట్లు రక్షించును? సాధు వగుటచే రాము నాతఁ డాశ్రయించెను. సాధువులతో విరోధించువాఁడు సాధువు కాఁజాలఁడు. అసాధువే. కావున నీకు రక్షకుఁడు కాఁజాలఁడు. సుగ్రీవుఁ డెట్లు సాధువు? అతఁ డేదియుఁ బాపముచేయ లేదా? యుండు వేమో, చేసియుండునుగాక. ఎప్పుడు శ్రీరామచంద్రమూర్తి నాశ్రయించెనో యప్పుడే సాధు వయ్యెను. సమాశ్రయణబుద్ధి సాధువులకుఁ గాని తక్కిన వారికిఁ గలుగదు.

అపిచే త్సుదురాచారో, భజతే మా మనన్యభాక్
సాధు రేవ స మంతవ్యః, సమ్యగ్వ్యవసితో హి సః
క్షిప్రం భవతి ధర్మాత్మా, శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి
కౌంతేయ ప్రతిజానీహి, న మే భక్తః ప్రణశ్యతి॥

భ. గీ. ౯-30-3౧

మిక్కిలి దురాచారము కలవాఁడైనను ఇతరాశ్రయము మాని నన్నే యెవఁడు సేవించునో వాఁడు సాధు వనియే గౌరవింపఁ దగినవాఁడు. వాఁడు చక్కని నిశ్చయము గలవాఁడు. అట్టివాఁడు శీఘ్రముగ నే నా సేవాధర్మమందు మనస్సుగలవాఁ డగుచున్నాఁడు. శాశ్వతశాంతి (మోక్షము) నొందుచున్నాఁడు. అర్జునా! నాభక్తుఁ డెన్నఁటికిఁ జెడఁడని నీవు ప్రతిజ్ఞచేసి చెప్పవచ్చును.

మాం హి పార్థ వ్యపాశ్రిత్య, యేఽపి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేపి యాంతి పరాంగతిమ్॥

భ. గీ. ౯-3౨

అర్జునా! నన్నుఁ జక్కఁగా సమాశ్రయణము చేసినవారు పాపపు జాతుల యందుఁ బుట్టిన వారైనను, స్త్రీలైనను, వైశ్యులైనను, శూద్రులైనను వారుకూడఁ బరమపదమునకుఁ బోదురు.

సుగ్రీవుఁ డీ ప్రకారము రామచంద్రమూర్తి నాశ్రయించినవాఁ డగుటచే సాధువే. వానికి నీవు విరోధివి కావున నసాధువే. నీవును బోయి యాశ్రయింపుము, రక్షించును. ఆశ్రయింపకున్న నిన్నెట్లు రక్షింపఁగలఁడు? కొన్నిచెట్లు తత్కాలమున నీడయిచ్చును. ఒకకాలమున నీడ యియ్యకుండును. ఈ వృక్ష మట్టిదికాదు. ఆశ్రితులకు స్థిరముగ వసింప యోగ్యమైనది. కావున వాసవృక్షము గ్రీష్మలయందుఁ గాఁపురము చేయు పక్షులకు సర్వదా నీడ యుండునుగదా.

వాసుదేవ తరుచ్ఛాయా, నాతి శీతా న ఘర్మదా
నరకాంగార శమనీ, సా కిమర్థం న సేవ్యతే॥

వాసుదేవ వృక్షమునీడ వేడిమిచేయునదికాదు. శీతము చేయునదికాదు. నరక మనెడి యంగారమును జల్లార్చునది. ఏల దానిని సేవింపరు అని యర్థము. దీని నిచ్చట ననుసంధించునది. వృక్షము త న్నాశ్రయించినవారికి వెంటనే తాపము పోవ నీడ యిచ్చును. ఆవలఁ బుష్పఫలాదులచే వారి సర్వేంద్రియాదులకుఁ దృప్తి కలిగించును. అట్లే యీ భగవంతుఁడు నని సర్వ విషయముల నెఱుంగునది.

మీఁదఁ జెప్పినది సామాన్యసాధువుల విషయము. ఇఁక నార్తులై యాశ్రయించినవారి విషయమందో వారికి ప్రశస్తమహాగతి = శ్రేష్ఠమైన గొప్ప శరణు, అట్టివారి కింతకంటె గొప్పశరణు లేదు. 'యోగక్షేమం వహామ్యహ' మ్మన్నట్లు లాశ్రయించినది మొద లుపాయదశ ప్రారంభించి సాంతమగువఱకుఁ దానే సర్వ కార్యములను నెఱవేర్చుచుండును అని భావము.

ఇతరులచే బాధపడువారికి "బాధితపాళికాశ్రయము" ఆశ్రయము = ఆశ్రయింపఁదగినవాఁడు, 'సర్వభూతేభ్యో మోక్షయిష్యామి' సర్వభూతములవలన రక్షించెద నని 'సర్వపాపేభ్యో మోక్షయిష్యామి' యని చెప్పెనుగదా.

ఇట్టి యాశ్రయము నేను మాత్రము సంపాదింపలేనా యందువేమో ? బంధుర కీర్తికి నేకపాత్రము = ఆశ్రితరక్షణ దక్షుఁడని విశేషకీర్తి గలవాఁ డీయన యొక్కఁడే - ఇంతటి కీర్తి సంపాదించిన వారెవరు లేరు.

చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతి నోర్జున
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ॥ భ॥ గీ॥

అనుచోటఁ జెప్పఁబడిన నలువురిందుఁ జెప్పఁబడిరి. సాధువులు - జిజ్ఞాసువులు వీరు కైవల్యకాములు.

ఆర్తులు-అర్థార్థులు=భ్రష్టైశ్వర్యకాములు - బాధితులు=అపూర్వైశ్వర్యకాములు-బంధురకీర్తికి = జ్ఞానికి- 'జ్ఞానీత్వాత్మైన మేమతమ్' ఇట్టియశోవంతునకు-ఇట్టివాఁడు 'స మహాత్మా సుదుర్లభః' అన్నట్లు దుర్లభుఁడు-కావున నేకవచనప్రయోగము- అటుగాక సాధువులనఁగా నుపాసకులు- బాధితు లనఁగా దృప్తప్రపన్నులు- ఆర్తులు = ఆర్తప్రపన్నులు-'ఆర్తోవా యదివా దృప్తః పరేషాం శరణాగతః'యని ముందు చెప్పఁబడును-ఏకపాత్ర మనుటచే నిట్టివారిని రక్షించువాఁడువే ఱొకఁడులేఁడు. ఇఁకనాశ్రిత ఫలప్రదానమున కుపయోగించు జ్ఞానసంపత్తిని జెప్పుచున్నది.

ఆరాధిత శాస్త్రలౌకిక వరప్రతిపత్ శుభశీలి = చక్కఁగాఁ బొందఁబడిన శాస్త్రము కలదియు, లౌకిక = లోకసంబంధమైనదియు, ప్రతిపత్ = జ్ఞానమే- శుభశీలి = మేలైన స్వభావముగలవాఁడు, అతీంద్రియవిషయములను దెలుపు శాస్త్రజ్ఞానము ప్రత్యక్షగోచరమగు లోకవిషయమును గుఱించిన జ్ఞానము గలవాఁ డగుటయే గాక యీ ప్రకార మాచరించువాఁడు శాస్త్రజ్ఞానము లౌకిక జ్ఞానము రెండు గలవాఁ డనుటచే జ్ఞానస్వరూపుఁడు జ్ఞానగుణకుఁ డని చెప్పఁబడెను. భూధరము = ఇచట

హిమవత్పర్వతమునే గ్రహింపవలయును. ధాతువులకు = బంగారు వెండిలోనగు వానికి- దీనివలన హిమవంతమునం దనేకములగు విలువగల ధాతువు లెల్ల నున్నట్లు శ్రీరామచంద్రునందుఁ గల్యాణగుణము లన్నియు నున్నవి. శ్రీరామచంద్రమూర్తి యనేక కల్యాణగుణైకస్థానమని యర్థము. పర్వతము నుపమానముగఁ జెప్పుటచే నపరికంప్యుఁడని భావము·గుణములకెల్ల౯ అను బహువచన ప్రయోగముచే 'పరాఽస్యశక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ,' యన్నట్లు జ్ఞానశక్తి బలైశ్వర్య వీర్య తేజస్సులు లోనగు ననేక గుణములున్నట్లు సూచితము. ఇక్క= స్థానము. అనుటచే గుణికి గుణములకు భేదము సూచితము.

తాత్పర్యము.

సాధువులకు నివాసవృక్షము, ఆర్తులకు మహాగతి, బాధితుల కాశ్రయము విస్తారకీర్తికి నేకపాత్రము, జ్ఞానవిజ్ఞాన సంపన్నుఁడు- ఎల్లధాతువులకు హిమవత్పర్వతము స్థానమైనట్లు సర్వకల్యాణగుణములకు రామచంద్రమూర్తి స్థానము.

కం. జనకుని సూనృతవాదిగ, నొనరింపఁగ వచ్చె నట్టి ♦ యుగ్రబలునితో
నని దుర్జయుతోడ మహాత్మునితోడ విరోధపడుట ♦ మోసము గాదే. ౩౮౭

'స్వరక్షణేఽప్యశక్తస్య, కో హేతుః పరరక్షణే'యన్నట్లు రామచంద్రుఁడా! నాకుఁ దెలియును లే- తనకు న్యాయ్యముగా రావలసిన రాజ్యమును దక్కించుకొనఁ జేతఁగాని వాఁడు సుగ్రీవునికినా రాజ్యము సంపాదించియియ్యఁగలఁడా?పోనీ యతఁడుబుద్ధిమంతుఁడై నచో బలవంతుఁడను సర్వసహాయ సంపత్తిగలవాఁడను నగు నాతో సంధి చేసికొనవలయునా ? తనవలెనే దిక్కులేని వానితోఁ జేసికొనవలయునా ? యందు వేమో ? రాజ్యమును దక్కించుకొను శక్తి లేక రాలేదు·తండ్రిని సత్యవాదిని జేయ నరణ్యములకు వచ్చెను. ఇతరుల సత్యముఁ గాపాడఁ దాను శ్రమించుట గొప్పగుణముకాదా? అట్టి భయంకరమైన బలవంతునితో జయింపరాని వానితో మహాత్మునితో విరోధించుట వలనఁ గీడు కలుగును గదా.

కం. నీ నేర మెత్తిపొడువఁగ, నే నాడెడుదానఁ గాను ♦ నీవును గినుకం
బూనకు నా మాటల విను,మీ నానుడి నడుమి చాల ♦ మే లగు నీకు౯- ౩౮౮

తాత్పర్యము.

నేను నీదోషము లెత్తి చెప్పి నిన్ను దెప్ప రాలేదు. కావున నన్ను నీవాక్షేపించెదనా యని కోపింపకుము. నామాటలు వినుము, విని యాప్రకారము నడిచిన నీకు మేలు గలుగును.

ఉ. వీరవరేణ్యా! రాము నెడ ♦ వైరము నేరము సుమ్ము, మేలు గా
దారసి నాకుఁ దోఁచిన యు ♦ పాయముఁ జెప్పెద విన్ము, మీఁద నీ
వేరహిఁ బథ్య మద్ది ఘటి ♦ యింపుము, కూరిమి యౌవరాజ్యమం
దా రవిసూను నిల్పుము, మ ♦ హాబలుతోడ విరోధ మేటికి౯. ౩౮౯

వేరము = వైరము, నేరము = దోషము.

తా త్ప ర్య ము.

నీవు వీరులందు శ్రేష్ఠుఁడవే, అయినను నీవంటి వారు లోకములో మఱియెవ్వరు లే రనుకొనుట సరిగాదు. కావున రామచంద్రమూర్తితో విరోధించుట దోషము. దానివలన మేలులేదు. దానికి నాకుఁ దోఁచిన యుపాయము చెప్పెదను వినుము. ఆవల నీకేది మే లని తోఁచునో యట్లు చేయుము. సుగ్రీవునకు యౌవరాజ్య మిమ్ము. వాఁడును మహా బలవంతుఁడే. అట్టివానితో నీకేల విరోధము?

కం. నా మనవి వినుము సీతా, భామాపతితోడఁ జెలిమి ♦ భవ్యము నీకుఁ
దీమహితుఁడు నీతమ్ముని,పై మచ్చరికించు టుడుగు ♦ బలవైరిసుతా. ౩౬౦

నా మనవి వినుము. రామచంద్రమూర్తితో స్నేహము చేయుట నీకు శుభకరము. అదెట్లు కుదురునంటివా? నీతమ్మునిమీఁద మచ్చరము వదలుము- నీ వా పని చేసిన రామచంద్రమూర్తి నిన్ను ద్వేషింపఁడు-

మచ్చరికించు అనుటకు "మదగజరాజకుంభముల మచ్చరికించు సరోజకుంభముల్" అని నైషధప్రయోగము నై - ౮- ౩- దీనికి రూపాంతరము మచ్చరించు.

ఉ. ఒక్కఁడె నీకుఁ దమ్ముఁడు, గుణోత్తరుఁ డాతఁడు, వాని తుల్యు నిం
దొక్కనిఁ జూపుమీ, సవిన♦యుండును నీయెడ, నీదు వంకవాఁ
డొక్కఁడ కాదె, బంధు వట ♦ నుండిన నియ్యెడ నున్నఁ, జూడుమా
కక్కసపుందనంబు కొఱ♦గాదు సుమీ, మఱి బుజ్జగింపుమీ. ౩౬౧

తా త్ప ర్య ము.

ప్రాణేశ్వరా! నీకుఁ దమ్ముఁడు వాఁడొక్కఁడే- వాఁడు తప్ప నిన్ను నన్నా యని పిలుచు వా రెవరున్నారు? వాఁడైనను దుష్టుఁడుగాఁడు- ఉత్తమగుణములు గలవాఁడు- ఈ యున్న యందఱు వానరులలో వానికి సమానుఁడగు వానిని నొక్కని జూపుము? వాఁడు నీయెడ వినయవిధేయతలు గలవాఁడే కాని నిన్ను ధిక్కరించు వాఁడుకాఁడు. నీబంధువులలో నందఱు నాఁడువారి వంకవారేగాని నీతండ్రి వంక వారిని మఱొక్కని జూపుము. వాఁ డక్కడ నుండినను నిక్కడనుండినను బంధువనఁ దగిన వాఁడొక్కఁడే ఆలోచింపుము. ఈ కఠినత్వము వలనఁ బ్రయోజనము లేదు. కావున వాని నాదరింపుము.

ఉ. తమ్ముఁడు గాఁడె నీకతఁడు ♦ దాయయె? నీవును నాతఁ డొక్కగ
ర్భమ్మునఁ గాదె పుట్టితిరి ♦ బంధువ యాతఁడు నీకు నంచు నా
నమ్మక మట్టు లెట్టఁ ద్వద♦నంతర మాతని దానమానకా
ర్యమ్ముల గౌరవించి భవ♦దంతికమందున నిల్పుకొమ్మగిన్. ౩౬౨

తాత్పర్యము.

వాఁడు నీకుఁ దమ్ముఁడు కాఁడా? నీకేమి శత్రువా? వాఁడు నీవు నొక్కగర్భమునఁగదా పుట్టితిరి. వాఁడు నీకు బంధు వని నా నమ్మకము. కావున నీ వెనుక నతని దానముచేతను గౌరవము చేతను గారవించి దగ్గఱ నుంచుకొమ్ము.

ఉ. నీ హితురాల నే ననుచు ♦ నెమ్మది నమ్మెద వేని నాపయిన్
స్నేహముకల్మి నా ప్రియము♦చేఁతయు నీకు నభీష్ట మేని యీ
ద్రోహము మాను, తమ్మునెడఁ ♦ దోరపు నెయ్యముఁ జూపుమీ, వృథా౽
హోహము గాదు, నీకు నిది ♦ యొక్కటె మార్గము లే దిఁ కేదియున్. ౨౯౩

తాత్పర్యము.

నేను నిజముగా నీకు మేలుగోరు దాన నని నీవు నిండుమనస్సున నమ్మెద వేని నా యందుఁ గల స్నేహముచే నాకుఁ బ్రియమైన కార్యము చేయుట నీ కిష్టమేని తమ్ముని విషయమున నీ ద్రోహము మానుము. వానితో స్నేహము చేసికొనుము. ఇది వ్యర్థమైన పోరపాటూహగాదు. ఇది తప్ప నీకు వేఱుమార్గము లేదు.

మత్తకోకిలము. ఆలకింపుము ప్రాణవల్లభ ♦ యాగ్రహంబును మానుమీ
కేలి నొద్దుచు విన్నవించెదఁ ♦ గీర్తి యుక్తముఁ బథ్యమున్
మేలు గాదు విరోధ మూన న♦మేయవిక్రముతోడ దం
భోళిసాధన తేజుతో రఘు♦ముఖ్యుతోడ శమింపుమీ. ౨౯౪

తాత్పర్యము.

ప్రాణేశ్వరా! నామాట వినుము. కోపము వదలుము. చేతులు జోడించి విన్నవించెదను. ఇది నీకుఁ గీర్తికరముగాదు. మేలునుగాదు, పరిమాణములేని విక్రమమును, ఇంద్రుని తేజస్సుగల రామచంద్రమూర్తితో విరోధము వలదు. శమింపుము.

కం.విధువదన తార హిత మీ,విధమున నెంతయు వచింప ♦ వీనుల నిడఁ డా
బుధపతితనయుం డౌరా, విధి మూఁడిన మర్త్యుఁ డేల♦విను విహితోక్తుల్. ౨౯౫

విధువదన = చంద్రునివంటి ముఖము గలది. బుధపతి తనయుండు = ఇంద్రుని కుమారుఁడు, విధి = కాలము, మృత్యువు, ఈ పద్యమునందలి నాలవపాదము భారతము నందలిది.

తాత్పర్యము.

చంద్రునివంటి ముఖముగల తార యీవిధముగ నెంత హితము చెప్పినను వాలి చెవులఁ బెట్టినవాఁడుకాఁడు. కాలము దాపరించినవాఁడు హితవాక్యములు వినునా?

—♦ { ౧౬-వ సర్గము. వాలి తారకు సమాధానముఁ జెప్పి యుద్ధమునకుఁ బోవుట. } ♦—

కం.తార ప్రియదార మేధో,దార నఖరవిజిత తార ♦ తతసీతకళా
ధార యిటు లాడఁ బదరి శ,తారధరాత్మజుఁడు కినుక ♦ నంగన కనియెన్. ౨౯౬

ప్రియదార=ప్రియభార్య - మేధా+ఉదార = బుద్ధిబలమునందు గొప్పది, నఖర = గోళ్ళచే - విజిత = జయింపఁబడిన - తార = నక్షత్రములు గలది. తత= విస్తారమైన, నీతికళాధార = నీతివిద్య కాధారమైనది, పదరి=ఆక్షేపించి, శతారధర= వజ్రమును ధరించిన యింద్రుని, ఆత్మజుఁడు = కొడుకు.

తా త్ప ర్య ము.

తనకుఁ బ్రియయగు భార్యయు విశేషబుద్ధిబలము గలదియు నక్షత్రములవంటి గోళ్లుగలదియు నీతివిద్యయందుఁ బండితురాలయినదియు నగు తార యిట్లు చెప్పఁగా వాలి కోపించి ఛీ యిది నీకు సరిగాదని యిట్లనెను.

శా. ఏమే చంద్రముఖీ యిటాడఁ దగ వౌనే? తమ్ముఁడా వాఁడు? ని
స్సీమోద్గర్వవిజృంభమాణుఁ డగుచున్ సింహార్భటుల్ చేసి ప్రో
ద్దామస్ఫూర్తిని నన్ను యుద్ధమునకుం దాఁ బిల్వ విద్వేషి యై
యే మంచున్ క్షమియింతు? శూరులకు నింతీ! తీపౌ ప్రాణముల్? ౩౬౭

నిస్సీమ = మితిలేని, ఉద్గర్వ = అధికగర్వముచే, విజృంభమాణుఁడు = చెల రేఁగుచున్నవాఁడు, సింహార్భటుల్ = సింహనాదములు, ప్రోద్దామస్ఫూర్తిని = అధిక పరాక్రమముచే, విద్వేషి = విరోధి.

తా త్ప ర్య ము.

ఏమే! చంద్రముఖీ! యిట్లు మాటలాడ నీకు న్యాయమా? వాఁడు నాకుఁ దమ్ముఁడా! తమ్ముఁడైనచో మితిమించిన గర్వముచేఁ జెలరేఁగి సింహనాదములుచేసి పరాక్రమ విశేషముచే విరోధించి నన్ను యుద్ధమునకుఁ బిలుచునా? ఇట్టి వానిని నన్నే మని క్షమింపుమనెదవు? శూరులకుఁ బ్రాణములు తీపని తలఁచితివా!

కం. తరుణీ యపరాజితులకు, దురమున వెనుకంజ యిడని దుర్ధర్షులకున్
బరిపంథిజన మొనర్చెడు, పరిభవము సహించుకంటెఁ భవ్యము మృతియా. ౩౬౮

అపరాజితులకు = పరాజయము లేనివారికి, దురమునన్ = యుద్ధమందు, దుర్ధర్షులకున్ = తిరస్కరింప సాధ్యపడని వారికి, పరిపంథిజనము = విరోధు లగువారు, పరిభవము = అవమానము, భవ్యము = శ్రేయస్కరము.

తా త్ప ర్య ము.

తరుణీ! పరాజయ మెఱుఁగని వారికి, యుద్ధమందు వెనుకడుగు పెట్టని తిరస్కరింపఁ బడని వారికి విరోధులు చేయు నవమానముకంటెఁ జచ్చుటే మేలు.

కం. తా నటె శూరుం డటె యిటు, మానక గర్జింప ననికి మహితారభటిన్
నే నటె హీనుఁడ నటె య,వ్వానిని సైరింప నేను వచ్చెనె ప్రాతల్. ౩౬౯

తా త్ప ర్య ము.

ఈ విధముగ మీఁద మీఁద యుద్ధమునకై సింహనాదములు చేసిన వాఁ

డఁట, శూరుఁడఁట, నేనట, బలహీనుఁడనఁట; అట్టిబింకెల విని సైరించు నంతటి తలవ్రాఁత నాకేమి వచ్చెను?

కం. రాముఁడు నాకపకారము, భామిని ఘటియించు ననుచు ♦ భయపడకుము ధ
ర్మామితరతుఁడు కృతజ్ఞుం, డే మని నిష్కారణముగ ♦ హింసించు ననున్. ౪౦౦

తా త్ప ర్య ము.

ఇఁక రామచంద్రమూర్తి నన్నుఁ జంపునని కదా భయపడెదవు. నీవు భయపడవలసిన కారణములేదు. ఆయన నాకపకారము చేయఁడు. ఏలన, ధర్మమునందు విశేషప్రీతి గలవాఁడు. మేలెఱిఁగినవాఁడు. ఇట్టి వాఁడు నిష్కారణముగ నన్నేల చంపును?

చం. మరలుఁడు మానినీచయము ♦ మానవతీమణి నీవు, నా పయిన్
దిర మగుభక్తిసంపదను ♦ దెల్పితి వింతయు నే నెఱుంగుదున్
దురమున కేగి నీ మఱఁది ♦ దోర్బలగర్వ మణంచి వచ్చెదం
దరుణిరో ప్రాణముల్ గొనను ♦ నమ్ముము నొంచెదఁ గాష్ఠముష్టులన్. ౪౦౧

కాష్ఠముష్టులన్ = కట్టలచేఁ గొట్టుటచేత, పిడికిలి గ్రుద్దులచేత.

తా త్ప ర్య ము.

నీ వీ స్త్రీలతో నంతఃపురమునకుఁ బొమ్ము. నామీఁద నీకుఁగల భక్త్యతిశయముచే నీవింతదూరము చెప్పితి వని నే నెఱుంగుదును. యుద్ధమునకుఁ బోయి కట్టలచే ముష్టులచేఁ గొట్టి నీమఱఁది భుజబలగర్వ మణఁచి వచ్చెదను గాని వానిని జంపను. నా మాట నమ్ముము.

ఉ. క్షీణపరాక్రముం డతఁడు ♦ నేసెదు గర్జ సహింప నేర, నా
ప్రాణముమీఁద నొట్టిడుదు ♦ భామిని పొమ్ము జయంబుఁ గోరి నా
జాణ ప్రదక్షిణించియు భృ♦శవ్యథఁ గౌఁగిటఁ గ్రుచ్చి ప్రోదినీ
పాణిజు మంత్రవంతముగ ♦ స్వస్త్యయనంబు ఘటించి స్త్రీలతోన్. ౪౦౨

క్షీణపరాక్రముఁడు = నశించిన పరాక్రమముగలవాఁడు, జాణ = నేర్పరి, తార, భృశవ్యథన్ = అధికవేదనచే, ప్రోదినీపాణిజు = వజ్రాయుధము చేతఁగల యింద్రునికుమారుని, మంత్రవంతముగ = మంత్రములతోఁ గూడినట్లుగ, ఇది పౌరాణికమంత్రమని యెఱుంగునది, స్వస్త్యయనంబు = స్వస్తి + అయనంబు = మంగళాశాసనము.

తా త్ప ర్య ము.

వానికి బలములేదు. గొంతులేదు. అట్టివాఁడు చేయు సింహనాదమును సైరింతునా? నాప్రాణముమీఁద నొట్టు పెట్టుచున్నాను. నా జయము గోరి మరలి పొమ్ము. అనఁగాఁ దారయు ప్రదక్షిణించి మిగుల వ్యథచేఁ గౌఁగిలించి మంత్రవంతముగ మంగళాశాసనములు పలికి స్త్రీలతో.

తే. అంతిపురమున కరిగె నా♦యంబుజాక్షి, యీరెలుంగున నేడ్చుచుఁ♦దార యిట్లు
మరలి గృహమున కేగఁగ ♦ వారివిభుఁడు, నిస్తులాగ్రహమునఁ బురి ♦ నిర్గమించి.

తా త్ప ర్య ము.

అంతఃపురమునకు సన్నగొంతుతో నేడ్చుచుఁ దారపోయెను. ఇట్లు తార మరలి యింటికిఁ బోఁగా వాలి యసమానకోపముతో నూరు వెడలి.

—♦ వాలి సుగ్రీవుల ద్వితీయయుద్ధము. ♦—

సీ. నిబిడరోషంబున ♦ నిట్టూర్పు విడుచుచు, శత్రుదర్శనకాంక్ష ♦ సకలదిశలు
కలయంగఁ బరికించి ♦ కనియె దీప్తానిల,ధాము నవష్టబ్ధు ♦ హేమపింగ
ళుని సూర్యపుత్త్రునిఁ ♦ గని సముత్సాహి యై, చేల చక్కఁ బిగించి♦చాలఁ గినుక
ముష్టి పై కెత్తి సం♦ముఖముగఁ జనఁ దన, కెదు రేగుదెంచెడి♦హేమమాలి
ఆ. వాలి నంశుమాలి♦వరతనూజుఁడు గాంచి, యెదురనడిచె నదరు ♦ బెదరు లేక
తనకు నభిముఖముగఁ♦ జనుదెంచు తమ్మునిఁ, గాంచి యీసు పెంచి♦కడఁకఁ బలికె.

నిబిడరోషంబునన్ = దట్టమైన రోషముచే, దీప్తానిలధామున్= మండుచున్న యగ్ని ప్రకాశమువంటి ప్రకాశముగల వానిని, అవష్టబ్ధున్ = యుద్ధార్థమై కదలక నిలుచున్న వానిని, హేమపింగళుని = బంగారువలెఁ బచ్చనైన కాంతి గలవానిని, హేమమాలి = దీనివలన నీసారి బంగారుమాల ధరించి వచ్చెనని యేర్పడుచున్నది. చేల=వస్త్రము, ఈ పద మిప్పటి వానరులవలె దిగంబరులు కారనియు వస్త్రధారులనియుఁ జెప్పుచున్నది. ఈసు = కోపము.

తా త్ప ర్య ము.

అధికరోషముచే నిట్టూర్పు విడుచుచు విరోధిని జూడఁగోరి నాలుగుప్రక్కలు చూచి యొకచోట మండుచున్న మంటవలెఁ గాంతిగలవానిని యుద్ధార్థమై నేలఁ దన్ని నిలఁబడియున్న వానిని బంగారుచాయగల పచ్చని మేనివానిని సుగ్రీవునిఁ జూచి యుత్సాహము గలవాఁడై కట్టువస్త్రము చక్కఁగ బిగించి మిగులఁ గోపించి ముష్టి పైకెత్తి యెదురుగఁ బోవఁగాఁ దన కెదురుగ వచ్చునట్టివానిని బంగారు మాలిక ధరించిన వానిని వాలిని సూర్యపుత్త్రుఁడు చూచి యదరుబెదరు లేక యెదురుగఁ బోయెను. ఇట్లు తన కెదురుగ వచ్చు తమ్మునిఁ జూచి కోపించి యిట్లనియె.

మ. ఇదిగో సన్నిహితాంగుళీకలిత మా ♦ నిముష్టినిం జూడరా
భిదురంబో యన నీ పయిం బడుచు ని♦ర్భేదించు నిన్నిప్పుడే
చెదరం బాఱకు మన్న నాకుఁ డిదె ము♦ష్టిం జూడుమీ నీ తలం
జదియం గొట్టెద నొక్కపోటునని య♦క్షీణప్రతాపోన్నతిన్. ౪౦౫

సన్నిహిత = దగ్గఱకుఁ జేర్పఁబడిన- అంగుళీకలిత = వ్రేళ్లతోఁగూడిన- భిదురంబో = వజ్రమో- చదియన్ = చిదికిపోవునట్లు- అక్షీణప్రతాపోన్నతిన్ = క్షీణింపని ప్రతాపాతిశయముచే,

తాత్పర్యము.

వ్రేళ్లు కదియఁ జేర్చిపట్టిన యీ ముష్టినిఁ జూడుము. వజ్రమో యనునట్లు నీపయిం బడుచు నిన్ను భేదించును పరువెత్తి పోకుము. అని వాలి చెప్పఁగా సుగ్రీవుఁడు నాముష్టి నిదె చూడుము. ప్రతాపాతిశయముచే నీతల నొక్క పోటునఁ జింతకాయను జిదుగఁగొట్టినట్లు కొట్టెదను.

చం. అనవుడుఁ గ్రుద్ధుఁడై కదిసి ♦ యట్టె ప్రగాఢపుముష్టిఁ గొట్టినన్
దనువునఁ గొండవంకవలెఁ ♦ దద్దయు నెత్తురు గాఱ సూర్యజుం
డును నొకసాలముం గొని క♦డు న్వడి దిర్దిరఁ ద్రిప్పి మోఁదె నా
ఘనబలశాలి వాలి తను♦కంపము పెంపున విహ్వాలింపఁగన్. ౪౦౬

తనుకంపము = దేహము వణఁకు, విహ్వాలింపఁగన్ = విలవిలలాడఁగా.

తాత్పర్యము.

అని చెప్పఁగా వాలి కోపించి దగ్గఱకుఁబోయి గట్టి పిడికిలిచేఁ గొట్టెను. ఆ దెబ్బచే దేహమునఁ గొండవంకవలె నెత్తురు గాఱఁగా సుగ్రీవుఁ డొక చెట్టు పీఁకి గిర గిర ద్రిప్పి వాలిని మొత్తెను. దానికి మిగుల బలశాలి యయ్యు వాలి గడ గడ వడఁకి విహ్వాలించెను.

కం. గురుభారసమాక్రాంతము, తరణి మహావాతనిహతిఁ ♦ దరలెడిమాడ్కిన్
హరిసుతగురుసాలహతిన్, హరిహయనందనుఁడు వణఁకె ♦ నతివికలుం డై. ౪౦౭

గురు భారసమాక్రాంతము = విశేషముగ బరువుతోఁ గూడినది. తరణి = ఓడ, మహానిహతిన్ = పెద్దవాయువు దెబ్బచేత, తరలెడి మాడ్కిన్ = చలించు విధముగ, హరిసుత = సుగ్రీవునియొక్క, గురు = గొప్పదియగు, సాల = చెట్టు యొక్క, హతిన్ = దెబ్బచేత, హరిహయనందనుఁడు = ఇంద్రునికొడుకు, వాలి, అతి వికలుండై = మిక్కిలి కలఁత చెందినవాఁడై.

తాత్పర్యము.

మిగుల బరువుచే నిండిన యోడ పెద్ద తుపాను గాలికి నూఁగినట్లు సుగ్రీవుని చెట్టు దెబ్బచేత వాలి కలవరపాటు చెందినవాఁడై వణఁకెను.

చం. అనిలసుపర్ణవేగులు మ♦హాబలశాలులు వాలిసూర్యజుల్
ఘనతరవర్ధమానదృఢ♦కాయు లజయ్యు లమిత్రమర్దనుల్
గొనకొని బీఱువోక వెఱ♦గూడక యోటమి లేక యంబరం
బున రవిచంద్రబింబముల♦పోల్పున నొప్పిరి యుద్ధధారిణిన్. ౪౦౮

అనిల సుపర్ణవేగులు=గాలివంటి, గరుడునివంటి వేగము గలవారు, వర్ధమాన= వృద్ధిచెందుచున్న - అజయ్యులు = జయింపరానివారు, అమిత్రమర్దనుల్ =శత్రువులను గొట్టువారు- బీఱువోక = బలహీనత చెందక- వెఱ = భయము- ఓటమి=ఓడిపోవుట

తాత్పర్యము.

వాయువేగము గరుడవేగమువంటి వేగము గలవారును మహాబలవంతులును మిగుల వృద్ధిచెందు దృఢమైన దేహముగలవారును జయింపరానివారును శత్రుసంహారకులు నగు వాలి సుగ్రీవులు బలహీనులుగాక భయపడక వెనుదీయక యాకాశమున సూర్యచంద్రులవలె భూమిపై యుద్ధరంగమున నొప్పిరి.

క. గురుబలవీర్యయుతుం డగు, హరిహాయసుతుశౌర్య మంత ♦ కంతకు హెచ్చెన్
హరితనయుశౌర్యసారము, దరతరమ పటుత్వ మెడలి ♦ తఱుఁగం జొచ్చెన్. ౪౦
తరతరమ = క్రమక్రమముగ.

తాత్పర్యము.

గొప్ప బలము వీర్యము గల వాలి శౌర్యము క్రమక్రమముగ హెచ్చెను. సుగ్రీవుని శౌర్యము క్రమక్రమముగఁ దగ్గెను.

తే. పాకశాసనసుతుచేత ♦ భగ్నదర్పుఁ, డయ్యుఁ బరిధుతవిక్రముఁ ♦ డయ్యు రోష
మునను జెలరేఁగి లాఘవం ♦ బునను భాస్కరాత్మజుఁడు పోరుచుండె స ♦ నంతశక్తి.

పాకశాసన సుతుచేతన్ = ఇంద్రుని కుమారుఁ డగు వాలిచేత - భగ్నదర్పుఁడు = చెదరిన బలము గలవాఁడు, పరిధుత విక్రముఁడు = ఎగురఁ గొట్టఁబడిన విక్రమము గలవాఁడు. లాఘవంబునన్ = అలసత లేక, మందుఁడు గాక.

తాత్పర్యము.

వాలిచేత దర్పము విక్రమము చెడినను రోషవశమున విజృంభించి మిగుల శక్తితో సుగ్రీవుఁడు యుద్ధము చేయుచుండెను.

క. సామర్షణవేగిత ముష్టాముష్టిఁ గరాకరిన్ స ♦ సార తరువులన్
హేమాహేమీ లొప్పిరి, కామముగఁ బదాపదిన్ న ♦ ఖానఖిఁ దిరులై. ౪౧

సామర్షణవేగితన్ = కోపముతోఁగూడిన వేగముతో, ముష్టాముష్టిన్ = ఒకరు ముష్టితో గ్రుద్దిన మఱియొకరు ముష్టితో గుద్దుట - కరాకరి = చేతులు చేతులు కలసి నట్లుగ, పదాపదిన్ = ఒకరు కాలితోఁ గొట్టిన నొకరు కాలితోఁ గొట్టుట, నఖానఖిన్ = ఒకరు గోళ్ళతో గీఱిన మఱియొకరు గోళ్ళతో గీఱుట, హేమాహేమీలు "ఓహో! భేదము లేదు నిండుసభలో నొక్కంత మాత్రంబు హేమాహేమీలు ఘటాఘటీ లతిరథుల్ మాంధాళు లీ సాము లేలా హీనాధిక భావముల్" వరాహ. ౧౦-౮.

ముష్టా ముష్టిః = ముష్టిభిః + ముష్టిభిః ప్రహృత్యేదం యుద్ధం ప్రవృత్తమ్మని విగ్రహము - కర్మవ్యతీహార లక్షణ బహువ్రీహిసమాసము, 'తత్ర తే నేద మితి సరూపే' ౨-౨-౨౭ 'అన్యేషామపి దృశ్యతే' ౬-3-౧౩౭ ఈ పాణిని సూత్రములచే ముష్టీముష్టి యని పూర్వపదాంతమునకు దీర్ఘమేకాని అత్వము రాదు. ఇది యపాణినీయమైనను నీ శబ్దము విషయమై మా యాచార్యుల వారితో సంప్రతించియున్నాను.

వారు నాకు శాకల్యవ్యాకరణము చూపియున్నారు. అందు ముష్టాముష్టి యను రూపము ప్రత్యేకసూత్రముచే గ్రహింపఁబడినది. అంతియగాక భారతంబున నన్నయ్య భట్టారకుఁడు-

కం. భీమాసురవీరుల ము, ష్టాముష్టిరణోత్థితచ్ఛటాశబ్దం బు
ద్దామంబై సర్విపిన ము, హామృగపక్షులకు నతిభయావహ మయ్యెన్.
ఆరణ్య- 3-3౯౫

ప్రయోగించెను. ఈ రామాయణమున నుభయరూపములు ప్రయోగింపఁ బడినవి.

తాత్పర్యము.

కోపముతోఁగూడిన వేగముచే నొకరి నొకరు ముష్టులతోను చేతులతోను చెట్ల తోను కాళ్లతోను గోళ్ళతోను ధీరులై యా యధికులు తమ యిష్టము వచ్చినట్లు యుద్ధము చేసిరి.

ఉ. ఒండొరులన్ వెసం గదిసి ♦ యుగ్రతఁ దాఁతురు వృక్షకోటిచే
నొండొరులం బడం దిగిచి ♦ యుర్విని నొంతురు గాఢముష్టిచే
నొండొరులన్ ముఖాముఖి స♦ముద్ధతిఁ దాఁకుదు రిద్ధవీర్యులై
భండన మిట్లు వారలకు ♦ వర్తిలె వాసవవృత్రయుద్ధమై. ౪౧౨

తాఁతురు = తాఁచుదురు- కొట్టుదురు- ముఖాముఖి = ముఖమునకు ముఖమునకు నెదురై- భండనము = యుద్ధము.

తాత్పర్యము.

ఒకరి నొకరు సమీపించి చెట్లచేఁ గొట్టుదురు. ఒకరి నొకరు నేలఁబడ నీడిచి పిడికిలిగ్రుద్దులచే నొప్పింతురు. ఒకరి కొక రెదురుకట్టై వీర్యముచేఁ దాఁకుదురు. వారి కిరువురకు నీ ప్రకారము వాసవ వృత్రయుద్ధమువలె యుద్ధము జరిగెను.

క. బల మఱి క్రమక్రమంబుగ, బలరిపుసుతుచేత ఘాత♦పడి సుగ్రీవుం
డలసి పరికించు మఱిమఱి, నలుదిక్కులు నేలఁ జూచు♦నలిగులి యగుచున్. ౪౧౩

అఱి = క్షీణించి- నలిగులి = మిక్కిలి నలిగినవాఁడు.

తాత్పర్యము.

సుగ్రీవుఁడు క్రమక్రమముగ బలము క్షయించినవాఁడై వాలిచే దెబ్బ దిని యలసి నాలుగుదిక్కులు చూచుచు నలఁగినవాఁడై.

—♦ శ్రీరాముఁడు వాలిని నేలఁ గూల్చుట. ♦—

ఉ. భూరితరార్తిఁ జిక్కు రవి♦పుత్త్రుని దుస్స్థితిఁ జూచి యుగ్రతే
జోరమణీయమూర్తి యరి♦సూదనదక్షుఁడు రామచంద్రుఁడున్
ఘోరశరంబు వాలివధ♦కుం దగుదానిని దీసి మార్విటం
కారము మీఱ వింటను స♦ఖండజవంబునఁ గూర్చె దక్షుఁడై. ౪౧౪

అఖండజవంబునన్ = మిగుల వేగమున. మౌర్వి = అల్లెత్రాడు.

తాత్పర్యము.

మిక్కిలి బాధపడుచున్న తనమిత్రుఁడు సప్రమాణముగఁ దా నభయహస్త మిచ్చినవాఁడు తన్నే నమ్మినవాఁడు, శరణాగతుఁడు, తా నభయహస్త మిచ్చినవాఁడు, సుగ్రీవుఁడు తన కన్నుల యెదుటనే శత్రువుచేఁబడెడు ప్రాణాంతకబాధ సమక్షమునఁ జూచి భయంకరమైన తేజముచే నందమైన యాకారముగల రామచంద్రమూర్తి శత్రుసంహరణ దక్షుఁడగు వాలిని జంపఁగల భయంకరమైన బాణమును దీసి యల్లెత్రాటికి మిగుల వేగముగఁ గూర్చెను.

తన యాశ్రితుఁ డింత బాధపడి ప్రాణాపాయదశకు వచ్చిన పిమ్మట బాణము వేయఁబూనకున్న ముందుగానే వేసియుండిన నిన్నిదెబ్బలు తన మిత్రునకుఁ దప్పియుండునుగదా. శ్రీరామచంద్రమూర్తి సుగ్రీవునకు దెబ్బలు కొట్టింపవలయునని కోరినవాఁడుకాఁడు. సుగ్రీవుఁడు తన్నుఁదాను రక్షించుకొనఁ గలిగియుండెనేని రామచంద్రమూర్తి జోక్యము గలిగించుకొనరాదు. అతని కది యవమానకరము. అది యనుగాక స్వప్రయత్నమునందు భారమువైచి యుండు వఱకు భగవత్సాహాయ్యము రాదు. స్వప్రయత్న మిఁక వ్యర్థమనితోఁచి మనస్సున భగవంతుఁడే రక్షకుఁడని తోఁచెనా యప్పుడు తోడుపడును- ద్రౌపదీ కరిరాజాదులు సాక్షులు. ఇఁక నేను యుద్ధము చేసి జయింపలేనని యెప్పుడు తోఁచి తనవంక సుగ్రీవుఁడు రక్షణార్థమై చూచెనో యప్పుడు రామచంద్రమూర్తి రక్షింపఁబూనెను.

అఖండ జవ మనునది యాశ్రిత రక్షణ మందలి త్వరను సూచితము.

క. ఆ జ్యాతలఘోషణమున, ద్యోజ్యాస్థలిఁ దిరుగు వనఖ♦గోత్కరమృగముల్
ప్రాజ్యభయాధీనములై, త్యాజ్యముగ నిజాయనాళి ♦ యవనిం గూలెన్. ౩౧౫

జ్యాతల ఘోషణమునన్ = వింటినారి చప్పుడుచే- ద్యో+జ్యా+స్థలిన్ = ఆకాశమునందు భూమియందు- వన ఖగోత్కరమృగముల్ = అడవియందలి పక్షిసమూహములు- మృగములు. ఆకాశమందుఁ దిరుగు పక్షులు, భూమిమీఁదఁ దిరుగు మృగము లని యర్థము- ప్రాజ్య = విశేషమైన- భయాధీనములై = భయమునకు వశపడినవై- త్యాజ్యముగన్ = వదలినవి కాఁగా- నిజాయనాళి = తమ స్థానములు.

తాత్పర్యము.

ఆ యల్లెత్రాటి టంకారమునకు నాకాశమునఁ దిరుగు పక్షులు- నేలఁ దిరుగు మృగములు మిగుల భయపడి తమ స్థానములందు నిలువలేక నేలఁబడెను.

క. దంభోళిభయదరవసం,రంభంబునఁ బిడుగు నా ని♦రస్తశరం బా
జంభారితనూభవభుజ,జృంభణ మడఁగంగ వక్షః♦సీమన్ నాటెన్. ౩౧౬

దంభోళి = వజ్రము (పిడుగు) యొక్క- భయద = భీతి కలిగించు, రవసంరంభమునన్= ధ్వనివేగముచేత- నిరస్తశరంబు = అల్లెత్రాటినుండి చిమ్మఁబడిన బాణము,

జంభారితనూభవ = ఇంద్రపుత్రుఁ డగు వాలియొక్క- భుజజృంభణము = భుజబలము-యొక్క యభివృద్ధి- వత్ససీమన్ = ఱొమ్మున.

తాత్పర్యము.

వజ్రాయుధముయొక్క భయంకరమైన వేగాతిశయముచేఁ బిడుగువలె రామచంద్రమూర్తి వింట నుండి వెలువడిన బాణము వాలిఱొమ్మున నాటెను.

వాలిఱొమ్మున నాటె ననుటచే వెనుకనుండి గాని ప్రక్కలం దుండి గాని వేయ లేదనియు నెదురు ముఖముగా నుండియే బాణము వేసె ననియు నంతవఱకుఁ జాటుగ నుండినను బాణము వేయునపుడు బయలనే యుండెననియు నెఱుఁగనగు. రామచంద్ర మూర్తికి వాలికి నడుమ వృక్షములు లేకుండిననే బాణము సూటిగఁ బోయి తాఁకును గాని చెల్లడ ముండినఁబోఁ జాలదుగదా.

క. ఆ శర మిటు నిజవక్షో, దేశంబున నాట రాక ♦ తిథి నిషమందున్
నాశితశక్రధ్వజ మనఁ,గా శతమఖసుతుఁడు గూలె ♦ గతసత్త్వుండై. ౪౧౭

వక్షోదేశమునన్ = ఱొమ్మున, రాక తిథి = నిండు పున్నమనాఁటియందు, ఇషమందున్ = ఆశ్వయుజమాసమున, నాశిత శక్రధ్వజమనన్ = పడవేయఁబడిన యింద్ర ధ్వజమువలె. శతమఖ సుతుఁడు=ఇంద్రుని కొడుకు వాలి, గతసత్త్వుండై = బలము పోయినవాఁడై.

తాత్పర్యము.

ఆ బాణము తన ఱొమ్మున నాటఁగా నాశ్వయుజ మాసమందుఁ బున్నమ నాఁడు పడవేయఁబడు నింద్ర ధ్వజమువలె బలము చెడినవాఁడై వాలి నేలఁబడెను.

రాక తిథి : ఇది సిద్ధసాంస్కృతిక సమాసముగాదు. సాధ్యసమాసము కావున హ్రస్వము.

ఇంద్రోత్సవము- ఉపరిచరవసువు "అశ్వయుజి యష్టికి మహావిభవంబు మెఱయ నేఁటేట నింద్రోత్సవం బను నుత్సవంబు సేయుచు నీశ్వరునకు నింద్రాదిదేవతలకు నతి ప్రీతి చేసె నది మొదలుగా రాజులెల్లఁ బ్రతిసంవత్సరంబు నింద్రోత్సవంబు చేయుచుం దురు."

క. ఘనముగ నయ్యింద్రోత్సవ, మొనరించు మహీపతులకు నొగి నాయుర్వ
ర్ధనము నగుఁ బెరుఁగు సంతతి, యనవరతము ధరణి ప్రజకు నభివృద్ధియగున్.

భార- ఆది- 3, ౨౩ - ౨౪.

ఈ యుత్సవమునే కృష్ణమూర్తి బృందావనమునఁ బడుపాటు గావించెను.

౧౭-వ సర్గము.

ఉ. ఘోరకుఠారధార ధరఁ ♦ గూలినవృక్షమునట్లు వాలి త
త్క్రూరశరాహతిన్ వసుధఁ ♦ గూలుటయున్ వడిఁ జేఁపకట్టుగా,

ధారిణి తేజఁ బాసెఁ గుము♦దప్రియహీన నభంబుమాడ్కి; నా
వీరుఁడు నేల వ్రాలియును ♦ వీడఁడు తేజము విక్రమాసువుల్. ౪౧౮

ఘోర = భయంకరమైన- కుఠారధారన్ = గొడ్డలివాదరచేత- చాఁప కట్టుగన్ = చాఁపచుట్టినట్లుగ- నేలతో సమముగా- కుముదప్రియహీన = చంద్రుఁడు లేని- నభంబు = ఆకాశము- విక్రమాసువుల్ = పరాక్రమము- ప్రాణము.

తాత్పర్యము.

భయంకరమైన గొడ్డలి మొనచే నఱికినఁ బడు చెట్టువలె నా క్రూర బాణము దెబ్బకు నేలతో సమముగాఁ జాఁప పఱచినట్లు పడఁగాఁ జంద్రుఁడులేని యాకాశము వలె భూమి తేజముఁ బాసెను. ఆ వీరుఁడు నేలఁబడియును తేజముఁగాని పరాక్రమము గాని ప్రాణములుగాని వదలినవాఁడుగాఁడు.

కం. వాసవదత్తం బగు త,ద్భాసురమణిఖచితకనక♦దామవరము తే
జోఽసుపరాక్రమలక్ష్ములు, వాసవి నెమ్మేన నిలిపి ♦ భాసిలఁ జేసెన్. ౪౧౯

వాసవదత్తంబు = ఇంద్రునిచే నీయఁబడినది. భాసుర = ప్రకాశించు, మణిఖచిత = రత్నములు చెక్కఁబడిన, కనకదామవరము = శ్రేష్ఠమైన బంగారు దండ- తేజోఽసుపరాక్రమలక్ష్ములు = తేజస్సు, ప్రాణములు- పరాక్రమలక్ష్మి- వాసవి = వాలియొక్క, నెమ్మేనన్ = దేహమునందు, భాసిలన్ = ప్రకాశించునట్లు.

తాత్పర్యము.

ఇంద్రుఁ డిచ్చిన మణులుచెక్కిన బంగారు సరము వాలి తేజస్సు, ప్రాణములు, పరాక్రమము- కాంతిని బోకుండఁ గాపాడెను.

తే. మేలికాంచనమాలిక ♦ మేన వెలుఁగ, వాలి విక్రమశాలి యా♦వేళ వెలిఁగె
సంజకెంజాయ రంజిలు♦జలధరంబు,తోడ నీడన నొప్పి యే♦జాడఁ జూడ. ౪౨౦

తాత్పర్యము.

శ్రేష్ఠమైన బంగారుమాలిక దేహమున వెలుఁగుచుండఁగాఁ బరాక్రమవంతుఁ డగు వాలి సాయంకాలమునందలి యెఱ్ఱని కాంతులతోఁ బ్రకాశించు మేఘమువలెఁ దోఁచెను.

కం. భర్మాంచిత మాలికతో, మర్మోద్ఘాటంబు సేయు ♦ మహిత శరముతో
నిర్మలమగు దేహముతో, స్వర్మహిపసుతుండు మూఁడు♦వన్నెల నొప్పెన్. ౪౨౧

భర్మాంచిత మాలికతో = బంగారుతోఁ జేయఁబడి ప్రకాశించు దండతో, మర్మోద్ఘాటంబు = ప్రాణములఁ బెకలించు, స్వర్మహిప సుతుండు=ఇంద్రుని కొడుకు, వాలి.

తాత్పర్యము.

బంగారు సరముతోను ప్రాణములు లేవఁదీయుచున్న గొప్ప బాణముతోను నిర్మలమగు దేహముతోను వాలి మూఁడురంగులఁ బ్రకాశించెను.

తే. వీరునకు వాలి కహిత సం♦హారునకును, స్వర్గమార్గ ప్రభావన ♦ శాలియైన
రామకార్ముకముక్త నా♦రాచవరము, పరమగతికారణం బయ్యెఁ ♦ బ్రధనమునను.

అహిత సంహారునకును = శత్రువుల సంహరించువానికి, స్వర్గమార్గ ప్రభావనశాలి = దేవలోక మార్గము గలిగించునది. రామ కార్ముక ముక్త = రాముని వింటిచే విడువఁబడిన, నారాచవరము = శ్రేష్ఠమైన బాణము, ప్రధనమునను = యుద్ధమందు - పరమగతి కారణంబు = ఉత్తమగతి పొందుటకు హేతువు - వాలి ముక్తుఁడయ్యెనని సారాంశము.

దీనివలన వాలి చేసిన దోషమునకుఁ బ్రాయశ్చిత్తముగా శాస్త్రప్రకారము దండించినను దయచే ముక్తునిఁ జేసి యనుగ్రహించె నని యేర్పడుచున్నది.

తా త్ప ర్య ము.

శత్రువుల సంహరించు శక్తిగల వాలికి స్వర్గమునకుఁ బంపఁగా శక్తిగల రామ బాణ ముత్తమగతిని (ముక్తిని) గలిగించెను.

సీ. విగతార్చి యైనట్టి♦వీతిహోత్రుఁడువోలెఁ, గల్పాంతపతితభా♦స్కరుఁడువోలె
సుకృతంబు సమసిన ♦ సురలోకముననుండి, యవనిపైఁ బడిన య♦యాతివోలె
నా మహేంద్రునిమాడ్కి ♦ నతిదురాధర్షుని, శక్రునిఁబోలె న♦సహ్యబలుని
హరివిపులోరస్కు ♦ హరివిశాలాక్షుని, దీప్తవదను మహా♦దీర్ఘబాహుఁ

ఆ. దన్నుఁ గూల్చినట్టి♦దర్పితు మెచ్చుచు, నతనిఁ జూడఁ గోరి ♦ యల్ల నల్ల
దెసలు చూచు వాలి ♦ దృఢపరాక్రమకీలి, దాసె రామవిభుఁడు ♦ తమ్ముతోడ.

విగతార్చి = జ్వాలలులేని, వీతిహోత్రుఁడు = అగ్ని, కల్పాంత = ప్రలయాంతమందు, పతిత = పడిన, భాస్కరుఁడు = సూర్యుఁడు, దురాధర్షునిఁ = ధిక్కరింపరానివానిని, హరి విపులోరస్కునిఁ = సింహము ఱొమ్మువలె విశాలమైనఱొమ్ము గలవానిని, హరి = పచ్చని, విశాలాక్షుని = వెడలుపు కన్నులు గలవానిని, కీలి = అగ్నిహోత్రుఁడు.

తా త్ప ర్య ము.

జ్వాల లుడిగిన యగ్నివలెఁ - ప్రలయకాలమున నేలఁబడిన సూర్యునివలెఁ- బుణ్యము క్షయము కాఁగా భూమిమీఁదఁబడిన యయాతివలె-నింద్రునివలె నలక్ష్యము సేయరాని వానిని- సింహము ఱొమ్మువంటి ఱొమ్ము గలవానిని- మండుచున్న మొగము గలవానిని- మిగుల దీర్ఘములైన బాహువులు గలవానిని- దన్ను నేలఁ బడఁగొట్టిన బలశాలిని మెచ్చుకొనుచు వాఁడెట్టివాఁడో చూడఁగోరి మెల్ల మెల్లగా దిక్కులు చూచుచు నుండు పరాక్రమమున నగ్నివంటి వాలిని రామచంద్రమూర్తి లక్ష్మణుతోడ సమీపించెను.

## వాలి శ్రీరాముని దూషించుట.

కం. ఇటు తను డాసిన రామునిఁ, బటుతర విక్రము సుమిత్రా•పట్టిం గని ప్ర
స్ఫుటధర్మయుతము మృదువును, గటువును నగు రీతిఁ గీశ•కాంతుఁడు పలికెన్.

దాసిన = సమీపించిన.

### తాత్పర్యము.

ఇట్లు తనయొద్దకు వచ్చిన రామచంద్రుని మిగులఁ బరాక్రమవంతుఁడైన లక్ష్మణుని జూచి వాలి ధర్మముతోఁ గూడినదియు, వినయముతోఁ గూడినదియు, గఠినము నగు మాటల నిట్లనెను.

శా. రామా నీవు నరేంద్రపుత్త్రుఁడవు, శా•స్త్రజ్ఞాన సంవేదివిన్,
స్థేమ శ్రీనిధివిం, గులీనుఁడవు, స•త్తేజుండవుం, గీర్తికిన్
ధామీభూతుఁడ, విట్టివాఁడ వయి యు•ద్ధక్షోణి లో నేను మా
ర్గోమై యుండ నురంబుఁదాఁప గుణ మే•మో దాని భాషింపుమా. ౨౧

నరేంద్ర పుత్త్రుఁడవు = రాజకుమారుఁడవు - సామాన్య క్షత్త్రియుఁడుకూడ నీవు చేసినట్టి పని చేయఁ డని భావము - అందు - శాస్త్రజ్ఞాన సంవేదివిన్ = ఉత్త జాతిమాత్ర క్షత్రియుఁడవు గావు, ఉత్తమ జ్ఞానము గలిగి సర్వము తెలిసినవాఁడవు- ఇక్కడ సముచ్చయము విశేషార్థ ద్యోతకము. ఉత్తశుష్కజ్ఞానము కలవాఁడవు మాత్రము కావు. స్థేమ శ్రీనిధివిన్ = స్థిరమైన కాంతికి నిధివి - కులీనుఁడవు= ఉత్తమ సూర్యవంశమునఁ బుట్టిన వాఁడవు - సత్తేజుఁడవున్ = వంశమువలన వచ్చినదే కాక మంచి స్థిరమైన తేజస్సుగలవాఁడవు. కీర్తికి- ధామీభూతుఁడవు=స్థానమైనవాఁడవు- మార్గోమై= మనస్సు దృష్టి మఱియొకసమీపఁ నుంచినవాఁడనై - ఉరంబుఁదాఁపన్= ఱొమ్మునుఁద గొట్టఁగా.

### తాత్పర్యము.

రామా! నీవు రాజు కుమారుఁడవు- శాస్త్రజ్ఞానము చక్కఁగాఁ గలవాఁడవు- స్థిరమైన శోభ గలవాఁడవు- గొప్పవంశమునఁ బుట్టినవాఁడవు- మంచి తేజస్సు గలవాఁడవు- కీర్తికి నెలవు-ఇట్టివాఁడవై యుండియు యుద్ధభూమిలోఁ బ్రక్కఁ దిరిగి నామనస్సు దృష్టి వానిపై నుంచి యుండఁగా నా ఱొమ్మునుఁద గొట్టుటయం దేమి గొప్ప కలదో చెప్పుము.

క. రాముఁడు కరుణజ్ఞానో,ద్దాముఁడు జనహితరతుండు • తతకారుణ్యశ్రీ
ధాముడు సమయజ్ఞుఁడు నని, నీమహితయశంబు భూత•నికరము పొగడున్. ౨౬

కరుణజ్ఞానోద్దాముఁడు = కారుణ్యజ్ఞానముచే గొప్పవాఁడు- విచారపూర్వకముగా నాశ్రితుల ఁక్ష్యులని తెలిసికొనువాఁడు- జనహితరతుఁడు = జనులకు మేలు చేయుటయందుఁ బ్రీతిగలవాఁడు- తతకారుణ్య శ్రీధాముఁడు = విస్తారమైన దయా

లక్ష్మికి స్థానమైనవాఁడు- సమయజ్ఞుఁడు = ఏ సమయమున నే పనిచేయవచ్చును ఎప్పుడేది చేయరాదను నుచితానుచితజ్ఞానము గలవాఁడు- నికరము = సమూహము.

తాత్పర్యము

రామచంద్రా! రాముఁడు కరుణాజ్ఞానముగలవాఁడు, జనుల మేలుకోరువాఁడు, దయాలక్ష్మికి స్థానమైనవాఁడు- ఉచితానుచిత జ్ఞానము గలవాఁడని లోకులు నిన్నుఁ బొగడుచున్నారు.

చం. దమము శమంబు నోరిమియు ♦ ధర్మము ధైర్యము సత్యముం బరా
 క్రమమును వెండి దండ మప♦రాధులయందున యివ్వి రాఘవా
 సముచితసద్గుణంబులు ర♦సాపతులం దని నేను నమ్మి జ
 న్యమునకుఁ దార వద్దనుచు ♦ నాడఁగ వచ్చితి నిందుఁ జచ్చితిన్. ౮౨

దమము = బహిరింద్రియ నిగ్రహము- శమము = అంతరింద్రియనిగ్రహము ఓరిమి = ఓర్పు- అపరాధులయందున=అపరాధులయందే- రసాపతులు=భూపతులు, రాజులు- జన్యము = యుద్ధము.

తాత్పర్యము.

తార నన్ను యుద్ధమునకుఁ బోవలదు- సుగ్రీవునకు సహాయుఁడై రాముఁడు వచ్చియున్నాఁడు- ఆయన నిన్నుఁ జంపును- అని చెప్పినను - వినక బాహ్యేంద్రియ నిగ్రహము- అంతరింద్రియనిగ్రహము- ఓర్పు, ధర్మము- ధైర్యము సత్యము పరాక్రమము-అపరాధులను మాత్రమే దండించుట యివి రాజుల కుచితమైన సద్గుణంబులు, ఇవి నీయందు మాత్రము లేకుండునా, నన్నేల నిరపరాధిని రాముఁడు చంపునని వచ్చితిని- నీచేఁ జచ్చితిని.

ఇప్పుడు నేను జెప్పిన రాజగుణములలో నొకటియైన నీయందు లేదు. నీవేమిటి రాజవు- సుగ్రీవుఁడు చెప్పినాఁడని తొందరపడి కోపించి గుణదోషములు విచారింప వలయు నను నోరుపు లేక యితరులతోఁ బోరాడు వానిని నే నెట్లు చంపుదునా యను ధర్మచింత లేక యెదురఁబోయి యుద్ధముచేయు ధైర్యములేక సత్యాసత్యము లెఱుఁగక పిఱికివానివలె దూరమున మాటుగ నుండి నీ కే యపకారము చేయని నన్ను దండించితివిగదా! నీవు మోసగాఁడవు అని తార తెలిసికొనెను గాని నేను దెలిసికొన లేకపోయితిని.

సామదానోపాయముల రామచంద్రమూర్తి యవలంబింపలేదని వాలి దూషించెను. విరోధిరాజులతోఁ దనకంటె బలవంతులతో సామదానోపాయములు గాని వధ్యుఁ డగుదోషిని దండించునపుడు వానితో సామదానోపాయము లేమున్నవి? అది యునుగాక వాలి సంధికి యోగ్యుఁడు కాఁడు.

అసంత్యాగాత్పాపకృతానుపాపాః తుల్యోదండః స్పృశతే మిశ్రభావాత్
శుష్కేణార్ద్రం దహ్యతే మిశ్రభావాత్ తస్మాత్పాపైః సహ సంధిం నకుర్యాత్.
భార- ౫, ౩౪-౭౦.

పాపముచేసినవారితో సహవాసముచేసినవాఁడును వానివలె దండింపఁబడదగిన వాఁడే యగును. ఎండు కట్టెలతోఁ గూడిన పచ్చికట్టెను గూడ నగ్ని కాల్చునుగదా-కావునఁ బాపులతో సంధిచేయరాదు.

ఉ. రాముఁడు సత్కులుండు గుణ♦రమ్యుఁడు నే నొరుతోడఁ బోరుచో
నేమని వచ్చు నాపయికి ♦ నే మని నన్వధియించు నంచు నే
నీమెయి నెంచి నీమొగ మ♦దెట్టిదొ నేఁ గనియుండమిం జుమీ
యీ మెయిఁబోర డాసితిని ♦ నియ్యెడఁ బ్రాణము ధారవోసితిన్. ౪౨౮

తాత్పర్యము.

రాముఁడు గొప్పవంశమునఁ బుట్టినవాఁడు గావున గొప్పగుణములు కలవాఁడై యుండును. కల్యాణ గుణములచే మనోహరుండు కావున హేయ కార్యమేల చేయును? నే నితరునితో యుద్ధము చేయుచుండఁగా నా మీఁదికి నేమని వచ్చును? నన్నేల వధియించును, ఇట్టి యకార్యము గూడఁజేయునా? యని నీ ముఖమెన్నఁడుఁ జూచియుండని కారణమున మోసపోయి యీ విధముగ యుద్ధమునకు వచ్చితిని, ప్రాణములు పోఁగొట్టుకొంటిని.

ఉ. పచ్చిక కప్పి యున్న పెను♦బావిని బోలెడువాని, బూదిలోఁ
జిచ్చును బోలువాని, నృప ♦ శేఖరధర్మసువేషధారి నౌ
నచ్చపుఁబాపచారునిఁ, గ♦టా నిను మాయలమారి వంచు నే
నిచ్చఁ దలంప నైతి సుధీ♦హీనతచే నిటు లైతి రాఘవా. ౪౨౯

తాత్పర్యము.

పచ్చిక కప్పిన బావిని, బూది కప్పిన చిచ్చును బోలి రాజవేషము ధరించిన పాపపు నడవడిగలవానిని, మాయలమారి నిన్ను వాస్తవము దెలిసికొనలేక బుద్ధి హీనతచే నిటులైతిని.

ఉ. నీమొగ మే నెఱుంగ, విను నీ ♦ కపకారము పట్నమందు నే
సీమను నేని యెప్పుడును ♦ జేసినవాఁడను గాను, గానలోఁ
గామము దీర నెయ్యవియొ ♦ కాయలుఁ గూరలు మెక్కుచుండు శా
ఖామృగ మేను, నన్ననుమఁ ♦ గారణ మే మొరుతోడఁ బోరఁగన్. ౪౩౦

పట్నమందు = నగరమందు- పట్టనశబ్దభవము పట్నము - "సీరంగపట్నంబు బారిసమరె"- వరాహ ౧-౩౦ సీమ=పొలిమేర - శాఖామృగము = క్రోఁతిని.

తాత్పర్యము.

నేనెన్నఁడు నీముఖముఁ జూచినవాఁడనుగాను, నగరమందుఁగాని పొలిమేరల విషయమందుఁగాని నీకపకారము నేను జేయలేదు. కావున నీకుఁగలహకారణము లేదు. అడవులలోనుండి మాయిష్టప్రకారమే మేమో యావేళకు దొరకినవి కాయలుఁ గూరలు తినుచునుండు క్రోఁతులము, కావున నీ కూటికి నడ్డము వచ్చినవాఁడను గాను. ఇట్టి నన్ను నితరునితో యుద్ధము చేయు సమయంబునఁ జంపఁ గారణమేమి ?

ఉ. రాజ సదన్వయంబున ధరిత్రిఁ జనియించి యధీతవేదుఁడై
తేజున మీఱి సందియము ♦ దీఱఁగ నెల్ల నెఱింగి యెవ్వఁడీ
యోజను ధర్మవేషమును ♦ నొప్పుగఁ దాల్చి యధర్మవృత్తుఁడై
భూజనతాఽహితంబుగను ♦ బూనునొ క్రూరపుఁజర్య సల్పఁగన్. ౪౩౧

సదన్వయంబునన్ = మంచివంశమునందు - అధీతవేదుఁడై = వేదాధ్యయనము చేసినవాఁడై - ఓజను = విధము - అధర్మవృత్తుఁడై = అధర్మపు నడవడిగలవాఁడై - భూజనతా = భూమిజన సమూహమునకు - అహితంబుగను = కీడుగ.

తాత్పర్యము.

రాజుల గొప్పవంశమునఁ బుట్టి వేదముల నధ్యయనము చేసి తేజస్సున నతిశయించి నిస్సందేహమైన జ్ఞానముగలవాఁడై యెవ్వఁడీవిధముగ ధర్మాత్ములు ధరింపవలసిన వేషమును ధరించి వ్యవహారమందు లోకులకుఁ గీడగు క్రూరకార్యమును జేయఁదలపెట్టును?

తే. రాజకులమునఁ బుట్టితి ♦ రామ నీవు, ధర్మవంతుండ వను కీర్తిఁ ♦ దనరినాఁడ
విట్టి క్రూరచరిత్రుండ♦ వేటికయ్యె, పెద్దమానిసివలెఁ బెంపు♦ పెరుఁగఁదిరుగ. ౪౩౨

తాత్పర్యము.

నీవు పుట్టినదా రాజవంశము. ధర్మాత్ముఁడను కీర్తిని సంపాదించితివి. ఇట్టి క్రూరకార్యము చేయు నీవు పెద్దమనుష్యులవలె నేల వర్తించెదవు.

క. సామము దానము శౌర్యో,ద్దామత సత్యంబు క్షమయు ♦ ధర్మము ధృతియున్
రామ యపరాధిదండము, భూమీశగుణము లండ్రు ♦ బుద్ధిమదగ్ర్యుల్. ౪౩౩

అపరాధిదండము = నేరముచేసినవానిని దండించుట- బుద్ధిమత్ + అగ్ర్యుల్ = బుద్ధిమంతులందు శ్రేష్ఠులు.

తాత్పర్యము.

బుద్ధిమంతులందు శ్రేష్ఠులగువారు సామము, దానము, అవి రెండు చెడెనేని శౌర్యము, సత్యము, క్షమ, ధర్మము, ధృతి, అపరాధుల దండించుట, యివి రాజగుణము లని చెప్పిరి.

క. వనచరులము ఫలమూలము,లను దిని జీవించు మృగము♦లము మే మనఁగా
విను నీవో పురుషుండవు, మనుజవరుండవును బుద్ధి♦మాలితి వింకే. ౪౩౪

తా త్ప ర్య ము.

మే మడవులందుఁ దిరుగువారము. మీరు పురములందు దిరుగువారు. మేము పండ్లు మూలములు దిని జీవించు మృగములము. మీ రిష్ట మృష్టాన్నములు తిను వారు- నేనో మృగమను- నీవో మనుష్యుఁడవు- నేనో నీకు సేవకుఁడను- నీవో రాజ వయ్యు బుద్ధిలేనివాఁడవైతివి. చూచితివా?

కం. ఇలయో పసిఁడియొ వెండియొ, కలహింపఁగఁ గారణములు ♦ గా? నాదు వనీ
ఫలమూలంబులపై నాసలు గొంటివె? వాని కొఱకు ♦ చంపితి నన్నున్? ౪౩౫

తా త్ప ర్య ము.

భూమిగాని బంగారుగాని వెండిగాని కలహకారణములుకదా- నేను దిను కందమూలముల మీఁద నీ వాశపడి నేను దినిన నీకు లేకపోవునే యని నన్నుఁ జంపితివా ?

కం. విను నయము దుర్వినయమును, ననుగ్రహము నిగ్రహంబు ♦ ననునివి వరుసన్
గననగుఁజూ సజ్జనదుర్జనభూమీపతులయం ద♦సంకీర్ణములై. ౪౩౬

నయము = మంచిమాటలాడుట- దుర్వినయము = తిరస్కారము- అనుగ్రహము=కరుణించి మేలు చేయుట- నిగ్రహము = విరోధించి కీడుచేయుట- సజ్జన దుర్జన భూమీపతులందు = మంచి రాజులయందు చెడ్డరాజులందు- అసంకీర్ణములై = ఒకదానితో నొకటి కలియక.

తా త్ప ర్య ము.

నయము అనుగ్రహము సజ్జను లగు రాజులయందుండును. దుర్వినయము నిగ్రహము దుష్టరాజులగుణములు. వారి యందవి వీరి యందివి యొకదానితో నొకటి కలియక యుండును. నీయం దివి రెండును మిశ్రములై యున్నవి.

ఉ. రాజులు స్వేచ్ఛ వచ్చినటు ♦ రాదు చరింపఁగ, నీవొ యింద్రియో
ద్వేజకవృత్తిఁ గామ మెది ♦ వేళను ముఖ్యముగాఁగఁ గోపి వై
రాజచరిత్రసంకరము ♦ గ్రాలఁగఁ జాపపరాయణుండ వై
యాజికిఁ గాలుద్రవ్వి మరి♦యాదఁ దలంపవు ధర్మహీనతన్. ౪౩౭

స్వేచ్ఛన్ = తనయిష్టము వచ్చినట్లు- ఇంద్రియోద్వేజకవృత్తిన్ = ఇంద్రియముఁ గలఁతపెట్టెడి విధముగ- రాజచరిత్ర సంకరము = మంచిరాజుల నడవడి చెడ్డరాజుల నడవడి కలియునట్లు, చాపపరాయణుండవై = విల్లే పరమగతిగాఁగల వాఁడవై ఆజికిన్ = యుద్ధమునకు.

తా త్ప ర్య ము.

రాజు లగువారు ధర్మవశులై చరింపవలయును గాని మేము ప్రభువులము, మే మెట్లు చేసినఁ గాదనువా రెవరని యిష్టము వచ్చినట్లు వర్తింపరాదు. నీవో యింద్రియముల వలనఁ గలఁత చెందినవాఁడవై కామమే సర్వకాల సర్వావస్థలయందును

ముఖ్యముగా నెంచుచు, నది నెఱవేఱకుండినఁ గోపించుచుఁ జెడురాజులయు మంచి రాజులయు నడవడి కలిసి చరించుచున్నావు. దానివలన నీవు మంచివాఁడవో చెడ్డ వాఁడవో మాబోఁటి వా రెఱుఁగఁ జాలకున్నారు. నిన్ను శిష్టుఁ డని నమ్మటకును లేదు. దుష్టుఁడ వని పరిహరించుటకును లేదు. ఇఁకఁ గామము సాధించుటయందు విల్లే ప్రధాన సాధనముగఁ గాని కలహమునకుఁ గాలు ద్రవ్వుచు బలవంతుఁడ నను గర్వముచే ధర్మము విడిచి మర్యాద దలంపకున్నావు.

తే. అర్థ మార్జించుటందు మ♦ర్యాదలేదు, శ్రద్ధయను మాటలేదు ధ♦ర్మంబునందుఁ
 గామవృత్తుండ వగుచు ని♦గ్రహము లేని,యింద్రియము లీడ్చినట్లెల్ల ♦ నేగె దీవు.

అర్థము = ధనము, కామవృత్తుండవు = మనోనిగ్రహము లేక యిష్టము వచ్చినట్లు పనిచేయువాఁడవు.

తాత్పర్యము.

ధన మీ విధముగ సంపాదింపవచ్చును. ఈ విధముగ సంపాదింప రా దను నియమము లేదు. ధర్మమును రక్షించుటయందు విశ్వాసము లేదు. ధర్మరక్షణము వ్యర్థ మని నీ యభిప్రాయము. కోరికలవెంట మనస్సు పోనిచ్చువాఁడవై యింద్రియములకు వశుఁడవై యవి యెట్లీడ్చిన నట్లు పోవుచున్నావు.

క. అపరాధము చేయని నను, విపరీతగతిన్ వధించి ♦ వికటశరమునన్
 నృపకుల! యే మని చెప్పెదొ, యపవాదము వోవ సజ్జ♦నావళిసభలోన్. ౪౩౯

తాత్పర్యము.

నీ విషయమున నే నే దోషము చేయలేదు, ఇట్టి నిరపరాధిని నన్ను నీ బాణముచేఁ జంపితివి. ఈ నింద పోవుటకు సజ్జనుల సభలో నీ వేమి సమాధానము చెప్పఁగలవు? నీవు రాజవంశమునఁ బుట్టఁదగినవాఁడవు కావు.

ఉ. చోరుఁడు ప్రాణిహింసకుఁడు ♦ సూచకుఁడున్ గురుతల్పగుండు భూ
 మీరమణఘ్నుఁడుం బిసిని ♦ మిత్రధరామరులన్ వధించు నా
 స్తూరుఁడు నాస్తికాధముఁడు ♦ గోఘ్నుఁడు నగ్రజుకంటె మున్నుగా
 దార గ్రహించు తమ్ముఁడును ♦ దథ్యము నారకవాసు లిందఱున్. ౪౪౦

సూచకుఁడు = కొండెములు చెప్పువాఁడు- గురుతల్పగుండు = గురువు భార్యతో సంగమించినవాఁడు- భూమీరమణఘ్నుఁడున్ = రాజును జంపువాఁడు- పిసిని = లోభి- మిత్రధరామరులన్ =హితులను బ్రాహ్మణులను- నాస్తికాధముఁడు= పరము లేదు, భగవంతుఁడు లేఁ డనువాఁడు- గోఘ్నుఁడు = ఆవును జంపినవాఁడు.

తాత్పర్యము.

దొంగ - జీవహింసచేయువాఁడు - కొండెములు చెప్పువాఁడు - గురు భార్యను బొందినవాఁడు- రాజును జంపినవాఁడు- నాస్తికుఁడు- గోవధచేయువాఁడు- అన్నకంటె ముందు పెండ్లాడినవాఁడు వీ రందఱు నరకమున వసించువారు.

ఈ దోషము లయోధ్యాకాండమున వివరింపఁబడినవి. కావున మరల వ్రాయలేదు.

కం. నినుఁబోల్ సుజనులు నా తోలును గప్పరు తాఁక రెముకలును మాంసంబుల్
దినరు మఱివెండ్రుకల నేపనికిం గొన రేల నన్నుఁ బరిమార్చితివో! ౪౪౧
పరిమార్చితివో = చంపితివో.

తాత్పర్యము.

నీవంటి సత్పురుషులు జింకచర్మములవలె మాక్రోఁతి చర్మములను గప్పుకొనరు. (నా తోలని చెప్పినను నాజాతివారి తోళ్లని యర్థము గ్రహింపవలెను-) ఏనుఁగు దంతములవలె నాయెముకలను దాఁకరు. మాంసమును దినరు. చమరమృగముల వెండ్రుకలవలె నా వెండ్రుక లేపనికి నుపయోగింపరు. ఇట్టి నన్నేమిపనికై చంపితివి.

తే. ఐదు గోళ్లుగలజంతువులందు రామ! యాళువయు నేదుఁబంది తాఁబేలు నుడుము
చెవులపిల్లియు నునివియవనిసురుల, కవనిపతులకుఁ దగును భక్ష్యంబు లగుచు.

తాత్పర్యము.

భక్ష్యాః పంచనఖాస్త్వేతే
గోధా కచ్ఛప శల్యకాః
ఖడ్గశ్చ శశకశ్చైవ
తాన్ హత్వాతు చరేద్వ్రతమ్॥ శంఖస్మృతి॥

రామచంద్రా! యైదుగోళ్ళుగల జంతువులందు ఆళువము, ఏదుఁబంది, తాఁబేలు, ఉడుము, - చెవులపిల్లి యీ యైదు మృగముల మాంసము దప్ప నితర జంతువుల మాంసమును బ్రాహ్మణ క్షత్రియాదు లెవరును దినరుగదా - ఆహారము నిమిత్తమై చంపితి వనుటకు దానికిని నేను గాఁగాను కదా! ఏలచంపితివి?

కం. నా యెముకలు నా చర్మము, హేయముగఁ బరిత్యజింతు రెందు మనిషుల్
నా యెఱచిఁ గుడువ రెవ్వరు,న్యాయమె నీ కిట్టి పంచనఖముం జంపన్. ౪౪౩
ఎఱచి = మాంసము, పంచనఖము = ఐదుగోళ్ళు గలది.

తాత్పర్యము.

తెలివి గలవారు నా యెముకలను జర్మమును దాఁకరాని వని తాఁకనుగూడఁ దాఁకరు. నా మాంసము దినరు. ఇటువంటి యైదుగోళ్ళుగల జాతిలోఁ జేరిన నన్నుఁ జంపుట నీకు ధర్మమా?

తే. అకట సర్వజ్ఞ యగుతార యాడినట్టి
సత్య వాక్యంబు హితమలక్ష్యంబు చేసి
తెలివి మాలుట వచ్చి తత్ఫలము నిదిగొ
ననుభవించుచు నున్నాఁడ నర్కకులుఁడ! ౪౪౪
అర్కకులుఁడ = సూర్యవంశమునఁ బుట్టినవాఁడా.

తాత్పర్యము.

అయ్యో! కాఁగల విషయము సర్వము తెలిసిన తార నామేలు కోరి చెప్పిన సత్యవాక్యమును అలక్ష్యముచేసి బుద్ధిలేనివాఁడనై వచ్చి దానిఫలము నిదిగో నిట్లను భవించుచున్నాఁడను.

తే. నీవు నాథుఁడుగా నవ♦నీతలంబు, పొలుచుచుండు ననాథగా ♦ భూపవర్య
క్రించుఁ డగు ధూర్తుపతి దాప♦రించి నట్టి, పరమశుభశీల సంపన్న ♦ ప్రమదపోలె.

క్రించుఁడు = నీచుఁడు- ధూర్తుఁడు = వంచకుఁడు- శుభశీలసంపన్న = మంచి నడవడిగలది- ప్రమద = స్త్రీ.

తాత్పర్యము.

ఈ భూమికి నీవు భర్తవైతివా, యిది భర్తలేనిదిగానే యుండును. ఎట్లనఁ నీచుఁడు మోసగాఁ డగు భర్త దాపరించిన యుత్తమస్త్రీ భర్తలేనిదిగానే యెంచవలయును గదా.

తే. నికృతిపరుఁడవు శఠుఁడవు ♦ నీచమతివి, దంభవిజితేంద్రియుండవు ♦ దశరథుండొ
పరమశీలుండు సుమహాను♦భావుఁ డతని,కడుపు చెడ నెట్లు పుట్టితి ♦ కఠినశీల?

నికృతిపరుఁడవు = పరుల కపకారము చేయుటే ప్రధానకృత్యముగాఁ గల వాఁడవు- శఠుఁడవు = రహస్యముగాఁ గీడుచేయువాఁడవు- దంభవిజితేంద్రియుండవు= ఒకరిని మోసగింప జితేంద్రియునివలె వర్తించువాఁడవు.

తాత్పర్యము.

పరుల కపకారము చేయువాఁడవు. రహస్యముగాఁ గీడు చేయువాఁడవు. నీచమైన మనస్సుగలవాఁడవు. ఇతరుల మోసగింప జితేంద్రియునివలె నటించువాఁడవు. ఇట్టి నీవు ఉత్తమమైన సదాచార సంపత్తిగలవాఁడును గొప్పమహిమగలవాఁడును నగు దశరథు కడుపుచెడఁ గఠినస్వభావుఁడా యెట్లు పుట్టితివి?

తే. ఛిన్నచారిత్రకక్ష్యంబు ♦ శీలవినుత, ధర్మమార్గాతివర్తియుఁ ♦ దృక్తధర్మ
సృణియు నగు రామహస్తిచేఁ♦ జిక్కి నేఁడు, కాలుఁజూడంగ నలసె మ♦త్కర్మవశత.

ఛిన్న = త్రెంపఁబడిన- చారిత్ర = మంచి నడవడి యనెడు- కక్ష్యంబు = కట్టుత్రాఁడు గలది- ధర్మమార్గాతివర్తియు= ధర్మమార్గ మతిక్రమించి చరించునది, త్యక్త = విడువఁబడిన, ధర్మ = ధర్మమనెడి- సృణియు = అంకుశముగలది - రామహస్తిచే = రాముఁడను నేనుఁగుచే-

తాత్పర్యము.

ఏనుఁగు తన్నుఁగట్టిన త్రాళ్లను ద్రెంచుకొని యంకుశమును లక్ష్యముచేయక వక్రమార్గములో గుంపుల నలయఁద్రొక్కుచుఁ బోవునట్లు నీవును సచ్చరిత్ర యనెడు బంధమునకు లోపడక ధర్మమునకు వెఱువక సదాచార సంపన్నులు పొగడు ధర్మమార్గము నతిక్రమించి పోవు నీచే నా కర్మవశమునఁ జావవలసి వచ్చెను.

తే. పెద్ద లెల్ల ఛీ ఛీ యనఁ♦ బెంపు దొలఁగు,నిట్టి యశుభమ యోగ్యంపుఁ♦గృతినొనర్చి
యేమి మొగమున సుజనుల♦యెదుటఁ బడెద, వేమి యంచు వచించెద♦ విట్టిపనికి?

తా త్ప ర్య ము.

ధర్మజ్ఞాన వృద్ధు లందఱు ఛీ ఛీ యనునట్టి యిట్టి గౌరవహానికరమైన కార్యము చేసి సుజనుల యెదుటికి నేమొగము పెట్టుకొని పోఁగలవు ? పోయినను నేమని చెప్పఁగలవు ?

కం. మగతనమును నెఱపితి కద, తగవులకుం దిగని యీ యు♦దాసీనునిపైఁ
బగ గొన్న విరోధులయెడ, మగతన మది లేద యెట్టి♦మగవాఁడ వౌకో. ౪౪౯

తా త్ప ర్య ము.

ఆహా రామచంద్రా! యేమి మగవాఁడవయ్యా ! నీమగతనము నీ భార్యను హరించినవానిపైఁ జూపఁజాలవైతివి గాని నీప్రశంసకు రాక తటస్థుఁడుగ నుండు నా మీఁదఁ జూపితివికదా.

కం. నాకంటి కెదుటఁ బడి నీ,వే కలహము చేసి యుంటి♦వేనియుఁ ద్రుటిలోఁ
బోకలమారీ! నీకుం, జేకూర్పనె దుంతరాతు♦చే గౌరవమున్. ౪౫౦

దుంతరాతు = దున్నపోతు వాహనముగాఁగల యముఁడు- పోకలమారీ = ఇష్టము వచ్చిన పోకలఁ బోవువాఁడా ! పర్యాయోక్త్యలంకారము- చెప్పవలసిన విషయము సూటిగాఁ జెప్పక పరికారాంతముచేఁ జెప్పిన పర్యాయోక్త్యలంకారము.

తా త్ప ర్య ము.

రామా! నా కంటి కెదుట నిలఁబడి నీవు నాతో యుద్ధముచేసి యుండినయెడల నిన్ను నేను నిమిషములో యమలోకమునకుఁ బంపి యుండనా ?

కం. కనుచా టగు నీచే మృతిఁ, గనవలసె నేను శౌర్య♦కలితుఁడ నయ్యుఁ
దనివారఁ దారివి నిద్రిం,చిన దారిగుడుపోతు పాము♦చేఁ జచ్చినటుల్. ౪౫౧

తా త్ప ర్య ము.

తప్పఁదారివి నిద్రించినవాఁడు పాముచేఁ గఱవఁబడి చచ్చినట్లు నేనెంతో శౌర్యముగలవాఁడనే, ఐననేమి, కనుమఱుఁగున నున్న నీచే నేను జావవలసివచ్చెను.

ఉ. నీ కథ నా కొకింతయును ♦ నీ వెఱిఁగింపవు గాక మున్ను, నీ
వేకతనన్ దినేశసుతు♦నిష్టము సల్పఁగ న న్వధించితో
యీ కపటాత్ము రావణుని ♦ నాజిని గొట్టి గళంబు కట్టి పె
న్వీకున నిందుఁ దేనె? పృథి♦వీసుతఁ దోడ్కొని రానె పూఁటలోన్? ౪౫౨

ఏకతనన్ = ఏకారణముచే- దినేశసుతున్ = సుగ్రీవునియొక్క, పూఁటలో = ఒక పూఁటలో.

తా త్ప ర్య ము .

రామా! నీకథ నాకుఁ గొంచెమైనఁ జెప్పినవాఁడవు కావు - చెప్పియుండినచో నీ వే కారణమున సుగ్రీవునికోరికఁ దీర్ప నన్నుఁ జంపితివో యీ కపటచిత్తుఁడైన రావ

ణుని యుద్ధములోఁ గొట్టి మెడ పట్టుకొని యిక్కడికి నీడ్చుకొని వచ్చియుండనా ! సీత నొకపూఁటలోఁ దీసికొని రాలేనా? గోటఁ బోవు పనికి గొడ్డలి వెదకితివి.

ఈ విషయము తారవలన వాలికిఁ దెలిసె నని యూహింపనగు.

పృథివీసుతఁ దోడ్కొని రానె పూఁటలోన్ = అనుట ఆలోచన లేని, గర్వోక్తులు - రావణాసురుఁ డొంటిగాఁ జిక్కినప్పుడు వానిఁ బట్టుకొనఁ గలిగెను గాని లంకకుఁబోయి రావణు సాధింపఁగల ననుట గర్వోక్తి మాత్రమే. చేతులు చేతులు కలిసి చేయు యుద్ధమందు నిందుఁడిచ్చిన మాలికా ప్రభావంబున నెవ్వరినైన గెలువ గలఁడు. ఏలన నది యెదుటివారి దేహము దాఁకినపుడు వారిలో నుండు శక్తిని లాగఁ గలదు గాని ఆకాశమునుండి యుద్ధము చేయు నిందజిత్తును అస్త్ర యుద్ధముచేయు నతికాయాదులను వాలి యేమి చేయఁగలఁడు? కుంభకర్ణు నేమి చేయఁగలఁడు? ఇందఱుఁగలిసి యేకకాలమున యుద్ధమునకు వచ్చినపుడు వాలి పోరాడఁగలఁడా? రావణుని బట్టుకొని వచ్చుచున్న వాలిని జూచి వారు సహించి యూరక చూచుచుందురా? అంతియకాక సీతను దెచ్చుట యంతటి సుకరకార్య మని వాలి తలఁచెను గాని వేవురు వాలులైనను సీతాదేవిని నామె యిష్టము లేక యొక యంగుళమైనఁ గదలించి యుండఁజాలరు.

క. పాతాళంబున దాఁచిన, శ్వేతనయన్ సాగరమున ♦ మఱుఁగుపఱిచినన్
శ్వేతాశ్వతరిం బూర్వము, శ్రీతురగగ్రీవు నట్లు ♦ చెచ్చెరఁ దేనే. ౪౫౩

తాత్పర్యము.

పూర్వము శ్వేతాశ్వతరి యను నుపనిషద్భాగమును మధుకైటభు లపహరించి సముద్రములోనికిఁ దీసికొనిపోఁగా హయగ్రీవమూర్తి వారిని జంపి దానిని మరలఁ దెచ్చినట్లు నేను సీతను దెచ్చియుండనా?

దీనివలన శ్వేతాశ్వతరోపనిషత్తు అర్వాచీనమని చెప్పువారి వాదము నిరస్తము.

ఉ. ఏ విబుధాలయంబుఁ జన ♦ నెంతయు నర్హుఁడు రాజ్యమేల సు
గ్రీవుఁడు దాయ గాన నను ♦ మృత్యువుఁ గూర్చుట యొప్పుఁగాక నీ
వీ వికటంపుఁబద్ధతిని ♦ హింసితుఁ జేసితి విట్టి సేత యో
ధ్మావర! యుక్తకార్యమనఁ♦గాఁ దగ దుగ్ర మధర్మ మాటచేన్. ౪౫౪

ఏన్ = నేను- భారతమందు 'ఏన్' అనురూపమే కాని నేను అను రూపము లేదు- విబుధాలయంబు = స్వర్గము- దాయ = జ్ఞాతి- తండ్రిసొత్తు పంచుకొన యోగ్యుఁడు- దాయాదుఁడు- 'విభక్తవ్యం పితృద్రవ్యం దాయ మాహు ర్మనీషిణః' నిఘంటువు.

తాత్పర్యము.

నేను మరణించినపిమ్మటఁ దండ్రి రాజ్యమున భాగమున కర్హుఁడు గావున సుగ్రీవుఁడు నన్నురాజ్యము నిమిత్తము చంపుట న్యాయ్యమే- కాని యే సంబంధము

లేని నీవు వక్రమార్గ మనుసరించి నన్నుఁ జంపితివి. ఇది తమస్సుతోఁ జేరినది. అధర్మ మైనది, కావున న్యాయ్యమైన దని చెప్పరాదు

క. పుట్టినవారికి నెప్పుడొ, గిట్టుట సహజంబ దానికిఁ వగవను నీ
కట్టడిచేఁతకు నుత్తర, మెట్టు వచించెదవొ చూడుమీ యుక్తి యెదేన్. ౪౫౫

తాత్పర్యము.

రామచంద్రా! భూమిమీఁదఁ బుట్టినవారేనాఁడో యొకనాఁడు చావవలసిన వారే. కావున మరణము వచ్చెనే యని నేను విచారపడలేను. కాని నీ వీ శూరుల మర్యాద దప్పించి చేసిన కార్యమునకుఁ బ్రత్యుత్తర మేమి చెప్పఁగలవు? ఏదైన యుక్తియుండిన వెదకుము.

క. అని నోరెండఁగ శరహతిఁ, దను వెల్లను నెరియ బాధ తాళఁగ లేమిన్
గనుఁగొనుచు రాము నూరక, వనచరపతి యుండె విగతవరతేజుండై. ౪౫౬

తాత్పర్యము.

అని నోరెండుచుండ బాణవేదనచే దేహ మెల్ల మండుచుండ బాధ సహింప లేక రాము నూరక చూచుచుఁ దేజోహీనుఁడై వాలి పడియుండెను.

## -* ౧౮-వ సర్గము. శ్రీరాముఁడు వాలిదూషణములకు సమాధానముఁ జెప్పుట.

సీ. ధర్మార్థయుతము హితంబును బరుషంబు,గా విచేతనుఁ డయి కపి వచింపఁ
గాంతిఁ బాసిన దినకాంతునిపోలిక, నంబువుల్ లేనిమేఘంబురీతిఁ
జల్లారి యున్నవైశ్వానరుచందాన, ననని పైఁ బడిన యాయగచరేంద్రు
ధర్మార్థగుణసహితముగ రాముఁడు పల్కె, ధర్మార్థకామవిధంబ యొండె
తే. లౌకికాచార మొండెఁ దలంపలేక, బాల్యమున నన్ను దూషింప ఫలముగల వె
యుడుగ నాచార్యవృద్ధబుధార్యవరులఁ, బలుక నేటికిఁ గ్రోఁతిచాపల్యముననుఁ?

వాలి తన్ను దూషించిన వాక్యములకు నిఁక రామచంద్రమూర్తి సమాధానము చెప్పుచున్నాఁడు. ఈ నిమిత్తముగనే వాలి వెంటనే మగణించునట్లు కొట్టక యూపిరియుండునట్లు కొట్టెను. ఇఁకఁగొంచెముగ బాణము ప్రయోగించియుండిన నది ఱొమ్మున దూసి యావల వెడలిపోయియుండును. వాలి చచ్చిపడియుండును. అప్పుడు రామచంద్రమూర్తి వాలిని వధించిన కారణము తెలియక లోకము పలువిధముల నిందించియుండును. తగిన సమాధానము చెప్పినను నిప్పటికి నాఁటున చేసినది యధర్మ మను దుష్టులు గలరు గదా.

ధర్మార్థయుతము = ధర్మయుతము- అర్థయుతము- ధర్మార్థయుతము = మఱి యొకనితో యుద్ధముచేయునపుడు కొట్టుట ధర్మముగా దను మాట- ధర్మయుతము- వెండి - బంగారు- భూములు మనకు వ్యవహారకారణములు కావనుట అర్థయుతము- హితము= మేలుగోరునది- నాతో నొకమాట చెప్పియుండిన నేను రావణాసురునిబట్టి

తెచ్చియుండనా ? సీతాదేవిని నెత్తికొని వచ్చియుండనా? ఇదియే కదా నీకుఁ గావలసిన మేలు, అనుట హితము- దశరథునివంటి పుణ్యాత్ముని కడుపున నీవంటి పాపాత్ముఁ డెట్లు పుట్టెను? కావున దశరథునకుఁ బుట్టినవాఁడవు కావు లోనైనవి పరుషములు- విచేతనుఁడయి = బుద్ధిలేనివాఁడయి - ఇది వాల్మీకి యభిప్రాయము అనఁగా వాలిమాటలకు నవివేకము కారణమని వాల్మీకితలంపు- విచేతనుఁడనఁగా స్పృహతప్పినవాఁడని యిచ్చటఁ జెప్పరాదు, స్పృహదప్పినవాఁడు మాటలాడ నేరఁడు కదా. కపి = క్రోఁతి, చపలచిత్తుఁడు, స్వభావముచేతనే చపలచిత్తుఁడు, దానిలో దెబ్బదిని బాధపడువాఁడు. దానిలోఁ గోపయుక్తుఁడు — ఇట్టివాఁ డెట్లు మాటలాడఁగలఁడో యట్లే మాటలాడె నని భావము, దినకాంతుని=సూర్యుని, అంబువుల్ లేని మేఘంబు రీతిన్ = నీళ్లు లేని మబ్బువలె, ఊరక యుఱుము లార్భటములే కాని చినుకులు పడనట్లు, క్రియాశూన్యములైన మాటలు మాటలాడె నని భావము. వైశ్వానర = అగ్నిహోత్రుని, ధర్మార్థగుణసహితముగన్ = వాలి ధర్మార్థయుతముగఁ బలికెను రామచంద్రమూర్తి ధర్మార్థగుణసహితముగఁ బలికెను. ఇట్లు చెప్పుటచే వాలి మాటలందు గుణములేదని భావము. అనఁగా వాలి మాటలాడినది శాస్త్రమునఁ జెప్పఁబడిన మాటలు చిలుకపలుకులవంటివి కాని యనుభవముతోఁ గూడినవి కావు, రామచంద్రమూర్తి కేవలశాస్త్రములనే కాక వాని ననుభవమునకు సరిపడునట్లు చెప్పె నని భావము. ఇది యిఁక వివరింపఁబడును. వాలి కామమునుగుఱించి ప్రశంసించినవాఁడు కాఁడు. ఆ విషయమునఁ దనయం దా దోషము కలదని వాఁడెఱుంగును.

దానివలన రామచంద్రమూర్తి ధర్మార్థకామవిధ మనుచున్నాఁడు. ధర్మము= వైదికపురుషార్థము- లౌకికాచారము=లోకమునందుఁ గల కట్టుపాటు - ఇరువుర కొక భార్యయున్నప్పుడు కాల, మాస, సంవత్సరాది నియమముండును, పాండవులు ద్రౌపదీ విషయమున సంవత్సర నియమముగలవారై యుండిరి. అట్టినియమము నీయందు లేదని భావము. ఇది గోవిందరాజీయ వ్యాఖ్యానుసారము. తార వాలి సుగ్రీవుల కుమ్మడి భార్యగా దేవతలిచ్చిరని తోఁచుచున్నది. కావునఁ దార యిరువురకు సమానము. తారయు నిరువురయందట్లులే వర్తించెను. గాని వాలి కది సరిపడినదికాదు. కావుననే తాను లేనప్పుడు సుగ్రీవుఁడు తారతో సంగమించె నని సుగ్రీవునిపై ద్వేషించెను. వాలి సుగ్రీవులకు వాస్తవ విరోధకారణము తారయే-ఆమాట వెలిని జెప్పరాదు. కావున దుందుభివిషయము నెపముగాఁ జెప్పెను. వాస్తవముగ నదియే కారణమైనచో నూరు వెడలఁగొట్టుటయేకాక యెట్లైనఁ జంపవలయు నను దీర్ఘక్రోధము గలవాఁడై యుండఁడు. తండ్రియే సుగ్రీవుని యువరాజు చేసెను. తండ్రి యిచ్చినదానిని హరింప వాలికి నధికారములేదు. హరించినాఁడనుకో ఆమరణాంతవిరోధ మేల? సుగ్రీవుని భార్యను జెఱుపనేల ? బాల్యమునన్ = పిల్లతనముచే- అజ్ఞానముచే- ఆచార్య, వృద్ధ, బుధ, ఆర్యవరులన్ = నీకుపనయనాది సంస్కారములు చేసినవారిని గాని వారున్నను

లేకున్నను బెద్దలనుగాని, పండితులనుగాని పాండిత్యములేకున్నను శాస్త్రీయపద్ధతి నడచు గొప్ప మనస్సు గలవారిని గాని యెవరినైన నీవు చేయు కార్యము సరియో తప్పో విచారించితివా ?

తా త్ప ర్య ము .

ఈ విధముగ ధర్మార్థయుతముగను హితముగను కఠినముగను వాలి యవివేకముగఁ బలుకఁగఁ గాంతిలేని సూర్యునివలె, నీళ్ళులేని మబ్బువలె, చల్లారిన యగ్నివలె, భూమిపైఁ బడియున్న యావానర శ్రేష్ఠుని జూచి ధర్మార్థ గుణ సహితముగ రామచంద్రమూర్తి యిట్లనెను? ఓయీ! ధర్మమని యర్థమని పలికితివి. సంతోషమే కాని ధర్మమే విధముగ నాచరించిన పురుషార్థమగును. ఎప్పుడది పురుషార్థముగాదు? అర్థము కామము ధర్మముతోఁ గూడియుండునట్లు చేయవలయునా ? ఈ విషయము నీవాలోచించితివా? పోనీ కుల సంప్రదాయ మంటివా? శాస్త్ర విషయమున సందేహమువచ్చినపుడు శిష్టాచారము గదా ప్రమాణము. అదియెట్లులున్నదో యాలోచించితివా? ఏ యాలోచన లేక పిల్లతనమున నన్ను దూషించిన నీకు రాఁగల లాభమేమి? పోనీ మే మడవియందుండు వారము. ధర్మశాస్త్రము మాకేమి తెలియునందువా? తెలిసికొనక పోవుట నీ తప్పు. ((Ignorance of law is no excuse) నీవు నీ కులగురువులనో వారు లేని యెడలఁ గులమునఁ బెద్దలనో వారు లేనియెడల శాస్త్రమెఱిఁగిన పండితులనో వారు లేనియెడల నాచారశుద్ధులనో యడిగితివా? ఏల యడుగలేదు? ఇది యంతయు నాలోచింపక క్రోధులకుఁగల స్వభావ చపలబుద్ధిచే నన్ను దూషించిన లాభమేమి!

సీ. శైల కానన వన♦సహిత మీ యుర్వర, యిక్ష్వాకులదిగ నీ ♦ వెఱిఁగికొనుము
ఇందలి మనుజుల ♦ మృగములఁ బక్షుల, బాలింపఁ దూలింప ♦ వారె విభులు
ధర్మ కామార్థత♦త్త్వజ్ఞుండు ఋజుశీలి, నిగ్రహానుగ్రహ♦నిపుణశక్తి
భరతుండు ధర్మలా♦భరతుండు దీనిని, బాలించు చున్నాఁడు ♦ వాలి! నేఁడు
తే. సత్యము నయంబు వినయంబు ♦ శౌర్య మే నృపాలుపాల వసించునో ♦ కాలదేశ
వేది యతఁడ తదాజ్ఞచే ♦ విశ్వమునను, ధర్మరక్షణ వాంఛ ని♦ స్తంద్రరీతి. ౮౫౮

శైల, కానన, వన, సహితము=పర్వతములు, తోఁటలు, తోఁపులు వీనితోఁ గూడిన, ఉర్వర=భూమియంతయు, ఇక్ష్వాకులదిగ=ఇక్ష్వాకువంశమునఁ బుట్టినవారిదిగా, ఇట్లు చెప్పుటచే నిక్ష్వాకుకాలమునుండి వంశపరంపరగా వారే సార్వభౌములయి యున్నారు. దీనిలో వారు తప్ప స్వతంత్రరాజు లెవరులేరని భావము, తూలింపఁ=చంపను, విభులు=ప్రభువులు, అధికారముచే వ్యాపించియుండువారు. సూర్యుఁడొకచో నుండినను ఆయన తేజస్సు లోకమునందంతయు వ్యాపించినట్లు వారయోధ్యలో నుండినను వారి యధికారము సర్వత్ర చెల్లుచున్నదని భావము. అటైన రాజు భరతుఁడుగదా, అతఁడు నన్ను దండింపవలెఁగదా, నీ వెవ్వఁడవు నన్ను దండించుట

కందువేమో, నిజము, ధర్మకామార్థతత్త్వజ్ఞుండు=ధర్మము, కామము, అర్థము వీని వాస్తవవిధము, నీవలె మాటమాత్రముగాదు, తెలిసినవాఁడు, ఋజుశీలి=చక్కని నడవడి కలవాఁడు, నిగ్రహానుగ్రహనిపుణశక్తి = శత్రువుల నిగ్రహించుటయందు, మిత్రుల ననుగ్రహించుటయందు నీతోఁగూడిన శక్తిగలవాఁడు, కావుననే నిన్ను నిగ్రహించుటకు సుగ్రీవు ననుగ్రహించుటకుఁ గారణమయ్యెను. ధర్మలాభరతుఁడు= ధర్మమునే సంపాదించుటయందుఁ బ్రీతిగలవాఁడు. నీవలె ధర్మమును దుంగలలోఁ దొ్రొక్కి యర్థకామముల సేవించువాఁడుకాఁడు. నయంబు = రాజనీతి. వినయము = అణఁకువ, కాలదేశవేది = ఏకార్య మెప్పుడు చేయనలెను, ఎచ్చటఁ జేయవలయు నను విషయముఁ దెలిసినవాఁడు. అతఁడ = ఆ భరతుఁడే. నిస్తంద్రిరీతిన్=హెచ్చరికతో.

తాత్పర్యము.

ఓయీ! కొండలతోను, అడవులతోను, తోఁటలు, తోఁపులతోను గూడిన యీభూమి యంతయు నిక్ష్వాకుకులము మొదలుకొని యిప్పటివఱకు మా వంశమునఁ బుట్టిన రాజులదిగా నీవు తెలిసికొనుము. ఈ కారణముచే నీవు ఇక్ష్వాకువంశము వారికి సామంతరాజవేకాని స్వతంత్రప్రభువవు గావు. ఇట్లు వారు సార్వభౌము లగుటచే వారి రాజ్యమందలి సమస్త జనులను మృగములను పక్షులనుగూడ రక్షించుటకు శిక్షించుటకు వారి కధికారము గలదని తెలిసికొనుము. సత్యమే. నీవు రాజవు కావు కదా యందువేమో- నిజమే నేను గాను గాని ధర్మార్థకామములను నేదేది యెప్పుడెప్పు డనుష్ఠింపవలయునో యా రహస్యమెఱింగి దుష్టుల నిగ్రహించుటకు శిష్టుల ననుగ్రహించుటకు శక్తగలిగి ధర్మలాభమందే ప్రీతిగల భరతుఁడు నేఁడు పాలించుచున్నాఁడు. అతఁడే సత్యము, నీతి, వినయము, శౌర్యము గలిగి దేశకాలస్థితు లెఱింగి పాలించుచున్నాఁడు. ఆయన యాజ్ఞచేఁ బ్రపంచమందు ధర్మమును గాపాడు కోరికతోఁ బ్రమాదపడక;

శైలకాననవన సహిత మీ యుర్వర యిక్ష్వాకు లది యనుట సత్యమా?

౧ దశరథుఁడు కైకతో (అయోధ్య ౨౮౧)

"తూరుపు నాఁట సింధువునఁ దొయ్యలి యంగ సమృద్ధ మత్స్య సౌ
వీరతలంబులన్ మగధ పృథ్వని దక్షిణ దేశమందునన్
వారక కాశిఁ గోసలను వంగముసందు జనించు నెవ్వియేన్
గోరుము నీ కొసంగెదను" అనుటచే నివి యన్నియు నతని యధికారమునకు లోపడిన వని యేర్పడెను.

౨ రామచంద్రమూర్తి సీతాదేవితో నరణ్యమునకు రథముపైఁ బోవుచు (అయోధ్య ౧౨౮౬) స్యందికానది దాఁటె.

"కమల లోచన యీ నది గరుసుగాఁగ
మను వొసంగెను నిక్ష్వాకు మనుజపతికిఁ

దక్షినది యెల్లఁ గరదులై ధరణినాథు
లేలుచుందురు సంప్రీతి యెసకమెసఁగ”నని చెప్పెను.

౩ దండకారణ్యవాసు లయిన మును లందఱు.

“కావున మే మెల్లరమును, నీ విషయమునందు నుంట నీచే నెపుడుఁ గావంబడ నర్హులమో - భూవర తనయాగ్రణీ ప్రభూతపుఁ గరుణన్” అనియు నీకు మా తప ముల నాలవభాగము పన్ను చెల్లించు చున్నా మనియుఁ జెప్పిరి. ఆరణ్య ౧౩.

౪ హనుమంతుఁడు సముద్రమధ్యమున సురసతో,

“రామునియాజ్ఞఁ బోయెదను రాముని రాజ్యమునందు నుండుటన్ రామరో నీకునుం దగవు రాముని కార్యము దీర్ప”నని చెప్పెను. సుందర ౯౯.

౫ రావణుఁడు సీతాదేవిని హరించినవార్త విని భరతుఁ డాజ్ఞాపింపఁగా రావ ణునిమీఁదికి దండెత్తిపోవ మూఁడువందలరాజు లయోధ్యకు వచ్చినట్లు ఉత్తరకాండ మున ౮౬౯ వ పద్యమునఁ గలదు.

దీనిపై నొక యాక్షేపము - కార్తవీర్యార్జునుఁడు మొదలగువారు ప్రబలు లయినప్పుడు వారు పన్నులు గట్టుచుండిరా ? పన్నులు గట్టవలసినపనిలేదు. ఆధి రాజ్యాధిపత్యము మైత్రిచేతనో బాంధవముచేతనో తిరస్కరింపక యంగీకరించినఁ జాలును.

ధర్మరాజు రాజసూయయాగముచేసి సార్వభౌమత్వము ప్రకటించినపుడు యాదవులను గెలిచెనా ? భీష్మాది కౌరవుల గెలిచెనా ? నడుమ నెవ్వఁడేని యొకఁడు ప్రబలుఁడై యుండినను వాని యనంతరము మరల యథాపూర్వ మిక్ష్వాకుల ప్రభుత్వమే. అన్యదేశజులు వచ్చి మన కధికారులై హిందూదేశ మాక్రమించుకొనినను మనదేశము స్వరాజ్య మనుచున్నామా ? మానితిమా? వీరుపోయిన మరల మన రాజ్యము మన ప్రభువులు పాలింపవలయు నని తలఁచుచున్నామా లేదా? మధ్యమున నెవఁడో యొకడు ప్రబలినంతనే శాశ్వత స్వామిత్వ మెందుఁబోవును. కార్తవీర్యార్జును తోడ క్షత్రియవంశములు నాశముకాఁగా మరల యథాపూర్వ మిక్ష్వాకులే కదా యధిరాజులైరి. కావున రామచంద్రమూర్తి యసత్యము చెప్పలేదు.

క. నేనును మఱికొందఱు భూజానులు చరియింతు మెవఁడు ♦ సలుపఁగఁ జాలున్
హానిని ధర్మంబునకును, నా నిశ్చలధర్మశీలుఁ ♦ డవని భరింపన్? ౮౫౯

భూజానులు = రాజులు, నిశ్చలధర్మశీలుఁడు = చలింపని ధర్మస్వభావము గలవాఁడు.

తాత్పర్యము.

నేను మఱికొందఱు రాజులు భూమిమీఁదఁ దిరుగుచున్నాము. నిశ్చల ధర్మ స్వభావుఁడైన భరతుఁడు రాజ్య మేలుచుండ నెవ్వఁ డధర్మము చేయఁజాలును, చేసెనా శిక్షింపఁబడకుండును ?

క. మేము స్వధర్మము తప్పక, భూమిం గల ధర్మహీన♦ పురుషుల భరతా
జ్ఞామహిమను దండించెద, మేమీ దోషంబు దీన ♦ నెఱుఁగం జెపుమా. ౪౬౦

తా త్ప ర్య ము.

ఈ ప్రకారము ధర్మరక్షణము నిమిత్తమయి తిరుగు మేము స్వధర్మము తప్పక భూమిని గల యధర్మాత్ములను భరతుని యాజ్ఞాప్రకారము దండింతుము. ఇది తప్పా? చెప్పుము. దీనివలనఁ బూర్వపు రాజులు ధర్మరక్షణకై కొందఱ నధికారుల దేశము మీఁదఁ బంపుచుండిరని తెలియ నయ్యెడిని. ఈ సందర్భమున అయోధ్యాకాండము ౨౪౨౭ వ పద్యము చూచునది. "రాజవు కమ్ము నీవు జనరాజికి వన్యమృగాళి కయ్యెదన్, రాజను దండకాటవికిఁ గ్రక్కునఁ బోయెద"నను వాక్యము లనుసంధించు నది. ఈ ప్రకారమే భరతునితో నింతకుముందే చెప్పెను. చూ. ఆరణ్య ౪౪౬ వ పద్యము.

ఈ భాగపరిష్కారము రామచంద్రమూర్తి చెప్పెనే కాని భరతుఁడు చెప్ప లేదుగదా యందురు. సత్యమే, భాగపరిష్కారాధికారము జ్యేష్ఠునిదే కదా. భరతుఁడు తాను రాజుగాననియు, రామచంద్రమూర్తియే రాజనియుఁ బాదుక లాయనప్రతినిధ యనియుఁ దాను మంత్రియనియుఁ దలఁచెనే కాని తాను రాజనని రాము నాజ్ఞా పింపలేదు. ఆ కారణమున వాస్తవప్రభువు రామచంద్రమూర్తియే యని యంగీక రింపఁదగును. రామచంద్రమూర్తికిఁ దాను రాజ నను నభిప్రాయము లేకున్నను లోకులు జేయు పాపమువలనఁ బాపమో యపకీర్తియో భరతునకు, వంశమునకు రాకుండఁ గాపాడుభారము రామచంద్రునందున్నది. ధర్మరాజు 'పరైఃపరిభవే ప్రాప్తే వయం పంచోత్తరం శతం, పరస్పరవిరోధేతు వయం పంచైవ తే శత'మ్మని చెప్పలేదా?

ఉ. నీవును ధర్మముఁ విడిచి ♦ నిష్ఠురగర్హితకర్మశాలివై
యేవపుఁ గామతంత్రమునె ♦ యెంతయు ముఖ్యముగాఁగఁ జూచుచున్
భూవిభునీతిఁ దప్పితివి ♦ పోలునె నీ కిది? నీచరిత్రముఁ
భావన సేయలేక గరు♦వంబున నన్నల నేల దూఱఁగన్. ౪౬౧

నిష్ఠుర=పరుషమగు, గర్హిత=నిందింపఁబడిన, కర్మశాలివై = పనులుసేయు వాఁడవై, ఏవపు = అసహ్యమగు, కామతంత్రమునే= కామవ్యాపారమునే, అనఁగా ధర్మవిరుద్ధమైన కామమునే, భూవిభునీతిన్= రా జుండవలసిననీతి, నీవొకఁడవు చెడిన రాజ్యమంతయుఁ జెడు నను జ్ఞానము లేనివాఁడవై.

తా త్ప ర్య ము.

నే నిపు డేమి యధర్మము చేసితి నని నన్ను నీవు నిగ్రహించితి వందువా? చెప్పెద, విను. నీవు ధర్మమును వదలి కఠినమై నింద్యమైన కార్యము చేయువాఁడవై యధర్మయుక్తమైన కామమునే ముఖ్యమైనదిగా గ్రహించి రా జుండవలసిన ధర్మము

దప్పితివి. ఇది నీకుఁ దగునా ? నీ నడవడి నీవు యోజింపక గరువముచే నితరుల నేల దూషించెదవు ?

చ. జనకుఁడు, నన్న, విద్యలను ♦ సమ్మతిఁ జెప్పినవాఁడు ముప్పురున్
వనచరవీర! ధర్మపథ♦వర్తులకుం దమ తండ్రులే సుమీ
యనుజుఁడు సద్గుణాంచితుఁడు♦నౌ తన శిష్యుఁడు నాత్మపుత్రుఁడున్
దనయుని యట్టివారు; వర♦ధర్మము సుమ్మి ప్రమాణ మింతకున్. ౪౬౨

అనుజుఁడు = తమ్ముఁడు- సద్గుణాంచితుఁడు = మంచి గుణములచేఁ బ్రకాశించువాఁడు.

తా త్ప ర్య ము.

నే నే ధర్మము తప్పి నడచితి నందువా చెప్పెద, విను. ధర్మము ప్రమాణమైనచోఁ గన్నతండ్రి- అన్న-విద్య నేర్పిన గురువు ఈ ముప్పురు ధర్మపథమం దుండువారికిఁ దమ తండ్రులేసుమా. అట్టులే సద్గుణములుగల తోడఁబుట్టినవాఁడు - సద్గుణములుగల శిష్యుఁడు- సద్గుణములు గల తన కన్నకొడుకు ఈ ముప్పురు కొడుకు వంటివారే.

చ. తరుచర! ధర్మసూక్ష్మమువి♦ధానము రా దెఱుఁగన్ మహాసుధీ
వరులకు నేనియున్, హృదయ♦వాస్తు వశేషచరాచరాత్మయే
పరమశుభాశుభంబులను ♦ బాగుగఁ దా దెలియంగఁ జాలు, నీ
తరమె యథావిధిం దెలియ ♦ ధర్మము తత్త్వము మూలముట్టుగన్? ౪౬౩

ధర్మసూక్ష్మము విధానము = ధర్మముయొక్క సూక్ష్మస్థితి, మహాసుధీవరులకు నేనియున్ = గొప్పపండితులకునైనను- హృదయవాస్తువు = హృదయమున వసించువాఁడు- అశేష=సమస్తమైన, చరాచరాత్మయే= చరములకు అచరములకు నాత్మగా నుండువాఁడే, యథావిధిన్ = ఉన్నదున్నట్టు, శాస్త్రప్రకారము.

తా త్ప ర్య ము.

ఓయీ! కన్నతండ్రి యన్నయె ట్లగును, అన్న తండ్రి యె ట్లగును, చదువు చెప్పినంతమాత్రముననే గురువు తండ్రి యగునా? యందువేమో? వీరు ముప్పురేల సమానులను ధర్మసూక్ష్మపద్ధతి గొప్ప పండితులకుఁగూడఁ దెలియదు. సమస్త చరాచరములకు నాత్మయై హృదయమందు వసించు నీశ్వరుఁ డొక్కఁడే యేదిధర్మము, ఏది యధర్మమను విషయము తెలిసినవాఁడు. ఆయనకుఁ దెలిసిన లోకమున కెట్లు తెలియవలె - ఆయన నా కేల చెప్పలేదు, అందువా - నీకు శాస్త్రరూపమునఁ దెలియఁజెప్పియున్నాఁడు. "శాస్త్రే ద్వేద్మి జనార్దనమ్" "కారుణ్యాత్ శాస్త్రపాణినా" "శ్రుతి స్మృతి ర్మమైవాజ్ఞా" యిట్టి వాక్యములు గలవుకదా - శాస్త్రరూపముగ నాయన చెప్పియున్నను నీవు తెలిసికొనకపోయినచో దోషు లెవరు ? నీవంటి కోతికి నట్టి ధర్మసూక్ష్మ మున్నదున్నటు లామూలాగ్రము దెలియ సాధ్యమా ?

సూక్ష్మా గతిర్హి ధర్మస్య దుర్జ్ఞేయా హ్యకృతాత్మభిః. భార. ౧౩-౧౦-౬౮.

ధర్మగతి మిగుల సూక్ష్మము, అది సంస్కారములేని మనస్సులు గలవారికిఁ దెలియ సాధ్యముగాదు.

అధర్మరూపో ధర్మోహి కశ్చిదస్తి నరాధిప
ధర్మ శ్చాధర్మరూపోఽస్తి, తచ్చ జ్ఞేయం విపశ్చితా. ౧౨-౩౩-౩౭

కొన్ని యధర్మములవలెఁ గానవచ్చునుగాని వాస్తవమున ధర్మములై యుండును. కొన్ని ధర్మములవలెఁగానవచ్చును. కాని యవి వాస్తవమున నధర్మములే.

అధర్మో ధర్మతాం యాతి స్వామీచే ద్ధార్మికో భవేత్
భార. ౧౧-౮-౩౩

స్వామి ధర్మాత్ముఁడైనచో నధర్మము ధర్మముగా నగును.

క. విను నీవు చపలుఁడవు నీకును మూఢులు చపలమతులు ♦ క్రోఁతులు మిత్రుల్
జనుషాంధునితోఁ జేగిన, జనుషాంధుఁడు వోలెఁ గనఁగఁ ♦ జాలుదె తగవున్?

జనుషాంధుఁడు = పుట్టు గ్రుడ్డి, అలుక్సమాసము.

తా త్ప ర్య ము.

నా కేల యీ ధర్మము సూక్ష్మము తెలియరాలే దందువా? నీవు స్థిరచిత్తము లేనివాఁడవు. కదలుచున్న నీటిలో రూపము చక్కఁబ్రతిఫలించునా? నీతోడ నున్న సహాయులో నీవలెఁ జపలచిత్తులు మాత్రమే గాక మూఢులు; పుట్టుగ్రుడ్డువానితోఁ జేరిన పుట్టుగ్రుడ్డికి నేమి తెలియఁగలదు? అట్టులే నీకు ధర్మ మెట్లు తెలియఁగలదు? 'అంధేనైవ నీయమానో యథాంధ' యను శ్రుతి స్మరించునది.

కం. నా పల్కుమాటలను వినుమా పల్కెద స్పష్టముగను ♦ మదిఁ గేవలమున్
గోపంబుచేతనే యభిశాపంబులు పల్కి తిట్టఁ ♦ జనకుము నన్నున్. ౪౬౫

కేవలము = మిక్కిలి, అభిశాపంబులు = నిందలు.

తా త్ప ర్య ము.

ఓయీ! నేను జెప్పఁదలఁచిన దేమో స్పష్టముగాఁ జెప్పెద వినుము. కేవలము కోపము చేతనే నన్ను నిందింపకుము.

చం. నినుఁ బొరిగొన్న కారణము ♦ నే వచియించెద విన్ము సత్సనా
తనవరధర్మమున్ విడిచి ♦ తమ్ముఁడు జీవముతోడ నుండ నా
యనఘునిభార్య నీ స్నుష రుమాంగనఁ గూడితి వీవు కామవృ
త్తిని దురితంపుఁబద్ధతిని ♦ దీనిని గా దనెదేని చెప్పుమా. ౪౬౬

సత్ + సనాతనధర్మమున్ = సజ్జనులచే సేవింపఁబడినదై శాశ్వతమైన ధర్మమును, నీ స్నుష = నీ కోడలు, కామవృత్తిని = కామవ్యాపారముచేత, దురితంపుఁ బద్ధతిని = పాపమార్గమున.

తాత్పర్యము.

నిన్నుఁ జంపిన కారణము చెప్పెద వినుము. సజ్జనులు శ్లాఘించు సనాతన ధర్మమును వదలి నీ తమ్ముఁడు జీవించియుండఁగా నతనిభార్యను నీకోడలవంటి రుమను నీవు పాపమార్గమున దుష్కామమునఁ బొందితివి. ఇది యసత్యమా చెప్పుము.

ఇచ్చట నీ తమ్ముఁడు జీవించియుండఁగా ననుటచే సోదరుని మరణానంతరము వాని భార్యను జీవించియుండు సోదరుఁడు గ్రహించు కులాచారపద్ధతిని దోషముగా రామచంద్రమూర్తి గ్రహించినవాఁడు కాఁడని యేర్పడుచున్నది.

కం. పో విడిచి ధర్మమార్గముఁ, గేవలదుష్కామి వగుచుఁ ♦ గెరలుచును స్వకీ
యావరజునిసతిఁ బట్టుట, నీ విధి దండింప వలసె ♦ నియ్యెడ నిన్నున్. ౪౬౭

స్వకీయావరజుని, స్వకీయ+అవరజుని = నీ సొంత తోడఁబుట్టినవాని, సతిని = భార్యను.

తాత్పర్యము.

ధర్మమార్గము వదలి కేవలదుష్కామముచే నడ్డములేక నీ తమ్ముని భార్యను నీవు చెఱిచిన కారణముచే నిన్నీవిధముగాఁ జంపవలసివచ్చెను.

కం. ధర్మంబు విడిచి జనహిత, కర్మాచారంబులకును ♦ గడు దవ్వగుచున్
నిర్మర్యాదం దిరిగెడి, దుర్మదునకు దండ మొకఁడె ♦ తుద కర్హమగున్. ౪౬౮

జనహిత = ప్రజలకు మేలుగలిగించు, కర్మాచారంబులకున్ = పనులకు నడవడులకు, దవ్వు=దూరము, నిర్మర్యాదన్ = కట్టుపాటులకు లోపడక, దండము= శిక్ష.

తాత్పర్యము.

రాజగువాఁడు సామదానభేదములు వ్యర్థములైనఁగదా దండ ముపయోగింపవలె, ప్రథమమందే దండ ముపయోగింపవచ్చునా యనుటకు రామచంద్రమూర్తి ప్రత్యుత్తర మిచ్చుచున్నాఁడు.

ధర్మము బుద్ధిపూర్వకముగ వదలి జనులకు మేలగు కర్మములను ఆచారములను ననుష్ఠింపక శాస్త్రబంధన మతిక్రమించి దుష్టగర్వమున నాకెదు రెవరని తిరిగెడి వానియందు సామదానభేదములు పనికిరావు. దండమొకఁడే యుపయోగింపవలెను. సామదానభేదములు తనకు లోపడని రాజుల విషయముగాని సామంతరాజుల విషయముగాదు. నేరముచేసి వధశిక్షకు నర్హుఁడయిన వానితో సామదానభేదము లేమున్నవి? ఇది శాస్త్రీయమా లౌకికాచారమా రెండునుగావు. నీవుదండ్యుఁడవు కావునఁ బ్రథమమందే దండమే యుపయోగించితిని.

ఉ. పుట్టితి క్షత్రియుండ నయి ♦ భూరియశోవిభవాభిరామమై
నెట్టనకీర్తిఁ గన్నయవ♦నీపతివంశమునందు నట్టిరా
పట్టిని ధర్మమెంచ కతి♦పాపముఁ జేసిన కామవృత్తు ని
న్నెట్టులు చూచి చూచి సహిం♦యింతు శమింతును నీవ చెప్పుమా. ౪౬౯

భూరియశోవిభవాభిరామమై = గొప్పకీర్తి సంపదచే మనోహరమై, అవనీపతి వంశమునందు = రాజవంశమున, రాపట్టిని = రాజకుమారుఁడను.

తాత్పర్యము.

నన్ను దండించుటకు నీ వెవఁడ వందువా? చెప్పెద, వినుము. నేను క్షత్రియుఁడుగాఁబుట్టితిని. ఎవఁడు క్షత్రియుఁడు? సనాతనధర్మము క్షతము గాకుండ (చెడిపోకుండ) రక్షించు వాఁడెవఁడో వాఁడు క్షత్రియుఁడు- కావున ధర్మరక్షణము నాకుఁ బుట్టువుతోనే వచ్చిన యధికారము. నేను సింహాసనారూఢుఁడై నను గాకున్నను నీ కార్యము నాకుఁ దప్పదు. (ఈకారణముచేత నే కదా "మత్స్వామివి నీవ నీవు వనధారిణి నుండిన నూరనుండినన్" అని ఋషులు చెప్పిరి. ఆరణ్య ౧౨ ప) అది తప్పిన నేను స్వధర్మమునకుఁ దప్పినవాఁడనే. నేను జాతిమాత్ర క్షత్రియుఁడను మాత్రమే కాదు. ధర్మపాలనతత్పరు లని ప్రసిద్ధిగన్న భూమిపాలుర వంశమునందుఁ బుట్టితిని. కావున ధర్మరక్షణమందు నా కెక్కువ యధికారము గలదు. అటువంటి రాజకుమారుఁడను ధర్మమును లక్ష్యముసేయక కామము ప్రధానము చేసికొని యతిపాపము చేయు నిన్నుఁ జూచి చూచి యెట్లు క్షమింతును? ఎట్లు సహింతును? ఇది సాధ్యమా? ఇంత ఘోరపాపము చేసిన నిన్నె దండింపనైతినేని యల్పపాపుల నే నేమని దండింతును? నాభార్యను రావణుఁడెత్తుకొని పోవుట యధర్మమని కదా నీవు వానినిబట్టి కొట్టి తెచ్చెదనంటివి. అట్లులే పరునిభార్యను దోడఁబుట్టినవానిభార్యను గోడలవంటిదానిని బూర్తిగాఁ జెఱచిన నిన్ను నేమిచేయవలెఁ జెప్పుము?

కం. తన సుతతోఁ జెలియలితోఁ, దనతమ్మునిభార్యతోడఁ ♦ దగులు కుమతికిన్
వనచరవర! వధ యెుక్కటె, వినియమితం బయ్యె దండ♦విధిశాస్త్రములన్. ౭౭౦

నా తమ్మునిభార్య నా భార్యకుఁ జెల్లెలే కదా- నాభార్యకుఁ జెల్లెలయినపుడు నాకు భార్య వావియెకదా యందువేమో! అదిగాదు- కూఁతురు- చెలియలు- మఱఁదలొక్కవరుసవారు- తనకూఁతుఁతోఁ దన చెలియలతోఁ దన మఱఁదలితో సంగమించువానికి శాస్త్రమందు వధశిక్ష యొక్కటే చెప్పఁబడెనుగాని వేఱొక్క శిక్ష చెప్పఁ బడలేదు.

ఈ సందర్భమున నీ ధర్మశాస్త్రవాక్యములు స్మరణీయములు.

భ్రాతు ర్జ్యేష్ఠస్య భార్యా యా, గురుప త్న్యనుజస్య సా
యవీయసస్తు యా భార్యా, స్నుషా జ్యేష్ఠస్య సా స్మృతా॥ మను ౯-౫౭.

అన్నభార్య తమ్మునికి గురుపత్నితో సమానురాలు. తమ్మునిభార్య యన్నకుఁ గోడలితో సమానురాలు.

రేతస్సేకః స్వయోనీషు కుమారీ ష్వంత్యజాసుచ
సఖ్యుః పుత్రస్యచ స్త్రీషు, గురుతల్పసమం విదుః. మను. ౧౧-౫౮

తోడఁబుట్టినది, కూతురు, చండాలస్త్రీ, మిత్రునిభార్య, కొడుకుభార్య వీరి

యందు రేతస్సును విడుచువాఁడు గురుభార్యాగమనము చేసినవాఁడగును అనఁగా గురుతల్పగమనము చేసిన వాని కెట్టి శిక్షయో యట్టి శిక్షయే యని భావము.

గురుతల్ప్యభిభాష్యైన స్తప్తే స్వప్యా దయోమయే
సూర్మీం జ్వలంతీం స్వాశ్లిష్యే న్మృత్యునా స విశుద్ధ్యతి. మను.౧౧-౧౦౩.

గురువనఁగా దండ్రి, తల్పమనఁగా భార్య, గురుతల్పమనఁగాఁ గన్నతండ్రి భార్యయని యర్థము. గురుభార్యను బొందినవాఁడు తానొనర్చిన పాపమును రాజుతోఁ జెప్పుకొని కళకళ కాఁగి మండుచున్న యినుపమంచముమీఁదఁ బండుకొని చక్కఁగాఁ గాలిన యినుపస్త్రీ ప్రతిమను గౌఁగిలించుకొని మరణ మొందుటచేఁ బరిశుద్ధుఁడగును.

ఇది యొకసారి పొరపాటునఁజేసి పశ్చాత్తాప పడువాని విషయము. అభ్యాసముగఁ జేయువానికి మరణశిక్షయే యని యమస్మృతి.

రేత స్సిక్త్వా కుమారీషు చాండాలీ ష్వంత్యజాసు చ
సపిండాపత్యదారేషు ప్రాణత్యాగో విధీయతే.

కన్యకలయందు, చండాలస్త్రీలయందు, అంత్యజాతి స్త్రీలయందు సపిండులైన భార్యలయందు (తన వంశమున నేడు తరములవారి వంశమునఁ బుట్టినవారి స్త్రీలయందు రేతస్సు విడిచినవారికిఁ బ్రాణత్యాగమే విధింపఁబడినది.

ఆరూఢపతితాజ్జాతో, బ్రాహ్మణ్యాం శూద్రజశ్చ యః
చండాలా తావుభౌ ప్రోక్తౌ సగోత్రా ద్యశ్చజాయతే.

ఆరూఢ పతితుఁడగువానికిఁ బుట్టినవాఁడును, బ్రాహ్మణస్త్రీకి శూద్రునివలనఁ బుట్టినవాఁడును, సమానగోత్రునికిఁ బుట్టినవాఁడును జండాలు రనఁబడుదురు.

పితృష్వసారం మాతుశ్చ మాతులానీం స్నుషా మపి
మాతుస్సపత్నీం భగినీ మాచార్యతనయాం తథా
ఆచార్యపత్నీం స్వసుతాం గచ్ఛంస్తు గురుతల్పగః.

తండ్రితోఁడఁబుట్టినదానిని, తల్లిని, మేనమామ భార్యను, కోడలిని, సవతి తల్లిని, తోఁడఁబుట్టినదానిని, ఆచార్యపుత్రిని, ఆచార్యభార్యను, తన పుత్రిని బొందువాఁడు గురుతల్పగుఁడు.

చండాలీ బంధకీ వేశ్యా రజస్థా యాచ కన్యకా
ఊఢా యా చ సగోత్రేణ వృషల్యః పరికీర్తితాః॥

చండాలస్త్రీ, అంకుటాలు, బోగముది, ముట్టుత, కన్యక, సగోత్రమున వివాహము చేసికొన్నది వీరందఱు వృషల లనఁబడుదురు. అనఁగాఁ జండాలస్త్రీలతో సమానలు. అనఁగా రతియోగ్యలుగారు.

మాతృష్వసాచ, శ్వశ్రూశ్చ, మాతులానీ, పితృష్వసా
పితృవ్యసఖీ, శిష్యస్త్రీ భగినీ, తత్సఖీ, స్నుషా
దుహితా,చార్యభార్యాచ, సగోత్రా, శరణాగతా

రాజ్ఞీ ప్రవ్రజితా, ధాత్రీ, సాధ్వీ, వర్ణోత్తమాచ యా,
అసామాన్యతమాం గత్వా గురుతల్పగ ఉచ్యతే॥ నారద॥

తల్లితోఁడఁ బుట్టినది, అత్త, మేనమామ భార్య, తండ్రితోఁడఁబుట్టినది, పిన్నతండ్రి సఖి, శిష్యుని భార్య, తోఁడఁబుట్టువు, దానిసఖి, కోడలు, కూఁతురు, ఆచార్యభార్య, సగోత్ర స్త్రీ, శరణాగతి చేసిన స్త్రీ, రాణి, సన్న్యాసిని, దాది, పతివ్రత, తనకంటె నుత్తమ వర్ణము స్త్రీ, గుడిసెవాటిలంజకానిది, వీరితోఁ బొందువాఁడు గురుతల్పగుఁడు.

"పశువేశ్యాభిగమనే ప్రాజాపత్యం వ్రతం చరేత్"

పశువులను వేశ్యలను నొకసారి పొందినవానికిఁ బ్రాజాపత్యవ్రతము.

శాస్త్రవాక్యము లిట్లుండుటచే బుద్ధిపూర్వకముగ దీర్ఘ కాలము మఱఁదలతో సంగమించిన వాలికి మరణదండము తప్ప వేఱు దండము లేదు.

కం. భరతుండు రాజు మేమో, ధరణిపు నాదేశమునను ♦ ధర్మేతరులన్
ధరఁ దిరిగి యరసి యుచితపు,సరణిన్ శిక్షింతు మార్యజన♦సమ్మతిగాన్. ౨౮౧

తా త్ప ర్య ము .

క్షత్రియజాతియందు, నందు సార్వభౌమ లవంశమందుఁ బుట్టిన కారణము చేతనే యధర్మాత్ముల దండించు నధికారము మా కున్నను రాజు భరతుఁడు కావున మే మాతని ఆజ్ఞప్రకారము ధర్మము తప్పినవారిని భూమియందుఁ దిరిగి వెదకి తగిన రీతి పెద్దలకు సమ్మతమగు విధముగ దండింతుము.

"దండకారణ్యరాజ్యం మే, దత్తం పిత్రా తథైవచ" అధ్యాత్మ రామాయణము. అయోధ్యా. ౯, ౩౦.

నీకు నగరపాలన మెట్లు తండ్రి యిచ్చెనో యట్లు లరణ్యరాజ్యము నా కిచ్చెను, ఇది భరతునితో రామచంద్రమూర్తి చెప్పినవాక్యము.

కం. దుర్జనశిక్షయు ధర్మో,పార్జనమును జేయు చుండు ♦ భరతుఁడు మేమున్
వర్జితతన్మార్గుల మై, కర్జంబు నుపేక్ష సేత ♦ కార్యం బగునే? ౨౮౨

దుర్జనశిక్ష = దుష్టుల దండించుట, ధర్మోపార్జనము = ధర్మము నార్జించుట, వర్జిత తన్మార్గులమై = విడువఁబడిన యా త్రోవగలవారమై.

తా త్ప ర్య ము .

భరతుఁడు రాజై దుష్టుల శిక్షించుచున్నాఁడు, ధర్మము నార్జించుచున్నాఁడు, మే మట్లు సేయక యుపేక్ష సేయుట తగునా? ఆయనవలె మేమును దుష్టశిక్ష ధర్మరక్ష చేయవలయునుగదా.

ఉ. పావనమైతి నా మదికి ♦ వానరనాయక! లక్ష్మణుంను సు
గ్రీవుఁడు నొక్క రూప సుమి ♦ శ్రీమహిదారలు తత్ఫలంబు లా
నీ వరశౌర్యశాలి ఘటి♦యింపఁగఁ జాలును నాకు మేలు, నే
నే విధి నేమి హేతువున ♦ నీతనిసఖ్య ముపేక్ష సేయుదున్? ౨౮౩

వాలి, నేను నిరపరాధిని, నన్నేల దండించితి వనిన మాటకు నీ వపరాధివి కావు ననే దండించితి నని రామచంద్రమూర్తి యింతవఱకుఁజెప్పి నీకార్యము నాతోఁ జెప్పియుండిన నేను నిమిషములోఁ జేయనా యన్న మాటకుఁ బ్రత్యుత్తర మిచ్చుచున్నాఁడు.

పావనమైత్రిణ=నిర్వంచనమైన స్నేహమున, ఒక్కరూప=సమానమే, శ్రీమహీదారలు=లక్ష్మి, రాజ్యము, భార్య. తత్ఫలంబులు=ఆస్నేహమువలన సుగ్రీవునకుఁ గలుగు ఫలములు.

తా త్ప ర్య ము.

నా మనస్సునందు వాలీ! వంచనలేని మైత్రియందు నీ లక్ష్మణుఁడు నా కెట్టివాఁడో సుగ్రీవుఁడు నట్టివాఁడే. నాతోడి స్నేహమువలన నతనికి రాఁగల లాభ మేమి యందువా, లక్ష్మి, భూమి, భార్య. ఇఁక నతనివలన నాకుఁ గావలసినది సీతాదేవిని వెదకి చెప్పుట, ఆకార్య మతఁడు చేయఁజాలును. మా స్నేహమువలన నతనికిఁ గావలసిన కార్య మతనికి నగును. నాకుఁ గావలసినది నాకు నగును, ఇట్టి స్నేహమును నేమి కారణముచే నుపేక్షచేసి నీతో స్నేహము చేయుమనెదవు? ఇంతకంటె నెక్కువ మేలు నీవు నా కేమి చేయవలసియున్నది. వాస్తవమున సీతాన్వేషణ కార్యమే సుగ్రీవుని వలనఁ గావలసిన కార్యముగాని రావణవధాదికముగాదు. అది తానే చేసికొనెద నని చెప్పెను. ఆ కార్యము సుగ్రీవుఁడు చేయఁగలఁడు. వాలి చేయఁజాలఁడు. వాలి చక్కఁగా రావణాసురుని యొద్దకుఁ బోయి సీతను దెచ్చితివే యెం మంచివానవని యనును. వాఁడు నాకుఁదెలియదు, పొమ్మనును. ఆమె నెందో యంతఃపురమున నేలమాళిగలో దాఁచును, వాలిరావణ యుద్ధము ప్రారంభమగును, రాక్షసులందఱు నేకమగుదురు. ఎందఱతోనని యెంతకాలమని ముష్టియుద్ధము సేయఁగలఁడు? చేయఁగలిగినను వారు మాయచే వాలిని జంపియుందురు, రాముఁడు వాలి మిత్రుఁ డగుటచే సుగ్రీవుఁడు సహాయము చేసియుండఁడు. రాముకార్యము పాడైయుండును. రామచంద్రమూర్తి సుగ్రీవునితో స్నేహము చేసినదే తగినకార్యము. క॥కయ్యమునకు నెయ్యమునకు,వియ్యమునకు సమతవలయు వేఱొండైనన్,గయ్యము గెలువదు నిలువదు, నెయ్యము వియ్యంబు పొసఁగనేరదు మొదలన్॥ అన్నట్లు గర్విష్ఠుఁడు సంపన్నుఁడునగు వాలికిని, సాధువు, కష్టదశయం దుండు రామునకు మైత్రి కుదురదు. అట్టిమైత్రి రాజనీతి సమ్మతముగాదు. శుష్కేనార్ద్రం దహ్యతే మిశ్రభావాత్ తస్మాత్పాపైస్సహ సంధిం నకుర్యాత్॥ భార,శా-౩౪-౭౦. అన్నియుఁ బచ్చికట్టెలయినచో నగ్ని దహింపఁ జాలదు, అటుకాక పచ్చికట్టె యెండుకట్టెలతోఁ జేరెనా వానితోపాటు దానిని గాల్చును. ఆకారణముచేఁ బాపులతో సంధి చేయరాదు. కబంధుఁడు సుగ్రీవుమైత్రి చేయుమని బోధించెనుగాని వాలిమైత్రి బోధించినవాఁడు కాఁడు. అదియునుగాక రామచంద్రమూర్తి సూర్యవంశమువాఁడు, సుగ్రీవుఁడు సూర్యపుత్త్రుఁడు,

హనుమంతుఁడు సూర్యశిష్యుఁడు. ఇట్టి సంబంధముగలచోట స్నేహము కుదిరినట్లు నిలచినట్లు వాలితోడ నిలుచునా? ఇది త్రేతాయుగము, ఇందు సూర్యవంశమువారు ప్రబలులు, ద్వాపరమందుఁ జంద్రవంశపువారు ప్రబలులు, సూర్యవంశపువారు దుర్బలులు, కావునఁ గృష్ణమూర్తి చంద్రవంశమునఁబుట్టి చంద్రవంశరాజగు నర్జునునితో స్నేహము చేసి సూర్యపుత్త్రుఁడగు కర్ణుని వధింపఁజేసెను. ఆ కాలమందు నర్జునాదులచేఁ గార్యము చేయించెను. ఈ త్రేతయందుఁ దానే స్వయముగఁ జేసి యింద్రపుత్త్రుని వధించెను. రామ సుగ్రీవమైత్త్రియందుఁ గృష్ణార్జున మైత్త్రియందు నీ విశేషము గమనింపవలయును. ఈ విషయమున మథింపవలసిన దింకను గలదు, కాని దాని కిది సమయముగాదు, స్థలముగాదు. రామచంద్రమూర్తి సుగ్రీవున కుపకారముచేసి ప్రత్యుపకారము పొందెను. ఇది సహ్యము. అటుగాక వాలి యొద్దకు లక్ష్మణుఁ బంపి పిలిపించుకొని నా భార్యను రాక్షసుఁ డెత్తుకొనిపోయినాఁడు, నీవు వెదకి చెప్పుమని యడుగుట నీచతగాదా? అదియునుగాక దోషియై వధ్యుఁ డగు వానితో స్నేహముచేసి వెనుకఁ జంపవచ్చునా? ఎన్నివిధములఁ జూచినను రామ వాలి సఖ్యము సరియగునదికాదు.

క౦. వనచరవర్యులసన్నిధిఁ, బొనరించితి నేను బ్రతినఁ ♦ బూర్ణమనమునన్
ఘనబల! బాస యొనర్చియుఁ, జనునే నాయట్టివాఁడు ♦ చలియింపంగన్. ౪౭౪

ప్రతిన = ప్రతిజ్ఞను, బాస = ప్రమాణము.

తా త్ప ర్య ము.

నీ భార్యను హరించిన వాలిని జంపెదను, వానరరాజ్యమును నీ భార్యను నీ కిప్పించెదను, అని నేను ఈ వానరుల సమక్షమందుఁ బ్రతిజ్ఞ చేసితిని. నే నిట్లు నిండు మనస్సుతోఁ బ్రమాణముచేసి తప్పవచ్చునా?

కావున నా మిత్త్రుని కార్యము సాధించుటకై కూడ నిన్నుఁ జంపితిని - సుగ్రీవునితోడ నాకు మైత్త్రి కుదిరినను కుదరకున్నను నీవు తమ్ముని భార్యను బట్టినందునకు నీవు నాచే వధ్యుఁడవు - నీవు నిర్దోషివేయైనను నా మిత్త్రునికి నీవు విరోధివైనప్పుడు నాకును నీవు విరోధివే కావున నీవు వధ్యుఁడవే - ఇట్లు నిన్నుఁ జంపుటకు స్వతంత్ర కారణములేకలవు. ఇప్పుడో రెండును గలియుటచే మఱింత బలిష్ఠము లయ్యెను. నీవు తనకు విరోధివని సుగ్రీవుఁడు చెప్పినంతమాత్త్రముననే నేను నమ్మి నిన్నుఁ జంపలేదు. నా కన్నులయెదుట నా మిత్త్రుఁడు నా యాశ్రితుఁడు నాకు శరణాగతుఁడు మఱి యొకనిచేఁ జంపఁబడుచుండ నేనూరక సాక్షినై చూచుచుండుట ధర్మమా? ఇచ్చటను విభీషణుని రక్షించుటయందు రామచంద్రమూర్తి చెప్పిన వాక్యములు విశేషబలముతో సార్థకముగ నన్వయించుచున్నవి.

తే. పరులకును శరణాగతుఁ డరియుఁడైన నార్తుఁడైనను మఱి దృప్తుఁడైనఁగాని
యాత్మనాశంబునకు నోర్చియైనఁ గావవలయు శాస్త్రసువిశ్వాసభావులకును. ౪౭౫

తే. భయముచేనొండె మోహంబువలననొండెఁ, బ్రతిఫలాసక్తినొండె స్వబలముఁగోలఁది
ప్రాపుగోరిన వారిఁ గాపాడఁడేని, వాఁడు పాలియు నిహమునందుఁ బరము నందు. ౩౮౪
తే. తాను జూచుచు నుండఁగఁ దన్ను శరణుఁ జొచ్చినాతఁడు పరుసిచేఁ జచ్చెనేని
యా యనాథుఁడు రక్ష సేయని నృశంసునెల్ల సుకృతంబుఁగైకొని యేగువాఁడు. ౩౮౫
ఉ. కానఁ బ్రపన్నుఁడౌ పురుషుఁ గావకయున్న దురంతపాపముల్
మానకకల్గు, నారకఫలం బపకీర్తియుఁ దప్పదేమియున్
మేని బలంబు వీర్యమును మేకొను నాశము, గాన సద్యశ
స్థానము ధర్మనాకఫలదంబు నొనర్చెదఁ గండు వాక్యమున్. ౩౮౬
(యుద్ధకాండము)

సీ. నీవు పాలించు వ♦నీశైలధారిణు, లైక్ష్వాకులైన మా ♦ వగును గాదె
దుష్టశిక్షణమును ♦ శిష్టరక్షణమును బృథివీశునకు నెందు ♦ విధియ కాదె
యనుజునిభార్యాగృ♦హములాదిఁ గొని వానిఁ, గట్టువస్త్రముతోడ ♦ నెట్ట లేదె
తమ్మునిభార్యను ♦ దగిలినవానికి, శిక్ష వధం బని ♦ చెప్పఁ బడదె
ఆ. యతనితోడ నేను ♦ నగ్నిసాక్షికముగఁ, జెలిమి సేసి హితము ♦ సేయుటకును
బ్రతిన సేయ లేదె ♦ పల్కి బొంకఁగఁ జన్నె, యే దసత్య మిందు♦ నెఱుఁగఁజెపుమ.

తాత్పర్యము.

వాలి మనస్సునకు ఝటితిస్ఫురణమునకై మీఁదఁజెప్పిన విషయములను సంగ్రహముగఁ జెప్పుచున్నాఁడు.

నీ వేయడవులు కొండలు నీవని పాలించుచున్నావో యవి యిక్ష్వాకు వంశమునఁ బుట్టిన మావగునా కదా? అగునందు వేని నీవు మాకు సామంతుఁడవే కదా? దుష్టుల శిక్షించుట శిష్టుల రక్షించుట రాజునకు విధి యగునా కాదా? తమ్మునిభార్యను గృహమును సర్వముగొని యతనిఁ గట్టువస్త్రముతో నూరువెడలఁ గొట్టితివా లేదా? తమ్ముని భార్యతో సంగమించినవానికి శిక్ష వధమని శాస్త్రములు చెప్పుచున్నవా లేదా.

సుగ్రీవునితో నేను నగ్నిసాక్షికముగ స్నేహముచేసి యతనికిమేలు చేయుటకు ప్రమాణము చేసితినా లేదా? ముందు మాట యిచ్చి యసత్యమాడఁదగునా? ఇప్పుడు నేనుజెప్పిన దానిలో నేది యసత్యము చెప్పుము.

రామచంద్రమూర్తి యింతపట్టుదలగా నీవు తమ్ముని భార్యతో సంగమించితివి కావున నిన్నుఁ జంపితినని యొత్తియొత్తి చెప్పినపుడు తాను దుందుభితో యుద్ధము చేయుకాలమందు సుగ్రీవుఁడు నాభార్య తారతో రమింపలేదా? వాఁడు మాత్రము వధ్యుఁడుకాఁడా యని వాలి యాక్షేపించియుండవలెను. అది సరియైన యాక్షేపము కాదని వాలికిఁ దెలియును. తాను జచ్చినానని సుగ్రీవుని నమ్మకమని వాలి యెఱుగును, తాను జావనీలేయని కొండను గుహాద్వారమున వేసినాఁడనియే వాలిచెప్పిన దోషము. ఇట్లు తనచావు కోరెననియే వాలికిఁ గోపము, కాని తాను జీవించియున్నాఁ

డని నమ్మి తారను బట్టె నని వాలి యభిప్రాయముగాదు. ఈ కారణములచే వాలి ఈ ప్రశంస చేయలేదు.

కం. సన్నుతధర్మోపేతము, లిన్ని మహాకారణముల ♦ వృక్షచరేంద్రా !
నిన్ను వధించుటె ధర్మం, బన్నెఱిఁ దలపోయుమా మహాబలశాలీ! ౪౭౬

సన్నుతధర్మోపేతము = సజ్జనులచే స్తోత్రము చేయఁబడిన ధర్మముతోఁ గూడినది, అన్నెఱి = ఆ మర్యాదను, ఆ నీతిని.

తాత్పర్యము.

సత్పురుషులు మెచ్చు నిన్ని ధర్మకారణము లుండుటచేఁ గ్రోతిఱేఁడా! నిన్ను వధించుటయే ధర్మము. దానిని నీ వాలోచింపుము.

కం. ధర్మ మెఱింగిన మిత్త్రుఁడు, ధర్మచరిత్రునకు నెపుడుఁ ♦ దగు సాయపడున్
ధర్మజ్ఞుఁడ విది సి ఖిల,కర్మమునకుఁ బ్రాచితంబుఁగాఁ ♦ దలఁపు మదిన్. ౪౭౭

తాత్పర్యము.

ధర్మము తెలిసినమిత్త్రుఁడు ధర్మచరిత్రుఁడగు మిత్త్రునకు సహాయపడుటే ధర్మము. నీవును నీ ధర్మము తెలిసినవాఁడవే. ఇది నీపాపకర్మమునకుఁ బ్రాయశ్చిత్త మనుకొమ్ము.

ప్రాయశ్చిత్త తద్భవము పాచితము. నీవును స్నేహధర్మము తెలిసినవాఁడవే యనుటచే నీవు స్నేహము చేసినచోట నిర్వంచనముగఁ జేసితివో వంచన బుద్ధితోఁ జేసితివో యాలోచింపుము. నీ స్నేహితులు నీ కట్టివారో నా స్నేహితులు నా కట్టివారని భావము. వాలి రావణ స్నేహ ధర్మప్రకారము వాలి జీవించి యుండెనేని రావణునకు సహాయుఁడై వచ్చియుండవలెను.

(చూ. ఉత్తరకాండము. ౭౭౮-౭౭౯-౭౮౦ పద్యములు.)

కం. చారిత్రవత్సలంబులు, సూరిజనాంగీకృతములు ♦ సుజనాచరితో
దారము లగు మనుసూక్తులు, వీర! ప్రమాణములు నాకు ♦ వినుమా వానిన్ ౪౭౮

చారిత్ర వత్సలంబులు = సదాచారముల ముఖ్యముగాఁ జెప్పుచున్నవి. సూరిజనాంగీకృతములు = పండితు లగు వారిచే నంగీకరింపఁబడినవి. సుజనాచరితోదారము=సజ్జనుల నడవడిచే గొప్ప వైనవి. మనుసూక్తులు=మనువు చెప్పినమాటలు.

తాత్పర్యము.

సదాచారమును ముఖ్యముగా బోధించునవి పండితు లామోదించునవియు శిష్టజను లనుష్ఠానమం దుంచుకొనునవియు నగు మనుస్మృతి వాక్యములు కొన్ని చెప్పెదను వినుము.

అన్ని స్మృతులలో మనుస్మృతియే పరమప్రమాణగ్రంథము. దానికి విరుద్ధమైన దేదియు గ్రాహ్యముకాదు. దాని ననుసరించియే యా యా యుగముల పురుషుల శక్తికిఁ దగినట్లు యా ఋషులు స్మృతులు ప్రకటించిరి. ఇవి వ్రతములు ప్రాయ

శ్చిత్తములు మొదలగు వానికి సంబంధించినవేకాని సనాతన ధర్మములకు సంబంధించినవి కావు. రామచంద్రమూర్తి త్రేతాయుగము నాఁటివాఁడు గనుక నప్పటికి మనుస్మృతి పరమప్రమాణము కావున దానిలోని వాక్యములను రామచంద్రమూర్తి తన చర్యకుఁ బ్రమాణములుగ నుదాహరించుచున్నాఁడు.

—♦ శ్రీరాముఁడు వాలికి ధర్మశాస్త్రవాక్యంబులు చెప్పుట. ♦—

కం.జనములు పాపముఁ జేసియు, జననాథులచేతఁ దాము ♦ శాసితు లగుచున్
ఘనసుకృతాత్ముల రీతిని, జనుచుందురు నాకవిభుని♦సదనంబునకున్. ౪౨౯

తాత్పర్యము.

జనములు పాపము చేసినను రాజుచే శిక్షింపఁబడిరేని వారాపాపము లనుభవింప నరకమునకుఁ బోక యా పాపములు చేయని పుణ్యాత్ములవలె నింద్రలోకమునకుఁ బోవుచుందురు.

చేసినపాపము రాజదండముచే నశించును. ఇక్కడ శిక్షింపఁ బడఁడేని యమదండ మనుభవింపవలయును. రెంటిలో నొకటి తప్పదు.

రాజనిర్ధూతదండాస్తు కృత్వా పాపాని మానవాః
నిర్మలాః స్వర్గమాయాంతి సంతః సుకృతినో యథా. మను.౮-౩౧౮

కం.చోరుఁడు చౌర్యముఁ జేసిన, భూరమణునిచేత శిక్షఁ ♦ బొరసియొ కాదే.
నారఁ బ్రవిముక్తుఁ డగుచునొ, వీరమణీ! పాపమునను ♦ విడువంబడెడిన్. ౪౩౦

తాత్పర్యము.

దొంగ దొంగతనము చేసెనేని రాజుచేత దండింపఁబడవలయును. లేదా రాజు విచారించి వీఁడు నిర్దోషి యని వదలపెట్టవలయును. ఈ రెంటిలో నేదైనను వానిని బాపవిముక్తునిఁ జేయును.

కం దోసముఁ జేసినవారిని, శాసింపఁగ నేరనట్టి ♦ జడమతి ఱేఁ డా
దోసమును దాను బొందును, వాసవసుత ధర్మవిధము♦ వచ్చునె తెలియన్? ౪౩౧

తాత్పర్యము.

పాపము చేసినవారిని దండింపఁజాలని మతిహీనుఁడైన రాజాపాపమును దాను బొందును. వాలీ! ధర్మవిధము తెలిసినదా? నేను దండింపకపోయితినా నీవు చేసిన పాపము నన్ను సంక్రమించును.

కం.స్ఫీతయశుం డగు మా మాంధాతయు శ్రమణుం డొకండు ♦ ధర్మము చెడ నీ
రీతిని పాప మొనర్చిన, నాతని దండింపఁడా భ♦యంకరలీలన్ ? ౪౩౨

స్ఫీతయశుఁడు = కీర్తిచేఁ బ్రసిద్ధికెక్కినవాఁడు. మా మాంధాత = మా వంశపూర్వుండగు మాంధాతయను మహారాజు. శ్రమణుండు = సన్న్యాసి, నీ రీతిని= నీవు చేసినట్లు.

తాత్పర్యము.

ధర్మాత్ముఁడని కీర్తివహించిన మావంశమునఁ బూర్వుఁడగు మాంధాత యను

మహారాజు సన్న్యాసియొక్కఁడు నీవుచేసిన పాపమువంటి పాపమునే చేయఁగా భయంకరవిధముగ నతని దండింపలేదా. అనఁగాఁజంపలేదా? సన్న్యాసియని విడిపించెనాయని భావము. సన్న్యాసియే దండింపఁబడినపుడు నీ వనెంత?

ఉ. ఎత్తనగోలునంద వసు♦ధేశ్వరు లారయలేక ధర్మముల్
మత్తిలి కొంద ఱుండియును ♦ న్యాయవిమర్శనవేళ నిండుజా
గ్రత్తు సహించి పాపజన♦కాండములం దగురీతి దండనం
బత్తఁగఁ జేసి పాపనిచ♦యంబు శమింపఁగఁ జేయురే కపీ! ౮౫౩

ఎత్తనగోలునంద=మొట్టమొదటనే, వసుధేశ్వరులు=రాజులు, ఆరయలేక=తెలిసికోలేక, మత్తిలి=మదించి, జాగ్రత్తు=హెచ్చరిక, సంస్కృతమున నిది జాగ్రత్ శబ్దము. హ్రస్వంబుమీఁది హల్లుల కుత్వోత్వంబులగు. దిక్=దిక్కు, దృక్=దృక్కు, కించిత్=కొంచిత్తు, అను సు. వ్యా. తత్సమ ౭౯ వ సూత్రప్రకారము జాగ్రత్తు ఆయెను. జాగ్రత్+త=జాగ్రత్త అనియుఁ జెప్పవచ్చును. అప్పుడు శూరత యోగ్యత లోనగు వాని వలె నని తెలియనగు, అత్తఁగన్ = పొందునట్లు, పాపనిచయంబు = పాప సమూహము.

తాత్పర్యము.

కొందఱు రాజులు మదించియుండి ప్రారంభమందే ధర్మ మిది యధర్మ మిది యని తెలియలేక యది విమర్శకు వచ్చినపుడు హెచ్చరికగలవాఁడై బుద్ధిపూర్వకముగ నధర్మమార్గమందు నడువనోల్లక పాపపుజనులగుంపుల దండించి పాపము శమించునట్లుచేయుట లేదా! ఎన్నిదినాలుగనో నే నీ కార్యము చేయుచున్నానే! ఇన్నాళ్లూరకుండి యిప్పుడు దోష మెంచెదవేల? యనునో యను వాలి మాట కిది ప్రత్యుత్తరము.

ఒక దొంగ నూఱుదొంగతనములుచేసి నూటయొక్కటవదొంగతనమందుఁ జిక్కెనేని వానిని న్యాయాధిపతి దండింపఁ బూనినపుడు నే నిన్నాళ్ళుగా దొంగిలించుచుండఁగా నూరకుండి యిప్పుడు దండించెదవేల? యను నధికారము లేదు.

కం. కానఁ బరితాప మందకు, మానిత నీ వధము ధర్మ♦మార్గముఁ దలఁపన్
దీనన్ మాకు స్వతంత్రత, వానరవర! లేదు శాస్త్ర♦బద్ధుల మగుటన్. ౮౫౪

తాత్పర్యము.

ఈకారణముచే నీవు వ్యసనపడవలసిన పనిలేదు, నిన్ను నేను ధర్మమార్గమందు నిలిచి ధర్మవిధముగనే చంపితిని, ఈకార్యమునందు మాకు స్వాతంత్ర్యములేదు. ఏలయన మేము శాస్త్రబద్ధులము, శాస్త్రమునందుఁ జెప్పినట్లు మేము చేయకతప్పదు.

ఈ విషయమునఁ గొన్ని మనుస్మృతి వాక్యము లు వ్రాయఁబడుచున్నవి.

యావా నవధ్యస్య వధే తావా న్వధ్యస్య మోక్షణే
అధర్మో నృప తే ర్దృష్టో ధర్మస్తు వినియచ్ఛతః॥మను ౯-౨౪౯

అవధ్యుని వధించుటచే నెంతపాపము గలుగునో యంతపాపము వధ్యుని విడుచుటచేఁ గలుగును.

అధార్మికం త్రిభి ర్న్యాయై ర్నిగృహ్ణీయాత్ప్రయత్నతః
నిరోధనేన బంధేన వివిధేన వధేనచ॥

అధర్మమందు వర్తించువారిని వారివారి దోషములకొలఁది మూఁడువిధముల దండింపవలయును. అవి యేవనినఁ జెఱసాలయందుంచుట, కాళ్ళకుఁ జేతులకు గొలుసులువేసి కట్టివేయుట, నానావిధముల వధించుట. మను ౮-౩౧౦.

నిగ్రహేణహి పాపానాం సాధూనాం సంగ్రహేణచ
ద్విజాతయ ఇవేజ్యాభిః పూయంతే సతతం నృపాః॥ మను- ౮-౩౧౧

దుష్టులగువారిని శిక్షించుట, సజ్జనుల రక్షించుట వీనిచే రాజులు యజ్ఞములుఁ జేసిన బ్రాహ్మణులవలెఁ బవిత్రు లగుదురు.

అదండ్యాన్ దండయన్ రాజా, దండ్యాంశ్చైవాప్యదండయన్
అయశో మహదాప్నోతి నిరయం చాధిగచ్ఛతి॥

దండింపరాని వారిని దండించినను దండింపవలసినవారిని విడిచినను ఆరాజునకు మిగుల నపకీర్తి నరకము కలుగును.

అనుగ్రహంచ మిత్రాణా మమిత్రాణాంచ నిగ్రహమ్
సంగ్రహంచ త్రివర్గస్య, శ్రేయ ఆహుర్మనీషిణః॥

భార- ౧౨-౨౮౭-౧౬

మిత్రుల ననుగ్రహించుట- శత్రువుల నిగ్రహించుట, త్రివర్గ సంగ్రహము వీనిచే రాజులకు శ్రేయస్సుగలదు.

చం. అదియును గాక యొండొకమ♦హత్తరహేతువు విన్ము దాన నీ
మది గల సందియంబు నతి♦మన్యువు పాయును, నీ వెఱుంగమిన్
బదరుచుఁ గాఱు లాడుట ల♦వంబును నాయెదఁ గిన్కవేసియున్
గొదుకును గాని లేదు, కపి♦కుంజర నమ్ముము నాదువాక్యముల్. ౪౮౫

మహత్తరహేతువు = మిగుల గొప్ప కారణము- అతిమన్యువు = నాయందుఁ గల విస్తారకోపము- పదరుచున్ = కోపపడుచు- కాఱులు = పరుషవాక్యములు.

తాత్పర్యము.

మీకు సంధ్య జపము తర్పణము లోనైన వున్నట్లు తెలియుటచే నీవు మనుష్యుఁడవని మనుష్యుల కన్వయించు ధర్మశాస్త్రవాక్యములు చెప్పితిని. నేను క్రోఁతిని కావున మృగమను- మృగములందు నీవు చెప్పిన వావి వరుసలు లోనైన వెక్కడివి? నీవు చెప్పిన శాస్త్రవాక్యములు నాయం దన్వయింపవు. అనెదవేని దానికిఁ దగిన సమాధానమే చెప్పెదను. ఆ విధముగఁ జూచిన నిన్నుఁ జంపుటకు గొప్ప కారణము గలదు. అది వినుము. నీసందేహము తీఱును. నామీఁది కోపము తొలఁగును.

నీవు మృగ మగుటచే నజ్ఞానమునఁ గోపించి పరుషములాడితి వని నా మనస్సునందుఁ గోపములేదు. కొంచుకును లేదు. నీవు కోపించితి వని నేను గోపింపను. నా మాట నమ్ముము.

క్షంతవ్యం ప్రభుణా నిత్యం క్షిపతాంకారిణాం నృణామ్,
బాలవృద్ధాతురాణాం చ కుర్వతా హితమాత్మనః॥ మను ౮-౩౧౨

తనయెదుట కార్యార్థమై వచ్చి యోడినవారును బాలురు వృద్ధులు రోగులు వారి వారి బాధకొలఁది తన్నాక్షేపించి తిట్టినను దనమేలుకోరు రాజు కోపింపరాదు వారిని క్షమింపవలెను.

యఃక్షిప్తో మర్షయ త్యార్తై స్తేన స్వర్గే మహీయతే,
యస్త్వైశ్వర్యా న్నక్షమతే నరకం తేన గచ్ఛతి॥ మను ౮-౩౧౩

నొప్పిపడినవారు త న్నాక్షేపించినను అట్టి యాక్షేపములను నోర్చుకొను రాజు స్వర్గమునఁ బూజ్యుఁడగును. ఐశ్వర్యగర్వముచే నోర్వనిరాజు నరకముల పాలగును.

సీ. వలపన్ని యురు లొడ్డి♦వది త్రవ్వి యోదంబు, లేర్పాటుగా వించి ♦ యెన్ని యెన్ని
యేనివిధంబుల ♦ నేమృగంబుల నైన, నెదు రుండి యేని మా ♦ టిడుచు నేని
భయపడి పడియున్నఁ ♦ బరువు వాఱుచు నున్న, నమ్మి నిల్చియయున్న♦నిమ్ముగాను
మా ర్గంబున నున్న ♦ మాంసాభిలాషులు, మానవుల్ చంపుట♦గానవొక్కొ-
తే. పాప మయ్యెడఁ గలిగెనే ♦ పరమధర్మ, కోవిదులు వేఁట పో రొకో♦క్రోఁతి! నీవు
నేను క్షత్రియుఁడను గాన ♦ నీవు రణము, సలిపినను జల్పకున్నను♦ జంపవచ్చు.

ఉరులు = ఉచ్చుత్రాళ్లు, ఒడ్డి=పఱచి, వది=మృగముల పట్టుటకై తీయుగుంత, ఓదంబులు=ఏనుఁగులు, ఎద్దులులోనగు పెద్ద జంతువులను బట్టుటకుఁగాను పెద్ద గుంతలు దీసి దానిమీఁద గుంతకానరానట్లు తడకలు సన్నకంప లేవైన వేసి నేలతోపాటు సమముగ మట్టపఱిచి దానిపైఁ బచ్చిక మొలచునట్లు చేయుగుంతలు. ఆ పచ్చికకై వచ్చి యేనుఁగు లాగుంతలలో దిగఁబడును. మాటు = అడ్డము, మాంసాభిలాషులు= మాంసమునందుఁ గోరికగలవారు, పరమధర్మకోవిదులు=ధర్మములు తెలిసిన యుత్తమ పురుషులు.

తా త్ప ర్య ము.

మాంసభక్షణమం దాసక్తి గలజనులు, మృగములను జంపుటకై వలలు పన్నుట లేదా? ఉరులు పఱుచుటలేదా, పల్లములు పెద్దగుంతలు దీయుటలేదా? మఱియెన్ని యో యుపాయముల నేమృగములనైన నెదురుగానుండి యైనను, జాటుగా నుండి యైనను, భయపడి నేలఁ గూలఁబడియున్నను, బరువెత్తుచున్నను, నమ్మి యెదురుగా నిలఁబడి యున్నను,మఱియొకప్రక్కఁ జూచుచున్నను నెన్ని మాయోపాయములఁ జంపుచున్నను వారిని దోషమంటునా? లేదుకదా! అట్లుండ రాజులు, విశేషధర్మజ్ఞానము గల రాజులు వేఁటపోరా? వేఁట రాజులకు విధింపఁబడలేదా? వేఁటవలన రాజులకు దోషము గల దని యెందైనఁ జెప్పఁబడెనా? రాజు లీమృగమును జంపవచ్చును, దీనిని జంప

రా దను నియతికలదా? కావున నేను రాజును, నీవు మృగమవు - నిన్ను నేవిధముగఁ జంపినను దోషములేదు. ఇందు నాకు స్వధర్మహాని కలదేమో చెప్పుము.

శత్రూణాం యా వధే వృత్తిః, సా మృగాణాం వధే స్మృతా
రాజ్ఞాం మృగ! న మాం మోహా త్త్వం గర్హయితు మర్హసి.
అచ్ఛద్మనా మాయయాచ మృగాణాం వధ ఇష్యతే
స ఏవ ధర్మో రాజ్ఞాంతు, యద్విత్వం కిన్ను గర్హసే.
ప్రమత్త మప్రమత్తంవా, వివృతం ఘ్నంతి చౌజసా
ఉపాయై ర్వివిధై స్తీక్ష్ణైః కస్మా న్మృగ! విగర్హసే.          భార. ఆది

శత్రువుల నేవిధముగఁ జంపవచ్చునో మృగముల నావిధముగనే రాజులు చంపవచ్చును. ఓ మృగమా! యేల నన్నజ్ఞానముచే దూషించెదవు.

మాయచేఁ గాని మాయ లేకగాని మృగములఁ జంపవచ్చు నని శాస్త్రములు చెప్పుచున్నవిగదా - రాజుల కదియే ధర్మము. ఏల నన్ను దూషించెదవు?

హెచ్చరిక తప్పియుండినను హెచ్చరికతో నున్నను-బయలనున్నను గఠినములైన నానోపాయములచేఁ దమ పరాక్రమమునఁ జంపుదురు. ఓ మృగమా! నన్నేల దూషించెదవు? ఇవి పాండురాజు వాక్యములు.

ఈ విషయ మిందు ననుసంధింపఁ దగును. తన కుపయోగపడు మృగమును మాత్రమే చంపవలయును, తక్కినవానిని జంపరా దను నియమము వేఁటయందు లేదు. పోతు పెంటి కలిసియున్నప్పుడు మాత్రము చంపరాదు. ఈ కారణములచే వాలి యితరునితో యుద్ధము చేయుచుండఁగాఁ గొట్టినది దోషముగాదు. వాలిని శ్రీరామచంద్రమూర్తి చంపుట నిష్కారణ మనువారు లేరు గాని చాటుగ నుండి చంపుట యాయన పరువునకుఁ, బౌరుషమునకుఁ దగినది కా దని కొందఱ యభిప్రాయము. ఈ యాక్షేపించువారు సాధక బాధకముల రెంటిని నాలోచించి చెప్పువారు గారు-వధ్యుఁడైన వాని నే విధముగఁ జంపినను దోషము లేదు. దీనిని బ్రభువు లందఱు నాఁటికి నేఁటికి నంగీకరించిన విషయమే.

రామచంద్రమూర్తి చేసినది యధర్మకార్యమే యైయుండినయెడల "గీ॥ సార ధర్మాత్ముఁడును సత్యసంధుఁడేని। రామచంద్రుండు దశరథ రాజసుతుఁడు। పౌరుష మునకు నప్రతిద్వంద్వుఁడేని। శరమ! యీ రావణాత్మజు సంహరింపు॥" యుద్ధ.౨౧౧౨ అని లక్ష్మణుఁడు చెప్పినప్పుడు ఇంద్రజిత్తు చావకుండవలెను.

కావున రామచంద్రమూర్తి చేసినది ధర్మవిరుద్ధకార్యము గాదు. ఇఁక నౌచిత్యము విచారింతము.

ఒక కార్యము రెండువిధములఁ జేయఁగూడినపుడు స్వకార్యహాని రాకుండఁ గార్యము చేయువాఁడు బుద్ధిమంతుఁడా? సర్వవినాశము చేసికొను మార్గమునఁ బోవు

వాఁడు బుద్ధిమంతుఁడా? రెండవవాఁడు బుద్ధిమంతుఁ డని బుద్ధిగలవా రెవ్వ రనరు. "నిష్ఫలం క్లేశ బహుళం సందిగ్ధఫలమేవచ, న కర్మ కుర్యా న్మతిమాం, త్సదా వై రాను బంధిచ" ఫలము లేనిది- విశేషకష్టముతోఁ గూడినది. ఫలము కలుగునో కలుగదో యను సంశయముగలది- ఎప్పుడు వైరానుబంధముగలది యగుకార్యము బుద్ధిమంతుఁడు చేయరాదు. ఇప్పుడు రామచంద్రమూర్తి త్రొక్కిన మార్గముగాక మఱియొక మార్గమునఁ బోయియుండిన నిన్ని దోషములు ప్రాప్తించి యుండును.

రామచంద్రమూర్తి వాలికి భయపడి యెదిరించి యుద్ధము చేయలేక చాటుగ నుండి చంపె నందురా యిది యవివేకప్రసంగము. ఎలన:—ఎదురుగా వచ్చినచో వాలి రామచంద్రు నేమి చేయఁగలఁడు? అతనిమూల దూరముగ నుండువాని నేమియుఁ జేయ జాలఁడు? ఇంతవఱకు వాలి గెలిచినవారిని ద్వంద్వయుద్ధమందు గెలిచెనేకాని ధనుర్ధారులతో యుద్ధము చేసికాదు. ద్వంద్వయుద్ధమం దా వాలికి కాశక్తిగలదు. దేహము కలియక దూరమువనుండి చేయు యుద్ధమం దది యేమియుఁ జేయఁజాలదు. కావున దానికి భయపడవలసినదిలేదు. బ్రహ్మాస్త్రము పాశుపతాస్త్రము నారాయ ణాస్త్రము కంటె నా తుచ్ఛమాలిక బలిష్ఠమైనదా? భుజబలమందు నస్త్రబలమందు వాలికంటె రామచంద్రమూర్తి మిగుల బలిష్ఠుఁ డని సుగ్రీవుఁడు పరీక్షించి నిశ్చ యించుకొనెను, కావున వాలికంటె రామచంద్రమూర్తి బలహీనుఁడు కాఁడు. అది యునుగాక రామచంద్రమూర్తియొంటిగాఁడు కాఁడు. తనయంతటివాఁడు లక్ష్మణుఁడు, హనుమదాదులు నలువురు వానరులు సహాయులుగాఁ గలవాఁడు. ఇందఱకంటెను వాలి బలవంతుఁడా? మొదటిదెబ్బకు లక్ష్మణుఁడే వాలిని బలివాఱియుండును. కావున స్వబలసంపత్తి - అస్త్రసంపత్తి - సహాయసంపత్తిగల రామచంద్రమూర్తి వాలికి నొకనికి వెఱచె ననుటకంటె బాలభాషణము వేఱొండు లేదు.

ఇంతకు రామచంద్రమూర్తి వాలిపై నస్త్రము వేయలేదు. తనయొద్ద నున్న బాణములలో నుత్తమమైనది వేయు లేదు. రెండవరకమో మూఁడవరకమో బాణమును బ్రయోగించెను. ఎట్లన:- యుద్ధకాండమున రామకుంభకర్ణ యుద్ధమందు (౧౪౬-౧౪౮ప)

"ఘటకర్ణుం డిటు పల్క రాముఁడు సుపుంఖస్ఫార వజ్రద్యుతో త్కటబాణంబులఁ జిమ్మెఁ దద్ధరిని నాతం డేమి కంపింపమిన్, పటుసారంబుల వాలినిం దునుము నబ్బాణం బులన్ వైచె నచ్చటులాస్త్రంబులు నించుకే నతని నేఁచన్ లేద" యని సాలవృక్ష ములఁ గొట్టిన బాణము వాలిని గొట్టిన బాణము కుంభకర్ణుని నేమియు బాధింపకుం డుటచే నంతకంటెఁ దీవ్రబాణమును గుంభకర్ణునిపై బ్రయోగించె నని చెప్పఁబడెను. దీనివలననే రామ వాలుల బలతారతమ్యము తెలియఁగ నగు. కావున రామచంద్రమూర్తి చాటుగ నుండి కొట్టుటకు వేఱొక కారణ ముండవలెను. అట యౌచిత్యమే. ఎట్లన:—

౧ లక్ష్మణ హనుమదాది సహితుఁడై రామచంద్రమూర్తి యెదురుగ బహి రంగముగ వచ్చియుండె ననుకొనుఁడు. వాలి భయముచేతనో భక్తిచేతనో తటాలున

రెండు చేతులు జోడించి వచ్చి పాదములపై శరణు శరణని పడ ననుకొనుఁడు. అప్పుడు శరణాగత రక్షణవ్రతము కాపాడుకొనవలయునా? విడువవలయునా? వ్రతమునే కాపాడుకొనవలయును. అప్పుడు వాఁడు చేసిన పాపమున కేమిశిక్ష విధించినట్లు? శిక్షవిషయ మట్లుండనిండు. సుగ్రీవున కేమి సాహాయ్యము చేసినట్లు? తన కార్య మేమి సాధించుకొన్నట్లు? వాలి సీతను దెచ్చుట కాని పని యని యిదివఱకే చెప్పఁబడెను. ఇంతకుఁ జంపఁబడవలసినవాఁడు రావణుఁ డొక్కఁడేకాఁడు. ఈవిధముగఁ జూచిన తన కార్యము, సుగ్రీవుకార్యము, దేవతాకార్యము మూఁడును బాడుచేసిన వాఁడై చపలచిత్తుఁడు, దూరాలోచన లేనివాఁడు, స్వకార్య పరకార్య విధ్వంసకుఁడని రామచంద్రమూర్తి బిరుదు సంపాదించియుండును. ఇట్లు రామచంద్రమూర్తి యీ యపూర్వ బుద్ధిమంతులకుఁ దృష్టికరముగ వర్తించి స్వకార్యము పరకార్యము పాడు చేసికొనియుండెనేని యప్పుడు రామచంద్రుఁడు చాల పౌరుషశాలి యని మెచ్చి యుందురు కాఁబోలు.

౨ రామాదులను జూచి భయపడి వాలి కిష్కింధలోనికిఁ బరువెత్తె నను కొందము. అప్పుడు గ్రామములోనికిఁ బోలేని రామచంద్రమూర్తి గ్రామము వెలుపల నెన్నాళ్ళని కూర్చుండియుండును. అట్లు చూచినను సర్వవైనాశకత్వము తప్పదు.

3 తారను బంపించి పతిభిక్ష వేఁడఁజేసె ననుకొందము. అప్పుడును సర్వవైనాశకత్వము తప్పదు. ఇంతయేల, వాలి జీవించియుండినచో రామకార్యము, సుగ్రీవకార్యము, దేవతాకార్యము, అవతారప్రయోజనము, సర్వము పాడైయుండును.

౪ రామ సుగ్రీవులకు వలె వాలి రావణులకును మైత్రి గలదు. కావున రావణునకు వార్త నంపి నీవు నీ సేనలతో రమ్ము, నేను నా సేనలతో వచ్చెదను, అని యొక ప్రక్క రావణుఁడు, ఒకప్రక్క వాలి సేనలతో లంక యందో కిష్కింధయందో ముందు వెనుకలఁ దాఁకిన రామ లక్ష్మణులు, నేవురు వానరు లెంతకాల మని యందఱతో యుద్ధము చేయుదురు? అక్కడ సీత గతియేమి?

కావున రామచంద్రమూర్తి బహిరంగముగ వచ్చి యుండెనా వాలిని జంపి యుండఁడు. సుగ్రీవుని కార్యము, తన కార్యము పాడుచేసికొని యుండును. కావునఁ గనుమఱుఁగున నుండి కొట్టినదే సరియైన కార్యము.

ఇట్టిదే భారతయుద్ధంబున జరిగెను. సైంధవవధనాఁడు భూరిశ్రవుఁడు సాత్యకిని గ్రిందఁ బడవైచి యతని శిరస్సు ఛేదింపఁ గత్తి పైకెత్తెను. ఆ సమయంబున మఱుఁగున దూరంబున నుండిన యర్జునుఁడు భూరిశ్రవుని చేతిని నఱకెను. అప్పుడు భూరిశ్రవుఁ డిప్పుడు వాలి రామచంద్రుని దూషించినట్లే,

నృశంసం తవ కౌంతేయ కర్మేదం కృతవానసి
అపశ్యతో విషక్తస్య య న్మేఛిత్వాం బాహు మచ్ఛినః.

అని నాకుఁ గానరాకుండ మఱుఁగున నుండి నా చేతిని దెగఁగొట్టి నీచకార్యము చేసితి వని దూషించెను.

అప్పు డర్జునుఁ డీ సమాధానము చెప్పెను.

మా నిమిత్తమై సాత్యకి మా పక్షమునఁ దన ప్రాణములకుఁ దెగించి యుద్ధరంగమునకు వచ్చెను. ఎవరి పక్షమున నెవరు వత్తురో వారిని రక్షింపవలసిన భారము ఆ పక్షమువారియం దున్నది. యుద్ధము చేసి చేసి యలసి యున్నవానిని నా కన్నుల యెదుట నీవు వధించితివేని ఆ దోష మూరకచూచుచున్న నాకుఁ గలుగును. కావున నతని రక్షింపవలసినది నాకు విధి- కావున నీచేఁ జావకుండ నతని రక్షించితిని. ఇతనికింకను సహాయులు గలరుగదా- వారు నా మీఁదికి వత్తురేమో యని హెచ్చరికగా నుండవలసినది నీకు విధి - నీవు ప్రమాదపడిన ఫల మనుభవింపుము. నేను జేసినది యధర్మము కాదు. ఆపదలందు మిత్రరక్షణ మధర్మ మగునా? యని ప్రత్యుత్తర మిచ్చెను.

ఆ సందర్భములే యిందును గాననగు. రామచంద్రమూర్తి యుద్ధమునకుఁ బొమ్మని ధైర్యము చెప్పకున్న సుగ్రీవుఁడు పోయియుండఁడు. రామచంద్రమూర్తి రక్షింపఁగలఁడు, రక్షించు నను నమ్మకము చేతనే పోయెను. రామచంద్రమూర్తి కేవలము సుగ్రీవుని కార్యార్థమై కాదు, తన కార్యము గలదు గనుకనే పొమ్మనెను. ఇట్లు తనకార్యమునకై పోయిన మిత్రుని రామచంద్రమూర్తి రక్షింపక యెట్లుండఁ గలఁడు. అర్జునుఁడు చాటుగానుండి కొట్టినది తప్పుగాదని ధర్మమే యని యిట్లుచెప్పెను.

సంగ్రామాణాంహి ధర్మజ్ఞ! సర్వశాస్త్రార్థపారగ!

న చాధర్మ మహం కుర్యాం జానంశ్చైవహి ముహ్యసే.

యుద్ధధర్మము దెలిసిన సర్వశాస్త్రార్థ పారంగతుఁడా! నే నేల యధర్మము చేయుదును? ఇది తెలిసికూడ నీవు మోహపడుచున్నావు.

యద్యహం సాత్యకిం దృష్ట్వా, తూష్ణీ మాసిష్య ఆహవే

తతస్తేన వియోగశ్చ ప్రాప్యం నరక మేవచ.

సాత్యకి యుద్ధమందుఁ జచ్చుచుండఁగా నే నూరక చూచు చుండితినేని నాకు నరకము తప్పదు అని చెప్పెను.

రామలక్ష్మణులు సుగ్రీవునకు సహాయులై నిన్నుఁ జంపవచ్చి యున్నా రని తార ముందే చెప్పెను గదా! ఏల హెచ్చరిక కలవాఁడై యుండరాదు? ఏల తత్ప్రాంతముల నిపుణముగా శోధించియుండరాదు? ఏల వానరులఁబంపి వారిని వెదకించి యుండరాదు? సందేహవేళ మందేహుఁడై యుండవచ్చునా? మఱియొక విషయ మాలోచింపవలసియున్నది.

శ్రీరామచంద్రమూర్తి హనుమంతుని బ్రిపథమమునఁ జూచిన వెంటనే తన కార్య మితనివలనఁ గాఁగల దని యాయన తెలివితేటలఁబట్టి నిశ్చయించుకొనెను.

కాని యీయనవలనఁ గార్యము చేయించుకొను టెట్లు ? ఆంజనేయుఁడు స్వతంత్రుఁడు గాఁడు. సుగ్రీవుని మంత్రి. ఆయన యాజ్ఞలేక యే పనియుఁ జేయఁజాలనివాఁడు. హనుమత్సాహాయ్యము కావలసియుండెనేని సుగ్రీవసఖ్య మత్యావశ్యకము సుగ్రీవ సఖ్య మావశ్యకమేని వాలి వధ యనివార్యము. కిష్కింధాకాండ రంగమున మొదటి వాఁడు కడపటివాఁడు హనుమంతుఁడే.

ఉ. చాల వ్రణామయార్తునకు ♦ శస్త్రచికిత్సకునట్లు ధారిణీ
పాలుఁడు దుర్లభం బయిన♦బంధురధర్మము జీవరక్ష భ
ద్రాళియుఁ గూర్చు లోకులకు ♦ నారసి వారది మొల్లకుండినన్
బాలన సేయఁగాఁ బ్రభువు ♦ పాల్పడి యుండుట వానరోత్తమా! ౪౩

వ్రణమయార్తునకున్ = పుంటిరోగముచే బాధపడువానికి- శస్త్రచికిత్సకునట్లు = కోసి వైద్యము చేయువానివలె.

తాత్పర్యము.

పుండువలన బాధపడు వానికి వైద్యునివలె రాజు లోకులఁ బాలింపవలసినది తనకుఁ గార్యముగా నేర్పడియుండుటచే వారి కిష్ట ముండినను లేకుండినను నేది మిగుల ధర్మమో జీవుల రక్షింపఁజాలునో మేళ్లను సమకూర్చునో యవి చేయవలయును. వ్రణరోగి తత్కాలబాధ కోర్వలేక యిష్టపడకుండినను వానిమేలు కోరువాఁడైనచో శస్త్రచికిత్సకుఁడు దానిని గత్తులతో ఛేదించి రోగము మాన్పును. అట్లులే నీ విషయమందును నీ మేలు కోరియే వర్తించితి నని తెలిసికొను మని భావము.

స్వే స్వే ధర్మనివిష్టానాం, సర్వేషా మనుపూర్వశః
వర్ణానా మాశ్రమాణాంచ, రాజా సృష్టోభిరక్షితా.

వర్ణాశ్రమ ధర్మముల రక్షించుటకే రాజు సృష్టింపఁబడెను.

ఉ. కావునఁ జంపరాదు క్షితి♦కాంతునిఁ, దిట్టఁగ రాదు, విప్రియం
బే విధి నాడ రాదు, పరి♦హేలనముం బచరింప రాదు, త
ద్భూవిభుఁ డొండు చెప్పఁ బనిఁ♦బూని తిరస్కృతు లాడ రా, దిలన్
దేవతలే నరాకృతిని♦ద్రిమ్మరు చుందురు ధర్మరక్షకై. ౪౪

పరిహేలనము = ఎగతాళి, పచరింపరాదు = చేయరాదు.

తాత్పర్యము.

ప్రజల మేలునకయియే రాజులు సంచరింతురు. కార్యములు చేయుదురు. వారు చేయునది దోషుల కనిష్టముగఁ దక్కినవారి కిష్టముగ నుండును. తమ కప్పటి కనిష్టమని దోషులు రాజులను జంపరాదు. తిట్టరాదు. అప్రియము లాడరాదు. పరిహసింపరాదు. అతఁడు చెప్పినదానిని ధిక్కరింపరాదు. ఏలన దేవతలే ధర్మరక్షార్థము మనుష్యరూపముల సంచరింతురు.

బాలోఽపి నావమంతవ్యో, మనుష్య ఇతి భూమిపః
మహతీ దేవతా హ్యేషా, నరరూపేణ తిష్ఠతి.

బాలుఁ డని మనుష్యుఁ డని రాజు నవమానింపరాదు. గొప్ప దేవత యగు విష్ణు వే మనుష్యరూపముతో నుండును.

ఉ. కేవలరోష మూని పరి♦కింపక యింతయు ధర్మసూక్ష్మముల్
వావిరి నన్నుఁ దిట్టితివి ♦ నాల్కకు వచ్చినయట్లు క్రోఁతిరా
జా! విను తాతదండ్రుల ప్ర♦శస్తపుధర్మము వీడనైతి, వా
తీవిరి పాయ నన్ను నిఁకఁ ♦ దిట్టెదె తిట్టుము, మెచ్చు మెచ్చినన్. ౪౮

వాతీవిరి = నోటి దురద.

తా త్ప ర్య ము.

కొంచెమైన నీవు ధర్మసూక్ష్మము నాలోచింపక నిన్నుఁ గొట్టితి నన్న కోపము నొకటినే ప్రధానముగ నుంచుకొని నీ నోటికి వచ్చినట్లు మాటలాడితివి. విను, నేనో నా తాతలు తండ్రు లేధర్మమందు సంచరించిరో యా ధర్మమును వదలినవాఁడఁగాను- ఇది నా వృత్తాంతము- నా యభిప్రాయము చెప్పితిని. ఇకఁ దిట్టెదవా తిట్టుము- మెచ్చెదవా మెచ్చుము- నేను వల దనను- రోషింపను- సంతోషింపను.

చం అనుచును రామభద్రుఁ డిటు ♦ లాడినవాక్యము లాలకించి యా
వనచరవల్లభుండు నృప♦వల్లభుదోషము లేమిఁ జూచి తా
మనమునఁ జాలఁ గుందెఁ గొఱ♦మాలినకాఱులు ప్రేలితిం గదా
యనఘు నటంచు, ధర్మవిధి♦యందు సునిశ్చితుఁ డౌచు ని ట్లనున్. ౪౯

కొఱమాలిన కాఱులు = నిష్ప్రయోజనములైన పరుష వాక్యములు- ప్రేలితిని = వదరితిని.

తా త్ప ర్య ము.

ఈ ప్రకారము రామచంద్రమూర్తి చెప్పఁగా వాలి విని యాయన యందు దోషము లేదని తెలిసికొని దోషహీనుని నిష్కారణముగఁ బ్రయోజనముమాలిన నిష్ఠురవాక్యము లాడితినిగదా యని పరితపించెను. ధర్మమార్గమందు నిశ్చయమైన మనస్సుగలవాఁడై యి ట్లనెను.

—♦ వాలి శ్రీరామునివాక్యంబుల సమాధానపడి తన్ను క్షమింప వేఁడుట ♦—

శా. రామా! నీ విపు డాడినంతయు యథా♦ర్థం బయ్యె సందేహ మం
దే మాత్రంబును లేదు, మాదృశులునా ♦ హీనాత్ములే నిన్నుఁ బోల్
ధీమత్పుణ్యుల మాఱు పల్కఁగను శ♦క్తిస్ఫీతు? లజ్ఞానినై
యేమేమో యనినాఁడ ప్రేముకొదను దం♦డ్రీ! నన్ను మన్నింపవే. ౫౧

యథార్థము=సత్యము, మాదృశులు=మావంటివారు, హీనాఖులే=నీచసమూహములా, ధీమత్ + పుణ్యుల=బుద్ధి బలముగల పుణ్యాత్ములను, శక్తిస్ఫీతులు=శక్తిచే గొప్పవారు.

తాత్పర్యము.

రామచంద్రా! నీ విపుడు చెప్పినదంతయు సత్యము. అందుఁ గొంచెమైన సందేహము లేదు. మావంటి యల్పజనులా నీవంటి ప్రజ్ఞావంతులైన పుణ్యాత్ములకు బదులు చెప్పఁగలవారు, జ్ఞానములేక నే నేమేమో యనితిని, నమస్కరించెదను- నాయనా! నన్ను మన్నింపుము.

ఉ. నీ వనఁ గేవలుండవె వి♦నీతుఁడవుం బరమార్థతత్త్వధీ
కోవిదతల్లజుండవు న♦కుంఠితకారణకార్యసిద్ధులన్
నీ వరబుద్ధి యెప్పుడు సు♦నిశ్చయముం గడు సుప్రసన్నమున్
దేవర! నన్ను బోఁటులె మ♦తిన్ నినుఁ దప్పులు పట్ట నేర్పరుల్? ౪౯-౨

కేవలుండవె=సామాన్యుఁడవా! "కృష్ణాసోదరులు దలఁపఁ గేవలులె నృపా" యని తిక్కన- భార- వినీతుఁడవు = పెద్దలచే సన్మార్గమున జక్కఁగ శిక్షింపఁబడినవాఁడవు. పరమార్థతత్త్వధీ=విషయముల వాస్తవస్థితినిగూర్చి గొప్ప జ్ఞానముగలవాఁడవు- కోవిదతల్లజుండవు = పండితశ్రేష్ఠుఁడవు- అకుంఠిత = మొక్కపోని- కారణకార్యసిద్ధులన్ = శిక్షించుటకు హేతువు లగు పాపములయు, కార్య = పాపకార్యమైన శిక్షలయు- సిద్ధులన్ = లాభములందు- సునిశ్చయము = మిగుల నిశ్చయము కలది- సుప్రసన్నము = మిగుల నిర్మలమైనది.

తాత్పర్యము.

రామచంద్రా! నీవేమి సామాన్య పురుషుఁడవా? ధర్మవిచారమందుఁ బెద్దలచేఁ జక్కఁగ శిక్షింపఁబడినవాఁడవు. విషయముల యథార్థ జ్ఞానము కలవాఁడవు. పండితశ్రేష్ఠుఁడవు- ఎట్టిది పాపము- దానికి శిక్ష యెట్టిది- దానివలన ఫలమేమి? యను విషయములందు నీమనస్సు సర్వదా నిశ్చయజ్ఞానము గలదై కలఁత లేక నిర్మలమై యుండును. నావంటివారా నిన్నుఁ దప్పులు పట్టువారు?

కం. ధర్మముల నేమి చేయక, ధర్మములం జేసి యెన్నో♦ధర్మేతరదు
ష్కర్ముఁడ నైతిని నన్నున్, శర్మద! ధర్మోక్తిఁ గరుణ♦క్షమియింపఁ గదే. ౪౯-౩

ధర్మేతర = ధర్మవిరుద్ధములైన, దుష్కర్ముఁడను = చెడుకార్యములఁ జేసినవాఁడను, శర్మద = సుఖము గలిగించువాఁడా, ధర్మోక్తిన్ = ధర్మవాక్యముచే.

తాత్పర్యము.

రామచంద్రా! నేను ధర్మముల నేమియుఁ జేసినవాఁడనుగాను - అధర్మముల నెన్నో చేసితిని - ధర్మవిరుద్ధములగు పాపకార్యములను జేసితిని. ఇట్టి నన్ను సుఖదాత వగు నీవు నీ తప్పుల క్షమించితి నని ధర్మార్థ మొకమాట చెప్పుము.

ఉ. కుందఁగ నెడంద నే నిటులు♦కూలుటకుం, బ్రియదార తారకై
యంగద లేదు, బాంధవుల♦కై రవయేనియు నంగలార్ప, హే
మాంగదు నాదు ముద్దుసుతు ♦ నంగదు లోనఁ దలంచినంత నా
కుం గల దుఃఖపాటు రఘు♦కుంజర! యే మని చెప్పఁ జాలుదున్. ౪౯౪

కుందగను = కూలిపోను, దుఃఖింపను, ఎడందన్=హృదయమందు, అంగద=దుఃఖము, అంగలార్పన్=శోకింపను, హేమాంగదున్ = బంగారు భుజకీర్తులు గల.

తా త్ప ర్య ము.

నేను నీ చేత యుద్ధమందుఁ జచ్చి యుత్తమలోకములకుఁ బోవుచున్నాను. కావున నా మరణమునకు నేను జింతింపను. సుగ్రీవుఁడ కలఁడు కావున నా ప్రియభార్య యగు తారకై నేను దుఃఖింపను. నన్నువలె సుగ్రీవు నాశ్రయించి బ్రదుకుదురు కావున బాంధవుల విడిచి పోవలసి వచ్చెనే యని కొంచెమైన విచారపడను. బంగారు భుజకీర్తులు గల నాముద్దు కుమారుని నంగదుఁ దలంచిన నాకుఁ గలుగు దుఃఖ మింత యని చెప్పఁజాలను.

—♦ వాలి యంగదుని శ్రీరామునకు నప్పగించుట. ♦—

ఉ. ఒక్కఁడె నాకుఁ బుత్త్రుఁడు, గు♦ణోత్తరుఁ డాతఁడు నే న దెంతయో
మక్కువ లాలనంబులను ♦ మానుగఁ బెంచితి నిప్పు డిట్లు నే
దిక్కఱి నేల వ్రాలఁ గని♦దీనతఁ బోయితె తండ్రి యంచుఁ దా
సుక్కునొ పీతనీరసర♦సుంబలె నంచును దల్లడిల్లెడన్. ౪౯౫

పీత నీరసరసు = త్రాగఁబడిన నీళ్ళుగల కొలను.

తా త్ప ర్య ము.

రామచంద్రా! నా కొక్కఁడె కొడుకు. వాఁడును గుణములనుబట్టి శ్రేష్ఠుఁడు. ఆకారణమున నేను మిక్కిలి చనవున బుజ్జగించి లాలించి కాపాడితిని. ఇప్పుడు నే నిట్లు నేల వ్రాలియుండుటఁ జూచి తండ్రీ! పోయితివా యని నీళ్ళు పోయిన కొలనివలెఁ గాంతి హీనుఁడై యెంత దుఃఖించునో.

చం. మరగినవాఁడు నా చనవు♦మానఁ డొకప్పుడు నాదుపొత్తు, నా
కరయఁగ నొక్కఁడే తనయుఁ♦డాతఁడు బాలుఁడు దాఁకుదప్పులన్
నెరవుగఁ దానుగా నెఱుఁగ♦ నేరఁ, డిఁ కేగతిఁ బట్టి పోవునో,
ధరణిప నీవ దిక్కు, విను ♦తల్లియుఁ దండ్రియు నీవ వానికిన్. ౪౯౬

తా త్ప ర్య ము.

రామచంద్రా! వాఁడు పిల్లవాఁడు కావున నాయొద్ద నెక్కువ చనవు గలిగి నన్ను విడిచి యల్పకాలమైన నుండువాఁడు కాఁడు. అదియును నేకపుత్త్ర విషయము. ఇది తాఁకును ఇది తప్పును అని తానుగాఁ దెలిసికొనుశక్తి లేనివాఁడు. ఇఁకవానికి మంచి సెబ్బరలు చెప్పి వానిని జక్కదిద్ద నలయు నను శ్రద్ధగలవా రెవరున్నారు?

కావున విచారించువారు లేక యే గతిఁ బట్టునో కదా యని దుఃఖించు చున్నాను. రామచంద్రా! వానికి నీవే దిక్కు. నీ కప్పగించుచున్నాను. వానికిఁ దల్లివైన నీవే - తండ్రివైన నీవే - వానికి నీవు తప్ప వేఱు తల్లి లేదు - తండ్రి లేఁడు.

తల్లి చచ్చినఁ దండ్రి పినతండ్రి యన్న సామెతకలదు. అందు వేఱొక పెండిలి చేసికొనెనా చెప్పవలసిన పనియే లేదు. మాఱు మగనిఁ దగులుకొనిన స్త్రీలు నంత మాత్రమువారే. అందు మొదటి మగఁడు రెండవ మగఁడు విరోధులైనపుడు తల్లి పిన్నతల్లియే యగునో సవతి తల్లియే యగునో- అయినను గన్నకడుపు కావున మగ వారంత యుదాసీనలై యుండరు.

కం. ఉంపుము సమానురాగం, బింపుగ నంగదునియందు ♦ నినతనయునిపైఁ
ద్రుంపుము పాల న్మెంపుము, పంపుము కార్యముల నీవ♦ పరమగుణాఢ్యా! ౪౯౭

తాత్పర్యము.

కావున రామచంద్రా! నీ కిటువంటి రాగద్వేషములు లేవు, నేను నీకు విరోధిని గాను. నా కొడుకు నీకు విరోధిగాఁడు. కాఁబట్టి సుగ్రీవుని యందే ప్రేమ యుంచెదవో యా ప్రేమ యంగదునియందు నుంపుము. వాఁడు చేయఁదగిన కార్యములందు నీవే వాని నియోగింపుము. సుగ్రీవుని స్వాధీన పఱుపకుము. నీవు వానిని బాలముంచినను నీళ్లముంచినను ఆ పుణ్యపాపములు నీవే.

కం. భరతునిపై లక్ష్మణుపైఁ, బరగించెదు నెట్టి ప్రీతి ♦ భద్రగుణా! భా
స్కరసుతుపై నంగదుపైఁ, బరఁగింపఁగదయ్య యట్టి♦పరమప్రీతిన్. ౪౯౮

తాత్పర్యము.

రామభద్రా! భరతునిమీఁద లక్ష్మణునిమీఁద నీకెట్టి ప్రీతి గలదో యట్టి ప్రీతి సుగ్రీవునిపై నంగదుపై నుంపుము.

ఉ. భాసురశీల తార సుత♦పస్విని నా యొనరించినట్టి యా
దోసముచేతఁ దాను గృత♦దోషయ భానుజుపట్ల, దానికై
యాసున భానునందనుఁడు ♦ హీనగఁ జూచుచు సావమానఁగా
నా సతిఁ జేయకుండఁగ ద♦యాపరతన్ నియమింపు మాతనిన్. ౪౯౯

కృతదోషయ = నేరముచేసినదే- సావమానఁగాన్ = అవమానముతోఁ గూడినదానిఁగా- సుతపస్విని = మంచి యాలోచనగలది- తప ఆలోచనే యని ధాతువు- లేదా నా వియోగముచే దుఃఖించునది.

తాత్పర్యము.

రామచంద్రా! తార సత్స్వభావముచే వెలయునది- మంచి యాలోచనగలది. నేను బోయిన కారణముచే దుఃఖించునది. అట్టిది నేను సుగ్రీవునితో విరోధించిన కారణముచే నదియును నా వలె దోషము చేసినదే కదా! ఆ కారణముచే సుగ్రీవుఁడు

దానిని గోపముచే నీచురాలింగఁ జూచుచు నవమానింపకుండునట్లు సుగ్రీవు నియమింపుము. నా నిమిత్తమై సుగ్రీవుని కది యేదియు ద్రోహ మొంచినది కాదు.

ఉ. మీకు నణంగి కుమ్మరుచు ♦ మీ హృదయంబు నెఱింగి కొల్చినన్
మీ కరుణాబలంబునను ♦ మేదిని యేలుట చెప్పనేల ? యా
నాకపదంబు నైన సము♦పార్జన సేయఁగఁ జాలి యుండు, నో
శ్రీకర ! పంకజాక్ష ! యిది ♦ సిద్ధము సత్యము నే నెఱుంగుదున్. ౫౦౦

తా త్ప ర్య ము.

దేవా! సుగ్రీవుఁడు మీయెడ వినయవిధేయతలు గలిగి మీ యిష్టానుసారము వర్తించెనా మీ దయచే వాఁడు భూమిని బాలించుమాట యేల? స్వర్గమునైన నార్జింపఁగలఁడు. ఇది సత్యము. తప్పదు. మీ మహిమ నాకుఁ దెలియును.

చం. వలవదు పోకు పోకు మని♦వార్యుఁడు రాముఁ డటంచుఁ దార దాఁ
బలుగతులన్ వచించినను ♦ బాయక నీ వలనన్ రఘూత్తమా
కలనను జావ నాశ గొని ♦ కాదె దివాకరసూతితోడ నేఁ
బెలుచన యుద్ధముం జెలుప♦ నే చనుదెంచితి జానకీశ్వరా ! ౫౦౧

అనివార్యుఁడు=వారింపరానివాఁడు, కలనను=యుద్ధమందు.

తా త్ప ర్య ము.

ఇంత తెలిసిన వాఁడవు. ఏల ఈ పనికి వచ్చితివి, నావార్త వినఁగానే నాయొద్దకు వచ్చియుండరాదా యందువేమో? పోవలదు, పోవలదు, రామచంద్రుని నీవు జయింపలేవు, అని తార నాకు ననేకవిధముల బోధించెను. కాని యుద్ధమందు నీచేఁ జావఁ గోరియే నేను సుగ్రీవునితోడ యుద్ధముచేయ వచ్చితిని. వాలి మహావీరుఁడనుటయందు సందేహములేదు. అటులున్నను దనమీఁదికి యుద్ధమునకు వచ్చినవారితో నతఁడు యుద్ధముచేసి చంపుచుండెనే కాని యతఁడై యదరుగొండితనమున రావణునివలె నందఱమీఁదికిఁ బోవుచుండినవాఁడుకాఁడు. అతని బలపరాక్రమములు తెలిసినవారతనిమీఁదికి రాకయే యుండిరి. ఇఁక వాఁడు చచ్చు విధ మెట్లు ? వీరుఁడు వీరమరణము కోరునేకాని రోగివలె మంచములోఁబడి చావనొల్లఁడు. ఇప్పుడు తాను యుద్ధము చేయఁదగిన వీరుఁడు రాముఁడు లభించెను. కావున యుద్ధమునకు వచ్చెను. అట్లైనఁ దొలుత నేల యన్ని తిట్లు రామచంద్రుఁ దిట్టెనందురా ? సుగ్రీవునకై సహాయుఁడై రాముఁడు వచ్చును. అప్పుడు కలహించి చావవచ్చునని తలఁచెఁగాని రామచంద్రమూర్తి యిట్లు చేయునని తలఁచినవాఁడుకాఁడు. ఆ కారణమున నాశాభంగము. అదియునుగాక దెబ్బదిని పడినపుడు రోషము అవమానము తీవ్రముగ బాధించుటచేఁ దత్కాలమునఁ దెలివి చెడుట స్వాభావ సిద్ధము.

కం. అని మొక్కి యూర కుండిన, విని రఘుకులదీపకుండు ♦ విశ్రుతధర్మం
బున నెనఁగుసూక్తులను నా, వనచరనాయకుని శాంతి ♦ పఱుచుచుఁ బలుకున్.

తాత్పర్యము.

అని నమస్కరించి యూరకుండఁగా రామచంద్రమూర్తి ధర్మయుక్తములైన సూక్తులను వాలి కిట్లనియె.

—♦ శ్రీరాముఁడు వాలిని సమాధానపఱుచుట. ♦—

సీ. వగవకు మయ్య యో♦వనచరాధీశ్వర !, యీ విషయంబున ♦ నించు కేని
మా నిమిత్తంబుగ ♦ నైనఁ జింతింపకు, నాత్మకు నైన యేని ♦ యడల వలదు
నీ వకృత్యంబున ♦ నిష్ఠుఁడ వౌటఁ బ్రా,యశ్చిత్త మేను జే♦యంగ వలసెఁ
గారణం బున్నను ♦ గార్యంబు గలుగును, గారణం బీవ య♦కార్యపరత
తే. నేను గార్యంబు నిన్ను దం♦డించుకతన, దండితుండయి దండ్యుండు ♦ దండనీతి
దండనము సేయునట్టి యా♦తండు నిరయ,పథమునను బోరు నిర్జర♦పతితనూజ. ౧౦౩

ఈ విషయంబునన్ = నీ కొడుకు రక్షణమందు, మా నిమిత్తంబుగను, రామచంద్రమూర్తి యిట్టి యకార్యము చేసెఁగదా యని ఆత్మకునైన యేని, అయ్యో నే నిటువంటి పాపము చేసితినిగదా యని యైన, అడలవలదు=విచారపడవలదు. అకృత్యంబునన్ = చెడుకార్యమందు- నిష్ఠుఁడవగుటన్ = స్థిరత్వము గలవాఁడవగుట- దండ్యుఁడు = దండింపఁబడవలసిన దోషి.

తాత్పర్యము.

వానరరాజా! నీవు నీ కొడుకుగతి యేమగునో యని వ్యసనపడకుము. నేనకార్యము చేసితినని కాని నీవు పాపముచేసితి వని కాని వ్యసనపడవలదు. నీవు పాపకార్యంబునందుఁ బట్టుదల గలవాఁడవగుటచేత నేను బలవంతముగ నైనఁ బ్రాయశ్చిత్తము పెట్టవలసివచ్చెను. నేను మంచిమాటలతో నీ వీ పాపముచేసితివి, ప్రాయశ్చిత్తము పెట్టుకొమ్మన్న నీవు పెట్టుకొందువా? కారణముండినేని కార్యము గలుగును. కారణములేక కార్యము గలుగదు. నీవు చేసిన చెడుకార్యము కారణము. నేను నిన్ను దండించుట కార్యము. దీనిచేత మన మిరువురము బాగుపడితిమి. దోషముచేసినవాఁడు దండ మనుభవించి పవిత్రుఁడగును. కావున నీవు నాచే దండింపఁబడి పవిత్రుఁడవైతివి. నిన్ను దండింపకుండిన నేను నరకము పాలయి యుందును. ఇప్పుడు నా కా గండము తప్పినది. మన కిరువురకు నరకభయములేదు.

ఉ. చేసితి వీ వకార్యమును ♦ జేసితి నేను సమర్హ దండముం
బాసితి వీవు పాపమును ♦ బాఢవినిర్మలశుద్ధరూపముం
భాసురధర్మపద్ధతిని ♦ బాయక పొందెద వింక దీని కా
యాసము నీసు రోసమును ♦ నందకుమీ, విధి దాఁట శక్యమే. ౧౦౪

బాఢ = విశేషమగు- నిర్మల = పరిశుద్ధమైన, రూపము = ఆకారముఁ. భాసుర=ప్రకాశించు, ధర్మపద్ధతిని=ధర్మమార్గమున, ఈసు=ఈర్ష్య, విధి=నియతి.

తా త్ప ర్య ము.

నీవు పాపకార్యము చేసితివి. నేను నిన్ను దండించితిని. దానివలన నీవు పాపరహితుఁడవై యీ దేహము విడిచి నిర్మలమైన దేవతాస్వరూపమును ధర్మమార్గమునఁ బొందువాఁడవైతివి. నేను నిన్ను దండింపకుఁడిన నీవు నరకము పాలై యుందువు. కావున దీనికి నాయాసముగాని యీర్ష్యగాని రోషముగాని పొందకుము. ఇంతకు విధి తప్పించుటకు నెవ్వరికి శక్యము? ఇది యిట్లు జరుగవలయు నని ముందే యేర్పాటయి యుండుటవలన జరిగె నని తలంపుము.

కం. అంగదునిఁగూర్చి నీమది, నంగద వహియింపఁ బోకు ♦ మా నీకొమరుం
 డంగుగ నీ కెట్లుల్లో యా, భంగియ రవిజునకు నాకుఁ ♦ బరమప్రీతిన్. ౫౦౫

 అంగద=దుఃఖము.

తా త్ప ర్య ము.

నీ కొడుకును గుఱించి నీవు కొంచెమైన విచారపడవలదు. అంగదుఁడు నీ కెట్లో నాకు సుగ్రీవునకుఁ బ్రీతి విషయంబున నట్టులే యనుకొనుము.

చం. అనవుడు ధర్మమార్గచరి ♦ తాగ్రణి రాముని స్వాదువాక్యముల్
 విని మదిఁ గొంకుఁ బాసి హరి ♦ వీరుఁడు పల్కు, మహానుభావ! త్వ
 త్సునిశితమార్గణాగ్ని ననుఁ ♦ జూఁడుటఁ దెల్వి దొఱంగి తిట్టితిన్
 నను క్షమియింపవయ్య రఘు ♦ నందన! యింద్రసమానవిక్రమా. ౫౦౬

ధర్మమార్గచరితాగ్రణి=ధర్మమార్గమందుఁ జరించువారిలో మొదటివాఁడు, ఇది రాముని స్వాదువాక్యముల్ అను సమాసములోని 'రాముని' యను షష్ఠ్యంతముతో నన్వయించును. 'పాండవప్రాగ్రసరుండు ధర్మసుతు పన్పిట' యని భారతము. 'అగు' ననునది యధ్యాహార్యమయ్యేనేని ప్రథమాంతమే విభక్త్యంతమునకైన విశేషణముగ నుండును. త్వత్ = నీయొక్క, సునిశిత = మిగులఁ బదునైన- మార్గణ = బాణ మనెడి; అగ్ని = నిప్పు, చూఁడుటన్= కాల్చుటచేత;

తా త్ప ర్య ము.

ఈప్రకారము చెప్పఁగా ధర్మమార్గమందుఁ జరించువారిలో మొదటివాఁడగు రామచంద్రమూర్తి తియ్యనిమాటలు విని మనస్సులోని సందేహము వదలి వాలి, మహానుభావా! నీవు ప్రయోగించిన వాఁడియగు బాణము నిప్పువలె నన్నుఁ గాల్చుచుండుటచేత నాబాధచేఁ దెలివిపోయినవాఁడనై తిట్టితిని. రామచంద్రా! నన్ను క్షమింపుము.

ఆనంద రామాయణమున:—

 యద్యపి త్వం దురాచారో నిహతోఽసి రణే మయా
 తథాపి భిల్లరూపేణ, ద్వాపరాంతేంఘ్రిం మమ
 భిత్వా ప్రభాసే బాణేన పూర్వవైరేణ వానర

తతో మద్ధస్తమరణస్యాస్య కారణ గౌరవాత్
ముక్తిం గచ్ఛసి త్వం వాలిన్ శుభాం జన్మాంతరేణహి.

సారకాండము ౮-౬౮

నీవు దురాచారుఁడ వగుటచే నాచే యుద్ధమందుఁ జంపఁబడినను నీవు బోయవాఁడవై ద్వాపరాంతమందు నా బొటనవ్రేలిని ప్రభాసతీర్థంబునఁ బూర్వవైరముచే వానరా! తెగఁగొట్టుము. ఆవల నిప్పుడు నాచేఁ జచ్చిన నీవు జన్మాంతరమున ముక్తుఁడ వయ్యెదవు అని కలదు.

ఇవి యన్నియు నాధునిక కల్పితకథ లనుటయందు సందేహములేదు. ఇట్టివి వ్రాసిన వారికి బుద్ధిలేదనుట యందును సంకోచింపఁ బనిలేదు. ఇట్టివాక్యముల నాధారము చేసికొని రామచంద్రమూర్తి కర్మబద్ధుఁడను మతిమంతులును గలరు. ఈ యానందరామాయణవాక్యములు క్షోదక్షమము లేమో శోధింతము.

౧ ఒకఁడు దోషి యగుటచే నధికారులచే న్యాయపద్ధతి దండింపఁబడునేని యా దండించిన న్యాయాధిపతి వానిని దండిచిన పాపముచే బద్ధుఁడగునా?

౨ బోయవాఁ డట్లు కృష్ణుని గొట్టుటకుఁ బూర్వవైరము కారణమఁట. కృష్ణునకు బోయవానికిఁ గాని రామునకు వాలికిఁగాని పూర్వవైర మేమి గలదు?

3 ఈ జన్మమందే సర్వకర్తృత్వయముచే వాలి ముక్తి కర్హుఁడై యుండ మఱియొక జన్మంబున హింసాత్మకమైన నీచజాతియందు నే కర్మవశమునఁ బుట్టెను?

భాగవతమందును - పద్మపురాణమందును వేఁటకాఁడు కాలి బొటన వ్రేలిని గొట్టినట్లున్నదేకాని పూర్వకర్మానుభవమునకై యట్లు జరగెనని లేదు.

భారతంబున మౌసల పర్వంబున.

సీ. అట్లగ్రజుఁడు చన్న ♦ నచ్చోటువాసి,యం, తంతఁ గ్రుమ్మరుచు ము♦రారిసకల
లోకపాలకుఁడు భూ♦లోకంబునందుఁదాఁ, బుట్టంగవలసిన ♦ యట్టి మేటి
పనులెల్లఁ దీరుట ♦ మనమునఁ దలపోసి, తను విముక్తికి ♦ నిమిత్తంబు దలఁచి
మునులవాక్యము తెఱం♦గును దొల్లి దుర్వాసు, నవయవసమితిఁ బా♦యసముపూయు
నప్పు డఱికాలఁ బూయమి♦న త్తపస్వి, యచట నవిలంఘ్యమై♦యపాయంబుగలుగు
ననినమాటయుఁ జర్చించి♦మనసు నింద్రి,యములు నడఁగించి గాఢసమాధి నొంది.
ఆ. అరుగుదెంచి యచటఁ ♦ దిరిగెడు నొకవేఁట,కాని గాంచి వాఁడు ♦ కమలనాభు
నొడలు చూచి లెంకి ♦ నున్నయేణం బను, నట్లు చేసి మాయ♦యావహించె.౮౨
మ. ధరణీనాథ యతండు శాతశర ♦ ముద్యద్వృత్తి సంధించి యు
ద్ధురభంగిన్ దెగనిండఁగాఁ ♦ దిగిచి యత్యుగ్రంబుగా నేసినన్
హరిశ్రీపాదతలంబుఁ దూఱఁగొని ♦ యయ్యస్త్రంబు మీఁగాల ని
ష్ఠురవేగంబున నుచ్చిపోయె ♦ వెస వాఁడుంజేరెఁ గైకొంటకున్. ౮౪

పూర్ణావతారము లగు రామకృష్ణావతారములే కర్మబద్ధము లగునేని యచేతన కర్మమే జగత్తునకు స్వతంత్ర కర్తయని చెప్పవలసివచ్చును. అంతకంటె నున్మత్త ప్రలాపము వేఱొకటియుండదు. రామునితోడ సీతాదేవి ఋశ్యమూకమందుండఁగా లక్ష్మణుఁడు చూచెనఁట. ఆయన చూడఁగానే సీత మాయమై రాముని కుడిభుజమునఁ బ్రవేశించెనఁట. ఇట్టి చిత్రము లానందరామాయణమునఁ బెక్కులు గలవు. అది వినోదార్థమై యుబుసుపోకకుఁ జదువఁదగిన గ్రంథమేకాని రామాయణ మని వాస్తవ చరిత్రమని చదువఁదగినది కాదు.

—♦ ౧౯-వ సర్గము. వాలిమృతి విని తార కిష్కింధ వెడలి వచ్చుట. ♦—

కం. అని ప్రత్యుత్తర మేమియు, నన లేకా నృపు సహేతు♦వగుసూక్తులకున్
బెను పగుమూర్ఛయుఁ గ్రమ్మఁగ, వనచరనాథుండు నేలఁ ♦ బడియుండె వ్యథన్

సహేతువు=కారణముతోఁ గూడినది. సూక్తులకున్=మంచిమాటలకు

తాత్పర్యము.

రామచంద్రమూర్తి పలికిన యుక్తియుక్తములగు మంచి మాటలకుఁ బ్రత్యుత్తరమేమియుఁ జెప్పఁజాలక క్షమింపవేఁడి పెద్ద మూర్ఛవచ్చిన కారణమున వాలి బాధపడుచు నేలఁబడియుండెను.

కం. పెల్లుగ శిలాద్రుహతిఁ బడి, కీళ్ళను గడు నొచ్చి బాణ♦కీలితతనుఁ డై
తెల్లుట నడుగులపటిమయు, సళ్ళఁగఁ బడియుండె వాలి ♦ శరవేదనచేన్. ౫౦౮

శిలాద్రుహతిన్=సుగ్రీవుఁడు కొట్టిన ఱాలయొక్క చెట్లయొక్క దెబ్బలచే, బాణకీలితతనుఁడై=మేకువలె బాణము గ్రుచ్చుకొనిన దేహముగలవాఁడై, శరవేదనచేన్=బాణమువలనఁ గలుగు బాధచే-

తాత్పర్యము.

సుగ్రీవుఁడు వాలిమర్మము దెలిసినవాఁడు. సమీపించెనా పట్టుకొని తనబలము లాగుకొను నని దూరము నుండియే ఱాలతోను చెట్లతోను విసరికొట్టెను. ఆదెబ్బల చేతనే కీళ్లు మిగుల నొప్పిచెందియుండెను. దానికిఁ దోడు బాణము మేకువలె దేహమున నాటుకొనెను. ఈ కారణముచేఁ గాళ్లలో బల ముడిగి కదలించుటకును లేక బాణము వలని బాధచేఁ బడియుండెను.

సీ. అక్కడ రామబా♦ణాహతిఁ దనభర్త, వాలియుట విని సహ♦పుత్ర యగుచుఁ
దార దుస్సహశోక♦భారంబునను భయ, వేగానఁ గిష్కింధ ♦ వెడలి వచ్చి
నంగదపరివార ♦ మగు కీశవర్గంబు, చాపపాణిని రామ♦చంద్రుఁ జూచి
బెదరి నల్దిక్కులు ♦ చెదరి పాఱెను వేగ, హతయూథపంబు మృ♦గాళివోలె
తే. వారలను రామబాణాను♦బద్ధు లట్లు,పఱచువారలఁ గని తార ♦ పలికె నిట్టు
లన్నఁ జంపించెఁ బిన్న రా♦జ్యంబు కొఱకు, దూరపాతిశరంబుల ♦ భీరులార!

దుస్సహా=సహింపరాని, శోకభారంబునను=శోకముయొక్క యతిశయముచే, హతయూథపంబు=చంపఁబడిన యూథనాయకుని గలది, అక్కడ=కిష్కింధానగరమున,

తా త్ప ర్య ము.

కిష్కింధానగరమందు రాముని బాణము దెబ్బచేతఁ దనమగఁడు చచ్చినాడని విని కొడుకుతోడఁ దార సహింపరాని దుఃఖాతిశయముచే భయముతోను వాలిని జూడవలయు నను త్వరతోను కిష్కింధ వెడలివచ్చెను.

అంగదుని పరిచారకులగు కోతులు ధనుర్ధరుఁడై యుండు రామచంద్రుని జూచి బెదరి పరిగాఁడు వచ్చిన మృగసమూహమువలె నాలుగు దిక్కులవెంటఁ బరువెత్తెను. రామబాణములు తమ వెంటఁబడినవా యన్నట్లు పరువెత్తుచున్న యా కోతులను జూచి తార యిట్లు చెప్పెను, ఓరి పిఱికివాండ్రారా! మీకు వచ్చిన భయమేమి? రాజ్యముకొఱకుఁ దమ్ముఁడు దూరమునఁ దగులుబాణములచే నన్నను జంపించెను.

కం. ఇన్నాళ్లు మీర లెల్లరు, నన్నైలింపాధినాథు♦నాత్మజు నిత్యం
బు న్నెఱి బలసి భజించియుఁ, జన్నే యిపు డిట్లు పఱవ ♦ శైలగుహాలకున్. ౧౦

నైలింపాధినాథు = ఇంద్రునియొక్క ఆత్మజుని = కొడుకును, చన్నే = తగునా.

తా త్ప ర్య ము.

ఇన్నిదినములుగ మీరందఱు మీ ప్రభువును సర్వదా గొలుచుచుండి యిప్పు డాపత్కాలంబున విడిచిపెట్టి కొండలకు గుహలకుఁ బరువెత్తి పోవుట న్యాయ్యమా?

—♦ వానరులు తారకు వాలిపాటు దెలుపుట. ♦—

చం. అను సతివాక్యముల్ విని వ♦నౌకసు లెల్ల సయుక్తికంబుగా
నని రిటు జీవపుత్రి! యిటు ♦ లర్థ్యముగా దరుదేరఁ, బొమ్ము, నీ
తనయునిఁ గాచుకొ, మ్మొకట ♦ దండధరుం డిటు రామరూపి యై
వనచరనాథు దూరతల♦పాతిశరంబులఁ గూల్చె దేవెరీ! ౧౧

వనౌకసులు = వన + ఓకసులు = అడవులయందుండువారు - జీవపుత్రి = బ్రదికియుండు కొడుకు గలదానా? దండధరుండు = యముఁడు; దూరతలపాతి = దూరప్రదేశమునఁబడునట్టి-ఇదివఱకు వారు చేతులు చేతులు కలిసినయుద్ధము చూచినవారే కాని దూరమున నుండు వానిని గొట్టు విధము చూచినవారు కారు - దేవెరీ= దేవీ - తద్భవము - దేవేరి రూపాంతరము.

తా త్ప ర్య ము.

అని తార చెప్పినమాటలు విని కోతులన్నియు యుక్తితోఁగూడిన ట్లిట్లు చెప్పిరి. ప్రాణముతోనుండు కొడుకును గల నీవు కొడుకుతోడ నిట్లు రారాదు. ఇంటికి

బొమ్ము. ఏలన నీ కొడుకు ప్రాణము కాపాడుకొనుము. వాలిని జంపినట్లు నీ కొడుకును గూడఁ జంపిన నీ వేమిచేయఁగలవు? యముఁడే రాముని వేషమున వచ్చి దూరమునఁ దగులు బాణములచే నో రాణి! వాలిని వధించెను. నేను సహగమనము చేయఁ బోయెద నందువా. కొడుకులు గల నీ వా పనియుఁ జేయరాదుగదా. కావున నూరు విడిచిరాకుము.

కం. గుండ్రాల నడిచి చెట్టులఁ, దీండ్రింబుగ మోఁది వాలి ♦ దేఁకువతోడన్
గోండ్రిల్లుచుండ రాముఁడు, వేండ్రపుఁ బవినిభశరములు ♦ వేయుచుఁ గూల్చెన్.

తీండ్రింబుగన్=తీక్ష్ణముగ; తేఁకువతోడన్=(౧) ధైర్యముతో (౨) భయముతో, గోండ్రిల్లుచుండ=(౧) కూయుచుండ (౨) అంగలార్చుచుండ ; వేండ్రపు=వేఁడిమిగల పవినిభ=వజ్రాయుధముతో సమానములయిన.

తా త్ప ర్య ము.

గుండ్రాలతోఁగొట్టి చెట్లతోమోఁది వాలి భయముతో నంగలార్చుచుండఁగా రాముఁడు వజ్రాయుధమువంటి బాణములచేఁ జంపెను. ఇందు అడిచి, మోఁది యను పదములకుఁ గర్త సుగ్రీవుఁడు. అప్పు డా దెబ్బలకుఁ దాళలేక వాలి యంగలార్చుచుండఁగా రాముఁడు గొట్టె ననుటచే వాలిని నన్యాయముగాఁ బలువురు చేరి చంపి రని తారకు భయము గలిగింపఁ జెప్పిన మాటగా గ్రహింపనగు. 'సుగ్రీవునిన్' అనునది యధ్యాహారము చేసికొని వాలి ధైర్యముతో సింహనాదము చేయుచుండఁగా నని చెప్పవచ్చును. కాని సారస్యము కానరాలేదు. వాలిని నానావిధములఁగొట్టి బాధ పెట్టి చంపినా రనియే వానరులు చెప్పిరి. వాలి యొకనిచేఁ జచ్చె ననిన నమ్మదని నమ్మించుటకుఁగా నిట్లు కల్పించి చెప్పిరి.

ఇచ్చట ననేకబాణములతో రామచంద్రమూర్తి వాలిని గొట్టె నని యున్నది. దీని నాధారము చేసికొని యిప్పటి విమర్శకులు కొందఱు వాలి పెక్కుబాణములచేఁ జంపఁబడె నని వాదించుచున్నారు. అది కేవల మసంగతము. పూర్వవ్యాఖ్యాతలందఱు రాముఁ డొక్క బాణముచేతనే వాలిని బడఁగొట్టెననియు నిచట బహువచన ప్రయోగము సంభావనార్థమనియు వ్రాసిరి.

తార కీ ముచ్చటలు చెప్పినవారు చూచి చెప్పినవా రనుటకుఁ బ్రమాణము లేదు. తారను యుద్ధభూమికి రాకుండఁ జేయవలయు ననియే వారి యుద్దేశము. భయ పెట్టినఁగాని రాకుండ దని వారి తలంపు. నీ మగఁ డొక్క బాణముచేతనే చచ్చె ననిన నది చులుకనగాను నవమానకరముగను నుండు నని వారి యభిప్రాయము. కావున నిట్లు చెప్పిరి. వీరు చెప్పినమాట నమ్మి తారయు ౧౦౯ వ పద్యంబున దూరపాతి శరంబుల ననియె. ఆమె యిప్పటికి వాలిని జూడలేదు గదా. చూచినపుడు శరైకవిద్ధుఁడై యుండఁ జూచెనుగాని బహుబాణవిద్ధుని జూడలేదు (౧౨౨ వ ప.) ౧౮౭ పద్యం

బునఁ దార యొండుశరంబున ననియే చెప్పెను. ౫౧౯ వ పద్యముఁ జూచునది. దీని వలన రామచంద్రమూర్తి ప్రయోగించినది యొక్క బాణమేయని స్పష్టపడుచున్నది.

i రామచంద్రమూర్తి పెక్కు బాణంబులు వేసియుండినచో నవి యెందుఁ బోయెను? ఆయన గుఱిగొట్టఁ జాలనివాఁడగుటచే నవి యాకాశచివ్వలవలె స్వేచ్ఛముగాఁ బోయెనా? దేహమునందు నాఁటిన దొక్క బాణమే కదా.

ii ఒకదానివెంట నొకటి బాణములను బ్రయోగించుచుండినచో వాలి యేల మొదటి బాణమునకే హెచ్చరిక గొని రామునిమీఁదికి రాలేదు? ఎవ్వరో వినోదార్థము చివ్వలఁ గాల్చుచున్నాఁ డని తలఁచెనా?

iii వాలికంటె బలిష్ఠములైన యేడుచెట్లను గొండను భేదించినవానికిఁ బెక్కు బాణము లేల వేయవలసి వచ్చెను?

ఇచ్చటఁ గాక మఱి యెచ్చటనైన రామచంద్రమూర్తి బహుబాణములు ప్రయోగించినట్లు వాల్మీకి చెప్పెనేమో చూతము.

బాలకాండమున ౧ వ సర్గయందు నారదుఁడు వాల్మీకికిఁ జెప్పునపుడు ౧౨౨ వ పద్యము 'ఒక పెనుగోలను' అనియే చెప్పెను.

వాల్మీకి యోగదృష్టిచేఁ జూచి వాలిఁ గోలఁ దుంచి యని యేకవచనమే ప్రయోగించెను. ఇట్టులే రామాయణమం దెందు నొక్క బాణ మనియే చెప్పఁబడెను. వాలిని బహుబాణములఁ జంపినట్టు లే గ్రంథమునను లేదు.

క౦. వానవసన్నిభ తేజుఁడు, వాసవి యటు గూలఁ జూచి ♦ వారని భృశసం
 త్రాసమున నెల్ల కోఁతులు, దూసిరి పురముఖముగాఁగఁ ♦ దొట్రిలఁబడుచున్.

వాసవసన్నిభతేజుఁడు=ఇంద్రుని తేజస్సుతో సమానమైన తేజస్సుగలవాఁడు, వాసవి=వాసవుని కుమారుఁడు; వాలి — అపత్యార్థక తద్ధితము; వారని=అడ్డములేని. భృశసంత్రాసమునన్=అధికభయముచే - దూసిరి=పరువెత్తిరి.

తా త్ప ర్య ము.

ఇంద్రుని తేజస్సుతో సమానమైన తేజస్సుగల వాలి నేలఁబడఁగాఁ జూచి విస్తారభయముచేఁ గోఁతు లన్నియు నిఁక నక్కడ నుండినఁ దమ్ముఁ జంపుదు రేమో యనుభయముచేఁ గిష్కింధాగుహాలోకిఁ బరువెత్తి పోయిరి.

దీనివలనఁ గొన్ని కోఁతులు దూరమువనుండి వాలి సుగ్రీవయుద్ధము చూచుచుండె నని తోఁచుచున్నది. వీరు పోయి చెప్పఁగాఁ దక్కినవారు తెలిసికొనిరి. తారకుఁ జెప్పినవారు వీరు గారు. రాణితో మాటలాడు నధికారము చిల్లరజనుల కెక్కడిది? కర్ణాకర్ణిగఁ బోయి పోయి తుదకు మొదటికి సంబంధము లేని దయ్యెను. వాడుకయం దింతయే కదా. ౫౧౮, ౫౨౨ - ౫౧౭ - ౬౨౩ - ౬౫౬ పద్యములఁ జూచునది.

'రామ ప్రేరణయా తేన బాహుయుద్ధ మథాకరోత్'
తతో వాలిన మాజఘ్నే శరేణైకేన రాఘవః॥— స్కాంద 3-౨-౨3
బాణేనైకేన తాం హత్వా రాజ్యే త్వా మభిషేచయే. —అధ్యాత్మ.

ఒక్కబాణముతో వాలిని జంపి నీకుఁ బట్టాభిషేకము చేసెదనని చెప్పెను ఒక్క బాణమే ప్రయోగించెను.

కం. గవఁకుల నెల్లెడఁ గాపిడు, మవధానమునం జరింపు ♦ మంగదు సద్వై
భవమున నభిషేకించిన, నవురుగ భజియించు నెల్ల♦శాఖామృగముల్. ౫౧౪

గవఁకులన్ = గవనులు, గవఁకులు, కలను మొదలగు శబ్దంబుల నువర్ణంబున కేకవచనంబున వైకల్పికంబుగను బహువచనంబున నిత్యముగను కుఙ్గగు - గవను - గవఁకు - గవఁకులు - అవధానము = హెచ్చరిక.

తాత్పర్యము.

కానివారు రాకుండునట్లు లన్నిగవఁకులందు రక్షకుల నియమింపుము. నీవు హెచ్చరికతోఁ జరింపుము. అంగదునకు వైభవముతోఁ బట్టాభిషేకము చేసితివేని కోఁతు లందఱు పూర్వము వాలినివలె సేవింతురు.

ఉ. ఓరుచిరాననా! యిచట ♦ నుండుట నీకు నభీష్ట మేని చే
కూరుఁ బ్రమాద, మెట్లనినఁ ♦ గోఁతులు భార్యలు లేనివారలున్
దారలు గల్గియుం బరుల♦దారలఁ గోరెడివారు వచ్చి యీ
యూరను నిండు వారు మును ♦ పూర్వేడలింపఁగఁ బడ్డవారితోన్. ౫౧౫

రుచిర + ఆననా = మనోహరమైన ముఖము గలదానా.

తాత్పర్యము.

ఓ యందమైన ముఖముగలదానా! నీ వీవిధముగ వెలుపలఁ దిరుగుచుండితి వేని నీ కపాయము కలుగును. ఏమి యాపదయందువా - ఇచ్చటఁ బ్రభువులేని కారణమునఁ బెండ్లాలు లేనివారు, పెండ్లా లుండినను నితరులభార్యలఁ గోరువారు, ఇదివఱకు నేరములు చేసి యూరనుండి తఱుమఁగొట్టఁ బడ్డవారు వీ రందఱు వచ్చి యూరు నిండుదురు. కావున నిన్నెవఁ డేమి చేయునో.

కం. వారికిని నూరివారికి, వారని కలహంబు లెపుడు ♦ వర్తిలు ననుచున్
వారికిఁ దోఁచినగతి నను, వారికి నల్పాంతరగత ♦ వానరతతికిన్. ౫౧౬

అల్పాంతరగత = బుద్ధివిశేషము లేనివారు; కొంచెము బుద్ధిగలవారు.

తాత్పర్యము.

క్రొత్తవారు వచ్చిన నేమి భయమందువా? క్రొత్తగా వచ్చిన వారికి నిదివఱకు నూర నుండువారికి విడువక కలహములు జరగుచుండును. అని యీప్రకార మాలోచన లేక మాటలాడు కోఁతుల సమూహమునకు.

వీరు బుద్ధివిశేషము లేనివారు కావుననే భయముచేఁ దత్తరలాడుచు వెత్తి

మొత్తులు వదరిరి. ఇట్టివారు గనుకనే రాముఁడు పెక్కుబాణంబులచే వాలిని జంపె నని చెప్పిరి.

తే. చారుహాసిని వచియించెఁ ♦ గారియంబు
నరసి తనకును బ్రతిరూప ♦ మైన భంగి
వాడువాఱిన మొగముతో ♦ వఱద కట్టఁ
బాష్పములు చేలచెఱఁగునఁ ♦ బాపికొనుచు. ౫౧౭

చారుహాసిని = మనోహరమైన చిఱునవ్వుగలది. ఇంతదుఃఖములోఁ గూడ వారి తెలివి తక్కువమాటలకు నామెకు నవ్వువచ్చె నని భావము. కారియంబు = కార్యము - ప్రతిరూపము = యోగ్యతకుఁ దగినది.

తా త్ప ర్య ము.

అందమైన చిఱునవ్వుగల తార చేయఁదగిన పని నాలోచించి తనయోగ్యతకుఁ దగినట్లు శోకాగ్నిచేఁ దపించుటవలన వాడిన ముఖముతో వెల్లువగఁ బాఱుచున్న కన్నీళ్లను పైఁటకొంగునఁ దుడుచుకొనుచు ని ట్లనెను.

ఉ. అక్కట యట్టిభర్త మహి♦తాత్ముఁడు వానరసింహమూర్తియే
దక్కక నాకుఁ బోయె నఁట ♦ ధారిణిరాజ్య మిఁ కేల? నాకు నిం
కెక్కడిపుత్రకుండు? తను♦వేటి? కవా నను నుద్ధరించెడిన్?
జక్కఁగఁ బోయెదన్ నృపతి♦సాయకవిద్ధధవాంఘ్రిమూలమున్. ౫౧౮

అట్టిభర్త=ఘనకార్యములు చేసి జగత్ప్రసిద్ధుఁడైన మగఁడు, నృపతిసాయక= రాముని బాణముచే, విద్ధ = కొట్టఁబడిన, ధవ = నా భర్తయొక్క, అంఘ్రిమూలమున్ = పాదముల సమీపమునకు.

తా త్ప ర్య ము.

అయ్యో! లోకోత్తర చరిత్రుఁడై ప్రసిద్ధికెక్కి పూజ్యమైన మనస్సు గల వాఁడు, వానరులందు సింహమువంటివాఁడు నగు నాభర్తయే నాకుఁ దక్కకపోయె నఁట. ఇఁక నాకు రాజ్య మేల? కొడుకేల? దేహమేల? ఇవియా నన్ను రక్షించునవి? కావున రామబాణముచే దెబ్బదిని పడిన నా పెనిమిటి పాదముల యొద్దకు నేను బోయెదను.

—♦ తార వాలిం జేరఁ బోవుట. ♦—

సీ. అని విలపించుచు ♦ హస్తతలంబున, మొగిఁ దన తల ఱొమ్ము ♦ మోఁదికొనుచుఁ
జనుదెంచి దానవ♦సంహతి సమవర్తి, సనురానివర్తిని ♦ స్వరుసమూహ
ముల వానవుఁడు శై ల♦ములఁబోలెఁ గొండల, మీటువానిని గాలి♦మీఱుజవముఁ
గలవాని మేఘౌఘ♦కంఠారవమువాని, సమరనాయకవిక్ర♦మాభిరాము
తే. శూరపాలితు శూరుని ♦ వైరినిసద, మణఁచు భీమగభారవు ♦ నంత నంతఁ
జూచి సంధులు విరిదులంగ ♦ స్రుక్కిపడుచుఁ,జేరఁ జనుదెంచె వానర♦వీరు కడకు.

దానవ సంహతి = మాయావి, దుందుభి మొదలగు దానవుల సమూహము నకు, సమవర్తి = యముఁడైన వానిని, సమరానివర్తిని = యుద్ధమునందు మరలని వానిని; స్వరుసమూహములన్ = వజ్రాయుధముల గుంపుచే, జవము = వేగము, మేఘ+ఓఘ = మేఘ సమూహముల గర్జలవంటి; కంఠారవమువాని = కంఠధ్వనిఁ గలవానిని, అమరనాయక = ఇంద్రునివంటి, విక్రమాభిరామున్=పరాక్రమముచే నందమైన వానిని, శూరపాతితున్ = శూరుఁ డగు శ్రీరామునిచేఁ బడఁగొట్టఁబడిన శూరుని, వైరినినదము = శత్రువుల కంఠధ్వని, భీమ = భయంకరమైన, గళారవున్= కంఠధ్వని గలవానిని; సంధులు = కీళ్ళు, విధులంగన్ = సడలిపోఁగా, శూరపాతితు శూరునని సమత్వము చెప్పుటచే ౫౨౦ పద్యములో శార్దూలశబ్దమునకు సింహ మను నర్థమే సమంజసము.

తాత్పర్యము.

ఈప్రకారము వారికిఁ జెప్పి యేడ్చుచుఁ జేతులచేఁ దలమీఁద రొమ్ము మీఁదఁ గొట్టుకొనుచు వచ్చి దానవులగుంపుల పాలిటికి యముఁడును, యుద్ధమునందు వెనుదీయనివాఁడును, వజ్రాయుధములచే నిందుఁడు మీటునట్లు కొండలను నెగఁజిమ్ము వాఁడును, గాలివేగమువంటి వేగముగలవాఁడును, ఉఱుమువంటి కంఠధ్వనిగలవాఁడును, ఇంద్రునివలె విక్రమముచే మనోహరమైనవాఁడును, శూరుఁ డగు రామచంద్రునిచేఁ గొట్టఁబడినవాఁడును, శూరుఁడును పగవారి కంఠధ్వనినిమించిన కంఠధ్వనిగల వాఁడును నగు వాలిని దూరమునందే చూచి కీళ్ళు సడలిపోఁగా నడువలేక నడువలేక వాలియొద్దకు వచ్చెను.

ఉ. ఓలిని వృష్టి పిమ్మటను ♦ నొప్పఱు మేఘముఁ బోలువాని, శా
ర్దూలము మాంసహేతువున ♦ రూక్షముగా వధియింప నేలపైఁ
గూలిన సింహమో యనఁగఁ ♦ గూలినవానిని, నాగకారణ
వ్యాలవిరోధిని ర్మథిత ♦ హారి సవేదికచైత్యసన్నిభున్. ౫౨౦

ఓలిని = చక్కఁగా, ఒప్పఱు = ఒప్పు+అఱు = అందముచెడిన, శార్దూలము = సింహము, "సింహో మృగేంద్రః పంచాస్యో హర్యక్షః కేసరీ హరిః, వ్యాదీర్ణాస్యో మహానాద శ్శార్దూలోఽమిత విక్రమ" యని వైజయంతి, రూక్షముగన్ = కఠినముగ, నాగకారణ = (అచ్చట దాఁగియున్న) పామును బట్టుకొనుట నిమిత్తముగ, వ్యాలవిరోధి = పాములకుఁ బగవాఁడైన గరుత్మంతునిచే, నిర్మథిత = చంపఁబడిన, హారి = మనోహరమైన; సవేదిక = శ్రమము హరించు నరుఁగులతోడి చైత్యసన్నిభున్ = మేడతో సమానమైన వానిని.

మిక్కిలి యందముగాను జనానుకూలముగా నున్న చైత్యములను అందులో దుష్టజంతువు పాము దాఁగియుండుటచేఁ గాళియ పరిహారణవేళ బలిస్థానచైత్యముఁ గూడ గరుత్మంతుఁడు పడఁద్రోసినట్లు శౌర్యాది గుణసంపన్నుఁడైనను వాలి తన

తమ్మునిభార్య నపహరించె నన్న పాపముచేతఁ జంపఁబడె నని యుపమానము సూచితము.

## తాత్పర్యము.

చక్కఁగా వాన వెలిసినపిమ్మట నందముచెడిన మేఘమువంటి వానిని, సింహాము మాంసము నిమిత్తమే చంపిన సింహామువలెఁ బడినవానిని, (మాంసము నిమిత్తమై యల్పమగు పులిచేఁ జంపఁబడిన సింహామువలె రామునిచేఁ జంపఁబడిన వానిని. ఇది యభూతోపమ) పాము నిమిత్తమై గరుత్మంతునిచే విఱుగఁ గొట్టఁబడిన తిన్నెలతోడి మేడవంటివానిని (వాలి నని యన్వయము.)

కం. వాలి ననుత్తమచాపము, ప్రాలంబము గొనినరాము ♦ రామానుజు భూ
పాలుర చెంగట నిలిచిన, వాలిసహోదరునిఁ గాంచె ♦ వరశుభమతియున్. ౫౨౧

అనుత్తమమగు = శ్రేష్ఠమైన, ప్రాలంబము = ఊఁత, దీనిచే రామచంద్రమూర్తి యింకను విల్లెక్కుడించలేదని తోఁచెడిని, వరశుభమతిః = మేలైన మంచి మనస్సు గలది. ఈ సందర్భమున నీ విశేషణప్రయోగము తారకు రామునందుఁగాని సుగ్రీవునందుఁగాని ద్వేషబుద్ధి లేదనియు మైత్రియే కలదనియుఁ దెలిపెడిని. అదెట్లు లన్నచోఁ దనభార్య నపహరించి తన్నుఁ జంపఁ దలఁచుచున్న వానిని వాలిని సుగ్రీవుఁడు తాను జంపుట దోషము గాదు. ఇఁక రామచంద్రమూర్తి విషయముననో తార యభిప్రాయమేమని: పదిమంది నీళ్లు త్రాగుటకై త్రవ్వింపఁబడిన చెఱువు నందు నొకఁడు మెడలో రాతిని గట్టుకొని చావవలయు నని దానిలో దూఁకి చచ్చిన దోష మెవరిది ? చెఱువుదా? వానికి స్నానపానాదులకు నలువురితోపాటు నీళ్లియ్య నని యది యనెనా ? అట్టులే సర్వజనులకు నాశ్రయయోగ్యుఁడై సర్వజన సంరక్షకుఁడైన శ్రీరామచంద్రమూర్తిని వాలి యాశ్రయింపక యాయనను నెదిరింపఁ దలంపుగొనుటచేఁ దప్పు వాలిదిగాని రామునిది గాదు. రామునిచేఁ జావవలయు నని వచ్చెను. ఆయనకోరిక రాముఁడు నెఱవేర్చెను. ఇందు రామచంద్రమూర్తిదోష మేమి గలదు? రక్షింపు మని సుగ్రీవుఁడు చేరినట్లు వాలియుఁ జేరియుండిన నేను రక్షింప ననియుండునా? "మమప్రాణాహి పాండవా" యనియు, "రక్షతే భగవాన్ విష్ణుః భక్తా నాత్మశరీరవత్" "పాండవులు నాకుఁ బ్రాణములు" "భగవంతుఁడు విష్ణువు తనభక్తులను దనశరీరమువలె రక్షించును" అన్నట్లు రామచంద్రమూర్తి పాహి యన్నవారి నెవరినైన రక్షించువాఁడు గనుకఁ దనయాశ్రితులకుఁ గీడుచేయఁ దలంచు వారిని నతఁడు శిక్షింపక విడుచునా? ఈ కారణముచే రామచంద్రమూర్తి వాలి తనయాశ్రితునికి విరోధి యగునా కాదా యని యొకటికి రెండుసార్లు చూచి దృఢపఱుచుకొని పిమ్మటఁగదా చంపఁ బూనెను. కాఁబట్టి యెట్లు చూచినను తప్పు వాలిదే కాని రామచంద్రమూర్తిది కాదని యామె యభిప్రాయము

తాత్పర్యము.

వాలిని నాయనను జంపిన యాయనుత్తమ ధనుస్సును నెక్కుడింపక యూఁతగాఁ గొని యుండు రామచంద్రుని నాయనకు సహాయుఁడై ప్రక్కన నిలుచుండిన లక్ష్మణుని వారిచే నీ కార్యము చేయించి వారి సమీపమందే నిలఁబడి యున్న సుగ్రీవుని నాశ్రేష్ఠమైన మంచి మనస్సుగల తార చూచెను.

ఉ. వారి నతిక్రమించి నిజ♦వల్లభుఁ జేరి శరైకవిద్ధుఁడై
ధారిణిఁ గూలియున్న పతిఁ ♦ దన్వి గనుంగొని దుస్సహార్తి దు
ర్వారమునన్ ధరం బడి భ♦రం బగు నిద్రను మేలుకొన్న య
న్నారినిబోలె లేచి ప్రియ♦నాథ! మనోహర! యంచు నేడ్చుచున్. గీ౨౨

శరైక విద్ధుఁడై = ఒంటి బాణముచేఁ గొట్టఁబడినవాఁడై.

తాత్పర్యము.

వారి నందఱను దాఁటుకొని యొంటిబాణముచేఁ గొట్టఁబడి నేలఁబడియున్న తన భర్తను జూచి సహింపరాని దుఃఖాతిశయముచే మూర్ఛిల్లి నేలఁబడి గాఢనిద్ర నుండి మేలుకొన్న దానివలె లేచి ప్రియనాథా! మనోహరా! యని యేడ్చుచు.

ఉ. దారుణమృత్యుపాశములఁ ♦ దద్దయు సందితుఁడైన పెన్మిటిన్
సారెకుఁ జూచి యేడ్చువది♦నన్ సుకుమారుఁ గుమారు నంగదున్
సారసమిత్రసూతి గని ♦ సైఁపఁగరాని మహార్తి దుఃఖకూ
పారమునందు మున్గెఁ బయి♦పై నరుదేరఁగ వేఁడిబాష్పముల్. గీ౨౩

దారుణ = భయంకరములైన, పాశములన్ = త్రాళ్ళచే, సందితుఁడు = కట్టఁబడినవాఁడు. సారసమిత్రసూతి = సూర్యునికుమారుఁడగు సుగ్రీవుఁడు, దుఃఖకూపారమునందున్ = దుఃఖసముద్రమునందు, వేఁడి బాష్పముల్=వెచ్చని కన్నీళ్లు, శోకమున వచ్చు కన్నీళ్ళు వేఁడిగా లోకొలుకులనుండి వచ్చును. సంతోషముచే వచ్చు కన్నీళ్ళు చల్లగా వెలికొలుకులనుండి వచ్చును. వదిన (రూ) వదినె.

తాత్పర్యము.

భయంకరములైన మృత్యుదేవత చేతి త్రాళ్ళచేఁ గట్టఁబడియున్న భర్తను బలుమఱుచూచి యేడ్చు వదినను, సుకుమారుఁడు బాలుఁడునైన యంగదుని సుగ్రీవుఁడు చూచి సహింపరాని దుఃఖబాధ యను సముద్రమున మునిఁగి మీఁద మీఁద వేఁడి కన్నీళ్లు కార్చుచుండెను.

—♦ ౨౦-వ సర్గము. తారావిలాపము. ♦—

ఉ. దారుణబాణతాడితు మ♦దద్విరదాభు మహేంద్రతుల్యునిన్
దార భృశార్తిభారపరి♦తప్తమనోంబుజయై హ్రదీశునిన్
జేరి కవుంగిటం బొదివి ♦ చెట్టు సమూలముగాఁగఁ ద్రెళ్ళిన
ట్లా రమణాంగయష్టిపయి ♦ హా యని వ్రాలె విలాపయుక్తయై. గీ౨౪

దారుణ బాణతాడితుః = భయంకర బాణముచేఁ గొట్టఁబడిన వానిని, మద ద్విరదాభుః = మదించిన యేనుఁగుతో సమానుని. భృశ = అధికమైన, ఆర్తిభార = దుఃఖమను బరువుచే, పరితప్త = మిగులఁ దపించిన, మనోంబుజయై = మనస్సు అను కమలముగలదై, హృదీశునిః = హృదయేశ్వరుని, రమణ = భర్తయొక్క, అంగయష్టి = కట్టెవంటి దేహము, విలాపయుక్తయై = ఏడుపుతోఁ గూడినదై.

తా త్ప ర్య ము.

భయంకరమైన బాణముచేఁ గొట్టఁబడినవానిని, మదించిన యేనుఁగువంటి వానిని, నిందుని(?)తో సమానుఁడగు, వానిని దన భర్తను దుఃఖతాపాతిశయముచేఁ దపించుచున్న మనస్సుగలదై కౌఁగిలించుకొని వేళ్లు తెగి పడిన చెట్టువలెఁ గట్టెవంటి యా పతి శరీరముపైఁబడి యేడ్చెను.

సీ. ఏపాటిరణముల ♦ నేపారు నేపారు నీకిట్టి, పాటబ్బెనే నేఁడు ♦ ప్రాణనాథ!
యనపరాధిని నేను ♦ హా యని పలవింప, బదులు మాటాడవే ♦ ప్రాణనాథ!
నా దోష మే మొకో ♦ నాయకా! నన్నిట్లు, పాసిపోవఁగ నీకుఁ ♦ బ్రాణనాథ!
యే మాత్రమైన నీ ♦ కెదు రాడి యెఱుఁగ నా, పాపమా కోపమా ♦ ప్రాణనాథ!
తే. ప్లవగనాయక లే లెమ్ము ♦ పరమతల్ప, మందు శయనింపు, భూపతు ♦ లెందు నేని
కటికి త్రాలను బండుట ♦ గలిగెనొక్కొ, యెట్టు లే నోర్చుదాన నీ ♦ విట్టులున్న.
ప్లవగనాయక = కోఁతిరాజా!

తాత్పర్యము - సులభము

కం. ఎంతప్రియము మొక్కొ ధరణీ, కాంతపయి న్నీకు ధరణి♦కాంతా! యిటు నేఁ
జెంతన యుండఁగఁజచ్చియు, నింతయుఁ గవుఁగిలిని విడువ♦విది యర్హంబే? ౧౯-౨౦.
ధరణికాంతా = రాజా?

తా త్ప ర్య ము.

రాజా! నీకు భూమి యను స్త్రీపై నెంతమక్కువయోకదా! యిటు లేకుండిన నేను బ్రక్కన నుండినను లక్ష్యము చేయక నన్ను వదలి చచ్చియు భూమిని గాఁగి లించుకొని విడువక యున్నావు.

కం. సురపురితెరువున ధర్మస్థిరగతి! కిష్కింధఁబోలు ♦ శ్రీపురి నీకుం
దొరకెనొకో కాదేనియుఁ, బరమశుభాస్పదము దీనిఁ ♦ బాయఁగఁ దలఁతే. ౧౯-౨౭

తా త్ప ర్య ము.

స్వర్గమునకుఁ బోవు మార్గమందు నీకుఁ గిష్కింధవంటి సంపద్యుక్తమైన వేఱొకనగరము లభించెను గాఁబోలు. లేకున్న మిగులశుభముల కాస్పదమయిన యీ యూరిని విడువఁదలఁతువా?

సీ. ఇంక నెవ్వరిఁ గూడి ♦ యెలమిమై విహరింతు, నారామతలములఁ ♦ బ్రాణనాథ
మధుగంధిసుమముల ♦ మన్నించి నా కింక, నిచ్చువా రెవ్వరు ♦ హృదయనాథ

ప్రాణేశ్వరీ యని ♦ పరమసంప్రీతిని, బిలుతు రిం కెవ్వరు ♦ లలితరూప
యెప్పుడు వచ్చు నా♦హృదయేశుఁ డని తమి నెదు రెవ్వరికిఁ జూతు♦విదితయశుఁడ
ఆ. నాదునాశ లెల్ల ♦ నాశనం బయ్యెనే, సంతసంబు లెల్ల ♦ సమసె నయ్యొ
దేవ నిన్నుఁ బాసి ♦ దిక్కఱి దీననై, మూలయింట నేను♦మూల్గవలసె. ౹౹౨౮

ఎలమిమైన్ = సంతోషముతో, ఆరామతలములన్ = ఉద్యానప్రదేశము లందు, మధుగంధి = తేనె వాసనగల, సుమములన్ = పూలను.

తాత్పర్యము—సులభము.

సీ. *ముగిసెనా నేఁటితో ♦ జిగిమీఱు సొగసార, నీ తోడ విహరించు ♦ నీటు లెల్లఁ
దీరెనా నేటితోఁ ♦ దీయని మురిపంపుఁ బలుకులు నీ తోడఁ ♦ బలుకు టెల్లఁ
గ్రుంగెనా నేఁటితో ♦ రంగారు నీరూపుభంగికై మదిలోనఁ ♦ బొంగు టెల్ల
సమసెనా నేఁటితో ♦ సరి నెలంతలచేత, వల నొప్పఁ గను గౌర♦వంబు లెల్ల
ఆ. నెవ్వరీడు నాకు ♦ నింతులలో నని, పొగరు పడుదు నిట్టు♦లగు టెఱుంగ
నాదుగర్వ మడఁప ♦ నానాథ నీ కిట్టి, పాటు గూర్చె నేమొ♦పాడుబ్రహ్మ. ౹౹౨౯

సరినెలంతలచేత = నాతో సమానురాండ్రగు స్త్రీలచేత.

తాత్పర్యము—సులభము.

సీ. *నా సుఖదుఃఖముల్ ♦ నానాథ! తనవిగా, నెంచి పాలించెడ ♦ రెవ్వ రింక
మన్మనోగతములు ♦ మన సిచ్చి మచ్చిక, నెవ్వనితో వచి♦యింతు నింక
నెవ్వరిఁ గనుఁగొని ♦ యెల్లవారును నన్ను, నిచ్చ మన్నించెద ♦ రింకమీఁద
నెవ్వని ప్రాపు నే ♦ నెద నమ్మి నిర్భయ, వృత్తిమై విహరింతు ♦ నింకమీఁద
ఆ. నెవని సుఖము కొఱకు ♦ నెలమిమై జీవింతు, నేమిసుఖముఁ గోరి ♦ యింక నుందు
నెన్నొ యిన్ని యాస లేవేవియో యుండె, నేఁటితోడ నెల్ల ♦ నేలఁ గలసె. ౹౹౩౦

మన్మనోగతములు = నామనస్సున నుండు కోరికలు, ఇచ్చన్ = ఇష్టముతో, ఇన్ని యాసలు = పెక్కులాశలు.

తాత్పర్యము—సులభము.

కం. నీయట్టివిభుఁడు నన్నుం, బాయుచు నీగులకతాల♦పైఁబడి యుండన్
వేయితునుక లై పోవదు, నాయీహృదయంబు బిడెప్డు ♦ నాశము కాదో. ౹౹౩౧

తాత్పర్యము.

నీవంటిభర్త నన్ను వదలి యీ గులకతాల మీఁదఁ బడియుండఁజూచియు నా హృదయము వేతునుకలై పగులకున్నది. దీని కేనాఁటికి నాశము లేదేమో. ఇప్పుడే కానిది యిఁకెప్డు కాఁగలదు. ఇంతకు మించిన విపత్తు మఱేది రాఁగలదు ?

కం. తమ్మునిఁ బురి వెడలంగాఁ, బొమ్మని మర్దించి వాని♦పొలఁతిని బలవం
తమ్ముగ నేలితి దానిఫ, లమ్మిటు గుడువంగ వలసె ♦ లాలితరూపా. ౹౹౩౨

తా త్ప ర్య ము.

తమ్ముని నూరు వెడలఁగొట్టి వాని భార్యను బలవంతమ్ముగ భార్యను జేసి కొంటివి. దాని ఫల మీా విధముగ ననుభవింపవలసి వచ్చెను.

దీనివలన వాలి సుగ్రీవుని భార్యను బలాత్కారముచేఁ జెఱిచెను. గాని యామె సమ్మతిపైఁ గాదనియు నేర్పడుచున్నది.

కం. నీమేలు గోరి ప్లవగ, స్వామీ! హితమాడలేదె ♦ జేనుల నిడితే?
వ్యామోహంబున నన్నే, ఛీ మాటాడకు మటంచుఁ ♦ జిక్కొట్టితిగా. ॥౩౩

జేనులఁ = చెవులయందు, చిక్కొట్టితివి = ఛీ కొట్టితివి.

తా త్ప ర్య ము.

నీ మేలుగోరి నీకీ దుష్కార్యము వలదని నేను బోధింప లేదా? నామాట నీ చెవుల కెక్కెనా? మోహాతిశయముచే నన్నే ఛీ యూరకుండు మని చీవాట్లు పెట్టితివి గదా.

ఉ. మానితరూప! యౌవనస♦మంచితదక్షుల దేవకాంతలన్
మానద! తావకీనలస♦మానమనోహరకాంతిఁ జేష్ట స్వా
ధీనలఁ జేసికొంచు సుమ♦తీ! తమి నేలవె? యిన్నినాళ్ళు నన్
వానరనాథ! యేలి తగ♦వా యిట నొంటిగ డించి పోవఁగన్. ॥౩౪

మానిత రూప = గౌరవింపఁబడిన యాకారము గలవాఁడా! యౌవన సమంచిత దక్షులఁ = వయస్సుచేఁ బ్రకాశించు సమర్థురాండ్రను, మానద = మానరక్షణము చేయువాఁడా! తావకీన = నీ; లసమాన=ప్రకాశించు; మనోహర = ఇంపైన, కాంతిన్ = కాంతిచేతను, చేష్టన్ = విలాస కార్యముల చేతను.

తా త్ప ర్య ము.

మంచి మనస్సుగలవాఁడా! నడిమి వయస్సుచేఁ బ్రకాశించుచుఁ బురుషుల వశపఱచుకొన నేర్పుగల దేవతా స్త్రీలను నీ సౌందర్యముచేతను విలాసచేష్టలచేతను లోఁపఱచుకొని కోరిక దీర నేలకపోదువా? నీ సుఖము మాత్రము నీవు చూచుకొంటివే కాని యిన్ని నాళ్ళుగ నన్నిచ్చట నేలియు నన్ను నొంటిగ విడిచి పోవుట నీకు ధర్మమా?

ఉ. వారణసత్త్వ పో వలదు ♦ వద్దని నే బతిమాలు చుండినన్
సారెకు నాలకింపక పి♦శాచము సోఁకినయట్లుగా బలా
త్కారముగాఁగ నీడ్చినవి♦ధంబునఁ బోరికి వచ్చి నప్పుడే
యారసి జీవితాంతకర ♦ మంచు నెఱింగితి నీకుఁ గాలమున్. ॥౩౫

వారణ సత్త్వ = ఏనుఁగు బలము కలవాఁడా! జీవితాంతకరము = ప్రాణనాశన కరము.

తాత్పర్యము.

ఏనుఁగు బలము కలవాఁడా! వలదు. వలదు. నీ విపుడు యుద్ధానికిఁ బోవల దని నే నెంత బతిమాలుచుండినను నామాట వినక దయ్యము సోఁకినట్లుగా బలాత్కారముగా నిన్నెవ్వరో యీడ్చుకొని పోవునట్లుగా నెప్పుడు యుద్ధమునకు వచ్చితివో యప్పుడే నీకుఁ బ్రాణనాశకర మగు కాలము సమీపించినదని తలఁచితిని.

ఉ. మానసమందు దుఃఖ మను♦మాట యెఱుంగను, దైన్య మెట్టిదో
యేను దలంప నిందనుక ♦ నిట్టి దటంచును నీదు మన్ననన్,
దీనత నెల్ల కాల మిఁకఁ ♦ దీఱనిదుఃఖముచేఁ గృశించుచున్
వానరనాథ! యెట్లు విధ♦వాత్వము దిక్కఱి నే సహించెదన్. ౫౩౬

దిక్కఱి = దిక్కులేనిదాననై.

తాత్పర్యము.

నాథా! యింతదనుక దుఃఖ మనుమాటయైన నెట్లుండునో మనస్సునందైన నే నెఱుంగను. నీవు నన్ను గౌరవించుచుండుటచే దీనత్వ మెట్టులుండునో యదియు నాకుఁ దెలియదు. ఇఁక మీఁదఁగల కాలము దీనత్వముచేఁ గలుగు నంతములేని దుఃఖముచే శుష్కించుచు దిక్కులేనిదాననై యీ వైధవ్యమును నే నెట్లు సహింపఁ గలను.

ఉ. రార కుమార! నీజనకు ♦ రమ్యగుణాకరు ధర్మరక్తుఁ గ
న్నారఁగఁ జూడరా యిపుడె ♦ హా యిదె చూ కడసారి, యింక నీ
కోరినయేని నీదుజన♦కుం గనుభాగ్యము లేదు రన్న, నీ
వేరిని నాయనా యనుచు ♦ నింకను బిల్తువురా కుమారకా! ౫౩౭

రమ్యగుణాకరున్ = మనోహరములైన గుణములకు గనియైన వానిని- ధర్మరక్తున్ = ధర్మమందుఁ బ్రీతిగలవానిని.

తాత్పర్యము.

కుమారా! యిటు రమ్ము. మనోహరగుణముల కాస్పదమై ధర్మప్రీతిగల నీ తండ్రిని గన్నుల కఱవుదీర నిపుడే చూడుము. ఇదియే కడసారి చూపు. ఇఁకమీఁద నీ తండ్రిని నీవు చూడఁగోరినను జూచు నదృష్టము నీకు లేదు. కుమారా! యిఁక నెవరినిరా నీవు నాయనా! యని పిలుతువు?

ఉ. చూడుము వీఁడె యంగదుఁడు ♦ శూరకులాగ్రణి! సౌఖ్య మెన్నఁడున్
వీడినవాఁడు కాఁ డఖిల♦వేళల గోమునఁ బెంపఁ బెర్గె, వా
యోడెడి నీదుమున్న, యయ♦యో కడుఁగోపిని బిన్నతండ్రి నే
జాడను గొల్చువాఁడో, కపి♦సత్తమ! యేగతిఁ బట్టి పోవునో? ౫౩౮

ఇట్లు కొడుకును జేరఁదీసి వాలిని జూచి చెప్పుచున్నది- గోమునన్=ముద్దుగా, సౌకుమార్యముగా- వాయోడెడిన్ = మాటాడ భయపడువాఁడు.

తాత్పర్యము.

శూరాగ్రేసరా! యిదిగో వీఁడె యంగదుఁడు చూడుము. ఏ సమయమందును సౌఖ్యమును వీఁడినవాఁడు కాఁడు. సర్వకాలములందు ముద్దుగాఁ బెంపఁగాఁ బెరిఁగినవాఁడు. నీ యెదుట మాటలాడుటకే భయపడుచుండువాఁడు. ఇఁకఁ గోపిష్ఠియైన పినతండ్రి సేవ యెట్లు చేయఁగలఁడో; చేయకుండిన నేగతి పట్టునో.

చం.అని పతిమీఁద వ్రాలి ప్లవ♦గాధిప! యీతఁడె నీ సుతుండు నీ
కను లొకయింత విచ్చి కనఁ♦గాఁ దగదే? యిటు లేల యేడ్వె నా
యన! యని తేర్ప రాదె? శిర ♦ మూదట మూర్కొన రాదె? దూరమున్
జనియెద వొక్కమాట కడ♦సారికిఁ జెప్పఁగ రాదె బుద్ధిగన్. ౫౩౯

మూర్కొనరాదె = వాసనచూడరాదా

తాత్పర్యము.

అని మగనిమీఁదఁబడి వానరేశ్వరా! వీఁడే నీకొడుకు- కన్నులు కొంచెము తెఱచి చూడరాదా? ఏలరా యేడ్చెదవని సమాధాన పఱుపరాదా? శిరస్సు వాసన చూడరాదా? దూరము పోయెదవే- కడసారిమాటగ బుద్ధి చెప్పరాదా?

చం.కటకట నిన్నుఁ జంపి ఘన♦కార్యము చేసెను రామభద్రుఁ, డి
చ్చట దిననాథసూతియెడఁ ♦ జల్పినబాసను దీర్చి యప్పు ప్రి
స్ఫుటముగ నీఁగె; సూర్యసుత! ♦ నూడు దొలంగఁగ నన్నుఁ జంపి తిం
కిట రుమతోడ రాజ్యరమ ♦ యేలుము భీతి తొలంగి హాయిగన్. ౫౪౦

నూడు = విరోధము- బాస = ప్రమాణము- తొలంగి = వదలి.

తాత్పర్యము.

వానరేంద్రా! నిన్నుఁ జంపి రామభద్రుఁడు గొప్ప కార్యముఁ జేసెను. అది యేమి దనెదవా? సుగ్రీవునకుఁ జేసిన ప్రమాణము సార్థకము చేసి యా యప్పు దీర్చు కొనెను. సుగ్రీవా! విరోధము పోవునట్టు లన్నను జంపితివి. ఇఁక హాయిగా రుమ తోడను రాజ్యరమతోడను సుఖింపుము.

కం.వల్లభ యిదె నీపెక్కురు,వల్లభ లిట నేడ్చువారు ♦ వల్లభ! యనుచున్
బల్లెత్తి మాట యొక్కటి, సల్లాపింపంగ రాదె♦చతురమనీషా! ౫౪౧

వల్లభలు = ప్రియురాండ్రు- చతురమనీషా = నేర్పుతోఁ గూడిన ప్రజ్ఞగల వాఁడా!

తాత్పర్యము.

మరల వాలిని జూచి చెప్పుచున్నది- ప్రియా! నీ ప్రియురాం డ్రిందఱు వల్లభా యని యిదిగో నిచ్చట నేడ్చుచున్నారు- వారితోఁ బల్లెత్తి యొకమాట మాటలాడరాదా?

చం. అనవుడు వానరీచయము♦లంగదుఁ గుశ్రిచ్చి హృదీశుఁగూర్చి యి
ట్లనిమెఁ గపీంద్ర! ముద్దుసుతు♦నంగదునిన్ గుణసన్నికృష్టుఁ జ
య్యన విడనాడి పోవఁ దగు♦నా పరదేశము నీవు పోవుచో
వనచరనాథ! నీకు నిది♦భావ్యముగాదు తలంచి చూడుమా. ౫౪౨

వానరీచయము = ఆఁడు కోఁతులగుంపు- గుణసన్నికృష్టున్ = గుణము లందు నీకు సమీపించిన వానిని- నీ గుణములవంటి గుణములు గలవానిని-

తా త్ప ర్య ము .

ఈ ప్రకారము తార చెప్పఁగా వాలికిఁ బ్రియురాండ్రగు నాఁడు కోఁతు లన్నియు నంగదుఁ గౌఁగిలించుకొని తమ హృదయేశ్వరుఁడగు వాలితో నిట్లనిరి. కపి రాజా! నీ ముద్దుకుమారుని గుణములందు నీతో సమానుని నంగదుని వదలి పరదే శము నీవు పోవచ్చునా? ఇటు సేయుట నీకుఁ దగినదికాదు. ఆలోచింపుము.

సీ. వీర! పుత్రుని నన్ను♦విడిచి దీర్ఘప్రవాసంబు పోవఁగ నీకు♦జన్నె చెపుమ
యటు పోవఁ దప్పేమి♦యాచరించితి మొక్క, నేనైన సుతుఁడైన♦నిర్మలాత్మ
నేఁ బ్రమాదంబున♦నేరంబె చేసిన, క్షమియింపవే నన్నుఁ♦జారుశీల!
నీ చరణంబుల♦నే నిదె వ్రాలెదఁ, గరుణింపవే నన్నుఁ♦గపివతంస!
తే. యనుచుఁ గరుణంబుగాఁ దక్కు♦వనచరీచ
యంబుతోఁ దార యేడ్చుచు♦నటమటించి
పరమనుతశీల తనప్రాణ♦భర్తదాపు
నంద ప్రాయోపవేశంబు♦నందఁ దలఁచె. ౫౪౩

దీర్ఘప్రవాసంబు=చిరకాల దేశాంతరవాసము, మరణము, చారుశీల=మనో హరస్వభావముగలవాఁడా! కరుణంబుగన్=శోకముతోఁ గూడినట్లుగ, అటమటించి= కంపముచెంది, ప్రాయోపవేశంబు=ప్రాయ + ఉపవేశము=అన్నపానముల వదలి మరణింప వలయునని నిశ్చయించి పరుండుట, అందన్=ఆప్రకారము చేయుటకు-

తా త్ప ర్య ము .

వీరుఁడా! నన్ను నీ కొడుకును వదలి స్థిరముగాఁ బరలోకమందుండఁ బోవుట నీకుఁ దగునా? నీవు మమ్ము వదలిపోవుటకు నేనుగాని నీ కొడుకుగాని యేమి తప్పుచేసి తిమి? ఒకవేళ నేను బొరపాటున నట్టిద్రోహము చేసియుండిన మంచిస్వభావము గల వాఁడా! నన్ను క్షమింపుము. కపిశ్రేష్ఠా! నీపాదముల నిదే పడుచున్నాను. దయ చూడుము. అని శోకముతోడఁ దక్కిన యాఁడుకోఁతులతోడఁ దార యేడ్చుచుఁ గంపించి తన మగని సమీపమునందే ప్రాయోపవేశము చేయ నాలోచించెను.

—♦ ౨౧-వ సర్గము. హనుమంతుఁడు తార నూరార్చుట. ♦—

కం. తారాపథమును బొయుచుఁ, దార ధరాస్థలిని రాలు♦తద్విధమున నా
తారాధిపతుల్యానన, తార ధరన్ వ్రాల హనుమ ♦ తరుణికి ననియెన్. ౫౪౪

తారాపథమ్ = ఆకాశమును, తార = నక్షత్రము, తారాధిప = చంద్రునితో, తుల్య = సమానమైన, ఆనన = ముఖముగలది.

తాత్పర్యము.

ఆకాశమునుండి నేల వ్రాలిన నక్షత్రమువలె నేలఁ బడియుండు చంద్రునివంటి ముఖము గల తారకు హనుమంతుఁ డిట్లనియె.

ఉ. మానిని యేల యేడ్చెదవు♦మానుము, దేహి కెట్టిందిగియేని య
జ్ఞానముచేత నే నతఁడు♦సల్పిన కర్మమె హేతుభూతమై
మానక మేలుగీళ్లను స♦మంచితరీతిని నాతిరిక్త మ
న్యూనముగాఁగఁ గూర్పుఁ జను♦నొక్కట నా పరలోకసీమకున్. ౫౪౫

తాత్పర్యము.

దేవీ యేల యేడ్చెదవు? ఏడుపు మానుము. దేహధారు లెవ్వరైనను దెలిసి చేసినను దెలియక చేసినను వారువారు చేసిన పుణ్యకర్మమో పాపకర్మమో కారణమై చేసిన కర్మమునకుఁ దగిన ఫలమును గొంచెమైన హెచ్చుగాని తక్కువగాని లేకుండఁ బుణ్యకర్మమునకు శుభము, పాపకర్మమునకుఁ గీడు గలిగించుటకుఁ బరలోకసీమకు వారివారి వెంటనే పోవుచుండును. అట్టులే వాలియుఁ దాను జేసిన శుభాశుభ కర్మఫల మనుభవింపబోయెను. దీనిలో నీవు సుగ్రీవునిగాని రామునిగాని నిందింపఁ బనిలేదు. వారు నిమిత్తమాత్రము. ఇందు నాత్మవిచారము చేయఁబడెను. "అర్థా గృహేన్నివర్తంతే ఆ శ్మశానాత్తు బాంధవాః, సుకృతం దుష్కృతంచైవ గచ్ఛంత మనుగచ్ఛతి." అర్థము లింటనే నిలిచిపోవును - బంధువులు శ్మశానమువఱకు వత్తురు - పుణ్య పాపములు పోయెడి వానివెంటఁ బోవును.

చం. మగువరో నీటిబుగ్గకు స♦మానము దేహము లెల్లవారికిన్
వగవఁగ నీకు నీవ తగు♦పద్ధతి, యన్యుల కేల యేడ్చెదో?
తగఁ గడు దీన వీ వితరు♦దైన్యము కై యనుకంప మందెదే?
జగమున నెవ్వఁ డెవ్వనికిఁ♦జారుమతీ! పలవింపఁ జెల్లెడిన్? ౫౪౬

నీటి బుగ్గకు సమానము=నీటి బుగ్గవలె నల్పకాల ముండునది. అనుకంపము= కరుణ.

తాత్పర్యము.

దేవీ! యందఱకు శరీరములు నీటి బుగ్గలవలె నల్పకాల ముండునవేకాని శాశ్వతముగా నుండునవికావు. కావున శరీరమునకై యేల యేడ్చెదవు? వాస్తవముగ నీ వేడ్వవలసినది నీకై కాని యితరులకై కాదు. నీవు చేసినది నిన్ను బాధించును గాని యితరులు చేసినది నిన్ను బాధింపదు. కావున నీవు చేయరానివి విడిచినను ఇట్లు చేసితినిగదా యని యేడువుము. ఇతరుల కేడ్చుటచే నీకు రాఁగల మేలేమి? నీవే యెంతో దీనురాలవు. నిన్ను నీ వుద్ధరించుకొనలేని దశయందున్నావు. ఇఁక

నొకరి దీనస్థితికి నీవు వగచి యేమి చేయఁగలవు? తమ్ముఁ దాము కాపాడలేనివారు పరులనేమి రక్షింతురు? పడనున్న చెట్టు పడుచున్నచెట్టును గాపాడఁగలదా? కావున లోకమందు నెవ్వ రెవ్వరికై యేడువవలయును. కాఁబట్టి గతించినదానికై వగవక కావలసినకార్యములు చక్కఁగాఁ జేయ యత్నింపుము. నన్నేమిచేయమందువా?

ఉ. బాలకుఁ డంగదుండు పరి♦పాలకురాలవు నీవ వానికిన్,
బాలిక! జీవపుత్రకవు♦భావిశుభార్థము లెల్లఁ గూర్పఁగాఁ
జాలుదు నింతమాత్రమును♦స్వాంతమునం దలపోఁత మాని యి
ట్లేల శరీరమున్ విడువ♦నెంచెదు? దుఃఖము తెల్విఁ బాపెనే? ౯౮౭

జీవపుత్రకవు = బ్రతికియుండు కొడుకుగలదానవు- భావి = రాఁగల; శుభార్థములు = శుభ ప్రయోజనములు.

తాత్పర్యము.

నీవు చేయవలసినది చెప్పెద వినుము. నీ కుమారుఁడు అంగదుఁడు బాలుఁడు- తాఁకు దప్పులు తెలిసినవాఁడు కాఁడు. వాఁడు జీవించియున్నాఁడు అట్టివానిని నీవు గాక మఱియెవరు రక్షింతు గని తలఁచితివి. నీ కడుపునఁ బుట్టిన వానిని రక్షించు శ్రద్ధ నీకే లేకున్న నితరుల కెట్లుండునని తలఁచితివి- ఆ భారము నీయందుఁ గదా యున్నది. వానికి నిఁకమీఁద జరుగవలసిన శుభప్రయోజనములు జరుపవలసినదానవు నీవు కావా? ఈ మాత్ర మాలోచింపక దేహము నేల విడువఁదలఁచితివి. దుఃఖము నీ తెలివిని నాశముచేసెనా యేమి?

ఉ. భూతలమందు భూతములు♦పుట్టుట గిట్టుట రెం డనిత్యముల్
పూతమనీషిణీ! యెఱుఁగ♦వో, యిటు గావున నౌర్ధ్వదైహికం
బై తగు సచ్ఛుభంబులనె♦యర్థము సేయఁగ, నైహికక్రియా
జాతము సేయరాదు పర♦సౌఖ్యముఁ గూర్పఁగ నెంచువారికిన్. ౯౮౮

గిట్టుట=చచ్చుట, అనిత్యములు = స్థిరముగ నుండునవి కావు - పూతమనీషిణీ = పవిత్రమైన మనస్సు గలదానా! ఔర్ధ్వదైహికంబు= ప్రాణము పోయిన పిమ్మటఁ జేయవలసినవి- సచ్ఛుభంబులనే = మంచిమేలగువానినే- ఐహికక్రియాజాతము = ఈలోక సంబంధములైన కార్యసమూహమును - పరసౌఖ్యము = పరలోక సౌఖ్యము-

తాత్పర్యము.

నిర్మలచిత్తా! ఈ లోకమందు భూతములు పుట్టినవి స్థిరముగా నుండవు. మరణించినవి మరలఁబుట్టక యుట్లేపోవు-ఈరెండు ననిత్యములే- పుట్టినవి చచ్చుట నిజము- చచ్చినవి పుట్టుట నిజము- ఇది నీవెఱుఁగవా యేమి? కావున మనకు హితు లగువారు బ్రదికి యున్నప్పుడు వారిమేలునకై యీలోకకార్యము లెట్లుచేసెదమో వారు మరణించి పరలోకమునకుఁ బోయినపుడు అక్కడ వారికి మేలుకలుగు ప్రేతకార్యాదులు చేయవలయును- వారిని గూర్చియీలోకకార్యములగు రోదనాదులు చేయరాదు. ఇది

వారికిఁ గీడు కలిగించును. బ్రతికినవారికిఁ జేయుత కార్యములవలెఁ జచ్చినవారికి రోద నాదులు నిషిద్ధములు.

చం. హరివరకోటి నేలెను స♦హస్రములం బ్రయుతార్బుదంబులం
బరమమతిన్ స్వకీయులను♦మన్చెను పెక్కువిధాల, ధర్మత
త్పరుఁడయి శాస్త్రదృష్టశుభ♦తత్త్వవిధిజ్ఞత సామదానశాం
తిరతిఁ జెలంగి వీడెను క్షి♦తిం గపినాథుఁడు దుఃఖ మేటికిన్. ౫౪౯

ప్రయుత + అర్బుదంబులన్ = పదిలక్షలు - పదికోట్లు సంఖ్యగలవారిని - స్వకీయులను=తనవారిని- మన్చెను = కాపాడెను- శాస్త్రదృష్ట = శాస్త్రమున విధింపఁబడిన, శుభ = మేలైన- తత్త్వవిధిజ్ఞతన్ = యథార్థాంశము తెలియుటచే,సామ = మంచి మాటలు చెప్పుటయందును, దాన = కోరికల నెఱవేర్చుటయందును, శాంతి= అపరాధుల మన్నించుటయందును, రతిన్ = ప్రీతిచే.

తా త్ప ర్య ము.

వాలికై యేమినిమిత్తమై నీవేడ్చుచున్నావు. పరలోకసుఖమునకై కావలసిన వీలోకమునఁ జేసికొనకముందే మరణించెనని యేడ్చెదవా? వేలు, లక్షలు, కోట్ల సంఖ్యగల వానరశ్రేష్ఠ సమూహమును బరిపాలించెను. అనేకవిధములఁ దన్నాశ్రయించిన బంధువులను మిత్రులను గొప్ప మనస్సుతో వారివారికిఁ దగిన జీవనములు గల్పించి బ్రదుకఁజేసెను. ధర్మమందు దాసక్తిగలవాఁడై శాస్త్రమునఁ జెప్పఁబడిన తత్త్వార్థ మెఱింగి సామము దానము శాంతి వీనియందుఁ బ్రీతిగలవాఁ డయ్యెను. ఇట్లీలోకమునఁ జేయఁదగిన వన్నియుఁజేసి యీ లోకమును వదలిపెట్టెను.

కం. అంగదునకుఁ గపిభల్లుక,పుంగవులకుఁ గీశరాజ్య♦మునకున్ నీ వా
యంగన! దిక్కఁక నీపై,సంగతిగా నిలిచినదియ♦సకలభరంబున్. ౫౫౦

కపి భల్లుక పుంగవులకున్ = కపిపుంగవులకు, భల్లుక పుంగవులకు = కపి భల్లుక పుంగవులకు, ద్వంద్వాంతే శ్రూయమాణం పదం ప్రత్యేక మభిసంపద్యతే. కపిశ్రేష్ఠులకు, భల్లుకశ్రేష్ఠులకు- కీశరాజ్యమునకు = కపిరాజ్యమునకు, సంగతిగాన్= సంబంధముతో.

తా త్ప ర్య ము.

అంగదునకుఁ గపిశ్రేష్ఠులకు, భల్లూకశ్రేష్ఠులకు, కపిరాజ్యమునకు నీవే దిక్కు. సమస్తభారము నీయందున్నది. నాకు దిక్కేది యనుట కిది సమాధానము.

కం. మానుము శోకము మెల్లగ, మానిని! నీ సాయమునను♦మానితగతి నీ
సూనుఁడు రాజ్యము సేయ మ,హానందము నందఁ గలుగు ♦ నడలకు మిట్టుల్.

సాయమునను = తోడుపాటుచే - సాహ్యశబ్దభవము సాయము.

తా త్ప ర్య ము.

ఏడుపు వదలుము. క్రమక్రమముగ నీ సాహాయ్యముచే నీ కొడుకు రాజ్యము సేయఁగా నీవు మిగుల సంతోషింపఁగలవు. కావున నిట్లులు పరితపింపకుము.

అంగదుఁ డే గతిపట్టునో యనుట కిది సమాధానము.

ఈ వాక్యములవలన నూరార్పుమాటలయందుఁ గొంచె మసత్యము కలసినను దోషములే దని యేర్పడుచున్నది. లేదా యంగదుఁడు యౌవరాజ్యమును నీ సాహాయ్యముచేఁ జేయఁగలఁడు. కావున శోకింపకు మనియైనఁ జెప్పవచ్చును.

కం. ఏమినిమి త్తము సంతతి, భూమిపయిం గనఁగఁ గోరుఁ ♦ బురుషుఁడు నేఁ డో
భామా? యది ఘటియిల్లెను, భూమిపునకుఁ జేయుఁగాక ♦ పుత్రుఁడు క్రియలన్.

తా త్ప ర్య ము.

గతించిన దానికై నీ వేడ్చి ప్రయోజనములేదు. భవిష్యత్తునందు నీకు నీ కొడుకునకు రాఁగల కష్ట మేదియు లేదు. కావున వర్తమానమున జరుగవలసిన వాలోచింపుము. లోకులు కొడుకులు కావలయు నని యేమి ప్రయోజనము గోరి కోరుదురో యట్టి కార్యము నెఱవేర్చు కాల మంగదునకు సంభవించెను. కావున నీ కొడుకు తండ్రి కుత్తరక్రియలు చేయనిమ్ము.

కం. తీరిచి కపిపతికిని సం,స్కారము సుతు రాజ్యమునను ♦ స్థాపించి వెతల్
దూరంబుఁ జేసె దనవుడుఁ, దార హనూమంతునకును ♦ దా నిట్లనియెన్. ౧౧౩

తా త్ప ర్య ము.

అంగదుఁడు వాలికి సంస్కారము గావింపఁగా నతని రాజ్యమునందు స్థాపించి నీవు దుఃఖమును బాసెదవు. అనఁగా హనుమంతునకుఁ దార యిట్లనియె.

'హ్నుష్టంచ హ్నుషితంచాపి హేంపా ప్రోంపా హనుష్మానూః' ద్వి. కో. అని హను హనూ శబ్దంబులు రెండు నుండుటచే, హనుమంతుఁడు హనూమంతుఁడు అని రూపంబులు.

—♦ తార హనుమంతునకుఁ బ్రత్యుత్తర మిచ్చుట. ♦—

కం. వినుమీ యంగదసన్నిభ, తనయశతముకంటె శౌర్య♦ధనుఁడై సమరా
వనిఁ ద్రెళ్ళిన నా వల్లభు, తనువు కవుఁగిలింత వరము♦తథ్యము కీశా! ౧౧౪

అంగద సన్నిభ = అంగదునితో సమానమయిన, తనయ శతముకంటెన్ = నూర్వురు కొడుకుల కంటె.

తా త్ప ర్య ము,

హనుమంతా! యంగదునివంటి కొడుకులను నూర్వురఁ గనుటకంటె శౌర్యమే ధనముగాఁ గలిగి యుద్ధమందుఁ బడిన నా భర్త దేహము నుగవుఁగిలించుకొనుటే శ్రేష్ఠము.

ఉ. ఎవ్వతె నయ్య నేను ప్లవగేశ్వరు సంస్కారణంబు దీర్పఁగా?
నెవ్వతెనయ్య నంగదుఁ గపీశ్వర రాజ్యమునందు నిల్పఁగా?
నవ్విధు లెల్లఁ దీర్పఁగ సమర్థుఁడుచూ పినతండ్రి యుండ, నే
రవ్వయు నాకు నేమిటికిఁ బ్రాణధవుం డరుగంగ స్వర్గమున్. ౫౫౫

సంస్కారణంబు = దహనాది క్రియలు, రవ్వ = రచ్చ.

తాత్పర్యము.

వాలికిఁ బ్రేతకార్యములు తీర్ప నే నెవ్వతెను? అంగదునకు రాజ్య మప్పగింప నేనెవ్వతెను? అవన్నియుఁ జేయవలసిన సమర్థుఁడు వానిపిన్నతండ్రియగు సుగ్రీవుఁడు నాప్రాణేశ్వరుఁడే స్వర్గమునకుఁ బోఁగా నీరాజ్యవిషయమైన రాజు సుగ్రీవుఁడా యంగదుఁడా యను కలహము నాకేల? ఎవఁడు రాజైన నాకు రాఁగలగౌరవము సుఖము లాభ మేమి కలదు? నా ప్రాణేశ్వరుఁ డున్నచోటనేకదా నా ప్రాణము లుండవలెను.

తే. అంగదుని విషయంబున నాంజనేయ! యేను యోజింపఁ దగినది యేది లేదు
కొడుకునకుఁ దండ్రి యేచుమీ కూర్మిబంధు,వరయ జనయిత్రిగాదయ్య హరివతంస!

తాత్పర్యము.

ఆంజనేయా! యంగదుని విషయమున నేను యోజింప వలసిన దేదియు లేదు - కొడుకునకు విద్యాబుద్ధులు నేర్పి గుణవంతునిఁ జేయవలసిన భారము తండ్రిది గాని తల్లిదిగాదు- తల్లియందు దేహపోషణ భారము మాత్రమే కలదు-తల్లిదండ్రు లిరువురు లేనివానికే తల్లియైన నింతకూడు పెట్టదా?

కం. పరముననే నిహమున నే, హరివరు సంశ్రయముకంటె నత్యుత్తమముగ
బరికింప లేదు నే నిఁక, హరి! యభిముఖనిహతు శయ్య నగుఁ బండ ననన్.

తాత్పర్యము.

పరలోకమునందైనను నీ లోకమందైనను వాలి నాశ్రయించి యుండుటకంటె నుత్తమమైనది నాకుఁ గనఁబడలేదు. కావున రణమునందు నెదురుముఖమున దెబ్బ దినిన వీరుని వీరశయనమందు నేను బండుకొనుట దగును.

(సీతావాక్యము. చూ. అయోధ్య. స. ౮౨౯.)

ఇచ్చట వాలి యభిముఖనిహతుఁ డనియే చెప్పెను. ఇదివఱకు శ్రీరామచంద్ర మూర్తి బాణము ప్రయోగించునపుడు చాటుగ నుండలేదు, ఎదురుగా నుండె నని వ్రాయఁబడిన యభిప్రాయమును బలపఱుచుచున్నది.

—— ౨౨-వ సర్గము. వాలి సుగ్రీవునితోఁ దాను జేసిన యపకారము మఱవుమని చెప్పుట. ——

కం. అంతట గుట్టుసుఱునఁ గపి,కాంతుఁడు శ్వాసంబు మెల్లగాఁ బుచ్చుచుఁ దాఁ
జెంతను గనె నంగదుఁ దదు,పాంతంబునఁ బ్రాప్తవిజయు నర్కాత్మభవున్.

కుట్టుసులు = కుఱు + ఉసులు = కొంచెము ప్రాణము, తదుపాంతంబునన్ = వాని సమీపంబున, దీనివలన సుగ్రీవుఁ డంగదుని దనదగ్గఱకుఁ దీసె నని భావము.

తా త్ప ర్య ము.

ఇట్లు వీరు మాటలాడుచుండు సమయంబునఁ గొంచె మూపిరిగల వాలి మెల్లగా నూర్పుచ్చుచుఁ దాఁ గన్నులు విచ్చి తన చెంతనున్న యంగదుని వాని సమీపమందు లబ్ధవిజయుఁడై యున్న సుగ్రీవునిఁ జూచెను.

సీ. కని స్పష్టమైన వా♦క్కున స్నేహపూర్వంబుగా నిట్టు లను దివా♦కరతనూజు
సుగ్రీవ! నీపయి♦నూఁడు చాటితి నని, యనఘ! దూషింపకు♦మయ్య నన్ను
భావిఫలం బట్టు♦పట్టి యీడిచి బలా,త్కారంబుగను దెల్వి♦తలఁగఁ జేసె
మనమిద్దఱమునొక్క♦మాటుగా సౌభ్రాత్ర, మునఁగూడిసుఖియింప♦ మొనయదయ్యెఁ
తే. దమ్ముఁడా! దైవకృత మది♦దప్పఁ జేయ, మనకు శక్యమె నే నింక♦మనఁగఁ జాల
నీ వనేచరరాజ్యంబు ♦ నేలుమి నీవు, కొమ్మ పాలించుచుండుమీ ♦ నిమ్మళముగ.

నూఁడు = పగ- చాటితిని = ప్రకటించితిని - సాధించితిని - భావిఫలంబు = రాఁగలకాలమునఁ గలుగవలసిన ఫలము.

తా త్ప ర్య ము.

ఇట్లు చూచి సుగ్రీవు నుద్దేశించి స్పష్టమైన మాటలతో స్నేహపూర్వముగ ని ట్లనెను. సుగ్రీవా! నీ మీఁదఁ బగసాధించితి నని నన్ను దూషింపకుము. నీయందు దోషము లేదు. ఇది యిట్లు జరుగవలసియుండుటచే నా ఫలము నన్నుఁబట్టి యీడిచి బలవంతముగ జ్ఞానహీనునిఁ జేసెను. అన్నదమ్ముల మర్యాద ననుసరించి మన మొక్కటిగఁ గూడియుండుట లభించినది కాదు. తమ్ముఁడా! యిది దైవముచేసిన పని- దానిని దప్పించుటకు మనకు శక్యమా? ఇఁక నేను జీవింపలేను. ఈ వానరరాజ్యము నీవు సంతోషముతోఁ బాలింపుము.

కం. జీవితమును రాజ్యంబును, శ్రీవైభవముఁ ధరిత్రి ♦ త్రిజగద్వినుతం
బై వఱలిన సత్కీర్తియుఁ, బో విడి చనువాఁడ సుగుణ♦భూషణ! దివికిన్. ౫౬౦

తా త్ప ర్య ము.

ప్రాణము, రాజ్యము, సంపద భూమిమీఁద మూఁడులోకములఁ బొగడ్తగన్న యశస్సు వీనిని వదలి స్వర్గమునకుఁ బోవుచున్నాను.

## —♦ వాలి సుగ్రీవునకు నంగదు నప్పగించుట. ♦—

ఉ. ఈ దురవస్థయందు సెడి♦యేనియు దుష్కర మేను జెప్పినన్
గా దన కీవు సేయఁదగు ♦ వానరవర! కంటివె బాలుఁ, బ్రాజ్ఞునిన్,
రోదనసక్తు, బాష్పచయ♦దూషితవక్త్రుని, సౌఖ్యపాత్రుని, ప
మోదముతోడ నే నెపుడు♦ముద్దుగఁ బెంచిన చిన్నిబాలకున్. ౫౬౧

దురవస్థ = చెడుస్థితి, మరణదశ, దుష్కరము = చేయఁగష్టమైనది. ప్లవగేశ్వర= రాజా! ఇఁక నీవే రాజవు గమ్ము అని భావము. రోదనసక్తుఁ = ఏడుచుచున్న వానిని, బాష్పచయ = కన్నీళ్ళ సమూహముచే, రూషిత=వ్యాప్తమైన, వక్త్రుఁ= ముఖము గలవానిని, ప్రాజ్ఞుఁ = చిన్నవాఁడైనను బుద్ధిమంతుని, సౌఖ్యపాత్రుఁ = సౌఖ్య మనుభవింప యోగ్యుఁడగు వానిని, చిన్ని = మనోజ్ఞమైన, "మన యశోద చిన్ని మగవానిఁ గనె నఁట" భాగ, స్కం. ౧౦.

తాత్పర్యము.

సుగ్రీవా! నీవే రాజవు, నే నీ మరణావస్థయందు నీకుఁ జేయుటకుఁ గష్టమైన పని చెప్పినను నేను జేయ నసక చేయుటే ధర్మము. అదిగో బాలుని, బుద్ధిమంతుని, నేడ్చుచున్న వానిని, కన్నీటిచే వ్యాపించిన ముఖము గలవానిని, సౌఖ్యపడ నర్హుని నేనెప్పుడు గారాబముతోఁ బెంచిన పిల్లవానిని,

తే. అంగదుని నాదుపుత్త్రు నా◆ప్రాణములకు, మిన్నయగువాని నన్న! నీ◆కన్నకొడుకు
నట్లు సాఁకఁ గదయ్య స◆మస్తదశల, దాతవును బ్రాత వీవె నా◆తనయునకును.

తాత్పర్యము.

అంగదుని నా కుమారుని నా ప్రాణములకంటె నెక్కువగు వానిని నన్నా! నీవు కన్నకుమారునివలె నన్ని వేళల రక్షింపుము. తండ్రివి త్రాతవు వాని కిఁక నీవే.

చం. భయపడునట్టిచోట వెఱఁ◆బాపును వానికి, విక్రమంబునన్
రయగతి నీకుఁ దుల్యుఁడు, దు◆రంబున రాక్షసపాళిఁ ద్రుంప దు
ర్జయుఁ డయి నీదు ముంగటన◆క్రాలుఁ జుమీ, యనురూపకర్మసం
చయములు వీఁడు సల్పు, రణ◆శౌండుఁడు జంకఁ డొకించుకేనియున్. ౧౬౩

రయగతిన్ = వేగముతోఁగూడిన గమనమందు, తుల్యుఁడు = సమానుఁడు; దురంబునన్ = యుద్ధమందు; దుర్జయుఁడయి = జయింపరానివాఁడై; అనురూప = వానివయస్సునకు శక్తికిఁదగిన, కర్మసంచయములు = కార్యసమూహములు - రణశౌండుఁడు = యుద్ధమున దక్షుఁడు, జంకఁడు = సందేహింపఁడు.

తాత్పర్యము.

వాఁడు బాలుఁడు కావున భయపడిన సమయమున భయముఁ బాపును పరాక్రమమందు వేగముతోఁడి గమనమందు నీకు సమానుఁడు- యుద్ధమందు రాక్షసులఁ జంపునపుడు నీ కన్నుల యెదుటనే పరాక్రమింపఁ గలఁడు. వానివయస్సు శక్తికిఁ దగినకార్యములు చేయఁగలఁడు. యుద్ధమున దక్షుఁడు. సందేహింపఁడు.

సీ. అనఘు సుషేణుని◆తనయ యీ తార సూ, క్ష్మార్థనిశ్చయ నిపు◆ణాత్మ సుమ్ము
ఔత్పాతికజ్ఞాన◆మందుఁ బండితురాలు, భామిని మేలని◆పలికినట్టి
పని యవశ్యము సల్ప◆వలయును గొంకక, యింతయేమిటికి నీ◆యింతి చెప్పి
నట్టి దేదియుఁ దప్పు◆దయ్య యిం కొక్కటి, పలికెద నీ మదిఁ◆బదిలపఱుపు

తే రాముకార్య మవశ్యక♦ర్తవ్యమెప్పుడు, శంకయొక్కింతయును లేక♦సలుపు మీవు
చేయకుంట యధర్మంపు♦జేత మఱియు, నవమతియొనర్చి తనుచు ని♦న్నపుడ చంపు.

సుషేణుని తనయ=సుషేణునికూఁతురుతార; తార సముద్ర మథనకాలమందు జన్మించినది. అపుడు వాలికుడిచేతిని సుషేణుఁ డెడమచేతిని బట్టుకొని యీమె నా భార్య యీమె నా భార్య యని వాదులాడిరి - అప్పుడు దేవతలు మధ్యస్థులై కుడిచేతిని బట్టుకొనినవాఁడు మగఁడనియు నెడమచేతిని బట్టుకొనినవాఁడు తండ్రియనియుఁ జెప్పి యీ వివాదము తీర్చిరి. కానఁ దార సుషేణుని తనయ యని చెప్పఁబడెను.

సూక్ష్మార్థ నిశ్చయ నిష్ణాతా త్మ= సూక్ష్మములైన సంగతుల నిశ్చయించుట యందు సమర్థమైన మనస్సుగలది- ఔత్పాతిక జ్ఞానమందు = అపశకునములఁబట్టి రాఁగల కీడు తెలిసికొనుటయందు- పదిలపఱుపు = స్థిరముగా నుంచుకొనుము- అవశ్య కర్తవ్యము = తప్పక చేయఁదగినది- అవమతి = అవమానము.

తా త్ప ర్య ము.

దోషరహితుఁడా! యీ తార సుషేణుని కూఁతురు. సూక్ష్మములైన సంగతు లెట్లు జరుపవలయునో నిశ్చయించుటయందు సమర్థమైన మనస్సుగలది. శకునములఁ బట్టి రాఁగల కీడులను జెప్పు తెలివియందుఁ బండితురాలు. ఆమె మంచిది చేయ వచ్చును, అనిన పని తప్పక చేయవలయును. స్త్రీ బుద్ధి యె ట్లుండునో యని సందే హింపఁ బనిలేదు. ఇంతయేల? ఈమె చేయవచ్చు ననినది చేయుము. వల దనినది మానుము. ఇంకొకటి మనస్సునందు దృఢముగ నాటింపుము. రాముని కార్య మే దయినను నీవు సందేహింపక యవశ్యము చేయవలయును. చేయకుండుట యధర్మ కార్య మగుటయే కాక నీవు తన్ను నవమానించితి వని వెంటనే చంపును. కావున భయము, భక్తి రెండును గలవాఁడవై వర్తింపుము.

ఉ. నే మరణించినంతట వ♦నేచరవల్లభ! శ్రీదొఱంగు నీ
దామము దివ్య మిష్ట యిది♦దాల్చి వధింపుము నీదుశత్రులన్
శ్రీమహితం బుదారమయి♦చెల్వగు కాంచనమాల యిద్ది, నా
నా మిహిరాత్మజుండును గ్ర♦హార్దితచంద్రుఁడువోలె దీనుఁడై. ౫౯౫

శ్రీదొఱంగున్ = మాహాత్మ్యము హీనమగును, దామము = హారము, ఇష్ట = నేను బ్రాణముతో నుండఁగానే, శ్రీమహితంబు = మాహాత్మ్యసంపదచేఁ బూజ్యము, ఉదారము = గొప్పది, మిహిరాత్మజుండును = సూర్యపుత్రుండును, గ్రహార్దిత = రాహువుచేఁ బీడింపఁబడిన.

ఈ మాలిక శత్రువుల దేహము సోఁకినపుడు వారిబలమును లాగుకొను మహిమ గలది. కావుననే వాలి యెప్పుడు యుద్ధమునకుఁ బోయినను దీనిని ధరించియే పోవు చుండెను. సుగ్రీవునందలి యలక్ష్యబుద్ధిచేఁ బ్రథమయుద్ధంబున ధరించి వచ్చినవాఁడు

కాదు. ఈ రహస్యము తెలిసియే సుగ్రీవుఁడు రెండవసారి యుద్ధంబున సాధ్యమైనంత వఱకు దూరమం దుండియే బాలచేఁ జెల్లచేఁ గొట్టెను.

తా త్ప ర్య ము .

వానరరాజా! నేను మరణించితినా యీ బంగారుహారము దానిమహిమ గోలుపోయినదగును. నీ విప్పుడే దీనినిదీసికొని ధరింపుము. ఇది ధరించియే శత్రువుల సంహరింపుము. ఇదిగొప్ప మహిమగల బంగారుదండ, అనిచెప్పఁగా సుగ్రీవుఁడు గ్రహణము పట్టిన చంద్రునివలెఁ గాంతిహీనుఁడై.

కం. తన యగ్రజువచనంబుల, ఘనతరశాంతంబుఁ దాల్చి ♦ కాంచనమాలన్
గొనియె ననుజ్ఞాతుండై, తనుజాతునిఁ జూచి వాలి♦తగ నిటు పల్కెన్. ౫౬౬

అగ్రజు=అన్నయొక్క- ఘనతరశాంతంబు=మిగుల గొప్పదగు శాంతిగుణము-అనఁగాఁ బూర్వమున్న విరోధబుద్ధిని- అనుజ్ఞాతుండై = వాలిచే ననుజ్ఞయీయఁ బడినవాఁడై; తనుజాతుని = కొడుకును; తగవు = ధర్మము.

తా త్ప ర్య ము.

ఈ ప్రకార మన్న చెప్పినమాటల విని సుగ్రీవుఁడు తనమనస్సునఁ బూర్వముండిన విరోధము రోషము వదలి శాంతుఁడై బంగారు సరమును ఆయనయనుజ్ఞ ప్రకారము తీసికొనెను. అప్పుడు వాలి తన కొడుకును జూచి ధర్మ మిట్లుపదేశించెను. ఆనందరామాయణమున నీ చిత్రవృత్తాంతము గననగు -

"ప్రీత్యర్పితా మాలికా సా, వాలీ కంఠే దధత్యసౌ
తస్మాత్త్వం దర్శనా ద్రామ, గతసత్త్వో భవిష్యసి
తత్రోపాయం చింతయస్వ, యేన తేఽద్య జయో భవేత్
తత్తస్యవచనం శ్రుత్వా రామః, సర్వం త మబ్రవీత్
గచ్ఛ త్వం మమవాక్యేన, కిష్కింధాయాంచ వాలినమ్
నిశి వినిద్రితం దృష్ట్వా, హర తన్మాలికాం శుభామ్.
తథేతి రామవాక్యేన, కిష్కింధా మేత్య పన్నగః
మంచకస్థాం జహారాథ, తాం మాలాం వాసవం దదౌ. ౧"

సారకాండము- అష్టమసర్గము.

ఒక పాము రామునితో వాలి మెడలో నున్న మాల నీవు చూడఁగానే నీవు బలహీనుఁడ వవుదువే నీ వెట్లు వాలినిఁ జంపఁగల వనెనఁట. నీవే పోయి వాలి నిద్రించునపుడు వాని మెడలోని హారము హరించి తెమ్మని రామచంద్రమూర్తి దానితోఁ జెప్పెనఁట. అది యట్టులే పోయి వాలి నిద్రించుచుండఁగా హరించి యింద్రున కిచ్చెనఁట. ౫౬౫ వ పద్యమే యిది పిట్టకథ యని తెలుపుచున్నది. కథకుఁ గాళ్లుమృంతకుఁ జెవులు లేవు.

—♦ వాలి యంగదునకు నీతి దెల్పుట. ♦—

తే. దేశకాలంబు లెఱిఁగి వ♦ర్తింపు కొడుక! క్షమవహించి ప్రియాప్రియ♦సంగతులను
సౌఖ్యదుఃఖంబు లోర్చి త♦త్సమయములను, వలనుమీఱఁగ సుగ్రీవు♦వశుఁడవగుము.

తా త్ప ర్య ము.

కుమారా! కార్యములు చేయుటయందు నే దేశమున నేకాలమున నే కార్యమెట్లు చేయవలయునో తెలిసి చేయుచు రమ్ము. అన్ని దేశములు అన్ని కాలములు సమానము లని యెంచకుము. ఒక దేశమున నుచితమైనది మఱియొక దేశమున, నొక కాలమున నుచితమైనది మఱియొక కాలమున నుచితమైనది కాదు. కావున సందర్భోచితముగ వర్తింపవలెను. ప్రియము వచ్చినను అప్రియము వచ్చినను సహింపుము. ప్రియమువచ్చెనేని సంతోషముచేఁ బొంగకుము. అప్రియము వచ్చెనని కృంగకుము. రెండు దశలయందు నీ మనస్సు సమముగా నుంచుకొమ్ము. అట్లులే రాజు చెప్పినది నీకుఁ బ్రియమైనచో నెట్లు చేయుదువో యట్టులే నీ కప్రియమైనను జేయుము. ప్రభుకార్యములు చేయుటయందు నీ ప్రియాప్రియములు లెక్కకు రానీకుము. అట్లు కార్యములు చేయుటయందు సుఖము కలిగినను దుఃఖము కలిగినను సహింపుము. ఈ ప్రకారము వర్తించుచు నీవు సుగ్రీవునకు వశపడియుండుము.

కం. నాపట్ల నీవు చనవుం, జూపుచు వర్తించినట్లు♦సుగ్రీవునెడం
జూపి చరించిన నావలెఁ, జేపట్టుచు లాలనంబు♦సేయఁడు నిన్నున్. ౨౬౮

తా త్ప ర్య ము.

నాయనా! నీవు నా విషయమున నెట్లు చనువుతో నీ యిష్టము వచ్చినట్లు వర్తించితివో యట్లేఁక మీఁద వర్తించితి వేని నిన్ను నావలె సుగ్రీవుఁడు క్షమింపఁడు. బుజ్జగింపఁడు. ఏమో పిల్లతనములే యని యూరకుండఁడు. దండించును. కావున నా విషయమున వర్తించినట్లు సుగ్రీవుని విషయమున వర్తింపకుము.

కం. ఈతని యహితులతోడను, నీతనిశాత్రవుల మిత్ర♦బృందముతోడన్
రీతి చెడి మైత్రిసేయకు, మీతనికార్యములుసేయు♦మెంతయు దాంతిన్. ౨౬౯

తా త్ప ర్య ము.

ఈ సుగ్రీవుని పగవారితోఁగాని వారి స్నేహితులతోఁగాని నీవు స్నేహము చేయవలదు. అది సందేహమునకుఁ గారణమగును. ఈతని కార్యములే యోర్పుగలిగి చేయుచుండుము.

కం. చేయకుము యతిస్నేహము, చేయకు మస్నేహ మెపుడు♦చెడు నీరెండున్
బాయ కెద జాగరూకత, నాయన! మధ్యస్థపథము♦నన్ వర్తిలుమా. ౨౭౦

తా త్ప ర్య ము.

నాయనా! యెవరితోనైన మితిమించిన స్నేహము చేయకుము. అది యవజ్ఞతకుఁ గారణమగును. ఎవరితోనైనను విరోధింపకుము. అతిసర్వత్రవర్జయే త్తను నట్లే

రెండును జెఱుపుగలిగించునవే. కావున హెచ్చరికగలవాఁడవై మధ్యస్థుఁడవై వర్తింపుము.

—♦ వాలి మరణించుట. ♦—

కం అని చెప్పి గుడ్లు గిరగిర, మని త్రిప్పుచు తీవ్రబాణ♦హతిఁ బీడితుఁ డై
గనఁబడ భీకరరదములు, వనచరలోకేశుఁ డపుడు ♦ ప్రాణము విడిచెన్. ౫౭౧

తీవ్రబాణహతిన్ = తీక్ష్ణమైన బాణము దెబ్బచే, పీడితుఁడై = బాధింపఁబడినవాఁడై, భీకరరదములు = భయంకరములైన దంతములు.

తా త్ప ర్య ము.

ఈ ప్రకారముచెప్పి వాఁడిగల బాణముచే బాధపడువాఁడై గ్రుడ్లు గిరగిర దిప్పి పండ్లు తెలియునట్లు నోరుతెఱచికొని వానరరాజు వాలి ప్రాణము విడిచెను.

తే. అగచరసమూహ మెల్ల హా ♦ యనుచు నేడ్చె
శూన్యమయి మహిఁ గిష్కింధ ♦ చూడఁదోఁచెఁ
బర్వతోద్యానగహనముల్ ♦ భాతి దప్పి
పాడు పడినట్లు దోఁచెఁ ద♦త్ప్రభువు వోవ. ౫౭౨

శూన్యమయి = పాడు పెట్టఁబడినట్లయి - తేజోవిహీనమయి, పర్వతోద్యానగహనముల్ = కొండలు, తోఁటలు, గుహలు, భాతి = పూర్వపురీతి, కాంతి.

తా త్ప ర్య ము.

కోఁతి గుంపులన్నియు హా యని యేడ్చెను. ఆ ప్రభువు పోఁగాఁ గిష్కింధ పాడుబడినట్లు కాంతిహీనమయి కానిపించెను. కొండలు, తోఁటలు, గుహలు పూర్వమున్నరీతి చెడి పాడుపడినట్లు తోఁచెను.

సీ. ఎవనివేగంబున ♦ నెడలి కాననములఁ, బుష్పౌఘసంబంధ ♦ భూరుహములు
వెనువెంటఁ జనుదెంచు♦ఘనుఁ డట్లు చేయుంగఁ,జాలువాఁ డెవఁడింక ♦ సత్త్వగరిమ
గోలభగంధర్వ♦కుంజరుతో నొక్క,పదునేనువర్షముల్ ♦ పగలు రేయి
యనక యుద్ధము చేసి ♦ యవినీతు షోడశ,వర్షంబునను నేల♦పాలు చేసి
ఆ. మాకు నెల్ల దిగులు ♦ మాన్చి రక్షించె, నట్టి వీరుఁ డేఁడి ♦ యకట యిపుడు
చూడ లేముగాదె ♦ శూరకులాగ్రణి, నింక నొక్కసారి♦యేని యనుచు. ౫౭౩

పుష్పౌఘ = పూలసమూహములతో, సంబంధ = నిండిన, భూరుహములు = చెట్లు, సత్త్వగరిమన్ = బలాతిశయముచే, గోలభ గంధర్వకుంజరున్ = గోలభుఁ డను గంధర్వ శ్రేష్ఠునితో.

తా త్ప ర్య ము.

వేగముగ నడచునపు డడవులయందలి నిండార పూచిన చెట్లవనివెంట వచ్చుచుండునో యట్టి వాలివలె బలముచే నాప్రకారము చేయఁగలవాఁ డెవఁడు గలఁడు?

గోలభుఁడను గంధర్వునితోఁ బదునైదు సంవత్సరములు విడువక హోరాహోరి రేయుంబగలు యుద్ధముచేసి పదునాఱవ సంవత్సరమున నా దుష్టునిఁజంపి మా కంద ఱకు భయము పాపి రక్షించె నట్టివీరుఁ డీక నెవఁడు గలఁడు? ఇట్లు చేసిన యా వీరుని నిఁక నొక్కసారియైనఁ జూడలేముగదా.

క. గోపతి యీల్గిన గోవులు, ప్రాపటి హర్యక్షకలిత ♦ భయదాటవిలో నేపటిసవిధము దోఁపఁగ, వాపోయిరి క్రోఁతు లెల్ల ♦ వనచరపతికిన్. ౫౭౪

గోపతి=ఆఁబోతు, ప్రాపు+అటి=సహాయములేనిదై, హర్యక్షకలిత=సింహ ములుగల, భయదాటవిలో=భయంకరమైన యడవిలో, ఏపు+అటిన=బలము చెడిన, వాపోయిరి=ఏడ్చిరి, వనచరపతికిꣳ=వాలి నుద్దేశించి, ఉద్దేశార్థంబున ద్వితీయకు షష్ఠి కువర్ణకంబు. చిరముగ బ్రహ్మకుం దపముచేసి- భార- కాశికిఁ బ్రయాణము.

తా త్ప ర్య ము.

ఆవులమందకు రక్షకమై యుండిన యాఁబోతు చావఁగా రక్షణము చెడిన యావులు భయంకరములైన సింహములుండు నడవిలో దుర్బలములై ఘోషించునట్లు వానరు లెల్ల వాలికొఱకు నేడ్చిరి.

క. మృతపతివదనముఁ జూచుచు, వితతవ్యసనాబ్ధి మునిఁగి ♦ విలపించుచుఁ ద త్పతిఁ గుrచ్చి పడియెఁ దారయు, హతవృక్షముతోడ వ్రాలు ♦ నాశ్రితలత నాన్.

మృతపతి=చచ్చినమగనియొక్క, వదనము = ముఖము, వితత=విస్తారమగు, వ్యసనాబ్ధి=దుఃఖసముద్రమందు, కుrచ్చి=కౌఁగిలించుకొని, హతవృక్షముతోడ=కొట్టఁ బడి పడుచెట్టుతోడ, ఆశ్రితలతనాꣳ=ఆశ్రయించియుండిన తీఁగయా యన్నట్లు,

తా త్ప ర్య ము.

మరణించిన పతిముఖముఁ జూచుచు విస్తార శోకసముద్రమున మునిఁగి యేడ్చుచు నా మగనిఁ గౌఁగిలించుకొని కొట్టఁబడిన చెట్టు నేల వ్రాలఁగా దానికిఁ జుట్టుకొన్న తీఁగయు దానితోడఁ బడునట్లు తారయు నేల వ్రాలెను.

—♦ ౨౩-వ సర్గము. వాలి మరణంబునకుఁ దార యేడ్చుట. ♦—

క. ఇటు వ్రాలి వాలిముఖమునఁ, గుటిలాలక ముఖముఁ జేర్చి ♦ కుతిలపడుచుఁ దా నిటు లను నా నుడి విన కీ, కటికశిలల మేను జేర్పఁ ♦ గలిగితె నాథా! ౫౭౬

కుటిలాలక = వంకర ముంగురులు గలది- కుతిలపడుచుꣳ = దుఃఖపడుచు.

తా త్ప ర్య ము.

ఇట్లు వాలిమీఁదఁ బడి యా యుంగరములవలెఁ జుట్టుకొనిన ముంగురులు గల తార యాయన ముఖమునఁ దన ముఖముఁ జేర్చి దుఃఖించుచు నిట్లనియె. అయ్యో! నా మాట వినక యిటు వచ్చి గడుసురాలమీఁద దేహమును జేర్చితివి గదా,

క. నీ కెంతటిప్రియురాలో, నా కంటెను భూమిదేవి♦నగచర దానిన్
నా కనులయెదుర నాశ్లేషాకలనం బేర్చి మాట♦లాడవు నాతోన్. ౧౨౭
ఆశ్లేషాకలనన్ = కౌఁగిలించుటచేత.

తాత్పర్యము.

వానరేశ్వరా! నా కన్నులయెదుర నే నిట్లుచేసిన నిది యే మనుకొనునో యని శంకింపక భూదేవిని గౌఁగిలించి సంతోషపఱచి నాతో మాటలాడవే- నీ కది యెంతటి ప్రియురాలో కదా.

తే. ఆర్య! సుగ్రీవువశ మయ్యె♦నౌర విధియు, వీరసాహసికప్రియ!♦పృథ్వియందు
శూరవరుఁ డన నా సూర్య♦సుతుఁడెగాక, బలియు రెవ్వరు నినుఁ దాఁకి♦బ్రదికినారు.
విధి = దైవము.

తాత్పర్యము.

ఆర్యా! దైవము సుగ్రీవునకు ననుకూలించెఁగదా, అటుగాకున్నఁ దెంపరి గాండ్రకుఁ బ్రియుఁడైన నాహాఁడా! భూమిమీఁద శూరాగ్రణి యనిన సుగ్రీవుఁడే! అతఁడుగాక మఱియెవరు నిన్ను యుద్ధమున నెదిరించి బ్రదికినవారు?

క. వానరగోలాంగూలవి, తానము నే నంగదుండు ♦ దద్దయు నేడ్వన్
వీనుల నిడ వేటికి మా, దీనాలాపంబు లిదియుఁ ♦ దెఱఁగే నీకున్. ౧౨౯

తాత్పర్యము.

వానరులయుఁ గొండముచ్చులయు సమూహములు నేను అంగదుండు మిగుల గోలుగోలున నేడ్చుచుండఁగా మా దీనవాక్కులను నీవు చెవినిడలేదుగదా, ఇది నీకుఁ దగినకార్యమా?

తే. మున్ను నీచేతఁ బగ లెందు♦మన్ని గొనిరొ, యట్టి దగు వీరశయనంబు♦నంద నీవు
యుద్ధసత్ప్రియ! కూలితే ♦ శుద్ధవంశ్య, నాథ! యెం దేగితివి న న్న♦నాథఁ జేసి. ౧౩౦
పగలు= పగవారు, "బహువచన ప్రత్యయంబైన 'లు' కొన్ని యెడల నలఘు రేఫంబగు." పగవారు పగలు, లు-ఇట్లుకాని, పగయనఁగా శత్రువని యర్థము కలదు, కావున పగలు అనునది పగలు అయ్యె నని చెప్పవచ్చును. మన్నిగొనిరో=చచ్చిరో.

తాత్పర్యము.

పూర్వము నీచేతఁ జంపఁబడిన శత్రువు లే వీరశయనంబునందుఁ బండుకొనిరో యుద్ధప్రియుఁడైన నీవు దానియందే కూలితికదా. నన్ను దిక్కులేని దానిని జేసి యెందుఁ బోయితివి,

క. సూరు లగువారు కన్యల, శూరుల కొసఁగంగ రాదు ♦ చూచితివె మహా
శూరునిభార్యను నే గతి, వారక హత నైతి నింద్య♦వైధవ్యమునన్. ౧౩౧
సూరులు=పండితులు.

తాత్పర్యము.

జ్ఞానముగలవారు తమ పుత్రికలను శూరులకు భార్యలుగా నీయరాదు. ఏల యందువా? శూరునిభార్యనైన నేను నింద్యమైన వైధవ్యముచే నెట్లు చచ్చినదాన నైతినో-

కూఁతులకు- కూఁతు శబ్దంబునకు 'లు' మొదలగు ప్రత్యయంబులు పరంబగుచో రేఫంబునకు లోపంబు- సు. వ్యా ఆచ్ఛిక- ౧౫ సూ.

ఉ. మానము న్యూన మయ్యెఁ, బర♦మం బగుసద్గతి రిక్తయయ్యె, నం
తేని నగాధదుఃఖజల♦ధిం బరిమగ్నగ నైతి, రాయి యే
మో నిజ మీయెడంద, యిటు ♦ మోహనగాత్రుఁడు భర్త చావఁగాఁ
గానఁగఁ గల్గియుం జెడదు ♦ ఖండములై శతధావిభిన్నమై. ౧౫౨

మానము=గౌరవము- న్యూనము=కొఱఁత, రిక్త=శూన్యము. అగాధ=లోఁతు తెలియని, పరిమగ్నగ=మునిఁగినదానిఁగా- ఎడంద=హృదయము, శతధా=నూఱువిధములుగా- విభిన్నమై=పగిలినదై,

తాత్పర్యము.

రాణి యను గౌరవము లోపమయ్యెను. ముత్తైదువు చావు లేకపోవుటచే సద్గతియు లేదయ్యె. మిగుల లోఁతు తెలియని దుఃఖసముద్రమునఁ బూర్ణముగ మునిఁగితిని- నా హృదయము రాయి కాఁబోలును, లేకున్న మోహింపఁజేయు శరీరము గల నా పెనిమిటి చావఁగాఁ జూచియు నూఱు వ్రక్కలై పగులకయున్నది.

క. నా నెయ్యుఁడు నాదైవము, నా నాథుఁడు నా హితుండు ♦ నా వల్లభుఁడుఁ
నానిధి యేకచరాగ్రణి, హా నన్ను ననాథఁజేసి ♦ నాకం బరిగెన్. ౧౫౩

నెయ్యుఁడు = నాయందు స్నేహముగలవాఁడు, ఏకచరాగ్రణి = అసహాయశూరుఁడు.

తాత్పర్యము.

నాకు స్నేహితుఁడు- నా దైవము- నాకు రక్షకుఁడు- నా మేలు గోరువాఁడు- నా పెన్నిధానము- అసహాయశూరుఁడు- నన్ను దిక్కులేని దానినిఁజేసి స్వర్గమునకుఁ బోయెను.

ఆ. తనయు లెంద ఱున్న ♦ ధాన్యసంపద లున్న, ధనము పూర్ణముగను♦ దనరియున్న
మగఁడు లేనియట్టి♦మగువను గని జనుల్, విధవ యండ్రుగాదె ♦ వెలితిదోఁప.

తాత్పర్యము.

ఎందఱు కొడుకు లున్నను, ధాన్యము, సంపద యెంతయున్నను, ధనము దండిగా నున్నను మగఁడు లేని యాఁడుదానిని జులుకనగా విధవ విధవ యందురుగదా! కొడుకులు ధనము లేకున్నఁ గొఱఁత చెప్పరుగాని మగఁడు లేకున్న నందఱు నిర్లక్ష్యముగానే చూతురు.

క. ఆరుద్రపురుగుడాలున, భారుచిరం బైనమృదువు♦పాన్పునఁబోలెన్
నీ రుధిరమండలంబున, వీరవరా! నీవు పండ ♦ విధి యేర్పడెనే. ౧౫

ఆరుద్రపురుగు = ఆర్ద్రా కార్తెయందు నేల నెఱ్ఱపట్టురంగు గలిగి తోఁచు పురుగులు- ఆర్ద్రా శబ్దభవము ఆరుద్ర- డాలునన్ = కాంతిచే- భా = కాంతిచే- రుచిరంబు = మనోహరము- మృదువు = మెత్తని- రుధిరమండలంబునన్ = నెత్తురు సమూహమున- పండన్ = పండుకొన-

తాత్పర్యము.

ఆరుద్రపురుగువలె నెఱ్ఱని కాంతితో మనోహరమైన మెత్తని పానుపునందు వలె నీనెత్తురువఱదనడుమఁ బండుకొనవలసినట్లు విధి యేర్పడెను గదా.

క. నెత్తురులు గాఱఁ బైపయి, మెత్తినగతి దుమ్ము గ్రమ్మ ♦ మెఱుఁగుచెడిన నీ
మెత్తనియొత్తను వెటువలె, నిత్తఱి నేఁ గౌఁగిలింతు ♦ వృషచరేంద్రా! ౧౬

తాత్పర్యము.

వానరరాజా! నెత్తురు వఱదగాఁ గాఱ దానిపై దుమ్ము మెత్తినట్లు పేరుకొనఁగాఁ గాంతిచెడిన నీ మెత్తని దేహమును నే నెటువలెఁ గౌఁగిలింతును.

క. ధన్యుఁడు పో సుగ్రీవుఁ డ,నన్యవిదిత మైనవైర ♦ మారాఘవరా
జన్యుని యొండుశరంబున, శూన్యముఁ గావించుకొనియె ♦ సువిహితభంగిన్. ౧౭

అనన్యవిదితము = ఇతరులయందుఁ గానరానిది.

తాత్పర్యము.

సుగ్రీవుఁడే కృతకృత్యుఁడు. ఎంతటి విరోధులైనను నితరులందుఁ గానరాని యంతటి దీర్ఘగాఢద్వేషము రామచంద్రునిఁ యొక్క బాణముచేతనే తెగినరీతి లేకుండ జేసెను.

క. తనువుఁ దొఱంగిన నిన్నుం, గనుఁగొను టొక్కండెగాక ♦ గాఢంబుగ లో
మ్మున నాటినశరముకతన,మ్మునఁ గౌఁగిటఁ జేర్పవలను♦మొనయదయయ్యో! ౧౮

తాత్పర్యము.

దేహము వదలిన నిన్ను దూరమునుండి చూచుటమాత్రమే కాని దృఢముగ రొమ్మున నాటిన బాణమువలన నిన్నుఁ గౌఁగిలింపఁ జాలకున్నాను.

చ. అని యిటు తార యేడ్వఁ గుధ♦రాంతరకందరలీనసర్పభం
గిని సురరాజపుత్రతను♦కీలితబాణముఁ బావ నీలుఁడున్
ఘనశర మొప్పె నస్తగిరి♦నాయకకూటనిరుద్ధుఁ డైన యా
దినకరు వీడి వచ్చు ఘన♦తేజ మనన్ మహితారుణద్యుతిన్. ౧౯

కుధరాంతర=కొండలోనుండు, కందర=గుహలో, లీన=డాగియున్న, సర్పభంగిని=పామువలె- సురరాజపుత్ర=వాలియొక్క- తను=దేహమునందు, కీలిత=నాటుకొనియున్న- నీలుఁడు=సుగ్రీవుని సేనానాయకుఁడు, ఘనశరము=గొప్ప బాణము-

అస్తగిరినాయక=పడమటికొండయొక్క, కూట=శిఖరమునందు- నిరుద్ధుఁడైన=అడ్డగింపఁబడిన, దినకరుఁ=సూర్యుని, మహి తారుణద్యుతిఁ=విస్తారమగు నెట్టని కాంతితో,

తా త్ప ర్య ము.

ఈ ప్రకారము తార యేడువఁగా నీలుఁడు వచ్చి కొండగుహాలోనున్న పామును దోఁకఁబట్టి వెలుపలికి లాగినట్లు వాలిఱొమ్మున నాటియున్న బాణమును వెలికి లాఁగఁగా నాబాణము పడమటికొండ శిఖరమున నుండు సూర్యుని విడిచి వచ్చు కాంతి యనునట్లు మిగుల నెఱ్ఱని కాంతితో.

తే. ఆ వనాటప్రకాండు గాయములనుండి, వెల్లువలు వాఱె నెత్తురుల్ ♦ కొల్లలుగను
బర్వతాగ్రమునం దుండి ♦ పాఱుచున్న, తామ్రగైరికసంపృక్త ♦ ధార లనఁగ. ౫౯౦
వనాటప్రకాండు = వానరశ్రేష్ఠుని- తామ్రగైరిక సంపృక్తధారలు=ఎఱ్ఱనికొండ ధాతువులతోఁగూడిన నీటిధారలు.

తా త్ప ర్య ము.

పర్వతము కొనలనుండి ప్రవహించు నెఱ్ఱని కావిరాలు మొదలైన ధాతువులతోఁ గూడిన నీళ్ళధార లనఁగ వానరశ్రేష్ఠుని గాయములనుండి నెత్తురులు కాలువలుగాఁ బాఱెను. ఈ గాయములు సుగ్రీవుఁడు కొట్టిన ఱాల, చెట్లదెబ్బలవలన నైనవని యెఱుంగ నగు.

క. శరహతి ధరణిం గూలిన, తరుచరపతి ప్రాణనాథు ♦ తనువున ధూళిన్
దరుణీమణి నయనోదక, ఝరిచే మార్జనము చేసె ♦ సర్వాంగములన్. ౫౯౧
నయనోదక ఝరిచేఁ = కన్నీటివంకచే.

తా త్ప ర్య ము.

బాణము దెబ్బవలన నేలఁబడిన వానరశ్రేష్ఠుఁడు తన ప్రాణనాథుఁ డగు వాలి దేహమునఁగల ధూళిని దార తన కన్నీటిధారలచే సర్వావయవములఁ గడిగెను.

తే. అంగదునిఁ జేరఁదీసి యా ♦ యబల యనియెఁ, గంటివే పుత్ర! నీ తండ్రిఁ ♦ గన్నులారఁ
బాపకర్మంబుచే నైన ♦ వైరమెల్ల, నేఁటితో మేనితోఁ బాసె ♦ నేలఁ గూలి. ౫౯౨

తా త్ప ర్య ము.

అప్పుడు తార యంగదుని దగ్గఱకుఁ దీసి వాలినిఁ జూపి నాయనా! నీతండ్రినిఁ గన్నులారఁ జూచితివా- పాపకార్యమువలనఁ గలిగిన విరోధము నీ దినముతో దేహముతో వదలిపెట్టెను.

చ. ఇదె కడసారిరా కొడుక ♦ యిప్పుడె తండ్రికి నీవు మ్రొక్కు మీ
యుదయదివాకరాభతనుఁ ♦ డొక్కఁడ కాలునిపీటి కేగు నా
వదలనిభక్తి నాతఁడును ♦ వాలిపదంబుల వ్రాలి తండ్రి! యం
గదుఁడను నేను మ్రొక్కెదను ♦ గైకొనవే యని మ్రొక్కెఁ, దారయున్. ౫౯౩

ఉదయదివాకరాభతనుఁడు = ఉదయించిన సూర్యునితో సమానమైన యొఱ్ఱని దేహము గలవాఁడు- కాలుని వీటికిన్ = యమపురికి-

తా త్ప ర్య ము.

కుమారా! యిదే కడసారి ఇఁక నీ తండ్రి మోము నీవు చూడఁబోవు. కావున మ్రొక్కుము. బాలసూర్యునివంటి దేహముగలవాఁ డొక్కఁడే యమపురికిఁ బోవుచున్నాఁడు. అని తల్లి చెప్పఁగా నంగదుఁడు వాలి పాదములపైఁబడి "తండ్రీ! నే నంగదుఁడను నమస్కరింపుచున్నాను- అంగీకరింపుము" అని నమస్కరించెను.

ఉ. నాయక! చూడ వేల? ప్రియ♦నందనుఁ డీగతి నీకు మ్రొక్క దీ
ర్ఘాయువు గమ్ము పుత్రక! య♦టంచును దీవన లాడ వేల? నా
థా! యిటు నేనుఁ బుత్రుఁడు మృ♦గాధిపహింసిత మైన గోపతిన్
బాయఁగ లేనిధేనువు స♦వత్సము నా నడలంగఁ గానవో. ౫౮

మృగాధిప హింసితము = సింహముచేఁ జంపఁబడినది- గోపతిన్ = కోడెను- సవత్సము = దూడ గలది.

తా త్ప ర్య ము.

ఇట్లంగదుఁడు మ్రొక్కఁగాఁ దార వాలిని జూచి నాథా! కొడుకు నమస్కరింపఁగా గన్నెత్తి చూడవేల? దీర్ఘాయుష్మంతుఁడవు కమ్మని దీవింపవేల? ఈ ప్రకారము కొడుకు నేను సింహముచే హింసింపఁబడిన యాఁబోతును విడువలేక దూడతోసుండు గోవువలె దుఃఖింపఁగాఁ దెలియలేదా.

తే. చటులసంగ్రామయజ్ఞంబు ♦ సలిపి నీవు, జానకీనాథసాయక ♦ జలమునందు
నవభృథస్నాన మర్హ్మమే ♦ యాచరింపఁ, బత్నినగు నన్ను విడనాడి♦ ప్రాణనాథ!

సంగ్రామయజ్ఞంబు = యుద్ధమను యజ్ఞము- సాయకజలమునందు = బాణమను నీట, అవభృథస్నానము = యజ్ఞాంతమునఁ జేసెడి మంగళస్నానము.

తా త్ప ర్య ము.

భయంకర యుద్ధమను యజ్ఞము చేసి రామచంద్రబాణ మను నీటియందు నీకుఁ బత్నినగు నన్ను విడిచి యవభృథస్నానము చేయనగునా?

క. ఏదీ రణమున నీకై, మోదించి బలాసురారి ♦ మున్నిచ్చిన యా
గాదిలి పసిండిహారము, లేదే నీ యురమునందు ♦ లీల రహింపన్. ౫౬

బలాసురారి = ఇంద్రుఁడు, గాదిలి = ప్రియమైన

తా త్ప ర్య ము.

యుద్ధమునందు నీ విషయమున సంతోషించి యింద్రు డిచ్చిన నీకుఁ బ్రియమైన బంగారుహారము నీ దేహమునందు లేదే- దాని నేల విడిచితివి?

క. అస్తంగతుఁ డగు సూర్యు ప్రశస్తమహాశోభ రత్న♦సానువు విడ దా
సిస్తున రాజ్యశ్రీ నిను, నస్తమితున్ విడువ దయ్యె ♦ నాఁ బ్రాణేశా! ౫౭

రత్నసానువు = మేరు పర్వతము.

తా త్ప ర్య ము.

అస్తమించిన సూర్యునికాంతి మేరుపర్వతమును వదలదు. ఆ ప్రకారమే నీవు మరణించినను రాజ్యలక్ష్మి నిన్ను విడనాడకున్నది.

మత్తకోకిలము. అక్కటా హిత మెంత చెప్పిన ♦ నాలకింపకపోయితే
నొక్కి చెప్పియు నడ్డగింప ని♦న్ సమర్థను గానుగా
దిక్కుమాలిన దాననైతిని ♦ దేవ! నే సుతుతోడ, న
న్నొక్కటన్ నినుఁ గూడి వల్లభ ♦ యుజ్జగించెను లక్ష్మియున్. ౫౮

ఉజ్జగించెను = వదలెను.

తా త్ప ర్య ము.

అయ్యో! నీకు మేలైనది నే నెంత చెప్పినను వినకపోయితివి కదా. అంత కంటె నొక్కి చెప్పి పోఁగూడ దని యడ్డగించునంత సామర్థ్యము నాయొద్ద లేదాయెఁ గదా. దాని ఫలమేమి? నేను నాకొడుకు దిక్కుమాలినవారమైతిమి. నీవు వదలి నట్లే మాంగల్య లక్ష్మియు నన్ను వదలెను. మత్తకోకిలము- ర స జ జ భ ర గణములు. ౧౧ వ యింట యతి.

—♦ ౨౪-వ సర్గము. సుగ్రీవుఁడు వాలికై దుఃఖించుట. ♦—

ఉ. అంగదుతోడ నిట్లు కడు ♦ నంగద నంగన యంగలార్ప నా
భంగి గతాసుఁ డౌచుఁ దన♦భ్రాత ధరాస్థలి యున్న రీతి నా
రం గని సూర్యనందనుఁడు ♦ గ్రమ్మెడు బాష్పజలంబుతోడ వం
తం గడుఁగూరె నింతకును ♦ దాన కదా కత మంచు నెంచుచున్. ౫౯

అంగదన్ = దుఃఖముచే- గతాసుఁడు = ప్రాణముపోయినవాఁడు.

తా త్ప ర్య ము.

అంగదుతోడ నీ రీతిఁ దార మిగుల దుఃఖించుచుండుటయుఁ బ్రాణముపోయి తన యన్న నేలఁబడియుండుటయు సుగ్రీవుఁడు చూచి యింతకుఁ దానుగదా కారణ మని కన్నీళ్లుగారఁ మిగుల దుఃఖించెను.

ఉ. ఆ సతిమోముఁ జూచి హృద♦యంబు కలంగిన మెల్ల మెల్లగా
వాసరనాథనందనుఁడు ♦ భాసురసర్పసమానబాణబా
ణాసనపాణి రాముని ని♦జాశ్రిత సంయుతుఁ డౌచు దీర్ఘని
శ్వాసము నించుచుం గదియ♦వచ్చి రఘూత్తముఁ గాంచి యి ట్లనున్. ౬౦

తా త్ప ర్య ము.

తార ముఖముఁజూచి హృదయము కళవళపాటు చెందఁగా సుగ్రీవుఁడు మెల్ల మెల్లగా సర్పముతో సమానమైన బాణమును వింటిని జేత ధరించియున్న రామ చంద్రమూర్తిని దన యాశ్రితులతోడ సమీపించి నిట్టూర్పు విడుచుచు నిట్లనియె.

ఉత్త చేతులనుండిన వాలిపక్షమువా రెవ్వరైనఁ దటాలునఁబైపడి వత్తురేమో యను సందేహముచేఁ గాఁబోలు బాణమును నెక్కుడింపక, విల్లును చేతియందుఁ గల వాఁడై యుండెను.

మత్తకోకిలము. ఈవు పల్కినబాస దీరె న◆రేంద్రచంద్రమ! యీకపి
క్ష్మావిభుత్వము నాకు నబ్బెను◆గాని రాజ్యసుఖంబులన్
జీవితంబునఁ గల్గు నాశ న◆శించె నన్ను క్షమింపుమా
భూవరా! మన నొల్ల నింకిటఁ◆బోదు నన్నకుఁ దోడుగన్. ౬౧

బాస = ప్రతిజ్ఞ.

తాత్పర్యము

రాజోత్తమా! నీవు చెప్పినమాట నీవు చెల్లించుకొంటివి. కపిరాజ్యము నాకు లభించెను. కాని రాజ్యసుఖములందుఁ గాని ప్రాణమందుఁగాని గల యాశ నశించెను. నా మాట నేను జెల్లింపలేను. క్షమింపుము. ఏమన నాయన్నకుఁ దోడుగా నేను బోయె దను. జీవింపనొల్లను.

సీ. మా యన్న దేవేరి◆మహితశోకంబును, బురమునవారల◆పొక్కుచంద
మంతటివాఁడు మా◆యన్న నా కారణంబునఁ బ్రాణములువాసి◆ భూమిఁ బడుట
బాలుఁ డంగదుఁడును◆బ్రతుకునో బ్రదుకఁడో, యను సందియం బిన్ని◆యరసిచూడ
రాఘవా! నామది ◆ రాజ్యభోగములందు,నాస చేయదు చూ య◆థార్థముగను
తే. రోషమునఁ గ్రోధమున నతి◆రూక్షవిప్ర
ధర్షమున నగ్రజుని మృతి ◆ ధరణినాథ
మున్ను నాకు నభీష్టమై ◆ మొనసెఁ గాని
యిపుడు దుస్సహతాపంబు ◆ హెచ్చె మదిని. ౬౨

దేవేరి=పట్టపురాణి- అతిరూక్ష విప్రధర్షమునన్=మిక్కిలి క్రూరమైన తిరస్కారముచే- పురమున వారలు=పురమునందలివారు- చేటు పురంబునవారి కెమ్మెయింగా కెటులుండు. భార. విరాట. తెనుఁగున షష్ఠీసప్తమీ తత్పురుషంబుల నవర్ణకంబు విభాషనగు- సు. వ్యా. సమాస. ౪౫ సూ.

తాత్పర్యము.

మాయన్నరాణిశోకంబును, బట్టనంబునఁ గల వారియొక్క దుఃఖవిధము, నా నిమిత్తముగ మాయన్న చచ్చి నేలఁబడుట, బ్రదుకునో బ్రదుకఁడో యనుసంశయ దశలో నంగదుఁ డుండుట, యివన్ని యాలోచించి చూడఁగా రామచంద్రా! నామనస్సు రాజ్యభోగంబులందు నాశపడలేదు. వాలి చచ్చిన వానిపెండ్లము కొడుకు బంధువులు మిత్రు లేడ్తురని యెఱుఁగవా, నవ్వుచుందురని తలఁచియుంటివా, యందు వేమో! రోషమునఁగోపమున నన్ను మిగులఁ గఠినముగాఁ దిరస్కరించిన కారణమున

నపుడు మా యన్న చావు నాకిష్టమై యుండెఁగాని యిపుడు శోకమును సహింప లేకున్నాను.

మత్తకోకిలము. అన్నఁ జంపి సురాధిపత్యము ♦ నైనఁ బొందఁగఁ గోర ము
న్నున్న యట్టుల ఋశ్యమూకత ♦ టోర్వి నుండు స్వవృత్తిమై
నిన్నుఁ జంప యథేచ్ఛ మేఁగుము ♦ నీ వ టన్న మహాత్ము ప
ల్కన్న తిం దగు నట్టివానికిఁ ♦ గార్య మిట్టిది నా కగున్. ౬౦౩

సురాధిపత్యము=దేవతల కధిపతిగా నుండుట- ఇంద్రత్వము.

తాత్పర్యము.

అన్నను జంపుటవలన నింద్రత్వము లభించినను నాకు వలదు- పూర్వమున్నటులు ఋశ్యమూక పర్వత శిఖరమునందుఁ గాయ గసుగులు దిని జీవింతును. దుఃఖకరమయిన ప్రభుత్వముకంటె శోకరహితమైన యేకాంతవాసమే సౌఖ్యకరము. "తమ్ముఁడా! నిన్ను నేను జంపను, నీ యిష్టమువచ్చినట్లు పొమ్ము" అని చెప్పినమాట యా నీతిపరునకుఁ దగియున్నది- అట్టివానిని జంపించిన ఘోరకార్య మీ క్రూరునకుఁ దగియున్నది-

ఉ. సోదరుఁ డన్నఁ గేవలుఁడె ♦ శూరవతంస మనుత్తముండు వ్యా
పాదితుఁ జేసినాఁడ నటు ♦ వంటిమహాత్ముని; రాజ్యలాభ స
మ్మోదము భ్రాతృనిర్మథన ♦ ముం బచరింపఁగఁ గల్గుదుఃఖ మిం
దేది ఘనంబొ యంచు గణి ♦ యింపను గామపురస్కృతుండనై. ౬౦౪

కేవలుఁడె=సామాన్యుఁడా! వ్యాపాదితుఁజేసినాఁడఁ = చంపఁబడినవానినిజేసినాఁడను, భ్రాతృనిర్మథనము=అన్నను జంపుట-కామపురస్కృతుఁడనై =గొప్పగా నెంచఁబడిన కామముగలవాఁడనై - అనుత్తముఁడు=అంతకంటె నుత్తముఁడులేనివాఁడు-

తాత్పర్యము -

పేరున కన్నయే కాని లోక సామాన్యుఁడైన యన్నయా? శూరులందు శ్రేష్ఠుఁడు, ఉత్తములం దుత్తముఁడు- అట్టివానిని జంపించితిని. ఆయనను జంపుటవలనఁ గలుగు రాజ్యలాభమువలనఁ గలుగు సంతోషమే గొప్పదో, యాయనను జంపుటవలనఁ గలుగు దుఃఖమే గొప్పదో యని కామమును బ్రధానముగా నెంచియుండి విమర్శించినవాఁడను గాను. కామ మాడించిన ట్లాడితిని గాని ధర్మమాలోచించినవాఁడను గాను.

ఉ. చంపఁగ నొల్లఁ డయ్యె నను ♦ సంగరభూమిని శక్తిగల్గి తాఁ
బెంపును బేర్మియుం దలఁచి ♦ బీరము గల్గినవాఁడు గాన, నేఁ
డెంపరినై దురాత్మతను ♦ ద్రెళ్ళఁగఁ జేసితి నీతి రీతిఁ జిం
తింపక యట్టివానిని వ్య ♦ తిక్రమ మొర్చితి బాలిశుండనై. ౬౦౫

బీరము = వీర్యము- పౌరుషము- తెంపరి = తెంపు + అరి = సాహసి- దురాత్మతను = చెడ్డమనస్సుగలవాఁడ నగుటను- వ్యతిక్రమము = మర్యాద నుల్లంఘించుటను- బాలిశుండను=మూర్ఖుఁడను.

తాత్పర్యము.

యుద్ధమునందు నన్నుఁ జంప శక్తియుండియుఁ దన గొప్పతనము పౌరుషము నాలోచించి ఛీ యీ దుర్బలుని నేమని చంపుదు నని నన్నుఁ జంప నిచ్ఛగించిన వాఁడు కాఁడు. నేనో మూర్ఖుఁడ నగుటచేత నన్నుఁ జంప నొల్లని వానిని నేను జంపుట మర్యాదయా యని యాలోచింపక దుష్టమనస్సుగలవాఁడ నగుటచేఁ జంపించితిని.

చ. బలితపుఁ జెట్టుకొమ్మ నను ♦ బాఁదిన నేలను వ్రాలి మూర్తమే
 విలవిల తన్నుకొంచడల ♦ వీరుఁడు న న్నని యూఱడించుచున్
 జలుపకు మింక నిట్టులని ♦ సాంత్వనవాక్యము లాడి పుచ్చె, నా
 యలఘుగుణాన్వితుం గినిసి ♦ యంతకుఁ జేర్చితి నింద కోర్చితిన్. ౬౦౬

బాఁదినన్=కొట్టఁగా- మూర్తము=కొంచెముకాలము, సాంత్వన వాక్యములు= మంచిమాటలు, అలఘుగుణాన్వితున్=గొప్ప గుణములతోఁ గూడిన వానిని, కినిసి= కోపించి, అంతకున్=యమునికి.

తాత్పర్యము.

బలమైన చెట్టుకొమ్మచే నాయన నన్నుఁ గొట్టినపుడు నే నా దెబ్బ సహింపలేక నేలఁబడి విలవిల తన్నుకొనుచుండఁగా నన్ను సమాధాన పఱిచి నీ విఁకమీఁద నామీఁదికి యుద్ధమున కిట్లు రాకు మని మంచిమాటలు చెప్పి పంపెను. అటువంటి గొప్ప గుణములు గలవానిపైఁ గోపించి చంపించితిని. నిందల సహించితిని.

కామము క్రోధము కన్నులఁ గప్పినపు డెదుటివాని సద్గుణములు కానరావు. ఆ కన్నుల పొరలు పోఁగానే మంచిగుణములు కానవచ్చును. ఇది లోక స్వభావము. రాజ్యమున కాశించిన నిటువంటి ఘోరకార్యములు చేయవలసి వచ్చు ననియే రామచంద్రమూర్తి కామ క్రోధ లోభ దాసుఁడుగాక ధర్మాతిరిక్తుఁడయ్యెను. ఇట్టివారు లోకోత్తర పురుషులు.

తే. భ్రాతృభావంబు మఱి యార్య♦భావ మధిక, ధర్మమును రక్షితంబు లీ♦ధన్యుచేతఁ
 గ్రోధమును గామమును మఱి♦క్రోఁతిగుణము, దృష్టమయ్యెను నాయందు♦శిష్టవర్య.

భ్రాతృభావంబు=సోదరుఁడను తలంపు, ఆర్యభావము=పెద్దతనము, దృష్టము= కానఁబడునది.

తాత్పర్యము.

సోదర ధర్మము, ఆర్యధర్మము, బలహీనులఁ జంపరాదను శాస్త్రీయ ధర్మము వీని నాయన రక్షించెను. నేను గామమును గ్రోధమును గ్రోఁతి గుణమును రక్షించితిని. అవి నాయందుఁ గానవచ్చు గుణములు.

సీ. అతుల మచింతనీ♦యంబును బరివర్జ, నీయంబు స్వనవేక్ష♦ణీయ మయి య
నీప్సనీయం బైన♦నిస్తులపాపంబు, విశ్వరూపునిఁ జంపి ♦ వృత్రవైరి
యొడిగట్టుకొన్న య ♦ వ్వడువున భ్రాత ని,ర్జించి నేనిట్టు లా♦ర్జించినాఁడ
నిందుఁ డియఘము మ♦హీజలద్రుమవని,తలు పంచికొనిరయ్యు ♦ తమకుఁ దార
తే. క్రోతికిల్బిషమును బంచు♦కొను నెవండు, పాపశీలుఁడ నీచుఁడఁ ♦ బరమగర్హి
తుండ లోకాపకారకా♦ర్యుండ; వాన, నీళ్లు పల్లంబునకు నేగి♦నిలుచు నట్లు. ౬౦౮

అతులము = అసమానము - అచింతనీయము = చింతింపసాధ్యము కానిది, అంత గొప్పదనుట - పరివర్జనీయంబు = పూర్ణముగా విడువఁదగినది. స్వనవేక్షణీయము = చూడఁదగనిది. అనీప్సనీయము = కోరరానిది - నిస్తులపాపంబు = అసమానపాపము - అఘము = పాపము - మహీ = భూమి - జల = నీళ్లు - ద్రుమ = చెట్లు - వనితలు = స్త్రీలు - లోకాపకారకార్యుండ = లోకమునకుఁ గీడుచేయు పనులు చేయువాఁడను.

ఇంద్రుని మీఁదఁ గోపించి కొన్ని దినములు బృహస్పతి గానరాకుండెను. అప్పుడు కశ్యపుని కొడుకగు విశ్వరూపుఁ డనువానిని బురోహితుఁడుగా దేవత లేర్పఱచుకొనిరి. వీఁడు రాక్షసపక్షపాతియై హవిర్భాగమును దొంగతనముగా రాక్షసుల కిచ్చుచుండెను. అది తెలిసికొని యింద్రుఁ డతనిఁ జంపెను. బ్రహ్మహత్య యింద్రుని బట్టెను. అప్పు డా పాపమును భూమియు, జలము, చెట్లు, స్త్రీలు పంచుకొని యింద్రునిఁ బాపముక్తునిఁ జేసిరి.

"ఇంద్రుండు.........తద్దోషంబొక సంవత్సరం బనుభవించి యంతం బాపుకొనువాఁడై భూజలవృక్షస్త్రీలం బ్రార్థించి మద్దురితంబు చతుర్విధంబులం బుచ్చికొండనిన భూమి తనయందుఁ జేయంబడిన ఖాతంబు తనంతన పూఁడునట్టి వరంబును, జలంబు సర్వంబు దనయందుఁ బ్రక్షాళితం బైనం బావనం బగు నట్టి వరంబును, వృక్షంబులు ఛేదింపఁబడి పునఃప్రరోహంబు గలుగు వరంబును, స్త్రీ లెల్లప్పుడుం దమకుఁ గామసుఖంబు గలుగునట్టి వరంబును గోరిన నతం డట్ల కా నొసంగిన నతని దుష్కృతంబు ధరణి యిరిణవిధంబునను నుదకంబు బుద్బుద ఫేనరూపంబునను మహీరుహంబులు నిర్యాసభావంబునను నింతులు రజోవికారంబునను నిట్లు చతుర్భాగంబులఁ బంచుకొని రంత" భాగ. ౬-౩౧౮.

తా త్ప ర్య ము.

నే నన్నను జంపించిన పాప మసమాన మైనది, ఇట్టి దని చింతింపరానిది, సాధువులచేఁ బూర్ణముగ వర్జింపఁదగినది, కన్నెత్తి చూడనైనఁ జూడ రానిది, కోర రానిది- ఇటువంటి పాపమును బూర్వ మింద్రుఁడు తన సోదరుఁడైన విశ్వరూపుని జంపి సంపాదించుకొనినట్లు నేను సంపాదించుకొంటిని. కాని యతని పాపమును భూమి - జలము - చెట్లు స్త్రీలు పంచుకొనిరి - క్రోతియైన నాపాపము నెవరు పంచ

కొందురు! పరమ పాప స్వభావుఁడను, నీచగుణములు గలవాఁడను, మిక్కిలి నింద్యుఁడను, లోకమునకు నపకారమే చేయువాఁడను.

ఉ. ఘోరతరార్తి ముంచె ననుఁ ♦ గోవిద వర్య; యధర్మసంయుతం
బారఁగ వంశనాశకర ♦ మౌ నకృతంబు ఘటించి పౌరస
త్కారము యౌవరాజ్యమును ♦ గైకొన నర్హుఁడఁ గా నటన్నచో
గౌరవయుక్త రాజ్యరమ ♦ కా తగువాఁడను ధర్మతత్పరా? ౬౦:

అకృతంబు = చేయరానిపని, రాజ్యరమకా = రాజ్యలక్ష్మికా, పౌరసత్కారము = పురజనులు చేయు గౌరవము.

తాత్పర్యము.

మిట్టనీళ్ళు పల్లమునకు వచ్చి కదలక నిలిచినట్లు ఘోర వ్యసనము నన్ను ముంచుకొనెను. పండిత శ్రేష్ఠా! రామచంద్రమూర్తీ! యన్నను జంపుట యనెడి యధర్మముతోఁ గూడి, యంగదుఁడు చచ్చుటచే వంశనాశకరమైన చెడుపని చేసినవాఁడను. కావున నూరిజనములు చేయు గౌరవమునకు, యౌవరాజ్యమునకైన నర్హుఁడను గాను. ఇఁక గౌరవముతోడి రాజ్యలక్ష్మికా నేను దగినవాఁడ నగుదును.

తే. భ్రాతృవధవాలమును దాప ♦ భరశిరోవి,షాణహస్తాక్షులును నగు ♦ చటులకల్మ
షేభ మిటు సంప్రవృద్ధమై ♦ యేటిగట్టుఁ,బోలె ననుఁగూల్చు చున్నది ♦ పుణ్యచరిత!

భ్రాతృవధవాలము = అన్నను జంపుట యనెడు తోఁకగలదియు, తాపభర= సంతాపాతిశయమనెడి, శిరో = శిరస్సు, విషాణ = కొమ్ములు, హస్త=తొండము, అక్షులు = కన్నులుఁగల, చటులకల్మషేభము = క్రూరపాపమను నేనుఁగు, సంప్రవృద్ధమై=పెరిగినదియై, ఇచ్చట వాలమనుటచే నేనుఁగు వెనుకటి భాగమంతయు గ్రాహ్యము, దానికంటె ముందుపడి బాధించునది సంతాపము గావునఁ దొండము కన్నులు మొదలైనవిగాఁ జెప్పఁబడినవి.

తాత్పర్యము.

అన్నను జంపుటయనెడి తోఁకయును,సంతాపాతిశయమనెడి శిరస్సు, కొమ్ములు, తొండము, కన్నులు గల మహాపాప మనెడి యేనుఁగు మిగుల వృద్ధిచెంది యేటిగట్టును వలె నన్ను నురలఁ ద్రోయుచున్నది.

తే. స్వర్ణమును జక్కఁ గ్రాఁచ వి ♦ వర్ణ మగుచు, మసటు విడనాడుభంగి నా ♦ మదిని గలుగు
సాధువృత్త మీపాపసం ♦ సర్గమునకు, రోయుచు నివర్త మయ్యెఁ బూ ♦ రుషవరేణ్య.

క్రాఁచ = కాఁకకు వేయఁగా, పుటము వేయఁగా, వివర్ణము = వర్ణము మాఱినది, మసటు = ముఱికి, సాధువృత్తము = మంచినడవడి, పాపసంసర్గమునకు= పాపముతోడి కూడికకు, రోయుచున్ = అసహ్యపడుచు, నివర్తమయ్యెన్ = మరలెను.

తా త్ప ర్య ము.

ముటికితోఁ గూడిన బంగారమును బుటము వేసినపుడు రెండు నొకచో నుండ లేక ముటికి యెట్లు వెడలిపోవునో యట్లు నా సాధువృత్తము పాపముతోడి కూటమికి నసహ్యించుకొని వెడలిపోయెను.

తే. మత్కృతం బైన ఘోరక ♦ ల్మషముకతన, దుస్సహం బైన యంగదు♦దుఃఖమునకు
వీరవరులైన కానన♦చారులెల్ల, సగము ప్రాణాన నున్నారు ♦ చారుశీల. ౬౧౨

మత్కృతము = నాచేఁ జేయఁబడిన

తా త్ప ర్య ము.

నేను జేసిన యీ ఘోరపాపము కారణముచే సహింపరాని యంగదు దుఃఖమును జూచి వానరు లందఱును నతఁడును జచ్చునేమో యని కొనయూపిరితో నున్నారు. అతఁడు చచ్చెనా యందఱు చత్తురు.

కం.కలుగరె సుతు లందఱకును, గలఁడే సుజనుండు సుమతి ♦ కడు వశ్యుండై
యిల నంగదుఁ బోల్తనయుఁడు, కలదే సోదరునిఁ గూర్పఁ♦గల దేశంబున్. ౬౧౩

తా త్ప ర్య ము.

లోకమున నందఱకుఁ గొడుకులు లేరా? ఉండఁగానే లాభమేమి? ఇటువంటి మంచివాఁడు మంచిబుద్ధిగలవాఁడు మిక్కిలి లోఁబడి వర్తించువాఁడు నంగదుని బోలు కొడుకు లెందుఁ గలరు? కొడుకులు గలిగినఁ గలుగుదురు గాక, తోడఁబుట్టినవాఁడే దేశమున లభింపఁగలఁడు.

ఇచ్చట రామచంద్రమూర్తి లక్ష్మణు నుద్దేశించి చెప్పిన వాక్యము స్మరించునది (ప. ౨౩౬౮ యుద్ధ. చూచునది.)

కం.బ్రదికనచోఁ దారేయుఁడు, బ్రదుకును దారయును ♦ వానిపరిపాలనకై
బ్రదుకనిచోఁ దనతనయుఁడు, బ్రదుకదు తారయును నిక్క♦వం బది రామా!

తారేయుఁడు = తారకొడుకు.

తా త్ప ర్య ము.

అంగదుఁడు బ్రదికెనా వాని రక్షించుకొఱకుఁ దారయును బ్రదుకును. వాఁడు బ్రతుకఁడా యామెయును బ్రదుకదు. ఇది నిజము.

తే.అన్నతోఁ బుత్త్రితో నెయ్య ♦ మలరుఁ బొంది, దీపితాగ్నుల విడిచెద ♦ దేహమేను
వీరె యున్నారు వానర♦వీరు లెల్ల, సీత నోయఁగఁ దద్వార్త♦జెప్ప నీకు ౬౧౪

దీపితాగ్నులఁ = మండెడు నగ్నియందు, పుత్త్రితో = కొడుకైన యంగదునితో,"భ్రాతౄణా మేక జాతానాం, యద్యేకః పుత్రవాన్ భవేత్, తేన పుత్రేణ తే సర్వే పుత్రిణో మను రబ్రవీ"త్తను స్మృతి వాక్యము ప్రకారము,ఒకతల్లి బిడ్డలలో నొకఁడు కొడుకులు గలవాఁడయ్యెనేని తక్కిన వా రందఱు వానిచేఁ గొడుకులు గల

వా రనియే చెప్పబడుదురు. అలరుపొంటె=సంతోషించు కొఱకు, పొంటెపరమగుటచే టవర్ణలోపము.

తాత్పర్యము.

అన్నతోను గొడుకుతోను స్నేహము గలిగి యుండుటకై నేను మండెడు మంటలయందు దేహము విడిచెదను. నా కార్యమేమి చేసిపోయెద వందువా ఇదిగో వానర వీరు లందఱున్నారు. వారు సీతను వెదకి రాఁగలరు.

ఉ. నే మరణింప నీదుపని ♦ నిల్వఁగఁ బోవదు నే నెఱుంగుదున్
రామ! వలంతి వీవు సుక♦రంబుగ సర్వముఁ జక్కఁజేసికో
నే మని వంశనాశకుఁడ ♦ యీమెయిఁ బ్రాణములన్ భరింతు? న
య్యో మహితాగసుండను ర♦ఘూత్తమ! నాకు ననుజ్ఞ యీయవే. ౬౧౬

వలంతివి = సమర్థుఁడవు, సుకరంబుగన్ = కష్టములేక, మహితాగసుండును= గొప్ప యపరాధము చేసినవాఁడను.

తాత్పర్యము.

ఓయీ! నా కార్యము క్రోఁతులు చేసెద రంటివే. నీవు చేసిన ప్రమాణ మేమాయె, ఈవానరులు నా కార్యము నేను జెప్పినఁ జేయుదురని యేమి నమ్మకము. నీవు పూఁటపడినట్లు వారు నా కేమి పూఁటపడిరా యందువేమో, రామచంద్రా! నేను మరణించినంతమాత్రమున, నీ క్రోఁతులు నీకు సాహాయ్యము చేయకపోయినంత మాత్రమున నీ కార్యము నిలుచిపోదని నే నెఱుంగుదును. ఎట్లన నీవు నీకార్య మేలోపము లేకుండఁ జక్కఁజేసికొను సామర్థ్యముగలవాఁడవని నాకుఁ దెలియును. నీవేయుండి యేల తోడుపడరా దందువా? వంశమునే నాశముచేసికొనినవాఁడను నే నేమని ప్రాణములను భరింతును. ఒక వేళ బ్రతికినను నిటువంటి ఘోరపాపకార్యములను జేయువాఁడను, అటువంటి పుణ్యకార్యములఁ జేయఁగలనా? నేను గొప్ప యపరాధము చేసినవాఁడనే. అయినను నాకు మరణమున కనుజ్ఞయిమ్ము.

తే. అనుచుఁ బల్కు కపీశువా♦క్యముల వినుచు
శత్రుమర్దనచణరామ♦చంద్రుఁ డపుడు
కన్నులను బాష్పపూరముల్ ♦ గాఱుచుండ
నార్తుఁ డయ్యె ముహూర్త మ♦య్యనఘునట్లు. ౬౧౭

శత్రుమర్దనచణ = శత్రువులను జంపుటయందు సమర్థుఁడగు రామచంద్రమూర్తి.

తాత్పర్యము.

అని చెప్పుచున్న సుగ్రీవు మాటలు విని శత్రుసంహారమందు సమర్థుఁడైన రామచంద్రమూర్తి సుగ్రీవునివలెనే తానును గన్నుల నీరు గాఱఁ గొంచెముకాలము దుఃఖించినవాఁ డయ్యెను.

దీనికే కరుణారసమని పేరు. పరుల దుఃఖము తనదుఃఖముగా నెంచుకొని దుఃఖించుటే కరుణ లక్షణము. ఈ యవతారమం దీ రసము విశేషముగఁ గాన్పించును. సీతకై రామచంద్రమూర్తి యేడ్చినది యిట్టి కారణముచేతనే యని యెఱుంగనగు. ఇది దొంగ యేడ్పుగాదు. మాయగాదు. నిజమైన దుఃఖము. ఆత్మార్థహానికై వచ్చినది కాదు. ఇట్టి కరుణగలవాఁడు గనుకనే రామచంద్రమూర్తికిఁ గరుణాకాకుత్స్థుఁ డని బిరుదు. ఆశ్రిత దుఃఖము లవమయిన సహింపలేఁడు.

ఇది భగవంతుని యందుఁగల కల్యాణ గుణములలో ముఖ్యమైన దొకటి. భగవంతుఁ డాశ్రిత వత్సలుఁడు కావున దృఢముగఁ గావలయు నని యెవ్వరేది కోరినను ననుగ్రహించును. కాని చెడుకోరికలు గలవారు వాని ఫలానుభవ కాలమున దుఃఖింపఁగా నయ్యో వీరెట్టి పాపపుఁ గోరికలఁ గోరి యిట్లు దుఃఖించుచున్నారే, వీ రెప్పుడు బాగుపడుదు రని వారివలెఁ దానును వారికై దుఃఖించును.

—♦ శ్రీరాముఁడు తార నూఱార్పఁ బోవుట. ♦—

చం. క్షమ క్షమఁబోలువాఁడు త్రిజ♦గత్పరిరక్షణకర్త రాముఁ డా
సమయమునం గనం జనియె ♦ సారెకుఁ ద న్గనుదాని, శోకసం
భ్రమపరిమగ్నఁ, దారను స♦మాశ్వసనేచ్ఛను మంత్రిముఖ్యులన్
విమలవిలోచనం గదిసి ♦ వేర్పడఁ జేసిరి వాలినిన్ సతిన్. ౬౧౮

క్షమన్ = ఓర్పునందు, క్షమన్ = భూమిని, దీనిచే వాలి దిట్టినట్లు తార తిట్టినను నోర్చుకొను వాఁ డని భావము, త్రిజగత్ పరిరక్షణకర్త = మూఁడులోకములను బాలించువాఁడు, తన్నుఁదిట్టినారని వారిపైఁ గోపింపక సర్వసమముగ మూఁడులోకములఁ బాలించువాఁడు. శోకసంభ్రమపరిమగ్నన్ = శోకముచేఁ గలిగిన తొట్రుపాటునందు మునిఁగిన దానిని, తన్నుఁ బలుమాఱు చూచుటచేఁ దనతో నేదో మాటలాడవలయు నని కోరియున్నదని గ్రహించె నని యెఱుంగవలయును. అట్టి కోరిక యామె కుండిన నామె రామచంద్రమూర్తి యున్నచోటికి రావలయునా? ఆయన పోవలయునా యనిన నామె పుట్టెఁడు దుఃఖములో మునిఁగి కలవరపాటు చెందియున్నది. అట్టి దేమి రాఁగలదు. సమాశ్వసనేచ్ఛను = ఊరడించు కోరికతో, విమలవిలోచనన్ = నిర్మలమైన కన్నులు గలదానిని, కాటుక కరఁగి పోవుటచేతఁ గన్నులు తెల్లగా నున్నవని భావము.

తా త్ప ర్య ము.

ఓర్పునందు భూమిని బోలి ముల్లోకములను బాలింపఁగల రామచంద్రమూర్తి యా సమయమందుఁ దన్నుఁ బలుమాఱు చూచుచున్న తారను జూచి యామె తనతో నేదియో చెప్పుకొనఁ దలఁచియున్నదని గ్రహించి యామె శోకముచేఁ దొట్రుపాటు పడియుండుటచేఁ దానే యామెను నూఱార్ప నామె యొద్దకుఁ

బోయెను. అప్పుడు మంత్రిముఖ్యులు తారను సమీపించి యామెను వాలినుండి వేఱుగాఁ దీసిరి.

కం ఆ పద్మదళవిలోచన, యా పద్మదళాయతాక్షు ♦ నాభీలమహా
చాపశరపాణి మార్తాం, డోపమసహజప్రభాస♦ముజ్జ్వలగాత్రున్. ౬౧౯

పద్మదళవిలోచన = తామరరేకులవంటి కన్నులు గలది, పద్మదళాయతాక్షున్ = తామరరేకులవలె విశాలములైన కన్నులుగలవానిని, "విద్వానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమ"మన్నట్లు విద్యావంతుఁడే విద్యావంతుని పరిశ్రమము తెలిసికొనఁగలఁడు. Like attracts like. రెండు సమానగుణములు గలవి యొకదాని నొకటి యాకర్షించును. అట్లే తారయు రామచంద్రమూర్తియు నిరువురు తామర రేకులవలె విశాలమయిన కన్నులుగలవారు కావునను జూచునవి కన్నులే కావునను దొలుతనె యొకదాని నొకటి యాకర్షించె నని భావము. పద్మదళవిలోచన, పద్మదళాయతాక్షు ననుటచే రామచంద్రుని కన్నులయందు దీర్ఘములైన యను విశేషణ మెక్కువగాఁ బ్రయోగింపఁబడెను. ఏలన లోకమునఁ బురుషుల కన్నులకంటె స్త్రీల కన్నులే సుందరములు, అందుఁ బాలసముద్రములోఁ బుట్టిన దగుటచేఁ దార యప్సర స్త్రీవలె మిగుల సుందరి. అట్టిదాని కన్నులెంతో సుందర తరములు. వానికంటె శ్రీ రామచంద్రమూర్తి కనులు సుందరతమము లని తెలుప "ఆయతము"అను విశేషణము ప్రయుక్తము, ఆభీల=భయంకరమైన, మహాచాప శరపాణి=పెద్దవిల్లు బాణము చేతఁ గలవాని; మార్తాండోపమ=సూర్యునితో సమానమైన, సహజప్రభా = పుట్టువుతోనే వచ్చిన కాంతిచే, సముజ్జ్వల గాత్రున్=ప్రకాశించు దేహము గలవానిని; ఇచ్చట మార్తాండోపమసహజ ప్రభా యనఁబడెను. ఈ లోకమున సహజప్రభ యొక్క సూర్యభట్టారకునిదే. ఆయన వలననే చంద్రుఁడు, అగ్ని, నక్షత్రములు, దీపములు కాంతి గల వగుచున్నవి. వీని యందలి కాంతి యాయన కాంతియే కాని దానికంటె వేఱైనది కాదు. అట్లే రామచంద్రమూర్తి తేజస్సునని గ్రహింపనగు.

తా త్ప ర్య ము .

తామరరేకులవంటి కన్నులు గల తార తామరరేకులవలె విశాలమైన కన్నులు గల రామచంద్రుని, చేత భయంకరమైన విల్లు, బాణము గల వానిని, సూర్యునివలె స్వభావతేజస్సుచేఁ బ్రకాశించువానిని.

తే సాధువర్తను రాజల♦క్షణసమేతుఁ, బురుషసత్తముని నదృష్ట♦పూర్వుఁ జూచి
చారుశీలవతీమణి ♦ స్వాంతమందు, నితఁడ యా రామభద్రుఁడం♦చెంచికొనుచు

సాధువర్తనున్ = మంచి నడవడి కలవానిని, అదృష్టపూర్వున్ = ముందెన్నఁడు నెచ్చటఁ జూడఁబడని వానిని, పురుష సత్తము = పురుషోత్తముని, ఆ రామభద్రుఁడు=౧ తన భర్తను జంపిన యా రామభద్రుఁడే వీఁడు ౨ పూర్వ మంగదుఁడు చెప్పియుండిన రామభద్రుఁడే వీఁడు, (3) ఎవనియందుఁ బుండరీకాక్షత్వాదిగుణ

ములు గలవని పెద్దలు చెప్పియుండిరో యతఁడే వీఁడు (౪) ఎవఁడు పురుషులకంటె (జీవులకంటె) నుత్తముఁ డని పెద్దలు చెప్పిరో వాఁడే వీఁడు.

తాత్పర్యము.

మంచినడవడి గలవానిని, రాజుల కుండవలసిన చిహ్నము లన్నియుఁ గల వానిని, బురుషులం దుత్తముని, మును పెన్నఁడు నెందుఁగానరాని వానిని, ఆ మనోహరమైన శీలమును గల స్త్రీలలో శ్రేష్ఠురాలగు తార చూచి వీఁడే తనభర్తను జంపిన రామభద్రుఁ డని మనమునఁ దలఁచెను.

కం. హరిహయతుల్యు దురాసదుఁ, బరమ మహాత్ముని రామ♦భద్రుని డాయన్
దరుణి వ్యసనాభిపీడిత, పరివిహ్వల యగుచుఁ జనియెఁ ♦ బరమజవమునన్. ౬౨౧

హరిహయతుల్యున్ = ఇంద్రునితో సమానుని, దురాసదున్ = జయింపరాని వానిని - వ్యసనాభిపీడిత= వ్యసనముచేత మిగులఁ బీడింపఁబడినది- పరివిహ్వల= మిగులఁ గలఁతపడినది, పరమజవమునన్ = మిగుల వేగముగ.

తాత్పర్యము.

ఇట్లు తనయొద్దకు రావలయునని వచ్చుచున్న యింద్రసమానుని, సాధింపరానివానిని - మిగుల గొప్ప మనస్సుగలవానిని రామభద్రునిఁ జూచి యాయనను దనయొద్దకు వచ్చునటుల చేయుట ధర్మము గాదని తలఁచి దుఃఖపీడితయయ్యుఁ జెదరిన మనస్సుగలదియయ్యు నాయనయొద్దకుఁ దానే మిగుల వేగముగఁ బోయెను. ఇట్టిది గనుకనే శీలవతీమణి యని మీఁదఁ జెప్పఁబడెను.

తే. మేటిగుఱికాని రాముని ♦ మెలఁత మిన్న, శోకసంభ్రాంతభావ వి♦శుద్ధసత్త్వ
దృఢమనస్విని గనుఁగొని ♦ యిట్టు లనియె, భర్తృవధజాతపరితాప♦ భరము పేర్మి.

మేటిగుఱికాని = గుఱితప్పక కొట్టువానిని, యుద్ధముచేయునపుడు లక్ష్యము స్థిరముగాదు, చలించుచుండును. అందు నిరువురు పెనఁగులాడునపుడు రెండవవానికి దెబ్బ తగులక తాను గొట్టఁదలఁచినవానినే కొట్టుట యెక్కువ లక్ష్యశుద్ధిని దెలుపును. శోకసంభ్రాంతభావ= శోకముచే భ్రమముగొనిన మనస్సుగలది, శుద్ధసత్త్వ + దృఢమనస్విని = నిర్మలమైన సత్త్వగుణముగలది, దృఢపడిన మనస్సుగలది, భర్తృవధజాత = మగనిఁ జంపుటచేఁ గలిగిన, పరితాపభరము=సంతాపాతిశయముయొక్క.

తాత్పర్యము.

గుఱితప్పక కొట్టువానిని, రాముని శోకముచే భ్రమించిన భావముగలదైనను నిర్మలసాత్త్వికత్వము గలది నిశ్చయమైన మనస్సుగలది యగు తార మగనిచావుచేఁ గలిగిన దుఃఖాతిశయముచే నిట్లు లనెను.

శోకసంభ్రాంత కావున నోరార రామచంద్రుని దిట్టవలయునని దృఢమనస్కయయ్యు విశుద్ధసత్త్వ కావున నాయనను జూడఁగానే సత్త్వగుణమే యుద్రేకించి తిట్లకు బదులు స్తుతింప సాగెను. ఆయనను జూడఁగానే సాత్త్వికురాలు గావున ౬౩౦ లోఁ

జెప్పిన ట్లీయన భగవంతుఁడు, మనుష్య మాత్రుఁడు గాఁడని తలంచెను. తన మగని చావు తన దురవస్థఁజూచి యిట్టి మహానుభావుఁడు కరుణించుటకు మాఱు శిక్షించెఁగదా యని తిట్ట నిశ్చయించు కొనెను గాని సమీపమునకు వచ్చి చూడఁగానే సత్త్వగుణమే యుద్రేకించెను.

—♦ తార దన్నుఁ జంపు మని శ్రీరామునిఁ జూచి ప్రలాపించుట. ♦—

సీ. అప్రమేయుఁడవు దు♦రాసదుండవు నీవు, విజితేంద్రియుఁడవును ♦ విశ్రుతైక
ఘనధార్మికుఁడవు న♦క్షయ్యకీర్తివిని వి,చక్షణుఁడవు క్షమ ♦ క్షమకు సాటి
క్షతజోపమాక్షుండ ♦ వతుల బాణాసన, బాణపాణివి మహా♦బలుఁడ వనఘ
యుత్తమసంహన♦నోపేతుఁడవు మర్త్య,విగ్రహాభ్యుదయము ♦ విడిచి దివ్య
తే. విగ్రహాభ్యుదయంబున ♦ వెలసె దీవు
పతిని జంపిన యాయొండు ♦ బాణముననె
నన్నుఁ దున్ముము రామ! నా♦నాథుఁ గందు
వాలి సుఖియింపఁ డయ్య న ♦ న్వదలి యెందు. ౬౩

(౧) ఇది ౬౧-౬౩కి వివరణము. అప్రమేయుఁడవు=నీ ప్రమాణ మింతయని చెప్ప సాధ్యము కానివాఁడవు. అపౌరుషేయము లగు వేదములుకూడ 'వేదాహ'మ్మని యారంభించి 'మహాంత'మ్మనియు,క ఇత్థా వేద=ఇట్టివాఁడని యెవఁడు తెలిసికొనఁగలఁ డనుటచే వానికిని నీ వింతటి వాఁడవని చెప్ప సాధ్యముగానివాఁడవు. సర్వజ్ఞులైన మీకే మీ మహిమ యెంతో తెలియ దఁట. ఇఁక మఱియెవ్వరెఱుఁగఁ గలరు? "యస్యాస్తే మహిమాన మాత్మన ఇవ త్వద్వల్లభోపి ప్రభుః! నాలం మాతు మియత్తయా నిరవధి"మ్మనికదా పెద్దలు చెప్పిరి. గగనము తనకడపలఁ దానెఱుఁగన ట్లని కదా భాగవతులు చెప్పుదురు. అట్టివాఁడవు నీవు.

(౨) ఏమి యిట్లులనెదవు, నీకుఁగన్నులు గానరాలేదా? ఎంతపొడుగు ఎంత లావుండునది కానరాలేదా యందువేమో! ఇప్పటి నీ యాకార మింతయని ప్రత్యక్షముగాఁ గానవచ్చుచున్నావు సత్యమే. 'ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణోరూప కల్పనా' యన్నట్లు భక్తులకు గోచరింప నిట్లు కానవచ్చుచున్నావు. సత్యమే, నిన్ను ధ్యానింపఁబూనినమనస్సునకు వాక్కున కందుదువా?(౩) నీవు ధనుర్బాణములు ధరించి కానవచ్చుచున్నావు. నిజమే, నీ పరత్వము మఱుఁగుపఱిచి యజ్ఞులను భ్రమింపఁజేయ శంఖచక్రములను దాఁచి యివి ధరించితివి. ఇవి లేకున్నను నీవు కార్యములు చేయ లేవా. (౪) నీవుబలమునందు జ్ఞానమునందు తేజస్సులోనగువానియందు మాత్రమే యప్రమేయుఁడవుగావు, వాత్సల్యకారుణ్య సౌశీల్యాదులందు నప్రమేయుఁడవే. ఎట్లన నీవు పరమపదమందుండు స్థితియేమి? ఈ వేషముతో నీ వడవులకు వచ్చి క్రోఁతుల తోను గ్రద్దలతోను బోయలతో స్నేహముచేసి వారి నుద్ధరింప వారిలో నొకఁడవై

మెలఁగుటయేమి? ఇంతకు వచ్చినవాఁడవు, ఇఁక నెంతవఱకుఁ బోఁగలవో యెవఁడు చెప్పఁగలఁడు? నీ వాత్సల్యాదులకు మితియేదీ? (౫) చేయూఁత కోలవిల్లు, ద్రోవ తోడు లక్ష్మణుఁడు గలవాఁడవై సాధన సహాయసంపత్తిలేనివానివలె నున్నావు కాని నిన్నుఁ బాలించి చూచిన సమస్తసాధన సమస్త పరిచరసహాయుఁ డెట్లుండునో యట్టి వారి నెల్ల మించియున్నావు. (౬) దుందుభిరావణుల జయించిన వాలిని నొక్కబాణ ముతోఁ బడఁగొట్టితివి. ఇంతటి యసాధ్యకార్యము చేసియు నేమియుఁ జేయ లేని యంబేదవలెఁ గానవచ్చుచున్నావు? నీ విట్టివాఁడవు కావున నిన్ను మనస్సుచే ధ్యానింప సాధ్యపడవు.

మనస్సునకుఁ బ్రాప్యుఁడవు కాకుండినఁ బోనీ, బాహ్యేంద్రియములకైనఁ బ్రాప్యుఁడ వగుదువా యనిన దురాసదుండవు = ౧. అంతరింద్రియమైన మనస్సునకే యూరక యూహింప సాధ్యపడనివాఁడవు. నావంటి ప్రాకృతజీవియొక్క ప్రాకృత ములైన బాహ్యేంద్రియములకు సాధ్యపడుదువా? పడవు. ఈ కన్నులతో నిన్నుఁ జూచి యేమి తెలిసికొనఁగలను? 'మహాజనో యేన గతః స పంథా' యన్నట్లు స్వధర్మ మునఁ బూర్వు లేమార్గమునఁ బోయిరో యా భక్తిమార్గమునఁ బోవువారికిఁ బ్రాప్యుఁడ వగుదువు. తక్కనవారి కప్రాప్యుఁడవే. 'భక్త్యాపరమయావాపి ప్రపత్త్యావా మహామునే ప్రాప్యోహం నాన్యథా ప్రాప్య' యనికదా భగవద్వాక్యము. ౩ వాలి వధ దుష్టమని యెవరందురో వారు నీయం దసూయగలవా రగుటచే నిన్ను సమీ పింపనైనఁ జాలరు. 'శ్రద్ధావా ననసూయశ్చ సోపి ముక్త' యని 'న చ మాం యోభ్య సూయతి' యనియు నుండుటచేతను వాల్మీకియే ప్రారంభమున అనసూయు లగుచును నాలకింపవలె నని చెప్పుటచేతను రామచంద్రమూర్తిపై నసూయపడు వా రాయ నను సమీపింపలేరు. దుర్గతుల పాలగుదురు. ౪ వేదబాహ్యులు- కుదృష్టులు లోనగు వారు వారి యుక్తులచే నీ మహత్త్వమును నిరసింపఁజాలరు. వేదబాహ్యులైన బౌద్ధులు, జైనులు రామచరిత్ర వ్రాసికొని యాయనను ధ్యానించుచున్నారు. మా యావాదు లే విపరీతవాదము చేసినను రామరామ యని ధ్యానించుచున్నారు. జపించు చున్నారు. సేవించుచున్నారు.

ఇట్టి యప్రమేయత్వము, దురాసదత్వము నీ యందున్నను ఆ గర్వముచే నితర రాజస్త్రీల నపహరించువాఁడవుకావు. ఏల? నీవు జితేంద్రియుడవు = ౧ స్వార్థముగ సంపాదింపవలయునన్న కోరిక నీకు లేదు. కావున వానరరాజ్యము సుగ్రీవుని కిచ్చితివి. ౨ ఇఁక స్త్రీలవిషయమందన్ననో 'న రామః పరదారాన్వై చక్షుర్భ్యా మపి పశ్యతి.' రాముఁడు పరస్త్రీలను గన్నెత్తియైనఁ జూడఁడు అనికదా చెప్పఁబడెను. వాలినియుద్ధ మందు జయించినవాఁడవగుటచే వాలిసొత్తయిన మేము నీ సొత్తే. అయినను మమ్ము నీ వాసించిన వాఁడవు కావు. మఱియొకఁ దుష్టుఁడిట్లు చేసియుండిన మమ్మెంత బాధించి యుండునో!

(3) ఇంద్రియములను జయించినవాఁడ వనఁగాఁ జూచుట వినుట మొదలగు కార్యములు చేయుటయందు నీ కింద్రియములతోఁ బనిలేదు. అవి లేకయే యాయా కార్యములు చేయఁగలవు. 'పశ్య త్యచక్షు స్స శృణో త్యకర్ణః । అపాణిపాదో జవనో గృహీతా । సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియ వివర్జిత' మ్మనికదా శ్రుతులు స్మృతులు చెప్పుచున్నవి. (౪) ఇంద్రియములచే జయింపఁబడనివాఁడవు. వానికి నీవు గోచరించినఁ గదా యవి నిన్ను జయించుట- 'దుర్జయం మనసా ప్యన్యై రింద్రియై రపి దుర్జయై' యనునది స్మరింపనగును. విజితేంద్రియుఁడవును = ఇచ్చట నేవార్థకం బున సముచ్చయము. విజితేంద్రియుఁడవే = నీవే విజితేంద్రియుఁడవు. నీ యందే యది ముఖ్యార్థము. తక్కిన బ్రహ్మరుద్రాదులందును వారిభక్షులు, పర్ణభక్షులు, వాయుభక్షులు, పర్ణనీహారభక్షులు లోనగువారియందు గౌణార్థము, ఔపచారికము. పరీక్షయందు వీ రందఱు తప్పినవారే. ఇట్టివాఁడవు నీవయ్యు నీయందు ధర్మగుణము లేదని తలఁచియుంటిని. గాని యాలోచించుకొలఁది విశ్రుతైక ఘన ధార్మికుండవు = సుప్రసిద్ధమైన, కేవలమైన, గొప్పదైన ధర్మగుణము గలవాఁడవు. (౧) స్వాశ్రితుల రక్షింప నవతరించి యిట్టి కార్యము చేసితివి. కావున ఘనధార్మికుఁడవు=ఉత్తమ ధార్మికుఁడవు. తన లాభమునకై ధర్మముచేయువాఁ డధమధార్మికుఁడు. తన లాభము పరులలాభము రెండు నాలోచించి చేయువాఁడు మధ్యమధార్మికుఁడు. పరుల నిమిత్తమునకుఁగా ధర్మముచేయువాఁ డుత్తమధార్మికుఁడు- నీ విట్టివాఁడవు- వాలినిఁ జంపుటయందు స్వలాభముకూడఁ గలిసిన దందురేమో- భూషణములు చూపినపుడు వీఁ డెచ్చట నున్నాఁడు తెలుపుము- వాని నిప్పుడే చంపెద నని రామచంద్రమూర్తి చెప్పఁగా ఆయన యా కార్యమునకై బయలుదేఱినఁ దన కార్యము పాడగునని సుగ్రీవుఁడు తలఁచి రావణు వృత్తాంతము దాఁచెను. సుగ్రీవ సాహాయ్యము లేకున్నను రామచంద్రమూర్తి తన స్వకార్యముచేసికొనఁ గలఁ డని యంద ఱంగీకరించినవిషయమే. కాని వాలివధయందు స్వార్థలేప దోషము చెప్పరాదు. వ్యవహారసరణి చెప్పవచ్చును, గాని పరమార్థమునఁ గాదు. (౨) వర్ణాశ్రమాచారధర్మములచేఁ బూజింపఁబడు వాఁడు ధార్మికుఁడు- భక్తిచేతఁ బూజింపఁబడువాఁడు ఘనధార్మికుఁడు. (3) శరణాగతరక్షకుఁడు. (౪) "ఆనృశంస్యమ్ పరోధర్మ" యన్నట్లు తన యాశ్రితుల కాపద వచ్చినపుడు తాను ఓర్వ చూపెడివాఁడు- (౫) శబర్యాదుల రక్షించుటచే ధార్మికుఁడు- మిగుల గష్టదశయం దుండి నీ యనుగ్రహ పాత్రుఁడగుటకుఁ దగిన యోగ్యత లేకున్న సుగ్రీవుని మిగులఁ గష్టదశయందుండిన వానిని రక్షించుటచే ఘనధార్మికుఁడవు- (౬) గొప్ప పాపముచేసి నరకాగ్నిఁ బడనున్న వాలిని నల్పశిక్షతో దాని నుండి తప్పించి పరమ పదమునకుఁ బోవఁజేయుటచే ఘనధార్మికుఁడవు- ఇట్టివాఁడవు నీ వొక్కఁడవే, నీయట్టి వాఁడు రెండవవాఁడు లేఁడు. కావున ఏక ఘనధార్మికుఁడవు- ఇట్టివాఁడవు నీ వని

నా యట్టి పామరలోక మనుకొనుటగాదు. విశ్రుతుఁడవు = జగత్ప్రసిద్ధుఁడవు. ఏక మేవ- అద్వితీయమ్మని నీ వంటివాఁడవు నీ వొకఁడవే- రెండవవాఁడు లేఁడని విశేష ముగ శ్రుతియే చెప్పుచున్నది. ఏలన:—నీవు మనుష్యమాత్రుఁడ వైనచో నీయట్టి మనుష్యుఁడు వేఱొకఁడు కాలాంతర దేశాంతరములందుఁ గలుగవచ్చును విశ్రుతుఁడవు = వి + శ్రుతుఁడవు = పరమాత్మవని వేదముచేఁ బ్రసిద్ధముగఁబడినవాఁడవు- విశ్వత్శ్రుషివ్యోమ్ని వాతే పరమాత్మని పక్షిణి. నానా॥ శ్రుతం క్లీబే శాస్త్రావధృతయో రపి॥ నానా॥ 'వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః' వేదము లన్నిటిచేఁ దెలియఁబడువాఁడను నేనే యని కదా కృష్ణమూర్తి చెప్పెను. భ. గీ. ౧౫-౧౫. అక్షయ్యకీర్తివి= క్షయ్య జయ్యౌ శక్యార్థే అన్నట్లు క్షయింపఁజేయు సాధ్యము గాని కీర్తిగలవాఁడవు. ఇట్లు చెప్పుటచే వాలిని జంపుటవలన రామచంద్రున కపకీర్తి లేదని భావము- ముందు ఘనధార్మికుఁడ వనుటచే నీవు వాలినిఁ జంపుటయందు ధర్మము తప్పినవాఁడవు కావని చెప్పెను. ఇప్పుడు దానివలన నీ కీర్తికి హానిలేదని చెప్పుచున్నది- స్థూల దృష్టిచేఁ జూచు మూఢులు వాలినిఁ జంపిన దధర్మమని చెప్పినను దూరాలోచనగల వా రట్లు చెప్పరని భావము- దీని కారణములు పూర్వమే వ్రాయఁబడెను. (౨) తస్య నామ మహద్యశః = మహాయశుఁ డని యాయనకుఁ బేరు. అని శ్రుతి.

విచక్షణుఁడవు= దూరపుఁ జూపుగలవాఁడవు. అనఁగా దూరాలోచనచేత యుక్తాయుక్తము లారసి సమస్త కార్యములు చేయువాఁడవు. ఆలోచనలేక యే కార్యము చేయువని భావము. యస్య జ్ఞానమయం తప యని శ్రుతి. కావుననే మొదటి సారియే వాలి యుద్ధమునకువచ్చి సుగ్రీవుని నొప్పింపకముందే చంపిన నిరపరాధియో యపరాధియో విచారింపక తొందరపడి చంపినవాఁడ నగుదునని మొదటిసారి నీ యాశ్రితునికిఁ గలుగు బాధ కన్నారఁజూచి రెండవసారిమాచి యావలఁ జంపితివి- గజపుష్పమాల సుగ్రీవు మెడలో వేయుట దూరాలోచనము చేత నేకదా.

క్షమర్ = ఓర్పునందు- క్షమకుసాటి = భూమితో సమానము. భూమి విషయమున జనులు త్రవ్వుట- మలమూత్రములు విడుచుట- కాలఁ దన్నుట- ఉమ్మి వేయుట లోనగు నెన్ని యపరాధములు చేసినను నామె కోపింపదు. సహించి యూరకుండును. అట్లులే భగవద్విషయమున మన మెన్ని యపరాధములు చేసినను ఆయన క్షమించునేకాని దండింపఁడు. కాని యాశ్రితులకుఁ గీడు చేసినవారిని సమూలము నాశముచేయును. (రావణుని నిర్వంశముగఁ దున్పించినట్లు) అట్లుండియు కృతాపరాధుఁడైన వాలినిమాత్రము వధించి యంగదుఁడు లోనగు వాని బంధువులను మిత్రులను వదలితివి. అయిదువందల కోట్ల యోజనముల విస్తారముగల భూమి కెంత యోర్పో యంత నీకున్నదని భావము. క్షతజోపమాక్షుండవు=క్రొత్తనెత్తురుతో- ఉపమ = సమానమగు- అక్షుండవు- ఎఱ్ఱని కన్నులు గలవాఁడవు. ౧ రామో రక్తాంతలోచన

యున్నట్లు సాముద్రిక శాస్త్రప్రకారము నీ కన్నుఎఱ్ఱగానుండి నీవు మహాపురుషుఁడ వని తెలుపుచున్నవి. ౨ పుండరీక మక్షిణి యన్నట్లు నీవు సాక్షాత్పుండరీకాక్షుఁడ వని నీ కన్నులే తెలుపుచున్నవి. ౩ అపరాధియగు వాలిమీఁది కోపము వాలిని జంపి నను నింకను వదలనట్లు నీకన్నులు చెప్పుచున్నను ఆకారమున నృసింహావతారమునందు వలె భయంకరుఁడవు గాక సౌమ్యుఁడవుగానే యున్నావు.

ఇన్ని గుణములలో నొక్కొక్కటియు రామచంద్రమూర్తి పరమాత్మయని స్థిరీకరింపఁదగినదే యని యిందలి విశేషణములు దెలుపుచున్నవి. ఈ విశేషణముల పై నుండు సముచ్చయములు విశేషార్థమునఁ బ్రయోగింపఁబడినవి. కొన్ని యనుక్త సముచ్చయములు లోపించినవి. అటుగాక యీ సముచ్చయముల కర్థాంతరము చెప్పినను జెప్పవచ్చును. అప్రమేయుండవును = అనఁగా నీ యాశ్రితులకు నీ కల రూపు తెలియును గాని తక్కినవారికిఁ దెలియదని భావము. ఇచ్చట ను లోపము. 'నమోనమో వాఙ్మనసాతి భూమయే నమోనమో వాఙ్మనసైక భూమయే' యను శ్లోకార్థ మిచట ననుసంధించునది.

దురాసదుండవును = ఆశ్రితులకుఁ బ్రాప్యుఁడవేకాని యనాశ్రితులకు నప్రాప్యుఁడవే.

విజితేంద్రియుండవును = ఆశ్రితరక్షణమందు నీకు మతిచాపల మెక్కువ యే కాని యనాశ్రితులందు నీ మనస్సు పోదని భావము.

ధార్మికుండవును = ఇచ్చట సముచ్చయ మవధారణార్థమునఁ బ్రయుక్తము. ధార్మికుఁడవే - రక్షణశిక్షణములు ధర్మపద్ధతినే చేయుదువు. అక్షయ్యకీర్తివిని = నీ బిరుదములు అర్థములేని మాటలుగావు సార్థకములు = క్రియాయుక్తములు, విచక్షణుండవును = ఇంతసామర్థ్యము కలవాడ వైనను ఆశ్రితులను వదలుటకు నీకు సామర్థ్యములేదు అని భావము. మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన- మైత్రి భావించి తాన సంప్రాప్తుఁడైనవాని నెటులైనఁ జేపీడువాఁడఁ గాను అని కదా రామచంద్రవ్రతము.

శ్రీరామచంద్రమూర్తి శరీరము ప్రాకృతమూర్తికాదు. అప్రాకృత దివ్య మంగళవిగ్రహము. ఇఁక నా విషయము చెప్పుచున్నది.

అతులబాణాసన బాణపాణివిని = అసమానములైన విల్లు బాణములు చేతఁ గలవాఁడవు. నీవు ధరించిన విల్లు బాణములను మఱియొక రూరక యెత్తనైనఁ జాల రని భావము. ఇది నా కెట్లు సాధ్యమయ్యె నందువా- మహాబలుఁడవు = లోకముల నందఱికంటె నెక్కువ బలముకలవాఁడవు గావున స్వాభావికీ జ్ఞానబలక్రియాచ యన్నట్లు బలస్వరూపమే నీవు. నీ బలములో కోట్యంశము నీ వనుగ్రహించినచో, వాఁడు లోకములో మహాబలు డనఁబడును.

మహా బలుఁడని వాయువునకుఁ బేరు. ఆయన కా బలమెక్కడిది? నీ వనుగ్రహించిన లేశము. అనఘు=పాప సంపర్కము లేనివాఁడా. ఇది యపహత పాప్మత్వాదులఁ దెలుపును. ఉత్తమసంహననోపేతుఁడవు = ఎట్టి యంగసౌష్ఠవ ముండినచో నంతటి మహాబల ముండఁగలదో యట్టి యంగసౌష్ఠవము గలవాఁడవు. ఇట్టి యవయవ సౌష్ఠవము లోకమున మఱి యెవ్వరియందు లేదా యనిన లేదు. ఎట్లన మర్త్య విగ్రహాభ్యుదయము విడిచి = మనుష్య శరీరము గలుగుటను వదలి, లోకమునఁ బుట్టిన మనుష్యులందఱు కర్మవశమునఁ బ్రాప్తమైన శరీరము గలవారు. కావుననే మర్త్యులు. నీవో మనుష్య లోకమునఁ బుట్టి మనుష్యునివలెఁ గానవచ్చుచున్నను గర్మవశమునఁ బుట్టినవాఁడవు కావు. స్వేచ్ఛాగృహీతశరీరుఁడవు - కావున నీ వీ లోకమున నుండినను దివ్య విగ్రహాభ్యుదయంబున వెలసెదవు. అప్రాకృత శుద్ధ సత్త్వ మయ దివ్యమంగళ విగ్రహమున వెలసెదవు.

ఇచ్చట 'తదాత్మానం సృజామ్యహమ్' అప్పుడు నన్ను సృష్టించుకొనుచున్నాను. సంభవా మ్యాత్మమాయయా' నాసంకల్పముచే నేను బుట్టుచున్నాను.

అవజానంతి మాం మూఢా, మానుషీం తను మాశ్రితమ్
పరం భావ మజానంతో, మమ భూత మహేశ్వరమ్.

భ॥ గీ॥ ౯-౧౧

మనుష్యశరీరము నాశ్రయించిన నన్ను సర్వభూత మహేశ్వరుఁడనైన నా పరమభావము తెలియని మూఢులు తెలిసికొనలేరు.

ప్రాదుర్భావాస్తు ముఖ్యా యే, మదంశత్వా ద్విశేషతః
అజహత్స్వభావ విభవా, దివ్యాఽప్రాకృత విగ్రహాః
దీపాద్దీప ఇవోత్పన్నా, జగతో రక్షణాయ తే
అర్చ్యా ఏవహి సేనేశ, సంసృత్యుత్తరణాయ తే
నృసింహ రామకృష్ణేషు-షాడ్గుణ్యం పరిపూరితమ్
పరావస్థాతు దేవేశ, దీపాదుత్పన్న దీపవత్॥ పద్మ॥

ఇత్యాది ప్రమాణవాక్యముల నిచట ననుసంధించునది.

తాత్పర్యము

రామచంద్రమూర్తీ! నీ కొలఁది లెక్కింపరానివాఁడవు. అప్రాప్యుఁడవు. ఇంద్రియముల జయించినవాఁడవు. రాముఁడొక్కఁడే గొప్ప ధర్మాత్ముఁడని ప్రసిద్ధికెక్కినవాఁడవు. శాశ్వతకీర్తివి- దూరాలోచనగలవాఁడవు. ఓర్పునందు భూమితో సముఁడవు. పుండరీకాక్షుఁడవు- శరచాపధారివి - మహా బలవంతుఁడవు- పాపస్పర్శ లేనివాఁడవు,సర్వాంగసౌష్ఠవము గలవాఁడవు, మనుష్యలోకమునకు వచ్చియు మర్త్య శరీరమును ధరింపక శుద్ధసత్త్వమయ దివ్యమంగళ విగ్రహము ధరించినవాఁడవు. రామచంద్రా! నీ వింతటి మహానుభావుఁడవు, వాత్సల్యనిధివి. ఆశ్రితవాంఛాప్రదాన

దక్షుఁడవు. నీ వెంతటి గొప్పవాఁడవైనను నా కర్మము నాధర్మము నా దుఃఖము నాకుఁ దప్పదుగదా. కావున నిన్ను నే నొకటి ప్రార్థించుచున్నాను.

నా పతిని బ్రతికింపుమని నేను గోరను- ఏలన నింతకంటె నుత్తమగతులకు నీ యనుగ్రహమువలనఁ బోయి యున్నాఁడు. అట్టివానిని మరల నధమగతికిఁ దెమ్మని నేఁ గోరను. నన్నుఁ గూడ నాయన యుండుచోటికిఁ బంపుము. ఇది నీ చేతిలోని కార్యము. ఈ దేహముతో నా లోకములకుఁ బోవ సాధ్యపడదందువా- ఈ దేహముతో నాకుఁ బనిలేదు. వాలిని నే యొండు బాణమున వేసితివో యా బాణమున నన్ను వేయుము. నేను బోయి నా భర్తతోఁ గలిసికొందును. నన్నుఁ జంపు మని కోరకున్న నీవే చావరాదా యందువేమో- నేనై యాత్మహత్య చేసికొనరాదు. పుత్త్రుఁడు గలది సహగమనము చేయరాదు.

ఆ. పురుషుకంటె మున్ను పరలోక మేగిన,సతియ నోఁచినదియు సతులలోనఁ
బురుషహీన యయినఁ బరమ పతివ్రత,యయ్యు జగముచేత వ్రయ్యఁ బడదె.

ఆ. పడిన యామిషంబుఁ బక్షు లపేక్షించు,నట్లు పురుషహీన యయిన యువతిఁ
జూచి యెల్లవారుఁ జులక నపేక్షింతు, రిదియుఁ బాపమనక హీనమతులు.

ఆ. సతి వియుక్తుఁడైన పతికిఁ బునర్దార, సంగ్రహంబు సేఁత శాస్త్రమతము
పతి వియుక్తయైన సతి కన్య పురుషసం,గ్రహము సేఁత లోకగర్హితంబు.

ఆది. ౬-౨౫౧-౨౫౩.

ఈ కారణముచే నేను జీవింపనురాదు. కావున నీవు నన్నుఁ జంపిన నా కుభయలోకదోషములు వదలి నేను నానాథు నొద్దకుఁ బోదును. నీవు పోకుండిన నేమి? అక్కడ దేవతాస్త్రీలు లేరా యందువేమో- ఎందఱున్నను నేను లేకుండిన నాయనకు సుఖములేదు. భార్య యుండుటయేల, భర్తను సుఖపెట్టుటకే కదా ? ఆయన కక్కడ సుఖములేకుండఁ జేసి యిక్కడ నే నేమని యుందును?

ఉ. ఆర్యవరేణ్య ! యా సరసిజాక్షుఁడు నాకమునం దలంక్రియా
కార్యవిచక్షణల్ కుసుమకాండవిరాజితశేఖరల్ మహా
వార్యగతిన్ భజించినను వాఁడు తాఁ బాయఁడు నన్నుఁ గానమిన్
భార్యను భర్తనుం గలుపు భవ్యయశంబునఁ బొంగదే నృపా ! ౬౨౪

దీనినే వివరించి చెప్పుచున్నది.

సరసిజాక్షుఁడు = కమలములవంటి కన్నులు గలవాఁడు- అనఁగాఁ జూచుటకు రమ్యమైన కన్నులు గలవాఁడు- ఆర్యవరేణ్య = గొప్పవారిలో గొప్పవాఁడా- నాకమునందున్ = స్వర్గమునందు - అలంక్రియాకార్యవిచక్షణల్ = అలంకరించుకొనుట యను పని యందలి నేర్పరులు- కుసుమకాండ = పూలసమూహముచే- విరాజిత = ప్రకాశించు. శేఖరల్ = శిరోభూషణములు గలవారు- అగు నప్సరసలు,

మహాఽవార్యగతిలో = ఏమియు నడ్డము లేక- ధన్యయశంబునన్ = మేలగు కీర్తి యందు. తాత్పర్యము.

ఉత్తములం దుత్తముఁడా - నా భర్త స్వర్గమునందు నెంతెంతో చమత్కారముగ నలంకరించుకొన్న నేర్పుగల దేవతాస్త్రీలు తమశిరస్సులందుఁ జిత్రచిత్రముగాఁ బూలు ముడిచి నేను ముందు సేవించెద ననిన నేను ముందు సేవించెద నని యడ్డము లేక పైపడి వచ్చుచుండినను నేను లేని కారణముచే నాయనకు సుఖసంతోషములు లేవు. కావున భార్యను భర్తను గలిపిన పుణ్యముఁ గట్టుకొమ్ము.

తార తన భర్తయొద్దకుఁ దాను బోయెద నని చెప్పుచున్నది గదా యేమి నమ్మకము? ఎవరెవరి పుణ్య పాపములకొలఁది వారు వారు పోదురుగాని యొకరు పోయినచోటికే వారి బంధువులు పోదురా? ఈ నియమ మనుకూల దంపతుల యందు లేదు. పతివ్రతయగు భార్య పతియుండు లోకముననే పోవును.

సంసరంత మభిప్రేతం, విషమే ష్వేక పాతినమ్
భార్యైవాన్వేతి భర్తారం, సతతం యా పతివ్రతా
ప్రథమం సంస్థితా భార్యా, పతింప్రేత్య ప్రతీక్షతే
పూర్వప్రేతంతు భర్తారం, పశ్చాత్సాప్యనుగచ్ఛతి
ఏతస్మాత్కారణాత్ రాజన్, పాణిగ్రహణ మిష్యతే.

భార.ఆది ౯౮-౨౭-౨౮

"మఱియు భార్య పురుషునం దర్ధంబగుటం జేసి పురుషునకు మున్న ప్రేతయైన పతివ్రత పరలోకంబునం దన పురుషుంగూడఁ దదనుగమనంబు ప్రతీక్షించుచుండు. పురుషుండు మున్న ప్రేతుండైనఁ బదంపడి తానును బ్రేతయై తన పురుషుంగూడ నరుగు" ఈ కారణంబునఁగదా పాణిగ్రహణంబు విధ్యుక్తంబయ్యె. ఈ కారణమునఁ బతివ్రతలయిన స్త్రీలకుఁ బతిసాలోక్యము తప్పదు.

తార పతివ్రతయా యనరాదు. ఆమె సముద్రమథనంబునఁ బుట్టిన యయోని జ- అప్సర స్త్రీ వంటిది. కావున నామెకు జారత్వదోషము లేదు.

అహల్యా ద్రౌపదీ తారా, సీతా మండోదరీ తథా
పంచకన్యాః పఠేన్నిత్యం, దుస్స్వప్నం తస్యనశ్యతి.

యని యొకచాటువు గలదు. వీ రందఱిటువంటి వారుగానే యున్నారు.

ఉ. నాకమునన్ వసించియును ♦ నాపతి నన్నెడఁబాసి యుండుటన్
శోకము విన్నఁబాటు గొని ♦ సుగ్రుక్కుచు నుండు నిజంబు దేవ నీ
వే కరణిన్ మనోహరన♦గేంద్రతటంబున సీతఁ బాసి య
స్తోకము గుందితో యటులె♦చూడుమ యన్యుల కైన వేదనల్. ౬౨౫

మనోహర నగేంద్రతటంబునన్=ఇంపైన పర్వతశిఖరంబున, అస్తోకము= మిక్కిలి.

తాత్పర్యము.

సర్వసుఖస్థానమైన స్వర్గమునం దుండినను నా భర్త నన్నెడఁ బాసియుండవలసి వచ్చుటచే శోకము దైన్యము వీనిచే శుష్కించుచుండును. ఇది నిజము. ఇది సత్యమను టకు నీవే సాక్షి. నీవు ఋశ్యమూకతటంబున సీతను దలఁచుకొని యెట్లేడ్చితివో యట్లే యితరు లని తలఁపుము.

ఉ. ప్రాయపుఁ బూరుషుండు తన♦ప్రాణసఖిం బెడఁబాయఁ గల్గు నా
యాయత మైన దుఃఖభర♦మంతయు నీవు నెఱుంగుదే కదా
యీయెడ వాలి న న్విడిచి ♦ యెంత తపించెడి నొక్కొ రాఘవా!
వ్రేయుము తచ్ఛరంబుననె ♦ వేగమ నేఁ జని కాంతు వల్లభున్. ౬౨౬

ఆయతము=దీర్ఘము, విస్తారము.

తాత్పర్యము.

యౌవనమందుండు మగవాఁడు తన ప్రియురాలిని విడనాడుటచేఁ గలుగు దుఃఖాతిశయము నీవనుభవముచే నెఱిఁగినవాఁడవే కదా. అట్లులే వాలి నన్ను విడనాడిపోయి యెంత తపించుచున్నాఁడో- రామచంద్రా! యాయనను వేసిన బాణముననే నన్ను వ్రేయుము. నేను బోయి నా మగనిఁ జూచెదను.

ఉ. స్త్రీవధ పాతకం బనుచుఁ ♦ జింతిలఁ బోకు మహానుభావ! నే
నా విభు నాత్మ నన్న మతి ♦ నన్ వధియింపు దయార్ద్రబుద్ధివై
నా విభుఁ జంపినట్ల, రఘు♦నాయక! వేదము శాస్త్రసంఘముల్
వావిరి నెంచు భర్తకును ♦ భార్యయ యాత్మ యటంచుఁ జూడుమా. ౬౨౭

స్త్రీవధ = ఆఁడుదానిఁజంపుట- పాతకంబు = పాపము- దయార్ద్రబుద్ధివై = దయచేఁ గరఁగిన బుద్ధిచే- అయోధ్యాకాండము ౧౦౩౭ వ పద్యము చూడుము.

తాత్పర్యము.

మహానుభావా! తాటకాంతకా! స్త్రీనిఁ జంపినఁ బాపము వచ్చునని యాలోచింపకుము. నీ కా పాపసందేహముతోఁ బనిలేదు. నీకుఁ బాపమురాదు. భర్త యాత్మగదా భార్య యన్న యభిప్రాయముతో దయగలవాఁడవై నా భర్తను జంపినట్లు నన్నుఁ జంపుము. భార్య వేరు భర్త వేరుగదా యందువేమో, భర్తకు భార్యయే యాత్మయని వేదశాస్త్రములు చెప్పుచున్నవి. (చూడుము అయో. ౧౦౩౭ ప.)

భార్యాభర్తృసంబంధ మొక జన్మముతోఁ దెగునదికాదు. జన్మాంతరము లందు నంటుకొనియే వచ్చును.

"సమనుభూతానాదిసర్గపరంపరా । సక్రమాకలిత సంసర్గము నః" యని నైషధము.

పునశ్చిరాయు స్స్వ భూత్వా, జాయతే విమలేకులే
పతివ్రితాతు యా నారీ । తమేవ లభతే పతిమ్. ॥స్మృతి॥

మరలఁ జరాయువుగలదై నిర్మలమైన కులమునందు జన్మించి పతివ్రితయగు స్త్రీ మరల నతనినే పతిగాఁ బొందును.

సతీవయోషిత్ ప్రకృతి స్సునిశ్చలా
పుమాంస మభ్యేతి భవాంతరేష్వపి॥ మాఘపండితుఁడు.

పతివ్రత యెల్ల జన్మంబులందును ఆ పతికే పత్నియగును గాక. శృంగారనైషధ వ్యాఖ్య-

తక్కిన ప్రమాణములు అయోధ్యాకాండమం దీయఁబడినవి.

ఉ. కూరిమి భార్య భర్తకును♦గూరిచి దానము సేఁతకన్న లే
దారయ నొండు దాన మని♦యందురు జ్ఞానులు, నన్ను నా ప్రియుఁ
గూరిచి తేని ధర్మ మొదఁ ♦ గూరిచి పుణ్యమ యబ్బు నన్ను సం
హారము చేసినట్టి యఘ ♦ మంటదు నిన్ను నృపాలకాగ్రణీ! ఉ-౨౭

తా త్ప ర్య ము .

రాజశ్రేష్ఠుఁడా! ప్రేమగల భార్యను భర్తకు దానము సేయుట యన్నిదానములలో నుత్తమ దాన మని జ్ఞానులు చెప్పుదురు. కావున ధర్మము దలఁచి నా భర్తతో నన్నుఁ గూర్చితివేని నీకుఁ బుణ్యమే కలుగును. సంహారముచేసిన పాపము రాదు.

ఉ. దిక్కది లేనిదాన, నతి♦దీనను, భర్తయుఁ బాసిపోయె, నీ
వొక్కశరంబు పై విడిచి ♦ యూపిరిఁ బాపుము, నీకు మ్రొక్కెదన్,
దిక్కరితుల్యగామి వర♦ధీయుతుఁ గాంచనమాలి వాలి నే
నక్కట వీడి నిల్వఁ గల♦నా చిరకాలము జీవయుక్తనై. ఉ-౨౮

దిక్కరి తుల్యగామి = దిగ్గజముల నడకతో సమానమగు నడక గలవానిని, వరధీయుతుఁ = గొప్పబుద్ధితోఁగూడిన వానిని- కాంచనమాలి = బంగారు హారము గలవానిని- జీవయుక్తనై = ప్రాణముతో.

తా త్ప ర్య ము .

నేనే దిక్కులేనిదానను, మిగుల దీనురాలను, భర్తకూడ నన్ను వదలిపోయెను. నీకు నమస్కారము చేసెదను. ఒక్కబాణము నామీఁద విడువుము. దిగ్గజముల నడక వంటి నడకగలవాఁడు గొప్ప బుద్ధిగలవాఁడును, బంగారుసరము ధరించినవాఁడును నగు వాలిని విడిచి దీర్ఘకాలము నేను ప్రాణముతో నుండఁగలనా? దీర్ఘకాలము కృశించి చచ్చుటకంటె నొక్కసారి తటాలునఁ బ్రాణము వీడుట మేలుగదా.

ఏకభార్యావ్రితస్థులుగాని పురుషులకు 'భార్యాదుఃఖమ్ పునర్భార్యా' యని భార్యచచ్చిన దుఃఖము మరల భార్యవచ్చువఱకుండునని ప్రమాణము. అట్టులే యీ

మగఁడు పోయిన మఱొకమగఁడు వచ్చునను ధైర్యముగల స్త్రీలకీ దుఃఖము మరల మగఁడు వచ్చువఱకే. రాఁగలఁడను ధైర్యము దొరకువఱకే. ఇదంతయుఁ దాత్కాలిక దుఃఖమే. దీనికిఁ దారయేగాక మూఁడుమగల వెదకికొనువా రందఱు నిదర్శనములే.

—♦ శ్రీరాముఁడు తార నాశ్వాసించుట. ♦—

కం. అని పనవుతారఁ గనుఁగొని, యనియె రఘూత్తముఁడు దుఃఖ♦మాఱఁగ నిట్టుల్
చనునె విరుద్ధపుమతి నీ, కనఘాత్మిక! వీరభార్య♦వై వహియింపన్. ౬౩౦

పనవు = ఏడ్చు, విరుద్ధపుమతి = విపరీతాభిప్రాయము.

తా త్ప ర్య ము.

అని యేడ్చుచున్న తారనుజూచి యామె దుఃఖము శమింపఁగ రామచంద్రమూర్తి యిట్లనెను. నీవు వీరుని భార్యవై యుండియు నిట్టి విపరీతపుబుద్ధిగలదానవగుట తగునా? ఇంతటి పేదమనస్సు గలదానవు. అటువంటి వీరున కెట్లు భార్యవైతివి?

తే. నిఖిలజగములు ధాతచే♦నిర్మితములు, తరుణి! సుఖదుఃఖ యోగముల్♦ధాతచేతఁ
గలుగుచుండును గాన దుః♦ఖంబు సుఖము, బ్రహ్మచేసినయది యని♦పలుకుజనము.

తా త్ప ర్య ము.

సమస్తలోకములు బ్రహ్మచే సృష్టింపఁబడినవి. సుఖము దుఃఖము అనునది కూడ వారివారి కర్మానుసారముగ నాయనచేతనే కలుగుచుండును. కావునఁ గదా సుఖము దుఃఖము బ్రహ్మ తెచ్చిపెట్టినాఁడని లోకము చెప్పుచున్నది.

ఉ. ధాత విధించినట్టులు గ♦దా సకలంబును వర్తిలున్, వశం
బే తరుణీ! విధాతృకృతి ♦ నింతయు మీఱఁగ, వీరపత్ను లీ
రీతిని దుఃఖ మందుదురె ♦ ప్రీతి వహించెదు యౌవరాజ్యసు
స్థితునిఁ బుత్త్రుఁ గాంచి యనఁ ♦ జెల్వ సువేష దొఱంగె దుఃఖమున్. ౬౩౨

తా త్ప ర్య ము.

బ్రహ్మ యేర్పాటు చేసినట్లు సర్వము జరగుచుండును. ఆ బ్రహ్మ ముందుగనే చేసినయేర్పాటును నతిక్రమించిపోవఁ గొంచెమైనను సాధ్యమగునా? వీరుల భార్య లీరీతి దుఃఖింతురా? వీరుఁడగు నాభర్తకు వీరయోగ్యమగు మరణము లభించెనని సంతోషింప వలయునుగదా. నీ కొడుకు యువరాజు గాఁగాఁ జూచి నీవు సంతోషించెదవు. అని చెప్పఁగా నాసుందరి సువేష దుఃఖమును బాసెను. దీనివలన వాలియందలి ద్వేషముచే దనకొడుకును దిక్కులేనివానిఁ జేసెదరేమో యను సందేహమే తార దుఃఖమునకు నెక్కువ కారణ మని తోఁచుచున్నది.

౨౫-వ సర్గము.

క. హా యని యేడ్చునంగదుఁ, దారను సుగ్రీవుఁ గాంచి ♦ తత్సమశోకుం
డౌ రఘుపతి లక్ష్మణుతో, వారల నూరార్చె సాంత్వ♦వచనంబులచేన్. ౬౩౩

సాంత్వవచనంబులచేన్=ఊరార్పుమాటలచే.

తా త్ప ర్య ము.

హా! రుమని యేడ్చుచున్న యంగదుని- దారను సుగ్రీవునిఁ జూచి వారితో సమానముగ నేడ్చుచు రామచంద్రమూర్తి లక్ష్మణుతోడ నూరార్చెను.

క. చచ్చినవారికి నేడ్చిన, వచ్చునె నిశ్శ్రేయసంబు ♦ వారికిఁ జెపుఁడా?
యిచ్చ ననంతరకార్యముఁ, గ్రచ్చఱ సలుపంగఁ దలఁపఁ ♦ గార్యము గాదే. ౬౩౪

నిశ్శ్రేయసంబు = మోక్షము- ఉత్తమమైన మేలు.

తా త్ప ర్య ము.

చచ్చినవారికై మన మేడ్చుచుండినచో వారికిఁ బరలోకమున నుత్తమమైన మేలు మోక్షము గలుగునా? చెప్పుఁడు. కావున నిష్ప్రయోజనమైన యీ కార్యము వదలి యిఁకమీఁదఁ జేయవలసిన కార్యమేదో యది త్వరగాఁ జేయఁదగిన కార్యము గదా.

పీనుఁగును దహనాదిసంస్కారములు చేయక పదిగంటలమీఁద నుంచినఁ బర్యుషిత దోషము వచ్చును.

క. చాలును లోకముతో పా, టీ లీలను బ్రేతమునకు ♦ నేడ్చుట నేమాఁ
గాలంబు మీఱి యావలఁ, జాలుదు రెద్దాని మీరు ♦ సలుపఁగఁ జెపుఁడా. ౬౩౫

తా త్ప ర్య ము.

లోకముతోపాటు మీరు నీవిధముగఁ జచ్చినవానికై యేడ్చితిరి, చాలును. దీనివలన లాభమేమి? ఏడువకుండిన నెవ్వరేమనుకొందురో యని యేడ్చెదరా? కాలాత్మకుఁడైన భగవంతుని యాజ్ఞను మీఱి మీరు చేయఁగల దేమున్నది.

క. నియతియె లోకనిదానము, నియతి క్రియాసాధనంబు ♦ నిక్కము చుండీ
నియతియె భూతావళులను, నియమింపఁగఁ గారణము వ♦నేచరులారా! ౬౩౬

నియతి= దైవము; లోకనిదానము= లోకమున కాదికారణము. వనేచరులు- అలుకస్సమానము.

తా త్ప ర్య ము.

లోకమున కాదికారణము దైవమే. దైవమే సమస్తకార్యములు సాధించునది. ఇది నిజము. మనము స్వతంత్రించి చేయునది యేదియులేదు. ఆయన చేయించినట్లు మనము చేయుచుందుము. ఆ దైవమే సమస్తభూతముల నియమింపఁ గారణము. 'తేన వినా తృణాగ్రమపి న చలతి'- భగవదాజ్ఞలేక గడ్డిపోఁచకూడఁ గదలదు.

ఇందు నియతి - కాలము - స్వభావము అనునవి యీశ్వర పర్యాయశబ్దములని గ్రహింపనగు. అట్లుగాకున్న లోకనాయకులు పెక్కు లగుదురు. ఈ సందర్భమున శ్వేతాశ్వతరోపనిషత్తునందలి యీ మంత్రములు స్మరింపనగు. "కాలః స్వభావో నియతిర్యదృచ్ఛా, భూతాని యోనిః పురుష ఇతి చింత్యా । సంయోగ ఏషాం నత్వాత్మభావా దాత్మాప్యనీశః సుఖదుఃఖహేతోః'.

ఈ ప్రపంచమునకుఁ గారణ మెవరు ? కాలము - స్వభావముని - యతి యదృచ్ఛాభూతములు జీవుఁడు కారణముగాదు. సుఖదుఃఖములకు లోఁబడినవాఁ డగుటచే జీవుఁడు కారణము గాఁజాలఁడు. ఆత్మ యనునది యుండుటచే వీని సం యోగము కారణముకాదు. అట్లైన నెవరు కర్త ?

తే ధ్యానయోగానుగతా అపశ్యన్ దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢాం యః కారణాని నిఖిలాని తాని కాలాత్మయుక్తా న్యధితిష్ఠ త్యేకః॥

బ్రహ్మవేత్తలు యోగధ్యానమగ్నులై తన గుణములచే మఱుఁగుపడియుండు భగవంతుని స్వశక్తిని గారణముగాఁ దెలిసికొనిరి.

ఈ కారణము లని తలఁపఁబడిన యన్నిటిని కాలము ఆత్మ యని చెప్పఁబడిన వానిని ఆయన యొక్కఁడే శాసించువాఁడు.

ఉ. ఒక్కఁడు దేనినేన్ జేలుప ♦ నోపఁడు కర్తగఁ, జేయఁ గార్యమున్
జక్కఁగ నెవ్వఁ డేనియును ♦ జాలఁడు చూ పెరరేప నెవ్వనిన్
నిక్కముహో స్వభావమున ♦ నిత్యము లోకము వర్తిలుం జుఁడీ
తక్కక, తత్స్వభావము స♦తంబును గాలపరాయణం బగున్. ౬౩౭

పెరరేపన్ = ప్రేరించుటకు.

తాత్పర్యము.

ఎవఁడు నేను స్వతంత్ర కర్త నని దేనిని జేయఁజాలఁడు. నీ వీ కార్యముచేయుమని యెవ్వఁడైనను నెవ్వనినైనఁ బ్రేరింపనులేఁడు. అది యిది కూడ దైవతంత్రమున నే లోకమున జరగుచుండును. ఆ దైవము కాలరూపమున నాయా కార్యములు చేయును.

క. కాలము దాఁటదు కాలముఁ, గాలమున నపక్షయంబు ♦ గలుగదు చుండీ
కాలము స్వభావముననే, క్రాలెడి స్వనియమము నద్ది ♦ కడవద యెపుడున్. ౬౩౮

అపక్షయంబు = క్షీణదశ-

తాత్పర్యము.

దైవము తన యేర్పాటును దాను దాఁటిపోఁడు. తన సంకల్పము ప్రకారమే సర్వము జరుపుచుండును. పూర్వ సంకల్పవిరోధముగఁ బరసంకల్పము చేయుచు దైవ మునకు నొకవేళ వృద్ధి యొక్కవేళ క్షయము లేదు. దైవము తన స్వభావముచేత నే ప్రకాశించును. తన నియమమును దా నతిక్రమింపడు. కాలము దాఁటదు. కాలమన్న ప్పు డీశ్వరుఁడు స్వతంత్రుఁడే కాని పరతంత్రుఁడు గాఁడని యెఱుఁగవలయు., నచాస్య కశ్చిజ్జనితా నచాధిప' యుని శ్రుతి. అపక్షయ మనునది షడ్భావవికారముల కుపలక్ష ణము. ఇవి భగవంతునకు లేవని భావము. 'అపక్షయ వినాశాభ్యాం పరిణామర్ధి జన్మభిః వర్జిత శ్శక్యతే వక్తుం యస్సదాస్తీతి కేవల' మ్మను వాక్యము స్మరించునది.

క. కాలం బెఱుఁగదు చుట్టముఁ, గాలమునకుఁ గారణంబు ♦ గలుగదు కడిమిన్
గాలము చిక్కదు మిత్రులుఁ, కాలమునకు లేరు వశము ♦ గా దాత్మలకున్. ౬౩౯

## తాత్పర్యము.

కాలమునకు బంధువు లనువారులేరు. కావునఁ బక్షపాతములేదు. కాలమును మన స్వాధీనపఱుచుకొను నుపాయములేదు. మన బలమునకుఁ గాలము భయపడి వశపడదు. కాలమునకు స్నేహితులు లేరు. కావున నపరాధుల నందఱ నేకవిధమున శిక్షించును గాని దాక్షిణ్యముంపదు. 'ఏష సేతుర్విధరణ ఏషాం లోకానా మసంభేదాయ' యను శ్రుతియు స్మరించునది. జీవాత్మలకుఁ బరతంత్రముగాను. ఆయా జీవుల కర్మానుగుణముగఁ బుణ్యాపాపము లనుభవింపఁ జేయుచుండునుగాని వాని యిష్టప్రకారము తాను వర్తింపదు.

తే. కాలపరిణామమునఁ గల్గు•గార్యజాత, మనుచు మతిమంతుఁ డుండఁగ•నర్వ మెప్పుడు
ధర్మ మర్థంబు కామంబు•తనకుఁ దాన, కలుగుఁ గాలక్రమంబునఁ•దొలఁగ దెట్లు.

కాలపరిణామమునన్; కాల = ఈశ్వరునియొక్క- పరిణామమునన్ = జీవుని కర్మానుగుణముగాఁ జేసెడి వ్యాపారములచేత- కార్యజాతము = కార్యముల సమూహము- మతిమంతుఁడు = బుద్ధిమంతుఁడు- కాలక్రమంబునన్ = ఈశ్వరుఁ డేర్పాటు చేసిన వ్యవస్థచేత.

## తాత్పర్యము.

సర్వమునకు నీశ్వరుఁడే స్వతంత్రకర్తయైనచో నిఁక జీవుఁడు చేయవలసిన దేమి యుండునా వినుము. శాస్త్రములందలి నిష్కృష్టాంశముల నెఱిఁగినవాఁడు ఈశ్వర ప్రేరణముచే జీవుఁడు కర్మానుగుణముగాఁ జేసెడి వ్యాపారములవలనఁ గార్యఫల సమూహము కలుగుచున్నదని తలంచుచుండవలెను. ఈశ్వరుఁడే చేసిన యేర్పాటు ప్రకారము ధర్మము అర్థము కామము మనము కోరినను గోరకున్నను లభించు చుండును. తప్పదు.

పూర్వమందు స్వభావవాదులని నియతవాదులని కాలవాదులని కొందఱుండిరి.

కారణం వినైవ సర్వం భవతీతి స్వభావవాదినః

కారణములేక సర్వమగు ననువారు స్వభావవాదులని మధుసూదన సరస్వతులు చెప్పిరి. వీరినే నాస్తికు లని రామతీర్థులు చెప్పిరి.

పూర్వజన్మార్జితౌ ధర్మాధర్మౌ నియతిః సైవ సర్వస్య కారణమితి నియతివాదినః.

పూర్వజన్మమం దార్జించిన పుణ్యాపాపములకు నియతి యని పేరు. అవియే సర్వమునకుఁ గారణ మనువారు నియతివాదులు. వీరే కర్మవాదులు నగుదురు

సర్వమునకుఁ గాలమే కారణ మనువారు కాలవాదులు. వీరందఱు నాస్తికులని పూర్వులు వ్రాసియున్నారు. ఈశ్వరుఁడున్నాఁడని యాయన కర్తృత్వము కారణత్వము నంగీకరింపరు. వీరిలో వీరికిఁ బరస్పరభేదములు కలవు. కావున రామచంద్రమూర్తి నాలుగు పద్యములలో నాలుగు విధములైన నాస్తికవాద ముపదేశించెనని

తలంపరాదు. ఈవాదము లన్నియుఁ బూర్వోక్త శ్వేతాశ్వతరోపనిషత్తునందు ఖండింపఁబడినవి, కావున నీచర్చ యనావశ్యకము.

తే. అట్లు కావున వాలి ము ♦ న్నాచరించి, నట్టి ధర్మార్థకామఫ♦లాళిఁ జెంది
నరిగె నిట నుండి నాకంబు♦నతుల మైన, తనదు పరిశుద్ధధామంబుఁ♦ గనుచు నిట్లు.

పరిశుద్ధధామము = రజస్సు తమస్సు సంపర్కములేని స్థానము- ఆచరించినట్టి యనునది ధర్మార్థకామములతో నేకాదేశాన్వయము.

తా త్ప ర్య ము .

లోకస్థితి యిట్టి దగుటచేత వాలి పూర్వము దా నే ధర్మార్థకామముల నాచరించెనో వానివలనఁ గలుగు ఫలము ననుభవించుటకై నాచే దండింపఁబడినవాఁ డగుటచేఁ దన పాప మంతయుఁ దొలఁగఁ దోఁచికొని శుద్ధసత్త్వమైన నాకంబుఁ జేరఁ బోయెను.

నాకము = దుఃఖములేనిది- కం = సుఖము = అదిగానిది అకం= దుఃఖము- అదిలేనిది నాకము. ఇంద్రలోకమందుఁ గూడ దుఃఖము కలదుకావున నిజమైననాకము వైకుంఠమే. రామునిచేతఁ జంపఁబడుటను- ప్రాణోత్క్రమణసమయంబున రామదర్శనము తచ్చింతనము అనుకూలభావము లభించుటచేతను వాలికి మోక్షము గలదు.
(చూ. ప. ౭౨౨)

శంబుకుని గాని వాలినిగాని మఱియొకరా జెవ్వఁడైన వధించియుండినచో వారికి నుత్తమ గతులు లభించి యుండవు- అట్టిగతు లిచ్చుటకు వారు గర్తలుగారు- రామచంద్రమూర్తి వారు చేసిన పాపములకు వారినిదండించుటయేగాక యుత్తమగతి నొసఁగెను. ఆ కారణముచే వారికి శ్రీరామచంద్రమూర్తి స్వయంకృషిచే వారెన్ని జన్మములకైన సాధింపలేని నిశ్శ్రేయసము నొసఁగి మేలుచేసెను. ఈ రెండు సందర్భముల రామచంద్రునియందు దోషమెంచువారు దీనిని గమనింపవలెను. శాస్త్రమర్యాద రక్షించెను. శంబుకుని విషయమం దిట్టులేకదా రామచంద్రమూర్తి వర్తించెను.

క. తన ధర్మగుణము బలిమిని, మును విజితం బైన స్వర్గ♦మును గైకొనఁగాఁ
జని డాఁపక ప్రాణంబులఁ, జనునే యిటువంటి శౌర్య♦శాలికి వగవన్. ౬౭౨

విజితంబు = జయింపఁబడినది. స్వర్గము = నాకము- స్వర్గమునకు వైకుంఠమనియు నర్థముగలదు.

తా త్ప ర్య ము .

తన ధర్మగుణముచేతనే స్వర్గమును జయించెను. దోషమును దండానుభవముచేఁ జంపుకొనెను. అట్టి స్వార్జితస్వర్గము ననుభవింపఁబోయెను. అటువంటి వీరునకై దుఃఖింపవగునా?

క. ఈ పౌరుషైకధనియుం, బ్రాపించె ననుత్తమంపుఁ ♦ బద మిఁక నే-
తాపంబునఁ బడ మీరలు, వే పూనుఁడు కాలయోగ్య ♦ విధికృత్యములన్. ౬౪౩

పౌరుషైకధనియు = కేవల పౌరుషమే ధనముగాఁగలవాఁడు- అనుత్తమంపు= అంతకంటె నుత్తమమైనది లేనిది- మోక్షము - కాలయోగ్య = ఈ సమయమునకుఁ దగిన విధికృత్యములన్ = శాస్త్రమునందుఁ జెప్పఁబడిన కార్యములను.

తా త్ప ర్య ము .

పౌరుషమే ధనముగాఁ గల యీతఁడు ఉత్తమోత్తమమైన పదమునుబొందెను. దీనికై యేల మీరు తపించెదరు? ఏడిచినది చాలును. ఇఁక జరగవలసిన శాస్త్రీయ కార్యములకు దహనాదులకు యత్నింపుఁడు.

—♦ లక్ష్మణుఁడు సుగ్రీవునితో వాలిని సంస్కరింపఁ బ్రయత్నింపఁ జెప్పుట. ♦—

క. రామవిభుఁ డిట్లు లాడఁగ, సౌమిత్రియు దుఃఖభార ♦ జలధినిమగ్నుం
డౌ మిహిరతనయుఁగని హిత, సామోక్తుల నిట్టు లనియె ♦ సమయార్హముగన్.

దుఃఖభార = దుఃఖాతిశయ మనెడి- జలధి = సముద్రమందు- నిమగ్నుఁడు = మునిఁగినవాఁడు, మిహిరతనయున్=సూర్యపుత్రుని· సుగ్రీవుని, హితసామోక్తులన్ = హితములైన మంచిమాటలచే-

తా త్ప ర్య ము .

రామచంద్రవిభుఁ డిట్లు చెప్పఁగా లక్ష్మణుఁడును దుఃఖసముద్రమునందు మునిఁగిన సుగ్రీవునితో సమయమునకుఁ దగిన హితములైన మంచిమాటల నిట్లనెను.

సీ. లే లెమ్ము సుగ్రీవ ♦ వాలికి నిఁకఁ బ్రేత, కార్యంబుఁ దీర్పఁగఁ ♦ గడఁగరాదె
తారాంగదులఁ గూడి♦దహనకార్యముఁ దీర్పు, మెందుఁగందపుఁ జెక్క♦లిందుఁ దేర
నాజ్ఞ సేయుము చూచు♦నంగదుం డెట్టులు, దీనుఁ డై యున్నాఁడో♦ తేర్పు మతని
వస్త్రమాల్యంబులు ♦ వలసిన ఘృతతైల,గంధముల్ దేర నం♦గదునిఁ బంపు
తే. నగర మెల్లను నీ యధీ♦నంబు సుమ్ము, వివశపుమా బాలిశత్వంబు ♦ వీరవర్య!
తారుఁడా! లెమ్ము!శిబికను♦ద్వరితముగను,దర యెమేలందు రిటువంటి♦తరుణమందు.

కడఁగరాదె=ప్రయత్నింపరాదా- బాలిశత్వము=పామరత్వమును- శిబికను= పల్లకిని.

తా త్ప ర్య ము·

సుగ్రీవా! లేలెమ్ము. ఇట్లు కూర్చున్నాఁడ వేల ? ప్రేతకార్యము నెఱవేర్పఁ దారాంగదులతోడఁగూడి ప్రయత్నింపరాదా? వాలికి దహనకార్యము నెఱవేర్చుటకుఁ గావలసిన గంధపుఁజెక్క లిక్కడకే తెప్పింపుము. అంగదుఁ డెట్లు దుఃఖించుచున్నాఁడో వాని సమాధానపఱుపుము. ఇంటిలో నుండు వాలివస్త్రములను మాల్యములను నేయి నూనె గంధపువస్తువులను దెచ్చుటకు నంగదునిఁ బంపుము. పట్టనమంతయు నీ స్వాధీనము. నీవు చేయఁదలఁచినది కాదనువారులేరు. ఈపామరత్వము వద-

లుము. తారుఁడా! నీవుపోయి త్వరగాఁ బల్లకిఁదెమ్ము. ఇట్టి ప్రేతకార్యంబులందుఁ ద్వర పడిన మేలని పెద్దలు చెప్పుదురు.

క. జత కూర్పుము వహనార్హుల, ద్రుతగతిని సమర్థులైన♦తోరపుఁజలులన్
వెత మాను మనుచు వానర,పతితో వచియించి రాము♦పజ్జకుఁ జనియెన్. ౬౭౬

వహనార్హులన్ = పీనుఁగును మోయుటకుఁ దగిన వారిని - ద్రుతగతిని = శీఘ్రముగ.

తాత్పర్యము.

వాలి పీనుఁగును మోయుటకుఁ దగిన బలశాలులను శీఘ్రముగ జతగూర్పుము, దుఃఖము మానుము- అని సుగ్రీవునకుఁ జెప్పి లక్ష్మణుఁడు రామచంద్రమూర్తి ప్రక్కన బోయి నిలుచుండెను.

సీ. అంతఁ దారుఁడు సుమి♦త్రాత్మజు నాజ్ఞ సం,భ్రాంతుఁడై గుహఁజొచ్చి ♦ పటుజవమున
భద్రాసనయుతంబు ♦ పక్షికర్మాంచితం, బగకర్మభూషితం ♦ బమలచిత్ర
పత్తిసమేతంబు ♦ వరజాలవాతాయ,నాన్వితంబును జిత్ర♦హారగతము
విశ్వకర్మకృతంబు ♦ విమలసిద్ధవిమాన, సన్నిభంబును దారు♦శైలసంయు
తే. తంబు కృత్రిమకందరి♦తంబు రక్త, చందనవిలిప్తమును బుష్ప♦బృందపద్మ
హారసంఛన్నమును నుద♦యార్కవర్ణ,మైన శిబికను గొనివచ్చి ♦ యందు నిలిపి.

పటుజవమునన్ = మిగుల శీఘ్రముగ - సంభ్రాంతుఁడై = త్వర గలవాఁడై భద్రాసనయుతంబు = రాజులకుఁ దగిన యెత్తైన యాసనముతోఁ గూడినది. పక్షి కర్మాంచితంబు = పక్షులవలెఁ వ్రాయఁబడిన చిత్రములచే నొప్పినది. అగకర్మభూషి తంబు = చెట్లవలె వ్రాయఁబడినది- చిత్రపత్తి సమేతంబు = విచిత్రమైన రేఖలతోఁ గూడినది, వర, జాల వాతాయనాన్వితంబు = గొప్పవగు సూక్ష్మరంధ్రములచేతను ఆవు కన్నులవంటి కిటికీలచేతను గూడినది. చిత్రహారగతము = వింతలగు హార ములతోఁ గూడినది. విశ్వకర్మకృతంబు = విశ్వకర్మ యనెడి దేవతల వడ్రింగిచేఁ జేయఁబడినది. విమల సిద్ధవిమాన సన్నిభంబును = నిర్మలమైన సిద్ధుల విమానముతో సరియైనది. దారు శైల సంయుతంబు = కొయ్యలతోఁ బర్వతమువలెఁ జేయఁబడిన దానితోఁ గూడినది- కృత్రిమ కందరితంబు = పనివాండ్రచే గుహలవలెఁ జేయఁ బడిన వానిని గలది- రక్తచందన విలిప్తమును = ఎఱ్ఱని గంధముచేఁ బూయఁబడినది- పుష్పబృంద = పూలసమూహముచేతను- పుష్పహార = పూలదండలచేతను- సం ఛన్నము = కప్పఁబడినది. ఉదయార్క వర్ణము = ఉదయించు సూర్యుని వన్నె గలది.

తాత్పర్యము.

ఇట్లు లక్ష్మణుఁ డాజ్ఞచేయఁగాఁ దారుఁడు శీఘ్రముగఁ గిష్కింధాగుహ జొచ్చి రాజయోగ్యమై పక్షులవలెఁ జెట్లవలె వ్రాయఁబడిన యాకారములు గలిగి

సన్నరంధ్రములు గవాక్షములతోఁ జిత్రహారములతోఁ గూడి విశ్వకర్మచేఁ జేయబడినదై సిద్ధుల విమానమువంటిదై గుహలతోఁ గూడి యుండినట్లు కొయ్యలతో నిర్మింపఁ బడిన పర్వతముగలదై యెఱ్ఱగంధము పూసి పూలదండలు వ్రేలవేసి బాలసూర్యుని వర్ణముగల పల్లకని గొనివచ్చి నిలుపఁగా.

తే. దానిఁ గనుఁగొని రాముండు ♦ తమ్ముతోడ,నిట్టు లను వేగ వాలిని ♦ నిందు నుంపఁ
బనుపు మీ ప్రేతకార్యంబు ♦ పరఁగ వేగ, మాచరింపుము యనదాని ♦ నాలకించి.

తా త్ప ర్య ము .

దానిఁ జూచి రామచంద్రమూర్తి లక్ష్మణునితో దీనియందు వాలిని నుంప నాజ్ఞాపింపుము. శీఘ్రముగాఁ బ్రేతకార్యము చేయింపుము, అని చెప్పఁగా విని.

క. వాలినదుఃఖంబున నిల, వ్రాలుచు నంగదుఁడు దివస♦రాజసుతుండున్
వాలిని శిబికను జేర్చి సు,మాలిని వస్త్రముల నగల ♦ నర్పించి వెసన్. ౬౪

వాలిన = అతిశయించిన- సుమాలిని = పుష్పముల సమూహమును.

తా త్ప ర్య ము .

అంగదుఁడు సుగ్రీవుఁడు దుఃఖాతిశయముచే నేలఁబడుచు లేచుచుఁ బోయి వాలిని శిబికలోనికిఁ బట్టి పూలు వస్త్రములు సొమ్ములు వీనిచేఁ బ్రేత మలంకరించి,

ఉ. ఇందు సమస్తదానములు ♦ నిద్ధమణీవసనాదు లాదిగాఁ
బొందు వనేచరుల్ శిబిక♦పూర్వ మతుల్యసమృద్ధభూమిభృ
ద్దండము లౌర్ధ్వదైహిక ము♦దారత నల్పెడిరీతి లోటు లే
కుండ నొనర్పుఁ డంచుఁ బ్లవ♦గోత్తముఁ డానతి యిచ్చె నంతటన్. ౬౫

ఇద్ధ = పరిశుద్ధమైన, మణీవసనాదులు= రత్నములు, వస్త్రములు లోనైనవి, మణీ యని దీర్ఘాంతమును గలదు. వనేచరుల్ = క్రోతులార! మధ్యమ పురుషమం దారగాగమంబు లోపంబు, శిబికపూర్వము = పల్లకికిముందు, అతుల్య = అసమాన మైన, సమృద్ధ = సంపదచే నతిశయించిన, భూమిభృద్దండము = రాజసమూహము, ఔర్ధ్వదైహికము= చచ్చిన వారికిఁ బరలోక సుఖమునకై చేయు కార్యములు, ఉదారత= గొప్పగా, లోభితనములేక, లోటు = లోపము, ప్లవగోత్తముఁడు = సుగ్రీవుఁడు.

తా త్ప ర్య ము .

అప్పుడు సుగ్రీవుఁడు మేలయిన రత్నములు వస్త్రములు మొదలైనవి వానరులారా! దానమిండు. కొందఱు పల్లకికి ముందు పొండు. అసమానసంపదగల మహారాజుల కెట్లు ప్రేతకార్యములు దీర్చెదరో యట్టు లే లోపములేకుండఁ బ్రేతకార్యము లన్నియుఁ దీర్పుఁడని యాజ్ఞాపించెను.

క. తారుఁడు లోనగువారు కు,మారకు నంగదునిఁ జుట్టి♦మహితాక్రోశో
దారరవంబుల నేగి ర,పారవ్యథ వాలి శిబిక♦పజ్జను గుములై. ౬౬

మహితాక్రోశోదారరవంబుల = మిగుల దుఃఖముతోఁ గూడిన పెద్దధ్వనులచే,

తాత్పర్యము.

తారుఁడు మొదలగువారంగదునితోడ బిగ్గ యేడ్చుచుఁ బల్లకి ప్రక్కన గుంపులుగాఁ బోయిరి.

క. తారాసతి మొదలుగఁ గల, నారులు వీరా! యటన్న ♦ నాదంబులతో
సారెకు నాక్రోశించుచు, స్వారాట్సుతు శిబికపజ్జఁ ♦ జనిరి మహార్తిన్. ౬౫౨

తాత్పర్యము.

తార మొదలగు స్త్రీలు వీరా! వీరా! యని యేడ్పు ధ్వనులతో దుఃఖించుచు వాలి పల్లకి మఱియొక ప్రక్కఁబోయిరి.

తే. వానరీనాదములచేత ♦ వనులు గిరులు
మాఱుమ్రోయుచు నవి యేడ్పు ♦ మాడ్కి నుండె
నిర్జనం బగు నొకయేటి ♦ నీటియొడ్డు
నందుఁ జితిఁ జేర్చి రిసుక వ ♦ నాటు లప్పుడు. ౬౫౩

తాత్పర్యము.

ఆఁడుకోతుల ధ్వనులచే నడవులు కొండలు మాఱు మ్రోయుచు నవికూడ నేడ్చుచున్నవా యన్నట్లుండెను. వానరు లిట్లు పల్లకిని మోసికొనిపోయి మనుష్యులులేని యొక యేటి నీటియొడ్డున నిసుక ప్రదేశమందుఁ జితిఁ జేర్చిరి.

ఇప్పుడు వాలి దహనమైన స్థల మని చూపుచోట నదిలేదు. ఇసుకభూమియు గాదు. కాలిన యెముకలవంటి మట్టి యిప్పటికి దొరకుచున్నది.

తే. వాహకులు డించి యచ్చట ♦ వాలిశవముఁ, జరగి రేకాంతమున కార్తి ♦ భరితులగుచుఁ
దార శిబికాశయితుఁ గపి ♦ వీరుఁ జూసి, యంకమునఁ బతిశిర ముంచి ♦ యడలె నిట్లు.

వాహకులు = పీనుఁగును మోసినవారు- అంకమునన్ = తొడయందు.

తాత్పర్యము.

వాహకులు వాలి శవమును జితి పేర్చినచోట దించి యేడ్చుచు నొంటరిపాటున కేగిరి. అప్పుడు తార శిబికయందున్న వాలి శిరస్సును తన తొడమీఁద నుంచి యిట్లేడ్చెను.

—♦ శిబికయందున్న వాలిఁ జూచి తార యేడ్చుట ♦—

సీ. హా వానరేంద్ర! మ ♦ హారాజ! హృదయేశ! హా మహాశూర! మ ♦ హార్హ దేవ!
నన్ను మన్నించు నా ♦ మన్నన యే మాయెఁ, గన్నెత్తి నన్నేల ♦ కాన విపుడు
ఇందఱు నీకయి ♦ వందురుచున్నారు, చూడవే వారల ♦ సుందరాంగ!
విగతాసు వయ్యును ♦ వీర! నీ నెమ్మోము, కళకళ లాడుచుఁ ♦ గాంతి దేరెఁ
ఆ. గ్రుంకుచున్న సూర్యు ♦ కోమరారుకాంతిని, బ్రదికి యున్న వాని ♦ పగిది గాఁగ
నొప్పుచున్న దయ్యొ ♦ యెప్పుడు చూతునో, కపికులేంద్ర! నిన్నుఁ ♦ గఱవు దీఱ.

వందురుచున్నారు = దుఃఖించుచున్నారు- విగతాసువు = ప్రాణము పోయినవాఁడవు.

తాత్పర్యము.

హా వానరేంద్రా! హా మహారాజా! హా హృదయేశ్వరా !హా మహాశూర!హా యోగ్యపురుషా! దేవా! నీవు నన్నెంతో గౌరవించుచుంటివే- అది యంతయు నిపుడే మాయెను. కన్నెత్తియైన నన్నేల చూడవు. ఇందఱు నీకయి దుఃఖించుచున్నారే? వారినైనఁ జూడరాదా? ప్రాణముపోయినను నీముఖము బ్రదికియున్నపు డున్నట్లే కళలు దేఱుచున్నదే- నా కన్నుల కఱవు దీఱ మరల నెప్పుడు నిన్నుఁజూడఁ గలను.

క. ఆరణ్యతలమునం దొక, నారాచముచేత నీదు♦నారులకును ము
త్తోరాణఁ దొలఁచి కాలుం,డే రామాకృతిని గొంచు ♦ నేగెడు నిన్నున్. ౬౫౬.

ముత్తో+రాణ = ముత్తైదువుల యందము.

తాత్పర్యము

అడవి ప్రదేశమం దొక్క బాణముచేతనే నీ రాణుల యందఱ ముత్తైదువు పోణిమిని హరించి యముఁడే రామునివలె వచ్చి నిన్నుఁ దీసికొనిపోయెను.

క. నీకు సదా వల్లభలై, నీ కూర్మికిఁ బాత్రలైన♦నీ ప్రియురాండ్రి
య్యో! కాలినడన దవ్వుగ, నీకడ కరుదెంచు టెఱుఁగ♦నేర వదేలా. ౬౫౭

వల్లభలై = ఇష్టమైనవారై.

తాత్పర్యము.

నీకెంతో యిష్టురాండ్రగు నున్న నీ భార్యలు ప్రియురాండ్రగు దూరముగఁ గాలినడకతో నీ యొద్దకు వచ్చిరే! అదియైన నీవు తెలిసికొ లేకున్నావు గదా.

సీ. ఈ రాజముఖులెల్ల ♦ నీ రమణులె కదా, పలుకరింప వదేల ♦ వానరేంద్ర!
నీ తమ్ముఁ డదె యేల ♦ నెన రూరఁ బలుకవు, పోలునే నీకిది ♦ పురుషవర్య!
వీరె మహారాజ! ♦ తారుఁడు లోనగు, సచివులు మంత్రింబు ♦ సలుపరాదె
పురజనుల్ వీరె నిన్ ♦బోరిఁ జుట్టియున్నారు, సెలవిమ్ము తగురీతి♦లలితరూప!

తే. వీర లందఱు పోయిన ♦ వేడ్కమీఱ, మనము చెలరేఁగి యుత్కట♦మదనవృత్తి
రమ్యవనసీమలను విహా♦రంబు సలుపు, చుంద మోనాథ! నేల నీ♦వూరకుండ.

రాజముఖులు = చంద్రునివంటి ముఖముగల స్త్రీలు, ఉత్కట = అతిశయించిన, మదనవృత్తి = కామవ్యాపారముచే.

తాత్పర్యము .

ఈ చంద్రవదన లందఱు నీకుఁ బ్రియురాండ్రే కదా. వారి నేల పలుకరింపవు! అదిగో నీతమ్ముఁడు. ఏల ప్రేమతోఁ బలుకరింపవు? ఇది నీకుఁ దగునా? మహారాజా! వీరె తారుఁడు లోనగు మంత్రులు. వారితో నేల మంత్రాలోచనముచేసి వారికిఁ జెప్పవలసినవి చెప్పి పంపరాదు. ఇదిగో వీరందఱు పూరజనులు నిన్నుఁజుట్టుకొని యున్నారు.

వారివారికిఁ దగినట్లు వారి కనుజ్ఞయిమ్ము. వీరందఱు వెడలిపోయిరేని మనము సంతోషముతోఁగామము దీఱ మనోహరములైన యీ వనప్రదేశములందుఁ దిరుగుచుందము. ఏల నాథా! నీ వూరకున్నావు.

—♦ అంగదుఁడు వాలిని సంస్కరించుట ♦—

క. అనుచు విలపించు తారను, వనజాక్షులు పట్టి ♦ లేప వనరుచు సుగ్రీ
వునితోడ నంగదుండును, దన జనకుని జితను జేర్చి ♦ తగ నగురీతిన్. ౬౫౯

వనజాక్షులు = స్త్రీలు- వనరుచున్ = దుఃఖించుచు-

తాత్పర్యము.

అని యేడుచుచున్న తారను స్త్రీలు పట్టి లేవనెత్తఁగా సుగ్రీవుఁడు సాహాయ్యపడఁగా నంగదుఁడు తన తండ్రి చితిని దగినట్లు జేర్చి.

క. చిరముగఁ బ్రవాసి యగుచును, బరలోకం బేగు కీశ ♦ పరివృఢున కిడెన్
గరుణముగ నేడ్చు చగ్నిని, హరిసుతుఁడు ప్రదక్షిణించె ♦ నపసవ్యముగన్. ౬౬౦

ప్రవాసి = ఇతర దేశమున వాసముచేయువాఁడు - కీశపరివృఢునకు = వానర శ్రేష్ఠునకు- అపసవ్యముగ- ఎడమవైపుగ.

తాత్పర్యము.

మరలి రాకుండఁ బరలోకమునకుఁ బోవుచున్న వానరశ్రేష్ఠునకు నంగదుఁ డేడ్చుచు నగ్నిని జితియం దుంచెను. అప్రదక్షిణముగఁ దిరిగెను.

తే. శక్రతనయుని నీ రీతి ♦ సంస్కరించి, విధిహితంబుగ నుదకముల్ ♦ విడుచుకొఱకు
శీతజల మైన శుభనదిఁ ♦ జేరి భాను, పుత్ర తారలు నంగద ♦ పూర్వకముగ. ౬౬౧

తాత్పర్యము.

ఇంద్రుని కొడుకగు వాలి కీ రీతి సంస్కారము నొనర్చి శాస్త్ర పద్ధతి నీళ్లు విడుచుకొఱకుఁ జల్లని నీళ్లుగల నదిని జేరి తారా సుగ్రీవు లంగదునితో- తార నీళ్లు విడుచుట కులాచారము.

క. వాలికి నుదకంబుల నిడి, రీ లీల సమానశోకుఁ ♦ డిక్ష్వాకుజుఁడున్
హేళిజుతోఁ బ్రేతక్రియ, లోలిన్ జరిపించె జిత్త ♦ ముత్తలపడఁగన్. ౬౬౨

తాత్పర్యము.

వాలికి నీళ్లు విడిచిరి. ఈ విధముగ వారితో సమానదుఃఖము గల రామచంద్రమూర్తి మనస్సు సంతాపింప సుగ్రీవునిచేఁ గ్రమముగాఁ బ్రేతక్రియలు జరిపించెను.

క. విగ్రహమునఁ గూలిన తన, యగ్రజునకు దహనకార్య ♦ మంతయుఁ దీరన్
వ్యగ్రమనస్కుండై యా, యుగ్రాంశుసుతుండు రాము ♦ నొద్దకు వచ్చెన్. ౬౬౩

విగ్రహమునన్ = యుద్ధమందు - వ్యగ్రమనస్కుండై = హెచ్చరికతోఁ గూడిన మనస్సుగలవాఁడై - ఉగ్రాంశు సుతుఁడు = సూర్యునికొడుకు- సుగ్రీవుఁడు.

తా త్ప ర్య ము.

యుద్ధమందుఁ జచ్చిన యన్నకు దహనాది కార్యములు జరపించి సుగ్రీవుఁడు హెచ్చరిక గలవాఁడై రాము నొద్దకు వచ్చెను. తక్కిన వా రందఱు స్త్రీలు పౌరులు కిష్కింధకుఁ బోయిరి.

తిర్యగ్జాతిలోఁ బుట్టిన యీ క్రోతులకు శాస్త్రములోఁ జెప్పఁబడిన సంస్కారాదులు యుక్తములు కావని యాక్షేపింపరాదు. ఇవి జాతి మాత్రముచేఁ గ్రోఁతులైనను దేవాంశమునఁ బుట్టినవా రగుటచేతను వేదాధ్యయన ముండుటచేతను క్షత్ర జాతు లగుటచేతను సంస్కారాదులు యుక్తమే॥ గోవింద॥

—•{ ౨౬-వ సర్గము. హనుమంతుఁడు శ్రీరాముని సుగ్రీవునకుఁ బట్టాభిషేకం బొనర్ప వేఁడుట. }•—

క. క్లిన్నాంశుకు బహుదుఃఖవి, పన్నుఁ సుగ్రీవు సచివ•పటలి భజించెన్
బన్నుగ నిందఱు గొల్వఁగఁ, జెన్నారెన్ నృపుఁడు మునుల•చే బ్రహ్మవలెన్. ౬౬౪

క్లిన్నాంశుకున్ = అప్పుడే స్నానముచేయుటచేఁ దడిసిన వస్త్రముగలవానిని- బహుదుఃఖవిపన్నున్ = దుఃఖాతిశయముచే బాధపడువానిని- సచివపటలి = మంత్రి సమూహము.

తా త్ప ర్య ము.

అప్పుడే స్నానముచేసినవాఁ డగుటచేఁ దడివస్త్రములతో నుండి సుగ్రీవుని దుఃఖభారముచే బాధపడువానిని మంత్రులందఱు సేవించిరి. ఇందఱు రామచంద్ర మూర్తిని సేవింపఁగా నాయన మునులచే సేవింపఁబడు బ్రహ్మవలె వెలింగెను.

ఉ. అంతటఁ గాంచనాద్రినిభుఁ • డంచిత బాలవికర్తనాననుం
డెంతయు భక్తిఁ కేల్మొగిచి • యిట్లను మారుతి రామచంద్రుతోఁ
జింతలు దీఱె యీ ప్లవగ•శేఖరుఁ డెట్లును జెందరాని భూ
కాంతత నొందె నీ కరుణ•కల్మిని రాఘవవంశవర్ధనా! ౬౬౫

కాంచనాద్రినిభుఁడు = బంగారుకొండతో సముఁడు, అంచిత=ప్రకాశించు, బాలవికర్తన = లేఁతసూర్యునివంటి, ఆననుఁడు = ముఖము కలవాఁడు, మారుతి = వాయు దేవుని కుమారుఁడు, ఆంజనేయుఁడు.

తా త్ప ర్య ము.

ఇట్లందఱుఁ గూర్చుండిన పిమ్మట బంగారుకొండవంటి రమణీయమైన యాకారము గలవాఁడును బాలసూర్యునివంటి ముఖముగలవాఁడును నగు హనుమంతుఁడు రామచంద్రమూర్తితో నిట్లనియె. రఘుకులదీపకా! నీ దయచేత నీ వానరశ్రేష్ఠుఁడు సుగ్రీవుఁడు దుఃఖముల వదలి తన కేవిధముగనైన సాధ్యముగాని ప్రభుత్వమును సంపాదించిన వాఁడయ్యెను.

కం. నీ వనుమతించినను సుగ్రీవుఁడు కిష్కింధఁ జేరి ♦ కీశావళితోఁ
గావించును గార్యంబులు, దేవా! సుస్నాతుఁ డగుచు ♦ దివ్యౌషధులన్. ౬౬౬

తా త్ప ర్య ము.

దేవా! నీవు సమ్మతించితివేని సుగ్రీవుఁడు కిష్కింధఁ జేరి పవిత్రస్నానము దివ్యౌషధులతోఁ జేసి వానరులతోడఁ దక్కిన పట్టాభిషేకకార్యంబులు జరుపును.

ఉ. హారిమణీపరీమళసు♦మాదుల మీ రట కేగుదెంచినన్
సారపు భక్తిఁ బూజలను ♦ సల్పు, నదే గుహ, రండు పోద మం
దీరు కృతాభిషేకునిఁగ ♦ నీతనిఁ జేసి కపీంద్రకోటికిన్
గూరుపుఁడీ ముదం బనినఁ ♦ గోవిదవర్యుఁడు పల్కెఁ బావనిన్. ౬౬౭

హారి = మనోహరమైన- మణీ = రత్నములచేతను- పరీమళసుమాదులన్ = మంచిసువాసనగల పూలచేతను- ఈరు = మీరు- కృతాభిషేకునిఁగన్ = అభిషేకము చేసికొనఁబడినవానిఁగ- కోవిదవర్యుఁడు=పండితశ్రేష్ఠుఁడు- పావనిన్ = ఆంజనేయుని- పవనుని పుత్త్రుఁడు పావని, అపత్యార్థకతద్ధితము.

తా త్ప ర్య ము.

మీరు కిష్కింధకు వచ్చెదరేని మిమ్ము సుగ్రీవుఁడు విలువగల రత్నములతోను సుగంధముగల పూలతోను భక్తిచేఁ బూజించును- అదే గుహ- దూరము గాదు- పోదము రండు- ఆయనకు మీరు పట్టాభిషేకముఁజేసి యీ వానరసమూహముల కన్నిటికి సంతోషము గలిగింపుఁ డనినఁ బండితుఁడైన రామచంద్రమూర్తి యాంజనేయునితో నిట్లనియె. పండితశ్రేష్ఠుఁ డనఁగా నే కార్యము చేయవచ్చును, ఏ కార్యము చేయరా దను జ్ఞానము కలవాఁ డని యర్థము.

—♦ శ్రీరాముఁడు సుగ్రీవుని పట్టాభిషేకంబున కనుమతి యిచ్చుట. ♦—

చం. జనకునియాజ్ఞఁ జేసి చొరఁ ♦ జాలను బట్నము నేని పల్లెనేన్
హనుమ! చతుర్దశాబ్దములు ♦ హాయిగ నర్కజుఁ డూరు చేరి చ
య్యన నభిషేకముం గొని య♦థాగమపద్ధతిఁ గీశరాజ్యముం
బూనరుచుఁ గాత మంచు రఘు♦పుంగవుఁ డర్కజుతోడ నిట్లనున్. ౬౬౮

చతుర్దశాబ్దములు = పదునాలుగు సంవత్సరములు- యథాగమ పద్ధతిన్ = శాస్త్రపద్ధతి తప్పకుండునట్లు.

తా త్ప ర్య ము.

ఆంజనేయా! తండ్రియాజ్ఞచేతఁ బదునాలుగు సంవత్సరములు ముగియువఱకు నేను పట్నముగాని పల్లెగాని ప్రవేశింపరాదు. కావున నేను గిష్కింధలోనికి రారాదు. సుగ్రీవుఁ డూరు చేరి సుఖముగఁ బట్టాభిషిక్తుఁడై శాస్త్రవిధి తప్పకుండ వానర రాజ్యము పాలించును గాక అని సుగ్రీవునితో నిట్లనియె,

క౦. ఈ యంగదు యువరాజుఁగఁ, జేయుము నీతో సముండు ♦ చేవను మఱియుక్
మీ యన్న పెద్దకొడు కితఁ, డే యనువున యౌవరాజ్య ♦ మీతనికిఁ దగుక్. ౬౯

చేవను = బలమున- అనువున=రీతిగ.

తా త్ప ర్య ము.

ఈ యంగదుని యువరాజుగఁ బట్టాభిషేకము చేయుము- బలమున నీతో సమానుఁడు. అంతియగాక మీ యన్న పెద్దకొడుకు- ఏ విధముగఁ జూచినను బలము చేతను బంధుత్వముచేతను నితనికి యౌవరాజ్యము దగియున్నది.

మీ యన్న పెద్దకొడుకు అనఁగా వాలి కిరువురు పుత్రు లున్నట్లు వారిలో నంగదుఁడు పెద్దవాఁ డని యర్థముకాదు. వాలికిఁ గొడు కొక్కఁడే. ఒక్కఁడే నాకుఁ బుత్రుఁ డని వాలియె చెప్పెనుగదా. కావునఁ బెద్దకొడు కనఁగా యౌవరాజ్యమునకు నీడు వచ్చిన పెద్దవాఁడని యర్థము.

ఓయీ! రామచంద్రుఁడు సుగ్రీవునకుఁ గపిరాజ్య మిచ్చి యంగదునకు యౌవ రాజ్యమిచ్చుట ధర్మముగాదు. మహారాజు మరణానంతరము వానికొడుకు రాజ్యమునకు రావలెనుగాని యితరులు రారాదు, అయోధ్యాకాండమునం దుండునది యంతయు నీ విషయమేకదా! దీనికేకదా భారతయుద్ధము. ధర్మము, ఆచార మిట్లుండ రామచంద్ర మూర్తి యేల దీని ననుష్ఠింపఁడయ్యెను? మహారాజు తన వెనుకఁ దనస్థానమునకు రాఁద గినవానినే యువరాజుఁ జేయుట సాంప్రదాయము. ఆ కారణముననే తనకొడుకున్నను ధర్మరాజును దొలుత ధృతరాష్ట్రుఁడు యువరాజుఁ జేసెను. సుగ్రీవుఁడు దొలుతఁ దండ్రి యాజ్ఞప్రకారము యువరాజయ్యెను. వాలియు దాని నంగీకరించెను. కావున యువ రాజగు సుగ్రీవుఁడే న్యాయ్యముగ రాజు గావలయును. అదట్లుండఁగాక

రథాశ్వం హస్తినం ఛత్రం ధనం ధాన్యం పశూన్ స్త్రియః
సర్వద్రవ్యాణి కుప్యంచ యో యజ్జయతి తస్య తత్ ॥

మను- ౭-౯౬.

రథములు - అశ్వములు- ఏనుఁగులు- గొడుగులు- ధనము - ధాన్యము- పశు వులు- స్త్రీలు- సర్వద్రవ్యములు- తామ్రాదు లన్నియు యుద్ధమునం దెవఁడు జయిం చునో వానివే.

రాజ్ఞశ్చ దద్యు రుద్ధార మిత్యేషా వైదికీ శ్రుతిః.

అంతియగాక యతఁడు జయించిన ధనమునే గాక యంత కుత్కృష్టధనమైన బంగారు వెండి లోనైనవి యియ్యవలయును.

ఇట్లుండుటచే సుగ్రీవుఁడు రాజ్యమును యుద్ధమునందు గెలుచుకొనెను. వాలియు వానరరాజ్యము నీవై గైకొమ్మని సుగ్రీవునితోఁ జెప్పెను. కావున సుగ్రీవుఁడు సంపా దించుకొనిన దానినే రామచంద్రమూర్తి యిచ్చెను- ఆ కారణమున నంగదునకు

వాలియందలి ద్వేషముచే నేమియు లేకుండఁ జేయునేమో యని యువరాజును జేయుమనెను- అట్లు చేయకుండినచో సుగ్రీవునితో నంగదుఁడు సమానబలుఁడగుట చేత వాలి పక్షమువా రందఱు నంగదునికి సహాయు లగుదురు. కుటుంబకలహము మరలఁ బ్రారంభమగును. ఇప్పు డది రామచంద్రమూర్తి నివారించెను.

సీ. సలిలాగమంబైన ♦ శ్రావణమాసంబు, తొలుతటియది వాన♦నెలలయందు
వార్షికసంజ్ఞను ♦ వర్తిల్లు మాసచతుష్కంబు వచ్చె ను♦ద్యోగమునకు
నిది వేళ గాదు నీ♦వేగుము పురి కేను, సౌమిత్రితోడ నీ♦శైలగుహను
వసియింతు నిచ్చట ♦ వల నొప్పియున్నది, గాలి రమ్యంబు వి♦శాల మిదియుఁ
తే. కుముదసారసయుతములు♦కొలఁకులెల్లఁ, గార్తికము వచ్చునెడ దశ♦కంఠవధకు
యత్నమును జేయు మీవు నీ♦వరిగి పురికి, రాజవగుము సుహృత్తతి ♦ రంజిలంగ.

సలిలాగమంబు = నీళ్లకాలము- వార్షిక సంజ్ఞను = వర్షసంబంధము అను పేరుచే- మాసచతుష్కము- నాలుగునెలలు- ఉద్యోగమునకు = సీతాన్వేషణ కార్యమునకు- కుముద సారసయుతములు = కలువలు కమలములు వీనితోఁగూడినవి. సుహృత్తతి = స్నేహితుల సమూహము.

తాత్పర్యము.

నన్నుఁ గిష్కింధకుఁబోయి పట్టాభిషేకము చేసికొను మనుచున్నావే! నీకార్యము గుఱించి యేమి యాలోచించితి వందువా- దానికి సమయము గాదు. వానకాలమందు మొదటిది శ్రావణమాసము. అది మొదలు నాలుగు నెలలు వర్షకాల మందురు. ఈ నాలుగునెలలు దండయాత్రకుఁ బనికిరావు. కావున నీ వూరికిఁ బొమ్ము. నేను లక్ష్మణుఁడీ గుహాయం దుండుము. అందు గాలి రమ్యముగా నున్నది. విశాలముగా నున్నది. కొలఁకులందుఁగలువలు కమలము లున్నవి. కార్తికము వచ్చునప్పుడు రావణు వధకుఁ గావలసినప్రయత్నము కపిసేనల ప్రోగుచేయుట యను కార్యము చేయుము. నీ విపు డూరికిబోయి నీస్నేహితులు సంతోషించునట్లు రాజవై సుఖంపుము- కాల విచారమున వ్యాఖ్యాతలయం దభిప్రాయభేదము గలదు. ఈ చెప్పిన నాలుగు నెల లేవి?

శ్రావణము భాద్రపదము ఆశ్వయుజము కార్తికము అని కొందఱ యభిప్రాయము. అట్లైనచోఁ గార్తికము పూర్తిగా ముగియకముందే యేల రామచంద్రమూర్తి తొందరపడి లక్ష్మణుఁ బంపెనని సందేహము కలుగుచున్నది.

కొందఱు ఛాందసులు 'పక్షా వై మాసా' యను శ్రుతి ననుసరించి మాస మనఁగాఁ బక్షము కావున నాలుగు మాసము లనఁగా నాలుగు పక్షము లనియు నవి శ్రావణ భాద్రపద మాసము లనియు, వీనినేకదా వర్షర్తు వనుచున్నారు. అట్లైనచో నాశ్వయుజ మాసమందే రామచంద్రమూర్తి తొందరపడి యుండును. కార్తిక మధ్యము వఱకు నూరకుండునా యని యాక్షేపము.

ఈ కాలవిచారము పూర్ణముగ యుద్ధకాండమున ౨౮౧౯ వ పద్య వ్యాఖ్య యందుఁ జేయఁబడును. ఇక్కడ నింతమాత్రము చెప్పఁబడును. వాలి వధ యాషాఢ మాసమున నని వ్యాఖ్యాత లంగీకరించియున్నారు. సీతాహరణము చైత్రమాసము నందని గోవింద రాజీయమునఁ గలదు గాని యది సరిగాఁ దోఁపదు. ఫాల్గుణ మాసంబున లంకాదహన మని సీతాంజనేయ సంభాషణమని వారే వ్రాసియున్నారు. తీర్థీయమం దిట్లేయున్నది. ఇది సత్యము. ఇది నిశ్చయమైనచో సీతాదేవి హనుమంతు నితో (సుందర. ౮౮ ౫) ఇప్పుడు పదియవమాసము నడచుచున్నది, యని చెప్పుటచే ఫాల్గునమునకు ముందు పదియవ నెల జ్యేష్ఠమగుచున్నది. కాని చైత్రము కాఁజాలదు. ఇఁక రెండు మాసములు రావణుఁ డిచ్చిన గడువున్నదనుటచేఁ జైత్రము వైశాఖము గడువవలసియున్నది. అప్పటికి గడువు సంవత్సరము పూర్తియగును. కావున సీతా హరణము జ్యేష్ఠమాసమం దనియే చెప్పవలసియున్నది. జ్యేష్ఠమున సీతను వెదకి యాషాఢమందు సుగ్రీవునితోఁ జెలిమిచేసి రామచంద్రమూర్తి వాలిని వధించెను. ఇది యంతయు నాషాఢమున జరగిన చర్యయే. నాలుగు నెలల లెక్క ఆషాఢ శుద్ధపూర్ణిమ మొదలు వర్షాకాల గణనదినము. ఈ పున్నమ మొదలు కార్తిక పూర్ణిమ వఱకే కదా సన్న్యాసులును జాతుర్మాస్యము నాచరింతురు. కావున రామచంద్రమూర్తి చెప్పిన నాలుగు నెలలు ఆషాఢ పూర్ణిమ మొదలు కార్తిక పూర్ణిమ వఱ కని చెప్పి నచో నిర్బాధము. లేదా శ్రావణాది మాసములు నాలు గనినను దోషములేదు. 'మార్గశీర్షే శుభే మాసి యాయా ద్యాత్రాం మహీపతిః'॥ ౭-౧౮౨ యనిమనుస్మృతి యందుండుటచే మార్గశిరమున దండయాత్ర బయలుదేఱవలసియున్న యెడలఁ గార్తిక మందేకదా సేనలగుంపు చేర్పవలెను. ఆ విషయమున సుగ్రీవుఁడే ప్రయత్నము చేసి నట్లు ఒక క్రొత్తకోఁతియైన రానట్టు కానవచ్చుటచే రామచంద్రమూర్తి లక్ష్మణుఁ బంపెను.

శ్రావణమాసము తొలుతటిది యన్నప్పుడు శ్రావణమాసము రాఁబోవు చున్నది. ఇప్పుడేమి ప్రయత్నముచేసినను నాలుగు నెల లూరక యుండవలసివచ్చును. కావున నిష్కారణ బాధ పరులకేల? అది గడచినపిమ్మటనే ప్రయత్నింపుమని చెప్ప వచ్చును. కార్తికమాసము పుట్టినను సుగ్రీవుఁ డే ప్రయత్నము చేయకయుండుటచే రామచంద్రమూర్తి లక్ష్మణుఁ బంపవలసివచ్చెను. మార్గశిరము నంతమున సీతా న్వేషణమునకై వానరులు పిలిపింపఁబడినట్లు (౧ ౨౩౮ కిష్కిం) అంగదు వాక్యము వలన స్పష్టము. వార్షికమాసములు నాలుగనియే మనుస్మృతి (౯-౧౦౮) చెప్పు చున్నది. "వార్షికాం శ్చతురోమాసాన్ యథేంద్రోఽభివర్షతి - శ్రావణాదీం శ్చతురోమాసాన్" అని కుల్లూకభట్టువ్యాఖ్య.

ఆషాఢమాసమున వాలివధయంటివే, యింతకు వారము పదిదినములకు ముందుగనేకదా పంపాతీరమున రామచంద్రమూర్తి వసంతము వర్ణించెను. చైత్ర

వైశాఖమాసములుగదా వసంతఋతువు, అందులేని యదికాదు. వార్షికమాసము నాలుగు నెలలనినట్లు వసంతకాలము నాలుగు నెలలని గ్రహింపవలెను. అట్లులే హేమంతఋతువు నాలుగు నెలలుగాఁ గవులు వర్ణించియున్నారు. గ్రీష్మర్తువు వసంతములో నంతర్గర్భితము. శరత్తు వర్షర్తువులో శిశిరము హేమంతములో నంత ర్గర్భితములు. కావున ఫాల్గున బహుళప్రతిపత్తిథి మొదలు నాలుగు నెలలు వసంత ర్తువుగానే గ్రహింపనగు.

— సుగ్రీవ పట్టాభిషేకము —

సీ. మన సమయంబిది ♦ యన ననుజ్ఞాతుఁడై, కిష్కింధ కేగి సు♦గ్రీవుఁ డపుడు
వానరకో ట్లభి♦వాదనం బొనరించి, బలసి వె న్నంటఁగఁ ♦ బౌరు లెల్ల
సాఁగిలఁబడి నమ♦స్కారంబు లొనరింప, వారి లేవఁగ నెత్తి ♦ హరివచన
పద్ధతి దేర్చి స్వ♦భ్రాతృనంతఃపురం, బును జొచ్చి తారకుఁ ♦ బొక్కు మాన్చి
తే. వెలికిఁ జను దేర వానర♦వీరు లెల్ల, నాదితేయబలంబు బ♦లారిఁ బోలె
హరి నభిషేక మొనరింప ♦ హేళిసుతుఁడు, దివ్యతేజోయుతుం ♦ డయి తేజరిల్లె.

సమయము = సంకేతము- అనుజ్ఞాతుఁడై = ఆజ్ఞపొందినవాఁడై- బలసి = చుట్టుకొని- పొక్కు = దుఃఖము- ఆదితేయబలము = దేవసేన- బలారికి = ఇంద్రుని- హేళిసుతుఁడు = సూర్యపుత్రుఁడు.

తా త్ప ర్య ము.

ఇది మనసంకేతము, పోయి రమ్మనఁగా సుగ్రీవుఁడు రామచంద్రమూర్తిచే నాజ్ఞపడసి కిష్కింధకుఁబోయి వానరులగుంపులు పౌరులు సాష్టాంగ నమస్కారము చేసి తన వెంటరాఁగా వారిని లేవనెత్తి యింపైన మాటల సమాధానపఱిచి తన యన్న యంతఃపురంబున కేగి దుఃఖించుచున్న తారను సమాధానపఱిచి మఱల వెలుపలికి రాఁగా నింద్రుని దేవతలవలె వానరు లభిషేకింపఁగా సుగ్రీవుఁడు దివ్యతేజస్సునఁ బ్రకాశించెను.

సీ. తపనీయభూషిత♦ధవళాతపత్రంబు, స్వర్ణదండాంచిత♦చామరములు
సర్వరత్నంబులు ♦ సర్వౌషధంబులు, సక్షీరవృక్షకి♦సాలకుసుమ
తతులు ధాన్యంబులు ♦ సితవస్త్రలేపనం,బులు సుగంధులు స్థల♦జలజములును
నగు సుమసంతతు ♦ లగరుచందనదివ్య, గంధము లక్షతల్ ♦ కాంచనంబు
తే. వ్యాఘ్రచర్మంబు నేయియు♦నడవిపంది,తోలుచెప్పులు గసగసల్ ♦ మేలిపెరుఁగు
తేనె సమకూర్ప మణిసిల♦తోను రోచ,నంబు నుత్తమ మగు లేప♦నంబుఁ గొనుచు.

తపనీయ = బంగారుచే- భూషిత = అలంకరింపఁబడిన; ధవళాతపత్రంబు = తెల్లనిగొడుగు- ఆతప+త్ర = ఎండనుండి రక్షించునది- స్వర్ణదండ = బంగారుదండ ములచే- అంచిత = ప్రకాశించు- చామరములు = వింజామరములు- సక్షీర =

పాలతోఁగూడిన- వృక్ష = చెట్లయొక్క- కిసాల = చిగుళ్ళయొక్కయు- 'కిసాలఃపుం కిసలయం కిసాలం కిసలం కిస'మ్మని ద్వి. కోశము. కుసుమ=పూలయొక్కయు- తతులు= సమూహములు- సితవస్త్ర = తెల్లనిగుడ్డలు- లేపనంబులు = గంధాదులు- స్థల జల జములు = మెట్టనేలలఁ బుట్టినవి. నీళ్ళయందుఁ బుట్టినవి- రోచనము = గోరోచనము- లేపనము = పచ్చకర్పూరము కుంకుమపువ్వు లోనైనవి. మణిసిల = తిలకమున కుప యోగించు కొండలలోఁ బుట్టిన ధాతువు.

తా త్ప ర్య ము.

బంగారుపూలతోఁ జేసిన తెల్ల గొడుగు- బంగారు కాడలుగల చామరములు- నవరత్నములు- అన్ని యోషధులు-పాలు గల చెట్ల చిగుళ్ళు, పూలు-నవధాన్యంబులు తెల్లవస్త్రము, తెల్లగంధము, మంచివాసన గలవగు మెట్టపూలు, నీళ్లలోఁ బుట్టినపూలు అగరు- చందనము- అక్షతలు- కాంచనము- పులితోలు- నేయి- అడవిపందితోలు- చెప్పులు- గసగసలు- మీఁగడ- పెరుఁగు- తేనె సమకూర్పఁగా మణిసిల- గోరోచనము పచ్చకర్పూరము- కుంకుమపువ్వు దీనిని దీసికొని-

సీ. పదునాఱుకన్యలు ♦ పరమహర్షమున రా, భక్ష్యమణీవస్త్ర♦పటలిచేత
ద్విజుల సంతర్పించి ♦ విధివిహితంబుగ, దర్భపరిస్తీర్ణ♦తలమునందు
జాతవేదుని నిల్పి ♦ పూతమంత్రంబుల, హోమంబుఁ గావించి ♦ యుచితభంగి
మంత్రవేదులు చిత్ర♦మాల్యోపశోభిత, ప్రాసాదతలమున ♦ రమ్యభద్ర
తే. పీఠిఁ బ్రాఙ్ముఖముగఁ గపి♦వీరవర్యు, నిలిపి, బహుళనదీనద♦నీరములను
సాగరాంబులఁ గొనివచ్చి ♦ స్వర్ణకుంభ, ములను నిండించి బంగారు ♦ కలశములను.

భక్ష్య- మణీ- వస్త్రపటలిచేత = భక్ష్యములచేతను- రత్నములయు-వస్త్రము లయు- సమూహములచేత- ద్విజులన్ = బ్రాహ్మణుల- దీనివలనఁ గిష్కింధయందు బ్రాహ్మణులు నుండిరని యేర్పడుచున్నది. విధివిహితంబుగన్ = శాస్త్రమున విధింపఁబడినట్లు - దర్భపరిస్తీర్ణ తలమునందు = దర్భలు పఱచిన ప్రదేశమందు, జాతవేదుని = అగ్నిని, ప్రాక్+ముఖముగ = తూర్పుముఖముగఁ బాఱునదులు, నద = పశ్చిమ ముఖముగఁ బాఱునేళ్ళు; నర్మద, తపతిలోనైనవి, సాగరాంబులన్= సముద్రజలములను.

తా త్ప ర్య ము.

పదునార్గురు పెండ్లికాని పడుచులు సంతోషముతో రాఁగా భక్ష్యములచేతను మణులచేతను వస్త్రములచేతను బ్రాహ్మణులఁ దృప్తులఁ గావించి శాస్త్రమునఁ జెప్పఁ బడిన ప్రకారము దర్భలు పఱచిన భూమిమీఁద నగ్నిని నిలిపి పవిత్రమంత్రముల హోమముచేయించి తగినవిధమున మంత్రములు దెలిసినవారు చిత్రమాల్యములచేఁ బ్రకాశించు మేడయందు మనోహరమైన బంగారుపీఁటమీఁదఁ దూర్పుముఖముగ

సుగ్రీవుని నిలిపి యనేక నదులయు నదములయు జలములను సముద్రజలమును దెచ్చి బంగారుకుండలలోఁ బోసి బంగారు పాత్రములను.

తే. వృషభశృంగములను ముంచి ♦ విధిహితముగ
మైందుఁడును ద్వివిదుఁడు గంధ♦మాదనుండు
గజుఁడు గవయ గవాక్షులు ♦ గాడ్పుపట్టి
జాంబవన్నళశరభులు ♦ సమ్మదమున. ౬౭౪

వృషభశృంగంబులను=ఎద్దుకొమ్ములను.

తా త్ప ర్య ము.

ఎద్దుకొమ్ములతో నా నీళ్ళు ముంచి శాస్త్రమునఁ జెప్పినట్లు మైందుఁడు, ద్వివిదుఁడు, గంధమాదనుఁడు, గజుఁడు, గవాక్షుఁడు, గవయుఁడు, హనుమంతుఁడు, జాంబవంతుఁడు, నలుఁడు, శరభుఁడు సంతోషముతో.

క. ఋభునాయకు వసుసంఘం, బభిషేక మొనర్చురీతి ♦ నతిపరిమళస
ద్విభవం బగు నీటను గపి, విభు నభిషేకించి రపుడు ♦ వెలసినర క్తిన్. ౬౭౫

ఋభునాయకుఁ = ఇంద్రుని, వసుసంఘంబు = వసువుల సమూహము.

తా త్ప ర్య ము.

ఇంద్రుని వసువు లభిషేకించినట్లు మిగుల సువాసనగల మంచినీటితోఁ బ్రేమతో నభిషేకించిరి.

కం. పొంగుచు సుగ్రీవుండును, నంగదునిఁ రాముచెప్పి♦నట్టుల యువరా
జుంగా నొనరించినఁ గపి,పుంగవులును మే లటంచుఁ ♦ బొగడిరి తుష్టిన్. ౬౭౬

తా త్ప ర్య ము.

సుగ్రీవుఁడు సంతోషముతోఁ బట్టాభిషిక్తుఁడై యూవల రామచంద్రమూర్తి చెప్పినట్టు లంగదుని యువరాజుగా నభిషేకింపఁ జేయఁగా నందఱు మిగుల సంతోషించిరి, సుగ్రీవుని బొగడిరి.

క. రాముని లక్ష్మణు మెచ్చిరి, ధామములఁ బతాకతతుల ♦ ధ్వజతతులఁ శా
ఖామృగము లెత్తఁ దేజ,స్తోమంబున నగర మెల్ల ♦ శోభిల్లెఁ గడున్. ౬౭౭

ధామములఁ = ఇండ్లయందు, పతాకతతులఁ = చిన్నవి, చిహ్నములులేనివియగు టెక్కెములు, ధ్వజములు = పెద్దవి, చిహ్నములు గలవియగు టెక్కెములు, శాఖామృగములు = కోఁతులు, తేజస్+స్తోమంబునఁ = కాంతిసమూహముచే, శోభిల్లెఁ = ప్రకాశించెను.

తా త్ప ర్య ము.

సుగ్రీవునకుఁ బట్టాభిషేకము, అంగదునకు యౌవరాజ్య మిచ్చినందునకు రామచంద్రుని లక్ష్మణుని మెచ్చిరి. ఇండ్లయందుఁ జిన్న టెక్కెములను పెద్ద టెక్కెములను వానరు లెత్తిరి. పట్టణమంతయుఁ గాంతిచే నిండి ప్రకాశించెను.

క॰ అభిషేకవార్త తులితస్వభునకు నెఱిఁగించి యాత్మసతి రుమతోనుఁ
స్వభిమతసుఖములఁ దేలుచు, విభవమున రహించె శక్రవిధమునఁ గపియున్. ౬౭

తులిత స్వభునకుఁ = విష్ణువువంటి రామునికి- "కేశవో మాధవః స్వభూ" అమరుఁడు- రుమతోనుఁ=అనుటచేఁ దనభార్య రుమతో మాత్రమేగాక తారతోను అని భావము. స్వభిమత = సు+అభిమత = మిగుల సమ్మతములైన.

తా త్ప ర్య ము.

అభిషేకము జరిగిన వార్త విష్ణువుతో సమానుఁడగు రామచంద్రమూర్తికిఁ దెలియఁబఱిచి సుగ్రీవుఁడు తన భార్యయగు రుమతోను తారతోను యథేచ్ఛసుఖము లిందునివలె ననుభవించు చుండెను.

ఇప్పుడు కిష్కింధ యని చెప్పఁబడు ప్రదేశములఁజూచిన నది యొక చిన్న పట్టన మని తోఁపఁగలదు. కాని వాలి సుగ్రీవులు పాలించిన దా చిన్న పట్టనము మాత్రముగాదు. చరిత్రశోధకులు కిష్కింధారాజ్య మనునది తూర్పునఁ బడమట దక్షిణమున ఉత్తరమున విదర్భ దండక గోదావరిగల ప్రదేశమై యుండెనని వ్రాసి యున్నారు. ఇప్పటి మైసూరు, తూర్పుకనుమలు పడమటి కనుములు సహ్యాదర్దురమలయ మహేంద్ర పర్వతము లీ రాష్ట్రము లోనివే. కూర్గదేశమం దిప్పటికిని కపిని యను నదియు, అంజనయను ప్రదేశము, లక్ష్మణతీర్థ మను నేరు కలవట- మలయాళదేశంబున అంగదపురమనియు ఉత్తర కర్ణాటకదేశంబున వనవాసి యనియు గ్రామములు గలవు. ఇప్పుడు మైసూ రను దానికిఁ గొందఱు మహిషాసురుఁడు మర్దింపఁబడిన స్థల మను చున్నారు. కాని యీ మహిషాసురుఁడు వాలిచే సంహరింపఁబడిన దుందుభి యను చున్నారు. కాని యిది సందేహింపఁదగిన విషయ మని తోఁచుచున్నది. ఏలన వాని యెముకలగూఁడు కిష్కింధ సమీపమందే కదా యుండెను. ఇదిగాక వానరు లెం దున్నను వీరి యధికారమునకు లోఁపడినవారే కావునఁ గిష్కింధారాజ్య మల్ప రాష్ట్రముగాదు.

—♦ ౨౭-వ సర్గము. శ్రీరామలక్ష్మణులు ప్రస్రవణగిరిగుహఁ జేరుట ♦—

సీ. రామచంద్రుం డంత ♦ సౌమిత్రితోఁ గూడి, వ్యాఘ్రవరాహర్క్షవానరాన్వితంబు
తతవిధగుల్మలతాగూఢమును బహు, వృక్షరుహసంజాతసంకులంబు
వానరగోపుచ్ఛవారభల్లూకబిడాల సేవితమును ♦ నీలమేఘ
రాశినిభంబును ♦ రమ్యజలాశ్రయం, బైన ప్రస్రవణాద్రి ♦ కరిగి యతని

తే. కనియె నీగుహఁ గంటివే ♦ యతివిశాల
మగుచు రమ్యంబు మితవాయు ♦ వగుచు వెలసె
శానకా రెల్లఁ గడవఁగఁ ♦ బ్రీమద మొప్ప
నుండుటయె యిందు లక్ష్మణా! ♦ యుక్త మగును        ౧-౬

వ్యాఘ్రహర్యక్షరవాన్వితంబు = వ్యాఘ్ర=పులులయు, హర్యక్ష= సింహము లయు, రవ = ధ్వనులతో, అన్వితంబు = కూడినది, తతవిధ = నానావిధములైన, గుల్మ = పొదలచేతను, లతా = తీఁగలచేతను, గాఢము = మఱుఁగుపడినది, బహు = అనేకములైన, ద్రుమ్మరుహ = చెట్లవలన, సంజాత = కలిగిన, సంకులంబు= నిండినది, వానర = కోఁతులచేతను, గోపుచ్ఛ = కొండముచ్చుల, వార = సమూ హముచేతను, భల్లూక = ఎలుఁగుగొడ్డులచేతను, బిడాల=పిల్లులచేతను, సేవితము = కూడియుండినది, నీలమేఘరాశి = నల్లమబ్బుపోవుతో, నిభంబును = సమానమయి నదియు, వానకారు = వర్షాకాలము.

తా త్ప ర్య ము .

సుగ్రీవాంగద పట్టాభిషేక వార్త విని యచ్చటనుండి లక్ష్మణునితో బయలు దేఱివచ్చి పులుల సింహముల ధ్వనులతోఁగూడినదియు నానావిధములగు పొదలచేఁ గానరాకయుండునదియుఁ బలువిధములైన చెట్లు గలదియుఁ గోఁతులు కొండ ముచ్చులు ఎలుఁగులు పిల్లులు గలదియు నల్లని మబ్బువలె నుండునదియు మనోహర మగు నీళ్లుగలదియు నగు ప్రస్రవణ మను కొండకుఁబోయి యందుఁ దమ్మునికిట్లు చెప్పెను. లక్ష్మణా ! యీ గుహను జూచితివా? మిగుల విశాలముగ రమ్యముగ విస్తా రము గాలి లేక యొప్పుచున్నది. వర్షాకాలమంతయు మన మిందు సంతోషముతో నుండుటే బాగు.

సీ. ఈగిరిశృంగంబు ♦ పృథ్వీశనందన, తెల్లన యెఱ్ఱన ♦ నల్లనైన
రాలచే ధాతువ♦ర్గంబుచే లహరీద,రీపాళిచేఁ బెక్కు♦వృక్షతతుల
చే మయూరవిహగ♦స్తోమనాదంబుచే, సిందువారకదంబ♦కుందగుల్మ
మాలతీసర్జార్జు♦నాళీసుమాళిచే, హృదయంగమంబు నై ♦యెసఁగెఁ గంటె
తే. చారుచిత్రలతావృత♦మై రహించె రమ్యమై యున్న వెందు గో♦రంటచెట్లు
గుహయు నున్నతమగుచును♦గొమరుమీఱె యుక్తమగునెలదిమన♦ముండుటకును.

లహరీ = కొండవంకలు, దరీ = గుహ, వీని పాళిచే = వరుసలచే, మయూర విహగ = నెమిళ్ళయు నితరపక్షులయు, స్తోమ = సమూహముల, నాదముచే=ధ్వనిచే, సిందువార = వావిలిచెట్లు, కదంబము = కడపచెట్లు, కుందము= మొల్ల, మాలతీ= జాజి, సర్జము = మద్ది, అర్జునము = ఏరు మద్ది, ఆళీ = వీని వరుసలయొక్క, సుమాళీ= పుష్పముల గుంపులచే, హృదయంగమంబునై = హృదయము నాకర్షించునదియై, చారు = మనోహరమైన, చిత్ర = అందమైన, లతావృతమై = తీఁగలచే నావరింపఁ బడినదై.

తా త్ప ర్య ము .

ఈ పర్వతశిఖరము- తెల్లన - యెఱ్ఱన - నల్లనైన రాలచేతను ధాతు సమూ హముచేతను- కొండవంకలయు గుహలయు వరుసలచేతను-అనేకములైన చెట్లగుంపుల

చేతను నెమిళ్ళయుఁ బక్షులయు గుంపుల రవళిచేతను- వావిలి- కడప- మొల్లపొదలు- జాజి- మద్దియేరు- మద్ది- వీని పూవులచేతను మనోహరమై యున్నది చూచితివా ? ఇంపై వింతైన తీఁగలచే నావరింపఁబడి ప్రకాశించుచున్నది. ఎక్కడఁజూచినను గోరంటచెట్లు రమ్యములై యున్నవి. గుహకూడ నెత్తుగ నున్నది. ఇది మనకుఁ దగిన స్థలము.

క. కమలాకర మది గంటివె, కమలాకరచారుఫుల్ల♦కమలాకర మై
విమలంబయి మనగుహకున్, సమీపతలవర్తి యగుచు♦సంతస మిడెడిన్. ౬౫౧

కమలాకరము = కొలను, కమల = లక్ష్మీదేవికి, కర = హస్తమువలె, చారు = మనోహరమైన, ఫుల్ల = వికసించిన, కమల = తామర పుష్పములకు, ఆకరమై = స్థానమై, విమలంబయి = నిర్మలమై, సమీపతలవర్తి = దాపునఁదుండి నది.

తా త్ప ర్య ము .

అదిగోఁ దటాకము చూచితివా? లక్ష్మీదేవి హస్తమువలె మనోహరమైన వికసించిన తామరలకు స్థానమై నిర్మలమై మనగుహకు సమీపమందే సంతోషము కలిగించుచున్నది.

ఉ. తూరుపు నుత్తరంబు గుహ♦దోఁచెడి వాటపుఁబల్లమై సుఖం
బారెడి జల్లు కొట్టనిని ♦ నా వెనుప్రక్కను మిట్టు గావునన్
మారుతముల్ మితంబ యగు ♦ నాయన ! దొడ్డది చాఁపఱాయి యొం
త్తో రహింగూర్చి భిన్న మగు♦తోరపుఁ గాటుకకుప్పఁ బోలుచున్. ౬౫౨

తూరుపు నుత్తరంబు = గుహ యీశాన్యమూలగా నుండుటచే నైరృతి ముఖమై యున్నది.

తా త్ప ర్య ము .

ఈ గుహ నైఋతి ముఖముగాఁ బల్లమై ముందు ప్రక్క వానజల్లు కొట్టుటకు వలనుపడక సుఖకరమైయున్నది- ఏలన వెనుక మిట్టుగా నున్నది- ఆకారణముచే గాలి కూడ నెంతకావలయునో యంత మితముగానే యుండును- చెదరిన కాటుకకుప్పవలెఁ బెద్దది నల్లచాపరాయి చూడ నందముగా నున్నది-

ఈ గుహ యిప్పటికి నిందుఁ జెప్పఁబడినట్లు తుంగభద్రానది యొడ్డున నున్నది-

సీ. ఉత్తరంబున మఱి♦యొండుశృంగముఁ జూడు, భిన్నాంజనచయంబు♦పేర్మిఁ గనుచు
నాగడపలఁబోలి♦ వ్యాప్తమై యున్నది, దక్షిణంబున నొండ♦ధవళశిఖర
మొప్పెడిఁగైలాస♦మో యన ముందటఁ, బ్రాచీనవాహిని ♦ పాతె నదిగొ
నడు సాకింతయు లేక ♦ యలతిత్రికూటంబున, జాహ్నవీసదికిని ♦ సాటి యగుచు
తే. సాలతాలతమాలత♦క్కోలజాల, తిలకకృతమాలహింతాల ♦ లలితవకుళ
చారువానీరపద్మక ♦ సరళవేణు, పాదపంబులఁ జెలఁగెడి♦భంగిఁ గంటె. ౬౫౩

శృంగంబు = శిఖరము. భిన్నాంజనచయంబు = చెరిసగముగఁ జేయఁబడిన కాటుకరాశి- ఆగడపలన్- దొంతిగా నేర్పడిన మేఘములపంక్తి- ఈ శబ్దము నిత్య బహువచనాంతము- ప్రాచీన వాహిని = తూర్పుగాఁ బాఱునది- అడుసు = బురద- సాల = మద్ది- తమాల = చీఁకటిమ్రాను- తాల = తాటి- తక్కోలజాల = తక్కోలవృక్షముల సమూహము. కృతమాలము = తేల- తిలక = బొట్టుగుచెట్టు- హింతాల = గిఱకతాడు, వకుళము = పొగడ- వానీరము = ప్రబ్బలి-

తాత్పర్యము.

ఉత్తరమున మఱియొక శిఖరము విరిసిన కాటుకకుప్పవలె నున్నది. చూడుము- అది దొంతిమబ్బులపంక్తివలె నున్నది- దక్షిణమున నొక తెల్లశిఖరము కైలాసమువలె నున్నది. ముందటఁ దూర్పుముఖముగా నేఱు పాఱుచున్నది. (ఇది తుంగభద్ర.) బురద లేక త్రికూటంబున జాహ్నవివలె నున్నది. మద్ది - త్రాటి - చీఁకటి - తక్కోలము- బొట్టుగు- తేల- గిఱకతాడు. పొగడ- ప్రబ్బ- పద్మకము- సరళము వెదుళ్ళచెట్లున్న విధము చూడుము.

క. అట నట నానాకృతులై, విటపితతుల్ తీరమందు ♦ వెలసెఁడి గంతే
స్ఫుటవసనాభరణాన్విత, కుటిలాలకచందమునను ♦ గొమ రొప్పంగన్. ౬౮

అటనటన్ = అచ్చటచ్చట- నానాకృతులై = పెక్కు ఆకారములఁ గలిగి- విటపితతుల్ = చెట్ల సమూహములు- స్ఫుట = ప్రకాశించు- వసన = వస్త్రముల తోను; ఆభరణ = భూషణములతోను- అన్విత = కూడిన- కుటిలాలక = కుటిల = వంకర- అలక = ముంగురులుగలది- స్త్రీ.

తాత్పర్యము

అచ్చటచ్చట పలువిధములయిన చెట్లు నదీతీరమందుఁ బ్రకాశించు భూషణములు- వస్త్రములు- వీనితో నలంకరించుకొన్న స్త్రీవలె నున్నది చూడుము.

చ. విమల విహంగమప్రకర♦విశ్రుతనాదము నై పరస్పరా
నమసమరక్తచక్రచయ♦సంపరిశోభిత మై మనోహరో
త్తమపులినస్థలం బయి ని♦తాంతము సారసమానసాలయ
భ్రమరయుతంబు నై నదియు ♦ భాసిలె నవ్వు నెలంత యో యనన్. ౬౯

విమల = శుభ్రమైన కాంతిగల- విహంగమ = పక్షులయొక్క- ప్రకర = సమూహముయొక్క- విశ్రుతనాదము = ప్రసిద్ధమైన ధ్వని, ఐ = కలిగి- పరస్పర = అన్యోన్యము- అసమ = సమానములేని- సమ = పూర్ణమైన- రక్త = అనురాగము గల, చక్రచయ = చక్రవాక పక్షులసమూహముచే- సంపరిశోభితమై = మిగులఁ బ్రకాశించునదియై- మనోహర = ఉత్తమ- పులినస్థలంబయి = ఇంపై శ్రేష్ఠమైన యిసుకదిబ్బలుగల ప్రదేశమై, నితాంతము = మిక్కిలి- సారస = కమలములతోను- మానసాలయ = హంసలతోను- మానస సరోవరము ఆలయముగాఁ గలది-

భ్రమర = తుమ్మెదలతోను- యుతంబయి = కూడినదై- నవ్వునెలంతయో = నవ్వుచున్నస్త్రీయో- ఉత్ప్రేక్షాలంకారము, ఓయనట- ఉత్ప్రేక్షావాచకము.

తాత్పర్యము.

పక్షిసమూహముల శ్రవ్యమైన నాదము కలిగి యొకదానియందు మఱియొక దానికి ససమానమై పూర్ణమైన యనురాగముగల చక్రవాకములచేఁ బ్రకాశించుచు మనోహరమైన యెత్తైన యిసుకదిబ్బలు గలదై మిక్కిలి కమలములతోను హంసలతోను తుమ్మెదలతోను గూడినదై యీనది నవ్వుచున్న స్త్రీవలె నున్నది చూచితివా?

విశ్రుతనాదము- అనునది స్త్రీల కలకల నవ్వు ధ్వనిని, పరస్పర.........శోభితమై యనుటచే సమానములై యొకదానితో నొకటి యొఱయుచున్న స్తనములను- పులినమనునది పిఱుఁదులను- సారసము లనునది కన్నులను- హంస లనునది గమనమును- భ్రమరము లనునది తలవెండ్రుకలను చూపులను సూచించును.

నవ్వునెలంత యనుటచే రామచంద్రమూర్తికి సీతాదేవి స్మృతికి వచ్చెనని సూచితము. ఈ నది తుంగభద్రయే.

సీ. ఒకచోట హృదయంగ♦మోత్పలంబులకూట, మొకచోట రక్తాబ్జ♦నికరఘాట
మొకక్రేవ కైరవ♦ముకుళసంఘముచేవ, యొకత్రోవఁ ప్లవముల♦యొప్పుఠేవ
యొకవంక నెమిళుల♦ప్రకటకేకల బింక, మొకతెంకిఁ గొంచల ♦ నొనరు పొంక
మొకప్రక్కఁ జందన♦ప్రకరంబు రుచి నిక్క,నొక యిక్క మౌనుల♦యునుకు లెక్కఁ
తే. జూచితే యీతరంగిణి ♦ సొంపుమీఱె, నౌర! యెంత మనోహర♦మైన దిదియు
నిందెమనము వసింత మా♦నందముగను,జిరము దూరంబుగాదు కి♦ష్కింధ యిటకు.

హృదయంగమ=హృదయమున కింపైన- ఉత్పలంబుల=కలువల- కూటము = సమూహము- రక్తాబ్జనికరము = ఎఱ్ఱకమలముల సమూహము- ఘాటము = గుంపు- ఒక్కచోటఁ గొన్ని యొకచోటఁ గొన్ని గుంపులు గుంపులుగా నచ్చటచ్చట నున్నవని భావము- క్రేవ = వైపు- కైరవ = తెల్లకలువల- ముకుళ = మొగ్గల- ప్లవములు = నీటిపైఁ దిరుగుపక్షులు- ఠేవ = అందము- తెంకి = ప్రదేశము- కొంచల = క్రౌంచపక్షుల- రుచి=కాంతి- మౌనుల యునుకులు= ఋష్యాశ్రమములు- చిరముదూరము = మిగుల దవ్వు- తరంగిణి = నది.

తాత్పర్యము.

లక్ష్మణా! చూచితివా- యీ నది యెంత యందమైయున్నదో యొకచోట నింపైన కలువలగుంపు- ఒకచోట నెఱ్ఱకమలముల గుంపులు, ఒకప్రక్క తెల్లకలువల మొగ్గలు- ఒకచోట ప్లవ పక్షుల యందము- ఒకప్రక్క నెమిళ్ళకేకలు - ఒకచోట క్రౌంచపక్షుల యందము- ఒకప్రక్క చందన వృక్షములు - ఒకచోట మునుల పర్ణశాలలు కలదై యున్నది - మన మిచ్చట నుందమా - ఇచ్చటికిఁ గిష్కింధ విశేష దూరము గాదు.

క. విన నయ్యె గీతవాద్య, ధ్వనులున్ నర్దత్ప్లవగమృ♦దంగరవంబుల్
కని రుమను రాజ్యరమయును, మనమున హర్షించుఁ గాదె ♦ మర్కటవిభుఁడున్.

విశేషదూరము గాదనుటకుఁ గారణము చెప్పుచున్నాఁడు. గీతవాద్యధ్వనులున్ = పాటలయు మేళములు మొదలగువాని చప్పుడులు- నర్దత్ = గర్జించుచున్న- ప్లవగ= కోఁతులయు, మృదంగ = మద్దెలలయు- రవములు = ధ్వనులు.

తాత్పర్యము.

గీతములయు వీణాది వాద్యములయు ధ్వనులును కపులగర్జలును మద్దెల చప్పుడులును నిక్కడికి వినవచ్చుచున్నవి. తన భార్యయగు రుమను రాజ్యలక్ష్మిని గూడిన వాఁడై సుగ్రీవుఁడు సంతోషించుచుండును.

క. అని యా ప్రస్రవణాద్రిని, నినకులుఁడు వసించె నందు ♦ నెల్లసుఖంబుల్
పొనరియు ముదముం గానఁడు,తన ప్రాణపదంపుభార్యఁ♦దలఁచుచు నార్తిన్. ౭౮౫

తాత్పర్యము.

ఈ ప్రకారము చెప్పుచు నా ప్రస్రవణ పర్వతమందు రామచంద్రమూర్తి వసించెను. అన్నిసుఖము లున్నను దనకుఁ బ్రాణపదమైన భార్యలేని దుఃఖముచే సంతోషించిన వాఁడుగాఁడు.

క. తూరుపుమలఁ బుట్టెడి నీ,హారకరుం జూచి చూచి ♦ వ్యథితాత్ముండై
హారిశయనంబు గలిగియుఁ,గూరుకుఁ గొనఁ డొక్కనాఁడు ♦ కువలయపతియున్.

నీహారకరున్ = చంద్రుని- హారిశయనము = మనోహరమైన ప్రక్క- కూరుకు = నిద్ర-

తాత్పర్యము.

ఆ రామచంద్ర భూపాలుఁడు తూరుపుఁ గొండయందుఁ బుట్టెడి చంద్రునిజూచి చూచి దుఃఖించిన వాఁడై పండుకొనుటకు సుఖశయ్య యుండియుఁ గన్ను మూసిన వాఁడుగాఁడు-

క. పొంగి చనుదెంచు శోకము,నం గారెడి బాష్పములను ♦ నవసెడి శ్రీరా
ముం గనుచుఁ దుల్యదుఃఖుం, డంగద శమియింప నిట్లు♦లన్నం దేర్చున్. ౭౮౦

తాత్పర్యము.

కడుపులోనుండి పొంగిపొంగి వచ్చుచున్న శోకముచేఁగారు కన్నీళ్లచే కుమిలించుచున్న శ్రీరామచంద్రమూర్తిని జూచి యాయన దుఃఖముతో సమాన దుఃఖము గల లక్ష్మణుఁ డాయనకు దుఃఖ మణఁగు నట్లు సమాధానపఱిచెను-

—♦ లక్ష్మణుఁడు శ్రీరాము ననునయించుట ♦—

క. అన్నా! యీగతి దుఃఖివి,పన్నతఁ గృశియింప నీకు ♦ భావ్యం బగునే
పన్నుగ నీవెఱుఁగవె దుః,ఖోన్నతిఁ గార్యములు నాశ మొందు నటంచున్. ౭౮౧

తాత్పర్యము.

అన్నా! రాజ్యభ్రంశము సీతావియోగము నను నాపదలు చాలక దుఃఖ మను

నాపదకూడఁ దెచ్చుకొని యీ ప్రకారము శుష్కింప నీకుఁ దగునా? దుఃఖాతిశయముచేఁ గార్యములు చెడునని నీ వెఱుఁగవా?

ఉ. నీవు క్రియాపరుండ వవ♦నీధవ! దైవపరాయణుండవుం
నీ వతి ధర్మశీలుఁడవు ♦ నిస్తులసద్వ్యవసాయి వా స్తికుం
డీవు మహాత్మ! కూళ నసు♦రేశ్వరు సంగరరంగమందు బా
హావిభవం బెలర్పఁ దును♦మాడఁగ నేర్తువె ధైర్యహీనతన్? ౬౯౨

క్రియాపరుండవు = కార్యము నెఱవేర్చుట కనుకూలమైన పురుషకారము ప్రధానముగాఁ గలవాఁడవు. దైవపరాయణుండవున్ = కార్యసిద్ధి కనుకూలమైన దేవతాభక్తియే ప్రధానముగాఁ గలవాఁడవు. నిస్తుల = అసమానమైన, సద్వ్యవసాయివి = నిజమైన నిశ్చయప్రయత్నము గలవాఁడవు. ఆస్తికుండవు = పరలోకమున్నది దైవమున్నాఁడను నమ్మకముగలవాఁడవు- కూళ = వంచకుఁడు.

తాత్పర్యము.

నిద్రించు సింహమునోర మృగములు చొరఁబడవన్నట్లు పురుష ప్రయత్నము లేక యే కార్యము కొనసాగదనియు, అట్టిపౌరుషము దైవము తోడ్పాటులేనిచో విత్తనము వేయఁబడని క్షేత్రమువలె ఫలము గలిగింపనేరదు. కావున దైవసాహాయ్యమావశ్యకమనియు, ఆ దైవసాహాయ్యము కలుగుటకు దైవభక్తి కావలయుననియుఁ దెలిసినవాఁడవై యీ ప్రకారము వర్తించువాఁడవు. ఆ పురుష ప్రయత్నమైనను ధర్మపద్ధతి ననుసరించి చేయుదువుగాని ధర్మముతప్పించి చేయవు. చేయఁబూనిన కార్యమును దృఢనిశ్చయ ప్రయత్నముతోఁ జేయుదువుగాని యలసుఁడవై సందిగ్ధచిత్తముతోఁ జేయవు. ఇంతకు నేమి కారణము? నీవు "దైవముగలదు- పరలోకము గలదు" అను జ్ఞానము గలవాఁడవు. ఇటువంటి మహాత్ముఁడవు పురుష ప్రయత్నమునకు మూలాధారమైన ధైర్యము లేనివాఁడవైతివేని యెట్లు వంచకుఁడు, రాక్షసులకధీశ్వరుఁడు నగు శత్రువును యుద్ధభూమియందు భుజబలముచేఁ జంపఁగలవు! ఏడుచుచుండు వానియొద్ద ధైర్య మెట్లుండఁగలదు?

ఉ. చేయుము శోకవేగమును ♦ జెచ్చెర నాశము మూలముట్టుగాఁ,
జేయుము సుస్థిరంబు ధృతిఁ ♦ జేకొనుచున్ వ్యవసాయ మెట్టులున్,
జేయుము ధ్వంసమున్ సకల♦సేవక పుత్రకమిత్రయుక్తదై
తేయుని, న్యాయ్యమే యిటులు ♦ దీఱనివంతలఁ గుందుచుండఁగన్ ? ౬౯౩

తాత్పర్యము

కావున శోకమును సమూలముగ శీఘ్రముగ నాశనముచేయుము. కార్యము సాధింప దృఢనిశ్చయుఁడవై దృఢమైన ధైర్యమును గ్రహింపుము. సేవకులతోడను, కొడుకులతోడను, మిత్రులతోడను గూడిన రాక్షసుని ధ్వంసముచేయుము. ఇవి

నీవు చేయవలసిన కార్యములు. వీనిని విడిచి యంతములేని దుఃఖముచేఁ గుళ్లి యుండుట తగునా?

కం. ఆతతగిరివనజలధిస,మేతం బగు భూతధాత్రి ♦ నేనియుఁ దలఁకిం
 పై తరలఁజేయ నేర్తువు, పై తేయుం డేటి లెక్క ♦ దర్పస్థానా. ౬౯౪

ఆతత = విస్తారమైన, గిరి = పర్వతములతోను- వన = అడవులతోను-జలధి= సముద్రముతోను- సమేతంబు = కూడినది- భూతధాత్రి = భూతముల ధరించునది- భూమి; తరలఁజేయ = తప్పింప- దర్పస్థానా = గర్వమునకు స్థానమైనవాఁడా-

తాత్పర్యము.

నీవు పూనుకొంటివేని కొండ లడవులు సముద్రముతోఁ గూడిన యీ భూమినే తలకిందుగాఁ ద్రిప్పఁగలవు. ఇఁక నొకరాక్షసుఁ డేమిలెక్క?

ఉ. వచ్చెను వానకాల, మిఁక ♦ వచ్చు నదే శరదాగమంబు, లో
 నెచ్చినతాల్మి వేచి సహి♦యింపుము, పిమ్మట రావణాసురున్
 గ్రొచ్చెదుగాక బంధుహిత♦కోటులతోఁ, దగువేళ నిన్ను నే
 నెచ్చరికింతు నాహుతికి ♦ నేడ్తెఱ రేఁచెడి వహ్నినో యనన్. ౬౯౫

శరత్ + ఆగమంబు = శరదృతువు-

తాత్పర్యము.

ఎన్నినాళ్లు సహించుకొందు మనెదవా? ఎంతోకాలము లేదు- వానకాలము రానేవచ్చెను- ఇదిపోఁగానే శరత్కాలము వచ్చును- అప్పుడు కార్యయత్నము చేయుదుము. అంతవఱకు నోర్పుతో సహింపుము. ఆవల రావణాసురుని బంధువులతో మిత్రులతో నేలఁబాటిపెట్టవచ్చును. ఆసమయము రాఁగానే యాహుతి వేల్చుటకై యగ్ని హోత్రమును గలయఁబెట్టి రేఁపినట్లు నేను నిన్ను హెచ్చరింతును- అంతవఱకు సహింపుము.

కం. అని లక్ష్మణుండు పల్కినఁ, దనకు హితము శుభము నైన ♦ తద్వాక్యంబుల్
 మనమున నిల్పి సుహృత్తముఁ, దననెయ్యునిఁ జూచి యనియె ♦ ధరణీశుఁడిటుల్.

తాత్పర్యము.

అని లక్ష్మణుఁడు చెప్పఁగాఁ దనకు హితము శుభమునైన యాయనమాటలు మనస్సున నిలిపి సుహృత్తులయందు శ్రేష్ఠుఁడును దనయందు స్నేహభావము గలవాఁడు నగు లక్ష్మణుతో నిట్లనెను.

ఉ. తమ్ముఁడ నీవు రక్తియు హి♦తమ్మును నెయ్యము సత్యశౌర్యద
 ర్పమ్ము లెసంగఁ బల్కుటను ♦ బాసితిఁ గార్యవినాశకారిదుః
 ఖమ్మును విక్రమమ్ముఁ గొని♦కాచెద నీ వచియించినట్లు కా
 లమ్మునకై, ప్రసన్నతఁ ♦ జెలంగెడుదాఁక నదీకపీశ్వరుల్. ౬౯౬

తా త్ప ర్య ము.

తమ్ముఁడా! నీవు అనురాగము, హితము, స్నేహము, సత్యము, శౌర్యము, దర్పము వెలయునట్లు చక్కఁగాఁ జెప్పితివి కావునఁ గార్య నాశముచేయు దుఃఖమును వదలితిని. నీవు చెప్పినట్లు నదులు సుగ్రీవుఁడు అనుగ్రహించుదాఁక వేచియుండెదను.

కం. వీరుం డగుపురుషుం డుప,కారికి మఱుమే లెటేని♦కావించుఁ బ్రతీ
కారముఁ జేయక మఱచెడి,క్రూరుఁడు నొప్పించు సుజన♦కోటుల మనముల్. ౬౯౮

తా త్ప ర్య ము -

వీరుఁడగు పురుషుడు తనకు మేలుచేసినవానికిఁ దా నెంత కష్టపడియైన మఱుమేలు చేయునుగాని విడువఁడు. అట్లు ప్రత్యుపకారముచేయక మఱచునట్టి క్రూరుఁడు సాధువుల మనస్సుల నొప్పించును. అదియే వాని కెంత క్రీడైనఁ గావించును.

చ. అన విని లక్ష్మణుండు జనకాత్మజభర్తతోడ రామ! నీ
వనినటు సర్వ మొప్పెడి వ♦నాటచయాధిపుఁ డర్హవేళఁ దాఁ
బనిఁగొని చేయు సాయమును ♦ వానలు నిల్చెడిదాఁక నోరుపుల్
గొని యిట నుండు మీ నెలలు ♦ గూల్తువుగా కరకోటి నావలన్. ౬౯౯

తా త్ప ర్య ము.

ఇట్లు చెప్పఁగా లక్ష్మణుఁ డిట్లనియె. రామచంద్రా! నీ వన్నట్లు సర్వము ననుకూలమై వచ్చును. తగినవేళ రాఁగానే సుగ్రీవుఁడు ప్రయత్నపూర్వకముగ సహాయము చేయునుగాని తప్పఁడు. కావున వానలు నిలుచుదాఁక సహించి యిందే యుందము. ఆవల శత్రువుల ధ్వంసముచేయుదువు.

శ్రీరామచంద్రమూర్తి సర్వదా ఆశ్రితజన రక్షణతత్పరుఁడు. తన యాశ్రితుల నందఱ రక్షించువఱకు నిద్రాహారము లాయనకు రుచింపవు. ౬౯౮వ పద్యమం దీ విషయము కవియే నచించెను. సుగ్రీవుని రక్షించెనుగదా యనిన నిది యవాంతరముగ వచ్చినది. అంతకంటె నెక్కువగ నాశ్రయించిన సీతాదేవిని రక్షింపలేదుకదా. ఆ విషయమై పరితాపపడుచున్నాఁడు.

—♦ ౨౮-వ సర్గము. వర్షర్తు వర్ణనము. ♦—

క. అన విని తమ్మునిఁ గనుఁగొని, చను దెంచెను గంటె వృష్టి♦సమయము మబ్బుల్
పెనుఁగొండలట్లు నభమున, ఘనముగ వ్యాపించె నిర్మ♦గవియగ ధరణిన్. ౭౦౦

తా త్ప ర్య ము.

అని లక్ష్మణుఁడు చెప్పగా రామచంద్రమూర్తి యాయననుజూచి తమ్ముఁడా! చూచితివా! వానకాలము వచ్చెను. భూమిమీఁదఁ జీఁకట్లు క్రమ్మునట్లు లాకాశమునఁ బెద్దకొండలవలె మేఘములు దట్టముగ వ్యాపించెను.

క. దివి దినకరకరముల న,ర్ణవరసముల నెల్లఁ ద్రావి ♦ నైపుణి మెఱయన్
నవమాసగర్భ యగుచును, నవురుగఁ బ్రసవించెడిన్ ర♦సాయన మిట్టుల్. ౭౦౧

దివి = ఆకాశము- దినకరకరములన్ = సూర్యకిరణములచే- అర్ణవరసములన్ = సముద్రజలమును- నవమాసగర్భ యగుచును = తొమ్మిదినెలలు గర్భము ధరించినదై- రసాయనము = జలమును- ప్రసవించెడిన్ = కనుచున్నది- దివి-కర్తృపదము.

రసాయనము = దేహపుష్టికరమైన యౌషధము- ఇక్కడ వర్షము వాడిన పైర్లకు ఎండవడఁబడిన మనుష్యులకుఁ బశువులకుఁ బక్షులకుఁ దాపమడఁచి యాహారసమృద్ధిని గలిగించును గావున రసాయన మనఁబడెను.

ఓయి, మనుస్మృతియందు 'అష్టమాసాన్ యథాదిత్య స్తోయం హరతి రశ్మిభిః॥' ౯-౩౦౫. అని యెనిమిది మాసములే సూర్యుఁడు కిరణములచే జలములు గ్రహించునని యుండఁగా నిందుఁ దొమ్మిదిమాసములు చెప్పఁబడెనే, వర్షాకాలము నాలుగు మాసము లయినపుడు తక్కిన యెనిమిది మాసములేకదా సూర్యుఁడు జలము గ్రహించునని చెప్పవలయును.

మనుస్మృతి తప్పుగాదు. రామాయణము తప్పుగాదు. వాస్తవమునఁ బండ్రెండు మాసములు సూర్యుఁడు జలమును గ్రహించుచునే యుండును. అనఁగా సూర్యరశ్మికి జలమావిరియై యాకాశమునఁ జేరుచుండును. అట్లు గాదేని వర్షాకాలమందుఁ దడివస్త్రము లారకయే యుండవలెను. అయినను ఎండకాలమందు సూర్యకిరణములు మిగుల వేఁడిమిగలవు. కావున విశేషజల మావిరియైపోవును. దక్షిణాయనమున సూర్యరశ్మి మందము గావున కానరాని యావిరి ధూమము వలెనై మేఘములై చలిమిరికి వర్షధారలై పడును. కార్తికముతోఁ గడవానలని సామెత- శరదృతువు రాఁగానే మేఘములు పలుచన పాఱును. కార్తికమాసమందు నాకాశమందున్న యావిరి సమయుటచేఁ బలుచని చినుకులు పడినఁబడును గాని విశేషించి జడిపట్టి కురియదు. కావున ఆనెలలోనే మరల నావిరి యాకాశమున కెగయ నారంభించును. కావున గర్భధారణము తొమ్మిదినెల లనుట తప్పుగాదు. స్త్రీలగర్భము తొమ్మిదినెలలేకదా! కావున నట్లు చెప్పఁబడెను.

ఇచట గోవిందరాజీయవ్యాఖ్యయందు "ఇప్పుడు సీత నాయొద్ద నుండునేని యామెయు గర్భము ధరించి యుండు నని రామాభిప్రాయము" అని వ్రాయఁ బడినది- ఇదిసరిగాదు. ఇప్పటికి నిటువంటి వర్షర్తువులు దండకయందే పదుమూఁడు గడచెను. గదా, యప్పుడే గర్భము నామె ధరించెను. ఆమె నేను బ్రహ్మచర్యము ధరించి నీ వెంట వచ్చెద నన్నమాటకు, రామచంద్రమూర్తి తాను బ్రహ్మచర్యము ధరించెద నన్న మాటలకు గతియేమి? రామచంద్రమూర్తి కాముకుఁడై యేడువలేను. సీతాదేవికి వచ్చిన దుఃఖమునకై యేడ్చెనని యింతవఱకు వ్రాసిన వ్రాఁతల కేదిగతి?

క. వనధర నిశ్శ్రేణులచే, వినువీధికి నెక్కి పోయి♦ వేఁడివెలుంగున్
నునుఁ గుటజార్జునసుమములఁ, గొనబార నలంకరింపఁ ♦ గూడెడిఁ గంటే. ౭౦౨

వనధర నిశ్రేణులచేఁ = వనధర = మేఘములనెడు- నిశ్రేణులచేఁ= సోపానములచే- వినువీథికిఁ = ఆకాశమునకు- వేఁడి వెలుంగుఁ = సూర్యుని- నును= మృదువైన- కుటజ + అర్జునసుమములఁ = కొండమల్లె- ఏరుమద్ది పూలచే- గొనబు+ అరఁ = అందముగా- వనధర నిశ్రేణులు = మబ్బుమీఁద మబ్బు, దానిమీఁద మఱియొక మబ్బు పడుటచే నిచ్చెనగాఁ జెప్పఁబడెను.

తాత్పర్యము.

ఒకదానిపై నొకటి పేర్చినట్లు నిచ్చెనవలె నున్న మేఘములవెంట నెక్కి యాకాశమునకుఁబోయి మృదువైన కొండమల్లె ఏరుమద్ది పూవులచే నందముగా సూర్యు నలంకరింపవచ్చును.

'ధ్యేయ స్సదా సవితృమండల మధ్యవర్తీ నారాయణ' యన్నట్టును, 'అలంకార ప్రియో విష్ణు' వన్నట్లును విష్ణువు నలంకారప్రియుఁడుగావున నాతఁడు సూర్యమండలాంతర్గతుఁడై యుండుటను ఆయనను దూరమునుండి నమస్కరించుటకంటెఁ జేతులార నర్చించుట బాగని ధ్వని.

దీనివలన మూర్తి పూజయే శ్రేష్ఠమని భావము.

'సహపత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమ' త్తన్నట్లు సీతతోఁగూడి చేసెడి భగవదారాధనమునకు విఘ్నము వచ్చెఁగదా యని రాముఁడనుకొనుచున్నాఁడని సూచిత మని గోవిందరాజీయము.

తే. సంజకెంజాయ నెడ నెడ♦రంజిలంగఁ దతము పాండర మగుచు నం♦తములయందు
స్నిగ్ధములు నైన మబ్బు లన్♦చింపిచేలములను గట్టిన ఫుండునా ♦ వెలసె నభము.

సంజకెంజాయ = సాయంకాలమునందలి యెఱ్ఱనికాంతి- ఎడనెడఁ = నడుమ నడుమ- పాండరము = తెలుపు- అంతములందుఁ = కొనలందు- స్నిగ్ధములు = తడిగలవి- నభము = ఆకాశము.

తాత్పర్యము.

నడుమనడుమ సాయంకాలపు టెఱ్ఱని యెండకాంతులు గలిగి (యిది నెత్తురు మఱకలు) కొనలయందు మిగులఁ దెల్లనై నీటితో నిండిన (చీము) మబ్బులను చింపి గుడ్డలుకట్టిన పుండువలె నాకాశమున్నది చూడుము.

ఉపమాలంకారము- లేక అతిశయోక్తి.

పుండెట్లు బాధాకరమో యీ కాలమట్లు నన్ను బాధించుచున్నదని ధ్వని.

తే. మందమారుతనిశ్వాస♦బృంద మగుచు, సాంధ్యరాగపటీరరం♦జనముఁ గనుచు
నభ్ర మాపాండురంబగు♦నభ్రయుక్తిఁ, గామపరిపీడితునిభంగిఁ ♦ గాన్పిలెఁ గంటె.

మందమారుత= మెల్లగా వీచు గాలి యనెడి- నిశ్వాసబృందము= నిట్టూర్పు పరంపరలు; దీనిచే సర్వదా నిట్టూర్పు లొకటి వెంట నొకటి వచ్చుచున్నదని భావము- సాంధ్యరాగపటీరరంజనము = సంధ్యాకాలసంబంధమైన యెఱ్ఱని

కాంతి యనెడి గందపుఁ బూతను- అభ్రము = ఆకాశము- ఆపాండురము = కొంచెము తెల్లనైన- అభ్రయుక్తిన్ = మేఘములతో- కామపరిపీడితుని భంగిన్ = కామముచే బాధింపఁబడిన వానివలె- భ్రాజిల్లెన్ = ప్రకాశించుచున్నది.

శ్రీగంధము పూఁత తాపశాంతికై చేయు శైత్యోపచారమును సూచించుచున్నది. ఆపాండురము సాత్త్వికభావములలోని వైవర్ణ్యము సూచితము. రూపకానుప్రాణితమైన యుత్ప్రేక్షాలంకారము.

తాత్పర్యము.

మందమారుత మనెడి నిట్టూర్పుల పరంపరలను సంజకెంజాయ లనెడి గంధపుఁ బూఁతనుగలదై కొంచెము తెలుపుగల మేఘములతోఁ గూడిన యాకాశము విరహతాపమువలన బాధపడు వానివలె నొప్పుచున్నది.

తే. ఘర్మసంతప్తయై నవ♦కాండములను, దొప్పదోఁగుచు నార్తి దో♦దూయమాన
యైన జనకాత్మభవ యన♦నవని బాష్పపూరములు రాల్చెఁ గంటివే♦ ధీరచరిత.

ఘర్మసంతప్త = ఎండవేఁడిమిచేఁ దపింపఁ బడినదై; సీతాపక్షమున విరహతాపముచే బాధపడినదై; నవకాండములను = క్రొత్తనీటిచేత; సీతాపక్షమున- కన్నీళ్ళచేత; తొప్పఁ దోఁగుచున్ = తోఁగుచున్+తోఁగుచున్ = తొప్పఁ దోఁగుచున్ = మిక్కిలి తడియుచు- రూ. తొప్పఁగఁ దోఁగుచున్- దోదూయమాన = మిక్కిలి దుఃఖించుచున్న- జనకాత్మభవ = సీత- అవని = భూమి.

తాత్పర్యము.

విరహతాపముచేఁ దపించుచుఁ గన్నీటివఱదలచే మిగులఁ దడియుచు దుఃఖించుచున్న సీతవలె భూమియు నెండవేఁడిమికిఁ గ్రాఁగి వాననీళ్ళచేఁ దప్పఁదడియుచు నావిరులు వెడలించుచున్నది. కాలిన పెనముమీఁద నీళ్ళుపడిన నావిరిలేచునట్లు కాలిన భూమిమీఁదఁ దొలుతఁ జినుకులుపడినప్పు డావిరిలేచుట ప్రసిద్ధము. శ్లేషాలంకారము.

క. జలదోదరముక్తంబులు, సులలితకహ్లారనికర♦సుఖశీతలముల్
లలిఁ గైతకపరిమళములు, చెలువుగ జుఱ్ఱంగ వచ్చెఁ♦జేరల కోలఁదుల్. ౭౦౬

జలదోదర ముక్తంబులు = మేఘముల నడుమనుండి వచ్చునవి. ఇట గాలి మాంద్యమును సూచించును. సులలిత, కహ్లార, నికర, సుఖ, శీతలముల్ = మిక్కిలి మనోహరమైన, కమలముల సమూహములయొక్క సుఖకరమైన చల్లఁదనము గలవి- కమలములమీఁది గాలియనుటచే శైత్యము, సౌరభ్యము సూచితము. కైతక పరిమళములు = మొగలిపూల వాసనలుగలవి, వాయువులు. ఇట్లు చెప్పుటచేత వాయువు చలిమిరిచేతను మాంద్యముచేతను వాసనలచేతను ఘనీభవించి నంత దట్టముగా నున్నదని భావము.

తాత్పర్యము.

వాయువు మేఘముల నడుమనుండి వెలువడి కమలములమీఁదుగా వచ్చి మొగలి

పూల వాసనలచే నిండియుండుటచే నీళ్లవలెఁ జేరలతో జుఱ్ఱుకొన సాధ్యమగుచున్నది.

క. కేతకధూళీలిప్తం, బాతతఫుల్లార్జునంబు ♦ నయి యాగిరి ని
ర్ధూతారి భాస్కరాత్మజు, భాతిని ధారాభిషిక్త ♦ పటిమం గ్రాలెన్.        ౨౦౭

కేతకధూళీలిప్తంబు = మొగలిపుప్పొడిచే వ్యాప్తమై- ఆతతఫుల్లార్జునంబు = విస్తారముగఁబూచిన యేరుమద్దులు గలదై. నిర్ధూతారి = చంపఁబడిన శత్రువుగల - భాస్కరాత్మజు భాతిని = సుగ్రీవునివలె, ధారాభిషిక్త పటిమన్ = ఉదకధారలచే నభిషేకింపఁబడిన విధమును - ఉపమాలంకారము.

తా త్ప ర్య ము.

శత్రువు నణఁచిన సుగ్రీవుఁడు గంధము పూసికొన్నట్లు ఈ పర్వతము మొగిలి పుప్పొడిచే వ్యాపింపఁబడి యతఁడు పూలను ధరించినట్లు వికసించిన యేరుమద్ది పూలను ధరించి యతఁడవభృథస్నాతుఁడైనట్లు వర్షధారలచేఁ దడిసి యొప్పుచున్నది

క. జలదము కృష్ణాజినముగ, జలధారలు దోఁచు చుండ ♦ జన్నిదములుగా
వలిగాలి నిండ గుహలన్, మల లొప్పెను శ్రుతులు చదువు♦ మనుజులమాడ్కిన్.

జలదము = మేఘము- వలిగాలి = చల్లనిగాలి- మలలు = పర్వతములు- శ్రుతులు = వేదములు-

తా త్ప ర్య ము.

ఈ పర్వతములు మేఘ మను కృష్ణాజినము జలధార లనెడి యజ్ఞోపవీతములు ధరించి గుహలలోఁ జలిగాలి నిండఁగా వేదాధ్యయనము చేయు బ్రాహ్మణులవలె నున్నవి. రూపకానుప్రాణిత మగు నుపమాలంకారము.

క. ఒఱపగు కడానిబంగరు, మెఱుఁగుల నెఱతుఱఁగలింత♦మించిన మించుం
గొఱడాలఁ గొట్ట దూఁకట, మొఱయిడు వటు వనఁగ నభము ♦ మొరసెడి వింటే.

ఒఱపు = అందము- కడానిబంగరు- అపరంజిబంగారుయొక్క - మెఱుఁగుల= కాంతులయొక్క, నెఱతుఱఁగలింత=అందమైన ప్రకాశముచే- మించిన=అతిశయించిన మించుంగొఱడాలను = మెఱుపులను కొఱడాలచే (చబుకు) దూఁకట = బాధచేత- మొఱయిడు = ఏడుచు- వటువు = బ్రహ్మచారి- నభము = ఆకాశము- మొరసెడిన్ = ధ్వనించుచున్నది.

దీనివలనఁ జక్కఁగాఁ జదువని బాలురను కొఱడాలచేఁ గొట్టు చుండిరని యేర్పడుచున్నది.

తా త్ప ర్య ము.

కొఱడాలచేఁ గొట్టిన నేడుచు బ్రహ్మచారివలె నందమైన యపరంజి బంగారు కాంతులను మించిన మెఱుపులు గల యాకాశ ముఱుములతో ధ్వనించుచున్నది- రూపకానుప్రాణితోపమాలంకారము.

తే. అకట లక్ష్మణ! నీలమే♦ఘాశ్రితంబు, కార్మొఱుం గెట్లు చలియించెఁ♦గంటివయ్య
రావణునియంకమందు ధ♦రాతనూజ, వ్యసనభరమున వణఁకెడి♦వడువు దోఁప.

నీల మేఘాశ్రితంబు = నల్లనిమబ్బు నాశ్రయించియుండునది- కార్మొఱుంగు= వానకాలపు మెఱుము- చలియించెన్ = కదలుచున్నది.

తా త్ప ర్య ము .

నల్లని రావణాసురుని రొండియందుఁ బచ్చని బంగారు వన్నెగల సీత వణఁకినట్లు మేఘము నాశ్రయించిన మెఱుము కదలుచున్నది చూచితివా-

రావణుని రామచంద్రమూర్తి చూడలేదుగదా! వాఁడు నలుపని యాయన యెట్లు చెప్పఁగలిగెను. సాధారణముగ రాక్షసు లందఱు నలుపే.

తే. నీలఘనములచే నవ♦లిప్త లగుచు, దిశలు నష్ట గ్రహాబ్జదీ♦ధితులతోడ
నంగనాయుతులకు హిత♦లయి విభాగ, మేర్పరింపఁగరాక తా♦ మెసఁగె నిపుడు.

నీలఘనములచేన్ = నల్లనిమబ్బులచే- అవలిప్తలు = వ్యాప్తములు- నష్ట = కానరాని- గ్రహాబ్జ = గ్రహములు చంద్రుఁడు గలవై- అంగనాయుతులకు = భార్యలతో నుండు వారికి- హితలయి = మేలు చేయునవియై- విభాగము = ఇది తూర్పు, ఇది పడమర యను భేదము చెప్ప సాధ్యపడక-

తా త్ప ర్య ము .

దిక్కులు నల్లమబ్బులచే వ్యాపించుటచే శుక్రాదిగ్రహములు గాని చంద్రుఁడు గాని కానవచ్చుటలేదు. ఇది యీ దిక్కని గుర్తింపరాకయు నున్నది. కావున నిది భార్యలు తమయొద్ద లేనివారికి సంతాపకరముగాని భార్యలతోడ నుండువారలకు సుఖకరమే. గ్రహములు చంద్రుఁడు కానరాలే దనుటచే నిది రాత్రివర్ణనము. శుక్రుఁడు లోనగు గ్రహములుగాని చంద్రుఁడుగాని కానవచ్చెనేని శుక్రోదయ మయ్యెనే తెల్లవాఱవచ్చెనే యని దంపతులు నిద్దురలేవవలసియుండును. ఇప్పు డా నియమము లేక సూర్యోదయమువఱకుఁ బండుకోవచ్చును.

తే. ప్రకటవర్షాగమమున ను♦త్సుకము లగుచు, నచ్చటచ్చట నావిరి ♦ వచ్చుచుండఁ
గామసందీపనంబుగఁ ♦ గ్రాలుచున్న,కొండమల్లెలు చఱియలఁ ♦ గొమరుమీఱె.

ప్రకట వర్షాగమమునకు = విరివిగా వాన కురియుటచే- ఉత్సుకములు=సంతోషించినవి- కామసందీపనంబుగన్ = కామము వృద్ధియగునట్లు- చఱియలన్=కొండల ప్రదేశములందు- కొమరుమీఱెన్ = అందమైయున్నవి.

తా త్ప ర్య ము .

విరివిగా వాన కురియుటచే సంతోషించి కొండమల్లెలు- కొండ చఱులందు నావిరి మొగయుచుండఁ గామ ముద్రేకింపఁ జేయుచున్నవి చూచితివా ?

ఉ. దుమ్ములు మాసె, మారుతము♦దోలఁ దొడంగెను జల్లగా, మొయిల్
జెమ్మట లూఱుటల్ సమసె♦నిల్చెను వీవనతోడి జోలి, దూ

రమ్యమ్ముగ నేగియున్నప్రజ ♦ గ్రిచ్చుఁ జేరెడి స్వాలయంబులన్,
నిమ్మళమార భూపతులు ♦ నిల్చిరి యాత్రలు వోక యూరులన్. ౭౧౩
వీవన = విసనకఱ్ఱ.

తాత్పర్యము.

దుమ్ము లడఁగెను. గాలి చల్లగా విసరుచున్నది. దేహమునందుఁ జెమ్మట లూటుట లేదు. విసనకఱ్ఱలతో విసరుకొనవలసిన పని నిలిచిపోయెను దూరముగఁ బోయి యున్నవారు తమ యిండ్లు చేరిరి. రాజులు దండయాత్రలు చాలించి వారివారి యూళ్లయందే నిల్చిరి.

ఉ. మానసవాసలాలసస♦మంచితహంసలు దాఁగె నెందునో
మానుగఁ జక్రవాకములు ♦ మంజులరీతిఁ బ్రియాప్తి రాజిలెన్
బూనిక నేకధారగను ♦ బోరున పాములు వ్రేలునట్లుగా
వానలు రేఁగ సాగ విఁక ♦ బాటలలోఁ బయనింప బండ్లపై. ౭౧౪

మానసవాస = మానస సరస్సునందు వసింప- లాలస = కోరికచే; సమంచిత= ఒప్పుచున్న- హంసలు = అంచలు.

తాత్పర్యము.

మానస సరస్సునందు వసింపఁ గోరికగల హంసలు సంచారములు మాని యెందెందో దాఁగెను. (వర్షాకాలమున హంసలకుఁ గీడు, నెమిళ్ళకు మేలు.) చక్రవాక పక్షులదంపతులు తమ ప్రియులు లభించుటచే మనోహరముగ సంతోషముతోఁ బ్రకాశించెను. (చక్రవాక దంపతులకు రాత్రులందు వియోగము) మేఘములనుండి భూమి వఱకుఁ దెంపులేక యొక్క-ధారగాఁ బాములను వ్రేలఁ దీసినట్లు వానలు కురియుటచే బాటలలో బండ్లమీఁదఁ జేయు ప్రయాణములు సాగవు.

చ. అనఘ! క్వచిత్ప్రకాశ మయి ♦ యభ్ర మదే క్వచిదప్రకాశ మై
కనఁగఁ గ్వచిత్క్వచిత్కుధర♦కాండనిరుద్ధము నై తరంగచా
లన రహితాబ్ధిపోలికఁ జె♦లంగెను; సర్జకదంబపుష్ప మే
ళన మయి శైలధాతుతతు♦లన్ నిబిడారుణ మై నదీతతుల్. ౭౧౫

అభ్రము = ఆకాశము- క్వచిత్ప్రకాశము = కొంచెముగాఁ బ్రకాశించునది- మేఘము లేనిచోట నని భావము- క్వచిదిత్యాదులకు నాంధ్రంబునఁ బ్రత్యేక ప్రయోగము లేదు. గాని సంస్కృత శబ్దమునకో తత్సమశబ్దమునకో విశేషణముగఁ బ్రయోగించుట గలదు-కచిదప్రకాశమై=ఒక్కచో మేఘములు గ్రమ్మి యుండుటచేఁ బ్రకాశము లేనిది- క్వచిత్ + క్వచిత్ + కుధరకాండ నిరుద్ధము = ఒక్కొకచోటఁ బర్వతములచే నడ్డగింపఁబడినది- తరంగచాలన=అలల కదలికలు- రహిత=లేని- అబ్ధిపోలిక= సముద్రమువలె- సర్జ=మద్దిపూలతో- కదంబ = కడపపూలతోను- మేళనమై =

కలసినదై - శైలధాతుతతులన్ = కొండల ధాతువులసమూహములచే- నిబిడారుణమై= దట్టమగు నెఱ్ఱనికాంతి కలదై- సర్గ మొదలు పై పద్యముతో నన్వయము-

తా త్ప ర్య ము.

లక్ష్మణా! ఆకాశమును జూడుము. మేఘములు లేనిచోట నజ్ఞాన రహితుని బుద్ధివలె విశదముగాఁ బ్రకాశించుచున్నది. ఒక్కచోట నజ్ఞాని బుద్ధివలెఁ బ్రకాశము లేక యున్నది. మోహభ్రాంతుని చిత్తమువలె నొక్కొక్కచోటఁ బర్వతములచే నడ్డగింపఁబడి యున్నది. ఒకొక్కచోట సందిగ్ధరహితుని చిత్తమువలె శాంతమై యలలులేని సముద్రమువలె నున్నది. మద్దిపూలతోను కడపపూలతోను గలిసి గైరిక ధాతువులచే మిగుల నెఱ్ఱనై నదులు.

తే. కేకికేకానుయాతముల్ ♦ ప్రాకటముగఁ, గ్రొత్తనీళ్ళను వహియించి♦రోకు మీఱ
దూఁకుచును బాఱుచున్నవి ♦ తోరమైన, వేగమునఁ గంటివే సువి♦వేకధన్య!

కేకి = నెమిళ్ళుల- కేకా = కూఁతలచే- అనుయాతముల్ = అనుసరింపఁబడి నవి- రోకు = రోషము- దీనికి వికాస మనియు నర్థము గలదు.

తా త్ప ర్య ము.

నెమిళ్ళధ్వనులచే ననుసరింపఁబడినవై - (అనఁగా నేటినీళ్ళ దూఁకు చప్పుడు మేఘధ్వని యని నెమిళ్లు సంతోషముతోఁ దామును గూయుచున్న వని భావము) క్రొత్తనీళ్లు గలవై రోషముతో దూఁకినట్లు దూఁకుచు మిగుల వేగమునఁ బాఱు చున్నవి చూచితివా-

కొండఱు భగవద్భక్తులు తాము సాత్త్విక రాజసజ్ఞాన మిశ్రమయి భగవంతుని యెడ నతి ప్రేమ నుంచిన మనస్సుతోఁగూడి మఱికొండఱు భగవంతుని దగ్గఱ స్తోత్రముచేయుచు శబ్దించుచుండఁగా నున్నట్టి స్థితి యిందు సూచితమని గోవింద రాజీయము.

తే. సారతరరసయుత మయి ♦ షట్పదములఁ, బోలు నేరేడుపండ్లను ♦ గాలికతన
నవని వ్రాలిన పలువన్నె♦లగు విపక్వ, చూతఫలముల భుజియింత్రు♦ చూవె జనులు.

సారతర = మిగుల సారముగల- రసయుతము = రసముతోఁ గూడినవి- షట్పదములన్ = తుమ్మెదలను- విపక్వచూత ఫలములన్ = కలమాగిన మామిడి పండ్లను.

శ్రావణ భాద్రపదములందు మామిడికాయలు పండ్లెక్కడి వని సందేహింప రాదు. కొన్ని చెట్లాకాలమందును గాయును. కొన్నిచెట్లు సంవత్సరమునకు రెండేసి మార్లు కాయు నని యీ వ్యాఖ్యాత చూచియున్నాఁడు. చెన్నపురియందు అకాల మున విక్రయమునకు వచ్చుచుండును.

తా త్ప ర్య ము .

మిగుల సారవంతమైన రసముతోఁగూడిన వగుటచే నల్లనై మెఱుఁగు లీనుచు

దుమ్మెదలఁబోలు నేరేడు పండ్లను, గాలి కారణమున భూమిమీఁదవ్రాలిన పెక్కు రంగులుగల కలమాగిన మామిడి పండ్లను లోకులు భుజింతురుసుమా.

తే. ప్రకట మైన బలాకమా॰లికలతో డ, మించుఁ డెక్కెంబుతోఁ గొండ॰మేల్మిఁ దాల్చి
రణతలంబున నున్న వా॰రణములట్లు, గర్జ లిడు చున్న వవిగో మే॰ఘంబులెల్ల.

బలాకమాలికలతోడన్ = కొంగలవరుసలతో- ఇది గజముల నక్షత్రమాలా స్థానీయము- మించు టెక్కెంబు=మెఱు పను ధ్వజము- కొండ మేల్మిన్ = ఆకారమునఁ గొండ గొప్పతనమును- వారణములు = ఏనుఁగులు.

తాత్పర్యము.

ప్రకాశముగాఁ గానవచ్చు కొంగలచాలులను నక్షత్రమాలలఁ దాలిచి మెఱుపులను టెక్కెములు గలవై, ఆకారమునఁ గొండవంటి గొప్పతనముగలవై యుద్ధ రంగమున నున్న యేనుఁగులవలె మేఘము లన్నియు గర్జ లిడుచున్నవి.

క. యవసము జడిఁ దని వొందఁగ, లిప గొనుచును నెమిలిపిండు ♦ లీల నటింపన్
దవ వర్షింపఁగ మబ్బులు, నవురుగ నపరాహ్ణవేళ ♦ జా నయ్యె వనుల్. ౭౧

యవసము = లేఁతకసవు- జడిన్ = వానచే- తనివు = తృప్తి- లిప = చేవ- అపరాహ్ణవేళన్ = మధ్యాహ్నము మీఁదటికాలమున- జానయ్యెన్=అందగించెను.

తాత్పర్యము.

పచ్చిక వానకుఁ దడిసి పసరెక్కఁగా నెమిళ్ళగుంపు విలాసముగా నాట్య మాడఁగా మబ్బులు వర్షింపఁగా నపరాహ్ణకాలమున నడవు లందముగా నున్నవి.

పగటి నాలుగవభాగమునకు నపరాహ్ణ మనిపేరు- ప్రాతము-సంగవము- మధ్యాహ్నము- అపరాహ్ణము- సాయాహ్నము అని పగ లైదుభాగములు.

దివ్యదంపతులైన లక్ష్మీనారాయణులు తమ చేతులార నీరుపోసి పెంచిన తోఁటవలె నున్న యీ లోకము వారికి వారి కృపాతిశయముచే సకలార్థములు సిద్ధించు ననుట సూచితము- గోవిందరాజీయము.

క. సలిలాతిభార మొదవఁగ, జలధరములు గర్జ లిడుచు ♦ సబలాకముగా
బలితపుగిరిశిఖరంబుల, నిలిచి నిలిచి లేచి పోవు ♦ నెటఁ గనుఁగొంటే. ౭౨

సలిలాతిభారము = నీళ్ళయొక్క యెక్కువ బరువు- జలధరములు = మేఘములు- సబలాకముగా = కొంగలతో- నెటి = అందము.

తాత్పర్యము.

ఎక్కువ నీటిబరువు గలుగఁగా మేఘములు గర్జించుచు కొక్కెరలతో బలిష్ఠము లైన కొండలపేటులందు నిలిచి నిలిచి లేచిపోవుచున్నవి చూచితివా?

పూర్ణగర్భిణులైన స్త్రీలు (లేక బరువులు మోయు కూలివాండ్రు) పర్వతము లెక్కునట్లు ఈ మేఘము లచ్చట నచ్చటఁ గూర్చుండి కూర్చుండి లేచిపోవుచున్న వని భావము.

హృదయమున భగవంతుని ధ్యానించుచు జ్ఞానవైశద్యముచే భగవంతుని సదా స్తుతించుచుఁ బూర్వోత్తరాఘక్లేశములు దిన్న దిన్నగా దాఁటి మోక్షమును జెందిన భగవద్భక్తు లిందు సూచితము.

తే. గర్భధృతికని మేఘాభి♦కాము మగుచు, దండ కేగకు కొక్కెర♦పిండు మింటఁ
గట్టఁబడి మారుతాహతిఁ ♦ గదలు చున్న, వెల్లదామరసర మన ♦ వెలసెఁ గంటె.

గర్భధృతికిని = గర్భము ధరించుటకై, మేఘాభికాము మగుచున్ = మేఘములఁ గామించునవి- దండకున్ = సమీపమునకు- మారుతాహతిన్ = గాలిదెబ్బచే.

తాత్పర్యము.

గర్భధారణము గోరి మేఘములఁ గామించి వానియొద్దకుఁ గొక్కెరలు పోవుచున్నవి. అవి కూర్పఁబడి మింటఁగదలుచున్న తెల్లదామర పూవులసర మన్నట్లున్నది చూడుము.

ఉ. పెల్లుగ నింద్రగోపముల♦పిల్లలు రాలఁగ నిందు నందు భ్రా
జిల్లెడి లేఁతపచ్చికల♦సీమలసొంపున ధాత్రి శోభిలెన్
మొల్లపుపెట్టుపట్టునను ♦ మొగ్గ కసీదను గుట్టఁ గాంతి రా
జిల్లెడి చిల్కపెక్కజిగి♦చీరను దాల్చిన కాంతయో యనన్. ౭౩

ఇంద్రగోపముల = ఆరుద్రపురుగుల- రాలఁగన్ = వానచినుకులవెంట నాకాశమునుండి పడఁగా- భ్రాజిల్లెడి = ప్రకాశించెడి- శోభిలెన్ = ప్రకాశించెను- కసీద = పట్టువస్త్రములమీఁద రంగుల పట్టుదారములతో నానాకారములతో జేయు కుట్టుపని. (Lace)

తాత్పర్యము.

దండిగ నారుద్రపురుగు లచ్చట నచ్చట నాకుపసరు లేఁతపచ్చికమీఁద రాలఁగా భూమి మెట్టుపట్టుతో మొగ్గలుగా కసీద కుట్టఁగాఁ బ్రకాశించు చిలుక పచ్చవన్నె చీరకట్టుకొన్న స్త్రీనలె నున్నది.

దీని మూలశ్లోకము - బాలేంద్రగోపాంతర చిత్రితేన విభాతి భూమి ర్నవ శాద్వలేన। గాత్రానువృత్తేన శుకప్రభేణ। నారీవ లాక్షోక్షిత కంబళేన॥ ఈ శ్లోకమును దెనిగింపఁబూనిననా డుదయము మొదలు సాయంకాలము నాలుగుగంటలవఱకు నెంత ప్రయత్నించినను బద్యము పాదమైనను సాగినదికాదు. దినమునకు విరామము కోలఁదినేఁబది పద్యములుకూడవచ్చునది యెంతప్రయత్నించినను నీసామాన్యపద్యము వ్రాయ పాకక రాలేదు. రామచంద్రమూర్తి దయ తప్పినదని యీకార్యముచేయ మన కిక నధికారము లేదని విసిగి రామాయణమును గాగిదములు తీసికొనిపోయి స్వామి ముందుంచి, నీవు వ్రాయించినంతవఱకు వ్రాసితిని- నీ యనుగ్రహము దప్పినది. నీ పుస్తకము నీవు తీసికొమ్మని చెప్పి యాయనముం దుంచి సాష్టాంగనమస్కారము చేసి తన గదిలోనికి వచ్చి యీ గ్రంథకర్త హాయిగఁ గూర్చుండెను. ఆవల రెండు

నిమిషములకుఁ దనంతఁ దానే యీ పద్యము వచ్చెను. భగవంతుని కరుణ గలదు. అహంకర్తృత్వాభిమానము నాఁప నిట్లు చేసెనని తలఁచి యా పుస్తకములు దెచ్చి కొని దీనిని నోరవచ్చినది వచ్చినట్లు గ్రంథమున వ్రాసెను. ఇంత గ్రంథమునందు దీనివలెఁ గష్ట మిచ్చినది వేఱొకదియులేదు- దైవచిత్రము.

క. క్రిన్న నది కడలిఁ బాఱెను, బన్నుగఁ గొక్కెరలు మేఘ♦పటలముఁ దార్కెన్
వెన్నుఁడు నిద్దురఁ గూరెను, జెన్నగు కాముకయుఁ బ్రియుని♦చెంతం జేరెన్. ౭౨౭

క్రిన్న = వేగముగ- కడలిన్ = సముద్రము నుద్దేశించి- తార్కెన్ = సమీపించెను- వెన్నుఁడు = విష్ణువు- ఆషాఢమున నేకాదశి మొదలు విష్ణువు పాలసముద్రమున యోగనిద్ర (నిద్రారూపక యోగము) యందుండును. కార్తిక శుద్ధైకాదశి మేలుకొనును.

తా త్ప ర్య ము.

వేగముగ నది తనభర్తయైన సముద్రమును జేరఁ బ్రవహించెను. కొక్కెరలు గర్భార్థము మేఘముల సమీపించెను. విష్ణువు యోగనిద్రఁగూరెను. కాముక ప్రియుని యొద్దఁ జేరెను.

శ్రీమన్నారాయణుండు లోకోజ్జీవనార్థమై తదేకచిత్తుఁడై యుండుటయు, భగవంతుని శేషభూతులైన లోకులు శేషియగు భగవంతునెడఁ గనఁబఱుచు పారతంత్ర్యము నిందు సూచితము- గోవింద రాజీయము.

క. చెలఁగె నెమిళ్లులయాటలు, కలిగెఁ గదంబముల విరులఁ♦ గ్రాలెడి కొమ్మల్
వెలిఁగె మహి సస్యవనముల, మెలఁగె సమప్రీతి నాలు♦ మే లగుకోడెల్. ౭౨౮

తా త్ప ర్య ము.

నెమిళ్లులయాట లతిశయించెను. కడపచెట్లయందుఁ బూలతోడి కొమ్మలు కలిగెను. భూమి పైరులచే నొప్పెను. ఆవులందుఁ గోడెలకుఁ గోడెలందు నావులకు సమానప్రీతి యుదయించెను.

ఉ. ఆడెను, జింత వాడెఁ, దొలఁ♦కాడెను, బాడెను, జంచలత్వముల్
వీడెను, జాలు గూడె సర♦విన్, వడి నూడనిఁ బాడె నయ్యెడన్
వేడుక నెమ్మిలున్ విరహి♦ణీనిచయమ్ములు, సద్వనమ్ములున్
జోడుగజమ్ములుం, గపులు, ♦ బోరని వానలు నెల్లవాఁకలున్. ౭౨౫

పూర్వార్థములోని క్రియ లుత్తరార్థములోని కర్తలతోఁ గ్రమముగ నన్వయించుటచే యథాసంఖ్యాలంకారము. తొలఁకాడెను, ఇది శబ్దపల్లవము. తొలఁకు+ఆడెను అని పదచ్ఛేదము- తొలఁకిఆడె ననుభేదము సరిగాదు-ప్రకాశించెను- ఊడనిఁబాడెన్ = పరువెత్తెను, ప్రవహించెను- నెమ్మిలు = నెమిళ్లు - విరహిణీనిచయములు = భర్తలొద్దలేనిస్త్రీలు- జోడు = దంపతులగు- వాఁకలు = వంకలు.

తా త్ప ర్య ము.

నెమిళ్లాడెను. భర్తలవిడిచి యుండుస్త్రీల చింత శుష్కించెను. వనమ్ములు ప్రకాశించెను. ఏనుఁగు దంపతులు పాడెను. స్రోతులు చపలత్వము వదలెను. (వానికిఁ గావలసిన యాహార మొకచోటనే దొరకుటచే నని యెఱుంగునది) వానలు ధారలుఁగాఁ గురిసెను, వంకలు పాఱెను.

ఉ. ఎత్తినవేడ్కతోడ సెల•యేఱులపొంతలఁ గ్రొంతలర్ మదం
బెత్తినహత్తిమొత్తములు • నెంతయుఁ గేదఁగిపూలవాసనల్
కుత్తుకబంటి గ్రోలి గిరి•కూటపతజ్ఝరిమ్రోఁత కుల్కుచున్
మత్తనటచ్ఛిఖావలస•మాజముతో ధ్వని నించు దిక్కులన్. ౭-౨౯

హత్తి = ఏనుగుల- మొత్తములు = గుంపులు- కేదఁగి = మొగలి- కుత్తుకబంటి = గొంతువఱకు వచ్చునట్లు- గిరికూట = పర్వతశిఖరములనుండి- పతత్ = పడుచున్న- ఝరి = సెలయేళ్ల- ఉల్కుచున్ = భయపడుచు- మత్త = మదించిన నటత్ = నటించుచున్న, శిఖావల = నెమిళ్ల- నించున్ = నిండించును.

తా త్ప ర్య ము.

అతిశయించిన సంతోషముతో సెలయేళ్ళ సమీపములందుఁ గొండల సందుల మదించిన యేనుఁగు గుంపులు మొగలిపూలవాసనలు కుత్తుకవఱకు ద్రావి కొండ శిఖరములనుండి పడు సెలయేళ్ళ ధ్వని కులికిపడుచు మదించి నటించు నెమిళ్ళగుంపులతో దిక్కులు నిండునట్లు ధ్వనించుచున్నవి.

ఉ. ఇమ్మగఁ బూవుఁ దేనియల•నిచ్ఛకొలందిని ద్రావుచున్ నిమే
షమ్మున మత్తు గాంచు నళి•సంఘము లిప్పుడు వర్షధారచే
గమ్మనఁ దాడితమ్మయి ది•గాలనఁ గాఁద్రుడుచుం గదంబపుం
గొమ్మల వ్రేలుచున్నయవి • కోల్పడి యెల్లమదంబుఁ జూచితే. ౭-౩౦

అళిసంఘము = తుమ్మెదగుంపు, తాడితమ్ము = కొట్టఁబడినది, మత్తు = మైకము, మైమఱపు, దిగాలనన్ = తటాలునవచ్చిన దిగులుచే, కాఁద్రుడుచున్ = కలఁతపడుచు, కోల్పడి = కోలుపోయి, పోఁగొట్టుకొని.

తా త్ప ర్య ము.

వసంతర్తువునందు దండిగాఁ బూచిన పూవులయందలి తేనియలను దమ యిష్టప్రకారము కోరిక దీరఁ ద్రావి యల్ప కాలములోనే సొక్కుచున్న తుమ్మెదల గుంపు లిపుడు తేనెలు లేకుండుటయేగాక వర్షధారల వేగముచేఁ గొట్టఁబడి దిగులుచేఁ గలవరపడి మఱియెక్కడఁ దేనెలు దొరకమిచేఁ గడప చెట్లకొమ్మలయందు మదమంతయు సమయఁగా వ్రేలాడుచున్నవి.

దండిగ ధనార్జన మున్న సమయమున నొడలు తెలియక తప్పఁద్రావి స్వేచ్ఛా విహారముల నున్నవారు సంపాదన ముడిగి దారిద్ర్యము పీడించుటయే గాక

యప్పులవారు పట్టి కొట్టఁగా దిగులుపడి యేమిచేయుటకు లేక యే యమ్మయైన నింత బిచ్చము పెట్టునాయని దేవురులాడు తాగుబోతుల దశ సూచితము.

క. చిప్పిల్ల రసము చల్లని, నిప్పులపొడిచాయ విరిసి ♦ నేరెడుపండుల్
కప్పఁగఁ దేఁటులదాఁటులు, కప్పినగతి జంబుతరులఁ ♦ గ్రాలెడిఁ గొమ్మల్. 2౨౮

రసము చిప్పిల్ల = రస ముబికి వచ్చుచుండగా- చల్లని నిప్పుల = బొగ్గుల - పొడిచాయ = సన్నని తునుకల కాంతితో, విరిసి = అతిశయించి - నేరేడు రూ. నేరెడు- తేటుల దాఁటులు=తుమ్మెదల గుంపులు- జంబుతరులన్=నేరేడుచెట్లయందు.

'ద్విహీనం ప్రసవే సర్వ'మ్మను ననుశాసనముఁబట్టి జంబు అని హ్రస్వరూపము.

తా త్ప ర్య ము.

రసముబికి వచ్చుచుండఁగా బొగ్గులవలె నల్లనైన నేరేడుపండ్లు విస్తరించి కప్పుకొనఁగా తుమ్మెదలు కప్పుకొన్నట్లు నేరేటిచెట్లున్నవి చూడుము.

క. సౌదామనీపతాకము, మేదురగంభీరరవము ♦ మేకొనఁగ సమి
న్మేదిని నుద్వృత్తగజముల, మాదిరిఁ గనుపట్టెఁ గనితె ♦ మబ్బులు మింటన్. 2౨౯

సౌదామినీ పతాకము = మెఱపను ధ్వజము- మేదుర= దట్టమైన- సమిత్ + మేదిని=యుద్ధభూమి యందు, ఉద్వృత్ + గజముల = యుద్ధమునకై బయలుదేఱు నేనుఁగుల- మాదిరి = వలె- రూ. మాద్రి.

తా త్ప ర్య ము

మెఱుఁగు లను ధ్వజములు గలిగి మిక్కిలి గంభీరమైనధ్వనితో యుద్ధభూమి యందు బయలుదేఱు నేనుఁగులవలె నాకాశమున మబ్బులున్నవి చూడుము.

ఈ యభిప్రాయము 2౧౮ వ పద్యమందుఁ గలదు. అయినను ఆదరాద్ద్విరుక్తి యని మఱలఁ జెప్పఁబడెను.

ఉ. శైలవనానుసారి యయి ♦ సత్పథమం దొకనాగ మేగుచో
నోలిఁ బిఱుంద నొండు స్తని♦తోదయ మాటయు నాలకించి తా
హాళిని యుద్ధకామ మయి ♦ యచ్చటఁ జీరె నొకండు దంతి యం
చాలము సేయఁగా మరలె ♦ నా ద్విరదంబును జూడు లక్ష్మణా! 230

శైలవన+అనుసారి= కొండల, నడవుల ననుసరించి పోవునది- సత్పథమందు= మంచిమార్గమందు- నాగము = ఏనుఁగు-పిఱుందన్= వెనుకవైపు- స్తనితోదయము= మేఘధ్వనిపుట్టుట- దంతి = ద్విరదము = ఏనుఁగు; భ్రాంతిమదలంకారము.

తా త్ప ర్య ము.

కొండ యడవులవెంటఁ దా నున్నచోటికి సరియగుమార్గమున నొక యేనుఁగు పోవుచు వెనుకప్రక్క నుఱుమఁగా నాధ్వని తన్ను యుద్ధమునకుఁ బిలిచిన వేఱొక యేనుఁగు ధ్వని యని భ్రమించి దానితో యుద్ధముచేయుటకై వెనుకకు మఱలెను. ఆ యేనుగును జూడుము,

తన పాండిత్యబలమున విమతస్థుల జయించి తన స్థానమునకై పోవువాఁడు మఱియొకఁడు తన్ను వాదమునకుఁ బిలువఁగా వానితో వాదింప మరలిన విషయము సూచితము.

క. ఆడెడిభంగిని గొన్నియుఁ, బాడెడిగతిఁ గొన్ని మత్త♦భరమునఁ గొన్నిన్
జూడఁగఁ బలు తెగల వనుల్, వేడుక శిఖిమధుపకరుల♦వృత్తులనొప్పెన్. 23౧

శిఖి = నెమిళ్ళయు, మధుప = తుమ్మెదలయు, కరుల = ఏనుఁగులయు, వృత్తులన్ = నడవడులచే.

తాత్పర్యము.

వనములు కొన్ని నెమిళ్ళవలె నాడుచున్నవి. కొన్ని తుమ్మెదలవలెఁ బాడుచున్నవి. కొన్ని యేనుఁగులవలె మదించియున్నవి.

క. లలితకదంబార్జునకం,దళరుచిరము నూత్న వారి♦తతపూర్ణంబుల్
గలితమదశిఖావలనృ,త్యలసిత మయి పానశాల♦యన వని యొప్పెన్. 23౨

లలిత = మనోహరమైన, కదంబ = కడపచెట్లయు, అర్జున = మద్దులయు, కందళ = మొలకలచే, రుచిరము = మనోహరము, మద = మదించిన, శిఖావల = నెమిళ్ళయొక్క, నృత్య = నాట్యముచే, లసితము = ప్రకాశించునది. పానశాల = కల్లంగడి, మద్యపానముచేయుస్థలము, దీనియందు నందమునకై వాసనకై పూలు చల్లఁబడియుండును. మద్యము కుండలనిండి యుండును. కైపెక్కినవా రాడుచుందురు.

తాత్పర్యము.

మనోహరములైన కడప, మద్ది, పీనిపూలచేతను మొలకలచేతను మనోహరమై క్రొత్తనీళ్ళు దండిగఁగలవై బాగుగ మదించిన నెమిళ్ళయాటలుఁగలవై యడవులు కల్లంగడులవలె నున్నవి.

తే. శక్రదత్తంబులగుచును♦స్వచ్ఛములయిముత్తెములఁ బోలుబిందువుల్♦మోదమునను
బత్రపుటలగ్నములను బి♦పాసఁ గ్రోలు బహుళవర్ణచ్ఛదము చక్ర♦వాక సమితి.

శక్రదత్తంబులు = ఇంద్రునిచే నీయఁబడినవి, పత్రపుటలగ్నములను = ఆకుదొప్పలయందుండునవి, పిపాసన్ = దప్పిచే, బహుళవర్ణచ్ఛదములు = పెక్కు రంగుల ఱెక్కలు గలవి. సమితి = సమూహము.

తాత్పర్యము.

వర్షాధిదేవతయగు నింద్రునిచే నీయఁబడి తెల్లనై మంచిముత్తెములఁ బోలుచున్న నీటిబిందువులను దప్పిదీర సంతోషముతోఁ బలురంగుల ఱెక్కలుగల చక్రవాకములు ఆకు దొప్పలయందుఁ ద్రాగుచున్నవి.

తే. భ్రమరతంత్రీలతామధు♦రస్వనంబు, కప్పలొండొంటి మించెడి♦కంఠతాళ
మంబుదమృదంగనాదంబు ♦ లింబుమీఱఁ, గాననంబుల సంగీత♦కంబు వెలసె.

భ్రమర = తుమ్మెదలనెడి - తంత్రీలతా = తీగెలవంటి తంత్రులయందుఁ

బుట్టిన, మధుర స్వనంబు = మనోహరధ్వని- అంబుద = మేఘములనెడి - మృదంగ నాదంబు = మద్దెలధ్వని - సంగీతకంబు = సంగీతగోష్ఠి.

తాత్పర్యము.

తుమ్మెదల ఝంకారము వీణాతంతుల ధ్వనిగా, కప్పకూఁతలు కంఠతాళము లుగా - మబ్బుల యుఱుములు మద్దెల ధ్వనులుగా నడవులయందు సంగీతగోష్ఠి జరుగు చున్నది.

తే. కొన్ని నెమిళులు పాడంగఁ ♦ గొన్ని యాడఁ, గొన్ని నిలువంగఁ జెట్టుల ♦ కొమలకొనలఁ
గొన్ని వ్యాలంబబర్హ భూ ♦ షోన్నతములు, గా వనంబుల సంగీత ♦ కంబు వెలసె. ౨౩౧

వ్యాలంబ = వ్రేలాడుచున్న - బర్హ = నెమలిపింఛెము లనెడి, భూషోన్నత ములు = ఆభరణములచే గొప్పవి.

తాత్పర్యము.

సంగీతగోష్ఠియందుఁ గొందఱు పాడుదురు, కొందఱు చూచుచుందురు. కొంద ఱలంకరించుకొని యుందురు. అట్లులే కొన్ని నెమిళ్ళు పాడఁగాఁ గొన్ని యాడఁగాఁ గొన్ని చెట్లకొమ్మల కొనలయందు నిలువఁగా నెమలి పింఛెము లను నా భరణములచే సింగారింపఁబడి వనములందు సంగీతగోష్ఠి జరుగుచున్నది.

క. మబ్బుల యుఱుములఁ గప్పలు, నిబ్బరమగు దీర్ఘకాల ♦ నిద్రను విడి పే
రుబ్బున నానాధ్వను లా, గుబ్బతిలన్ వానధార ♦ కున్ మోదించెన్. ౨౩౮

ఆగుబ్బతిలన్ = అతిశయింపఁగా - "కోరుకు లాగుబ్బతిలంగఁ జూచె నలకూబర సన్నిభు నద్ధరామరున్" అను మనుచరిత్ర.

తాత్పర్యము.

చాలఁగాలముగ నిద్రపోవుచున్న కప్పలు మేఘముల యుఱుములకు మేలు కొని మిగుల సంతోషముతో నానావిధములైన ధ్వను లతిశయింపఁగా వానధారల వలన సంతోషించెను.

చ. కులుకుమెఱుంగుజక్కవ ల ♦ కుంఠమదంబునఁ గ్రాల, నుర్లు నొ
డ్డులను నతిక్రమించుచుఁ గ ♦ డున్ మద మెత్తఁగఁ బుష్పముల్ ఫలం
బుల నుపహారముల్ గొనుచుఁ ♦ బోయెడిఁ బో తటినీనవోఢలున్
గెలవునఁ దూర్ణయానములఁ ♦ గేరుచుఁ బ్రాణవిభుం గనుంగొనన్. ౨౩౯

ఇందుఁ దమభర్త సంగమముగోరి పోవు నధికకామవతులకు నదులకుఁ బోలిక చెప్పబడుచున్నది.

అకుంఠ = కొఱఁతలేని- ఉర్లు = పడుచున్న- తటినీనవోఢలన్ = ఏఱులనెడి వయస్సుస్త్రీలను- కెలవునన్ = కామాసక్తితో- రమించుకోరికతో- తూర్ణయాన ములన్ = తొందర ప్రయాణములచే- కేరుచున్ = ఉత్సహించుచు- ప్రాణవిభున్ = భర్తను- నాయిక = అభిసారిక- ఉపహారములు = కానుకలు, జక్కవలకు స్తనముల

కుపమానము- ఉర్లనొడ్డుల నతిక్రమించుననుటచే లజ్జాత్యాగముచే నడ్డమువచ్చినవారి నతిక్రమించి పోవుట చెప్పఁబడెను.

తా త్ప ర్య ము.

మెఱుఁగెక్కి కులుకుచున్న జక్కవలు నిండుమదంబున నొప్పుచుండఁగా దొరలుచున్న గడ్డలను దాఁటుకొని మిక్కిలి మదించినట్లు పూలు పండ్లులోనగు కాను కలు తీసికొని నదు లను పౌఢస్త్రీలు సంభోగాసక్తిచే శీఘ్ర ప్రయాణముల నుత్సాహ ముతోఁ దమభర్తయగు సముద్రు నొద్దకుఁ బోవుచున్నవి.

తే. కాలుకొండలతో బద్ధ♦మూలము లయి, కాలుకొండలమాడ్కి ని ♦ నీలమేఘ
పటలసంసక్తములు నవ♦వారిపూర్ణ, జలదములు నీలకాంతుల ♦ జానుమీఱె. ౨౩౮

నీలమేఘ = నల్లని మబ్బులయొక్క- పటల = సమూహములతో - సంసక్తములు = కూడినవి. నవవారి పూర్ణ జలదములు = క్రొత్త నీటితో నిండిన మేఘములు, జాను మీఱెన్ = అందగించెను. బద్ధమూలములు = కదలక స్థిరముగా నుండునవి.

తా త్ప ర్య ము.

కాలుచున్న కొండలతో స్థిరముగఁ బాఁదుకొన్న కొండలును గాలిపోవునట్లు నల్లని మబ్బుల గుంపులతోఁగూడిన క్రొత్తజలములచే నిండిన మబ్బులు నీలకాంతులచే బ్రకాశించుచున్నవి. కారుచిచ్చుచేఁ గాలిన కొండలు నల్లగానుండును. వానితోఁగలసి నవి వానివలెనే నల్లగా నుండును. అట్లులే మేఘములు నని యెంచునది.

తే. ఉబ్బి కేకలు వైచు మ♦యూరతతులు, శక్రగోపసమన్విత♦శాద్వలములు
హారివాసన లీను నీ♦పార్జునములు, గ్రాలువనులందుఁ జరియించెఁ ♦ గరులు కెరలి.

మయూరతతులు = నెమిళ్ళ సమూహములు, శక్రగోప = ఇంద్రగోపముల తో, సమన్విత = కూడిన, శాద్వలములు = పచ్చికపట్టులు, నీపార్జునములు = కడప మద్దిచెట్లు, కెరలి = విజృంభించి.

తా త్ప ర్య ము.

సంతోషముచేఁ బొంగి కేకలువైచు నెమిళ్ళు, ఆరుద్ర పురుగులతోఁగూడిన పచ్చికనేలలు మంచివాసనలు వ్యాపింపఁజేయు కడప మద్దిచెట్లుగల వనములందు నేనుఁ గులు విజృంభించి తిరుగుచున్నవి.

చ. నిరవధికాంబుధారలను ♦ నీటు దొలంగిన కేసరంబులన్
సురుచి దొఱంగి యున్న బిస♦సూనములన్ మధుపాళి వాసి ని
ర్భరరుచి రేద్ధ కేసరధు♦రంబు కదంబకదంబకాళిఁ జె
చ్చెరఁ జని వ్రాలె, హీనదశ ♦ చేకుఱ మైత్రిఁ దలంతె చంచలుల్. ౨౪౦

నిరవధిక = కొలఁదిలేని, అంబు+ధారలను = నీటిధారలచే, నీటు = అందము, కేసరంబులన్ = అకరువులచే, బిససూనములన్ = కమలములచేతను, మధుప+ఆళి=

తుమ్మెదలపంక్తి, నిర్భర = అతిశయమై, రుచిర = మనోహరమై, ఇద్ధ = ప్రకాశించు, కేసరధురంబు = అకరువుల విశేషముగలది, కదంబ = కడపపూవుల, కదంబక = సమూహముల, ఆళిఁ = వరుసలచే, చంచలుల్ = చపలచిత్తులు.

తాత్పర్యము.

ఎడఁదెగక పడుచున్న నీటిధారలచే నందముచెడిన యకరువులను, గాంతిదొలఁగిన కమలములను వదలి తుమ్మెదలు యతిశయకాంతి గల యకరువులచే నిండిన కడపపూవుల గుంపులను వ్రాలెను. తమ మిత్రులకు హీనదశ సంప్రాప్తించినపుడు చంచలచిత్తులు తమ పూర్వస్నేహమును స్మరింతురా - అర్థాంతరన్యాసాలంకారము.

ఉ. ఎంతయు భూరిసమ్మదగ♦జేంద్రము హృష్టిలసద్గవీంద్రముఁ
శ్రాంతమృగేంద్రముఁ రుచిర♦సంపదుదంచితభూధరేంద్రముఁ
దొంతులు మేఘబృందముల♦తోఁ బరిఖేలితనిర్జరేంద్రముఁ
శాంతనరేంద్రముం గనితె ♦ సాదృతి లక్ష్మణ వానకాలమున్. ౨౪౧

భూరిసమ్మద గజేంద్రము = మిగుల సంతోషించిన గజశ్రేష్ఠములు గలది- బహువ్రీహిసమాసము- వానకాలముతో నన్వయము- ఇట్లులే తక్కినవి తెలియునది- హృష్టి = సంతోషముచే- లసత్ = ప్రకాశించు- గవీంద్రముఁ = కోడెలుగలది- శ్రాంత= అలసిన- మృగేంద్రముఁ=సింహములుగలది- రుచిరసంపత్ = మనోహరమైన పుష్పాది సంపదచే- ఉదంచిత = ప్రకాశించు, భూధరేంద్రముఁ = పర్వతశ్రేష్ఠములు గలది- పరిఖేలిత = క్రీడించెడి, నిర్జరేంద్రమున్=ఇంద్రుఁడుగలది- శాంతనరేంద్రముఁ = దండయాత్ర చాలించిన రాజులు గలది- సాదృతి = ఆదరముతో.

తాత్పర్యము.

లక్ష్మణా! యీ వానకాలమున నేనుఁగులు మిగుల సంతోషముచే మదించినవి. ఆఁబోతులు మేఁపు దండిగ దొరకుటచే సంతోషించినవి. సింహములు బడలినవి, పూలు మొదలైనవానిచేఁ గొండలు మనోహరములై యున్నవి. మేఘముల దొంతులతో నింద్రుఁడు డాడుకొనుచున్నాఁడు. రాజులు దండయాత్రలు లేక శాంతపడియున్నారు.

కం. జలనిధిఘోషంబు దిసంతులు గొట్టుచు గగనతలము♦తో రాయుచు నే
ళ్లులఁ గొలఁకుల బావులఁ జెఱ్వుల నేకముఁజేసె మేఘ♦పూగము గంటే. ౨౪౨

దిసంతులు గొట్టుచుఁ = నిందించుచు, మేఘపూగము = మేఘముల సమూహము, మేఘపూగము కర్తృపదము.

తాత్పర్యము.

సముద్రధ్వనిని ఛీకొట్టుచు అనఁగా దానితో సమానమై యాకాశముతో రాసికొనుచు నేళ్ళను గొలఁకులను బావులను జెర్వులను మేఘములు సమానముగఁ జేసెను. అన్నియును సముద్రములవలె నిండియున్నవని భావము.

ఉ. జోరున నేకధారగ వ♦సుంధరఁ బర్వఁగఁ జిమ్మచీఁకటుల్
దోరపువర్షముల్ గురియఁ ♦ దోడయి గాలియు జివ్వు జివ్వునన్
గూ్రిరత వీవఁగా నదులు ♦ కూలము లుర్లఁగఁ బొంగి మెవ్వియో
దారులఁ దప్పుతో్రివల ని♦తాంతరయంబునఁ బాఱె నిమ్మెయిన్. ౭౪౩

తా త్ప ర్య ము.

భూమియందు దట్టపుఁ జీఁకటులు వ్యాపించునట్లు జోరుమని యేకధారగా జడి వానలు కురియఁగా దానికిఁ దోడు జివ్వుజివ్వుమని గాలి కఠినముగా వీవఁగా నొడ్డు లురలిపడునట్లు పొంగి యేఱులు దోవ డొంక లేక పోయినదే దోవఁగాఁ దప్పుత్రోవల మిగులవేగముతోఁ బాఱుచున్నవి.

చ. ధర జనతాభిషిక్తు లగు♦ధారిణినాయకు లాత్మవైభవం
బరుదుగఁ జూపురీతి నమృ♦తాశననాయకదత్తమై మహా
మరుదుపనీతమైన ఘన♦మండలిచే నభిషిక్తమౌచు భూ
ధరతతి గానిపించెడిఁ గ♦దా నిజరూపము శ్రీయుతంబుగన్. ౭౪౪

జనతా = జనసమూహముచే, అభిషిక్తులు = అభిషేకింపఁబడినవారు - అమృతాశననాయక = ఇంద్రునిచే- దత్తమై=ఈయఁబడినదై - మహా = గొప్పదగు- మరుత్=గాలిచే, ఉపనీతము = సమీపమునకుఁ దేఁబడిన- ఘనమండలిచేన్=మేఘ సమూహముచే- భూధరతతి కర్తృపదము.

తా త్ప ర్య ము.

భూమియందు జనులచే నభిషిక్తులైన రాజులు తమ వైభవము లోకులకుఁ గనఁబరుచు రీతిగఁ బర్వతము లింద్రదత్తమై గొప్పవాయువుచే సమీపమునకుఁ దేఁబడిన మేఘ సమూహముచే నభిషిక్తములై శ్రీయుక్తమైన తమ స్వరూపము కనఁబడఁ జేయుచున్నవి.

ఉ. రిక్కలతోడి మిన్ను ఘన♦బృందముచేత ముసుంగుఁ గాంచె, నే
ప్రిక్కన నున్నవాఁడొ కన♦రాఁడు దివాకరుఁ, డీ ధరిత్రియుం
జెక్కువ నీటఁ దృప్తిఁ గొనె♦ బేరిచీఁకటి ముంచె సర్వమున్
దిక్కులు తెల్వి మాసె నెది♦దిక్కొ యెఱుంగఁగరాదు లక్ష్మణా! ౭౪౫

రిక్కలతో = నక్షత్రములతోడి- ఋక్షశబ్దభవము రిక్క- మిన్ను=ఆకాశము- ఘనబృందము చేత = మేఘసమూహముచే; దివాకరుఁడు - సూర్యుఁడు.

తా త్ప ర్య ము.

రాత్రులందు నక్షత్రములతోడి యాకాశము మేఘములను ముసుంగులు ధరించెను. పగళ్ళయందు సూర్యుఁ డే ప్రక్క నున్నాఁడో తెలియలేదు. భూమియో విస్తార జలముచేఁ దృప్తిపొందినది. అన్నిటిని జీఁకటి యావరించెను. దిక్కుల కాంతి మాసి పోయెను. ఏది యే దిక్కో తెలియరాకయున్నది.

చ. తర మిఁడి వారిధారలను♦ ధౌతము లై ధరణీధ్రకూటముల్
కరము విరాజితంబు లయి♦ కాఁగెడి వ్రేలెడి మేలిము త్తెపున్
సరముల పోణిమిం దనరు ♦ శైలతటాగ్రపతత్ప్రపాతకో
త్కరములతోడఁ గంటివె ము♦దంబు ఘటించెను భోగికై వడిన్. ౨౪౯

తరమిఁడి = తరము+ఇఁడి = సాటిలేక- ముక్కులోనగు వానికి వానిలేమిని దెలుపుచో నిడి వర్ణకంబగు-ఉప్పిఁడి మొక్కిఁడిలోనైనవి.సు-వ్యా-తద్ధిత-౩౪ సూ.ధౌతములై-కడుగబడినవై; ధరణీధ్ర= పర్వతముల- కూటముల్= శిఖరములు- కరము= మిక్కిలి- శైలతటాగ్ర = పర్వతశిఖరముకొననుండి- పతత్=పడుచున్న- ప్రపాతక= సెలయేళ్ళ- ఉత్కరము = సమూహము- భోగి = భోగ మనుభవించువాఁడు.

తాత్పర్యము.

సాటిలేని నీటిధారలచేఁ గడుగఁబడి పర్వతశిఖరములు మంచిముత్తెముల సరములవలెఁ దనకొండ శిఖరములనుండి పడు సెలయేళ్ళ సమూహములచే మిక్కిలి యొప్పుచు భోగపురుషునివలెఁ బ్రకాశించుచున్నవి.

ఉ. కొండలనుండి జాఱు నెడఁ ♦ గొండల గుండులు ద్రోవ కడ్డమై
యుండిన వానిఁ దాఁకి వడి ♦ యొప్పఱు నిర్ఝరపాళు లిప్పు డ
దండిగఁ జింది ప్రక్కలను ♦ నవ్యము లయ్యె గుహాళులన్ వినం
బండువుగాఁగఁ బాడు శిఖి ♦ మండలి పాలిటి హారవల్లులై. ౨౫౦

నిర్ఝరపాళులు = కొండవంకల సమూహములు.

తాత్పర్యము.

ఇంతకుముందు కొండలనుండి జాఱుచున్న కొండవంకలు తమకుఁ గొండలగుండ్లడ్డమురాఁగా దాఁటి రాలేక యక్కడనే నిలిచిపోవుచుండెను. అట్టివిప్పుడు వానిని లక్ష్యముసేయక ప్రక్కలకుఁ జింది యచట గుహాలందు విన నింపుగాఁ బాడు నెమిళ్ళకు హారములవలెఁ బ్రవహించుచున్నవి

ఆ. మదనకదనములను ♦ మదవతుల్ సురపురి, ననఁగఁ బెనఁగఁ బెరిఁగి ♦ హారవల్లి
సంఘ ముర్విఁ దెరలు ♦ చందంబు దోఁపఁగఁ, దోయధార లురలెఁ ♦ దోరముగను.

తాత్పర్యము.

ఇంద్రలోకమందు స్త్రీలు రతికేళి దేలు సమయమున వారి మెడలయందలి ముత్యాల సరములు తెగి నేలఁ బడుచున్నవో యన్నట్లు వాననీటిధారలు విశేషించి కానవచ్చుచున్నవి.

కం. వికిరంబులు డాఁగుటచే, ముకుళించెడి నీరజాత♦ములపంక్తులచే
వికసించెడి జాజులచే, సెకవేలుపు గ్రుంకు టాత్మఁ ♦ జింతింపఁ దగెన్. ౨౫౧

వికిరంబులు = పక్షులు, సెకవేలుపు = సూర్యుఁడు.

తాత్పర్యము.

పక్షులు గూండ్లయందు దాఁగుటచేతను, కమలములు ముకుళించుటచేతను, జాజులు వికసించుటచేతను, సూర్యుఁడు గ్రుంకెనని యూహింపవలసియున్నది.

కం. త్రోవ యిది డొంక యిది యని, భావింపఁగ రామ! నడఁగఁ ♦ బగ యెలగోల్ సే
నావిసరము వెనుదీయఁగ, భూవల్లభ దండయాత్ర ♦ పొనుపడెఁ జుమ్మా. ౨౫౦

ఎలగోల్ సేనావిసరము = యుద్ధసైన్యమునకు ముందు పోవు నల్పసైన్యము, వెనుదీయఁగన్ = వెనుకకు మరలిరాఁగా, పొనుపడెన్ = ఉడిగెను.

తాత్పర్యము.

త్రోవ యిది డొంకయిది యని తెలిసికొన వలనుపడమిని, విరోధ ముపశమింప, ముందుగా దోవలు చూచుటకై పోయిన సేన వెనుకకు మరలిరాఁగా రాజుల దండయాత్ర యాఁగిపోయెను.

కం. అనఘా! యీ భాద్రపదం-బున, సామామ్నాయపఠన♦మునకున్ విప్రుల్
ఘనమతు లుపక్రమించెద, రినకుల! యధ్యయనసమయ ♦ మిది యగు కతనన్.

ఈ భాద్రపదంబునన్ = అనుటచే వానకాలమునందు శ్రావణము దాఁటి భాద్రపదము వచ్చెనని దెలియ నాయెను.

తాత్పర్యము.

లక్ష్మణా! యీ భాద్రపద మాసమందు సామవేద పఠనమున కిదియే సమయము గావున బ్రాహ్మణులు సామవేదాధ్యయనము చేయ నారంభింతురు.

కం. గృహకృత్యంబులఁ బో నిడి, మహితపదార్థములగూర్చి ♦ మనభరతుం డ
స్పృహ నాషాఢిమొదల్ వ్రత,సహితుం డయి యుండు నయ్యె ♦ శ్రద్ధాయుక్తిన్.

గృహకృత్యంబులన్=ఇంటిపనులను విచారించుటలు పోనిడి=వదలి, అస్పృహ= సంసారకాంక్ష లేక, ఆషాఢి = ఆషాఢ శుద్ధమున, పున్నమ వ్రతసహితుండయి = చాతుర్మాస్యవ్రతముతోఁ గూడినవాఁడై.

తాత్పర్యము.

ఇంటికార్యములను విచారించుట మాని వ్రతమునకుఁ గావలసిన పదార్థము లన్ని చేర్చుకొని మన భరతుఁడు భోగేచ్ఛ మాని యాషాఢపూర్ణిమ మొదలు శ్రద్ధతోఁ జాతుర్మాస్య వ్రతమును జరుపుచున్నాఁడు గదా.

దీనివలన వర్షాకాల గణనము ఆషాఢ శుద్ధ పూర్ణిమతోనే చాతుర్మాస్యవ్రతము ప్రారంభము అని తెలియనగు.

కం. పురి నుండి వచ్చు నన్నుం, బరికించి యయోధ్యజనము ♦ పరఁగించిన దు
ర్భరరవముం బురిడించుచు, సరయూనది వేగ పాఱు ♦ సరవం బగుచున్. ౨౫౩

పురిడించు = సమానమగు.

తాత్పర్యము.

అయోధ్యవిడిచి వచ్చుచున్నను జూచి పౌరులు గావించిన ధ్వనివలెనే యిపుడు సరయూనది వేగముగ ఘోషించుచుండునుగదా.

ఉ. భావుకమైన యిట్టియెడ ♦ బాధితవైరి సదారుఁ డౌచు సు
గ్రీవుడు రాజ్యభోగములఁ ♦ గ్రీడలు సల్పుచు నుండుఁ గాదె, నే
నో విగతాత్మదారుఁడ సముజ్ఝితరాజ్యుఁడనై నదీతట
క్ష్మావలెఁ గూలిపోయెదఁ గ్రమంబుగ సైఁపఁగరాని యార్తిచేన్. ౨౫౪

భావుకము = శుభము- బాధితవైరి = బాధింపఁబడిన విరోధులుగలవాఁడు- సదారుఁడు = భార్యతోఁ గూడినవాఁడు- విగతాత్మదారుఁడన్ = నా భార్యలేనివాఁడను- సముజ్ఝిత రాజ్యుడన్ =వదలిపెట్టఁబడిన రాజ్యము గలవాఁడను- నదీతటక్ష్మా= ఏటియొడ్డుభూమి = ఏకాకురములకుఁ దత్సమంబున హ్రస్వరూపములేదు. కావున క్ష్మా యనియే ప్రయుక్తము.

తాత్పర్యము.

శుభకరమైన యీ సమయంబున శత్రువునుజయించిన సుగ్రీవుఁడు భార్యతోడ రాజ్యభోగము లనుభవించుచుండునుగదా! నేనో శత్రువును జయింపనైతిని, భార్య యులేదాయె, రాజ్యములేదాయె, కావున నేటియొడ్డు భూమి నీళ్ళవేగమునకుఁ గూలి పోయినట్లు సహింపరాని దుఃఖవేగముచేఁ గూలిపోవుచున్నాను.

క. ఈకారు దుర్గమం బ,స్తోకంబు మదీయహృదయ♦శోకానలమున్
భీకరసత్త్వుఁడు రావణుఁ, డేకై వడిఁ బోర మొందుఁ ♦ గృత్యము మనకున్. ౨౫౫

ఈ కారు = ఈవానకాలము- దుర్గమంబు= కడచిపోవరానిది- అస్తోకంబు = గొప్పది- భీకరసత్త్వుఁడు= భయంకరమైన బలముగలవాఁడు.

తాత్పర్యము.

ఈ వానకాలము దాఁటి జీవించుటయే కష్టసాధ్యము, ఏలన నా మనస్సునఁ గల శోకాగ్ని విస్తారమైయున్నది. ఒకవేళ బ్రదికితినిఁబో రావణుఁడు భయంకరబలము గలవాఁడు- అల్పుఁడుగాఁడు. మనకార్య మేవిధముగాఁ దుదముట్టగలదు.

ఉ. ఏమి యొనర్చువాఁడ ధర♦ణీశ్వర చెప్పు మటంచు వేఁడ శా
ఖామృగనేత మార్గము ల♦గమ్యము లంచును నెన్నినాళ్ళకో
ప్రేముడి భార్యఁ గూడె నని ♦ పెద్దయుఁ బో మన కార్య మంచు నే
నేమియుఁ బల్కనైతి, నతఁ♦డే చనుదెంచెడి యుక్తవేళకున్. ౨౫౬

శాఖామృగనేత = వానరరాజు; సుగ్రీవుఁడు, అగమ్యములు = పోరానివి - ప్రేముడి = ప్రేమగల.

తాత్పర్యము.

వాలివధానంతరము సుగ్రీవుఁడు రాజేంద్రా! నన్నేమి చేయుమనెద రని యడుగఁగా వచ్చునది వానకాలము, త్రోవలా నడువరానివి. సుగ్రీవుఁడా యెన్ని

దినాలకో ప్రేమగల భార్యను గూడినవాఁడు- మన కార్యము చాలఁ బెద్దది. సుకరము గాదు, అని యాలోచించి నీ విట్లు చేయుమని చెప్పక యూరికేఁ బొమ్మంటిని. కార్యము చేయఁదగినవేళ కతఁడు వచ్చును.

క. ఉపకార మెఱుఁగువాఁ డా,కపివర్యుఁడు గాన వేతుఁ ♦ గాలంబునకై
విపులమహానదులయుఁ ద,త్కపినాథు ననుగ్రహంబుఁ ♦ గాంచెడిదాకన్. ౭౪౯
వేతుఁ=వేచుదును- వేచియుండెదను.

తాత్పర్యము.

మనము చేసిన మే లెట్టిదో దానికిఁ బ్రత్యుపకార మెట్లు చేయవలయునో సుగ్రీవుఁ డెఱుంగును. కావున వెడలుపుగల పెద్ద నదులయు నా సుగ్రీవుని యొక్కయు ననుగ్రహము వచ్చుదాఁక కాచియుండెదను. ఏల్లింకవలె, సుగ్రీవుఁడు రావలె, మన కార్యము కావలె, తొందర పడి లాభమేమి ?

క. వీరుం డగు పురుషుం డుప,కారికి మఱు మే లెఱేని ♦ కావించుఁ బ్రతీ
కారముఁ జేయక మఱచెడి, క్రూరుఁడు నొప్పించు సుజన♦కోటులమనమున్. ౭౫౦

తాత్పర్యము.

సుగ్రీవుఁడు ప్రత్యుపకారము చేయునని యేమి నమ్మకమందువా? అట్లు గాదు. వీరుఁ డనఁగా చేయ సామర్థ్యము గల పురుషుఁ డుపకారికిఁ బ్రత్యుపకారము నేవిధముననైనఁ గావించును, గాని మానఁడు. ప్రత్యుపకారము చేయని క్రూరుఁడు సుజనుల మనస్సులను నొప్పించును. అది వానికిఁ గీడు కలిగించును గావున లోకమునకు భయపడి తన మేలు కోరియైనఁ జేయును.

చం. అన విని లక్ష్మణుండు జన♦కాత్మభవాపతితోడ రామ! నీ
వని నటు సర్వ మొప్పెడి వ♦నాటచయాధిపుఁ డర్హవేళఁ దాఁ
బనిఁగొని చేయుసాయమును ♦ వానలు నిల్చెడిదాఁక నోరుపుఁ
గొని యిట నుండు మంత రిపుఁ ♦ గూల్పఁగ నా నని పల్కె నంతటన్. ౭౫౧
వనాటచయ+అధిపుఁడు=క్రోఁతి సమూహముల ప్రభువు.

తాత్పర్యము.

అని రామచంద్రమూర్తి చెప్పఁగా విని లక్ష్మణుఁడు రామచంద్రా! నీవు చెప్పిన దంతయు సత్యము. సుగ్రీవుఁడు సమయము చూచి సహాయము చేయును. గాని చేయక పోఁడు. కావున వానలు నిల్చెడుదాఁక మనమిందే యుందము. ఆవల శత్రుసంహారమునకై ప్రయత్నింతము.

—♦ ౨౯-వ సర్గము. కామపరతంత్రుఁ డగు సుగ్రీవుని హనుమంతుఁడు బోధించుట ♦—

కం. తొలఁగఁగ మెఱుఁగులు మబ్బులు, చెలఁగఁగ హంసారవంబు ♦ శ్రీమంతంబై
మెలఁగఁగ వెన్నెల దిక్కుల, వెలుఁగఁగ వినువీది మిఁగుల♦విమలం బగుచున్.

మెఱుఁగులు మబ్బులు తొలఁగఁగ, హంసారవంబు చెలఁగఁగ, దిక్కుల వెన్నెల శ్రీమంతంబై మెలఁగఁగ వినువీధి విమలంబగుచుఁ వెలుఁగఁగ నని యన్వయక్రమము.

తాత్పర్యము.

మబ్బులు మెఱుఁగులు తొలగిపోఁగా హంసముల ధ్వని వినరాఁగా దిక్కులందు వెన్నెల కాంతిగలదై ప్రకాశింపఁగా నాకాశము నిర్మలమై వెలుఁగఁగా.

సీ. కని మహాభోగభా♦గ్యసమృద్ధుఁ గామైక, పరతంత్రు సజ్జన♦భవ్యమార్గ
దూరగు ధర్మార్థ♦దూరమానసు విని, వృత్తకార్యునిఁ బ్రమ♦దోత్తమాభి
రతనిరతుని మనో♦రథజాలసంప్రాప్తి, రేపగల్ హాయిఁ జ♦రించువాని
దారతోఁ దారతో♦ హారిసదా దార, ఖేలావిలోలుఁడై ♦ క్రాలువాని

తే. నందనంబున బృందార♦కేందుముఖులు, బృందములు గట్టికొలువ ♦ సానందుఁడైన
వాసవునిఁ బోలి విహరించు♦వాని సచివ, వారవిన్యస్తనృపకార్య ♦ భారుఁడగుచు.

హనుమంతుఁడు రామచంద్రమూర్తి భక్తుఁడయ్యును తన స్వామియగు సుగ్రీవుని యాజ్ఞ లేమిని రామునొద్దనే యుండక సుగ్రీవు నొద్దనే యున్నాఁడు. కావునఁ దన ప్రభువు మూలమున సర్వప్రభువగు రామచంద్రమూర్తి కార్యము నెఱవేర్పఁ బూనుచున్నాఁడు. దీనివలన భగవత్కార్యపరుఁడగు భక్తుఁడు సర్వదా స్వామి సన్నిధానమందే యుండవలయు నను నియమము లేదు. లక్ష్మణునివలె నుండి కైంకర్యము చేయుచుండినఁ జేయుచుండవచ్చును. హనుమంతునివలె దూరమం దుండి స్వామికార్యము నెఱవేఱు నుపాయ మాలోచించుచు స్వయముగనో పరులమూలముననో యది నెఱవేర్చుచుండవలెను. అదియును సాధ్యపడనివాఁడు భరతునివలెఁ జేయవలెను. పరులను సేవింపవలసి వచ్చెనేని భగవత్సేవాసక్తిగలవారియొద్ద నుండవలెనుగాని వాలివంటి భగవద్విముఖులయొద్ద నుండరాదు.

కని=చూచి; దీనికిఁ గర్తృపదము ౭౬-౩ వ పద్యములోని సామీరి యనునది. మహాభోగభాగ్య సమృద్ధుఁ- విస్తారమైన భోగముతోను దానికిఁ గావలసిన రత్నాభరణాది పదార్థములతోను నిండియుండు వానిని; కామైకపరతంత్రున్ = కామమున కొక్కదానికే వశపడియుండువానిని- సజ్జన = సత్పురుషుల, భవ్యమార్గ = ధర్మమార్గమునకు, దూరగుఁ = దూరమున నడుచువానిని, ధర్మార్థదూరమానసుఁ = ధర్మమునకు నర్థమునకు దూరమైన మనస్సుగలవానిని; వినివృత్తకార్యునిఁ = తనకుఁ గావలసిన వాలి వధమనెడి కార్యము నెఱవేరినవానిని, ప్రమదోత్తమ = ఉత్తమలైన స్త్రీలయొక్క, అభిరత = రతిక్రీడలయందు, నిరతుఁ = విశేష ప్రీతిగలవానిని, మనోరథజాలసంప్రాప్తి = తన కోరికల సమూహములు చక్కగ లభించుటచే- రే + పగల్ = రేపగలు రాత్రి పగలు- హాయిఁ = సుఖముగ- దారతోఁ = భార్యయగు రుమతో, తారతోఁ = తారతోడను, హారి=మనోహరమైన, సదా=ఎడఁతెగని, ఖేలావిలోలుఁడై =ఆటలయందు నాసక్తిగలవాఁడై -బృందారకేందు

ముఖులు = దేవతాస్త్రీలు- బృందములు=గుంపులు- వాసవున్ = ఇంద్రుని; సచివ వార=మంత్రివర్గమునందు, విన్యస్త=ఉంచఁబడిన; కార్యభారుఁడు=కార్యమను భారము గలవాఁడు.

తాత్పర్యము

రామచంద్రమూర్తి కార్యమునకై ప్రయత్నింపఁ దగిన కాలము వచ్చుటయు నా విషయమై సుగ్రీవుఁ డేమియు నాలోచింపకయుండుటయుఁ జూచి గొప్ప భోగముతోను దాని ననుభవింపఁ గావలసిన ధన రత్నాది సమృద్ధితోను గూడిన వానిని (స్వామికార్యము మఱచుట కీ యొకటియే చాలును) కామము నొకదానినే ముఖ్య కార్యముగ నుంచుకొనిన వానిని (స్వామికార్యము చెఱుప నిది యొకటియే చాలును) సజ్జనులు నడచు శుభమార్గమునకు దూరమైన వానిని (స్వామికార్యము చెఱుప నిదియొక టియే చాలును) ధర్మవిచారము, అర్థవిచారము లేనివానిని (స్వామికార్యము మఱవ నిదియే చాలును) ఈ యొక్కటొక్కటియే భగవంతుని కార్యము మఱవఁజేయఁజాలి యుండఁగా నిన్నియుఁ జేరిన నేమని చెప్పవలెను. తనకార్యము నెఱవేఱిన వానిని, ఉత్తమస్త్రీ రతియందు నాసక్తిగలవానిని, తనకోరిక నెఱవేఱుటచే సుఖముగా నిది రాత్రి యిది పగలని తెలియక తిరుగువానిని తన భార్యతోనేగాక తారతోను గ్రీడావినోదంబుల మరగినవానిని, నందనంబునందు దేవతాస్త్రీల సమూహములు గొలువ సంతోషయుక్తుఁడైన యింద్రునివలెఁ దిరుగువానిని-రాజకార్య విచారము మంత్రులపై వైచినవానిని;

ఉ. పన్నగ రాజ్యతంత్రముల • పట్ల విమర్శము లేనివాని, ను
త్పన్నధరాధిపత్యగురు • శంకు, నిదేశవిహీను, సర్వదో
త్పన్నమనోజసౌఖ్యరతు • వానరనాయకు, డాసి తత్త్వసం
పన్నుఁడు కాలవేది హిత • పథ్యయథార్థనయోక్తి సూరియున్. ౭౯-౭

ఉత్పన్న= వదలిపోయిన- ధరాధిపత్య = రాజత్వవిషయమైన- గురుశంకున్= గొప్ప సందేహముగలవానిని- నిదేశవిహీనున్ = రాజ్యపాలనవిషయమైన యాజ్ఞలు పాలింపనివానిని- సర్వదా = ఎల్లప్పుడు- ఉత్పన్న = పుట్టిన- మనోజ సౌఖ్యరతున్= మన్మథ సౌఖ్యములందుఁ బ్రీతిగలవానిని- తత్త్వసంపన్నుఁడు= యథార్థజ్ఞానము గల వాఁడు- కాలవేది = ఏకాలమున నేకార్యములు చేయవలయునో యెఱిఁగినవాఁడు- హిత- పథ్య- యథార్థనయోక్తి = ఫలకాలమున మేలిచ్చునదియుఁ దత్కాలమందును బూర్ణ ఫలసాధకమున కనుకూలముగ ధర్మమైనదియు, వాస్తవమైనదియు, నీతితోఁగూడి నదియు నగు మాటలు గలవాఁడు- సూరియున్ = పండితుఁడును.

తాత్పర్యము.

రాజకీయ వ్యవహారభారము మంత్రులమీఁద వేసిన వేయనీ, వారేమి చేయుచున్నారో యెట్లు చేయుచున్నారో యను విచారణకూడ లేనివాఁడు, అట్లయినఁ

దనకుఁ బ్రభుత్వము దక్కునా యను విషయమున సందేహము లేనివాఁడు, ఇఁక న న్నెవ్వరేమి చేయఁగలరను ధైర్యము గలవాఁడు రాజగుటచే నేనైన రాజీయవలసిన యాజ్ఞలైన నిచ్చుచున్నాఁడా యనిన నదియు లేనివాఁడు, ఇఁకఁ జేయుకార్య మేమనిన సర్వదా స్త్రీలతో మన్మథక్రీడలఁ దేలుచుండువాఁడు నగు సుగ్రీవునితో వాస్తవార్థము తెలిసినవాఁడు కావుననే యితఁ డిట్లుండిన మరల గీడుల పాలగునే యని యెఱిఁగిన వాఁడును హితముగను బథ్యముగను సత్యముగను నీతియుక్తముగను మాటలాడువాఁడును బండితుఁడును.

క. సామమృదుభాషణుం డగు, సామీరి వచించె వినయ♦సంపదను యశ
శ్శ్రీముహు లొదవెఁ గపిస్వా,మీ! మిత్రులకార్య మొకఁడె ♦ మిగిలెం జుమ్మీ.

సామమృదు భాషణుండు = మంచిగను మెత్తగను మాటలాడువాఁడు, సామీరి = సమీరుని కుమారుఁడు, ఆంజనేయుఁడు.

తా త్ప ర్య ము .

మంచితనముగ మెత్తగ మాటలాడు నాంజనేయుఁడు వినయముతో సుగ్రీవునితో నిట్లనియె. వానరరాజా! నీ కేమో యశస్సు, సంపద భూమి లభించెను. మిత్రుల కార్యము మాత్రమే నెఱవేఱక మిగిలియున్నది.

క. కాలమెఱుంగుచుఁ దత్త, త్కాలంబున మిత్రులందుఁ ♦ దగుపద్ధతి భూ
పాలుఁడు వర్తింప యశో,జాలము రాజ్యంబు కీర్తి ♦ శౌర్యము పెరుఁగున్. ౨౬౪

తా త్ప ర్య ము .

అనుకూలప్రతికూల కాలము లెఱుంగుచు నా యాకాలంబులందు మిత్రులందుఁ దగినరీతిగ రాజు వర్తించెనేని యతని కీర్తి, రాజ్యము కీర్తి, శౌర్యము వృద్ధిచెందును.

క. దండంబును మిత్రసుహృ, త్కాండంబును గోశబలము ♦ క్ష్మాపతి యీ నా
ల్గుండిన లెస్సగ రాజ్య మ,ఖండసమృద్ధిం దనర్చుఁ ♦ గపిలోకవరా! ౨౬౫

తా త్ప ర్య ము.

వానరరాజా! సేనాబలము, మిత్రబలము, సుహృద్బలము - కోశబలము నను నీనాలుగు గల రాజుయొక్క రాజ్యము పూర్ణవృద్ధింగాంచును.

తే. వృత్తసంపన్నుఁడవు నీవు ♦ చిత్త మొప్పుడు
తతనిరత్యయపథమును ♦ దగిలి యుండు
వేగ హితకార్యమును నెఱ♦వేర్పఁ బొంకె
యత్నమును జేయఁ దగు నీకు ♦ నగచరేంద్ర! ౨౬౬

వృత్త సంపన్నుఁడవు = మంచినడవడిగలవాఁడవు. తతనిరత్యయ పథమున్ = మిక్కిలి హానిలేని దారియందు- సన్మార్గమందు.

తా త్ప ర్య ము.

నీవు స్వభావముచేత మంచి నడవడిగలవాఁడవు. నీ మనస్సు సన్మార్గమందు వర్తించుచుండును. కావుననే నేను నిన్ను హెచ్చరింపఁగలిగితిని. శీఘ్రమున నీకు మేలుచేసినవారి కార్యము నెఱవేర్చుకొనుటకు వానరేశ్వరా! నీవు యత్నముచేయుట తగును.

క. తనపనుల నెల్ల వదలియుఁ, దనమిత్రునికార్యమునకుఁ ♦ దత ముత్సాహం
బును గొని చరించునాతఁడు, కనఁ డెప్పు డనర్థకంబుఁ ♦ గపికులతిలకా! ౭౬౭

తా త్ప ర్య ము.

తన కార్యములన్నియు వదలియైనను దన మిత్రునికార్యమును జక్కఁబఱుపనుత్సాహముచేయు నతనికిఁ గీడెన్నఁటికిని రాదు.

క. కాలాతిక్రమణంబుగఁ, జాలఁగ మిత్రార్థమునకు ♦ సమకట్టి నరుం
డే లీల నెంత గాసికిఁ, బా లైనను మిత్రకార్య♦పరుఁ డన రతనిన్. ౭౬౮

కాలాతిక్రమణంబుగన్ = కాలము మించిపోఁగా - మిత్రార్థమునకున్ = మిత్రుని కార్యము నెఱవేర్చుకొనుటకు- సమకట్టి=ప్రయత్నించి, మిత్రకార్యపరుఁడు= మిత్రకార్యమునం దాసక్తి గలవాఁడు.

అకాలే కృత్య మారబ్ధం, కర్తు ర్నార్థాయ కల్పతే
త దేవకాల ఆరబ్ధం, మహ తేర్థాయ కల్పతే. భార-౧౨-౧౩౮-౯౫

అకాలమందుఁ గార్యము ప్రారంభించినను జేయువానికిఁ బ్రయోజనము లేదు. అదే సకాలమందు నారంభించెనేని మిగులఁ బ్రయోజనము గలదు.

తా త్ప ర్య ము.

అనుకూలకాలము మించినతరువాత మిత్రుని కార్యమునకై ప్రయత్నించి యే విధముగ నెంత శ్రమించినను వానిని మిత్రకార్యమునం దాసక్తి గలవాఁడని లోకు లనరు.

—♦ హనుమంతుఁడు సుగ్రీవునితో సీతను వెదకింపు మని చెప్పుట ♦—

ఉ. కావున మిత్రకార్యము స♦కాలమునందె యొనర్పు మీవు, స
ద్భావ! విదేహజన్ వెదకఁ ♦ బంపుము, కాలము మీఱె మున్నె, ప్ర
జ్ఞావిభవుండు త్వద్వశుఁడు ♦ క్ష్మాపతి సత్వరుఁ డయ్యుఁ గాలమున్
బోవుట తా నెఱింగియును ♦ బూనఁడునూ నిను హెచ్చరింపగన్. ౭౬౯

తా త్ప ర్య ము.

ఈ కారణముచే నీవు సరియైన కాలమందే మిత్రకార్యము చేయుము. మంచి మనస్సుగలవాఁడా! సీతను వెదక వానరులను బంపుము. ఇప్పటికే కాలము మించినది. బుద్ధి సంపదగలవాఁడును నీకు వశుఁడునైన రామచంద్రుఁడు సీతాన్వేషణమందుఁ

దొందరగలవాఁ డయ్యు సమయకాలము దాఁటుట తెలిసినవాఁ డయ్యు నిన్ను హెచ్చరింపక యూరకున్నవాఁడు. ప్రిజ్ఞావిభవుఁడు త్వద్వశుఁడు కావునఁ దానే నిన్ను హెచ్చరింపక నీ వడవడి పూర్తిగాఁ దెలియువఱకుఁ దొందరపడరాదని సైఁచి యున్నాఁడు. కాని తన కార్యమం దాయన ప్రమాదపడి యున్నాఁడని తలంపకుము.

ఆ. నీదువంశ మిలను ♦ నిలిపెను జిరకాల, మైత్రి కర్హుఁడైన ♦ మాననీయుఁ
డప్రమేయమహిముఁ ♦ డతులితగుణి యయ్యా, రాజచంద్రుఁ డైన ♦ రామవిభుఁడు.

తాత్పర్యము.

నా కార్యము నెఱవేఱెను ఇఁక నా సౌఖ్యము వదలుకొని యతనికై శ్రమింపకుండిన నేమి యనెదవా? అట్లు లనకుము, ఆయన నీ వంశము రక్షించెను. ఆ యొక్క కారణముచేతనే దీర్ఘకాలమైత్రికిఁ దగినవాఁడు. అంతియకాక నీ వతని సామంతప్రభువవుగావున నీకు గౌరవింపఁదగినవాఁడు. అట్టి యధికారము నీపై లేకుండినను గొలఁది చెప్పరాని మహిమగలవాఁడు. ఆ కారణముచేతను నీకు రామచంద్రమూర్తి పూజ్యుఁడే.

కం. ఆతండు నీకు మున్నుగ, ఖ్యాతంబుగ మేలు చేసె ♦ నతనికి నీవున్
బ్రీతిం గూర్పఁగ వలదే, వే తరుచరవరులఁ బంప ♦ వే సమకూడన్. ౭౭౧

తాత్పర్యము.

నీవు చేయవలసిన సాహాయ్యము వెరకు ధర్మానికిఁ జేయునది కాదు. లోక మెఱుఁగునట్లు నీకు ముందుగ నాయన సాహాయ్యము చేసెను. కావున నీ వతనికి మఱుమేలు చేయవలదా? అది నీకుఁ గర్తవ్యము కదా! చేయకుండినఁ బ్రత్యవాయము గదా! కావున సీతను వెదక వానరుల నందఱ నిచటికిఁ బిలిపింపఁ గోరెదను.

కం. కాలాతిక్రమదోషము, గ్రాలదు పరు లెచ్చరింప ♦ కయ మును చేయన్
గాలాతిక్రమదోషము, గ్రాలెడిఁ బరులెచ్చరింపఁ ♦ గార్యము సేయన్. ౭౭౨

తాత్పర్యము.

కాల మతిక్రమించెనుగదా. ఇఁకఁ జేసినను వ్యర్థమేకదా యందువేమో- కాలము కొంచె మతిక్రమించినను నెదుటివారు హెచ్చరింపకముందే చేసితిమేని యందుఁ గాల మతిక్రమించి చేసిన దోషములేదు. పరులు హెచ్చరించిన పిమ్మటఁ జేసినఁ గాలదోషము గలదు. ఇప్పుడు కాలము కొంచె మతిక్రమించినను రామలక్ష్మణులింకను హెచ్చరింపలేదు. వారు హెచ్చరింపకముందే చేసినచో దోషములేదు.

కార్తికమాసమున పున్నమతోనో అమావాస్యతోనో గదా నాలుగు మాసములు ముగియును. దండయాత్రకు మార్గశిరము రావలెఁగదా. ఇప్పు డిది యాశ్వయుజమేకదా. ఎట్లు గడువు మీఱెనని యాంజనేయుఁడు చెప్పెను ?

మార్గశిరమాసము దండయాత్రకు సేనలతోడఁ బోవఁదగిన సమయము. అంతకుముందే సేన లన్ని సిద్ధముగా నుండినఁగదా మార్గశిరమున బయలుదేఱుట

సంభవించును. అంతకుముందు తొలుత సీతాదేవి యెందున్నదో తెలియవలె. దాని కెంతకాలము పట్టునో. అట్లు తెలిసిన పిమ్మట సేనలు సమకూడవలె. దానికిఁ గొంత కాలము, మాసమైనఁ బట్టును. రెంటికి రెండు మాసము లనుకొన్నను ఆశ్వయుజమునఁ దొలుతనే దానికిఁ దగిన సన్నాహము ప్రారంభింపవలె. ఇప్పు డాశ్వయుజము ముగియ వచ్చినది- కావునఁ గాల మతిక్రమించెనని హనుమంతుఁడు చెప్పెను. కావున హనుమంతుఁడు చెప్పినది తప్పుగాదు. రామలక్ష్మణాంజనేయు లాక్షేపించినది ఏ ప్రయత్నము చేయలేదనియే కాని సేనలతోడ బయలుదేఱలేదని కాదు.

కం. ఉపకారము లేకున్నను, నృపతీ! యుపకృతి నొసర్ప ♦ నీతియ నీకుఁ
విపుల శ్రీరాజ్యంబులఁ, గృప సేసిన రాముఁనెడ నిఁ ♦ కే మని చెప్పన్. 223

తాత్పర్యము.

నీవంటి సద్గుణ సంపత్తి గలవానికి నుపకారము చేయనివారికిని నుపకారము చేయుట తగిన కార్యము. అటయే శ్లాఘ్యమైనది. అట్లుండ రామచంద్రమూర్తి నీ కిదివఱకే యుపకారము చేసి నీకు విస్తారరాజ్యము, సంపద ననుగ్రహించెను. అట్టి వాని కుపకారము చేయుటయందుఁ జెప్పవలసిన దే మున్నది.

కం. ధృతియుతుఁడవు బలినుతుఁడవు, హితచరితుఁడ వీవు వానరేశ్వర! యేలా ♦
క్షితిపతికార్యముఁ దీర్పఁగఁ, దతవానరకోటిఁ బంపఁ ♦ దడసితి విట్టుల్. 224

ధృతియుతుఁడవు = ధైర్యము గలవాఁడవు. బలినుతుఁడవు = బలవంతులచే బలవంతుఁడ వని స్తోత్రము చేయఁబడినవాఁడవు. హితచరితుఁడవు = పరులకు మేలు చేయు నడవడి కలవాఁడవు. తడసితివి = ఆలస్యము చేసితివి.

తాత్పర్యము.

యుద్ధమనినఁ బ్రాణాపద గలిగించు కార్యమని భయపడితి వనుకొందునా? నీవు ధైర్యము గలవాఁడవు. ఆపదలకు భయపడువాఁడవు కావు. బలహీనుఁడవు కావున రావణాసురునితో నెట్లు యుద్ధము చేయనని తలఁచితి వందునా? నీవు బలవంతులచే బలవంతుఁడ వని పొగడబడిన వాఁడవు. పరోపకారబుద్ధి నీయందు లేదా యనుకొనఁ బరులకు హితము చేయు నడవడి గలవాఁడవు.

ఇన్ని యుండియు నేల రామచంద్రమూర్తి కార్యమునం దుపేక్ష వహించి యాలస్యము చేసితివి.

ఇప్పు డీ యాక్షేపము చేయుటకు మాఱు ముందుగనే హెచ్చరించి యుండ వచ్చునుగదా! అప్పు డూరకుండ నేల? ఇప్పుడు చెప్ప నేల? అందు మేని రాచవారితో నాడినను గష్టమే, ఆడకున్నను గష్టమే. గెలిచినను గష్టమే. ఓడినను గష్టమే. కత్తిమీఁది సామువంటిది. ముందుగాఁ జెప్పిన నీవు నాకుఁ జెప్పువాఁడవా? నీకున్నంతబుద్ధి మాకు లేదా యందురు.—కావున రాజనీతి ననుసరించి చెప్పలేదు.

అదియునుగాక సుగ్రీవుఁ డంతఃపురమునందే కాలము గడపుచుండెనని ౭౮౧వ పద్యమువలనఁ దెలియనగు.

ఉ. నీ విట బాసటై చనక ♦ నిల్చినయంతనె రాముకార్యముల్
బోవునె రిత్తయై? నిశిత♦భూరిశరాళిచే మనుష్యభు
గ్దైవతపన్నగావళులఁ ♦ దత్క్షణమాత్రన పిల్కుమార్పఁగాఁ
జేవ గలండు, నీ ప్రతిన ♦ చేయుట యెట్టిదొ చూడఁ దాళెడిన్. ౭౭౫

బాసట = సాహాయ్యము- రిత్తయై = వ్యర్థమై- నిశిత = ఘనమైన- భూరి= గొప్పవగు- శరావళిచేత్ = బాణపరంపరచే, మనుష్యభుక్ = రాక్షసులయు- దైవత= దేవతలయు- పన్నగ = సర్పములయు- ఆళులన్ = గుంపుల- పిల్కుమార్పఁగన్= చంపుటకు- చేవగలండు = బలముగలవాఁడు- ప్రతిన = ప్రతిజ్ఞ- తాళెడిన్ = సహించియున్నాఁడు.

తాత్పర్యము.

రామునికార్యము నావలనఁ గావలసియున్నది. కావున నాయన నాకు వశపడి యున్నాఁడు. కావున నే నాలస్యము చేసితినని కాని చేయలేదని కాని యాక్షేపించి నాకుఁ గోపము వచ్చునట్లు చేసినఁ దనకార్యమే చెడునని రామచంద్రమూర్తి భయ పడునని తలఁచితివా సుగ్రీవా! నీవు సాహాయ్యము చేయకుండిన రాముకార్యము వ్యర్థమై పోవునని తలంపకుము. వాఁడిగల యనేక బాణములచే రాక్షసులను దేవతలను పాతాళలోక వాసులను క్షణములో నాశము చేయఁగలఁడు. అట్లైన నూరకేల యున్నాఁడని యందువా నీవు సాహాయ్యము చేసెదనని వాగ్దానము చేసితివి. కావున నీ వేమాత్రము చేయుదువో చేయనే చేయవో చూతమని సహించియున్నాఁడు, కాని తనకార్యము దాను జేసికొనశక్తిలేక కాదు.

క. ప్రాణంబునకును జంకక, రాణన్ మేల్ చేసె నీకు ♦ రాముఁడు నీవున్
రాణువతోఁ జని యాతని, రాణిని నెమకింపు నంబ♦రంబున ధరణిన్. ౭౭౬

రాణువ = సేన- నెమకింపుము = వెదకింపుము-

తాత్పర్యము.

యుద్ధమే ప్రాణాపదకరమైన కార్యము. దానిలో వాలితో యుద్ధము ప్రాణ గొడ్డమైన దని నీకుఁ దెలియును. అట్టి విషయము నే కొంచెము తప్పినను దన ప్రాణముమీఁదికి వచ్చునే యని సందేహింపక సాహసించి నీకు మేలుచేసెను. కావున నీవును సేనతోఁగూడఁ బోయి యాయన భార్యను భూమియందు నాకాశమందు వెదకింపుము.

చం. అనిమిషదైత్యమారుతఖ♦గాహిగణంబులు గూడియేని రా
మునకు రవంతయేని భయ♦మ్ముం గలిగింపఁగలే వసంగ నే

మని వధియింప రాక్షసచ♦యంబును, నీ కుపకారి యైన యా
ఘనునకు మాఱుమే ల్సలుప(♦గా గమకింపుము వానరేశ్వరా! ౭౭౭

అనిమిష = దేవతలయు- దైత్య = దైత్యులయు- మారుత = మరుత్తులయు- ఖగ = గరుడులయు- అహి = పన్నగులయు- గణంబులు = సమూహములు- గమకింపుము = ప్రయత్నింపుము.

తాత్పర్యము.

రాక్షసు లనిన రామచంద్రమూర్తి భయపడునని తలఁచితివా- దేవతలు- దైత్యులు- మరుత్తులు- గరుడులు- పన్నగులు- వీరంద ఱొకటిగాఁ గలసి తన మీఁదికి వచ్చినను రామచంద్రమూర్తిని భయపడఁజేయఁజాలరు. ఇఁక నొక రాక్షసు లనిన యాయనకు లక్ష్యమా? కావున నట్టి యభిప్రాయముండెనేని వదలి నీ కుపకారముచేసిన గొప్పవానికి మఱుమేలు సేయ యత్నింపుము- ఆ యాలోచన తప్ప వేఱొక యాలోచన చేయకుము.

కం. మంటను వింటను జలముల, మంటల బలితలమునందు ♦ మహితజవమునన్
గుంటు పడక కపు లెల్లరు, దంటలు చన నీ వనుజ్ఞ ♦ దయచేసితి వేన్. ౭౭౮

మంటన్ = భూమియందు- మంటలన్ = అగ్నులందు- బలితలమునందున్ = పాతాళమందు- దంటలు = సమర్థులు.

తాత్పర్యము.

భూమియందు ఆకాశమందు నీళ్లయందు నిప్పులందుఁ బాతాళమందునైన వేగముగ నడ్డములేక పోఁగల సమర్థులు కపు లున్నారు. నీ వనుజ్ఞ యిమ్ము- నీ యనుజ్ఞ లేక వారేదైన నెట్లు చేయఁగలరు?

కం. పాటించి యెట్టికార్యముఁ, బాటవమునఁ దీర్ప నేరు♦పరులౌ వారల్
కోటికోలందులు ధరణిరుహాటులు గల రేమి సేయ♦నగు ముద లిడుమా. ౭౭౯

పాటవమునన్ = సామర్థ్యముచే- ధరణిరుహాటులు=వృక్షచరులు- వానరులు- ముదల=ఆజ్ఞ.

తాత్పర్యము.

పని పూని యెట్టికార్యమైనను దమ సామర్థ్యముచేఁ జక్కఁజేయ నేర్పుగల వారు, వానరులు కోటానకోటు లున్నారు. వా రేమి చేయవలయునో యాజ్ఞయిమ్ము. నీవు చేయవలసినది మాటమాత్రమే.

ఉ. నావుడుఁగాలయోగ్యపవ♦నప్రభ వాలపనంబు లెల్ల సు
గ్రీవుఁడు చక్కఁగా విని హ♦రిధ్వజినీపతి నీలుఁ జూచి నా
నావనచారియూథపులు ♦ నాదునునుజ్ఞ ప దేనునాళ్ళలో
రావలయున్ ససైన్యముగఁ ♦ బ్రాణముఁదీయుదు రాక తక్కినన్. ౭౮౦

కాలయోగ్య = కాలమునకుఁ దగిన- పవన ప్రభవ = వాయు పుత్రుఁడైన

యాంజనేయుని యొక్క- ఆలపనంబులు = మాటలు- హరిధ్వజినీపతి = వానరసేనా నాయకుని.

తాత్పర్యము.

అని చెప్పఁగాఁ గాలమున కుచితమైన హనుమంతుని మాటలు విని సుగ్రీవుఁడు వానర సేనానాయకుఁ డగు నీలునిఁ జూచి వానర యూథ నాయకు లందఱుఁ బదునైదు దినములలోఁ దమ సేనలతో నిచ్చటికి రావలెను. రాని వానిప్రాణము దీయఁ బడును.

కం. అని చాటింపుము తారా,తనయుండును నీవు వేగ ♦ తగుపద్ధతులన్
బనిపూనుఁడు కార్యంబున, కని సుగ్రీవుండు చొచ్చె ♦ నంతిపురంబున్. ౨౮౧

తారాతనయుండును = అంగదుఁడును- అంతిపురము=అంతఃపుర శబ్దభవము. తారా తనయుండును అనుటచేత జాంబవదాదులు గ్రాహ్యము.

తాత్పర్యము.

అని ప్రకటింపుము. అంగదుడు నీవు దానికిఁ గావలసిన వన్నియుఁ దగురీతి కార్యములు చేయ యత్నింపుఁడు, అని యంతఃపురము ప్రవేశించెను.

దీనివలన సుగ్రీవుఁ డంతఃపురమందే కాలము గడపుచుండె ననియు హనుమంతుని బలవంతముమీఁద వెలుపలవచ్చి నాలుగు మాటలు మాటలాడి మరలఁబోయె ననియు నూహింపవలసియున్నది. కావుననే రాజ్యతంత్రమేదియు విచారించుచుండిన వాఁడు కాఁడని చెప్పఁ గారణమయ్యెను హనుమంతుఁడు హెచ్చరింపకుండిన సుగ్రీవుఁడు రామకార్యము మఱచియే యుండును.

-♦ ౩౦-వ సర్గము. శరత్కాలంబున శ్రీరాముఁడు సీతావిరహంబునఁ దపించుట. ♦-

చం. వెలియఁగ వానలున్, నభము ♦ వెల్లన నెల్లెడఁ దోఁపఁ, జంద్రమం
డలము విశుద్ధమై తనర ♦ నవ్యశరద్రజనీలలామ ని
ర్మలశశికాంతిచందనము ♦ రమ్యముగాఁగ నలందఁ, క్రోఁతిఱేఁ
డలఘుసుఖంబుఁ జెంద, సమయంబు నతీతము నొందఁ, జూచుచున్. ౨౮౨

వెల్లన = తెల్లగా, నవ్య = మనోహరమైన- శరద్రజనీలలామ = శరత్కాల రాత్రియనెడు స్త్రీ- నిర్మల శశికాంతిచందనము = తెల్లని వెన్నెలయను గంధము- అలందన్ = పూసికొనఁగా- అతీతము = కడచినది.

తాత్పర్యము.

వానలు నిలువఁగా, నాకాశము తెల్లగా సర్వత్ర కానరాఁగాఁ జంద్రమండలము పరిశుభ్రముగాఁ గానరాఁగా శరద్రాత్రి యనెడు స్త్రీ వెన్నెలయను గంధము పూసికొనఁగా సుగ్రీవుఁడు సుఖంపఁగా గడవు దాఁటిపోఁగాఁ జూచుచు.

కం. తొలఁగఁగ మెఱుఁగులు మబ్బులు, చెలఁగఁగ హంసారవంబు ♦ శ్రీమంతంబై
మొలఁగఁగ వెన్నెల దిక్కుల, వెలుఁగఁగ వినువీది మిగుల♦విమలం బగుచున్. ౨౮౩

తా త్ప ర్య ము.

౭౬౦వ పద్యము చూచునది-ఆ పద్యమే మరల నిచ్చట వ్రాయుట యచ్చట నాంజనేయుఁడు హెచ్చరిక పడినపుడే యిచ్చట రామచంద్రమూర్తియు విషాదపడ సాగెనని తెలుపుటకే.

కం. మానితశైలాగ్రసమా,సీనుండై రామవిభుఁడు ♦ సీతాతరుణిన్
మానసమునఁ దలపోయుచు, నూనినశోకమున నిట్లు ♦ నుపతాపించెన్. ౭౮౪

మానితశైలాగ్ర సమాసీనుండై = పూజ్యమైన కొండశిఖరము మీఁదఁ గూర్చుండినవాఁడై- ఉపతాపించెన్ = పరితాపపడెను.

తా త్ప ర్య ము.

వాన భయము లేమిచేతను, ఆకాశము నిర్మలముగా నుండుటచేతను గుహ విడిచి వెలుపలవచ్చి కొండమీఁదికిఁబోయి యచ్చటఁ గూర్చుండి రామచంద్రమూర్తి సీతాదేవిని దలఁచుకొని శోకముచే నిట్లు పరితాపపడెను.

ఇప్పుడు సీతాదేవిని దలఁచుకొని దుఃఖించె ననుటచే నింతకుఁ బూర్వము మఱచియుండెనని యర్థము గాదు. కాలప్రతిబంధకముచే లోలోపలఁ గుములు చుండినది యిప్పుడు బయలుపడిన దని భావము.

కం. వరసారసారవారవ, వరసారససారమధుర♦రవంబు చెలంగన్
సరసంబుగ నాశ్రమమున, సురమించును నేఁడు నాకు ♦ సుఖ మిడు నెట్లో. ౭౮౫

వర = శ్రేష్ఠమైన- సారసారవ = సారసపక్షుల ధ్వనివంటిది- ఆరవ = కంఠ ధ్వనిగల దగు సీతయొక్క- వర = ఇంపైన- సారస = బెగ్గురుపక్షులయొక్క- సార మధు = మిగుల మధురమైన- రవంబు = ధ్వని-

తా త్ప ర్య ము.

సీతాదేవి యాశ్రమంబున నున్నప్పుడు సారసముల తియ్యని కంఠరవమువంటి రవముతో నన్నెంతో సంతోషింపఁజేయుచుండెను. అట్టిది యిప్పుడు నాకు నెట్లు సుఖ మియ్యఁగలదో-

కం. కుసుమితతరువిసరంబుల, లసదష్టాపదవినిర్మ♦లంబుల శుభ మా
నసమాసనములఁ గనుచుం, గుసుమాంగి యెట్టు లడలు♦నో నే లేమిన్. ౭౮౬

కుసుమిత = పూచిన - ఇది తారకాదులలోఁ జేరిన పదము - తరువిసరంబు లన్ = చెట్ల సమూహములను- లసత్ = ప్రకాశించు; అష్టాపద = బంగారువలె- వినిర్మలంబులన్ = మిగుల నిర్మలములైన వానిని- అసమ + అసనములన్ = సరిలేని యసనవృక్షములను - కుసుమాంగి = పూలవలెఁ గోమలమైన దేహముగలది - అడలునో = దుఃఖించునో.

తా త్ప ర్య ము.

పూచిన చెట్లగుంపులను బంగారువలె నిర్మలములయిన యసనములను జూచుచుఁ బువ్వుకోమల, సీత నేను జెంతలేమిని నెంత పరితాప పడునో!

క౦. కలభాషిణి మును పలుకఁగఁ, గలహంసరవంబుపోల్కిఁ ♦ గని యెఱుఁగుదు నే
లలితసకలాంగి నిపు డే,చెలువునఁ దెలియంగలాఁడ ♦ సీతారమణిన్. ౭౮౭

కలభాషిణి = మధురసూక్ష్మధ్వని గలది- లలిత = మనోహరమైన, సక లాంగి = సకలావయవయములు గలది.

తా త్ప ర్య ము.

పూర్వము కలహంసవలె మధురమైన సూక్ష్మరవమున సీతాదేవి పలుకఁగాఁ దెలిసికొనుచుంటిని. ఇప్పుడు నేనెట్లు తెలియఁగలను.

కం. మక్కువ నొక్కటఁ దిరిగెడి, జక్కవకవరవళి విన్న ♦ జలజాక్షి యయో
యెక్కడఁ దపియించునో, దిక్కఱి ననుఁ బాసి మిగుల♦దీనత నొంటిన్. ౭౮౮

జక్కవ కవరవళిన్ = చక్రవాకపక్షుల దంపతులధ్వని- దిక్కఱి = దిక్కు లేనిదై.

తా త్ప ర్య ము.

అనురాగముచే నెడఁబాయక కూడ నంటి తిరిగెడి చక్రవాకదంపతుల ధ్వని విని సీతాదేవి నన్ను విడిచి యొంటిగ నుండుటచే దీనయై యెట్లు తపించునో కదా.

ఉ. ఆవనజాతపాణి మఱి ♦ యా యనిమేషవిలోలనేత్ర హా
యా వరవల్లికాలలిత ♦ యా యమృతాసమకీరవాణి లే
కీ వనజాకరంబులును ♦ నీ తటినీవరతీరదేశ మిం
దీవనకాననోత్కరము ♦ లిం పొదవింపవు సంచరింపఁగన్. ౭౮౯

వనజాతపాణి = కమలమువంటి యరచేయి గలది- అనిమేష = చేఁపలవలె- విలోల = మిగులఁ జలించుచున్న- నేత్ర = కన్నులుగలది- వరవల్లికా = ఇంపైన తీఁగవలె- లలిత = మనోజ్ఞమైనది- అమృతాసమ కీరవాణి = అమృతమువలెఁ దియ్యఁదనమునందు సమానమైన చిలుక పలుకులవంటి పలుకులు గలది- వనజాకరంబులు = కొలఁకులు- తటినీవరతీరదేశము = శ్రేష్ఠమైన నదియొక్క యొడ్డు ప్రదేశము. వనకాననోత్కరములు = తోఁటల అడవుల సమూహములు.

తా త్ప ర్య ము.

కమలములవంటి యరచేతులు గలదియు, మీనములవంటి కన్నులుఁ గలదియుఁ, దీఁగవంటి కోమలదేహము గలదియు నమృతమువంటి చిలుక పలుకులు గలదియు లేక యీ సరస్సులు నీ నదీతీరములు నీ తోఁటలు నడవులు సంచారము చేయుటకు సంతోషము గలిగింపకున్నవి-

క. శారదగుణనారాచ,స్ఫారుఁడు కాముఁడు వియోగ♦జాతార్తను సీ
తారమణిని సుకుమారిని, గారింపక యున్నె మృత్యు♦కారణ మగుచున్. ౭౯౦

శారదగుణ = శరత్కాల గుణమనెడి- నారాచ= బాణములచే- స్ఫారుఁడు= ప్రకాశించువాఁడు- వియోగ జాతార్తను = వేఱుపాటువలనఁ గలిగిన బాధ గలిగిన దానిని- కారింపక = బాధింపక.

తాత్పర్యము.

శరత్కాల గుణమను బాణములచేఁ బ్రకాశించు మన్మథుఁడు విరహబాధ పడుచున్న సీతను సుకుమారిని మరణకారణమై బాధింపకుండునా?

క. చాతకము నీటికై పురుహూతునకున్ మొఱలు పెట్టు నోజను గొన
ల్యాతనయుఁడు విలపించెను, సీతానవజాక్షికై వి శేషవ్యథచేన్. ౨౯౧

పురుహూతునకున్ = ఇంద్రునకు.

తాత్పర్యము.

చాతకము నీటికై యింద్రుని గుఱించి మొఱలు పెట్టినట్లు రామచంద్రమూర్తి సీతాదేవి నుద్దేశించి మిగులఁ బరితాపపడెను.

చాతకపక్షి మేఘమువలన వచ్చు నీటిచేఁ దప్ప దక్కిన నీటిచే దాహ మార్చుకొన యత్నింపనట్లు లేకపత్నీవ్రతస్థుఁడైన రామచంద్రమూర్తి సీతాదేవితోఁ దప్పఁ దక్కిన స్త్రీలతోఁ గామతృప్తి చెందఁదలఁచిన వాఁడు కాఁడని భావము. ఇది యాయన యనుకూలనాయకత్వము సూచించెడిని- ఒక్కకాంతకే వలచి గుణాభిరాముఁడగు వాఁడనుకూలుఁడని యనుకూలనాయకలక్షణము.

క. ఏకాంతవిసంజ్ఞుండై, యేకాంతమనంబుతోడ నేకాకృతి సీ
తాకాంతకు దురపిల్ల ని,లాకాంతునిఁ జూచి సత్ఫలగ్రహణార్థన్. ౨౯౨

ఏకాంత విసంజ్ఞుండై = మిక్కిలి స్మృతితప్పినవాఁడై - ఏక + అంత + మనంబుతోడన్ = ఏకాగ్రమైన మనస్సుతో- ఇతర విచారములేని మనస్సుతో- ఏకాకృతిన్ = ఒక్కవిధముగా- దురపిల్లన్ = శోకింపఁగా- ఇలాకాంతునిన్ = రామచంద్రుని- సత్ఫల గ్రహణార్థన్ = మంచిపండ్లు తీసికొనివచ్చు నుద్దేశముతో.

తాత్పర్యము.

మైమఱపుచెంది యేకాగ్రమైన మనస్సుతో నేకవిధముగ సీతాదేవికై దుఃఖించు రామచంద్రుని జూచి మంచి ఫలములు తెచ్చు కోరికతో.

—లక్ష్మణుఁడు శ్రీరాముని దుఃఖముఁ బాపుట.—

ఉ. వింతపథంబులం దఱిగి వేగమ వచ్చి సుమిత్రపుత్రుఁ డ
త్యంతవిషణ్ణచిత్తుఁ డయి యన్నయుదే మిటు సీదుభూరివి
క్రాంతి పరాభవంబు గొనఁ గామవశాత్ముఁడ వౌట యర్హమే!
చింతలఁ గుందె దయ్యొ ధృతిచేఁ బని దీర్పఁగ నర్హమౌ నెడన్. ౨౯౩

వింతపథంబులన్ = క్రొత్తత్రోవల- అత్యంత విషణ్ణచిత్తుఁడయి = మిక్కిలి విషాదము చెందిన మనస్సుగలవాఁడై- భూరివిక్రాంతి = గొప్ప పరాక్రమము- పరాభవంబు = అవమానము- కామవశాత్ముఁడవు= కామమునకు వశపడిన మనస్సు గలవాఁడవు.

తాత్పర్యము.

క్రొత్తమార్గముల నడవిలోనికిఁ బోయియుండిన లక్ష్మణుఁడు వచ్చి యన్నను జూచి మిక్కిలి విషాదపడి యిది యేమిది నీ విక్రమమునకు నవమానము వచ్చునట్లు కామమునకు వశుఁ డౌట తగునా? ధైర్యముచేఁ బని చక్కఁజేసికొనవలసిన సమయము వచ్చినప్పు డయ్యో దుఃఖించుచున్నావే

చ. మన మిపు డాచరింపఁగ స♦మంజసకార్యము నెంచి, ధీప్రసా
దనమును గాంచి, కాలమువి♦ధంబుఁ దలంచి, స్మరించి వానరేం
ద్రుని పెనుఁబ్రాపు, దేవతల♦నర్థ భజియించుటలోఁ గ్రహించి, దు
ర్జనగణదూర! ధైర్యమునఁ ♦ బ్రాలుము ప్రాలుము విక్రమంబునన్. ౭౯౮

సమంజసకార్యముఁ = తగినపనిని- ధీప్రసాదమును = ప్రసన్నమైన బుద్ధి గలవాఁడవై - ప్రాలుము = ప్రకాశింపుము- ప్రాలుము = మీఱుము, అతిశయింపుము.

తాత్పర్యము

మన మిపు డేమి చేయదగునో యాలోచించి మనస్సు నిర్మలము చేసికొని కాల మున్నస్థితి యోజించి, సుగ్రీవు సాహాయ్యము జ్ఞప్తి చేసికొని దేవతాప్రార్థనము సేవ మనస్సునకుఁ దెచ్చుకొని ధైర్యమునఁ బ్రకాశింపుము- పరాక్రమముచే నతిశయింపుము.

క. శ్రీనిలయ! త్వత్సనాథ మ♦హీనందన సులభ యగునె ♦ యితరులకును వై
శ్వానరకీలలలోఁ బడి ♦ మానవుఁ డెవ్వండు మీర? ♦ మనఁగాఁ జాలున్. ౭౯౯

శ్రీనిలయ = లక్ష్మీదేవికి స్థానమైన వాఁడా- శ్రీనివాసా- ఇది సాభిప్రాయ సంబోధనము- నీవు శ్రీకి స్థానమైతివే- నిన్ను నెట్లు శ్రీ యగు సీత విడిచి యెందుఁ బోఁగలదని తలఁచితివి త్వత్సనాథ = నీవే నాథుఁడుగాఁగలది- పతివ్రత తనభర్తను విడిచి యునికిపట్టు విడిచి మఱియొకచోటికిఁ బోవునా? మహీనందన = సామాన్య స్త్రీ గాదు. భూమియందుఁ బుట్టినది- అయోనిజ, సులభ = సులభముగాఁ బొందఁ దగినది- నీ సమ్మతి యామె సమ్మతి లేక యితరుఁడామె నాశించెనేని వానికిఁ గష్టములే ప్రాప్తించును గాని సుఖము ప్రాప్తింపదు- వైశ్వానరకీలలలోఁ = అగ్నిజ్వాలల యందు.

తాత్పర్యము.

శ్రీనివాసా ! నీవు నాథుఁడుగాఁ గలిగిన భూమిపుత్రి సీత యితరులకు సులభ యగునా? ఆమె నెవ్వఁ డాశించినను అగ్నిజ్వాలలలోఁ బడినవాఁడు నశించినట్లు నశించువాఁడే కాని యెవ్వఁడు బ్రదుకఁగలఁడు?

చ. అని హితమును బ్రియంబును నయంబును ధర్మము సామ మొప్పఁగా
ననియెడి తమ్ము వాక్యముల ♦ నాదట రాఘవుఁ డాలకించి నా

యన! భవదీయసూక్తి హిత ♦ మౌను దురాసద కార్యచింతనం
బును దగుఁ దత్ప్రయత్నమును ♦ బూనఁగ నొప్పు నటంచుఁ బల్కుచున్. 78 ఉ
దురాసదకార్య చింతనము=సులభసాధ్యముకాని పని సాధించు నాలోచనము.

తాత్పర్యము.

ఈ ప్రకారము భవిష్యత్కాలమున మేలు గలిగించునవియుఁ దత్కాలమున కింపైనవియు నీతి ధర్మము మంచితనముతోఁ గూడినవియు నగు మాటలను లక్ష్మణుఁడు చెప్పఁగా రామచంద్రమూర్తి ప్రీతితో విని, 'నాయనా! నీవు చెప్పిన మంచి మాట మేలైనదే. కష్టసాధ్యమైన పని యెట్లు చేయవచ్చునా యని యాలోచింప వలసిన విషయమే. దానికిఁ దగిన ప్రయత్నము చేయఁదగినదే' యని చెప్పుచు,

—♦ శరదృతు వర్ణనము. ♦—

సీ. పదపడి రాముండు ♦ పద్మపలాశాక్షిఁ, దలఁచి లక్ష్మణుతోడఁ ♦ బలికె నార్తి
వేగంటి ధారిణి ♦ విపులధారలచేతఁ, దన్పి పైరులు ప్రోచి ♦ ధన్యుఁ డయ్యె
ద్రుమభూమిధరపురో♦గమఘనంబులు మ్రోఁగి, వర్షించి బడలికఁ ♦ బాపుకొనెడి
కారుమబ్బులు దెసల్ ♦ కాటుక పట్టించి, విమదద్విపము లట్లు ♦ వేగమేదె
ఆ. నంబుగర్భములు మ♦హావేగములు కుట,జార్జునాతిపరిమ♦ళాన్వితములు
జృంభితములు నైన ♦ యెలగోలుగాలులు, విసరి విసరి వీచి ♦ విరతి వెలసె. 79 2
పద్మపలాశ + అక్షి = తామర రేకులవంటి కన్నులు గలది, వేగంటి = వెయ్యి కన్నులు గలవాఁడు, ఇంద్రుఁడు-ఇది బహువ్రీహి సమాసము, విపులధారలన్ = విస్తారమైన నీటిధారలచే, తన్పి = తృప్తినొందించి, ధన్యుఁడయ్యెన్ = చేయవలసిన పని చేసినవాఁడయ్యెను. ద్రుమ = చెట్లు, భూమిధర = పర్వతములు, పురోగమ= వీనికిఁ బైగాఁ బోయెడి, ఘనంబులు = మేఘములు, కాటుక పట్టించి = కాటుక పట్టించినట్లు నల్లగాఁ జేసి, విమద ద్విపములు = మదముడిగిన యేనుఁగులు, ఏదెన్= క్షీణించెను. అంబుగర్భములు = నీళ్లు గర్భమునందుఁ గలవి. కుటజ+అర్జున+అతి పరిమళ+అన్వితములు = కొండమల్లెలు, మద్దులు-వీని పూలయొక్క యతిశయించిన సువాసనతోఁ గూడినవి. జృంభితములు = విజృంభించినవి. ఎలగోలుగాలులు=వానకు ముందు వచ్చు గాలులు.

తాత్పర్యము.

అట్లు చెప్పి యావల రామచంద్రమూర్తి సీతాదేవిని దలఁచి లక్ష్మణుతో నార్తితో నిట్లనియె. ఇంద్రుఁడు వర్షధారలచేత భూమిని దడిపి పైరులను రక్షించి కృతకృత్యుఁడయ్యెను. చెట్లమీఁదుగను కొండలమీఁదుగను పోవు మేఘంబులు ధ్వనించి కురిసి గాసి చెంది బడలిక పాపుకొనుచున్నవి. వానకాలపు మబ్బులు దిక్కులను నల్లగాఁజేసి మదముడిగిన యేనుఁగులవలె వేగము తగ్గినవయ్యెను. లోపల నీళ్లుగలిగి

మహావేగము గలిగి కొండమల్లెపూవులయు మద్దిపూవులయు వాసనలతో నిండి వానకు ముందు వచ్చుగాలులు విసరి విసరి వీచి చాలించుకొనెను.

క. వారిధరవారముల మద,వారణసంతానములయు ♦ బర్హితతులయున్
వీరవర ! కొండవంకల, నారావ మ్మొక్కమాఱె ♦ యణఁగెను వింటే. ౨౯౮

వారిధరవారములయు = మేఘసమూహముల యొక్కయు, మదవారణ సంతానములయు = మదించిన యేనుఁగుల గుంపులయు, బర్హితతులయున్ = నెమిళ్ళ గుంపులయు, కొండవంకలయున్ అనుదానిలో సముచ్చయము 'యు' లోపించి కొండ వంకల సని యయ్యె.

తాత్పర్యము.

మేఘముల గుంపులయు, మదించిన యేనుఁగులగుంపులయు, నెమిళ్లగుంపులయు కొండవంకలయు ధ్వని యొక్కసారిగ నిలిచిపోయెను.

క. ఓలిని వారిదధారల, జాలున నిర్మలములైన ♦ శైలంబులప్ర
స్థాళులు విచిత్రకాంతుల,చే లిప్తము లైనరీతిఁ ♦ జెలఁగెడి నారా. ౨౯౯

వారిదధారల = మేఘముల నీళ్ళధారలయొక్క, ప్రస్థ+ఆళులు = చఱియల సమూహములు, లిప్తములు = పూయఁబడినవి.

తాత్పర్యము.

మేఘజలధారలచేఁ జక్కఁగా నిర్మలముగా ముఱికిపోవునట్లు కడగఁబడిన కొండలయందలి చఱుల వరుసలు విచిత్రకాంతులచేఁ బూయఁబడినట్లున్నవి. ఔరా, యాశ్చర్యము.

క. వ్రీళావతి నవసంగమ, వేళను జఘనములఁ జూపు♦విధముగను శర
త్కూలంకషయున్ సైకత,పాళుల మెలమెల్లఁ జూపు ♦ భంగులు కంటే. ౩౦౦

వ్రీళావతి = సిగ్గుగలస్త్రీ, నవసంగమవేళను = క్రొత్తగా భర్తతో సంగ మించు సమయంబున, జఘనములను = నడుము ముందటిభాగములను, శరత్కూలం కషయున్ = శరత్కాలమందలి నదియును, సైకతపాళులన్ = ఇసుకదిబ్బల ప్రదే శములను.

తాత్పర్యము.

సిగ్గుగలస్త్రీ తనభర్తతోఁ గ్రొత్తగా సంగమించునపుడు మెల్లమెల్లగాఁ గటి ప్రదేశమును జూపునట్లు శరత్కాలనదియు మెల్లమెల్లగాఁ దనలోని యిసుక దిబ్బ లను గనఁబడఁజేయుచున్నది.

క. శారదిశాఖాతతులం, దారాగణతరణికుముద♦ధవకిరణములన్
వారణసత్తమముల నిజ,సారద్యుతిఁ బంచి యమరె ♦ శారద యనుజా. ౩౦౧

శారది = ఏడాకులయరఁటిచెట్లయొక్క, శాఖాతతులన్ = కొమ్మలసమూ హములందు, తారాగణ = నక్షత్రములయందును, తరణి=సూర్యునికిరణములందును,

కుముదధవ = చంద్రుని కిరణములందును; వారణసత్తమములన్ = ఏనుఁగులగుంపులందును, నిజ = తన యొక్క, సారద్యుతి = సారవంతమైనకాంతి, శారద = శరత్కాలము, ఇది కర్తృపదము.

తాత్పర్యము.

శరత్కాలము తన సారవంతమైన తెల్లనికాంతిని గొప్పారపుటరఁటి కొమ్మల యందును, నక్షత్రములందును, సూర్యచంద్రుల కిరణములందును గొప్పయేనుఁగులందును నుంచెను. ఏడాకులరఁటియందుఁ బుష్పములుగాను, నక్షత్ర సూర్య చంద్రులయందు నిర్మల కాంతిగను, ఏనుఁగులయందుఁ గ్రీడలుగను శరత్కాలము ప్రకాశించెను అనిభావము.

క. శారదగుణాత్తయును నా, నారుచిరద్యుతియు నైన ♦ నవ్యశ్రీ బా
లారుణకరబోధిత మగు నీరేజాకరమునందు ♦ నెఱనెఱిఁగాంచెన్. ౮౦౨

శారదగుణాత్త = శరత్కాల సంబంధమైన గుణాతిశయముచేఁ బొందఁబడినది, నానారుచిరద్యుతి = అనేక విధములైన మనోహరమైన కాంతిగలది. నవ్య శ్రీ=మనోహరకాంతి - బాలారుణ = లేఁత సూర్యుని, కర = కిరణములచే, బోధితము = మేలుకొల్పఁబడినది. నీరేజాకరమందు = తామరసరస్సునందు, నెఱ = సంపూర్ణమగు, నెఱిన్ = సౌందర్యమును.

తాత్పర్యము.

శరత్కాలగుణములఁబొంది పెక్కులైన మనోహరకాంతులు గలిగిన క్రొత్తయింపైన కాంతి బాలసూర్యుని కిరణములచే మేలుకొలుపఁబడిన తామరకొలనియందు మిగుల నందగించెను.

క. ఘనసారవృక్షసుమవాసన లై మత్తాళిబృంద♦ఝుంకారము లై
గొనబుగ మదవారణముల,కును దర్పము రేఁపె గాడ్పు♦కొదమలు వనిలోన్. ౮౦3

ఘనసారవృక్ష = పచ్చకర్పూరము కలుగు నేడాకుల యరఁటి చెట్లయొక్క, సుమ = పూలయొక్క, వాసనలై = వాసనలు కలనై, మత్త+అళి = మదించిన తుమ్మెదల, బృంద = సమూహములయొక్క, ఝుంకారములై = ఝుమ్మను ధ్వని గలనై, గాడ్పుకొదమలు = పిల్లగాలులు.

తాత్పర్యము.

పచ్చకర్పూరపుఁజెట్ల పూలవాసనలుగలనై మదించిన తుమ్మెదల ఝుంకారములుగలవై పిల్లగాలులు మదించిన యేనుఁగులకు గర్వము రేఁగునట్లు చేసెను.

సీ. జంట జంటలు గాఁగ ♦ శైవాలినీపులి,నావళియందుండి ♦ యరుగుదెంచి
సరసులఁ గ్రీడించు ♦ జతనంబు గొని తమ,ఱెక్కలు విచ్చుచు ♦ ఱేసి యాడి
పుష్పొళ్లు బుక్కాయు♦పొళ్లుగా మెయినిండ, నెలమినినొండొంటి ♦ నెదురుకొనుచుఁ
జక్రవాకంబులుఁ ♦ జక్రాంగకంబులుఁ, గేళిఁ దేలుచు నున్న♦లీలఁ గంటె

ఆ. మదము దొట్టఁదిరుగు ♦ మాతంగములయందుఁ, గొ్రొవ్వి తిరుగులాడు ♦ కోడెలందు
నీరు తేటతేటపాఱు ♦ నిమ్నగాతతులందు, ఋతువులక్ష్మి దోఁచె ♦ నెన్నఁగ తుల. ౮౦౪

శైవాలినీ = ఏళ్లయొక్క, సూశైవలినీ, పులినావలి = ఇసుకదిబ్బలవరుసల, త్రేసి = విజృంభించి, బుక్కాముపొళ్ళుగా = గంధపొళ్ళుగా, చక్రాంగకంబులు = హంసలు.

తాత్పర్యము.

లక్ష్మణా! జక్కవలు, హంసలు జోడుజోడుగ నేటి యిసుకదిబ్బలయందుండి వచ్చి కొలఁకులందుఁ గ్రీడించుటకై యత్నించి తమ ఱెక్కలు విదిర్చి విజృంభించి, క్రీడించి పూలయందుండు పొళ్లు గంధపుఁ బొళ్ళుగా దేహమునిండఁ బూసికొని సంతోషముతో నెదురుకొనుచు నాటలాడుచున్న విధముఁ జూచితివా? మద మతిశయింపఁ గాఁ దిరుగు నేనుఁగులందును, గొవ్వుపట్టితిరుగు కోడెలందును తేఁటిన తేటనీరుగల నదుల యందును శరదృతువు కాంతి కానవచ్చుచున్నది.

ఆ. చూచి మబ్బులేని ♦ చుక్కదారిని దమ, పించియములనగలు ♦ విడిచి ప్రియులఁ
దలఁగి కాంతి దొఱఁగి ♦ ధ్యానముల్ సేసెడి, నెమ్మిపింఛు వనుల ♦ నెమ్మిజాఱి.

చుక్కదారి = ఆకాశము, నక్షత్రమార్గము; నెమ్మిపింఛు = నెమిళ్ళ సమూహము, నెమ్మి = సంతోషము.

తాత్పర్యము.

మబ్బులులేని యాకాశమునుజూచి తమ పింఛము లను నాభరణములను వదలి ప్రియురాండ్రవదలి కాంతిచెడి నెమిళ్లు సంతోషహీనములై ధ్యానముచేయుచున్నవి

చ. గరగరజాళు వాపసిఁడి ♦ గౌరపుఁగాంతులు నిండ దిక్కులన్
నెరవిరి నిండు వ్రేఁకనను ♦ నేలకు వంగినకొమ్మ లెల్లెడన్
గరమును నేత్రపర్వముగఁ ♦ గ్రాలఁగ ఘుమ్మని కమ్మవాసనల్
నెరయఁగఁ జేయు మంకెనల ♦ నీటు వహించె వనాళులిమ్మెడన్. ౮౦౬

గరగర = నిర్మలమైన, గౌరపుఁగాంతులు = పచ్చవన్నెలు, నెరవిరి నిండు వ్రేఁకనను = దండిగాఁబూచిన పూవుల బరువుచే, నేత్రపర్వముగన్ = కన్నుల పండువుగ.

తాత్పర్యము.

నిర్మలమైన యపరంజి బంగారువంటి పచ్చనికాంతులు దిక్కుల నిండఁగా నిండారఁ బూచిన పూవుల బరువుచేఁ గొమ్మలు నేల జీరాడుచుండఁగా మిక్కిలి కన్నులపండువుగఁ గమ్మని వాసనలను ఘుమ్మని దిక్కులందు వ్యాపింపఁ జేయు మంకెన పూవులచే నడవు లందగించెను.

మ. కరిణీసంతతి వెంట నంట నళిసీ ♦ కాండప్రియంబుల్ కరుల్
వరసూనోద్ధతముల్ మహావనతటీ ♦ వాహ్యాళిసంసక్తముల్

గురుదానోత్కటముల్ మహామదరసా♦లోలంబులై మందసం
చరణస్థితము లయ్యెఁ గాననముల♦ సౌమిత్రి! కంటే కదా. ౫౦౬

కరిణీ = ఆడేనుఁగుల, సంతతి = సమూహము, నళినీకాండ ప్రియంబుల్ = తామరతూండ్లయం దాసక్తి గలవి, తామర కొలఁకుల నీటియం దాసక్తి గలవి, వరసూనోద్ధతముల్ = శ్రేష్ఠములైన యేడాకుల యరఁటిచెట్ల పూవుల వాసనలచే మదించినవి, మహావనతటీ = గొప్ప యడవి ప్రదేశములందు, వాహ్యాళి= వయ్యాళి తిరుగుటయందు, విలాస సంచారములందు, సంసక్తముల్ = తగిలిన మనస్సుగలవి, గురు = గొప్పదగు, దాన = మదపు నీళ్ళచే, ఉత్కటముల్ = చీలిన చెక్కిళ్లు గలవియు, మహామదరసాలోలంబులు = గొప్ప మదరసముచే నూఁగులాడునవి, మందసంచరణ స్థితము లయ్యె = మిక్కిలి తిన్నగా నడచునవి అయ్యెను. కరుల్- కర్తృపదము.

తాత్పర్యము.

సౌమిత్రీ! యీ యడవియందలి యేనుఁగులఁ జూచితివా? ఆఁడేనుఁగులు తమ వెంట రాఁగాఁ దామరతూండ్లయందుఁ దామరకొలని నీళ్ళయందుఁ బ్రియముగల వియుఁ గప్పురపు టనంటుల వాసనలచే గర్వించినవియుఁ బెద్దయడవులందు వినోద సంచారములు చేయునవియు మదపునీళ్లు కాఱుటచేఁ బగిలిన చెక్కిళ్లుగలవియు నగు నేనుఁగులు మదరసాతిశయముచే నూఁగులాడుచు మెల్లగా నడచుచున్నవి.

చ. వెలఁగె నభం బదే చికిలిఁ♦జేసిన వాలులడాలునన్, నదీ
జలములు సన్నగిల్లె, నెల♦జవ్వని మెక్కు మెలంతనడుమ్మునా
జలరుహశీతవాతముల♦సంచరణం బొనరెన్, దిశాతతుల్
కళకళలాడుచున్నవి ప్ర♦గాఢపుఁజీఁకటి తమ్ముఁ బాసినన్. ౫౦౭

చికిలిఁజేసిన = తుడిచి మెఱుఁగుపెట్టిన, వాలుల = కత్తుల, డాలునన్ = కాంతిచే, జలరుహశీతవాతముల = కమలములమీఁదనుండి వచ్చుటచేఁ జల్లనైన గాలులయొక్క.

తాత్పర్యము.

దుమ్ముదుడిచి మెఱుఁగుపెట్టిన కత్తులకాంతిచే నాకాశము ప్రకాశించు చున్నది. లేఁబ్రాయ మెక్కుచున్న స్త్రీనడుమువలె నేటిజలములు సన్నగిల్లెను. కమలముల చల్లనివాయువులు సంచారము చేయుచున్నవి. దట్టపుఁజీఁకటులు తమ్ము వదలిపోవుటచే దిక్కులు కాంతియుక్తములైనవి.

ఉ. వేఁడి వెలుంగుకాఁకలకు ♦ బీఁటలు వాఱఁ దొడంగెఁ బంకముల్
మాఁడినయట్లుగా ధరణి ♦ మాటికి రేఁగెను సాంద్రధూళి, మ
న్నీఁడులు వైరకోపముల ♦ నీఁగఁగ నొండొరుల జయింపఁగాఁ
బోఁడిమి దండయాత్రఁ జనఁ ♦ బూనఁగఁ గాలమి దయ్యె లక్ష్మణా. ౫౦౮

బీటలు = పగుళ్లు, సాంద్రధూళి = దట్టమైనదుమ్ము, మన్నీఁడులు = రాజులు.

తాత్పర్యము.

సూర్యుని యెండవేఁడిమికి బురదలు పగుళ్ళు పాఱుచున్నవి, నేలమాఁడినట్లు దుమ్ములు రేఁగుచున్నవి. రాజులు తమ విరోధములు కోపములు దీర్చుకొన నొకరి నొకరు జయింపఁగా దండయాత్ర పోవుటకై ప్రయత్నము చేయుటకు నిదే తగిన కాలము.

ఉ. పొంకముగా శరత్సుగుణపుంజసుతుష్టశరీరశోభ ని
శ్శంకముగాఁగఁ గ్రమ్మరుచు ♦ సాంద్రముదంబునఁ బోతరించి పెన్
హుంకృతు లొప్పఁ గొమ్ము లొక ♦ యోరగ వ్రాలుచుచున్ ఖణిల్లనన్
అంకెలు వైచి చివ్వకును ♦ అక్కేడిఁ గాళ్ళు వృషాళి మందలన్. ౮౧౦

శరత్సుగుణ పుంజ సుతుష్ట శరీరశోభ=శరత్కాలముయొక్క మంచిగుణముల యొక్క సమూహముచే మిక్కిలి వర్ధిల్లిన దేహకాంతిగలది, పోతరించి = బలిసి = గర్వించి, అక్కేడిన్ = గీఱుచున్నవి, వృషాళి = ఎద్దులగుంపులు.

తాత్పర్యము.

ఒప్పునట్లు శరత్కాలముయొక్క మంచిగుణములచే మిక్కిలి వృద్ధి చెందిన దేహకాంతిగలవై మందలయందలి కోడెలు బలిసి గర్వించి జంకు భయములేక దిరుగుచు హుమ్మని కొమ్ము లొక ప్రక్కగ వంచి ఖణిల్లనునట్లు అంకెలువైచుచుఁ గలహమునకుఁ గాళ్లుగీఱుచున్నవి.

చ. నలినశరప్రపీడితమ♦నంబునఁ దీవ్రగతానురాగ మై
కులచయసంయుతంబగుచుఁ ♦ గూరిమి మీఱఁగ మందయాన మై
సలలితభంగిఁ దోఁపఁగ వ♦శాచయ మాత్తమదున్ నిజేశ్వరున్
దలఁగక వెంట నంటెడిని ♦ దమ్ముఁడ చూచితె కాననంబులన్. ౮౧౧

నలిన శరప్రపీడిత = మన్మథునిచేఁ బీడింపఁబడిన, మనంబునన్= మనస్సుచే, తీవ్రగతానురాగమై = తీవ్రముగాఁ బొందిన యనురాగము గలదై, కులచయ సంయుతంబు = తనతోపాటి యేనుఁగులతోఁ గూడినది, మందయానమై = మెల్లని గమనము గలదై, వశాచయంబు = ఆఁడేనుఁగుల గుంపు, ఆత్తమదున్ = మదించిన వానిని.

తాత్పర్యము.

మన్మథునిచేఁ బీడింపఁబడినవై, యా కారణమునఁ దీవ్రమైన యనురాగము గలదై, తమవంటి యేనుఁగులతోఁ గూడి కూరిమితో మెల్లగా నడచుచు మనోహరముగ నాడేనుఁగుల గుంపు మదించిన తమ భర్తను విడువక వెంటనంటి యడవులందుఁ బోవుచున్నవి. లక్ష్మణా, చూచితివా?

క తొడవు లగు పేరీపురులన్, విడిచి నదీతీరమునకు ♦ వెడలఁగ హంసల్
వడి గద్దించిన మరలెడి, వడువున దైన్యమునఁ జనెడి♦బర్హాలఁగంటే. ౪౧౨

తొడవులు = ఆభరణములు, పురులన్ = పింఛెములను, బర్హాలన్=నెమిళ్ళను.

తాత్పర్యము.

తమ కలంకారముగా నున్న పురులను వదలి నదీతీరములకుఁ బోఁగానం దున్న హంసలు బెదరింపఁగా వెనుకకు మరలు చున్నవా యేమి యన్నట్లు దీనములై యున్న నెమిళ్ళఁ జూడుము.

క. జక్కవల నీరుకోళ్ళను, జక్కఁగ దిగులొంద నెగచి♦సామజములు అం
పెక్కఁగ నలినాలంకృత, మక్కొలఁకుం గలఁచి కలఁచి♦యంబులు గ్రోలెన్. ౪౧౩

ఎగచి = తఱిమి, సామజములు = ఏనుఁగులు, అంపు — గడబిడధ్వని, నలినాలంకృతము = తామరలచే నలంకరింపబడినది. కలఁచి = కలియఁబెట్టి.

తాత్పర్యము.

చక్రవాకములను నీరుకోళ్లను బాగుగ నేనుఁగులు తఱుమఁగొట్టి ధ్వనిచేయుచుఁ గమలములచే నలంకరింపఁబడిన యా కొలనిని గలియఁబెట్టి కలియఁబెట్టి నీళ్లు త్రాగుచున్నవి.

క. అస లుడిగి విసులజలములు, నిసుమును వెలుఁగఁగ సధేను♦బృందం బగు సా
రసరావరణితతటినీ,రసముల సారసచయంబు ♦ రమణం గ్రుంకెన్. ౪౧౪

అసలు = బురద, ఇసుమును = ఇసుకయును, సధేనుబృందము = ఆవులమందలతోఁగూడినది, సారస = బెగ్గురుల, రావ = ధ్వనిచే, రణిత = ధ్వనించుచున్నట్లు చేయఁబడిన, తటినీరసములన్ = ఏటినీళ్లయందు, సారసచయంబు = బెగ్గురులగుంపు, క్రుంకెన్ = స్నానము చేసెను మునిఁగెను.

తాత్పర్యము.

బురద యడుగంటి తేఱిన తేటనీళ్ళు, ఇసుక ప్రకాశింపఁగా నావులమందలతోఁగూడిన బెగ్గురు పక్షుల ధ్వనులు గల యేటినీళ్ళయందు బెగ్గురు పక్షులు స్నానము చేయుచున్నవి చూడుము.

చం. ఎడపక దూఁకు చున్న సెల♦యేళుల చప్పుడు, వృద్ధి నొందుఁ దా
ముడుగక మ్రోయు చుండెడి మ♦యూరరవంబులు, గాలిమ్రోఁతలున్,
నుడుఁగక కట్టుఁబట్టు యని ♦ మ్రోఁగెడు కప్పల నాదుఁబంపులున్
బొడ వడఁగెన్ ముదంబు చెడ ♦ భూరివలాహకగర్జతోడుతన్. ౪౧౫

ఎడపక = వదలక, పొడవడఁగెన్ = క్షీణించెను, భూరి = గొప్పదగు, వలాహక = మేఘముల, గర్జతోడుతన్ = ఉఱుములతో, సహోక్త్యలంకారము.

తాత్పర్యము.

విడువక దూఁకుచున్న సెలయేళ్ల చప్పుడు అతిశయించుచు వదలక మ్రోయు

నెమిళ్ళ కేకలు గాలిమోఁతలు తగ్గక కట్టఅట్టఅట్టని కూయు కప్పలకూఁతలు ఇవన్ని యు మేఘగర్జనలతో క్షీణించెను.

కం. పెక్కుల వన్నెల పాములు, బక్కటిలి నవోదితాబ్ద♦పరిలీనము లై
డొక్కలు మాడఁగ నాఁకట, బొక్కలు వెలువడి చరించు ♦ బుసుబుసుమంచున్.

బక్కటిలి = చిక్కి, = నవ=క్రొత్తగా, ఉదిత = పుట్టిన, అబ్ద = మేఘముల వలన, పరిలీనములై = దాఁగినవై, డొక్కలు = కడుపులు, మాఁడఁగన్= మండఁగ.

తా త్ప ర్య ము.

క్రొత్తమేఘము లుఱిమినపుడు భయపడి పుట్టలలో దూఱి వెలికిరాకుండుటచే నాఁకలిచేఁ గడుపులోఁగాలి యా కారణముచే బక్కచిక్కియుండు పలువిధముల వన్నెలుగల పాము లిప్పుడు దిగులుతీఱి బుస్సుబుస్సుమని బయటవచ్చి తిరుగుచున్నవి.

కం. చంచచ్చంద్రకరస్పర్శాంచిత ముద్వికచతార♦కాన్విత యౌరా
మించఁగ రాగము సంధ్య త్యజించెడి నంబరముఁ దాన ♦ చెలువుగఁ గం టే.౧౧౭

చంచత్ = ప్రకాశించుచున్న, చలించుచున్న, చంద్రకర=చంద్రకిరణముల యొక్క, స్పర్శ = తాఁకుటచే, అంచిత = ఒప్పుచున్నది, ముత్ = సంతోషముచే, వికచ = వికాసము నొందిన, తారకా = (౧) కంటిపాపలతో (౨) నక్షత్రములతో (౧) రాగము = ఎఱ్ఱనికాంతి (౨) అనురాగము- అంబరము = వస్త్రము (౨) ఆకాశము- తాన = తనకుఁదానే- శ్లేషాలంకారము- సమాసోక్తియును.

తా త్ప ర్య ము.

సంధ్యయనెడు స్త్రీ చంద్రుఁడనెడి నాయకుని కరస్పర్శముచే నొప్పుచున్నదై సంతోషముతో వికసించిన నక్షత్రము లను కంటిపాపలు గలదై యెఱ్ఱని కాంతియనెడి యనురాగ మతిశయింపఁగాఁ దనకుఁ దానే యాకాశ మనెడి చీరను వదలుచున్నది.

కం. ఉదితశశిరమ్యముఖి తమి, విదితోడువ్యక్తచారు♦విమలాంబక కౌ
ముదకౌముదీవసన యయి, యిదె శే వెలిచీరఁ దాల్చు♦నింతిం బోలెన్. ౧౧౮

ఉదిత = ఉదయించిన- శశి = చంద్రుఁడనెడి- రమ్యముఖి = మనోహరమైన ముఖముగలది. తమిన్ = (౧) కోరికతో (౨) రాత్రియందు- విదిత = తెలియఁబడుచున్న- ఉడు = నక్షత్రములనెడి- వ్యక్త = స్ఫుటములైన. విమల = నిర్మలములైన అంబక = నేత్రములు గలది- కౌముద = శరత్కాల సంబంధమైన- కౌముదీ=వెన్నెల యనెడి- వసన=చీరగలది- శే = రాత్రి- వెలిచీర = తెల్లని చీర- ఇంతిన్ = స్త్రీని- ఉపమాలంకారము.

తా త్ప ర్య ము.

ఉదయించు చంద్రుఁడనెడి ముఖము గలదై, కానవచ్చుచున్న నక్షత్రములనెడి కన్నులుగలదై శరత్కాలమందలి వెన్నెల యను చీరగలదై రాత్రి తెల్ల చీర కట్టుకొన్న స్త్రీవలె నున్నది.

ఉ. పండినయెన్నుజొంపములు ♦ భాసిల ముక్కుల సారసావళుల్
దండిముదంబునన్ మొగులు♦దారిని మారుతవేగఘూతముల్
నిండుజవంబునం బఱచె ♦ నిర్మలశీలక! పెక్కువన్నెపూ
దండలు గూర్చి నింగి యను♦తామరసాక్షి ధరించినట్టులై. ౪౮

జొంపములు = గుత్తులు- సారసావళుల్ = బెగ్గురుల గుంపులు- మొగులుదారిన్ = ఆకాశమందు, మారుత = గాలియొక్క- వేగ=వేగముచే- ఘూతముల్ = ఎగురఁ గొట్టఁబడినవి- జవంబునన్=వేగమున- నింగి=ఆకాశము- తామరసాక్షి=స్త్రీ.

తాత్పర్యము.

పండిన పైరుల యెన్నుల గుత్తులను ముక్కులందుఁ గఱచుకొని యాకాశమున గాలిచే నెగురఁ గొట్టఁబడినవై మిగుల వేగముగా బెగ్గురులు పరువెత్తుచున్నవి. ఇది చూడ నాకాశము నానావర్ణములు గల పూవుల దండలను ధరించిన స్త్రీవలె నున్నది.

ఉ. నిద్దురగొన్నహంస మయి ♦ నిర్మలకైరవవారయుక్తమై
యద్దిర పేరగాధపుజ♦లాశయమందలినీర మొప్పెడిన్
రద్దు పడంగ మేఘములు ♦ రాకనిశాకరుతోడఁ జుక్కలన్
ముద్దులు మూటఁగట్టు నభ♦ముం దలపించుచు నూర్మిళాధవా. ౪౯

కైరవ వారయుక్తము = కలువల గుంపులతోఁ గూడినది- పేరు = అధికమైన- అగాధపు = మిగుల లోఁతుగల- జలాశయమందలి = మడుఁగు నందలి; రద్దు పడంగన్ = పోఁగా- రాక = నిండుచందురునితోడి రాత్రి- నిశాకరుతోడన్ = చంద్రునితో- స్మృత్యలంకారము.

తాత్పర్యము.

తూఁగుచున్న హంసములు నిర్మలములైన తెల్ల కలువల గుంపులు వీనితోఁ గూడి మిగుల లోఁతుగల మడుఁగులందలి నీళ్ళు మేఘములు కానరాకపోఁగా నిండు పున్నమనాఁడు చంద్రునితోఁ జుక్కలతో ముద్దులు మూటగట్టుచున్న యాకాశమును స్మృతికిఁ దెచ్చుచున్నది.

హంసకుఁ జంద్రునకు, తెల్లకలువలకు నక్షత్రములకు, మేఘములులేని యాకాశమునకు బురదలేని మడుఁగునకుఁ బోలిక గ్రహింపవలెను.

ఉ. రాణ దలిర్పఁగా లలిత♦రాజమరాళకులంబు చట్టు నొ
డ్డాణముతీవిఁ దాల్పఁ, బ్రక♦టస్ఫుటనీలసరోజపద్మముల్
పోణిమి మీఱుపేరులను ♦ బోలఁగ, నూతులు భూషితాంగ లౌ
నేణవిలోచనామణుల♦యొంపు వహింపఁగఁ గంటె లక్ష్మణా! ౫౦

లలిత = అందమైన- రాజమరాళకులంబు = రాజహంసల సమూహము- ప్రకటస్ఫుట నీలసరోజపద్మములు = బాగుగవికసించిన నల్లకలువలు- తామరలు, పేరులను = హారములను- నూతులు = బావులు- భూషితాంగలు = అలంకరింపఁ

బడిన దేహములు గలవారు- ఏణవిలోచనానాముల = జింకకన్నులవంటి కన్నులుగల స్త్రీరత్నముల- నూతులు = బావులు- వికృతిశబ్దము స్త్రీసమముగాన నిచ్చట స్త్రీ పర్యాయముగను నర్థము గ్రహింపనగు.

తా త్ప ర్య ము .

అందము వృద్ధియగునట్లు రాజహంస లొడ్డాణమువలెఁ జుట్టుకొనఁగా వికసించిన నల్లకలువలు కమలములు నీలరత్నముల హారమువలెఁ బ్రకాశింపఁగా బావు లలంకరించుకొన్న స్త్రీరత్నములవలె నున్నవి చూడుము.

సీ. గోపాలబాలురు♦కొమరొప్ప వాయింపఁ, బిల్లఁగ్రోవులఁ బుట్టు♦ప్రియరవంబు
రెపరెప మని వీచు♦ రేపటిపూఁటల,యెలగాలి జనియించు♦హితనదంబు
వ్రేండ్ల పూవుంబోండ్లు♦ పెరుఁగు చిల్కఁగఁబుట్టు,ఘుఘుమమని యెడి♦కొమరుటులివు
చియ్యపట్టినకోడె ♦ యొయ్యన నసగూఁట, సారెకు నినుచు హుం♦ భారవంబు
తే. లేఁగలను విడుకాలంబు♦గాఁగ నవియు, నాఁకొనుటను నంబే యని ♦ యఱచునాదు
చేలకును జెట్లకును జను♦హాలికులయు, నులివు లిప్పుడు బెరసె నొం♦డొంటితోడ.

రేపటిపూఁటలన్ = ఉదయకాలములందు, ఎలగాలి = పిల్లగాలి, మందమారుతము, హితనదంబు = ఇంపైనధ్వని- వ్రేండ్లపూవుంబోడ్లు = గొల్లవారిస్త్రీలు- ఉలివు = చప్పుడు- చియ్య = మాంసము, నసగూఁటన్ = కామమదముచే- ఆఁకొనుటను = ఆఁకలిగొనటచే- హాలికులయు = కాపులయొక్కయు- బెరసెన్ = కలిసికొనెను.

తా త్ప ర్య ము .

గొల్లపిల్లవాండ్రు వాయించు పిల్లంగ్రోవుల ధ్వనులు, ఉదయకాలమున రెపరెపమని వీచు మందమారుతములధ్వని, గొల్లెతలు పెరుఁగు చిలుకఁగాఁ బుట్టు ఘుంఘుమ్మనునాదము, బలిసిన కోడెలు కామోద్రేకముచేఁ జేయు హుంభారవము దూడలను విడుచు కాలమగుటచే నవి యాఁకలికి నంబే యని యఱచు నఱపులును, చేలకుఁ జెట్లకుఁ బోవు కాపువారి ధ్వనులన్నియు నొకదానితో నొకటి కలిసికొని పోయినవి.

చం. సలలితవేణికాకుసుమ♦సంచయభూరివిభాసమానమై
పలుచనికోమలంపు నునుఁ♦బయ్యెర యొయ్యన సంచలించుచున్
వలిపపుఁబట్టుఁబుట్టపు బెం♦ణంగు సహించిన త్రెల్లపూవులన్
గులుకు మెఱుంగుకూలముల♦కోమలికంబును గంటె తమ్ముఁడా. ౮౨3

సలలిత = అందమైన, వేణికా = ప్రవాహమందలి, కుసుమసంచయ=పూల గుంపులచే, భూరి = మిక్కిలి, విభాసమానమై = ప్రకాశించునదియై, పయ్యెర = గాలి, ఒయ్యన = మెల్లగా, వలిపపు = సన్నని, పట్టుఁబుట్టపుబెణంగు = పట్టు గుడ్డ యందమును- కోమలికంబు = సౌందర్యము.

తా త్ప ర్య ము.

మనోహరమైన ప్రవాహము లందలి పూలగుంపులచేఁ బ్రకాశించుచుఁ బలుచని మృదువైన గాలికి మెల్లగాఁ గదలుచు సన్నని తెల్ల పట్టువస్త్రము కాంతిగల తెల్లు పూవుల నందమైన నదీతీరములందుఁ జూచితివా తమ్ముఁడా.

చం. ప్రకటవనప్రచండమధు♦పానకళాభృశశౌండహృద్యహ
ర్షకభసలప్రకాండయుత♦సమ్మదతాండవితద్విరేఫముల్
సుకమల రేణుగౌరతను♦శోభ వహించి మదంబు పేర్మిఁ గొం
చక పవనానుయాత్రి నదె ♦ సల్పుచు నున్నవి చూడు లక్ష్మణా. ౮_౫౪

ప్రకట వనప్రచండ = గొప్ప యడవులం దడ్డము లేకపోవునవియు- మధుపానకళా భృశశౌండ = తేనె ద్రావుటచే మిగులఁ గ్రొవ్వినవియు, హృద్య హర్షక= మనోహరములు, సంతోష కరములు నగు- భసలీ ప్రకాండ = ఆఁడు తుమ్మెదల గుంపులతో- యుత = కూడినవియు- సమ్మద = సంతోషాతిశయముచే- తాండవిత = తాండవ మాడుచున్న- ద్విరేఫముల్ = తుమ్మెదలు- భ్రమర శబ్దమునందు రెండు రకారము లున్నవి- కావునఁ దుమ్మెదలకు ద్విరేఫములని పేరు. సుకమల = మంచికమలముల- రేణు = పుప్పొడిచే- గౌరతనుశోభ = పచ్చని దేహకాంతి- వహించి = కలవై - పవన + అనుయాత్రికుఁ=గాలివెంటఁ బోవుటకై, దాని వాసన వలన నని భావము.

తా త్ప ర్య ము.

పెద్ద యడవులం దడ్డములేకపోవుచుఁ దేనె తనివిదీరఁ గడుపులు నిండఁ ద్రావుచు, సంతోషముతో నాఁడుతుమ్మెదలు తమ వెంటరాఁగా గండుతుమ్మెదలు కమలములయందలి పుప్పొడి సోఁకుటవలనఁ బచ్చనికాంతిగలవై మదించి పరిమళముతోఁ గూడి పోవుచున్న గాలివెంట నా వాసనకై తాము బోవుచున్నవి చూడుము.

ఉ. తేటెను వారిపూరములు ♦ దెల్వి వహించెను గైరవావళుల్
దేటెను గ్రౌంచపిండునకుఁ ♦ దీయనినాదము, పక్వసుస్థితిఁ
మీటెను శాలికావనులు ♦ మెల్లన పీవఁ దొడంగె వాయువుల్
జాటుట వానకాల మిదె ♦ చంద్రుఁడు సాంద్రరుచిఁ వెలింగెడిన్. ౮_౫౫

వారిపూరములు = జలప్రవాహములు - కైరవావళుల్ = కలువల సమూహములు- క్రౌంచపిండునకుఁ = క్రౌంచపక్షులగుంపునకు- పక్వసుస్థితిఁ = పండిన దశను- శాలికావనులు = వరిపైరులు- ఇది కార్తికమాసమని తెలుపుచున్నది. సాంద్రరుచిఁ = దట్టపుఁగాంతిచే.

తా త్ప ర్య ము.

ఏళ్లయందు నీరు బురదలేక నిర్మలములయ్యెను. కలువలు వికాసము నొందెను. క్రౌంచములకుఁ దీయనినాదము తీఱెను. కార్తికపుఁగారు వరిపైరులు పండిన వయ్యెను, వాయువులు మెల్లగా వీచెను. వానకాలము పోవుటచేఁ జంద్రుఁడు దట్టపు వెన్నెల కాయఁజొచ్చెను. 'మాహిషంచ శరచ్చంద్రచంద్రికాధవళం దధి' యని కాళిదాసుఁడు.

తే. మేల్మి మీనోపదర్శిత♦మేఖల లయి, యలసగతు లయ్యె వాహినీ♦జలజవదన
లతులరతులను బ్రియులతో♦నవఁగి, పెనఁగి, వేగ వసివాళ్లు వడి చను♦వెలఁదు లనఁగ.

మీనోపదర్శిత మేఖలలు = చేఁపలవలెఁ గానవచ్చు నొడ్డాణములు, బిళ్లల మొలత్రాడువలెఁ జేఁపలయాకారములు చెక్కఁబడిన బిళ్లలుగల యొడ్డాణములు- అలసగతులు - తిన్నని నడకగలవి. వాహినీ జలజవదనలు = నదులు అను స్త్రీలు- వసివాళ్ళు = మిక్కిలివాడుటలు- 'వసివాళ్వాడుచు వచ్చుచున్నయది కర్ణాటాంగనం గంటివే' యని శ్రీనాథుఁడు. వెలఁదులు=స్త్రీలు ఇందు నాయిక సామాన్య, అభిసారిక.

తా త్ప ర్య ము.

చేఁప లనెడు నొడ్డాణముల ధరించి నదులనెడి స్త్రీలు ప్రియులతో రతికేళి దేలి యలసి సొలసి మెల్లగాఁ దమ యిండ్లకుఁ బోవు వేశ్యలవలె మెల్లగాఁ బోవుచున్నవి.

కం. జక్కవలన్ శైవాలపుఁ, బెక్కువలన్ తెల్లుపూవు♦వెలిచేలములన్
మిక్కిలి నదిముఖములు సాం, పెక్కెను సతిముఖములట్లు ♦ భృతపత్రములై. ర_౨౮

శైవాలపుఁ బెక్కువలన్ = నాచుయొక్క యతిశయమును- వెలిచేలములు = తెల్లవస్త్రములు- భృత = భరింపఁబడిన- పత్రములై = ఆకులుగలవై - మకరికా పత్రములుగలవై.

తా త్ప ర్య ము.

జక్కవలచేతను, అతిశయించిన నాచుచేతను తెల్లుపూవు లను తెల్లని చీరల చేతను నదులముఖములు స్త్రీలముఖములవలెఁ బత్రములతోఁ గూడియున్నవి.

చక్రవాకములకు స్తనములకు, శైవాలమునకు వెండ్రుకలకుఁ బోలిక గ్రహించునది.

కం. వనముల వికసితబాణా,సనముల మధుపానమత్త♦షట్చరణమహా
స్వనముల నుద్యతబాణా,సనదండుఁడు మరుఁడు నలుపు ♦ సంచారములన్. ర_౨౯

వికసిత బాణాసనములన్ = పూచిన నల్లగోరఁటలు- వేగిసచెట్లను గలవియు, మధుపాన = తేనె త్రాగుటచే- మత్త = మదించిన- షట్చరణ = తుమ్మెదల- మహా స్వనములన్ = గొప్పధ్వనులు గలవియగు వనములందు- ఉద్యతబాణాసనదండుఁడు= ఎత్తఁబడిన కోదండ మను దండము గలవాఁడు.

తాత్పర్యము.

పూచిన నల్లగోరంటలు వేగిసలు గలవియు దేనెత్రావుటచే మదించిన తుమ్మెదల సంచారములు గలవియు నగు వనములందు నెత్తబడిన దండమువంటి విల్లుగలవాఁడై మన్మథుఁడు సంచారము చేయుచున్నాఁడు.

తే. తతము జగతికి జీవ ♦ దాన మొసఁగి, యేళ్లు చెఱువులుఁ గొలఁకులు ♦ నెల్ల నించి
భూమిఁ బైరులఁ బంటల, ♦ బొసఁగఁ జేసి, యంబుధరములు నష్టంబు ♦ లయ్యెనిపుడు

తతము = విస్తారముగ- జగతికి = లక్షణచేఁ బ్రపంచమునఁ గల జీవకోటికి- జీవనదానము = (౧) జలదానము (౨) ప్రాణాధారమైన మనుగడను- అంబుధరములు = మేఘములు.

తాత్పర్యము.

ప్రపంచములోని జీవులకెల్ల జీవన మనెడి జీవనము (నీళ్ళనెడి మనుగడను) దానమిచ్చి, యేళ్ళు చెఱువులు కొలఁకులు వీనిని వాని వాని యోగ్యతానుసారముగ నిండించి భూమియందుఁ బైరు పంటలు వృద్ధిఁ బొందించి మేఘములు నష్టములయ్యెను.

ఇందుఁ దన సర్వస్వము లోకోపకారకముగ దానము చేసిన మహాదాత సూచింపఁ బడుచున్నాఁడు.

తే. సుప్రసన్నోదకంబుల ♦ శోభతోడ, నింబుమీఱిన కురరీర ♦ వంబుతోడ
హాళిఁ దిరిగెడి జక్కవ ♦ పాళితోడ, సరసు లెల్లను దోఁచెను ♦ సరసముగను. ౬౦

సుప్రసన్న+ఉదకంబుల శోభతోడన్ = మిగుల నిర్మలములైన జలముల కాంతితో- ఇంబుమీఱిన = మిగుల మనోహరమైన, కురరీరవంబుతోడన్ = క్రౌంచ పక్షుల ధ్వనులతో- సరసులు = కొలఁకులు- సరసముగ = ఇంపుగ- ఆనందకరముగ, సరసిశబ్ద బహువచనము- సరసులు.

తాత్పర్యము.

నిర్మలజలకాంతితో మనోహర క్రౌంచధ్వనితో విలాసముగాఁ దిరుగు జక్కవల గుంపులతోఁ గొలఁకులు మహానందకరములై యున్నవి.

కం. కొండలచఱులన్ శ్యామా,దండము బంధూకకోవి ♦ దారాసనముల్
దండిగ వాసన లీనుచు, నుండెడి యేడాకులరఁటు ♦ లొప్పెడిఁ గంటే. ౬౧

శ్యామాదండము = తెగడచెట్లగుంపు- బంధూక = మంకెనలు- కోవిదార = కాంచనపుఁ బూవులు.

తాత్పర్యము.

కొండచఱులందుఁ దెగడచెట్లపూలు మంకెనపూలు కాంచనపూలు అసనములు ఏడాకులరఁటులు విస్తారముగ వాసనల వెదచల్లుచు నున్నవి చూచితివా ?

కం. పులినతలంబులఁ గురరుల,విలసనముల సారసముల ♦ విహరణ కేళుల్
సులలితరథాంగదంపతి,కలకలనాదములు వెలసెఁ ♦ గడురమ్యములై. ౬౨

పులినతలంబులన్ = ఇసుక తిప్పలయందు.

తాత్పర్యము.

ఇసుకదిన్నెలందుఁ గ్రౌంచముల వికాసములు బెగ్గురుల విహారములు హంస దంపతుల కలకలధ్వనులు మిగుల మనోహరములై వెలయుచున్నవి.

కం. పరిపంథులైన నృపతులు, పరస్పరజయాభిలాషఁ ♦ బయనించుటకై
పోరి యత్నముఁ జేయ నిదే, తరుణము సౌమిత్రి యింకఁ ♦ దడయం జనునే.

పరిపంథులు = శత్రువులు.

తాత్పర్యము.

శత్రువులగు రాజు లొకరినొకరు జయించు కోరికగలవారై దండయాత్ర పోవుటకై కావలసిన సేనలను సామగ్రిలను జేర్చుకొన యత్నించుకాలమిదే. ఇంక నాలస్యము చేయరాదు.

—♦ సుగ్రీవుఁడు సమయ మతిక్రమించినందునకు శ్రీరాముఁడు విచార పడుట. ♦—

ఉ. వానరనాథపుత్రుఁ డిట ♦ వచ్చినవాఁడును గాఁడు, యత్నమేన్
జేసినఁగాడ లేదు, గడ♦చెన్ శతవర్షము లొచుఁ బ్రావృషన్
మాసచతుష్క మక్కట సు♦మాళమునన్ ననుఁ గూడి యాడు సీ
తాసతిఁ బాసి శోకమునఁ ♦ దత్తఱలాడెడి నాకు లక్ష్మణా! ౬౪

శతవర్షములు = నూఱేండ్లు- ప్రావృషన్ = వర్షాకాలమందు- మాసచతుష్కము = నాలుగునెలలు- సుమాళమునన్ = సంతోషాదులవలనఁ గలిగెడు పారవశ్యముచేత- తత్తఱలాడెడు = తపించు.

తాత్పర్యము.

లక్ష్మణా ! సుగ్రీవుఁడా యిచ్చటికి వచ్చినవాఁడుగాఁడు. రాకుండిన పోనిమ్ము, ఏదైన యత్నము చేసినాఁడా యనిన నదియునులేదు. క్రొత్తకోతులేవియు వచ్చినట్టులేదు. సంతోషపరవశత్వముచే ననుఁ గూడియాడు సీతాదేవి లేని కారణముచే శోకమునఁ దపించు నాకు నీ వర్షాకాలము నాలుగునెలలు నూఱుసంవత్సరములవలెఁ గడచెను.

ఇచ్చటఁ గొందఱాషాఢాది నాలుగునెల లని శ్రావణాది నాలుగు నెలలని కొందఱు వ్రాసియున్నారు. ఈ ప్రస్తావన కార్తికమాసమందు జరగుచున్నది. కావున శ్రావణాది నాలుగు నెలలు పూర్తికాలేదు. రామచంద్రమూర్తి నాలుగు నెలలు గడచె ననెను గావున ఆషాఢమునఁ బున్నమ మొదలు లెక్కించుట బాగు. కార్తిక పున్నమతో వర్షములు ముగియును. ఆవలఁ గార్యవిఘ్నము చేయు వానలుండవు.

ఆ. చక్రవాకి భర్తృ♦సంగతిఁ బాయక, చనెడిరీతి విషమ♦వనమునకును
నాటతోఁట కరుగు♦న ట్లరుదెంచెను, భర్తృహితసమేత ♦ బాల సీత. ౬౫

చక్రవాకి = ఆడుచక్రవాక పక్షి- విషమవనమునకున్ = క్రూరమైన యడవికి- ఆటతోఁట = ఉద్యానవనము- భర్తృహిత సమేత = భర్తకు మేలు చేయవలయునను కోరిక గలది.

తాత్పర్యము.

ఆఁడుచక్రవాకము మగని విడిచి యుండలేక కూడ నుండునట్లు కష్టకారణమైన యీ ఘోరారణ్యములకు, నుద్యానవనమునకుఁ బోవునంత సంతోషముతోఁ బతికి మేలుచేయు కోరిక గలదై వయస్సునఁ జిన్నదైనను సీతవచ్చెను.

ఆ. ఆలు లేనివాఁడు ♦ నార్తిఁ గుందెడువాఁడుఁ, బుడమినెల్లఁ గోలు♦పడినవాఁడు
నక్కటా! ప్రవాసి ♦ యంచు నాపై దయ, రాదు తండ్రి! కీశ♦రాజునకును. ౬౮
ప్రవాసి = దేశము విడిచి వచ్చినవాఁడు.

తాత్పర్యము.

నాయనా, లక్ష్మణా! అయ్యో! రాముఁడు పెండ్లాము లేనివాఁడే - ఆ దుఃఖముచేఁ దపించుచున్నవాఁడే, రాజ్యమంతయుఁ బోఁగొట్టుకొన్నవాఁడే, దేశము విడిచి కానని దేశమునకు వచ్చినాఁడేయని నామీఁద సుగ్రీవునకు దయరాలేదు చూచితివా ?

ఈ కష్టములన్నియుఁ దాను బడినవాఁడే, నేను బడిన కష్టము లేకదా రాముఁడు పడుచున్నాఁడు. నా కష్టముల నాయన తప్పించెనే, ఆయన కష్టముల నేను దప్పింపవలదా యని యతనికిఁ దోఁచినదికాదు.

ఉ. పోయెను రాజ్యమెల్లఁ, బరి♦భూతి గనెన్ దనుజేంద్రుచేత, నీ
వా యను దిక్కు లేదు, నిలు♦వంగను నీడను లేని దేబె, తా
జాయకుఁ గాఁగ నేడ్చెడిని ♦ సమ్మతి నా శరణంబు నొందె, నం
చా యగచారి నాయెడ న♦నాదరబుద్ధి వహించెఁ దమ్ముఁడా! ౬౯
పరిభూతి = అవమానము- దేబె = అసమర్థుఁడు జాయ = పెండ్లాము
అగచారి = కోఁతి, సుగ్రీవుఁడు.

తాత్పర్యము.

ఈ ప్రకార మాలోచింపక సుగ్రీవుఁడు, రాముఁడా రాజ్యమంతయుఁ బోఁగొట్టుకొనినాఁడు- రాక్షసుచే నవమానింపఁబడినాఁడు- నీవా యను దిక్కులేదు. పక్షికైన నొక గూడుండును. వానికదియులేదు. ఉత్త యసమర్థుఁడు. పెండ్లామో పెండ్లామో యని యేడ్చుచున్నాఁడు. నాపెండ్లామును నీవైనఁ దెచ్చియిమ్మని నాకాళ్లమీఁదఁ బడినాఁడు, అని నాయందు నలక్ష్యభావము గలవాఁడయ్యెను.

కం. తనకార్యము నెరవేఱుట, మనతో నే మనుచు యువతి♦మార్గణకార్యం
బును దలఁపఁడు తనసమయంబును మఱచె నకాలమునను ♦ భూజచరుండున్.
యువతిమార్గణకార్యంబును = సీతను వెదకుపని.

తా త్ప ర్య ము.

సుగ్రీవుఁడు తనపని కొనసాగుటచే నిఁక మనతోఁ గావలసిన దేమున్నదని సీతను వెదకుపని నాలోచించిన వాఁడుకాఁడు. తగినకాలమునఁ దన సంకేతమును మఱచెను.

—♦ శ్రీరాముఁడు లక్ష్మణునిఁ గిష్కింధకుఁ బోయి రమ్మనుట. ♦—

కం. పొమ్మా కిష్కింధకుఁ గనుఁ గొమ్మా యా మూర్ఖు భోగ♦కుటిలితమతి నీ
వి మ్మాడ్కి ననుమ నావచనమ్ముగ సౌమిత్రి ప్లవగ♦నాథునితోడన్. ౭౩౯

తా త్ప ర్య ము.

లక్ష్మణా! యిఁక మనము చేయవలసిన పని చెప్పెద వినుము. నీవు కిష్కింధకుఁ బొమ్ము, మూర్ఖుఁడై భోగముల మరగి కుటిలమనస్సుగల యా సుగ్రీవునిఁ జూడుము, చూచి నేను జెప్పినానని వానితో నిట్లనుము.

తే. అర్థులై యాశ్రయించిన ♦యర్థులకును
మున్నె యుపకార మొనరించి♦యున్నవారి
కాడియును బాస తప్పుచు ♦ నాశ చెఱుచు
వాఁడె పురుషాధముం డండ్రు ♦ ప్రాజ్ఞజనులు. ౭౪౦

తా త్ప ర్య ము.

కార్యముగలిగి యాశ్రయించిన యోగ్యులకు, నందుఁ బూర్వమే తన కుప కారము చేసినవారికిఁ బ్రత్యుపకారము చేసెద నని ప్రమాణముచేసియు దాను వారి యాశను జెఱుచువాఁడే పురుషాధముఁడని ప్రాజ్ఞులందురు.

తే. పాపమో పుణ్యమో మున్ను ♦ పలికినట్టి
పలుకు దప్పక సత్యంబు♦పక్ష మూని
నడచు నవ్వీరుఁడే చుమీ పుడమియందు
దండి యశ మొందుఁ బురుషోత్త♦ముండునాఁగ. ౭౪౧

తా త్ప ర్య ము.

ముందు మాటచెప్పి యా మాట నెఱవేర్చుటయందుఁ బాపముచేయవలసి వచ్చి నను బుణ్యముచేయవలసి వచ్చినను నాడినమాట తప్పక సత్యంబునందు నిలుచు నవ్వీరుఁడే (కార్యనిర్వాహకుఁడే) పురుషోత్తముఁడని కీర్తిగాంచును.

కం. తనపనులు చక్కఁబఱిచిన, తనమిత్రుల మఱచు నా కృ♦తఘ్నుఁడు చావన్
విను మాతని పీనుఁగును, గననైన నను గనవు శునక♦కంకశివాదుల్. ౭౪౨

తా త్ప ర్య ము.

తన కార్యము నెఱవేర్చి మేలు చేసిన మిత్రుని మఱచిన కృతఘ్నుడు చచ్చె నేని వాని పీనుఁగును కుక్కలు, గ్రద్దలు, నక్కలు దినకుండుట యటుండ దానిప్రక్క నైనఁ జూడవు.

వాల్మీకి రామాయణమందు సూత్రప్రాయముగఁ జెప్పఁబడిన యీ నీతిని బోధించుటకై భారతమున వ్యాసమహర్షి నాడీజంఘుని చరిత్రము విపులముగ వ్రాసెను. ఈ ప్రకారము రామాయణమున సూత్రప్రాయముగఁ జెప్పఁబడిన ధర్మములు నీతులు అధ్యాత్మ విషయము భగవత్తత్త్వము స్త్రీ పురుషుల చరిత్రములు గీతములు దృష్టాంతములతోడ భారతమున విపులీకరింపఁబడినవి. రామాయణమున సూచింపఁబడిన నూటికి నూఱుపాఖ్యానములు భారతమునఁ గలవు. భారత కథ రామాయణమువలె నిరువది నాలుగువేల గ్రంథమే- ఈ యుపాఖ్యానముల వలన లక్షగ్రంథమయ్యెను. దీనిని బట్టి భారతము రామాయణవ్యాఖ్యయనఁబడెను. దీనికి దృష్టాంతములు మఱికొన్ని సుందరకాండాదుల నీయఁబడును.

కం. అని చెప్పు మతఁడు నిజముగ, ఘనతరమత్కనకపృష ♦ గాఢవికృష్ట
స్తనితార్భటవిద్యున్నిచ, యనిభశరాసనముఁ జూడ ♦ నాసం జేసెన్. ౭౪౩

ఘనతర = మిక్కిలి గొప్పదగు- మత్ = నాయొక్క- కనకపృష = బంగారు కట్లు గలదియు- గాఢ వికృష్ట = పూర్ణముగ లాగఁబడిన, స్తనితార్భటి = ఉఱుము వంటి ధ్వనిగల- విద్యున్నిచయ నిభ = మెఱుపులతో సమానమైన కాంతిగల- శరాసనము = విల్లు.

తాత్పర్యము.

అని యీప్రకారము చెప్పుము. అతని యిప్పటి మనస్థితినిఁజూడ మిక్కిలి గొప్పదైనదియు నాయొక్క బంగారు కట్లుగలదియు, బాగుగఁ లాగఁబడినదియు, నుఱుమువలె ధ్వనించునదియు మెఱుఁగులవంటి కాంతిగలదియునగు నావింటిని వాఁడు చూడఁగోరెను.

కం. ముడివడ్డబొమలతో నే, నుడికెడుచిత్తంబుతోడ ♦ నుగ్రతఁ దివియన్
బిడుగులు క్రక్కెడు నల్లియు, బెడితపుటులి వతఁడు గోరె ♦ వెండియు వినఁగన్.

తాత్పర్యము.

కనుబొమలు ముడివేసికొని కోపముతో మండుచున్న చిత్తముతో భయంకరముగా లాగఁగాఁ బిడుగులు గ్రక్కు నా యల్లెత్రాటి భయంకరధ్వనిని మఱియు నొకసారి వాఁడు వినఁగోరుచున్నాఁడు.

కం. ఎఱిఁగి యెఱింగియు మది నా, నెఱినెఱియున్ బాణశక్తి ♦ నీబాసట దా
నుఱుఁడు గదే మన సమయము, మఱచెం దనపనులు దీరి ♦ మరగుట సుఖముల్.

నెఱినెఱియున్ = అధికపరాక్రమము- బాసట = సాహాయ్యము- ఉఱుఁడు గదే = లక్ష్యము చేసినవాఁడుకాఁడుగదా. "ఉఱుఁడు సురేంద్రునైన"నని భారత ప్రయోగము- నన్నయ్య.

తాత్పర్యము.

వృక్షముల నఱకుట వాలిని జంపుట వీనివలన నా గాఢపరాక్రమము-నా బాణ

శక్తి - సీతొడ్పాటు తెలిసి తెలిసియు లక్ష్యము చేసినవాఁడు కాఁడు- తన పనులు చక్కఁబడి సుఖము మరగుటచేఁ దాను జేసిన ప్రమాణమునే మఱచెను.

కం. తనచెలిమి వాలివధ మేఁ, బనిపూనుట యేల యేమి♦ బాస యొనర్చెన్
మనకు జడికాలు చనఁ జప్పను సర్వము మఱచెఁ దనదు♦పని నెఱవేఱన్. ౮౪౬

తాత్పర్యము.

ఏల తనతో స్నేహముచేసితిని, ఏల వాలిని జంపితిని, వర్షాకాలము దాఁటఁగానే తానేమి చేసెద నని ప్రమాణము చేసెను. ఇవన్నియుఁ దనపని నెఱవేఱఁగానే మఱచెనుగదా.

కం. వానలు వెలిసినతోడనె, నే నిట కరుదెంచువాఁడ ♦ నిక్కం బనియెన్
వాననెలల్ నాలుగుఁ జనెఁ, దా నెఱుఁగఁడు స్వైరకేళి♦తత్పరుఁ డగుచున్. ౮౪౭

తాత్పర్యము.

సుగ్రీవుఁడు నాతో వానలు నిలువఁగానే యిచ్చటికిఁ దాను వచ్చెదనని చెప్పెను. వాన నెలలు గడచెను. గాని యిచ్ఛా విహారమందాసక్తి గలవాఁడగుటచే దానిని దెలిసికొనలేక యున్నాఁడు.

కం. ఇష్టజనగోష్ఠి దీరుచు, నిష్టంబుగ్రోలంది త్రావి ♦ యెఱుఁగఁడు మన యీ
కష్టము దయఁ దలఁపఁడుగా, శిష్టనుతా! దుఃఖమునను ♦ జేడ్పడు నాపై. ౮౪౮

తాత్పర్యము.

తన కిష్టులగు వారితో సరస సల్లాపము లాడుచు నిష్టము గ్రోలఁది త్రావి మన యీ కష్టముగాని, దుఃఖమున బాధపడుచున్న నాపై దయగాని తలఁపకున్నాఁడు.

ఉ. కావున లక్ష్మణా! చనుము ♦ గాఢమదాగ్రహతుల్యరీతి సు
గ్రీవునితోడ నిట్లనుము ♦ కీశపతీ! మును వాలిచన్న యా
త్రోవను గంప మొల్వ దల♦దుశ్చ్యవనాత్మజుమార్గ మీవునుం
బోవకు వానరా! సమయ♦ముం దలపోయు మిఁ కేని నీమదిన్. ౮౪౯

గాఢ = అధికమైన - మదాగ్రహతుల్య రీతి = నా కోపమునకుఁ దగిన విధముగ - దుశ్చ్యవనాత్మజు = వాలియొక్క.

తాత్పర్యము.

కావున లక్ష్మణా! నీవు కిష్కింధకుఁ బొమ్ము. పోయి, నా కోపమునకుఁ దగినట్లు నీవిట్లు చెప్పుము. వానరరాజా! వాలిపోయిన మార్గమునఁ గంపలు మొలవలేదు. నీ కిష్ట మున్నయెడల నీవును బోనచ్చును. అయినను వాలిపోయిన త్రోవ నీవు పోవలదు. వానరుఁడా! నీ వేమి ప్రమాణము చేసితివో యిఁకనైన దానిని స్మరింపుము.

క. వాలిని నొక్కని శరమునఁ, దూలం బుచ్చితిని మున్ను ♦ ద్రోహమతిన్ స
త్యాలాపము గమనింపని, బాలిశు నినుఁ ద్రుంతుఁ జుమ్ము ♦ బంధుయుతముగన్.

తాత్పర్యము.

వాలి చేసిన దోషమునకు వాఁడుమాత్రమే దండ్యుఁడగుట వానినిమాత్రమే దండించితిని- ద్రోహబుద్ధివై నత్యవాక్యము గమనింపని నిన్ను 'మూఢుఁడా! బంధువులతోడఁ జంపుదు' నని తెలిసికొమ్ము.

ఉ. వానరరాజ, నీపలుకు ♦ బాసను మీఱకుమీ, సనాతనం
 బైన సుధర్మపద్ధతిని ♦ నాఱడి పెట్టకుమీ, త్వదగ్రజుం
 గానఁగఁ బోకుమీ నిశిత♦కాండములన్ ధరఁ ద్రెళ్లి, యంచుఁ దీ
 వ్రానలతేజ నానుడిగ ♦ నాడుమ యెయ్యది యుక్త మంతయున్. ౮౪

సనాతనంబు = శాశ్వతమైనది- త్వదగ్రజున్ = నీయన్నను- నిశిత కాండములన్ = పదునైన బాణములచే- తీవ్రానల తేజ = మండుచున్న యగ్నిహోత్రునివంటి తేజస్సు గలవాఁడా? మదోన్మత్తుల యెదుట సామభాషణములు పరాభవ కారణము లగును. కావున నీవును బిఱుసుగానే మాటలాడు మని యర్థము- నానుడిగన్ = నా మాటగ- నేను జెప్పితినని.

తాత్పర్యము.

వానరరాజా! నీవు చెప్పిన ప్రమాణవాక్యము నతిక్రమింపకుము. శాశ్వతమైన ధర్మమార్గమును వ్యర్థపఱుపకుము. నా వాఁడిబాణములచేఁ జచ్చిన నీ యన్నను జూడఁబోకుము, అని తీక్ష్ణమైన యగ్నిహోత్రునివంటి తేజస్సుగలవాఁడా! నామాటగ నేను జెప్పితినని సమయోచితముగ నింకను నేమేమి చెప్పవలయునో యన్నియుఁ జెప్పుము.

క. దేవనిభుఁ డిట్లు భృశరో,షావిష్టుం డగుచుఁ బలుక ♦ ననుజుండును సు
 గ్రీవు నెడ నదే విధముగ, వావిరికోపంబుఁ దాల్చి♦వరబలనిలయున్. ౮౫

దేవనిభుఁడు = నారాయణునితో సమానుఁడు- "దేవ ఏకో నారాయణః" యని శ్రుతి- అవతారకారణమున సామ్యము- భృశరోషావిష్టుండగుచున్ = అధికమగు కోపముచే నావేశింపఁబడినవాఁడై- మూఁడవపాదమందలి 'దే' గాయత్రియందలి పదునొకండవ యక్షరము.

తాత్పర్యము.

విష్ణుతుల్యుఁడగు రామచంద్రమూర్తి మిగులఁ గోపించి పలుకఁగా నాయన తమ్ముఁడగు లక్ష్మణుఁడును నంతకోపము దాను గలవాఁడై; వరబలనిలయున్ = పై పద్యముతో నన్వయము.

౩౧-వ సర్గము.

—♦ లక్ష్మణుఁడు శ్రీరామునితో సుగ్రీవునిఁ దాను వధించెద నని చెప్పుట. ♦—

ఉ. కామము పేర్మి దీనుఁ డగు♦కంజదళాక్షునిఁ జూచి పల్కె నో
 రా మది సాధువృత్తముఁ ది♦రస్కృతి చేసి సుహృత్త్వలాభ జా

తామితభోగసౌఖ్యముల ♦ నాత్మ గణింపఁడు, రాజ్యసౌఖ్యముల్
భూమివ నాశ మొందినను ♦ బుద్ధి స్మరించుచు నిన్ను నయ్యెడన్. ౧-౫౩

కామముపేర్మిన్ = కామాతిశయమున, సాధువృత్తము = సజ్జనుల నడవడి- సుహృత్త్వ = స్నేహము, లాభ = లభించుటచే, జాత = కలిగిన, అమితభోగ సౌఖ్యములన్ = మితిమించిన భోగములను, సుఖములను.

తా త్ప ర్య ము .

మిగుల బలమునకు, నా కారణముచేఁ దన కార్యము దాను సాధించు శక్తికి స్థానమైనను గామాతిశయముచే దీనుఁడై యున్న తామరసాక్షుని నన్నునుజూచి లక్ష్మణుఁ డిట్లనియె. ఆహా! యేమి యాశ్చర్యము!! సత్పురుషుల నడవడి తిరస్కరించి రామచంద్రునితోడ స్నేహము కలుగుటచేఁగదా, నాకీ భోగములు, సౌఖ్యములు కలిగెనని మనస్సున నెంచక యున్నవాఁడు. రామా! రాజ్యసౌఖ్యములు నాశన మాయెనా యప్పుడు నిన్నుఁ దలఁపఁగలఁడు. 'సంపన్నాంధున కంజనంబు వినుమా దారిద్ర్య మూహింపఁగన్' భాగ. దశ.

క. తుచ్ఛగ్రామ్యసుఖంబుల, నిచ్ఛించుచు మతి దొఱంగి ♦ కృతమెంచనియా
పుచ్ఛి కెటి రాజ్యసంపద, మచ్ఛరముల వాలి చనిన♦మార్గము చనుతన్. ౧-౫౪

తొఱంగి = విడిచి, కృతము = తన కితరులు చేసిన మేలు, పుచ్ఛికిన్ = తోఁక గలవానికి.

తా త్ప ర్య ము.

నీచమైన గ్రామ్యసుఖముల మరగి బుద్ధిమాలినవాఁడై చేసిన మేలెఱుఁగలేని కోఁతికా రాజ్యసంపద!! నా బాణములచే వాలిపోయిన త్రోవన పోవునుగాక.

ఉ. కోపము నాఁపఁజాల రఘు ♦ కుంజర! త్రుంచెద నే ననూనృతా
లాపునిఁ గీశనాయకు ని♦లాసుత రోసెడిఁగాక యంగదుం
డేపున నన్న, నాత్తభయ♦దేషు శరాసనహస్త శత్రుసం
తాపనదక్షు ఘోరసము♦దాయ దురాగ్రహు రాఘవుం డనున్. ౧-౫౫

అనూనృతాలాపునిన్ = అసత్యభాషణుని - కీశనాయకున్ = కోఁతిరాజును రోసెడిన్ = వెదకెడిని- ఆత్తభయదేషున్ = చేత నందుకొనిన భయంకర బాణము గలవానిని- శత్రుసంతాపన దక్షున్ = విరోధిని దపింపఁజేయు సమర్థుని- సుగ్రీవునిఁ జంపఁగలవానిని - ఘోరసముదాయ దురాగ్రహున్ = భయంకర యుద్ధమునకుఁ గావలసిన చెడుకోపము గలవానిని.

సుగ్రీవుఁడు గడువు మీఱినను రాఁడాయెనని లక్ష్మణునకుఁ గోపము మదిలో నున్నను నన్నను మించి యేమియుఁ జెప్పఁజాలక లోలోపల నణఁచుకొనుచుండెను. ఇప్పుడు రామచంద్రమూర్తియే కోపించెను గానఁ గుములుచున్న యగ్ని భగ్గని

మండసాగెను. ఆయన మాటసామెతకుఁ జెప్పిన దానిని దాను యథార్థ పరుపఁ బూనెను.

తాత్పర్యము

అన్నయ్యా! నేను గోపము నణఁపలేను. అసత్యవాదియయిన వానరరాజును జంపెదను. మనకార్యము గతి యేమందువా. అంగదుఁడు సీతాదేవిని వెదకించును అని చెప్పఁగా భయంకర బాణమును, వింటిని జేత ధరించినవానిని సుగ్రీవునిఁ జంప సామర్థ్యముగలవానిని ఘోరయుద్ధమునకుఁ గావలసిన కోపము దెచ్చుకొన్నవానిని దమ్మునిఁ జూచి రామచంద్రమూర్తి యిట్లు చెప్పెను.

—♦ శ్రీరాముఁడు లక్ష్మణుని శాంతిపఱచి కిష్కింధకుఁ బంపుట. ♦—

చ. తలఁచునె నిన్నువంటి గుణ ♦ ధన్యుఁడు నింతటి పాపకార్యముం
జలుపఁగ? మానవన్న, మన ♦ సఖ్యముఁ బూర్వపు వృత్తభంగియుఁ
దలఁచి యథాప్రకారముగఁ ♦ దద్దయుఁ బ్రీతిఁ జరింపు లక్ష్మణా!
కలుషము సద్వివేకమునఁ ♦ గ్రాచు ఘనుండు నరోత్తమాఖ్యుఁ డౌ. ౮౯౬

గుణధన్యుఁడు = సద్గుణములే ధనముగాఁ గలవాఁడు, ఇంతటి = మిత్రుని వధించినంతటి, పూర్వపువృత్త భంగియుఁ = పూర్వము వాని చర్యవిధము, కలుషముఁ = పాపమును, సద్వివేకమునఁ = మంచి వివేకముచే, ఇది న్యాయ్యము, ఇది యన్యాయ్యమని వేఱువేఱుగ నేర్పఱిచి తెలిసికొనెడిది వివేక మనఁబడును· క్రాఁచు= కాలుచు, నరోత్తమాఖ్యుఁడు = మనుష్యులలో నుత్తముఁడను కీర్తి గలవాఁడు.

తాత్పర్యము.

ఏమి లక్ష్మణా! సద్గుణములచే ధన్యుఁడవగు నీవంటి వాఁడుకూడ మిత్రవధ మను పాపకార్యముఁ జేయఁ దలఁపనైనఁ దలఁచునా? వలదు - వలదు. అట్లుచేయ వలదు. వానికి మనకుఁగల స్నేహము - ఇంతకుఁబూర్వము వానినడవడి-యివన్నియుఁ దలఁచి పూర్వమువలెఁ బ్రేమతోనే నడచుకొనుము - ఎవఁడు పాపమును యుక్తాయుక్త జ్ఞానముచేఁ గాల్చునో వాఁడు మనుష్యులలో నుత్తముడని కీర్తి వహించును. గాని తొందరపడి పని చేయువాఁడుగాఁడు.

చ. ఇది మది నుంపబోకు, ప్లవ♦గేశ్వరుతోఁ బరుసంబు మానుచుఁ
మృదువగు వాక్య పద్ధతిని ♦ హెచ్చరికింపుము, క్లృప్తకాల మ
య్యదితన విస్మరించుట యం♦టంచును శాత్రవవీరహంత స
ద్హృది వచియింప నాతఁడు ని♦వృత్తనిజాశయు డౌచుఁ వేగిమై. ౮౯౭

ఇది = నేను గఠినముగాఁ జెప్పినది, పరుసంబు = కఠినత్వము, విస్మరించుట= మఱచుట, శాత్రవవీరహంత= శత్రువీరుల వధింపఁగలవాఁడు, సత్ + హృదిఁ = మంచి హృదయముతో, ఆతఁడు = లక్ష్మణుఁడు, నివృత్త నిజాశయుఁడు=మరలింపఁ బడిన తనయభిప్రాయముగలవాఁడు.

తాత్పర్యము.

లక్ష్మణా! నేను గోపముతోఁ జెప్పినమాటలు నీవు పరమార్థములుగా మనస్సునందుంపకుము. సుగ్రీవునితోఁ గఠినముగా మాటలాడక మెత్తనిమాటలతోనే గడువును నీవు మఱచితివేల యని హెచ్చరికింపుము. అని శత్రుప్రహరణ దక్షుండయ్యును రామచంద్రమూర్తి యాశ్రితరక్షణతత్పరుఁడు గావున మంచి మనస్సుతోఁ జెప్పఁగా లక్ష్మణుఁడును సుగ్రీవునిఁ జంపవలయునన్న తన పూర్వాభిప్రాయమును మానుకొని వేగముతో.

క. వాసవచాపనిభం బగు, భాసురకోదండ మూని ♦ ప్రతిలయ కాలుం
డై సౌమిత్రి సశృంగో, ద్భాసితమందరనగంబు ♦ పగిది రహించెన్. ౧౪౮

వాసవచాపనిభము = ఇంద్రధనుస్సుతో సమానమైనది, ప్రతిలయకాలుండై = ప్రలయకాలమందలి,యమున కుద్దిగ్నైనవాఁడై, సశృంగ = శిఖరముతోఁ గూడుటచే, ఉద్భాసిత = మిగులఁ బ్రకాశించు, మందరము = మందరపర్వతము.

తాత్పర్యము.

ఇంద్రధనుస్సుతో సమానమై ప్రకాశించు విల్లుధరించి ప్రళయకాలమందలి యమునివలెనై లక్ష్మణుఁడు శిఖరముతోఁగూడిన మందరపర్వతమో యనునట్లు ప్రకాశించెను.

ఉ. అన్న వచించినట్లు తన ♦ యాడఁగ యుక్తము లైనమాటలున్
దన్నుఁ గపీశుఁ డాడెడి వి♦ధంబును గీష్పతితుల్యబుద్ధి సం
పన్నుఁడు లోఁ దలంచుచును ♦ బాదతలాహతి పాతితాశ్వక
ర్ణోన్నతసాలతాలమహి♦జోత్కరుఁ డై శిల లెల్ల నుగ్గుగన్. ౧౪౯

తనయాడఁగన్ = తాను జెప్పుటకు, గీష్పతితుల్య = బృహస్పతి బుద్ధితో సమానమైన, బుద్ధిసంపన్నుఁడు = బుద్ధిసంపదగలవాఁడు, బుద్ధిసంపదయందు బృహస్పతితో సమానుఁడు, పాదతలాహతిన్ = కాలిదెబ్బచే, పాతిత = పడఁగొట్టఁబడిన, అశ్వకర్ణ = ఇనుమద్ది, ఉన్నతసాల = ఎత్తైనమద్ది, తాల = తాటి, మహిజ= చెట్లయొక్క, ఉత్కరుఁడై = సమూహము గలవాఁడై, శిలలు=ఱాలు, నుగ్గుగన్= పొడిగ.

తాత్పర్యము.

అన్న చెప్పినట్లు తాను జెప్పవలసినమాటలు దానికి సుగ్రీవుఁడు బదులు చెప్పెడిమాటలు తనలోఁ దానే బుద్ధియందు బృహస్పతితో సమానుఁడగు లక్ష్మణుఁ డాలోచించుచుఁ దన త్రోవకడ్డమువచ్చిన ఇనుమద్ది పెద్దమద్ది తాటిచెట్లను గాలిదెబ్బలచేఁ బడఁగొట్టుచుఁ బాదఘట్టనమునఁ గాలిక్రిందఁబడిన ఱాలు పొడిపొడిగాఁగ.

ఇందు లక్ష్మణుని కార్యాసక్తి దేహబలము వర్ణింపఁబడెను. చెట్లడ్డమువచ్చినపుడు తొలఁగిపోరాదా యనిన దోవ యేర్పడలేదు. ముక్కుచాయగాఁ బోయినదే

దోవ- అడవినిండఁ జెట్లు- ఎన్నని? తొలఁగిపోను- దానివలన నెంత యాలస్యమగును. గొడ్డలితో నఱికి దోవచేసికొని పోవుటకు బదులు చెట్లు విఱుగఁదన్ని దోవచేసికొని పోయెను. మద్దిచెట్లను విఱుగఁ దన్నినాఁడనుటచే బలమునందు వాలికి రామచంద్రమూర్తికి సమానుఁడని సూచితము.

క. సామజమును దలపించుచుఁ, గామక్రోధభవరామ♦ఘనకోపాగ్ని
స్తోమావృతుఁ డయి భయదం, బౌ మారుతి మనఁగఁ జనియె ♦ నతితూర్ణముగన్.

సామజముఁ = ఏనుఁగును. తలఁపించుచుఁ = తలఁపునకు దెచ్చుచు, కామక్రోధభవ=కామమువలనను, క్రోధమువలనను పుట్టిన, రామఘన కోపాగ్ని = రామచంద్రుని గొప్ప కోపమనెడు నగ్నియొక్క, స్తోమ=సమూహముచే, ఆవృతుఁడు= ఆవరింపఁబడినవాఁడు- భయదము=భయమును గలిగించు, అతితూర్ణముగఁ=మిక్కిలి వేగముగ.

తాత్పర్యము.

ఏనుఁగును జ్ఞప్తికిఁ దెచ్చుచు గామక్రోధములవలనఁ బుట్టిన రాముని గొప్ప కోపమనెడి యగ్నిచే నావరింపఁబడి భయంకరమైన గాడ్పువలె మిగుల వేగముగఁ జనియెను. రామకోపావృతుఁడై యనుటచే లక్ష్మణునకు స్వయముగఁ గోపము లేదనియు రాముని కోపమే యాయనయం దావేశించెననియు గ్రాహ్యము.

క. పుట్టినపని తొందరచేఁ, దట్టినయుద్రేకమునను ♦ దనకుడిపదముం
బెట్టుచు దవుదవ్వుగఁ దా, నిట్టలపున్వేగమునఁ జ♦నెం బురిచాయన్. ౧౬౧

ఉద్రేకమునను = విజృంభణముచే, దవుదవ్వుగఁ = దూరదూరముగ, ఎడమకాలికంటెఁ గుడికాలు దూరమునం దుంచుచు, ఇది వడిగా నడచువారికిఁ దెలిసిన విషయమే, నిట్టలపు న్వేగమునను = అధికవేగముచే, ఇచ్చట స్థిరము పరమయినను నుగాగమము, గురువపున్మరువువలె.

తాత్పర్యము.

తొందరగాఁ బనిచేయవలసియుండుటచేఁ గలిగిన యుద్రేకమునఁ గుడికాలు దూరదూరముగా నుంచి నడచుచు మిగుల వేగముగఁ గిష్కింధవైపుపోయెను.

క. దట్టంపు గిరులనడుమను, బట్టనమును గీశరాజ♦పాలితముం దా
నెట్ట యెదుటఁ గని కపిపైఁ, బుట్టినకోపమున నధర♦పుట మదరంగన్. ౧౬౨

అధరపుటము = రెండు పెదవులు.

తాత్పర్యము.

దట్టముగాఁ జుట్టుకొనియుండు కొండలనడుమనుండి సుగ్రీవునిచేఁ బాలింపఁబడుచున్న కిష్కింధానగర మెట్ట యెదుటఁ జూచి సుగ్రీవునిపైఁ బుట్టినకోపముచేఁ బెదవు లదరుచుండఁగా.

కిష్కింధ గుహయనుటకుఁ గారణమిది యొకకొండలోపల బిలముగా నుండు టచేఁగాదు. కొండబిలమువలె నిది చుట్టు కొండలచేఁ జుట్టఁబడి నడుమఁ బురముండు టచే నని దీనివలనఁ దెలియఁదగు.

—♦ లక్ష్మణునిఁజూచి క్రోతులు భయపడి పరువెత్తుట. ♦—

సీ. పురబహిశ్చరుల వా♦నరవర్యులను గాంచె, వారు నామానవ♦వర్యుఁ గాంచి
కరముల గిరిశృంగ ♦ తరువులఁ గొనదాన, బహ్వింధనంబుల ♦ జ్వలనుఁ డనఁగ
ద్విగుణితాగ్రహుఁడుగాఁ♦ దేఱిచూడఁగ లేక, లయకాలుఁడో యని♦భయముగదుర
గుంపులై కపులు దిక్కులవెంటఁ బాఱుచు, సుగ్రీవభవనంబుఁ ♦ జొచ్చి వేగ
తే. సాగ్రహుండయి లక్ష్మణుఁ ♦ డరుగుదెంచు
విధముఁ దెలుపఁగఁ దారతో ♦ వివిధగతులఁ
గామియై కేళిఁ దేలుచుఁ ♦ గపికులేంద్రుఁ
డంతిపురినుంట వినఁడు వా ♦ రాడునుడులు. ౧౬౩

పురబహిశ్చరులన్ = పురమునకు వెలుపలఁ దిరుగువారిని, కరములన్ = చేతులందు, గిరిశృంగతరువులన్ = కొండపేఁటులను జెట్లను, బహ్వింధనంబులన్ = పెక్కుకట్టెలచే, జ్వలనుఁడు = అగ్నిహోత్రుఁడు, ద్విగుణిత = ఇబ్బడించిన, ఆగ్రహుఁడు = కోపముగలవాఁడు, లయకాలుఁడో = ప్రలయకాలమందలి యముఁడో.

తాత్పర్యము.

ఊరివెలుపలఁ దిరుగు క్రోఁతులను జూడఁగా వారు క్రొత్తమనుష్యుఁ డెవఁడో యుద్ధమునకు వచ్చుచున్నాఁడని తలఁచి కొండల శిఖరములు, చెట్లు తీసికొనిరాఁగా దానిచే నిబ్బడించిన కోపంబునఁ గట్టెలువేసిన మండు నగ్నివలె మండి యెదుటివారు తన్ను దృష్టినిలిపి చూడలేక ప్రళయకాలమందలి యముఁడే యిట్లు వచ్చెనేమో యని భయపడి గుంపులు గుంపులుగా దిక్కులవెంటఁ గొండలు పరువెత్తఁ గొందఱు లక్ష్మణుని ముందుచూచినవారు సుగ్రీవు నింటియొద్దకుఁబోయి లక్ష్మణుఁడు కోపముతో వచ్చియున్నాఁడని చెప్పఁగాఁ గామాతురుఁడై తారతో నానావిధములఁ గ్రీడించుచున్నవాఁ డయి యంతఃపురములో నుండుటచే వారిమాట లాయన విన్నవాఁడు కాఁడు.

సీ. సచివసందిష్టులై ♦ శాఖామృగాగ్రణు, లద్రినాగాభ్రాభు ♦ లైనవారు
దశనాగవిక్రముల్ ♦ దశగుణోత్తరబలుల్, సామజాయుత స త్త్వ♦సంగతులును
వికృతదర్శనులును ♦ ద్వీపిపరాక్రముల్, ద్రుమహస్తు లగుచును ♦ దుర్గములను
బ్రాకారములయందుఁ ♦ బరిఖలఁ గేవల, విక్రమోదగ్రులై ♦ వెలసి రంత
ఆ. నన్న పడెడిబాధ ♦ యగచరనాథు ప్ర,మాదపాటుఁ దలఁచి ♦ మనమునందుఁ
దీవ్రకోప మెసఁగ ♦ దీర్ఘోష్ణముగ నూర్పు, వెడల జేవుఁటింప♦ వీక్షణములు. ౧౬౪

సచివసందిష్టులై = మంత్రులచే నాజ్ఞాపింపఁ బడినవారై- శాఖామృగా

గ్రణులు = శ్రోతులందు శ్రేష్ఠులగువారు. అద్రినాగ+అబ్ద+ఆభులు = కొండలతో- ఏనుఁగులతో- మేఘములతో సమానులు, దశనాగవిక్రముల్ = పదియేనుఁగులపరాక్రమము గలవారు, దశగుణోత్తరబలుల్ = వారికిఁ బదంతలెక్కువబలము గలవారు, సామజాయుత సత్త్వసంగతులును = పదివేల యేనుఁగుల బలముతోఁ గూడినవారు, వికృతదర్శనులు = చూచుటకు వికారముగ నుండువారు, ద్వీపిపరాక్రముల్ = పెద్దపులి పరాక్రమముగలవారు, ద్రుమహస్తులు = చేతులందుఁ జెట్లుగలవారు, దుర్గములను = కోటలను, పరిఖల = అగడ్తల, క్రేవలఁ = ప్రక్కల, విక్రమోదగ్రులై = పరాక్రమముచే భయంకరులై, దీర్ఘోష్ణముగఁ = దీర్ఘముగను, వేఁడిగను, జేవుఱింపఁ = ఎఱ్ఱన కాఁగా, వీక్షణములు = చూపులు.

తాత్పర్యము.

మంత్రులచే నాజ్ఞాపింపఁబడినవారై పర్వతములతో నేనుఁగులతో మేఘములతో సమానులైనవారును, బదియేనుఁగుల నూఱేనుఁగుల పదివేల యేనుఁగుల బలముగలవారును, వికారపుఁ జూపులుగలవారును, పులులవంటి పరాక్రమముగలవారును, నగు వానరశ్రేష్ఠులు చేతఁ జెట్లు దీసికొని కోటలను బ్రాకారములను అగడ్తలను విక్రమాధికులై కావలి కాచియుండిరి. అన్నపడెడి బాధయును, సుగ్రీవుఁడు హెచ్చరికతప్పి యుండుటయుఁ దలఁచి మిగులఁ గోపించినవాఁడై వేఁడి నిట్టూర్పులు విడుచుచుఁ గన్ను లెఱ్ఱన కాఁగా.

తే. ధూమయుత పావకుం డనఁ ♦ దూపుములికి,జిహ్వగాఁ జాపదండంబు ♦ శీర్షముగను
దనదు తేజంబు విషముగఁ ♦ దనరురామ, సోదరుఁడు పంచవదనమౌ ♦ నురగ మనఁగ.

ధూమయుతపావకుండు + అనఁ = పొగతోఁ గూడిన యగ్నిహోత్రునివలె, తూపుములికి = బాణముకొననుండు ములికి, జిహ్వగాఁ=నాలుకగా, శీర్షము = తల, పంచవదనము = ఐదు తలలుగలది. ఒకశిరస్సు, రెం డంబులపొదులు, ఒకచేత విల్లు, ఒకచేత ములికి పైవైపుగా నుండ నెత్తఁబడిన బాణము, ఇవియైదు శిరస్సులని చెప్పఁబడెను.

తాత్పర్యము.

పొగతోడి యగ్నిహోత్రుఁడో యనునట్లు బాణముకొన ములికి కోఱగాఁ గోదండము తలగాఁ దన తేజము విషముగా నొప్పు లక్ష్మణుఁ డైదు తలలపామువలె.

—♦ సుగ్రీవునకుఁ దన యాగమనవార్తఁ దెలుపుమని లక్ష్మణుఁ డంగదుఁ బంచుట. ♦—

చ. ప్రలయకృశానుతుల్యుఁ డనఁ ♦ బ్రజ్వలుఁడై భుజగేంద్రుఁ డో యనన్
గలితమహాగ్రహంబునను ♦ గ్రాలెడు నాతనిఁ జేర నంగదుం
డలమిన సాధ్వసంబునను ♦ నారటపాటున రాఁగ నాతనిన్
వలనుగ జూచి పల్కెఁ జని ♦ వత్స వచింపుము పిన్నతండ్రికిన్. ౧౬౮

ప్రలయకృశానుతుల్యుఁడనన్ = ప్రలయకాలమందలి యగ్నిహోత్రునకు సమా

నుఁడనునట్లు, ప్రజ్వలుఁడై = కోపముచే మండుచున్నవాఁడై. భుజగేంద్రుఁడోయనఁ = గొప్పపామోయనునట్లు, సాధ్వసంబునఁ = భయముతో, వత్స = నాయనా.

తా త్ప ర్య ము .

ప్రళయకాలమందలి యగ్నిహోత్రుఁడోయనఁ గోపముచే మండుచుఁ బెద్ద పామోయనునట్లు బుసగొట్టుచు మిగులఁ గోపంబుననున్న యా లక్ష్మణునిఁ జూచి భయపడి యారటపాటునఁ జేరఁబోఁగా నతనిఁ జూచి మంచి మాటలతో నాయనా! నీవు పోయి నీపినతండ్రికిఁ జెప్పుము.

మ. మదదుర్వార్ద్దముఁడైన లక్ష్మణుఁడిదే ♦ మాటాడ నీతోడఁ దా
మదిలో నగ్రజుదుఃఖపాటునకు సం♦భ్రాంతుండు సంతప్తుఁడై
కదిసెన్ ద్వారతలంబు నీ కతని♦వాక్యం బైన నాలింపఁగా
నెదలోఁ గల్గిన నాచరింపు వనచా♦రీ! యుక్త మా మార్గమున్. ౮౬౭

మదదుర్వార్త్ + దముఁడు = మదించిన శత్రువుల నణఁచువాఁడు.

తా త్ప ర్య ము.

అన్నదుఃఖము చూడలేక తొట్రుపాటు, సంతాపముగలవాఁడై మదించిన శత్రువుల నణఁచు లక్ష్మణుఁడిదే నీతోడ మాటాడుటకై వాకిటవచ్చి నిలిచి యున్నాఁడు· ఆయన మాట వినుటకు నీకిష్టముండినచో, వానరుఁడా! యెట్లు వర్తింప వలయునో యట్లు వర్తింపుము. నీవిచ్చటకు వచ్చెదవా, నన్నచ్చటికి రమ్మనెదవా? నేను రాను. నీవు రావలదు. నీదోవ నీవు పొమ్మనెదవా యని భావము.

క. అని వచియించి జవంబునఁ, జనుదెమ్మన శోకయుక్తిఁ ♦ జని జనకునకున్
జననికి రుమకును మ్రొక్కుచు, వినిపించె నుదంత మెల్ల ♦ విశదతరోక్తిన్. ౮౬౮

జవంబునన్ = వేగముగ, ఉదంతము = వృత్తాంతము, విశదతరోక్తిన్ = మిగుల స్పష్టములైన వాక్కులచే·

తా త్ప ర్య ము.

నీ వీమాటచెప్పి ప్రత్యుత్తర మే మిచ్చునో తెలిసికొని త్వరగా రమ్మనఁగా నతఁడు శోకించుచుఁ బోయి తారకును రుమకును నమస్కరించి వృత్తాంతమంతయు స్పష్టమైన మాటలతోఁ జెప్పెను.

క. మదనవిమోహితచిత్తుఁడు, మదమత్తుఁడు ఘనసుషుప్తి ♦ మదితుం డయి యం
గదుమాటలు వినఁ డినజుఁడు మదమత్తుల కెచట కెక్కు ♦ మనవుల్ గినవుల్.

మదనవిమోహితచిత్తుఁడు = కామముచేఁ దెలివిపోయిన మనస్సుగలవాఁడు, మదమత్తుఁడు = త్రాగుటచే దేహము తెలియనివాఁడు, ఘనసుషుప్తి మదితుఁడు = గాఢనిద్రమత్తుగలవాఁడు.

తా త్ప ర్య ము.

అంగదుఁ డీమాటలు సుగ్రీవుని సన్నిధిలోఁ దారారుమలకుఁ జెప్పినను గాము

వశుఁడై తప్పఁదాగి దేహము తెలియక నిద్రిమబ్బున నుండినవాఁడగుటచే నీ మాట లాయన చెవి కెక్కినవికావు. మదమత్తులకు మనవులు గినవులు మనస్సున కెక్కునా. (అర్థాంతరన్యాసాలంకారము)

క. చండౌఘనిభుని నృపుఁ గని, గుండెలు పగులంగ భీతిఁ ♦ గ్రోతులతుటుముల్
దండను గిచ కిచ మని రవ, మొండొండ నిగిడ్చెఁ గరుణ ♦ యుదయింపంగన్.

చండ+ఓఘ+నిభునిఁ=తీవ్రమైన ప్రవాహముతో సమానుని, తుటుముల్=గుంపులు.

తా త్ప ర్య ము.

తీవ్రమై పొంగి వచ్చుచున్న ప్రవాహమువంటి లక్ష్మణుని జూచి గుండెలు పగులఁగఁ గ్రోఁతుల గుంపులు సుగ్రీవుని సమీపమునఁ గిచకిచమని తమమీఁద దయ గలుగునట్లు మీఁదమీఁద ధ్వనించెను.

---♦ సుగ్రీవునకు మంత్రులు హితము బోధించుట ♦---

సీ. ఆ మహారవమున ♦ కల్లన మేల్కని, వ్యాకులహార భూ♦షాకులుండు
మదవిహ్వలారుణ ♦ మహితలోచనుఁడు తా, రాత్మజు వాక్యంబు ♦ లాలకించె
నంగదునుడి విని ♦ యతనితో వచ్చిన, దారదర్శులుఁ జను♦వారుఁ గీశ
పతి కిష్టసచివులు ♦ ప్లక్షప్రభావాఖ్యు, లర్థ ధర్మంబుల ♦ నైకగతులఁ
ఆ. బలుక వచ్చియున్న ♦ పార్థివసుతుఁ గూర్చి, వృషునిమాడ్కి సముప♦విష్టుఁ డైన
ప్లవగనాథుతోడఁ ♦ బ్రస్తావ మొనరించి, హితము దోఁప నతని ♦ కిట్టులనిరి.౮౭

వ్యాకులహార భూషాకులుండు = క్రిందుమీఁదై కలసిపోయిన హారములు కలవాఁడు, మదవిహ్వలారుణ మహితలోచనుఁడు = మదముచేఁ గలఁతపడి ఎఱ్ఱనైన పెద్దకన్నులు గలవాఁడు, దారదర్శులు = భార్యలను జూడఁదగినవారు- అంతఃపురము లోనికి రాఁగూడినవారు; చనువారు = మాటచెల్లుఁబడిగలవారు 'చనువారె' కడుఁ జనువాఁడునై పురుషకారియు దక్షుఁడునైన మంత్రి-భార. సభా. ౧౪- నైకగతులఁ= అనేకవిధముల - వృషుని మాడ్కిఁ = ఇంద్రునివలె- "వాసవో వృత్రిహావృషా" యని యమరుఁడు; సముపవిష్టుఁడైన = చక్కఁగాఁ గూర్చుండిన వాఁడైన.

తా త్ప ర్య ము.

ఆ క్రోఁతుల కిలారింపులకు మెల్లగ మేల్కని మెడలోని హారము లొకదానితో నొకటి పెనవేసికొనియుండ, మదముచే వ్యాకులములై యెఱ్ఱనైనకన్నులుగల సుగ్రీవుఁ డంగదుఁడు చెప్పిన వాక్యములను విని యతఁడు వచ్చునపుడు తనతోడఁ బిలుచుకొని వచ్చినవారు, అంతఃపురములోనికి రాఁదగినవారు, మాటచెల్లుబడి గలవారును సుగ్రీవుని కిష్టులైన మంత్రులు నగువారు, ప్లక్షుఁడు, ప్రభావుఁడు నను వారు, ధర్మార్థవిషయంబు ననేకవిధముల మాటలాడవచ్చియున్న లక్ష్మణుని గుఱించి యింద్రునివలెఁ జక్కఁగ స్వస్థతవచ్చి కూర్చుండిన సుగ్రీవునితో నతనికి మేలు కలుగునట్లు లిట్లనిరి.

క. భ్రాతలు రాజ్యసుఖశ్రీ, దాతలు నీమిత్రవరులు ♦ దాశరథులు భూ
మీతల భరభరణార్హులు, నాతతసత్యాత్ములుగ మ♦హాభాగవరుల్. 62

రాజ్యసుఖశ్రీదాతలు = నీకు రాజ్యమును సుఖమును సంపదను నిచ్చినవారు, భూమీతల భరభరణార్హులు = భూభారమును వహించి రాజ్యము పాలింప యోగ్యులు, ఆతతసత్యాత్ములుగ = విస్తారముగ సత్యమునందు మనస్సుగలవారు. మహాభాగవరుల్ = గొప్పపుణ్యాత్ములు.

తా త్ప ర్య ము.

అన్నదమ్ములు, నీకు రాజ్యమును సుఖమును సంపత్తు నొసఁగినవారు, నీకు ముఖ్యస్నేహితులు, దశరథరాజ కుమారులు, భూభారము వహించి రాజ్యము పాలింపయోగ్యులు, మిగుల సత్యమునందు మనస్సుగలవారు, గొప్ప పుణ్యాత్ములు నగు రామలక్ష్మణులు.

క. ఆయిరువు రందు నొక్కఁడు, దాయఁగ లక్ష్మణుఁడు చాప♦ధరుఁడై రాఁగా
నాయతిబలుఁ గని భీతిని, గూయిడుచున్న వియు వింటే ♦ క్రోఁతులు తేఁడా! 63

తా త్ప ర్య ము.

ఆయిరువురిలో లక్ష్మణుఁడనువాఁడు విల్లు ధరించినవాఁడై రాఁగా నామహాబలుఁజూచి భయపడి క్రోఁతులన్నియుఁ గూఁతలు పెట్టుచున్నవి. రాజా! వింటివి గదా.

క. వ్యవసాయ శతాంగుండై, సవురుగ సౌమిత్రి వాక్య ♦ సారథి యిదె రా
ఘవశాసనమున వచ్చెఁ, జవమున నంగదుని నీకు ♦ సన్నిధి కనిచెన్. 64

వ్యవసాయశతాంగుండై = ప్రతిపక్షుల నిరసించు దృఢనిశ్చయమను రథముగల వాఁడై, వాక్యసారథి = రామవాక్య ప్రేరితుఁడై, దూతయై.

తా త్ప ర్య ము.

లక్ష్మణుఁడు కాలినడ నొంటరిగా యీ దుర్గమప్రదేశమున కెట్లు వచ్చెనందువా పగవారిని సాధింపవలయునను దృఢనిశ్చయము రథముగా రామునివాక్యమే సారథిగా రాముని యాజ్ఞాప్రకారము వచ్చెను. శీఘ్రముగ నంగదుని నీ యొద్దకుఁ బంపెను.

క. చూడుక్కలన కపుల మాడ్చెడి,చూడ్కిని నున్నాఁడు సుతుల ♦ మఱిబంధువులన్
దోడ్కొని చని పదములఁ బడి,వేడ్కొనుమీ యతని కోప♦వేగము దీరన్. 65

తా త్ప ర్య ము.

రథమెక్కి వచ్చినాడంటిరే యుద్ధసన్నాహమున వచ్చెనా, వినోద సంచారమునకై వచ్చెనా యందువేమో, బాణములచేఁగాదు, చూపులచేతనే వానరులనెల్ల మాడ్చుచున్నట్లున్నాఁడు. కావున నీవు కొడుకులతోను జుట్టములతోను బోయి యాయన కాళ్ళమీఁదఁబడి క్షమింపఁ బ్రార్థింపుము.

తే. రాజధర్మాత్ముఁడైన శ్రీ♦రామవిభుఁడు, చెప్పి నట్టులు చేయుము♦చిత్త మునిచి
నీవు పలికినవాక్యంబు ♦ నిలిపికొనుము, సత్యవాది వటన్న ప్ర♦శస్తిఁ గనుము.

తాత్పర్యము.

ధర్మాత్ముఁడైన రామచంద్రమూర్తి యేమి చెప్పునో యట్టులు చేయుము. నీవు చెప్పిన మాటపై నిలిచి సుగ్రీవుఁడు సత్యవాదియను కీర్తి సంపాదింపుము.

—♦ ౩౨-వ సర్గము. లక్ష్మణుఁడు వచ్చినవార్త విని సుగ్రీవుఁడు భయపడుట. ♦—

క. అని చెప్పఁ గినుక దశరథ,తనయుఁడు నిలుచున్నవాఁడు ♦ తనవాకిట నం
చను నంగదునుడి విని యా,సనమునఁ జలియించు చనియె ♦ సచివులతోడన్.

తాత్పర్యము.

దశరథరాజకుమారుఁడు లక్ష్మణుఁడు తన వాకిటఁ గోపయుక్తుఁడై వచ్చి నిలచియున్నవాఁ డనిన యంగదుమాట వినినతోడనే కూర్చుండినవాఁడు కూర్చుండినట్లే యాసనమందే వణఁకుచు మంత్రులతో నిట్లనెను.

ఉ. ఆడను గీడుమాట, యెదు♦రాడను వారికిఁ, జెడ్డ సేయఁగాఁ
జూడను, రామచంద్రునను♦జుం డిటు లేటికిఁ గోప మూనెనో?
యాడిరొ రంధ్రముల్ వెదకు♦నట్టి విరోధులు లేనిపోనివిన్
గీడొనరింప నాకు రఘు♦కేసరితోడ, నేఁ కేమి చేయుదున్. ౧౭౫

తాత్పర్యము.

నేను వారి నొకమాటయినఁ గీడుమాట పలికినదిలేదు. వారిని ధిక్కరించి యవునన్నది కాదని, కాదనినది యౌనని చెప్పినవాఁడనుగాను. వారికిఁ జెడ్డసేయ నాలోచింపను. ఏల నామీఁద లక్ష్మణునకుఁ గోపము వచ్చెను, రామునకు నాకు విరోధము కల్పింప సందులు వెదకువారేదైన నామీఁదఁ గొండెములు చెప్పిరో, ఇఁక నేనేమి చేయుదును.

క. తొలుదొలుత యథాస్థితిగాఁ, దెలియం దగు నతనిబుద్ధి♦తీరు నతండున్
జలుప నిట నిశ్చయించిన, యలవిధమున్ హితులచేత ♦ నతినిపుణముగన్. ౧౭౬

తాత్పర్యము.

మన మేకార్యమైనఁ జేయుటకు ముందు నతని యాలోచనవిధము ఆయన యిక్కడ నేమిచేయ నిశ్చయించినది హితులచేత విశదముగా నేర్పడఁ దెలిసికొవలెను. ఆయన యుద్దేశము తెలియక మన మేమియుఁ జేయరాదు.

క. భయపడను లక్ష్మణునకున్, భయపడ నొకయింత రామ♦భద్రున కైనన్
బ్రియమిత్రుఁడు హేతువు లే,కయె కుపితుం డగుట కేను ♦ గళవళపడెదన్. ౧౭౭

తాత్పర్యము.

నేను లక్ష్మణునకు భయపడను- రామభద్రునకు భయపడను గాని ప్రియస్నేహితుఁడు కారణములేకయే కోపించెఁగదా యని వ్యాకుల పడుచున్నాను. ఈయొక్కమాట సుగ్రీవుని స్వభావసిద్ధమగు గొప్పగుణమును స్పష్టపఱుచుచున్నది.

క. సులభము మిత్రులఁ జేస్కొట, కలసిన పిదప మైత్రి చెడక ♦ కాపాడుటయే
బలితపుఁగష్టము మది చంచల మగుటను బ్రీతి చెడును ♦ స్వల్పంబునకేన్. ౮౮౧

తాత్పర్యము.

మిత్రుల సంపాదించుట సులభము. సంపాదించినవారితోఁ గలిసిన పిమ్మట నామైత్రి చెడకుండఁ గాపాడుకొనుట చాల కష్టము. ఏలందురా- మనస్సు చంచలమగుట స్వల్పమునకే మైత్రిచెడును.

క. రాముఁడు నా కొనరించిన, యామేలున కేమి సేయ♦నగుఁ బ్రతికృతిగా
నామదిఁ దానిం దలఁచిన, నేమో భయ మొదవె నెద్ది ♦ యీ డగుఁ జేయన్.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి నాకుఁజేసిన మేలునకు నేనేమి ప్రత్యుపకారము చేయఁగలను? అది తలఁచుకొలఁది నేనేమి చేయలేనే! ఏమిచేయుదునా యని యేమో భయము గలుగుచున్నది-

—♦ హనుమంతుఁడు సుగ్రీవునకు హిత ముపదేశించుట. ♦—

క. అనవుడు సుగ్రీవునిఁ గని, హనుమంతుం డనియె వింత ♦ యానే నీ వా
ఘను లొనరించిన మేలును, మనమున విస్మృతిని గనమి ♦ మార్తాండసుతా!

తాత్పర్యము.

ఇట్లు సుగ్రీవుఁడు చెప్పఁగా హనుమంతుఁ డిట్లనియె. సుగ్రీవా! యా మహాత్ము లొనరించిన యుపకారమును నీవు మఱవకుండుట యాశ్చర్యకరముగాదు.

సీ. ఆరాఘవేంద్రుండు ♦ వీరవరేణ్యుండు, శక్రాభవిక్రము ♦ జడుపు లేక
త్వత్ప్రియార్థము గాదె ♦ వధియించె వాలిని, బ్రణయకోపం బూని ♦ పార్థివుండు
పనిచె నిజానుజు ♦ ఘనబలు లక్ష్మణు, నీవు మత్తుండ వై ♦ యెఱుఁగ లేక
కాలంబు దాఁటుట ♦ లీలమై నుండిన, నతఁ డెచ్చరింపఁగ ♦ నడుగుదెంచె

తే. విచ్చెఁ గపురంపు టనఁటులు ♦ హెచ్చె మింట నిర్మలగ్రహనక్షత్ర ♦ నికరములును
విచ్చు మొగ్గయ్యె మేఘముల్ ♦ విశదకాంతు లలమె దిక్కులఁ గొలఁకుల ♦ నాపగలను.

శక్రాభవిక్రముఁ = ఇంద్రునితో సమానమైన పరాక్రమముగలవానిని, ప్రణయకోపంబు = స్నేహమువలనఁ గలుగుకోపము, నెయ్యపుటలుక, స్నేహితుఁడు నేరముచేసినాఁ డని తెలుపుటయే యీ కోపమునకు ద్దేశముగాని కీడుచేయవలయునని కాదు. మత్తుండవై = మదముచే దేహము తెలియనివాఁడవై, విచ్చు మొగ్గయ్యెన్ = చెదరిపోయెను. ఆపగలను = ఏళ్ళయందు.

## తా త్ప ర్య ము.

వీరులలో శ్రేష్ఠుఁడైన రామచంద్రమూర్తి భయమనునదిలేక నీకుఁ బ్రియము చేయుటకై యింద్రసమానుఁడైన వాలిని వధించెనుగదా, అట్టివాఁడు స్నేహరూపకమైన కోపముచేఁ బంపఁగా లక్ష్మణుఁడు వచ్చెను ఏల వచ్చెనంటివా - నీవు తప్పఁద్రావి దేహముతెలియక మత్తుఁడవై నీవు చెప్పివచ్చిన గడువు దాటిపోవుటయైన దెలియక విలాసక్రీడలఁ దగిలియుండిన కారణమున స్నేహితుఁడవై యుండి నీవిట్లు చేయవచ్చునాయని నిన్ను హెచ్చరింపవచ్చెను. గడువు దాఁటినదా యందువేమో స్పష్టముగా దాఁటివది. కఫురఫుటనఁటులు వికసించుట - ఆకాశమున గ్రహనక్షత్రములు విశదముగాఁ గానవచ్చుట - మేఘములు చెల్లాచెదరై పోవుట, దిక్కులందుఁ గొలఁకులందు నేళ్ళయందుఁ దెల్లని కాంతులు వ్యాపించుట, వర్షాకాలముపోయి శరత్కాలము స్థాపితమగుట తెలుపుచున్నది.

తే. జైత్రయాత్రకు నిది తగు♦సమయ మగుట, వారలను గానఁబోకున్కి ♦ వారు నిన్ను
మత్తునిఁగ నెంచి రదియ ని♦మిత్తమూని, వచ్చె నిచటికి సౌమిత్రి ♦ వానరేంద్ర !

జైత్రయాత్రకుఁ = శత్రువులను జయింపఁగోరి చేయు ప్రయాణమునకు, మత్తునిగఁ = మైమఱచినవానిఁగా.

## తా త్ప ర్య ము.

యుద్ధయాత్రకుఁ బోవువారు తగిన ప్రయత్నము చేయవలసిన సమయమిదే. అటులుండియు నీవు వారియొద్దకుఁబోయి వారికిఁ దగిన సమాధానము చెప్పి వారేమియాలోచన చెప్పుదురో యేమో విచారింపవైతివి. కావున నిన్ను మత్తుఁనిగ వారెంచిరి. ఆకారణముచే నిన్ను హెచ్చరింప లక్ష్మణుఁడు వచ్చెను.

క. హృతదారుఁడు దుఃఖార్తుం, డతులమహాత్ముండు రాముఁ ♦ డనుచుట ననుజుం
డతిపరుషము లాడినచో, హితమని సహియింపఁ దగుఁ గ♦పీశ్వర నీకున్. ౨౨౬

హృతదారుఁడు = అపహరింపఁబడిన భార్యగలవాఁడు, దుఃఖార్తుఁడు = ఆ కారణముచే దుఃఖముచేఁ బీడింపఁబడువాడు, అతులమహాత్ముఁడు = అసమానమైన గొప్ప మనస్సుగలవాఁడు, అనుచుటన్ = పంపుటచే.

## తా త్ప ర్య ము.

భార్యను గోలుపోయి మిగుల దుఃఖపడు మహాత్ముఁడు రామచంద్రమూర్తి ఱంపుటచే వచ్చిన లక్ష్మణుఁడు నిన్నుఁ గఠినముగఁ బలికినను నీవు దాని సహించుకొనవలెను. గాని యెదిరించి మాటలాడరాదు. ఏలనన, దోషము నీయందున్నది. ప్రథమ దోషమునకుఁదోడు తిరస్కారభావము చూపితివేని యొకటికి రెండగును.

క. అపరాధివి వారిమొడం, గపినాయక! దోషహరణ♦కరణక్షమ మా
నుపమ మఱి యొద్ది లే దిఁక, నిపు డంజలిఁ జేర్చి మ్రొక్కు♦మీ సౌమిత్రిన్.

అపరాధివి = నీవు దోషము చేసినవాఁడవు. దోషహారణకరణక్షమము = దోషము హరింపఁజేయుటయందు సామర్థ్యముగలది, ఉపమ = ఉపాయము.

తా త్ప ర్య ము.

సుగ్రీవా! నీవు వారివిషయమున దోషము చేసినవాఁడవు. ఆ దోషమును బాయఁజేయశక్తిగల ప్రాయశ్చిత్తము నీవు లక్ష్మణునికి రెండుచేతులు జోడించి మ్రొక్కుటయే. ఇంతకు మించిన యుపాయము లేదు.

ఈ హనుమదాచార్యోపదేశమును భక్తులు ప్రపన్నులు చక్కఁగ మనస్సునందుంచుకొనవలయును. ఈ విషయమై ప్రపత్తిశాస్త్ర మేమి చెప్పుచున్నదనిన,

పాగ్రబ్ధేతర పూర్వపాప మఖిలం ప్రామాదికం చోత్తరమ్
న్యాసేన క్షపయ, న్నభ్యుపగత ప్రారబ్ధఖండంచ నః
ధీపూర్వోత్తరపాప్మనా మజననాత్ జాతేపి తన్నిష్కృతే
కాటిల్యే సతి శిక్షయా ప్యనఘయన్ క్రోడీకరోతి ప్రభుః।

వి వ ర ణ ము

పాపములు రెండువిధములు- శరణాగతి చేయుటకుముం దీజన్మమందో పూర్వజన్మములందో చేసిన పాపము పూర్వాఘ మనఁబడును. తరువాతఁ జేసినది యుత్తరాఘ మనఁబడును. పూర్వాఘమంతయు నిశ్శేషముగ శరణాగతి చేయుటతో వెంటనే నశించును. ఆకారణముచే వాఁడు నిష్కల్మషుఁడై నిలుచును. ఉత్తరాఘము రెండు విధములు (౧) బుద్ధిపూర్వకము, (౨) అబుద్ధిపూర్వకము. తెలిసి తెలిసి చేసినది బుద్ధిపూర్వకము. పొరబాటునఁ జేసినది యబుద్ధిపూర్వకము. అబుద్ధిపూర్వకముగఁ జేసినపాపమును భగవంతుఁడు లెక్కకుఁ దీసికొనఁడు. దానికై శిక్షింపఁడు. బుద్ధిపూర్వకముగఁ జేసినది రెండువిధములు:- కృతప్రాయశ్చిత్తము, అకృతప్రాయశ్చిత్తము. పాపము చేసిన వెనుక 'నయ్యో! యిటువంటి పాపము చేసితిమే' యని పశ్చాత్తాపము పుట్టి యిఁక నిట్టి పాపము చేయరాదని నిశ్చయించుకొని చేసినదానికిఁ బ్రాయశ్చిత్తము పెట్టుకొన్నయెడలఁ గృతప్రాయశ్చిత్తము. అట్టు ప్రాయశ్చిత్తము పెట్టుకొనకుండెనేని యకృత ప్రాయశ్చిత్తమగును.

ఇందుఁ జెప్పఁబడిన ప్రాయశ్చిత్తము స్మృతులలోఁ జెప్పఁబడిన కృచ్ఛ్రము-చాంద్రాయణము లోనైనవి కాదు. అది ప్రపన్నులు కానివారి విషయము. ప్రపన్నులో మరల శరణాగతిచేయుటయే ప్రాయశ్చిత్తము. ఇది పాపపరిహారార్థము. ప్రాయశ్చిత్తముగఁ జేయఁబడు శరణాగతి గావున ముందుచేసిన శరణాగతిని బాధింపదు. ఇది త్రికరణముల దేనితోనైన భగవత్సన్నిధానమందో భాగవత సన్నిధానమందో చేయవచ్చును. ఇక్కడఁ బ్రస్తుతమింతియే. ఇంకను దెలిసికొనఁ గోరువారు నా ప్రపన్నామృతముఁ జూడవచ్చును. ఇచ్చట నాంజనేయుఁ డుపదేశించినది నమస్కారరూపకమైన ఈ ప్రాయశ్చిత్తమే. అన్నియోగముద్రలకంటె శ్రేష్ఠమైనది. వేగముగ

ఫలమిచ్చునది యంజలి ముద్రయే. "అంజలిః పరమా ముద్రా క్షిప్రం దేవప్రసాదినీ" యని ప్రమాణము.

అనుతప్తస్తు తానేవ క్షామయే న్నాన్యథా శమః
భగవత్యపచారేపి సైషా శాంతి రనుత్తమా॥

అయ్యో యిట్టిపాపము చేసితినే యని పశ్చాత్తాపపడినచో క్షమించునుగాని వేఱువిధముగ క్షమింపఁడు. భగవ దపచారమునందు నిదే యుత్తమ ప్రాయశ్చిత్తము.

త్వదంఘ్రి ముద్దిశ్య కదాపి కేనచిత్
యథా తథా వాపి సకృత్ కృతోంజలిః
తదైవ ముష్ణా త్యశుభా న్యశేషత
శ్శుభాని పుష్ణాతి నజాతు హీయతే॥

స్వామీ! నీ పాదారవిందముల నుద్దేశించి యెుకప్పుడైన నెట్లులైన నేపరికారమైన నంజలిచేసి యుండిన నశుభము లన్నియుఁ బోయి శుభములు పొందియుండనా? అది యెప్పుడు వ్యర్థము పోదు.

అంజలి యను నేక వచన ప్రయోగముచే నిండు మనస్సుతో నొక్కసారి చేసిన జాలు నని భావము.

ఇప్పుడు అనుటచే దీనికి దేశకాల నియమములతోఁ బనిలేదని భావము.

కపినాయక యనుటచే దీనికి నధికార నియమము లేదని భావము.

క. భూనాథనియుక్తులు నయి, మానవపతిమేలు గోరు ♦ మంత్రులు హితముల్
మానక వచింప నర్హము, గానఁ జుమీ భయము విడిచి ♦ కలతెలఁ గంటిన్.

తాత్పర్యము.

నన్నుఁబోయి మఱియొకని కాళ్ళమీఁదఁబడి మ్రొక్కు మని నీవుచెప్పవచ్చునా? ఇది నాకగౌరవము కాదా యందువేమో - రాజులు తమ కేదిమేలో యది మీరు తెలుపుచుండుఁడనియే మంత్రుల నియోగింతురుగాని యిచ్చకాలు చెప్పుచుండుఁడని కాదు. అట్టి హిత ముపదేశింప లేని వారు ద్రోహులేకాని మంత్రులుగారు, హితులు గారు. ఆ కారణముచే నీకు మేలుకోరి భయమువిడిచి నీకు హితమైనదానినే చెప్పితిని. ఆ పరికారము చేసితివా బాగుపడెదవు, చేయవైతివా చెడుదువు.

క. కోపించి రాఘవుం డురు,చాపంబును గేలఁ గొనిన ♦ ససురాసురమై
దీపించు జగము నంతయు, స్థాపింపఁ గలండు తనవశం బయి పరఁగన్. ౧౮౯

తాత్పర్యము.

రామచంద్రమూర్తి యనిన నీ వేమని తలఁచితివి. తన కార్యము తాను జేసికొనలేక యసమర్థుఁడై నిన్నాశ్రయించెనని తలఁచితివా - ఆయనకుఁ గోపమే వచ్చి

చేత విల్లె తీసికొనెనా దేవతలతో రాక్షసులతో వెలుఁగు నీ ప్రపంచమంతయుఁ దనకు లోఁబడఁ జేసికొనఁగలఁడు.

క. తలఁచుచుఁ బూర్వోపకృతిం, దలఁగక మఱుమేలు సేయఁ ♦ దలఁకొను నీ వా
లలితాత్ముని వేఁడినచో, నలుగంగా నెట్టు నేర్చు ♦ నాతఁడు మరలన్. ౨౦

పూర్వోపకృతిన్ = వారు ముందుచేసిన యుపకారమును, తలకొను = యత్నించు, లలితాత్మునిన్ = మృదువైన మనస్సు గలవానిని.

తాత్పర్యము.

పూర్వము రామచంద్రమూర్తి చేసిన యుపకారము తలఁచి మఱుమేలు సేయు తలంపు గలిగి దానికై యత్నించు నీవు 'అపరాధము క్షమింపు' మని ప్రార్థించితివేని మెత్తని మనస్సుగల యతఁడు నీపైఁ గోపింపఁగలఁడా? అది యాయనకు సాధ్యమా?

చం. తరలుము పుత్రమిత్రసహి♦తంబుగ, నాతనిఁ జేరఁబోయి నీ
కరములు మోడ్చి మ్రొక్కి, సతి ♦ కాంతువశంబున నిల్చునట్లుగా
హరివర! నిల్వు, నీదు సమ♦యంబును దప్పక తద్వశుండ వై
యరమర మేల నానుడి హి♦తార్థముగాఁ గైకొని గ్రహింపుమా. ౨౧

తాత్పర్యము.

ముందుచేసిన యుపదేశమునే వివరించి చెప్పుచున్నాఁడు. నీవు బయలుదేఱి పుత్రునితోడను మిత్రులతోడను నతనియొద్దకుఁ బోయి రెండుచేతులు జోడించి నమస్కరించి భార్య యేప్రకారము భర్తయొద్ద నిల్చునో యట్లు నీ ప్రమాణము తప్పక యాయన వశమున నిలువుము. వానరేంద్రా! నేను నీ హితముగోరి చెప్పితి నని గ్రహింపుము.

ఇందు జీవులకు భగవంతునకుఁగల భార్యాభర్తృ సంబంధము తెలుపఁబడెను. స్త్రీప్రాయ మితరత్సర్వ మన్నట్లు భగవంతుడు తప్ప దక్కిన దంతయు స్త్రీప్రాయమే. భగవంతుఁడు భర్త. జీవకోటు లన్నియు భార్యవంటివే. అనఁగాఁ బతివ్రతయగు స్త్రీ తా నుద్ధారముగుటకై భర్త నెట్లు సేవించునో యట్లు జీవులు త ముద్ధరించుకొనుటకు భగవంతునకు వశపడి యాయన స్వేచ్ఛావినియోగమునకుఁ బాత్రమై యుండవలెను. అట్లు చేయని స్వైరిణి యుభయలోకముల నెట్లునాశమగునో యట్టులే తాను స్వతంత్రుఁడ ననుకొను జీవుఁడు నాశమగును, అని భావము.

అపరాధము చేసినవాఁడు సుగ్రీవుఁ డొకఁడేకదా. అతఁడు పోయి కాళ్ళమీఁదఁ బడినఁ జాలదా? ఏల బంధువులతోడఁబోయి కాళ్లమీఁదఁ బడుమని హనుమంతుఁ డుపదేశించెను. వ్యవహారదశయందు నాఁడువారు మగవారు పిల్లలు పెద్దలు పోయి కాళ్ళమీఁదఁబడి యీయొక్కని నీవు దండించితివా మేమిందఱము దిక్కులేనివార మగుదుము. మమ్ము నందఱఁ జంపిన ట్లగునని చెప్పుకొనిన నెట్టివానికిని

దయ పుట్టును. ఇట్లు పారమార్థిక శరణాగతియందు దానొక్కడే శరణాగతి చేసితన రక్షాభారముమాత్రము భగవంతునియందు వైచినచో బుత్రకళత్ర రక్షాభారము తననుండి తప్పదు. ఆకారణమున వారికి దాను రక్షకుడు అను జ్ఞానముపోదు. సర్వరక్షకుడు భగవంతుడై యుండ దనయందు గొంత రక్షకత్వ మున్న దనుకొనుటవలన స్వాతంత్ర్యము స్ఫురించును. అది జీవుని స్వరూపస్వభావములకు విరుద్ధము. కావుననే 'ఆత్మాత్మీయ నిక్షేప మాత్మనిక్షేప ముచ్యతే.' తన్ను దనది యనుకొన్న దంతయు భగవంతుని కప్పగించుట యాత్మనిక్షేపమని చెప్పబడెను. అప్పుడు భారము తనయందు లేదు. తనకు వారికిగూడ భగవంతుడే భర్తయగును. ఇందఱ రక్షించు భార మాయనదే. అంద ఱాయనసొత్తే, యనియు భగవంతుని యాజ్ఞాప్రకారము (శాస్త్రప్రకారము) తాను భగవంతుని సొత్తైనవారిని భరింపవలసి యున్నది. కాని స్వతంత్ర భర్త తానగుటచే గాదనియు దోచును. భగవంతుని సొత్తును రక్షింపవలసిన భారము భర్తనియందు గలదు కదా. అట్లయిన నొక ప్రపన్నుడు లోకములోని ప్రపన్నుల నందఱ రక్షింపవలయునుగదా యనరాదు. భగవంతుని యాజ్ఞ శాస్త్రము. అది భార్యాపుత్రులను రక్షించు భారము తనయందుగల దని చెప్పుచున్నది. కాని శక్తిలేకున్నను లోకములో నందఱ రక్షించుభారము తనయం దున్నదని చెప్పదు. ఇది నా భార్య, నేను రక్షించు భారము తనయం దున్నదని చెప్పదు. ఇది నా భార్య, నేను రక్షింపవలయు ననుకొనుటకు ఇది ప్రపన్నురాలు, భగవంతుని సొత్తు, భగవంతుడు దీనిని రక్షింపు మని యాజ్ఞాపించెను. గావున భగవంతుని యాజ్ఞమీఱక రక్షించెదను అనుకొనుటయందును భావభేదము కలదు. భర్త ప్రపన్నుడై భార్య ప్రపన్నురాలు కాలేదు, అప్పు డెట్లనుదురా? పురుషుడేమో తనరక్షాభారము తాను దొలగించుకొని భగవంతునియందు వైచి మీఁద జెప్పినట్లు వర్తింపవలయును. అట్టి భార్యయో, భర్తతో ననుకూలింపని కారణమున భర్తృసాలోక్యము దానికి లేదు. దాని గతులకొలది యది మరల జనన మరణములపాలై పోవలసియుండును. ఈ విషయమున నీక్రింది ప్రమాణవాక్యము లనుసంధింపవలయును.

ఆత్మా రాజ్యం ధనంచైవ కళత్రం వాహనానిచ
ఏతద్భగవతే సర్వ మితి తత్ ప్రేక్షితం సదా. - భార. ఆది.
తేన సంరక్ష్యమాణస్య ఫలే స్వామ్య వియుక్తతా
కేశవార్పణ పర్యంతా హ్యాత్మ నిక్షేప ఉచ్యతే.

స్త్రీలను వదలు మనిన శాస్త్రముల యభిప్రాయము వారియందలి కామము వదలు మనియే కాని వారు వయస్సువారైనను బుత్రులు లేనివారైనను అనుకూలవతులైనను దిక్కులేనివారిని జేసి స్వరూపత్యాగము చేయుమనికాదు. ఉద్ధరింపగల పుత్రుడుండెనేని వాని కప్పగించి పోవచ్చును. లేదా యది ప్రతికూలముగ వర్తించునది యయ్యెనేని వర్జింపవచ్చును.

తే. రామరామానుజాజ్ఞ శాఖామృగేంద్ర, తలఁగిచనఁ జిత్తమందేనిఁ ♦ దలఁపవలదు
నీ మన మెఱుంగు గాదె సుత్రామనిభుని,సానుజుని రాము మానుష♦మైనబలము.

రామరామానుజాజ్ఞ = రామాజ్ఞ గాని లక్ష్మణునాజ్ఞ గాని, శాఖామృగేంద్ర = వానరశ్రేష్ఠుఁడా, తలఁగిచనన్ = అతిక్రమించిపోవ, సుత్రామనిభుని = ఇంద్రునితో సమానుఁడైనవానియొక్క, సానుజుని = తమ్మునితో గూడినవానియొక్క, మానుషమైన బలము = మనుష్యసంబంధబలము, ఇట్లు చెప్పుటచే నీవాయన యమానుషబలము తెలిసికొనలేవు. నీవు బాగుపడుటకు నాయన చూపిన మనుష్యశక్తి, జ్ఞానము చాలునని భావము.

తాత్పర్యము.

కపిరాజా! నీవు రామాజ్ఞగాని లక్ష్మణాజ్ఞగాని మీఱిపోవ మనస్సునందైన దలఁప వలదు. ఇంద్రసమానుఁడైన తమ్మునితోఁ గూడిన రాముని మనుష్యబల మెట్టిదో నీ మనస్సునకుఁ దెలియునుగదా.

—♦ 33-వ సర్గము. లక్ష్మణుఁ డంగదునితో సుగ్రీవు నంతఃపురంబుఁ జొచ్చుట. ♦—

సీ. అచట నంగదుచేత ♦ నాహూతుఁడై సుమిత్రాత్మజుఁ డరిగె గు♦హాంతరమున
భూరివిక్రము లైన♦ద్వారపాలురు లేచి, ప్రాంజలు లై నిల్వఁ♦బడిరి గాని
కుపితుఁడై రోఁజెడి♦నృపసుతు డాయంగ, సాధ్వసవశమునఁ ♦ జనఁ డొకండు
రత్నమయం బయి ♦ రమణీయ మై దివ్యమై పుష్పితారామ ♦ మగుచు హర్మ్య
తే. సాధసంబాధమగుచును ♦ సర్వకామ,ఫలుల సుమనముల రాజిలి ♦ లలితదేవ
యక్షగంధర్వపుత్రకీ♦శాళిచేత, దివ్యమాలాదిధరులచేఁ ♦ దేజరిలుచు. ౧-౬

ఇంతవఱకు లక్ష్మణుని వాకిట నూరక నిల్వఁబెట్టలేదు. నీవు లక్ష్మణుని బిలుచుకొని రమ్మని యంగదుని బంపి యాయన పోయి వచ్చులోపల నీ యాలోచనలు జరుపఁబడెనని యెఱుఁగనగు.

ఆహూతుఁడై = పిలువఁబడినవాఁడై, కుపితుడై = కోపించినవాఁడై, సాధ్వసవశమునన్ = భయకారణమున, పుష్పితారామము = పూచిన యుద్యానవనము, హర్మ్యసౌధ సంబాధము = హర్మ్యములచేత, సౌధములచేత (హర్మ్యములు = ధనికుల మేడలు, సౌధములు = రాచనగళ్ళు) నిఱుకయినది, సర్వకామఫలులన్ = అందఱకుఁ గావలసిన పండ్లనిచ్చువానిచే, సుమములన్ = పూలచే, దేవ యక్ష గంధర్వపుత్రి = దేవతలయొక్కయు, యక్షులయొక్కయు, గంధర్వులయొక్కయు, కొడుకులగు, కీశాళిచేతన్ = కోఁతులగుంపులచే, దివ్యమాల్యాది ధరులచేన్ = దివ్యమాల్యములు, దివ్యగంధములు లోనైనవానిని ధరించినవారిచే.

తాత్పర్యము.

అంతఃపురమందు నీ యాలోచనలు జరుగుచుండఁగా విని వాకిట నంగదునిచే

బిలువఁబడినవాఁడై లక్ష్మణుఁడు గుహలోనికిఁ బోఁగా బరాక్రమవంతులైన ద్వార పాలురు లేచి చేతులు జోడించి నిలువఁబడిరి గాని కోపించి నిట్టూర్పు విడుచుచున్న రాజకుమారుని దగ్గఱకు నెవఁడును భయముచేఁ బోయినవాఁడు కాఁడు. రత్నము లతో నిండి రమ్యమై దివ్యమై పూచిన యుద్యానముగలదై హర్మ్యములచే సౌధము లచే నిఱుకై యే పండు కోరిన నా పండిచ్చు చెట్లచేతను బూలచేతను బ్రకాశించి దేవతలకు యక్షులకు గంధర్వులకు జనించినవారు దివ్యమాల్య దివ్యగంధముల ధరించిన వారును నగు కోఁతిగుంపులచేఁ బ్రకాశించుచు.

తే. చందనాగరుపద్మాళి♦సంతతులను, సారమైరేయ మధురస ♦ పూరములను
నధికవాసిత మైన మ♦హాపథముల, మేలిసెలయేళ్లఁ గాంచె సౌ♦మిత్రి యచట.

చందనాగరు పద్మాళి సంతతులను = చందనము- అగరు- పద్మములు- వీని గుంపులచేతను, సార=రసవంతమైన, మైరేయ=మైరేయమను పేరుగల, మధురస=సారా యముల, పూరములను = ప్రవాహములచేతను, అధికవాసితములు = మిగుల వాసన గొట్టునవి, మహాపథములను=పెద్దబాటలను.

తా త్ప ర్య ము.

చందనము, అగరు, పద్మములు వీనియొక్కయు, మైరేయమను సారాయము యొక్కయు వాసనలుగల పెద్ద బాటలను, సెలయేళ్లను లక్ష్మణుఁడు చూచెను.

సీ. అంగదుగృహము మైం♦దాలయంబును గజ,ద్వివిదగవాక్షుల♦వీళ్లు, గవయ
శరభవిద్యున్మాలి♦సంపాతిసూర్యాక్ష, వాయుతనూజుల♦వానములును
వీరబాహుసుబాహు ♦ తారసుషేణుల, నలనీలకుముదుల ♦ నిలయములును,
జాంబవంతుం డుండు♦శాలయు దధివక్త్ర,నదనంబును సునేత్రు♦సద్మతలము

తే. మఱి సుపాటలు వసియించు♦మందిరంబు,పాండురాభ్రప్రకాశముల్ ♦ ప్రకటధాన్య
ధనసతీజన నిబిడముల్ ♦ ఘనజవుండు, త్రోవఁ గనుఁగొని యరిగె ♦ సరోషమతిని.

పాండుర + అభ్ర+సంకాశముల్ = తెల్లమబ్బుల కాంతిగలవి, నిబిడముల్ = దట్టములైనవి, ఘనజవుండు = మిగుల వేగముగలవాఁడు, సరోషమతిని = కోప ముతోఁ గూడిన మనస్సుగలవాఁడై.

తా త్ప ర్య ము.

ఇట్లు పెద్దబాటలవెంటఁ బోయి అంగదుని, మైందుని, గజ- ద్వివిద - గవాక్ష శరభ - విద్యున్మాలి - సంపాతి - సూర్యాక్ష - ఆంజనేయ - వీరబాహు - సుబాహు - తార - సుషేణ - నల - నీల - కుముద జాంబవంతుల యిండ్లను, దధివక్త్ర సునేత్ర సుపాటలులు నివసించు గృహములను, తెల్లని మబ్బునలెఁ బ్రకాశించునవియు, విస్తా రముగ ధాన్యము ధనము స్త్రీసమూహములు- వీనిచే దట్టమైనవియు నగు వానిని లక్ష్మణుఁడు కోపముతోఁ గూడిన మనస్సుగలవాఁడై మిగుల వేగముగఁ బోవుచునే చూచెను.

ఉ పాండురసాలసంవృతము • బాధదురాసదముఁ మనోజ్ఞ మా
ఖండలగేహసన్నిభము • కాంతి గిరీశగిరిప్రతీపముఁ
దండిగ సర్వకామఫల•ధారిణిజోత్కరరాజితంబు నా
ఖండలదత్తదివ్య నగ•కల్పితసౌఖ్యము దీప్తిమంతముఁ. ౧౯ ౬

పాండురసాల సంవృతము = తెల్లనిప్రాకారముచేఁ జుట్టఁబడినది. బాధదురాసదముఁ = లోపలఁ బ్రవేశించుటకు మిక్కిలి సాధ్యముకానిది, మనోజ్ఞము = ఇంపైనది, అఖండలగేహసన్నిభము = ఇంద్రుని యింటితో సమానమైనది. గిరీశగిరిప్రతీపముల = కైలాసముతో సమానమైనది, 'గిరీశో గిరిశో మృడః' అమరము. సర్వకామఫలద = వారువారు కోరినఫలముల నిచ్చునట్టి, ధారిణిజ + ఉత్కర = చెట్ల సమూహములచే, రాజితంబు = ప్రకాశించునది, అఖండలదత్త = ఇంద్రునిచే నీయఁబడిన, దివ్యనగ = దేవతావృక్షములచే, కల్పిత = కల్పింపఁబడిన, సౌఖ్యము = సుఖముగలది. ఇది సుగ్రీవ గృహవర్ణనము.

తా త్ప ర్య ము.

తెల్లని ప్రాకారముచేఁ జుట్టఁబడి చొరరానిదై, రమ్యమై, ఇంద్రునిమేడతో సమానమై, కైలాసమువలెఁ దెల్లనికాంతిగలదై, యేఫలములు గోరినవారి కాఫలము లిచ్చు చెట్లు గలదై, ఇంద్రుఁడిచ్చిన దేవతావృక్షములచేఁ గల్పింపఁబడిన సౌఖ్యము గలదై, తేజస్సుతోఁ గూడినదై.

తే. దివ్యమాల్యావృతంబు దే•దీప్యమాన,తప్తకాంచనతోరణో•ద్భాసితంబు
నాయుధీయావితద్వార•మైన సూర్య,తనయుమందిర దేశంబుఁ • గనుచు వేగ.

దేదీప్యమాన = ప్రకాశించుచున్న, తప్తకాంచన తోరణోద్భాసితంబు = పుటము వేయఁబడిన బంగారు తలవాకిలిచేఁ బ్రకాశించునదియై, ఆయుధీయ = ఆయుధములు ధరించినవారిచే, అవిత = రక్షింపఁబడిన, ద్వారమైన = ద్వారముగల.

తా త్ప ర్య ము.

దేవతాసంబంధమైన పూలదండలచే నావరింపఁ బడినదియు, మిగులఁ బ్రకాశించు మేలిబంగారు తలవాకిలి గలదియు నాయుధధరులచే రక్షింపఁబడునదియు నగు సుగ్రీవుని యింటిని జూచి, వేగముగ.

క. బలియుండు నిరంకుశగతి, నిలయముఁ జొరఁబాఱె పద్మి•నీకాంతుఁడు ద్యో
తలముం జొచ్చెడి క్రియఁ గ,క్ష్యల నేడిటి నరగఁ గడచి• చనుచు సుమతియుఁ.౧౯౮

నిరంకుశగతిఁ = ఆటంకములేని గమనమున, పద్మినీకాంతుఁడు = సూర్యుడు, ద్యోతలముఁ = ఆకాశమును, కక్ష్యలఁ = తొట్టికట్టులను.

తా త్ప ర్య ము.

మంచి మనస్సుగల లక్ష్మణుఁడు బలవంతుఁ డగుటచే నే యడ్డము లేక యింటి

లోనికిఁ బోయి సూర్యుఁ డాకాశమునఁ బ్రవేశించెడి విధముగ నేను తొట్టికట్టులను దాఁటిపోవుచు.

తే. హైమరాజతపర్యంక♦దామములను, సురుచిరవరాసనాళి నా♦స్తరణములను
రమ్యతర మైన యంతిపురంబుఁ జొచ్చి, తత వయోరూపగర్విత♦సతులఁ గనియె.

హైమరాజపర్యంక దామములను = బంగారు వెండి మయము లైన పానుపుల వరుసలను, సురుచిర = మిగుల మనోహరమైన, వర = శ్రేష్ఠములైన, ఆసనాళిః = పీఁటలులోనగు నాసనములను, ఆస్తరణములను = కూర్చుండుటకై దిగువపరుపఁబడిన తివాచీలు కంబళ్ళను, తత = మిక్కిలి, వయోరూప గర్విత సతులః = వయస్సు చేతను సౌందర్యముచేతను గర్వించినస్త్రీలను.

తా త్ప ర్య ము.

బంగారుమయము, వెండిమయమైన పానుపుల వరుసలను, మనోహరములైన కుర్చీలు, బల్లలు పీఁటలు-వీనిచేతను, నేలఁబఱచిన కంబళ్ళు తివాచీలచేతను, మిగుల మనోహరమైన యంతఃపురముఁజొచ్చి యచ్చట వయస్సు, సౌందర్యముచే మదించిన స్త్రీలను,

క. సమగీతపదాక్షరముః, విమల మనోజ్ఞస్వరంబు ♦ వీణారవముః
రమణీయభూషణోత్తమ,రమణుల హారిణుల వినియె ♦ రాఘవుఁడు కనెన్. ౯౦౦

సమగీత పదాక్షరముః = వీణాతంతెల పాటకు సమముగాఁ బాడఁబడు, పద+అక్షరముః = పదములు, అక్షరములను గలది, (౨) సమ = హెచ్చుతక్కువలు లేక, గీత = పాటలయందలి, పద + అక్షరముః = పదములు అక్షరములు గలదియు, విమల = దోషములు లేనిది గనుకనే, మనోజ్ఞంబు = ఇంపైన, స్వరంబు = ధ్వనిగలదియు, అనఁగా శ్రుతికలిసినది, వీణారవముః = వీణాధ్వనిని, రమణీయ భూషణోత్తమ రమణులః =సొగసైన సొమ్ములుగల యుత్తమస్త్రీలను, హారిణులః = హారములు ధరించినవారిని.

తా త్ప ర్య ము .

వీణాధ్వనికి సమానముగాఁ బాడఁబడు పదములను నక్షరములను గల ధ్వనులను వినెను. అందమైన యలంకారములు గల యుత్తమస్త్రీలను హారముల ధరించినవారిని లక్ష్మణుఁడు చూచెను.

క. ఆపోవనివారు నభూ,షాపరిలిప్తాంగకులు న♦చారుతరపటీ
దీపితమాలోరస్కులు, రూపింపఁగ లేరు వాన♦రుని సేవకులన్. ౯౦౧

ఆపోవనివారు = తృప్తిపడనివారు; అభూషాపరిలిప్తాంగకులు=సొమ్ములు ధరింపనివారు, చందనాదులు పూసికొననివారు; చారుతరపటీ = అందమైన వస్త్రములు ధరింపనివారు, అదీపితమాలోరస్కులు = మాలలచేఁ బ్రకాశింపని వక్షములు గల వారు. పటశబ్దము సామాన్యముగఁ బుంలింగ మయినను "పటః త్రిషు- పటీతి వస్త్ర

సామాన్యే" యని శబ్దార్థకల్పతరువునందుఁ గలదు. పటః పటీః పటీయని మూఁడు రూపంబులుగలవు. సేవకులన్ = సేవకులయందు, సప్తమ్యర్థమున ద్వితీయ. కొన్ని యెడల నజడంబు తృతీయాసప్తములకు బహువచనంబున ద్వితీయ చూపట్టెడి. త్రి. కా. ౧౮ సూ. మనుజుల విప్రుండు సమధికత్వ భాజనములందుఁ వేదప్రపంచవిదులు — (భార. శాంతి. ఆ. ౧)

తా త్ప ర్య ము.

సుగ్రీవుని సేవకులందు సంతుష్టులుగానివారు, సొమ్ములు ధరింపనివారు, చందనాదులు బాగుఁగ బూసికొననివారు, రమ్యములైన వస్త్రములు ధరింపనివారు, రొమ్ములందు మాలలు వ్రేలాడనివారు నొక్కరైన లేరు.

క. రాజితమణిమయనూపుర, కూజితములు మేఖలల యకుంచితరవముల్
రాజకుమారుఁడు విని లజ్జాజుష్టమనస్కుఁడయ్యె సౌధమునందున్. ౯౦-౨

రాజితమణిమయనూపుర = ప్రకాశించు రత్నములచే నిండినయందెల, కూజితములు = ధ్వనులు, మేఖలల = ఒడ్డాణములఁ (గజ్జెల), యకుంచితరవముల్ = కొంచెముగాని ధ్వనులు, లజ్జాజుష్టమనస్కుఁడయ్యెన్ = సిగ్గుతోఁగూడిన మనస్సు గలవాఁడయ్యెను. ఇది పురుషాయితక్రీడ తెలుపుచుండుటచే లక్ష్మణుఁడు సిగ్గుపడెనని భావము. స్వస్థ్యమైనచో నందెలధ్వను లెక్కువగాను, నొడ్డాణముల ధ్వనులు కొంచెముగా నుండవలెను.

తా త్ప ర్య ము.

ప్రకాశించు మణులచేఁ జెక్కఁబడిన యందెల కొంచెపుధ్వనులును, ఒడ్డాణముల యెక్కువ ధ్వనులను నామేడయందు విని లక్ష్మణుఁడు సిగ్గుపడెను.

క. ఆనాదము విని కుపితుఁడు, జ్యానాద మొనర్చి నిండ సకలదిశలు వే
వే నడచి యువతిరహితస్థానంబున నిలిచె రామతాపార్దితుఁడై. ౯౩

జ్యానాదము = అల్లెత్రాటిధ్వని, యువతిరహితస్థానంబునన్ = స్త్రీలు లేనిచోట.

తా త్ప ర్య ము.

ఆధ్వని విని పట్టపగలయ్యుఁ బ్రక్కల మగవారు తిరుగుచుండినను లక్ష్యము లేక యింతకామమున మునిఁగి యున్నారుకదా యని కోపించినవాఁడై సకల దిక్కులు ధ్వనిచే నిండునట్టు లల్లెత్రాడు మీటి త్వరత్వరగాఁ బోయి రామునకుఁగలిగిన తాపముచే బాధపడువాఁడై స్త్రీలు లేనిచోట నిలచెను.

క. ఆమార్వీరవమును విని, హైమాసనమందు వణఁకె నగచరపతియున్
సౌమిత్రి వచ్చెరా యని, మోమును వెల వెలఁ బాఱ ముంచినభీతిన్. ౯౪

మార్వీరవము = అల్లెత్రాటిధ్వని, హైమాసనమందున్ = బంగారముపీఠమునందు.

తా త్ప ర్య ము.

ఆ యల్లెత్రాటి ధ్వని విని లక్ష్మణుఁడు వచ్చెరా యని భయపడి తెల్లఁబాఱిన మోముతోఁ దాను గూర్చుండిన పీఠమందే వణఁకెను.

—♦ లక్ష్మణుని సమాధానపఱుప సుగ్రీవుఁడు తారను బంచుట. ♦—

శా. తారేయుం డటు వచ్చి తర్జ బిలువం జెం♦తం గ్రోలుతారాసతిన్
నీరేజాప్తసుతుండు గాంచి యనియెన్ ♦ నీరేజపత్రేక్షణా!
శ్రీరామానుజుఁ డెంత యుగ్ర మృదుల మా♦చి త్తంబువాఁ డెప్పుడున్
భూరిక్రోధవశాత్ముఁడై యిపుడు రాఁ♦బూనంగ నేహేతువో. ౯౦౫

తా త్ప ర్య ము.

స్త్రీలు లేనిచోట లక్ష్మణు నిలిపి యంగదుఁడు వచ్చి సుగ్రీవునితో లక్ష్మణుఁడు వచ్చినాఁడని తెలిపెను. అప్పుడు సుగ్రీవుఁడు తారను జూచి సర్వదా లక్ష్మణుఁడు మిగుల మెత్తని మనస్సుగలవాఁడు. అట్టివాఁ డింత కోపమునకుఁ బాలుపడిన మనస్సుగలవాఁ డగుటకుఁ గారణమేమో.

క. కారణము లేక సాధువు, పూరుషసత్తముఁడు కోప♦మును బూనం డే
నేరముఁ గావించితిమో, యారసి నా కెఱుఁగఁ జెప్పు♦మా బుద్ధిమతీ! ౯౦౬

బుద్ధిమతీ = బుద్ధిమంతురాలా!

తా త్ప ర్య ము.

కారణము లేక పురుషశ్రేష్ఠుఁడగు సాధువు కోపింపఁడు. కావున లక్ష్మణుఁడు కోపించుటకు మనయం దేదో నేర ముండవలయును. నీవు బుద్ధిమంతురాలవు. అది యేదో విచారించి నాకుఁ దెలియఁజెప్పుము.

క. కాదేని నీవ వేచని, భూదయితకుమారుఁ గాంచి ♦ పురుసాంత్వోక్తిన్
సాదరమతిగాఁ జేసి ప్రసాదంబును బడయుమీ పి♦శాలసునేత్రా! ౯౦౭

పురుసాంత్వోక్తిన్ = మిగుల మంచిసమాధానము మాటలచే; సాదరమతిగాన్ = మనయం దాదరముతోఁగూడిన మనస్సుగలవానిఁగా, ప్రసాదంబును = అనుగ్రహమును.

తా త్ప ర్య ము.

అట్లు మనదోషమేదో తెలియసాధ్యము కాదేని నీవే పోయి రాజకుమారుఁ గాంచి మంచిమాటలచే సమాధానపఱిచి మనయం దాదరముగలవానిఁ జేసి యాయన యనుగ్రహమును బొందుము.

క. పరిశుద్ధమనస్కుఁడు నినుఁ, దరుణీ! కని కోపగింపఁ ♦ దలపఁడు శాంతిం
బొరయు, మహాత్ముకు లెప్పుడు, గరితలయెడ దారుణంబుఁ ♦ గావింపరుగా. ౯౦౮

పరిశుద్ధమనస్కుఁడు = నిర్మలమైన మనస్సుగలవాఁడు, కల్లకపట మెఱుఁగనివాఁడు, గరితలయెడన్ = స్త్రీలయందు, దారుణంబు = కౄరత్వము.

### తాత్పర్యము.

మగవాఁడవు నీవుపోవుటకు భయమైనచో ఆఁడుదాన నేనెట్లు పోదునందు వేమో, లక్ష్మణుఁడు నిర్మలమైన మనస్సుగలవాఁడు. కల్లకపట మెఱుఁగఁడు, కావున నపరాధినివి కాని నిన్నుఁ జూచి కోపింపఁడు. శాంతిపడును. ఏలనఁ మహాత్ములెప్పుడును స్త్రీలవిషయమునఁ గ్రూరత్వము వహింపరు.

క. మును నీవు సాంత్వవచనం,బున నతనిఁ బ్రసన్న చిత్తు ♦ మొగిఁ జేయుము నేఁ
జను దెంతు వెనుక మ్రొగలో,చన ! యా సితకమలనయను ♦ సందర్శింపన్. ౯౦౯

సాంత్వవచనంబునన్=సమాధాన వాక్యములచే, సితకమలనయనున్=తెల్లని కమలములవంటి నేత్రములు గలవానిని- అనఁగా నిప్పుడు కోపముచే రక్తకమలముల వలె నెఱ్ఱని కన్నులుగలవాఁడని భావము.

### తాత్పర్యము

ముందుగా నీవు పోయి మంచిమాటలచే సమాధాన పఱుపుము. వానిచే నాయన శాంతిపడి కోపము మానును. అప్పుడు తెల్లకమలములవంటి కన్నులుగల యాయనను జూడవచ్చెదను.

### —♦ తార లక్ష్మణునితో సంభాషించుట. ♦—

క. అనిన మదవిహ్వలాక్షి యుఁ, జనె నడుగున నడుగు నిడుచు ♦ సౌమిత్రిని డా
యను లంబమానరశ్నగ,శనయై నమితాంగయష్టి ♦ సహలక్షణయై. ౯౧౦

మదవిహ్వలాక్షియు=పానమువలనఁ గలిగిన మత్తుచే భయమును గనఁబఱుచు కన్నులుగలది, లంబమాన=వ్రేలాడుచున్న, రశ్నరశనయై=మణులుగల యొడ్డాణము గలదై, సంభోగకాలమందుఁ దీసిన యొడ్డాణమును మరల బాగుగఁ బెట్టుకొనలేదని భావము, నమితాంగ యష్టి = వంచఁబడిన కఱ్ఱవంటి దేహము గలదై, దీనికి వినయమో, స్తనభారమో, చండరతిశ్రమమో కారణము. సహలక్షణయై = సంభోగ చిహ్నములు గలదై, చెదరినవెండ్రుకలు, ఊడినరవిక, జాఱుచున్న చీరపైఁటగలదై, అడుగున నడుగు నిడుచున్=అడుగులో నడుగుపెట్టుకొనుచు, చండసురతాలసత్వమో స్వభావసిద్ధ మందగమనమో, మత్తో, కారణము- మగవాని యెదుటికి నిట్టి సంభోగ చిహ్నములతో స్త్రీ పోవచ్చునా యనినఁ దల్లియొద్దఁ బిల్లకు దాఁపవలసినది లేనట్లు నిష్కల్మషచిత్తుఁడై పరస్త్రీలయందు మాతృభావముగలవానియెదుట స్త్రీ లెట్లుండిన నేమిభయము. శుకునియెదుట స్త్రీలు చీరలు విడిచియుండలేదా? బుద్ధిపూర్వకముగాఁ గావలయుననియే మేధావినియైన తార యీవేషముతోఁ బోయెను. ఇట్టివేషముఁ జూచి లక్ష్మణుఁడు నవ్వినను, అయ్యో భయపడి యున్నదున్నట్టు లేచివచ్చెనని తలఁచినను మఱి యుదాసీనభావము వహించినను గోపము శమించినట్లే. ఒక విధమైన భావమున వికారము జనించెనేని యా భావము మాఱినట్లేకదా.

తాత్పర్యము.

అని సుగ్రీవుఁడు చెప్పఁగా సంభోగకేళి యలసి పరుండిన తార పరుండినట్లే లేచి యలసతచే మెల్లగా నడుగులో నడుగిడుచు మదముచే భయమును గనఁబఱుచు కన్నులుగలదై మణులయొడ్డాణము వ్రేలాడుచుండఁగా వంగిన దేహముతో సంభోగ చిహ్నములతోఁ బోయెను.

క. చనుదెంచు వానరేంద్రుని,వనితఁ గని మహాత్ముఁ డతఁ డవాఙ్ముఖుఁడై స్త్రీ
జనసన్నికర్షమునఁ దాఁ, గనలు శమింపఁగ నుదాసగతి వర్తిల్లెన్. ౯౧౧

మహాత్ముఁడు = కామపీడితముగాని నిష్కల్మషచిత్తుఁడు, అవాఙ్ముఖుఁడై తలవంచినవాఁడై, పరస్త్రీలఁ జూచుట దోషము కావునఁ దలవంచుకొనెనని భావము, స్త్రీజనసన్నికర్షమునన్ = స్త్రీలు సమీపించి వచ్చుటచేత, కనలు = కోపము శమింపఁగన్ = తనకుఁదానే చల్లారఁగా, ఉదాసగతిన్ = ఉపేక్షతో.

తాత్పర్యము

ఇట్లు వచ్చుచున్న తారను జూచి మహాత్ముఁడగు లక్ష్మణుఁడు శిరస్సు వంచి స్త్రీలు సమీపించుటచే గోపము తనకుఁ దానే చల్లారఁగా నుపేక్షించి యూరకుండెను.

తే. పానవశమున సిగ్గును బాయఁ దట్టి
జనవరతనూజదృష్టిప్రసాదమునను
జనవు మెఱయ మహార్థంబు సాంత్వపూర్వ
మయిన వాక్కులఁ దార యిట్లనియె నపుడు. ౯౧౨

పానవశమునన్ = త్రాగిన కారణమున, పాయఁదట్టి = వదలిపెట్టి, జనవర తనూజ = రాజకుమారుఁడైన లక్ష్మణుని, ప్రసాదమునను = చూపుల నైర్మల్యముచే, చనవు = మచ్చిక, మహార్థంబు = గొప్ప ప్రయోజనము గలది, సాంత్వ పూర్వము = సమాధానవాక్కులు ముందుగాఁ గలది. జనవరతనూజ శబ్దము ధార్మికత్వమును సూచించును.

తాత్పర్యము.

పానవశమున సిగ్గువిడిచి ధర్మాత్ముఁడైన లక్ష్మణుని దృష్టి కోపమువదలి ప్రసన్నమైనదని తెలిసికొని యా కారణమునఁ జనువున సార్థకమైన సమాధాన వాక్యముల నిట్లనియె.

ఉ. క్ష్మావరనందనా! కినియఁ గారణ మెయ్యది? యుష్మదాజ్ఞఁ దాఁ
గావరమెత్తి యెవ్వఁడిటఁ గా దని చేయక యుండువాఁ, డశం
కావిలవృత్తి శుష్కసుహిజ్జ్వలితకానన మేగ్పు వహ్నికీ
లావళి దూఁకి నెవ్వఁడొకొ మూసపడున్ శలభంబురీతిగన్. ౯౧౩

యుష్మదాజ్ఞ = నీ యుత్తర్వును, కావరమెత్తి = గర్వించి, అశంకావిల

వృత్తి = సందేహము లేనినడకతో, శుష్కమహీజావృతకాననము = ఎండుచెట్లు నావరింపఁ బడిన యడవిని, ఏర్చు = కాల్చు, వహ్నికీలావళిన్ = అగ్నిజ్వాలాసమూహము లందు, శలభంబు = మిడుత.

క్ష్మావరనందనా = రాజకుమారా! అటువది వేలేండ్లు మీతండ్రి రాజ్యము పరిపాలించినను నెద్దినిన దనిన గాఁటను గట్టు మన్నట్లు దోషియనఁగానే తలనఱుకు మనినవాఁడుగాఁడు. నేరము విచారించి స్థాపించి యానలఁ దగినట్లు దండించుచుండెను. నీ యొద్ద నా విమర్శన మున్నట్టు లేదు. తప్పని నీమనస్సునకుఁ దోఁపఁగానే తల నఱుక యత్నించుచున్నావు. ఇట్టి తొందరగాఁడవు నీ వాయన కెట్లు నందనుఁడ వని భావము.

కినియఁగారణ మెయ్యది? కోపము వచ్చుటకు రెండు కారణములు, ఇష్టము ప్రాప్తించకపోవుట, అనిష్టము ప్రాప్తించుట, ఈ రెంటిలో నేది ప్రాప్తించెనని కోపించితివి? నీయాజ్ఞ కెవరైన విరోధముగ నడచిరా, లేక నీకుఁ గీడెవరైనఁ జేయబూనిరా? యుష్మదాజ్ఞ......యుండువాఁడు = సుగ్రీవుఁడు మేము వానరులము, మృగప్రాయులము, కావున మాకు నైహిక సుఖమే పరమార్థము. ఇష్టము వచ్చినట్లు భోగించుటే మా కార్యము, ఇట్టి సుగ్రీవుఁడు కొండలలో గుహాలలోఁ గాయ గసురులు దిని యల్లాడుచుండఁగా నయ్యో పాపమని దయాళులరై రాజ్యమిప్పించి భార్యల వశపఱిచి సుఖముండు పొమ్మని పంపితిరి. మీయాజ్ఞా ప్రకారము వాఁడు వర్తించుచున్నాఁడు. ఊరికిఁబోవలసిన పనిలేదు. మా యొద్దనే యుండు మనిన నుండక పోయినాఁడా? మీయుత్తర్వు ప్రకార మాతఁడు సుఖించుచుండ నీవేల కోపగించితివని భావము.

తాత్పర్యము.

దశరథ రాజకుమారా! నీకోపమున కేమికారణము, ఎవ్వఁడు మదించి నీయాజ్ఞనుల్లంఘించెను. ఎండిన యడవిని దహించు కారుచిచ్చు దహించుచుండఁగా దానిలో మిడుతలు దూఁకినట్టు లెవ్వఁడు నీకోపమునకుఁ బాత్రుఁడు కాఁజూచెను.

క. చంచలనయనామణి నిర్వ్యంచనముగ సాంత్వపూర్వ◆వాక్కులఁ దనుఁ బ్రశ్నించిన ననియెం బ్రణయోదంచిత మగుసూక్తి రాము◆తమ్ముఁడు సతికిన్.౯౧౪

నిర్వ్యంచనముగన్ = కపటములేక, మోసముచేయు బుద్ధిలేక, సాంత్వపూర్వవాక్కులన్ = ఊరార్పు మాటలతో, ప్రణయోదంచితము = మిక్కిలి నీతితోఁ గూడినది, రాముతమ్ముఁడు = రామునివలెఁ బరితాపపడువాఁడు.

తాత్పర్యము.

స్త్రీరత్నమైన తార కపటములేక సమాధాన వాక్యములఁ దనకోపకారణ మడుగఁగా న్యాయమైనరీతిగా లక్ష్మణుఁ డిట్లనియె

—♦ లక్ష్మణుఁడు తారతో సుగ్రీవుఁడు సమయాతి
క్రమణంబుఁ జలుపుట చెప్పుట. ♦—

శా. ఏమీ భర్తృహితాత్మురాల ! మది ని ♦ తే నీవు యోజింపవా?
కామోద్రేకిత నర్థధర్మవిధులం ♦ గానండు, కావింపఁడుఁ
భూమీపాలనముఁ, గణింపఁడు మముఁ ♦ భూరివ్యధాయుక్తులఁ,
సామాత్యుండయి నీమగండు సతి ! పా♦నం బెప్డు సేవించెడిన్. ౯౧౫

భర్తృహితాత్మురాల = భర్తమేలుకోరు మనస్సుగలదానా, అనగా నీభర్త తప్పు నీకుఁ గానరాలేదు కాఁబోలు, భర్తమేలుకోరుదానవు. వాఁ డిట్లపరాధము చేసియుండఁగా నీకేల కానరాలేదు ? ఆయన నేల హెచ్చరింపలేదని భావము. ఇంతే = ఇంతమాత్రము, కామోద్రేకిత = కేవలకామముయొక్క విజృంభణముచే, అర్థధర్మవిధులఁ = అర్థమార్జించువిధము ధర్మమార్జించు విధము కానఁడు = ఆలోచించినవాఁడు కాడు, భూరివ్యధాయుక్తులఁ=అతిశయమైన బాధచేఁ గూడియుండు వారిని, సామాత్యుడయి=మంత్రులతోఁగూడి.

తా త్ప ర్య ము.

ఏమీ, నాకోపము నిష్కారణ మని నీ మగనియందు దోషము లేదని యంటివా, పతిమేలు గోరుదానా! ఈ మాత్రమైన నీ వాలోచింప వైతివిగదా, కామ విజృంభణమే ప్రధానముగాఁ జేసికొని యర్థవిచారము ధర్మవిచారము నాలోచించిన వాఁడై నగాఁడు. ఇట్లు చేయుమనియా మేము చెప్పినది. భూమీపాలనము చక్కఁగఁ జేయుచున్నాఁడా? ఇది యర్థము నుపేక్షించుట గాదా, మిగుల దుఃఖపడు మమ్ము నిదివఱకు నుపకారము చేసియుండు వారిని లెక్కపెట్టినవాఁడు కాఁడు. ఇది ధర్మము నుపేక్షించుట గాదా? ఏల యిట్లు చేయుచున్నాఁడనిన మంత్రులలోఁ గలిసి యెప్పుడు మద్యపానరతుఁడై తెలివితప్పియున్నాఁడు. ఇది దోషముగాదా.

క. నాలుగునెలలను గడు విడి, గోలా ! నీమగఁడు లెస్స ♦ గ్రోలుచు మదిరఁ
గాలము చనుటను గేళిం, దేలుచు నెఱుఁగండు నీవు ♦ దెలుపఁగ రాదే. ౯౧౬

తా త్ప ర్య ము ·

మూఢురాలా! నాలుగునెలలకు వచ్చెదనని మాట చెప్పి వచ్చి సారాయము ద్రావుచు స్త్రీలతో నాట లాడుచుఁ గాలము గడచుట యైన నెఱుఁగకున్నాఁడు. నీమగఁ డిట్లు చేయుచుండఁగఁ బతిమేలు కోరి యిప్పు డిన్నిమాటలు చెప్ప నేర్చిన దానవు నీ వేల హెచ్చరింపరాదు.

క· పానంబును గొనియాడరు, మానిని ! ధర్మార్థసిద్ధి ♦ మదిఁ గల సుమతుల్
పానంబు చెఱుచు నర్థము, పానంబే ధర్మకామ♦భంగముఁ గూర్చున్· ౯౧౭

తా త్ప ర్య ము.

నా మగనియందేమి దోషమంటివి. మద్యపానాసక్తుఁడగుటయే దోషము, ధర్మలాభము, అర్థలాభము గోరువారు పానమును మెచ్చుకొనరు. పాన మర్థమును జెఱుచును. పానము ధర్మమును ధర్మమైన కామమును జెఱుచును, కావునఁ బానము మహాదోషము.

క. ఉపకారి కొనర్పమిఁ బ్రత్యుపకారము ధర్మలోప ♦ మొదవెడి నర్థం
బపగత మగుఁ గామము చెడుఁ, జపలాక్షీ ! సుగుణమిత్ర♦సంచ్యుతిచేతన్. ౯౦

తా త్ప ర్య ము.

పానమువలనఁ గలుగు కీడు వివరించి చెప్పెద వినుము. ఉపకారులకు వారికిఁ బ్రత్యుపకారము చేయకుండుటచే ధర్మహాని మొదటిదోషము, త్రాగుఁబోతున కా విషయమై యాలోచింపనైన మతియుండదుగదా. రెండవది యున్న ధనము నాశమగును. మూఁడవదోషము త్రాగుబోతులమాట నమ్మరాదు గావునను, ధననాశమగుటను సుగుణవంతులైన మిత్రులు వదలిపోవుదురు. దానివలనఁ గామము నాశమొందును. ఈ విధముగఁ ద్రాగుఁబోతు మూఁటను జెడును.

తే. అర్థకామవరిష్ఠుని ♦ నమలచరితు, సత్యధర్మపరాయణు ♦ సఖుని విడిచి
ధర్మహాని ఘటించెను ♦ దక్కినట్టి, రెండు విడనాడె నీమగం♦డందు తార ! ౯౧

అర్థకామవరిష్ఠునిన్ = అర్థకామములకంటె గొప్పవానిని, అమలచరితున్ = దోషరహితమైన నడవడిగలవానిని, సత్యధర్మపరాయణున్ = సత్యము ధర్మము పరమగతిగా నుండువానిని, సఖునిన్ = మిత్రుని, ధర్మహాని = ధర్మమునకుఁగీడు, తక్కినట్టిరెండు = అర్థము, కామము.

తా త్ప ర్య ము.

తారా ! అర్థమునకంటెఁ గామమునకంటె శ్రేష్ఠుఁడు మిత్రుఁడు. అందు నిర్మలమైన నడవడి గలవానిని సత్యము ధర్మము పరమగతిగాఁ గలవానిని వదలిపెట్టి ధర్మమునకు హాని గావించెను. ధర్మము చెడినపుడు అర్థము కామము వానియంతనవియే చెడును. కావున వానిని నీ మగఁడు వదలెను. ఇఁక వాఁ డెట్లు బాగుపడునని తలఁచితివి.

తే. కార్యతత్త్వజ్ఞురాల ! శా♦ఖామృగేంద్ర,విభుఁడు కార్యంబు నిట్లు గా♦వించినాఁడు
కాన మాకిఁకఁ జేయ నౌ♦కార్య మెద్ది, చెప్పుమీనీవ చక్క యో♦జించి యిపుడు.

కార్యతత్త్వజ్ఞురాల = కార్యముయొక్క వాస్తవస్థితి తెలిసినదానా !

తా త్ప ర్య ము .

కార్యముయొక్క వాస్తవస్థితి తెలిసినదానా ! వానరరాజు కార్యము నిట్లు చేసెను. ఇప్పుడు మేము చేయవలసిన పనియేమో యోజించి నీవే చెప్పుము.

తే. అనిన నతని ధర్మార్థస • మాధియుక్త, మతులమధురస్వభావ మై • నట్టిపలుకుఁ
దార యాలించి వారల • కారియమ్ముఁ, దెలిసి పతికార్యవిశ్వాస • కలితుఁ బలికె.

అతని యను పదము భిన్నపదముతో సమస్తమయ్యెను, పలుకున నెడి తత్పు మాసఘటక పదంబుతో నన్వయించును. సమసనీయపదద్వయంబు యువర్ణవ్యవధానంబునుబోలె నితరపద వ్యవధానంబును సహించును.

ధర్మార్థ సమాధియుక్తము=ధర్మార్థములతో సంబంధము కలది. అతుల మధుర స్వభావము=అసమానమైన మనోహరమైన స్వభావము, పతికార్య విశ్వాస కలితుఁ=తనపతియగు రామచంద్రమూర్తికార్యంబునందు విశ్వాసంబుగల వానిని, దీనివలన లక్ష్మణకోపము రామకార్యార్థ మయియే కాని యితరము కాదని తార తెలిసికొనెను. కారియము=కార్యము.

తా త్ప ర్య ము .

ఇట్లు లక్ష్మణుఁడు చెప్పఁగా ధర్మముతోను గార్యప్రయోజనముతోడను గూడి నదియు మిక్కిలి తియ్యనైన స్వభావము గలదియు నగు లక్ష్మణు పలుకు నాలించి వారికార్యము దెలిసి పతికార్యమందు విశ్వాసముచేఁ బలుకు లక్ష్మణుతోఁ దార యిట్లనియె.

—• తార లక్ష్మణుని సమాధానపఱుచుట. •—

ఉ. కోపము సంహరింపు నర • కుంజర! కా దిది కోపకాలము౯
గోపము సేయ నౌనె యను • కూలచరిత్రుల నాత్మ బంధుల౯?
మీాపనియందు శ్రద్ధఁ గల • నిర్మలచిత్తు ప్రమాదపాటు సం
తాపితవీరవైరి! తగ • దా క్షమియింపఁగ నిన్ను బోఁటికిన్. ౯౨

తా త్ప ర్య ము .

మానవశ్రేష్ఠా! నీవు చెప్పినదోషము సుగ్రీవునందుండుట సత్యము-ఆ కారణమున నతఁడు దోషము చేసినవాఁడే కావున నీవు కోపపడుటకుఁ గారణము లేదు. కావున దానిని జంపుము. ఇది నీవు కోపింపవలసిన సమయముగాదు. ఏలయందువా? ఎవరిమీాఁదఁ గోపపడవలయును? ప్రతికూలురైన శత్రువులందుఁగదా, తన కనుకూలురై చరించు బంధువుల విషయమునఁ గోపింపవచ్చునా? నీవు కోపించుటకుఁ బ్రతికూల శత్రువిందెవ్వఁడున్నాఁడు? మీాపనియందు శ్రద్ధగలవాఁడు మనస్సునందుఁ గల్మషములేనివాఁడు పొరపాటుపడెనేని నీవంటివాఁడు క్షమించి హెచ్చరింపవలెనా? చంపయత్నింపవలయునా? నీవు వీరులగు శత్రువులమీాఁద నీ ప్రతాపముఁ జూపవలయునా? అనుకూలురైన మిత్రులందుఁ జూపవలయునా?

కం. బలవంతుఁడైన సుజనుఁడు, బలహీనులమీాఁదఁ గోప • పడునె కుమారా!
యిల శాంతిసత్త్వములకుం, దల యగు నీబోఁటి కనియెఁ • దలఁచునె యకటా.

తాత్పర్యము.

బలవంతుఁడైనవాఁడు తనతో సమానుఁడైన బలవంతునిమీఁదఁ గోపించును గాని బలహీనులమీఁదఁ గోపించునా? పౌరుషమున కిదియా లక్షణము? అటయి నను గోపము తామసులగుణము. శాంతిసత్త్వగుణముగల నీవంటివాఁడు కోపింపవలయు నని తలఁపనైనఁ దలఁచునా? ఇది స్వభావవిరుద్ధ మగుట కాదా? చంద్రుఁడెన్నఁ డైన వేఁడి యెండలు గాయునా?

కం. ఎఱుఁగుదు రామునికోపము, నెఱుఁగుదు కాలంబు చనుట ♦ యీరలమే తే
నెఱుఁగుదుఁ బయి మాకార్యము, నెఱుఁగుదు నే సర్వమాత్మ♦ నెఱుఁగుదునైనన్.

తాత్పర్యము.

నీమగని దోషము నీకుఁ దెలియదా. నీవేల హెచ్చరింపరాదంటివి, కాలము మీఱుట నే నెఱుఁగుదును. రామచంద్రమూర్తికి వచ్చినకోపము తెలియును. మీరు చేసినమేలు నే నెఱుఁగుదును. మేము చేయవలసినది యెఱుఁగుదును. అయినను,

క. తెలియుదుఁ గామబలంబునఁ, గలుగు మదవికారమాఁపఁ♦గా రా దనుచున్
దెలియుదు సుగ్రీవుం డే,జలజాక్షులతోడఁ గామ♦సక్తుఁ డగుటయున్. ౫౭

తాత్పర్యము.

ఇది నీకుఁ దెలియును. నాకుఁ దెలియును. నాకుఁ దెలిసినది నీకుఁ దెలియనిది మఱియొకటి గలదు. కామబలముచేఁ గలుగు చిత్త వికార మణఁపరాదని నే నెఱుఁ గుదును. ఇది నీ వెఱుఁగవు. సుగ్రీవునకుఁ గామబలముచేఁ జిత్తవికారము గలిగించిన వా రెవరో యదియు నే నెఱుఁగుదును.

తే. ఆగ్రహమునకు వశమైన♦యట్లు నీవు, బుద్ధి చిక్కదు స్మరతంత్ర♦ములకు వత్స!
కామరతుఁ డైనమనుజుండు ♦ గాంచు నయ్యె, దేశకాలార్థధర్మముల్ ♦ధీరహృదయ!

తాత్పర్యము.

నీకుఁ దెలియని విషయ మొకటి గలదని చెప్పితినిగదా! అది యేల నీకుఁ దెలి యదో దానిని గుఱించి చెప్పెదను వినుము. నాయనా! నీ మనస్సు సులభముగాఁ గోపమునకు వశపడినట్లు పిల్లవాఁడ వగుటచే మన్మథతంత్రములకు వశపడినదికాదు. ఆ కారణముచే మదనపరతంత్రుల చిత్తవృత్తియెట్టిదో నీ వెఱుఁగవు. ధీరహృదయా! గట్టి గుండెగలవాఁడా! మన్మథ పరతంత్రుఁడగు వానికి దేశము, కాలము, ధర్మము, అర్థము ఇవన్ని తెలియఁగలవా? సాధ్యమా? ఇంతమాత్రము నీవు తెలిసికోలేకపోయితివి గదా. ఒక కార్యమందుఁ బూర్ణముఁగ మగ్నుఁడైన వాఁడు రెండవ కార్య మెట్టు లాలోచింపఁగలఁడు.

కం. నన్నుఁ గూడి కామవృత్తం,బున లజ్జాహీనుఁ డయ్యెఁ ♦ బురుషాగ్రణి! నీ
యనుజుని వానరవల్లభు, ననఘా! క్షమియింపుమీ ద♦యాలంబగుణా! ౫౭

దయాలంబగుణా = దయయే యూతగాఁ గల సమస్తగుణములు గల

వాఁడా! నీ యందున్న యన్ని కల్యాణగుణములకు దయ యాధారమై ప్రధానమై యున్నదని భావము.

తా త్ప ర్య ము.

దయానిధానా! సుగ్రీవుఁ డేస్త్రీలతోఁగూడి కామాసక్తుఁ డయ్యెనో వారిని నే నెఱుఁగుదు నని చెప్పితిని. ఆ స్త్రీ మఱి యెవ్వతెయో గాదు నేనే. అతఁడు కామవ్యాపారంబున నాసక్తుఁడైనది నాతోడనే. ఆ వ్యాపారమందు నతనికి దేహము మీఁద గుడ్డ యుండినది, పోయినది తెలియక సిగ్గువిడిచి యుండినాఁడు. తనగుడ్డ పోయినది తెలియక యుండువాఁడు మీ కార్యమెట్లు లాలోచింపఁ గలఁడు. కావున దోషము నాది. నేను నీ మఱఁదలు శ్రుతకీర్తివంటిదానను. నీ తమ్ముఁడు సుగ్రీవుఁడు. నీవు సుగ్రీవుని జంపితివేని శత్రుఘ్నుని జంపి శ్రుతకీర్తికి దుఃఖము కలిగించినట్లు నాకును గలిగించినవాఁడ వగుదువు. కావున క్షమింపుము.

చం. నిరఘతపోభిరాములు వినిర్మలధర్ములు నా మహర్షులే
పరఁగుచుఁ గామతంత్రు లయి ♦ బంధురమోహవశాత్ములైనచో
గురుచపలస్వభావుఁ డగుక్రోఁతి యహో గురుసౌఖ్యవృత్తిమైఁ
బరఁగుచు నుంట చిత్రమె కృపాగుణభూషణ! నీవ చెప్పుమా. ౯౮

నిరఘ + తపోభిరాములు = పాపములేనివారు, తపస్సుచే నొప్పెడివారు లేక నిర్దుష్టమైన తపస్సుచే నొప్పువారు. వినిర్మలధర్ములు = మిగుల నిర్మలమైన ధర్మగుణములు గలవారు, బంధుర మోహవశాత్ములు = అధికమైన మోహమునకు వశపడిన మనస్సుగలవారు, గురు చపలస్వభావుఁడు = మిగులఁ జంచలమైన స్వభావముగలవాఁడు - కావుననే కపియనుపేరుగలవాఁడు, కృపాగుణభూషణ = కృపాగుణమే యలంకారముగాఁ గలవాఁడా!

తా త్ప ర్య ము.

ఏ దోషములేని తపస్సుచేయువారు, పాపరహితులు, నిష్కల్మషమైన ధర్మమున వర్తించువారు నగు మహర్షులే కామసౌఖ్యముల మరగి, విశేష మోహమునకు వశపడిన మనస్సుగలవారై యుండఁగా స్వభావముచేతనే చపలుఁడయి కపి యను సార్థకనామము వహించినవాఁడు విశేష సుఖవ్యాపారమందు వర్తించుట చిత్రమా? కృపాగుణమే యలంకారముగాఁ గలవాఁడా! నీవే చెప్పుము.

కం. అనుచు మహార్థపువాక్యము, వనితామణి పల్కి వెండి ♦ వనజాక్షునితో
నను మదవిహ్వల లీలగఁ, దన పెనిమిటికిఁ హితంబు ♦ దలకొనురీతిన్. ౯౯

తా త్ప ర్య ము.

అని మిగుల నర్థముతోఁగూడిన మాటలాడి మదముచే విహ్వల యగు తార వినోదముగ మాటలాడి దానితో లక్ష్మణుఁడు సమాధాన పడమి యెఱిఁగి తన పతిమేలునకై మరల నిట్లు చెప్పెను.

కం. జతనము సేసెను మున్నే, క్షితినాథతనూజ నీదు♦ కెలసముఁ దీర్పన్
రతిపతివిధేయుఁ డయ్యును, క్షితిరుహచరవల్లభుండు ♦ కినియఁగ నేలా. ౯౦

కెలసము = కార్యము, రతిపతివిధేయుఁడు = మన్మథునకు లోఁబడినవాఁడు, క్షితిరుహచరవల్లభుఁడు = వానరరాజు, కినియఁగన్ = కోపింపఁగా, జతనము = యత్నము.

తాత్పర్యము.

రాజకుమారా! సుగ్రీవుఁడు కామాసక్తుఁడయి నాఁడని నేను జెప్పుటచే మీ కార్యములు చెఱచెనని తలఁపకుము. మన్మథవశుఁడయ్యు నీవు రాకముందే మీ కార్యము నెఱవేర్పఁదగిన ప్రయత్నము చేసి యున్నాఁడు.

కం. బలయుతులు కామరూపులు, పలువురు కోటానఁగోట్లు ♦ పర్వతవాసుల్
బలిముఖులు వీరె వచ్చిరి, సలిలాశయచరులు కార్య♦సాధనశక్తుల్. ౯౧

బలిముఖులు = వానరులు రూ॥ బలీముఖులు- వబల కభేదము గావున వలిముఖులనియుఁ గలదు. సలిలాశయచరులు = మడుఁగులందుఁ దిరుగువారు.

తాత్పర్యము.

ఏమి ప్రయత్నముచేసె నందువా. అతఁడు పిలిపింపఁగా బలవంతులు- కోరిన రూపము ధరింపఁగలవారు అనేకులు కోటానఁగోట్లు వానరులు మడుఁగులలోఁ దిరుగువారు కార్యము సాధించు శక్తిగలవా రిదిగో వచ్చియున్నారు.

ఉ. అంతిపురంబులోఁ బరఁ బ♦రాంగన లుందురు, చూడ దోషమన్
స్వాంతముతోడ నిల్చి తిటఁ ♦ జాలును రమ్ము సుశీలరక్షణం
బెంతయుఁ జేసి తీ విటు, ల♦క్ష్మణా! విను మైత్రిచేత స
త్స్వాంతులు నాత్మమిత్రజన♦దారలఁ జూచుట దోషమా? యనన్. ౯౨

పరాంగనలు = ఇతర స్త్రీలు, స్వాంతము = మనస్సు- సుశీలరక్షణంబు = సదాచారమును రక్షించుట- సత్స్వాంతులు = మంచి మనస్సు గలవా, రుఆత్మమిత్రజనదారలన్ = తమ స్నేహితుల భార్యలను.

తాత్పర్యము.

అంతఃపురమునఁ బరస్త్రీ లుందురు. వారిని జూచిన దోషము వచ్చునను మనస్సుతో నిచ్చట నిలిచితివి. సదాచారము బాగుగనే కాపాడితివి గాని చాలును. మిత్రభావముచే మంచి మనస్సుగల వారు తమ మిత్రుల భార్యలఁ జూచుట దోషమా అని చెప్పఁగా.

—♦ లక్ష్మణుఁడు సుగ్రీవునిఁ జూచి నిష్ఠురంబు లాడుట ♦—

ఉ. దేవనిభుండు తన్ను సుద♦తీమణి పిల్చుటఁ జేసి కార్యపుం
దీవరహాటుచేతఁ జని ♦ దివ్యమహాభరణోజ్జ్వలాంగునిన్
దేవధనాభు మర్జయుని ♦ దివ్యసుమాంబరు దివ్యరూపు సు
గ్రీవు సతీసమావృతునిఁ ♦ గీర్తిపరున్ మృదుతల్పసంయుతున్. ౯౩

దివ్యమహాభరణోజ్జ్వలాంగుని = దేవతా సంబంధమైన గొప్ప యాభరణములచేఁ బ్రకాశించు వానిని, దేవధవార్హుని = ఇంద్రునితో సమానుని, దుర్జయుని= జయింప సులభసాధ్యముగాని వానిని, దివ్య సుమాంబరుని = దివ్యములైన పూలు, వస్త్రములు ధరించినవానిని, దివ్యరూపుని=దేవతాస్వరూపుని, సతీసమావృతుని= ఆఁడువారిచేఁ జుట్టఁబడినవానిని, మృదుతల్పసంయుతుని = మెత్తని పాన్పుపైనుండు వానిని.

తాత్పర్యము.

తన్ను స్త్రీరత్నమగు తార పిలుచుటచేతను గార్యపుఁ దొందరచేతను, నంతఃపురములోనికిఁ బోయి యచ్చట దివ్యములైన గొప్ప భూషణములు ధరించినవానిని, నింద్రునితో సమానుని, సులభముగా జయింపరానివానిని దేవతాసంబంధమైన పూలు,వస్త్రములు ధరించినవానిని దివ్యరూపమున వెలుఁగువానిని స్త్రీలచేఁ జుట్టఁబడియుండువానిని కీర్తిశాలిని మెత్తనిపాన్పుపై నుండువానిని దేవసమానుఁడైన లక్ష్మణుఁడు చూచెను.

క౦. కని జేవురింపఁ గన్నులు, కనలున లయకాలునట్లు ♦ గ్రాలంగ రుమా
వనితాయుతుఁడౌ భాస్కరతనయుఁడు గనె విపులనేత్రు ♦ దశరథపుత్రున్. ౭-౩౮

జేవురింపఁ = ఎఱ్ఱనకాఁగా, తారచెప్పిన సమాధానములు తృప్తికరముగా లేమిని గోపము చల్లారలేదని భావము. కనలునఁ = కోపముచే.

తాత్పర్యము.

ఇట్లు చూచి కోపముచేఁ గన్నులెఱ్ఱనకాఁగాఁ బ్రలయకాలయమునివలెనున్న లక్ష్మణుని, కోపముచే విశాలములైన నేత్రములుగలవానిని, రుమతోడఁ గూడియుండు సుగ్రీవుఁడు చూచెను.

౩౮-వ సర్గము.

సీ. అప్రతిహతతేజు ♦ నాగ్రహావిష్టు స,మాగతుఁ బురుషసిం♦హంబు రోషి
నిశ్శ్వసమాను వ♦హ్నిప్రభాదీప్తుని, భ్రాతృశోకసుతప్తు ♦ బలవదగ్ర్యు
నారఁ గనుంగొని ♦ వ్యథిఁ జెందియుం డయి, తతపరిష్కృతహా♦ధ్వజమువోలె
హేమాసనమునుండి ♦ యిలపయి దుముకంగ, శశి వెంటఁ జనెడిన♦క్షత్రచయము
తే. లట్ల రుమయును దక్కన♦యంబుజాక్షు, లొకటఁ బీరములను డిగ్గ ♦ నుఱికి రంతఁ
గేలు జోడించి వడఁకుచుఁ ♦ గీశవరుఁడు, కల్పవృక్షము పోలికఁ ♦ గ్రాలుచుండె.

అప్రతిహతతేజుని = ఎట్టివారికిఁ దిరస్కరింపరాని తేజస్సు గలవానిని, ఆగ్రహావిష్టుని = కోపముచే నావేశింపఁబడినవానిని, సమాగతుని = సమీపించి వచ్చినవానిని, రోషిని = రోషముగలవానిని, నిశ్శ్వసమానుని = నిట్టూర్పువిడుచు వానిని, వహ్నిప్రభాదీప్తుని = అగ్నిజ్వాలవలె మండుచున్నవానిని, భ్రాతృశోక

సుతప్తం = అన్నకుఁగలిగిన శోకమునకై తపించువానిని, బలవదగ్ర్యం = బలవంతులలో శ్రేష్ఠుని, ఆరం = పూర్ణముగా, వ్యధితేంద్రియుండై = బాధపడుచున్న యింద్రియములుగలవాఁడై, తతపరిష్కృత మాహేంద్రధ్వజమువోలె = ఉత్సవ సమయంబున విశేషముగ నలంకరింపఁబడిన యింద్ర ధ్వజమువలె, హేమాసనమునుండి బంగారు మయమైన యాసనమునుండి.

తా త్ప ర్య ము .

మాఱులేని తేజస్సుగలవానిని, కోపించినవానిని,సమీపమునకు వచ్చినవానిని, పురుషశ్రేష్ఠుని, రోషముగలవానిని, నగ్నిజ్వాలవలె వెలుఁగుచున్నవానిని, అన్నకుఁ గలిగిన శోకమునకై సంతాపపడువానిని, బలవంతులందు శ్రేష్ఠుని, బాలించి చూచి తార చెప్పినమాటలతో సమాధానపడలేదే - ఇఁక నేమిచేయుదును ? అని బాధపడుచున్నవాఁడై అలంకరింపఁబడిన యింద్రధ్వజమువంటి సుగ్రీవుఁడు తా నుండిన బంగారుపీఠమునుండి క్రిందికి దుముకఁగాఁ దోడనున్న రుమయును దక్కిన స్త్రీలును దటాలునఁ గ్రిందికి దుమికిరంత; సుగ్రీవుఁడు రెండుచేతులు జోడించి వడఁకుచుఁ గల్పవృక్షమువలెఁ బ్రకాశించుచుండెను.

కం. తారావృతశశిపోలిక, సారసనేత్రాసమూహ•సంవృతుని వనీ
చారిని రుమాద్వితీయునిఁ, గ్రూరాగ్రహయుక్తి మనుజ•కుంజరుఁ డనియెన్. – 36

తారావృత శశిపోలికం = నక్షత్రములచేఁ జుట్టఁబడిన చంద్రునివలె, సారసనేత్రాసమూహ సంవృతునిం = స్త్రీలగుంపుచేఁ జుట్టఁబడినవానిని, వనీచారుని=వానరుని రుమాద్వితీయునిం = రుమ తోడుగాఁ గలవానిని, కూరాగ్రహయుక్తిం = తీక్ష్ణ కోపముతోఁ గూడినవాఁడై .

తా త్ప ర్య ము .

నక్షత్రములతోఁగూడిన చంద్రునివలె స్త్రీల నడుమనుండువానిని భార్యయగు రుమ ప్రక్కన గలవానిని వానరుని జూచి క్రూరమైన కోపముతో లక్ష్మణుఁ డిట్లనెను.

కం. నిజమరియుఁ గృతజ్ఞుండును, విజితేంద్రియుఁ డధికకరుణ • వెలసెడి సత్త్వా
భిజనయుతుం డైనమహీ, భుజుఁడే సుమీ లోకమునను • బూజ్యుం డెందున్.

నిజమరి = సత్యవాది- (నిజము + అరి) సత్త్వాభిజనయుతుఁడు = సద్వంశమునఁ బుట్టినవాఁడు, మహీభుజుఁడు = రాజు.

తా త్ప ర్య ము .

గొప్ప వంశమునఁబుట్టి భూపరిపాలనము చేయు రాజు రాజుగాఁడు. సత్యవాది- కృతజ్ఞుఁడు- ఇంద్రియజయము గలవాఁడు మిగుల దయగలవాఁడునై యున్నవాఁడే రాజు. వాఁడే లోకపూజ్యుఁడు. వీనియం దొకటియైన నీయందు లేదు. కావున నీవు రాజుగా నుండఁదగవని భావము.

కం. మే లొనరించినవారికి, మే లొనరింపఁగను బ్రతిన ♦ మేకొని ధర్మం
బేలిదముం గావించెడి, వాలిశుకంబెర్క ఖలుండు ♦ పలుకు మెవండో. ౯౩౭
ఏలిదము = అలక్ష్యము. తిరస్కారము, రూ. ఎల్లిదము.

తాత్పర్యము.

నీవు సత్యవాదివి కావనుటను వివరించుచున్నాఁడు. తనకు మేలొనరించిన వారికి మేలు చేసెదనని ప్రమాణముచేసి ధర్మము నుపేక్షించిన వారికంటె మూర్ఖుఁడు నీచుఁడు నెవఁడో చెప్పుము. నీ విట్లు చేసితివి గదా.

ఉ. మావునపట్ల బొంకినను ♦ మావులు నూటిటిఁ జంపుపాప మా,
నావునపట్ల బొంకినను ♦ నాలను వేయిటిఁ జంపుపాప మా,
భావము దప్పి పూరుషుని ♦ పక్షమునం దనృతంబుఁ బల్కినన్
వావిరి తన్ను నాత్మజన♦వర్గముఁ జంపును మూలముట్టుగన్. ౯౩౮
మావు = గుఱ్ఱము, ఆవునపట్ల = ఆవుయొక్క విషయమున, ఆలను=ఆవులను, బహువచనంబు పరంబగు నపుడు ఆవు ప్రభృతుల తుది యక్షరమునకు లోపంబు విభాషనగు- (సు. వ్యా. ఆచ్ఛిక- ౭౯ సూ.)

తాత్పర్యము.

గుఱ్ఱము విషయమున నసత్యమాడిన నూఱు గుఱ్ఱములఁ జంపిన పాపము వచ్చును. ఆవు విషయమున బొంకిన వేయావులఁ జంపిన పాపమువచ్చును. మనుష్యుని విషయమున నసత్యమాడినఁ దన్నుఁ దనవారిని సమూలముగఁ జంపిన వాఁడగును.

కం. మును మే లొనరించిన హిత,జనములకున్ మరల మేలు ♦ సలుపం దలఁపో
యని నీచుండు కృతఘ్నుఁడు, వినుమా వధ్యుండు భూత♦వితతికి నెల్లన్. ౯౪౦
ఇఁకఁ గృతఘ్నత గుఱించి చెప్పుచున్నాఁడు.

తాత్పర్యము.

ముందు తనకు మే లొనరించిన హితులకు మరల మేలు చేయ నాలోచింపని నీచుఁడు కృతఘ్నుఁడు భూతసమూహముచేఁ జంపఁదగినవాఁడు. ఎవఁడైన నేదియైన నెల్లయినవానిఁ జంపినను దోషములేదు. రాముని విషయమున నే నపరాధిని. రాముఁడు నన్ను దండింపవచ్చును. నన్ను దండించుటకు నీ వెవఁడవు, అను నేమో యని యట్టివాని నెవఁడైన జంపవచ్చు ననెను.

కం. వినుమా కృతఘ్నుఁ గనుఁగొని, కినుకను వచియించె మున్ను ♦ కీశపతీ! భూ
జనవందితుఁడు స్వయంభువు, మనమున నిపుడైన నెఱుఁగు♦మా ధర్మవిధిన్. ౯౪౧

తాత్పర్యము.

వానరరాజా! పూర్వము కృతఘ్నుని జూచి కోపముతో బ్రహ్మ యిట్లు చెప్పెను. ఆ ధర్మపద్ధతిని నిపుడైన నీవు తెలిసికొనుము. చెప్పెదను.

కం. ధరణీసురునిం జంపిన, సురఁ ద్రాగిన ముచ్చిలింప ♦ సువ్రతము చెడన్
బరఁగును బ్రాయశ్చిత్తము, ధర నిష్కృతిలేదు సూ కృ♦తఘ్నున కెందున్. ౯౪౨

తా త్ప ర్య ము.

బ్రహ్మహత్య చేసినను, కల్లుద్రావినను, దొంగిలించినను, వ్రతభ్రష్టుఁడైనను ప్రాయశ్చిత్తము గలదు. మేలు మఱచిన వానికిఁ బ్రాయశ్చిత్తము లేదు.

తే. తొలుత రామునిచేఁ గృతా♦ర్థుండ వగుచు, మాఱు సేయనికతమున♦మానహీన
కుటిలుఁడవు నీవు మఱికృత♦ఘ్నుఁడవు నీ వ,నార్యుఁడవు నీవు కల్లరి♦నగచరేంద్ర!

తా త్ప ర్య ము.

ముందు రామచంద్రునిచే నీవు కార్యము చేయించుకొని ప్రత్యుపకారము చేయని కారణమున నీవు కృతఘ్నుఁడవు. నీవు మానహీనుఁడవు. నీవు వంచకుండవు. నీవు నీచుఁడవు. నీ వసత్యవాదివి.

ఉ. చెప్పుము నీవె రాఘవుని♦చేతఁ గృతార్థుఁడ వై ప్రతిక్రియం
దప్పక నీవు చేయఁగ మ♦నంబునఁ గల్గిన సీత రోయఁగాఁ
దెప్పునఁ బూన వేల? సుద♦తీరతస క్తుసిఁ గల్లరీని నిన్
గప్పయెలుంగుపాము వని ♦ కానక పోయెను రాముఁ డక్కటా. ౯౪౪

తా త్ప ర్య ము.

ధర్మసందేహము కలిగినఁగదా- మఱియొకరు మధ్యవర్తి చెప్పవలె. నే నడిగెదను నీవే చెప్పుము. రామచంద్రమూర్తిచే నీ ప్రయోజనము నెఱవేర్చుకొన్న వాఁడవై ప్రత్యుపకారము చేయవలయు నని నీ మనస్సున నుండెనేని సీతాదేవిని వెదకుటకు శీఘ్రముగా నీవేల యత్నము చేయలేదు? స్త్రీ సంభోగాసక్తుని నసత్యవాదిని నిన్నుఁ గప్పకంఠధ్వనిగల పాము వని రాముఁడు తెలిసికొనలేక పోయెను. కప్పలు తనయొద్దకు వచ్చుటకై కప్పవలెఁ గూసి యవి రాఁగానే వానిని మ్రింగునట్టి పాము వలె నీవును వంచకబుద్ధిచే మంచిమాటలాడువాఁడవు.

ఉ. ఏపఱి దీనవాక్యముల ♦ నేడ్చిన ని న్గని జాలిచే నయో
పాప మటంచు నాత్మఁ గొని ♦ పాపరతా! దురితాత్మ! నిన్ను సం
ప్రాపితరాజ్యుఁ జేసె రఘు♦భర్త మహాత్ముఁడు, మే లొలంపఁగా
నోపవయేని ని న్నపుడ ♦ యుగ్రతఁ బంపును వాలిఁ జేరఁగన్. ౯౪౫

ఏపు+అఱి=బలము చెడి, సంప్రాపితరాజ్యున్=రాజ్యమును బొందిన వానిఁగా.

తా త్ప ర్య ము.

బలము చెడి దీనవాక్యముల నేడువఁగా నిన్నుఁజూచి వ్యసనపడి యయ్యో పాపమే యని, పాపాత్ముఁడా! నీకు రాజ్యము రామచంద్రమూర్తి లభింపఁజేసెను. అటువంటి మహాత్మునకు మేలుచేయఁగా నంగీకరింపవేని నిన్ను వాలి పోయినచోటికి నాయన పంపును.

కం. అలవాలి చనినమార్గము, కలుషాత్మక మూఁత వడదు ♦ కాన సమయమున్
దలఁపుము సత్యము పట్టుము, తలఁపకుమీ యన్న త్రోవఁ♦ దరలఁగ నీవున్. ౯౪౬

కలుషాత్మక = పాపపు మనస్సుగలవాఁడా, తరలఁగన్ = ప్రయాణమైపోవ.

తాత్పర్యము.

పాపాత్ముఁడా! వాలిపోయిన మార్గ మింకను మూఁతపడలేదు. తెఱవఁబడియే యున్నది. ఆ త్రోవఁ బోవుటకు నీ వాలోచింపకుము. నీవు చేసిన శపథము స్మరింపుము. సత్యమునందు నిలువుము.

కం. పవిసన్నికాశముల రా, ఘవచాపవిముక్తశాత♦కాండములన్ నీ
వవివేకీ! కననికతన వి,భవములనే మరగి రాము♦పనిఁ దలఁపవుపో. ౯౪౭

పవిసన్నికాశములన్ = వజ్రాయుధముతో సమానమైనవానిని, రాఘవచాప = రాముని వింటినుండి- విముక్త = విడువఁబడిన- శాతకాండములన్ = పదునైన బాణములను, కననికతనన్ = చూడని కారణముచే.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి వింటినుండి వెలువడి వజ్రాయుధములతో సమానమైన బాణములను నీవు చూచినవాఁడవు కావు. ఆ కారణమున బుద్ధిలేనివాఁడా! రామకార్యమును నాలోచింపకయున్నావు. నిజము.

—♦ ౩౫ వ సర్గము. తార లక్ష్మణుని శాంతి పఱుచుట. ♦—

కం. అని కొఱవిఁ జూఁడినట్లుగ, ఘనకోపమునన్ వచించు♦కాకుత్థ్సవరున్
గనుఁగొని యిట్లనుఁ దారా,వనజాయతనేత్ర సాంత్వ♦వచనరచనలన్. ౯౪౮

చూఁడినట్లుగన్ = కాల్చినట్లుగ.

తాత్పర్యము.

ఈప్రకారము కొఱవితోఁ గాల్చినట్లు మిగులఁగోపముతో మాటలాడుచున్న లక్ష్మణుఁ జూచి తార మంచి సమాధాన వాక్యముల నిట్లనెను.

చం. ఇటు సరిగాదు నీకు వచి♦యింపఁగ లక్ష్మణ, వానరేంద్రుఁ డీ
కటుతరభాషణంబు వినఁ♦గాఁ దగఁడున్, మఱి యందునున్ సము
త్కటరుష నీదువా వెడలఁ, ♦ గాఁ డకృతజ్ఞుఁడు, కాఁడు క్రూరుఁడున్,
కుటిలుఁడు గాఁడు, కాఁడు హత♦కుండు హరీశుఁ డసత్యవాదియున్. ౯౪౯

కటుతరభాషణంబు = మిగుల కారమగు మాటలను, సముత్కటరుషన్ = అధిక కోపముతో, వా = నోటినుండి.

తాత్పర్యము.

లక్ష్మణా! నీవీ ప్రకారము మాటలాడరాదు. నిర్దోషి కావున నిట్టిమాటలు వినఁదగఁడు. అందు నీ నోటినుండి వెడలఁగా విన బొత్తిగా నర్హుఁడుకాఁడు. వలన సుగ్రీ

వుఁడు నీవు చెప్పినట్లు కృతఘ్నుఁడుగాఁడు. క్రూరుఁడు కాఁడు. వంచకుఁడు కాఁడు. నీచుఁడు గాఁడు. కల్లరిగాఁడు. నీ వారోపించిన దోష మొకటియు నతనియందులేదు.

ఉ. సారబలాఢ్య! యన్యులకు ♦ సాధ్యముగాని మహారణంబునన్
సారసనేత్రి రాముని ప్ర♦సాదమునన్ స్థిర కీశరాజ్యమున్
జారుసుఖంబులున్ రుమను ♦ సంపదలన్ ననుఁ బొందినాఁడు, మి
మ్మూర్మరక మెచ్చెడిన్ మఱపు ♦ నొందఁడు మీ రొనరించు సాయమున్. ౯౦

తాత్పర్యము.

దృఢమైన బలము గలవాఁడా! సుగ్రీవుఁడు కృతఘ్నుఁడు గాఁడు. మేలు మఱచిన వాఁడుగదా కృతఘ్నుఁడు. సుగ్రీవుఁడో- యితరులకు సాధ్యముగాని గొప్ప యుద్ధమందు రామచంద్రమూర్తియనుగ్రహముచే స్థిరమైన వానరరాజ్యము, ఇంపైన సుఖము, రుమను నన్నుఁ బొందినాఁడు. ఈ విషయమును స్మరించి స్మరించి మీరు చేసిన సాహాయ్యము మెచ్చుచున్నాఁడు. మఱచినవాఁడు కాఁడు. ఇట్టివాఁడు కృతఘ్నుఁ డెట్లగును?

కం. కడుదుఃఖపడుట మీఁదయఁ, గడుసుఖముల నిపుడు గాంచి ♦ కానఁడు గడువున్
గడచనవిశ్వామిత్రుని, వడువు న నీ కీశవిభుఁడు ♦ వాస్తవ మనఘా! ౯౧

తాత్పర్యము.

అటయిన నేల రామకార్యమునకై యత్నింప లేదందువా? ఉన్నవాస్తవము చెప్పెద వినుము- మిక్కిలి దుఃఖపడినవాఁ డగుటచే వెంటనే మిక్కిలి సుఖములు కలుగఁగా వానిని వాఁచినయ ట్లనుభవించుటయందు గడువు మీఱిన విషయము విశ్వామిత్రునివలెఁ దెలిసికొన లేకపోయెను. ఇది యతనియం దుండు లోప మంతే కాని తక్కిన లోపమేదియు లేదు.

కం. కామవశుండు ఘృతాచీ,భామినికిం జిక్కి యేండ్లు ♦ పది చన ముని వి
శ్వామిత్రుఁడు ధర్మాత్ముఁడు,దా మది నొకదిన మ టంచుఁ♦దలఁపఁగ లేదే.౯౨

తాత్పర్యము.

అంతటి మైమఱపు గలిగించు కామానుభవముండునా యందు వేమో- మీ గురువగు విశ్వామిత్రుఁడు ఘృతాచికిఁ గామవశుఁడై చిక్కి యెంతో ధర్మాత్ముఁడై యుండియుఁ బదియేం డ్లొకదినముగ నెంచి సంధ్యాది నిత్యకృత్యములు మఱవలేదా. అంతకంటె సుగ్రీవుఁడు గొప్పవాఁడా? జితేంద్రియుఁడా? ధర్మనిష్ఠగలవాఁడా?

కండుమహర్షి ప్రమ్లోచని యనుదానిని దగులుకొని తొమ్మిదివందల యేడు సంవత్సరముల ఆఱుమాసముల మూఁడుదినము లొకపగలుగా నెంచె నని విష్ణుపురాణమునఁ బ్రథమాంశమునఁ బంచదశాధ్యాయంబునఁ గలదు. కామమాహాత్మ్య మిట్టిది.

విశ్వామిత్రునివిషయము బాలకాండమున వివరింపఁబడినది. అందు విశ్వామిత్రుఁడు మేనకతోఁ గూడియుండినట్లు చెప్పఁబడెను. ఇచ్చట ఘృతాచి యని తార చెప్పెను. వ్యాఖ్యాతలు మేనకకే ఘృతాచి యను పేరు గలదని వ్రాసిరి. కొన్నిచోట్ల వీ రిరువురు వేఱుగఁ జెప్పఁబడిరి.

'సీ. అకట నిర్దయబుద్ధి వనిదూఱెఁ గదురంభ, యాహా వివేకివౌ దనియె హరిణి
చేఁదు మ్రింగెదవంచుఁ జలికి నవ్వె ఘృతాచి, మాయలాఁ డనితిట్టె మంజుఘోష
న్యాయనిష్ఠురములఁ బ్రార్థించె నూర్వశి, జంకించె రమ్మంచుఁ జంద్రరేఖ
చెలినేచి తని దిసంతులు గొట్టె మేనక, విడువు మాట లటంచు నొడివె హేమ
గొంటువనియెఁ దిలోత్తమ గూర్మిఁ గొసరె, ధాన్యమాలిని పుంజికస్థల యదల్చె
దివిజకామిను లీరీతిఁ దిరుగుపాటి, గువ్వకోల్గాంచుఁ దమలోన నవ్వుకొనుచు.'

—మనుచరిత్ర-

కావునఁ దారచెప్పినది కర్ణాకర్ణిగ విన్నవార్త యగుటచేఁ బ్రమాద ముండవచ్చును. బాలకాండమునఁ జెప్పినవాఁడు శతానందుఁడు కావున నదియే ప్రమాణముగ నెంచవలెను. శకుంతల మేనకకూఁతురేగదా. విశ్వామిత్రుఁడు రెండుసార్లేకవిధముగఁ బొరపడె ననుట నమ్మఁదగినదికాదు.

కం. భీమతపోవిభవుఁడు వి, శ్వామిత్రునియంతవాఁడె ♦ స్మరవశుఁ డగుచున్
నేమపుఁగాల మెఱుంగఁడ, రామానుజ! యేమి చెప్పఁ ♦ బ్రాకృతజనులన్. ౯౩

భీమతపోవిభవుఁడు = భయంకరమైన తపస్సుగలవాఁడు, స్మరవశుఁడు = కామమునకు వశపడినవాఁడు.

తాత్పర్యము.

భయంకర తపశ్శాలియగు విశ్వామిత్రు నంతటివాఁడే కామవశుఁడై కాలమెఱుంగక నిత్యకృత్యముల మఱచెను. లక్ష్మణా! యిఁకఁ బామరులగుఱించి యేమి చెప్పవలెను.

చం. జనవర! దేహధర్మ మది ♦ సాధ్యము గాదు విడంగ, దానిపై
మన సిడ భ్రాంతుఁడై తనివి♦మాలక కాల మెఱుంగఁ డయ్యె స
జ్జననుతశీల! దోష మిది ♦ సైఁపుము, నిక్క మెఱుంగలేక నా
యన! జడునట్లు నీవు కని♦యుం దగునా? విను మింకఁ జెప్పెదన్. ౯౪

దేహధర్మముచే = దేహస్వభావము, తనివిమాలక = తృప్తిపడక, జడునట్లు = మూఢునివలె.

తాత్పర్యము.

సత్పురుషులు పొగడు సదాచారము గలవాఁడా! దేహస్వభావగుణము వదలిపెట్టుటకు సాధ్యముగాదు. అందు నా కామంబుపై మనసిడఁ జాలించినవాఁడు కాక తృప్తిలేకపోవుటచేఁ గాలము గడచుట తెలియనివాఁడయ్యె. ఇది తప్పే. క్షమింపుము.

నీకుఁ గానవచ్చినది యీ మాత్రమే. వాస్తవము నీ వెఱుంగవు. నీవు దోషివి యన్నప్పుడు కాదని నేనేల వాదింపవలయు నని దోష మంగీకరించితిని. గాని నీవు వాస్తవ మెఱుఁగక యే మూఢునివలెఁ గోపింపరాదు. వాస్తవ మేమంటివా చెప్పెద వినుము.

కం. నినుబోఁటి సత్త్వయుక్తులు, మనమునఁ జక్కని విమర్శ ♦ మాలి తటుకునన్
గినుకకు లోపడుదురె? రవి,తనయునిపైఁ గినుక మాను ♦ ధర్మజ్ఞవరా! ౯౫౫

సత్త్వయుక్తులు = సత్త్వగుణమే ప్రధానముగాఁ గలవారు.

తాత్పర్యము.

నీవంటి సాత్త్వికులు లోఁతుపాతు సందర్భము లన్ని విమర్శింపక తటాలునఁ గోపింపవచ్చునా? కావున సుగ్రీవునిపై నీకుఁ గల కోపము వదలుము. నీవు ధర్మము తెలిసిన వారిలో శ్రేష్ఠుఁడవు గదా.

కం. ననుఁగాని రుమను గానీ, ధనధాన్యవసువులుగాని ♦ తన కపిరాజ్యం
బును గాని విడుచు రామునిపని కీతం డనుచు దలఁతుఁ ♦ బరమదయాఢ్యా. ౯౫౬

తాత్పర్యము.

పరమదయాశాలీ! సుగ్రీవుఁడు రామచంద్రమూర్తి కార్యార్థమై నన్నుఁగాని రుమనుగాని ధనము ధాన్యము బంగారు మొదలైనవి కాని యింతయేల-తన కపిరాజ్యముగాని యిన్నిటిని గూడ విడుచునని నా యభిప్రాయము. ఆ కార్యమునం దంత యాసక్తి గలవాఁడై యున్నాఁడు.

—♦ సుగ్రీవుఁడు కపిసేనల రప్పించినవార్త తార లక్ష్మణునకుఁ దెలుపుట ♦—

సీ. ఆహవంబున రావ♦ణాసురు వధియించి, రోహిణితోడఁ జం♦ద్రునివిధాన
జనకజతోడ రా♦మునిఁ గూర్చు సుగ్రీవుఁ, డింతటిశంక నీ♦కేల చెపుమ?
నూఱువేల్ కోటులు ♦ నూఱువేల్ ముప్పది,యా యయుతంబులు ♦ నసురవరులు
గల రయ్య లంకను ♦ గలన వారల నెల్లఁ, జంపక రావణుఁ ♦ జంప రాదు

ఆ. తోడులేని యొక్క♦తోయజాప్తతనూజు, చేతఁ జచ్చు నెట్లు ♦ ఖ్యాతబలుఁడు
దశముఖుం డటంచుఁ ♦ తత్త్వమెఱింగిన, వాలిచెప్పె దానిఁ ♦ బలుకుదాన. ౯౫౭

ఆహవంబునన్ = యుద్ధమునందు- తోయజాప్తతనూజుచేతన్ = సుగ్రీవునిచే.

తాత్పర్యము.

లక్ష్మణా! సుగ్రీవుఁడు చేసిన ప్రమాణప్రకారము యుద్ధమునందు రావణుఁ జంపి చంద్రునితో రోహిణిఁగూర్చినట్లు రామచంద్రునితో సీతను సుగ్రీవుఁడు గూర్పఁ గలడు.పదిదినము లాలస్యమైనంత మాత్రమునసే యీదరబాదరఁబరువెత్తి వచ్చితివే, నీకీ సందేహ మేల కలిగెను? సుగ్రీవుఁ డొంటరిగావచ్చి మీ యెదుటఁ గూర్చుండిన రాఁగలలాభ మేమి?లంకయందు లక్షకోట్లుపైన పదికోట్లు మూఁడులక్షల అఱువదివేలు రాక్షసులు గలరనియు- వారి నందఱఁ జంపినగాని రావణునిఁ జంప సాధ్యపడదనియు

సహాయులు లేని యొంటరివాఁడు సుగ్రీవుఁడు రావణాసురు నెట్లు చంపఁగలఁ డనియు వాస్తవమెఱిఁగిన వాలి నాతోఁ జెప్పెను. ఆయన చెప్పినమాటలు నేను చెప్పెదను.

నీ కెప్పుడు చెప్పెను, అట్లు చెప్పఁ గారణమేమి కలిగెనందువా- మీరు రావణ వధార్థమై సుగ్రీవునితోఁ జెలిమి చేసితిరని వేగులవా రంగదునకుఁ జెప్పిరి. అంగదుఁడు నాతోఁ జెప్పెను. వాలి సుగ్రీవునితో రెండవసారి యుద్ధమునకుఁ బోవఁబూనినపుడు నే నీ సమాచారము చెప్పి నీవు యుద్ధమునకుఁ బోవలదంటిని. అప్పుడు రాముఁడు చేసినది సరిగాని పని. లంకలో నిండ ఉన్నారే. ఈ రాక్షసులను సుగ్రీవుఁ డొకఁ డెట్లు చంపఁగలడని చెప్పెను. నాకుఁ దెలిసిన దింతమాత్రమే.

క. మీకనిఁ దోడ్పడుపొంకెు వనౌకోనిచయంబు లిటకు ♦ నరుదేరఁగ ము
న్నే కావించె నిదేశం, బీ కపివీరుండు గడువు ♦ నేగడి నేఁడే. ౧౯౮

అనిఁ = యుద్ధమందు, తోడ్పడు పొంకెు = సహాయము చేయుకొఱకు, వనౌకోనిచయంబు = వానరమూహము, నిదేశము = ఆజ్ఞ, గడువు = నియమిత కాలము.

తాత్పర్యము.

యుద్ధమునందు మీకు సాహాయ్యము చేయుటకై సుగ్రీవుఁడు వానర సమూహము లిచ్చటికి రావలసినదిగా నింతకుముందే యాజ్ఞ గావించియున్నాఁడు. ఆగడువు నేఁటితో ముగియుచున్నది.

క. వారల నెల్లరఁ దోడ్కొని, శ్రీరామార్థంబు సిద్ధి ♦ సేయఁగఁ దా నే
తేరఁ దలంచి కపీశుఁడు, ధీరవరా! యటకు బయలు♦దేఱఁడు సుమిత్రా. ౧౯౯

తాత్పర్యము.

తగిన తోడు లేక యచ్చటికి నొంటరిగా వచ్చి యేమి ప్రయోజనము? తగిన సేనతోడఁ బోయి రామకార్యము సాధింపవలయునని తలఁచి యంతవఱకు బయలు దేఱకున్నాఁడు.

క. గోలాంగూలశతంబులు, వాలినవిక్రములు ఋక్ష♦వరులుం గ్రోఁతుల్
చాలఁగఁ గోట్లకోలందులు, హాళి నినుం గొల్చువార ♦ లయ్యా! యిపుడే. ౨౦౦

తాత్పర్యము.

ఈ దినము నీవిందు నిలచితివేని నూర్లకొలఁదులు కొండముచ్చులు, ఎలుగులు కోతులు మహాబలపరాక్రమ సంపన్నులు కోట్లకొలఁదులు నీసేవ చేయఁగలవారు.

ఉ. మానుము కోప మో పురుష♦మండన! నీదు మొగంబుతీరు జ్వా
లానలతుల్యనేత్రముల ♦ నారసి యీకపిరాజు నంగనల్
మాననిభీతిఁ జేడ్పడిరి ♦ మాకును దొల్లిటిశంక చొప్పడెన్
వానరనాథుపట్ల విసు♦వాసము గూర్పుము ప్రీతిఁ దేర్పుమీ. ౨౦౧

పురుషమండన = పురుషులయం దలంకార భూతమైనవాఁడా, జ్వాలానల తుల్య నేత్రములు = మండుచున్న యగ్నిహోత్రిని వంటి కన్నులు, ఆరసి=చూచి, విసువాసము = విశ్వాసశబ్దభవము- ప్రేమ.

తా త్ప ర్య ము

నీ వే దోషము సుగ్రీవునం దారోపించితివో యా దోష మితనియందు లేదు. కాఁబట్టి పురుషశ్రేష్ఠా! కోపము చాలింపుము. నీముఖ ముండువిధము, మండుచున్న యగ్నివంటి నీ కన్నులు చూచి సుగ్రీవుని యోఁధువారందరు భయపడియున్నారు. వారి మాటయేల? మాకును బూర్వపుస్థితి వచ్చెనా యేమి యని సుగ్రీవుని విషయమున సందేహింపవలసి వచ్చెను. కావున సుగ్రీవుని పట్ల మునుపటి ప్రేమ యుంచుము. ప్రీతితో నతని భయముఁ బాపుము.

—♦ ౩౬-వ సర్గము. సుగ్రీవుఁడు లక్ష్మణుని సమాధానపఱుచుట ♦—

చ. అనిన మృదుస్వభావుఁ డగు ♦ నారఘువంశవిభూషణుం డు త
ద్వనితసధర్మ సూక్తిఁ గొని ♦ దారుణకోపము మానె, సూర్యనం
దనుఁడును క్లిన్నవస్త్ర మనఁ ♦ దన్ను గ్రపనూనుభయంబు వీడి కాం
చనమయచిత్రమాల్యము వెసం ద్యజియించి మదంబు పాయుచున్. ౯౬౨

క్లిన్నవస్త్రము = తడిగుడ్డ, కాంచనమయచిత్రమాల్యము = వాలి యిచ్చిన బంగారు సరము, త్యజియించి = వదలి.

తా త్ప ర్య ము.

ఇట్లు తార చెప్పఁగా మెత్తని స్వభావముగల లక్ష్మణుఁ డామె చెప్పిన ధర్మముతోఁ గూడిన మాటలు గ్రహించి తీవ్రకోపమును వదలెను. అది చూచి సుగ్రీవుఁడును లక్ష్మణు వలని భయమును దడిగుడ్డను వదలినట్లు వదలి మెడనుధరించి యుండిన వాలి యిచ్చిన బంగారుమాల తీసివైచి మదంబు వదలి.

క. వినయమునఁ బల్కె లక్ష్మణ, మునుపోయిన కీశరాజ్య♦మును శ్రీకీర్తుల్
జననుత రాముని దయచే,తన మరల లభించె నాకుఁ ♦ దథ్యము సుమిత్రా. ౯౬౩

తా త్ప ర్య ము.

అణఁకువతో నిట్లనియె. లక్ష్మణా! పూర్వము పోయియుండిన వానర రాజ్యము, సంపద, కీర్తి యివి యన్నియు రామచంద్రమూర్తి దయచే మరల నాకు లభించెను. ఇది సత్యము.

ఉ. అంతటివిక్రమాఢ్యునకు ♦ నంతటి నైజఘనక్రియాదిశా
క్రాంతసుకీర్తి కేఁడు ప్రతి♦కారము సేయఁగ నోపువాఁడు? భూ
కాంతుఁడు సీత నొందు, నల♦కావలు రావణుఁ ద్రుంచి వైచు, నా
వంతయు శంక లే దయిన ♦ నయ్యెద నేను సహాయమాత్రుఁడన్. ౯౬౪

అంతటి = ఏడు మద్దిచెట్లను, కొండను పాతాళమును నొక బాణముచే భేదింపఁగలిగి నంతటి, నైజ = తన, ఘనక్రియా = గొప్పకార్యముచే, దిశాక్రాంత = దిక్కులు వ్యాపించిన, సుకీర్తికిన్ = మంచికీర్తిగలవానికి, ఏఁడు = ఎవఁడు, ప్రతికారము = అపకారము, అల = సీతను హరించిన యా, కావలున్ = గర్వించినదుష్టుని

తాత్పర్యము.

అంతటి పరాక్రమ సంపదగలవానికి, నంతటి స్వకార్యముచే దిక్కులందు వ్యాపించిన సుకీర్తిగలవానికి నెవఁడపకారము చేయఁగలఁడు. రామచంద్రమూర్తియే సీతను మరలఁ బొందఁగలఁడు. దానికై దుష్టుఁడగు రావణుఁ దుత్రింపనుగలఁడు. సందేహములేదు. అయినను నేను నిమిత్త మాత్రముగ సహాయుఁడ నయ్యెదను.

క. ధరణీరుహముల నేడిటి, ధరణిని ధరణీధరంబు ♦ దారితములుగా
శరమున నొక్కటఁ జేసిన, వరబలునకు నేఁటితోడు♦పాటది యేలా? ౯౬౫

తాత్పర్యము.

నా సాహాయ్యము లేకున్న నాయన కార్య మాయన చేసికొనలేడని నా యభిప్రాయముగాదు. ఏడు చెట్లను, భూమినిఁ గొండను నొక్క బాణమునఁ జీల్చిన మహాబలశాలికి నితరుల సాహాయ్యముతో నేమిపని.

కం. ఉంకించి ధనువు మీటిన, ఠంకృతి గిరిసహిత మై వ♦డంకును ధరయున్
బింకమఱి యట్టిమేటికి, నింకొక్కఁడు సాయపడఁగ ♦ నేలా చెపుమా. ౯౬౬

తాత్పర్యము.

ధనుస్సు పూని యల్లెత్రాడు మీటినంతమాత్రముననే యా ఠంకారముననే బిఱుసుచెడి కొండలతోడి భూమి గడగడలాడును. అంతటి గొప్పవానికి నితరులు సాయము చేయవలయునా?

కం. వైరి యగు రావణాసురు, భూరిచమూతతులతోడఁ ♦ బొరి గొనఁ జనునా
శ్రీరాముని వెంబడి గో,త్రారమణకుమార! యిదిగో ♦ రా సిద్ధుండన్. ౯౬౭

భూరిచమూతతులతోడన్ = గొప్ప సేనాసమూహములతో, పొరిగొనన్ = చంపుటకు, గోత్రారమణకుమార = రాజకుమార.

తాత్పర్యము.

విరోధి యగు రావణాసురుని గొప్ప సేనలతోడఁ జంపఁబోవు రామచంద్రమూర్తికి వెంటవచ్చుటకు నిపుడే యిదిగో సిద్ధుఁడనై యున్నాను నా మాట దక్కించుకొనుటకు నేనుగూడ రావలసిన వాఁడనే కాని యాయన చేయులేని పని నేను జేయు శక్తిగలిగి కాదు.

తే. ప్రణయకారణముననొ వి♦శ్వాసముననొ, యాభవద్దాసుఁ డొకవేళ ♦ నించుకంత
తప్పినడచిన యేన్ క్షమి♦తవ్యుఁడగును, గలఁడె యొకఁడైన నపరాధి♦గానివాఁడు.

ప్రణయకారణముననొ = చనవుచేతనో, విశ్వాసముననొ, తప్పుచేసినను

క్షమించు నను నమ్మకము చేతనో, భవద్దాసుఁడు = మీ దాసుఁడు, ఇంచుకంత = కొంచెము, క్షమితవ్యుఁడు = క్షమింపఁదగువాఁడు.

తా త్ప ర్య ము .

నాకుఁగల చనువుచేతనో ప్రేమచేతనో యీ మీ దాసుఁడు కొంచెము తప్పు చేసినను క్షమింపఁదగువాఁడే కాని దండింపఁదగువాఁడు కాఁడు. ఏలన, లోకమునందుఁ దప్పుచేయనివాఁడెవఁడు? అందఱ దండింపఁబూనిన నిఁక మీరు రక్షించునది యెవరిని?

—♦ లక్ష్మణుఁడు సుగ్రీవుని బ్రశంసించుట ♦—

సీ. అని వచియించుమ♦హాత్ము సుగ్రీవుని గని యిట్టు లనియె ల♦క్ష్మణుఁడు ప్రీతి
విసయవంతుఁడవు నీ ♦ వసఘ దిక్కౌట మా, యన్న సనాథుఁడై ♦యమరె నయ్య
నీ పారిశుద్ధ్యంబు ♦ నీదు నార్జవమును, నీ ప్రభావంబు ని♦న్నింటెఁ జూడ
లలితవానరరాజ్య♦లక్ష్మిని భోగింప, నర్హుండ వీవు కీ♦శాగ్రగణ్య

ఆ. నీదుసాహ్యమునను ♦ నిర్జరారాతిని, రామవిభుఁడు చంపు ♦ రణమునందు
ధర్మకలితగుణ కృ♦తజ్ఞ జిత్వరవర్య, యుక్త మయ్య నీదు♦సూక్తి మిత్ర. ౯౬

సనాథుఁడై = రక్షకుఁడు గలవాఁడై, ఆర్జవము = చక్కని నడవడి, నిర్జరారాతిని = రాక్షసుని, జిత్వరవర్య = జయించు స్వభావము గలవారిలో శ్రేష్ఠుఁడా.

తా త్ప ర్య ము.

అని చెప్పుచున్న గొప్ప మనస్సుగల సుగ్రీవునిఁజూచి సంతుష్టుఁడై లక్ష్మణుఁడిట్లనియె. సుగ్రీవా! నీవు వినయము గలవాఁడవు. నీవు దిక్కగుటచే మాయన్న రక్షకుఁడు గలవాఁడయ్యెను. నీ మనశ్శుద్ధి నీ చక్కని నడవడి నీ ప్రభావంబు నిన్నిటిని జూడ నీవు వానరరాజ్యలక్ష్మి ననుభవింపఁ దగినవాఁడవు నీసాహాయ్యముచే రావణుని రామచంద్రమూర్తి యుద్ధమునఁ జంపఁగలఁడు. ధర్మముతోఁగూడిన గుణములు గలవాఁడా, కృతజ్ఞుఁడా, జయశీలీ, నీవు చెప్పినది యుక్తమై యున్నది.

కం. ఘనసామర్థ్యము గలిగియుఁ, దనదోష మెఱింగి యెవఁడు ♦ దానిం బలుకుఁ
వినయంబున మా యన్నయు, వినతనయా! నీవొకండు ♦ నిద్దఱు తక్కన్. ౯౭౦

తా త్ప ర్య ము .

కార్యము సాధించుటయందు గొప్ప శక్తి కలిగియుఁ దన దోష మిదియని తెలిసికొని నాయం దీదోషము గలదని నీవొకఁడు, మాయన్న రామచంద్రమూర్తి యొకఁడు మీరిరువురు తప్ప సుగ్రీవా! చెప్పెడువాఁడు లేఁడు. ఎక్కువమంది తమ దోషములను దాము దెలిసికొన లేరు. ఎవఁడైనఁ దెలిసికొనినను దానిని బయలు పఱుపక తాను నిర్దోషి యనియే చెప్పును. ఇది సామాన్యజన స్వభావము.

చం. సముఁడవు రామభద్రునకు ♦ శౌర్యపరాక్రమసాహసంబులం,
దమరెను దైవతంత్రమున ♦ నచ్చపు నెయ్యము మీకు, లెమ్ము పో

దము, తరుణీవియోగజనితవ్యథఁ గుందెడి రాముఁ దేర్ప మా
విమనుని పల్కులన్ విని కపిప్రభు! దూఱితి నిన్ను సైఁపుమీ. ౯౨౦

తరుణీ వియోగజనితవ్యథన్ = భార్యావియోగముచేఁ గలిగిన దుఃఖముచే, విమనుని = శోకించువాని, దూఱితిన్ = నిందించితిని, సైఁపుమీ = సహింపుమా.

తాత్పర్యము.

సుగ్రీవా! శౌర్యమునందుఁ బరాక్రమమందు సాహసమందు నీవు రామచంద్రునకు సముడవు. దైవవశమున మీ యిద్దఱకు స్నేహము కుదిరెను. ఇఁకఁ బోదము లెమ్ము. భార్యావియోగదుఃఖముచే బాధపడు రామచంద్రమూర్తిని సమాధానపఱుపుము. ఎన్నఁడు నెవ్వరినిఁ బరుషము లాడని రామచంద్రుఁడు దుఃఖముచేఁ బలికిన పలుకులు విని సహింపలేక నిన్ను దూషించితిని, సహింపుము. "ఉచ్యమానోఽపి పరుషం నోత్తరం ప్రతిపద్యతే" యని కదా రాముఁడు వర్ణింపఁబడెను.

ఈ ప్రకరణమున నీక్రింది విషయము సూచితము. సుగ్రీవుఁడు రామచంద్రమూర్తికి విశ్లేషించి సాయపడవలసియుండఁగా నాయన కార్యమును మఱచి యాయన సన్నిధానంబునకై నను బోవక భోగసక్తుఁడై చేసిన ప్రతిజ్ఞ మఱచియుండఁగా లక్ష్మణుఁడు మిగులఁ గోపముతో సుగ్రీవుని దండింపవచ్చెను. అది గని మిత్రశ్రేష్ఠుఁడైన హనుమంతుఁడు "అపరాధివి వారి యెడం । గపినాయక దోషహరణ కరణ క్షమమా। నుపమ మఱియొద్ది లేదిఁక । నిపుడంజలిఁ జేర్చి మ్రొక్కుమీ సౌమిత్రిన్" అని సుగ్రీవునకు హిత ముపదేశించెను. సుగ్రీవమహారాజును నా యర్థమును జక్కఁగ గ్రహించి రెండుచేతులు జోడించికొని "ప్రణయకారణముననో విశ్వాసముననో । ఈ భవద్దాసుఁ డొక వేళ నించుకంత, తప్పి నడచినయేన్ క్షమితవ్యుఁడగును । గలఁడె యొకఁడైన నపరాధి గానివాఁడు." అని చెప్పెను. భగవంతుని యెడఁజేసిన యపచారమును భాగవతుల క్షమాపణ వేఁడుకొన్నను భగవంతుఁడు క్షమించును. భగవదపచారము పోయి యతఁడు భగవత్కైంకర్య యోగ్యుఁ డగునని తెలియఁబఱిచెను.

ఆపై లక్ష్మణుఁడు తానును సుగ్రీవుని గోపగించుకొనుట రామచంద్ర ప్రేరితము గాని స్వాభిప్రాయముగాని కాదనియు అది రామచంద్రుని దుఃఖముఁజూచి యోర్వఁజాలక తనంతనే వచ్చినదనియుఁ జెప్పి సుగ్రీవునెడఁ దాను బడిన యపరాధమునకై తన్నతఁడు క్షమింపవలయు నని యాతని వేఁడుట "ఆ విమనుని పల్కులన్ విని కపిప్రభు! దూఱితి నిన్ను సైఁపుమీ"యను పద్యమునఁ జెప్పఁబడెను. విష్ణుభక్తులపచారపడి యుండినచో ననుతాపాది ప్రాయశ్చిత్తముచే నా పాపము దీర్చుకొన్న పిదప వారు పాపాక్రాంతులై యున్న సమయమున వారియెడ నపరాధ పడినవారందఱును వారియెడ క్షమాపణను గోరి వారి యనుగ్రహము పొందవలసిన దను శాస్త్రార్థ మీ కడపటి పద్యముచే సూచితము.

—♦ { 32-వ సర్గము. సుగ్రీవుఁడు హనుమంతునితో వానరులనిమిత్తమై మఱల దూతలఁ బంపు మని చెప్పుట. } ♦—

సీ. అని లక్ష్మణుఁడు పల్క ♦ నినజుఁడు తనచెంత నిలుచున్న హనుమతోఁ♦బలికె నిట్లు
హిమవంతమునను మ♦హేంద్రవింధ్యంబులఁ, గైలాసమందర ♦ శైలములను
దరుణార్కవర్ణ భా♦సురముల సాగరాంతాద్రులఁ బశ్చిమా♦శాద్రులందు
సంధ్యాభ్రసన్నిభ ♦ జలజాప్తనిలయంబు,నందుఁ జరించు వ♦నౌకసులను
తే. పద్మతాళవనంబున♦ప్లవగవరుల, నంజనాంబుదసంకాశ♦కుంజరాభు
లయిన యంజనపర్వత♦హరివరులను, స్వర్ణవర్ణ మనశ్శిలా♦వాసకపుల. ౯౨౨

తరుణ అర్కవర్ణ భాసురములన్ = బాలసూర్యుని కాంతివంటి కాంతిచేఁ బ్రకాశించునవి. సాగరాంతాద్రులన్ = సముద్రతీర పర్వతములందు, పశ్చిమాశాద్రులందున్ = పడమటికొండలందు, సంధ్యాభ్ర = సంధ్యాకాల మేఘమువంటి, జలజాప్త నిలయంబు = ఉదయపర్వతమున, వనౌకసులను = క్రోఁతులను, అంజనాంబుద సంకాశ = కాటుకవలె నల్లనైన మేఘములకు సమానులైనవారును, కుంజరాభులు=బలమున నేనుఁగులవంటివారును, స్వర్ణవర్ణ= బంగారు వన్నెగల, మనశ్శిలావాసులు = మనశ్శిలామయమైన గుహలందు వసించువారు.

తాత్పర్యము.

ఇట్లు లక్ష్మణుఁడు చెప్పఁగాఁ దన సమీపమున నున్న హనుమంతునితో సుగ్రీవుఁ డిట్లనియె. హిమవత్పర్వతమందు, మహేంద్ర, వింధ్య, కైలాస, మందర పర్వతములందును బాలసూర్యకాంతిగలవియగు సముద్రతీర పర్వతములందుఁ బడమటికొండలందు సంధ్యాకాల మేఘమువంటి యుదయపర్వతమందుఁ దిరుగుచుండు క్రోఁతులను బద్మతాలవన మందుండు వానరులను నల్లని మేఘముతో సమానులై యేనుఁగుబలము గలవారునైన యంజనపర్వత వానరులను మణిశిల విశేషించియుండు గుహలం దుండువారిని.

క. మేరువున ధూమ్రగిరిని మ,హారుణమున హరికాన♦నాంతరసీమన్
మైరేయపాయు లగు దు,ర్వారమహాజవుల ఘోర♦వానరపతులన్. ౯౨౩

తాత్పర్యము.

మేరు పర్వతమునందు ధూమ్ర పర్వతమందు మహారుణపర్వతమందు హరి= (మనోహరమైన, కాననాంతరసీమన్ = అడవులందుఁ గల, మైరేయపాయుల = మైరేయ మను సారాయమును ద్రాగువారు, వారింపరాని గొప్ప వేగముగలవారు భయంకరులైన వానరనాథులను,

తే. మునులయాశ్రమసీమల ♦ వనములందు, భూమి నెల్లెడ నుండెడి♦భీమబలుల
వానరుల నెల్లఁ బిలిపింపు ♦ వానరేంద్ర, సామదానాదివిధులను ♦ జాగు వలదు.

తా త్ప ర్య ము.

మునీశ్వరుల యాశ్రమములం దుండువారును ఇంకను భూమిమీఁద నెందెందున్నారో భయంకరబలము గల వానరులనందఱను హనుమంతా! సామముచేత వచ్చువారిని సామముచేత, దానముచే వచ్చువారిని, దానముచేతఁ బిలిపింపుము. ఆలసింపవలదు.

క. దూతలఁ బంచితిఁ ము న్నాహూతికి నై భూరిజవుల ♦ నుద్దవిడిం గీ
ఖ్యాతతగణములఁ బంపుము, జాతత్వరులుగను జేయు ♦ సచివా! వారిన్. ౯౭౫

ఆహూతికై = పిలుచుటకై, ఉద్దవిడిన్ = మిగుల వేగముగ, జాతత్వరులు= త్వరపుట్టినవారు.

తా త్ప ర్య ము.

మంత్రి! ఆంజనేయా! ఇంతకుముందే వానరులను బిలుచుకొని వచ్చుటకై మిగులఁ ద్వరగలవారిని దూతలను బంపితిని. పోయినవారు జాగులేక త్వరగా వచ్చుటకై మరల వేగముగఁ బోఁగల విస్తారమైన వానరసమూహమును బంపుము.

తానిదివఱకే జాగ్రత్తపడియున్నానని లక్ష్మణునికిఁ దెలియుటకై యీమాట చెప్పఁబడెను.

క. కామాసక్తకపీంద్రుల, సోమరులైనట్టి దీర్ఘ♦సూత్రుల మునుము
న్నా మహితశాసనంబున, సామీరీ! పిలువఁ బంపు ♦ చయ్యనఁ గపులన్. ౯౭౬

కామాసక్తకపీంద్రులన్ = సుఖములు మరగి వానిని విడిచిరాలేని వానరులను, దీర్ఘసూత్రులను = సోమరితనముచే నేఁడు పోదములే, రేపుపోదములే యని కాలముఁద్రోయువారిని, మునుమున్ = ముందుముందుగా, అందఱకంటె ముందుగ, సామీరీ = సమీరకుమారా, ఆంజనేయా! చయ్యనన్ = త్వరగా.

తా త్ప ర్య ము.

సుఖాసక్తులై యిండ్లను భార్యలను బిడ్డలను విడిచిరాలేనివారిని రేపు పోదములే, యెల్లుండి పోదములే యని సోమరితనమున జాగుచేయుచుండువారిని నా యాజ్ఞప్రకారము ముందుగా వచ్చునట్లు పిలువఁదగువారిని ద్వరగాఁ బంపుము.

క. వలిముఖుఁ డెవఁ డీ యాజ్ఞను, బలుచన గావించి రాఁడో ♦ పదిదినములలో
నల నృపశాసనదూషకు,తలఁ దీయించెదను వాయు♦తనయా చుమ్మీ. ౯౭౭

వలిముఖుఁడు = వానరుఁడు, పలుచన = అలక్ష్యము, నృపశాసన దూషకు= రాజాజ్ఞ మీఱిన వానియొక్క.

తా త్ప ర్య ము .

ఏవానరుఁ డీ యాజ్ఞ నసడ్డసేసి పదిదినములలో రాఁడో యట్టి రాజాజ్ఞమీఱిన వాని తల నఱకించెదను. ఆంజనేయా! యిది యందఱకుఁ దెలియఁ బఱుపుము.

సీ. వేగ పంపుము నూర్లు ♦ వేలు కోట్లుగ నిప్డు, క్రోఁతుల దిక్కు ది♦క్కునకు నీవు
మేఘపర్వతనిభుల్ ♦ మేఘపథం బెల్లఁ, గప్పుచుఁ జనువారు♦గాక యిపుడ
తావు లెఱింగిన♦తరుచరుల్ కపు లుండు,తలములకును బోయి ♦ పిలువనిమ్ము
యనవుడు హనుమయు ♦ నఖిలదిక్కులకును, బనిచె నాక్షణమంద ♦ ప్లవగవరుల
తే. వారు విహగోడుపథమున ♦ భూరివేగ,మునను జని సింధుకందర♦వనములందుఁ
గలుగుక్రోఁతులకును రాము♦కార్యవిధముఁ, దెలిపి పనుపంగ వారును ♦ దీవరముగ.

మేఘపథము = ఆకాశము, విహగోడుపథమునన్ = పక్షులు నక్షత్రములు పోవుమార్గమున, దగ్గఱ దాపుల నుండువారిని బిలుచుటకుఁ బోయినవారు పక్షులవలెఁ బోయిరి. దూరము పోవలసినవా రాకాశమున నెత్తుగ నెగిరిపోయిరి. సింధు=నదీతీరములందు; నదులందుఁ గోఁతులుండవు కావున లక్షణచే నదీతీరము లని గ్రహింపవలెను. కందర = గుహాలయందు, వనములందు = అడవులందు.

తా త్ప ర్య ము .

ఆంజనేయా! నూర్లు, వేలు, కోట్లుగ వానరులను దిక్కుదిక్కులకుఁ ద్వరగాఁ బంపుము. మేఘములతోను బర్వతములతోను సమానులగు వా రాకాశమంతయుఁ గప్పినట్లు లిపుడే పోవుదురుగాక! ఎక్కడ నెక్కడ కోఁతులున్నారో యా యా తావులు తెలిసినవా రా యా తావులకుఁబోయి వారిని బిలువనిమ్ము. తెలియనివారిని బంపవలదు. అని చెప్పఁగా హనుమంతుఁడు కోఁతుల నన్ని దిక్కులకు నప్పుడే పంపెను. వారును బక్షులు, నక్షత్రములు పోవు మార్గమున మిగులఁ ద్వరఁగాబోయి నదీతీరములందు గుహాలందు నడవులందు నుండువారి కందఱకు రాము కార్యవిధ మెఱిఁగింపగ వారును శీఘ్రముగ.

—♦ వానరసేనలు కిష్కింధకు వచ్చుట. ♦—

క. లయకాలసన్నిభం బగు, భయదపుసుగ్రీవునాజ్ఞఁ ♦ బ్లవగవరేణ్యుల్
రయమునఁ జనుదెంచిరి ది,క్చయములు ప్రచ్ఛాదితముగ♦సమరోత్సుకులై. ౯౯

లయకాల సన్నిభము = ప్రలయకాలమందలి యమునితో సమానమైనది, భయదపు = భయంకరమైన, దిక్చయములు = దిక్కుల సమూహములు, ప్రచ్ఛాదితముగన్ = కప్పఁబడినవిగ, సమరోత్సుకులై = యుద్ధకాంక్షగలవారై.

తా త్ప ర్య ము.

ప్రలయకాలమందలి మృత్యుదేవతతో సమానమై భయంకరమైన సుగ్రీవునాజ్ఞప్రకారము వానరముఖ్యులు దిక్కులు కానరాకుండునట్లు యుద్ధకాంక్షచే వచ్చిరి.

సీ. అంజనగిరినుండి ♦ యంజనసన్నిభుల్, మూఁడుకోటులు కీశ♦ముఖ్యవరులు
నస్తాచలమునుండి ♦ హాటక దేహులు, పదికోట్లు వచ్చిరి ♦ ప్లవగపతులు
గిరిశాలయమునుండి ♦ హరికేసరద్యుతుల్, వేకోట్లు వచ్చిరి ♦ వీర్యధనులు
వలిమల ఫలమూల♦ముల మెక్కు కోఁతులు, వేవేలకోటులు ♦ వేగ వచ్చె

తే. వింజమలనుండి యొకకోటి♦వేలకపులు, కదలివచ్చిరి భీషణాం♦గారకాభు
లరుగుదెంచి రసంఖ్యాక ♦ హరులు క్షీర,వారినిధితీరగులు నాళి♦కేరభుజులు.

అంజనసన్నిభుల్ = కాటుకతో సమానమైనవారు. అస్తాచలము = పడమటి కొండ, హాటకదేహులు = బంగారువంటి పచ్చని దేహముగలవారు, గిరిశాలయము= కైలాసము, హరికేసరద్యుతుల్ = సింహము మెడమీఁది వెండ్రుకలవంటి కాంతిగల వారు, వలిమల = హిమవత్పర్వతము, వింజము = వింధ్యపర్వతము, భీషణ= భయం కరమైన, అంగారకాభులు = నిప్పుతో సమాను లగువారు, అసంఖ్యాకహరులు = లెక్కలేని వానరులు, క్షీరవారినిధితీరగులు = పాలసముద్రముతీరమందుండువారు, నాళికేర భుజులు = టెంకాయలు దినువారు, నాళికేర రూపాంతరము నారికేళము.

తాత్పర్యము.

అంజనపర్వతమునుండి కాటుకవంటి నల్ల దేహముగల వానరులు మూఁడుకోట్లు, పడమటికొండనుండి బంగారువంటి పచ్చని దేహముగలవారు పదికోటులు కైలాసము నుండి సింహము మెడమీఁది వెండ్రుకలవంటి కాంతిగలవారు వేయికోట్లు, హిమవత్ప ర్వతమందు పండ్లు వేళ్ళు తిను కోఁతులు వెయ్యివేలకోట్లు వింధ్యపర్వతమునుండి కోటివేల కపులు నిప్పువంటి యాకారముగలవారు పాలసముద్రము తీరమునుండి టెంకాయలు దిను వానరులు లెక్కలేనివారు వచ్చిరి.

క. హరిమండలముఁ మ్రింగెడి,సరణిని జనుదెంచె శైల♦సరిదవనీకం
దరకాననిలయం బగు, హరిమండల మప్డు రాఘు♦వార్థం బగుచుఁ. ౯౮౧

హరిమండలముఁ = సూర్యమండలమును, శైల, సరిత్, అవనీ, కందర కానన నిలయులు = కొండలు, ఏటిభూములు, గుహలు, అడవులు వాసముగాగలవి, హరి మండలము = కోఁతులగుంపు, రాఘువార్థంబు = రామచంద్రమూర్తి కార్యము నెఱవేర్చుకొఱకు.

తాత్పర్యము.

కొండలందు, నదీతీరములందు గుహలయందు నడవులందు వాసముచేయు వానరసమూహము సూర్యమండలము ను మ్రింగునట్లు రాముకార్యము సాధించు కొఱకు వచ్చెను.

ఉ. కాననచారులం బిలువఁ♦గా మును పోయిన వానరాళి యొం
దేని మహేశ్వరుండు ఘటి♦యించె మహాధ్వరముఁ మనోహరం
బై నెగడంగ నట్టె శిశి♦రాచలసీమ మహాద్రుమంబునుఁ
మానుగఁ గాంచె నల్ల సవ♦నంబున నాజ్యపయోన్నసంగతిఁ. ౯౮౨

కానన చారులఁ = వానరులను, మహాధ్వరముఁ = గొప్పయజ్ఞమును, శిశి రాచలసీమ = మంచుఁగొండ ప్రదేశమందు, మహాద్రుమంబునుఁ = గొప్పవృక్ష

ము, అల్లసవనంబునన్ = ఆయజ్ఞమందు, ఆజ్యపయోన్నసంగతిన్ = నెయ్యి, పాలు, అన్నము కూడికచే.

తాత్పర్యము.

వానరులను బిలుచుటకుఁ దోలుతఁ బోయినవారు పూర్వము శివుఁ డెచ్చట గొప్ప యజ్ఞము చేసెనో యట్టి హిమాలయపర్వత మందల పెద్దచెట్టును జూచిరి. ఆ యజ్ఞమందు నెయ్యి, పాలు, అన్నము వీని కూడికచే,

ఉ. నానిన నేలఁ బుట్టిన మ♦నఃప్రమదాకరకందమూలసం
తానము సత్ఫలంబులు సు♦ధారుచిమంతము లై రహించు న
వ్వానిని నెవ్వఁడేని యొక♦సారి మెసంగిన మాస మాఁకలిం
బూనఁడు కీశు లట్టి ఫల♦మూలములున్ రుచిరప్రసూనముల్. ౯౮౩

మనఃప్రమదాకర = మనస్సంతోషమునకు స్థానమైన, కందమూల సంతానము = గడ్డల వేళ్ల, సమూహము, సత్ + ఫలములు= మంచిపండ్లు,సుధారుచిమంతంబులు = అమృతమువలె రుచిగలవి, మెసంగినన్ = తినిన, రుచిర=మనోహరములైన, ప్రసూనముల్ = పూవులు.

తాత్పర్యము.

నానిన నేలయందుఁబుట్టి మనస్సునకు సంతోషకరములైన కందములు మూలములు, అమృతమురుచిగల మంచిపండ్లును, ఒకసారి యెవ్వఁడేని తిననేని యొక నెల నలకు మరల నాహారము కాఁబట్టదో యట్టిఫలములను మూలములను మనోహర పుష్పములను.

క. ఇనసుతునకుఁ బ్రీతిగఁ గై,కొని ఘనమిం గలుగునట్టి♦క్రోఁతుల నెల్లన్
వినియమనము చేసి వెసం, జనుదెంచిరి మున్నుగాఁగ ♦ సరిచన గడువున్. ౯౮౪

ఇనసుతునకున్ = సుగ్రీవునకు, వినియమనము = ఆజ్ఞ, సరిచనన్ = సరిపోఁగా, సుగ్రీవుఁడు చెప్పిన పదునైదుదినముల గడువునకు సరిగా.

తాత్పర్యము.

సుగ్రీవునకుఁ బ్రీతిగఁ దీసికొని భూమిలోని క్రోఁతుల కందఱకు రారండని యాజ్ఞచేసి సుగ్రీవుఁడు పెట్టిన గడువునకు సరిగా వచ్చిచేరిరి.

క. ఇటు వచ్చి కానుకల ముం,గట నుంచి కపీంద్ర యెల్ల♦కపులకు గిరిని
ష్కుటసింధువాసులకుఁ బ్రస్ఫుటముగ మీ యాజ్ఞఁ దెలుపఁ♦బోలుపుగ వారున్.

గిరినిష్కుట సింధువాసులకున్ = కొండలలో వనములలో నేళ్లతీరమున నుండువారికి, ప్రస్ఫుటముగన్ = స్పష్టముగ.

తాత్పర్యము.

ఈ ప్రకారము వచ్చి కానుకల ముందుంచి వానర రాజా! మీయాజ్ఞ కొండలలో నడవులలో నేళ్ళతీరములందు వానరులకెల్లఁ దెలుపఁగా వారును.

క. చనుదెంచిరి కిష్కింధకు, నన సుగ్రీవుండు మిగుల ♦ హర్షంబున నా
వనచరులకానికల్ గొని, చనుఁడీ యని సెల వొసంగె♦స్వభవనములకున్. ౯౮౬

తాత్పర్యము.

కిష్కింధకు వచ్చిరి, అని చెప్పఁగా సుగ్రీవుఁడు మిగుల సంతోషించి వారిచ్చిన కానుకల గ్రహించి మీ యిండ్లకుఁ బొండని యనుజ్ఞయిచ్చెను.

—♦ ౩౮-వ సర్గము. లక్ష్మణసుగ్రీవులు సేనతోడ శ్రీరామునియొద్దకుఁ బోవుట ♦—

సీ. వారికి సెలవిచ్చి ♦ వానరపతి తాను, నృపతి గృతార్థులం ♦ చెంచుకొనియె
సౌమిత్రి యంతభా♦స్కరపుత్రుఁ గని రాముఁ,గనఁబోవఁ దగునొకో♦యనఁగనాతఁ
డగుఁగాక కలదె మీ♦యాజ్ఞప్తి కన్యథా,త్వం బని తారాది♦వనితలకును
సెల విచ్చి మీరును ♦ శీఘ్రము రండని, వానరవరులకు ♦ నాన తిడిన
ఆ. నంగనాదర్శనక్షణుల్♦హస్తములను, మోడ్చి యుం దుండఁ బల్లకి♦మోయువారి
నాదుశిబికను గొనిరండు ♦ కాదు జాగు, సేయ నన వారు నట్టుల♦చేయుటయును.

కృతార్థులు = నెఱవేఱిన ప్రయోజనము గలవారు. అన్యథాత్వంబు=వేఱు విధము, ఆనతి=ఆజ్ఞ, అంగనాదర్శనక్షణుల్ = అంతఃపురస్త్రీలఁజూడఁ దగినవారు.

తాత్పర్యము.

ఈ ప్రకారము వారికిఁ బోవ ననుజ్ఞయిచ్చి తాను రామచంద్రుఁడు కార్యము నెఱవేఱిన వారని తలఁచెను. అంతట లక్ష్మణుఁడు సుగ్రీవునితో నిఁక రామచంద్ర మూర్తిని జూఁడబోఁదగునుగదా - యనినట్టులే చేయుదము. మీయాజ్ఞప్రకారము జరుగవలయునుగాని వేఱొకవిధముగ జరుగునా యని తారాది స్త్రీలకు మీ రందఱు పొండని యాజ్ఞ సేసి మీరు రావలసినదని వానరశ్రేష్ఠులకు నాజ్ఞ సేయఁగా నంతః పురస్త్రీలఁజూడఁ దగినవారంచే చేతులు జోడించుకొనియుండిరి. అంతఁ బల్లకి మోయువారినిజూచి మీరు నాపల్లకి సిద్ధముచేసి తెండు, ఆలస్యము కారా దనిన వారు నట్టులే సిద్ధము చేసి తెచ్చిరి.

క. ఎక్కుము లక్ష్మణ యని యతఁ, డెక్కిన సుగ్రీవుఁ డెక్కి ♦ యిరుగడలందున్
జక్కని చామరములు పెం, పెక్కిన శ్వేతాతపత్ర ♦ మెలమిం గూర్పన్. ౯౮౮

ఇరుగడలు - రెండుప్రక్కలు, శ్వేతాతపత్రము = తెల్ల గొడుగు.

తాత్పర్యము.

లక్ష్మణా! నీ వెక్కుమని యాయన యెక్కిన తరువాతఁ దానెక్కి రెండు ప్రక్కల వింజామరములు వేయుచుండఁ దెల్ల గొడుగు సంతోషము గలిగింపఁగా.

లక్ష్మణుఁడు కూర్చుండకుండిన సుగ్రీవుఁడు కూర్చుండఁడు. ఆయన నడచి వచ్చుట రాజలక్షణముగాదు. కావున నాయన గౌరవము కాపాడుటకై లక్ష్మణుఁడును బల్లకియందుఁ గూర్చుండెను.

ఉ. భేరులు మ్రోయ శంఖములబిట్టులివుల్ పరఁగంగఁ గీశగ
ర్జారవముల్ చెలంగఁ గపిరాజ్యరమావిభవాభిరాముఁడై
శూరులు శస్త్రపాణులును జుట్టును జేరి భజింప నేగి ధా
త్రీరమణుండు పొల్చు నెడ దిగ్గి సలక్ష్మణుఁడై సభక్తిమై. ౯౮౯

భేరులు = నగారాలు, బిట్టులివుల్ = పెద్దధ్వనులు, కీశగర్జారవముల్ = కోఁతుల సింహనాదములు, కపిరాజ్యరమావిభవాభిరాముఁడై = కపిరాజ్యలక్ష్మి యొక్క వైభవముతో నొప్పినవాఁడై.

## తాత్పర్యము.

నగారాలు శంఖములు వీని ధ్వనులు వ్యాపించుచుండఁగాఁ గోఁతులు సింహనాదములు చేయఁగా వానరరాజ్యలక్ష్మికిఁ దగిన వైభవముతో నొప్పినవాఁడై శూరులు శస్త్రములు ధరించి చుట్టును జేరి కొలువఁగాఁ బోయి రామచంద్రమూర్తి యుండుచోటికి దూరమునందే పల్లకి దిగి లక్ష్మణునితో భక్తితో.

క. రాముని డాయఁగఁ జని కర, తామరసంబుల మొగుడ్చఁ దక్కిన కోఁతుల్
భూమీశుమ్రోల నటువలెఁ, జేమోడ్చిన భయము భక్తి చెలఁగఁగ నిలువన్.

తామరసంబులు = కమలములు.

## తాత్పర్యము.

రామచంద్రమూర్తి సమీపమునకుఁ బోయి హస్తపద్మములు మోడ్చి నమస్కరించి నిలువఁగా దక్కినవానరులు రామచంద్రుని యెదుటఁ జేతులు జోడించుకొని భయముతోను భక్తితోను నిలువఁగా.

క. నాళీకముకుళరాజిత, నాళీకాకరముమాడ్కి నవ్యం బగు కీ
శాళీసైన్యముఁ గని భూ,పాలుం డినసుతునియెడఁ గృపాళుం డయ్యెన్. ౯౯౧

నాళీకముకుళ = తామర మొగ్గలచే, రాజిత = ప్రకాశించు, నాళీకాకరము = తామరకొలను, మాడ్కి = వలె, నవ్యంబగు = మనోహరమైన, కీశాళిసైన్యము = కోఁతిగుంపులసేన, కృపాళుండు = దయగలవాఁడు.

## తాత్పర్యము.

తామరమొగ్గలచేఁ బ్రకాశించు తామరకొలనివలె నుండు వానరసేనను జూచి రామచంద్రమూర్తి సుగ్రీవునియందు దయగలవాఁడయ్యెను.

—— శ్రీరాముఁడు సుగ్రీవునకు నీతిఁ దెలుపుట. ——

క. తనపదమున వ్రాలిన యా, యినతనయుని లేవనెత్తి యెలమిని గవుఁగిం
టను జేరిచి కూర్చుండుము, యని యతఁ డాసీనుఁ డగుడు నర్మిలి ననియెన్. ౯౯౨

ఎలమిన్ = సంతోషముతో, అర్మిలిన్ = ప్రేమతో.

తాత్పర్యము.

తనపదములపై వ్రాలిన సుగ్రీవుని లేవనెత్తి సంతోషముతోఁ గౌఁగిలించి కూర్చుండుమని చెప్పి యతఁడు కూర్చుండఁగా బ్రేమతో రామచంద్రమూర్తి యిట్లనియె.

తే. ధర్మ మర్థంబు కామంబు ♦ దగినరీతి, విభజనము సల్పి యుచితంపు♦వేళఁ దెలిసి
వాని సేవించు చుండు నా♦ప్రాజ్ఞతముఁడు, ప్లవగనాయక రాజునాఁ♦బ్రథ వహించు.

ప్రథ = కీర్తి, ప్రాజ్ఞతముఁడు = బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడు.

తాత్పర్యము.

సుగ్రీవా! ధర్మము, అర్థము, కామము వీనిని వేఱువేఱుగా భాగించుకొని యే యే వేళల దేని ననుష్ఠింపవలయునో తెలిసికొని యొకటి చేయుసమయంబున వేఱొకటిచేయక దేని నుపేక్షింపక వానిని సేవించువాఁడే రాజని కీర్తి వహించును.

నీవు ధర్మార్థముల సేవింపఁదగు కాలములందుఁ గూడ గామము సేవించుచుండితివి, అది రాజనీతిగాదని భావము.

తే. ధర్మమార్గంబు విడిచి య♦ర్థంబు మఱచి
సర్వదా కామ మంద యా♦సక్తి గలుగు
నతఁడు వృక్షంబు కొనకొమ్మ♦యందుఁ గూర్కి
నేలఁ బడి మేలుకొనువానిఁ ♦ బోలు చుండు. ౯౯౪

తాత్పర్యము.

ధర్మము వదలి యర్థము మఱచి యెల్లవేళఁ గామమందే యాసక్తిగలవాఁడు చెట్టు కొనకొమ్మపై నిద్రించి నేలఁబడి మేలుకొనువాని వంటివాఁడు.

నేలఁబడి నడుములు విఱిగి గాయపడినపుడు దుఃఖించి లాభమేమి?

క. శత్రువులఁ వధియించుచు, మిత్రుల సమకూర్చుకొనుచు ♦ మెలఁకువతోడన్
ధాత్రిఁ ద్రివర్గఫలమునకుఁ, బాత్రుం డగురాజు ధర్మ♦పథవర్తి యగున్. ౯౯౫

త్రివర్గము = ధర్మార్థకామములు, ధర్మపథవర్తి = ధర్మమార్గమందు నడచువాఁడు.

తాత్పర్యము.

శత్రువులఁ జంపుచు, మిత్రుల సంపాదించుకొనుచు హెచ్చరికతో ధర్మార్థకామఫలమును ననుభవించు రాజు ధర్మమార్గమునందు నడచువాఁ డగును.

క. ఖద్యోతనందనా! యిది, యుద్యోగము సేయ మనకు ♦ నుచితసమయ మౌ
సద్యస్సభఁగూర్పుము సచి,వాద్యులతో మంత్ర మిప్పు ♦ డాలోచింపన్. ౯౯౬

ఖద్యోతనందనా = సూర్యపుత్రా, సద్యస్సభ = ఇప్పుడేసభ, సచివాద్యులతో = మంత్రులు మొదలగువారితో, మంత్రము = ఆలోచన.

తా త్ప ర్య ము

సుగ్రీవా! యిది మన కార్యమునకై యత్నము చేయవలసిన సమయము. మంత్రులు, దండనాయకులు, లోనగువారి నిపుడే సభ గూర్చుము. ఎట్లు కార్యారంభముచేసిన బాగో యాలోచింతము

—♦ సుగ్రీవుఁడు శ్రీరామునితోఁ దాను వానరసేనల సిద్ధపఱుచుట తెలుపుట. ♦—

చం. అనవుడు నాతఁ డిట్లను మ♦హాత్మక నష్టమహావిభూతియున్
వనచరరాజ్యలక్ష్మియు ఘ♦నం బగుకీర్తియుఁ గంటి నీదు నీ
యనుజుని సత్ప్రసాదమున ♦ నవ్యయభంగిని వెండి మాఱుమేల్
పొనరుప నెంచఁ డెవ్వఁ డల♦పూరుషుఁడే సతతంబు నింద్యుఁ డౌ. ౯౯౭

తా త్ప ర్య ము.

అని రామచంద్రమూర్తి చెప్పఁగా సుగ్రీవుఁ డిట్లనియె. మహాత్మా! నాకుఁ బోయియుండిన మహైశ్వర్యము, వానరరాజ్యలక్ష్మి, గొప్పకీర్తి మరల నీయొక్కయు నీ తమ్మునియొక్కయు ననుగ్రహముచే క్షీణింపని విధముగాఁ బొందితిని. ఇట్టి నీకుఁ బ్రత్యుపకారము సేయఁదలంపనివాఁడు సర్వదా నిందింపఁబడఁ దగనవాఁడే.

సీ. రాజేంద్ర ! భూమిచ♦క్రంబునఁ గలిగిన, ప్లవగగోలాంగూల♦భల్లుకముల
బలియురఁ బిలువంగఁ ♦ బంచితి దేవగం,ధర్వపుత్రులు ఘోర♦దర్శనులును
గామరూపధరులు ♦ కాంతారమార్గవి,జ్ఞానులు తమతమ ♦ సేన లొప్ప
నూఱులు నూఱువేల్ ♦నూఱులక్షలు మఱి, యయుతముల్ శంకువు♦లర్బుదములు
తే. ఖర్వమధ్యాంతములును సా♦గరపరార్ధ
ములును వచ్చుచునున్నారు ♦ బలిముఖేంద్రు
లల మహేంద్రపరాక్రముల్ ♦ హాటకాద్రి
మందరాభులు వింధ్యాద్రి♦ మందిరులును. ౯౯౮

బలియురన్=బలముగలవారిని, పగతాదుల బహువచన లకారంబునకు రేఫం బగు. (సు. వ్యా. అచ్చి ౧౧ వ సూ.) ఘోరదర్శనులు=చూడ భయంకరు లగువారు. కామరూపధరులు = కోరినరూపము ధరింపఁగలవారు. కాంతార మార్గవిజ్ఞానులు = అడవిబాటలు తెలిసినవారు. అయుతము = పదివేలు; శంకువు, అర్బుదము, ఖర్వము, మధ్యము, అంతము, సాగరము, పరార్ధము- ఇవి సంఖ్యావాచకములు.

ఏకం దశం శత మస్మాత్సహస్ర మయుతం తతః పరం, లక్షం ప్రయుతం కోటి మథార్బుదబృందే ఖర్వం నిఖర్వంచ, తస్మాన్మహాసరోజం శంకుం సరితాంపతిం త్వంతం మధ్యం, పరార్ధమాహు ర్యథోత్తరం దశగుణం తథాజ్ఞేయమ్॥ అని జ్యోతిశ్శాస్త్రము. ఒకటి, పది, నూరు, వెయ్యి, అయుతము, లక్ష; ప్రయుతము, కోటి, అర్బుదము, బృందము, ఖర్వము, నిఖర్వము, మహాపద్మము, శంకువు, సముద్రము, పరార్ధము ఇవి

యొకదానికన్న నొకటి పదంతలెక్కువ. పదివే లయుతము. పది యయుతములు లక్ష. పదిలక్షలు ప్రయుతము. ఇట్లే యెఱుంగునది. ఈ వానరసేన సంఖ్య యుద్ధకాండమున ౬౦౬-౬౦౭ పద్యములఁ జెప్పఁబడినది.

బలిముఖేంద్రులు = వానరశ్రేష్ఠులు; హాటకాద్రి = మేరుపర్వతము;

తా త్ప ర్య ము .

రామచంద్రా! భూమండలమునఁగల క్రోఁతులు కొండ్రముచ్చులు ఎలుఁగులను బలవంతులను బిలిపించితిని. వీ రందఱు దేవతలయు గంధర్వులయు కుమారులు. సాధారణ వానరములుగారు. భయంకరమైన యాకారముగలవారు. కోరిన రూపము ధరింపఁగలవారు. అడవిబాటలు తెలిసినవారు. తమ తమ సేనలతో నూఱులు, నూఱువేలు, నూఱులక్షలు, అయుతములు, శంకువులు, అర్బుదములు, ఖర్వములు, మధ్యములు, అంతములు, సాగరములు, పరార్థములుగా వచ్చుచున్నారు. ఇంద్రునితో సమానమైన పరాక్రమముగలవారు, మేరు మందరపర్వతములతో సమానులు, వింధ్యాద్రియం దుండువారు నగు వానరులు వచ్చుచున్నారు.

క. కావలు సహబాంధవు నా, రావణు వధియించి యుగ్రరణమున యుష్మ
ద్దేవిని గొనితెచ్చియు నో, దేవా! యర్పించువారు ♦ దేవర కింకన్. ౯౯౯

కావలుఁ = దుష్టుని.

తా త్ప ర్య ము.

దుష్టుఁడగు రావణుని బంధువులతో ఘోరయుద్ధమునఁ జంపి నీ భార్యను దెచ్చి నీకు సమర్పించువారు.

తే. అనిన నాతని యుద్యోగ♦మంతఁ దెలిసి, కుట్మలితహస్తు గాఁగిట♦గుర్చి మోద
గరిమ వికసితమేచక♦కంజతుల్య,దర్శనీయుఁడు భాస్క-రా♦త్మజున కనియె. ౧౦౦౦

ఉద్యోగము = ప్రయత్నము, కుట్మలితహస్తుఁ = మొగ్గవంటి చేతులుగలవానిని, వికసిత = విచ్చిన, మేచకకంజ = నల్లుకలువతో, తుల్య =సమానముగా, దర్శనీయుఁడు = చూడఁదగినవాఁడు.

తా త్ప ర్య ము.

సుగ్రీవుఁ డీ ప్రకారము చెప్పఁగా నాయన చేసిన యుద్ధ ప్రయత్నమంతయుఁ దెలిసికొని మొగ్గవలెఁ జేతులు జోడించియున్న యతనిఁ గౌఁగిలించుకొని సంతోషాతిశయముచే నల్లుకలువవలెఁ జూడ నందమైన రామచంద్రమూర్తి సుగ్రీవున కిట్లనియె.

—♦ ౩౯-వ సర్గము. శ్రీరాముఁడు సుగ్రీవునిఁ బ్రశంసించుట. ♦—

ఉ. చిత్ర మటయ్య భాస్కరుఁడు ♦ చీఁకటులం దివి రూపుమాపుటల్
వృత్రవిరోధి లోకులకు ♦ వృష్టులచేత ముదంబుఁ గూర్చుటల్

ధాత్రిని శీతలంబుగ సు♦ధాకరుచేయుటయుఙ్ భవాదృశుల్
మిత్రులకుం బ్రతిక్రియగ ♦ మేలొనరించుట సౌమ్యభూషణా! ౧౦౦౧

వృత్రవిరోధి = ఇంద్రుఁడు, వృష్టులచేతఙ్ = వానలచేత, సుధాకరుచేయుట యుఙ్ = చంద్రుఁడు చేయుటయు, భవాదృశుల్ = నీవంటివారు, ప్రతిక్రియగ = బదులుగ, సౌమ్యగుణభూషణా = మంచిగుణముగల వారిలో నలంకార మగువాఁడా.

సుధాకరుచేయుట=ఇచ్చట సుధాకర శబ్దముపై విభక్తి ప్రత్యయము లోపము. 'ధాతుజవిశేషణ భావార్థకపూర్వవ్యవహితావ్యవహిత కర్తృపదప్రథమకుఁ దఱచుగ యొక్క షష్ఠియగు' త్రి. కా. సూ. ౧౫. ఈ సూత్రప్రకారము సుధాకరుయొక్క యని రూపమురాఁగా యొక్కకు లోపంబు బహుళం బను నా పరిచ్ఛేదమందలి పదునాఱవ సూత్రవ్యాఖ్యానమున బహుళగ్రహణముచే ధాతుజవిశేషణ భావార్థకముల ముందటి కర్తృపదములయొక్కకు నిత్యముగ లోపం బని యెఱుంగవలయును. అని యుండుటచే నిచట విభక్తి లోపంబని యెఱుఁగునది.

తాత్పర్యము.

సజ్జనరత్నమా! సూర్యుఁ డాకాశమునఁ జీఁకటిని నాశముచేయుట, ఇంద్రుఁడు ప్రజల సంతోషమునకై వానలు గురియించుట, చంద్రుఁడు భూమినిఁ జల్లచేయుట నీవంటి సత్పురుషులు స్నేహితులకు మఱు మేలుసేయుట చిత్రమా? ఇవి వారికి సహజ కృత్యములు.

క. మిత్రతనూభవ నినుఁ బోల్, మిత్రవరుఁడు మిత్రతతికి ♦ మే ల్సేయుటయుఙ్
జిత్రమె నేనిఁక వెలయుదు, జైతుఁడనై కలన నీదు♦సాహాయ్యమునన్. ౧౦౦౨

మిత్రతనూభవ = సూర్యనందనా, జైత్రుఁడనై = జయించినవాఁడనై, కలనఙ్ = యుద్ధమందు.

తాత్పర్యము.

సూర్యనందనా! నీవంటి మిత్రరత్నము మిత్రులకు మేలుసేయుటయం దాశ్చర్యమే మున్నది? నీవు సహాయుఁడ వగుటచేత నేనిఁక యుద్ధమందు జయించినవాఁడనే.

క. మతి నే నెన్న యెఱుంగుదు, సతతప్రియవాది వనుచు ♦ సఖ! నీవే స
మ్మతుఁడు సుహృన్మిత్రుఁడవును, బ్రతతయశా! నాకుఁ దోడు♦పడు మివ్వేళన్.

సమ్మతుఁడు = నా కిష్టుఁడవు, సుహృత్=మంచిమనస్సుగల స్నేహితుఁడవు, ప్రతతయశా = విస్తారకీర్తి గలవాఁడా.

తాత్పర్యము.

విస్తారకీర్తిశాలీ! నీవు నాకు నెల్లప్పుడు ప్రియములు చెప్పుదు వని నా మనస్సునకు బాగుగఁ దెలియును. సఖుఁడా! నీవు నా కిష్టుఁడవు. మంచి మనస్సుగల మిత్రుఁడవు. ఈ సమయమున నాకు సాహాయ్యపడుము.

ఉ. నా దయితన్ హరించెఁ దన♦నాశముఁ బొంచెను రావణుం డను
హ్లాదుఁడు వంచనన్ శచిని ♦ నర్కతనూభవ! మున్ హరించి న
ట్లా దితిజాధమున్ శితశ♦రావళిఁ ద్రుంచెద నా పులోమునిన్
సూదితుఁ జేసినట్టి బల♦సూదను పోలికి నంచు నుండఁగన్. ౧౦౦౪

దయితన్ = ప్రియురాలిని, అనుహ్లాదుఁడు = శచీదేవి పులోముని కూఁతురు. ఆమెను అనుహ్లాదుఁ డనువాని కీయవలె నని పులోముని యభిప్రాయము. ఆమెను ఇంద్రుఁడు పెండ్లాడఁగోరెను, పులోముని సాహాయ్యముచే ననుహ్లాదుఁడు శచిని హరించికొనిపోయెను. ఇంద్రుఁ డతనిఁ జంపి శచీదేవిని దాను దెచ్చుకొని పెండ్లాడెను. శితశరావళిన్ = వాఁడిబాణపరంపరలచే, సూదితున్ = చంపఁబడిన వానిసిగా, బలసూదను = ఇంద్రుని.

తా త్ప ర్య ము.

పూర్వ మనుహ్లాదుఁడు వంచనచేసి శచీదేవిని హరించినట్లు రావణుఁడు తాను నాశమై పోవుటకుఁగాను నా ప్రియురాలిని మోసగించి హరించెను. ఆ యింద్రుఁ డా దైత్యునిఁ జంపినట్లు నేను వాఁడిబాణపరంపరలచే రాక్షసునిఁ ద్రుంచెదను- అని మాటలాడుచుండఁగా,

—♦ వానరసేనలు శ్రీరామునికడకు వచ్చుట ♦—

సీ. ఇంతలో నాకాశ ♦ మంతయుఁ బెనుధూళి, నావృత మయ్యెఁ దీ♦వ్రాంశుకిరణ
జాలంబు తేజంబు ♦ సమసి కుంఠిత మయ్యె, దిక్కులు రజమున ♦ నిక్కు చెడియె
శైలకాననదీ♦సహిత వసుంధర, గడగడ మని కదు♦వడఁకఁ జొచ్చె
ధరసన్నిభము తీక్ష్ణ♦దంష్ట్రము దుర్దాంత,బల మసంఖ్యం బగు♦ప్లవగసేన
ఆ. మహిని నిండె నిమిష♦మాత్రమునం దొప్పి, రద్రిసాగరాప♦గాలయులును
గామరూపధరులు ♦ కర్కశ దేహులు, జలదరవులు గహన♦చరులు కపులు.

ఆవృతమయ్యెన్ = కప్పఁబడెను. తీవ్రాంశుకిరణజాలంబు = సూర్యకిరణముల సమూహము, తేజంబు = కాంతి, సమసి = నశించి, కుంఠితమయ్యెను = మొక్కపోయెను, రజమున = ధూళిచే, నిక్కు=అందము, శైల, కానన, నదీ సహిత వసుంధర = కొండలతో నడవులతో నదులతో గూడిన భూమి, ధరసన్నిభము= పర్వతముతో సమానము, తీక్ష్ణదంష్ట్రము = వాఁడికోఱలుగలది. దుర్దాంతబలము = అణఁపరాని బలముగలది. అసంఖ్యము = లెక్కింపరానిది, ప్లవగసేన = వానరసేన, అద్రిసాగరాపగాలయులు = కొండలయందు సముద్రతీరములందు నదీతీరములందుండువారు. కర్కశదేహులు = కఠినశరీరములు గలవారు, జలదరవులు = మేఘధ్వనివంటి ధ్వనిగలవారు. గహనచరులు = అడవులందుఁ దిరుగువారు.

తా త్ప ర్య ము.

ఇట్లు వారు మాటలాడుచుండు కాలమున నాకాశము విస్తారముగ దుమ్ముచే

నావరింపఁబడెను. సూర్యుని కాంతి తగ్గిపోయెను. ధూళి క్రమ్ముటచే దిక్కులయందము చెడెను. కొండలతో నడవులతో నదులతో భూమి గడగడలాడెను. నిమిషమాత్రములోఁ బర్వతముల వంటిదియుఁ బరునైన కోఱలుగలదియు నణఁపరాని బలము గలదియు లెక్కకు మిక్కుటమైనదియు నగు వానరసేన భూమియంతయు నిండెను. అప్పుడు గొండలందు సముద్రతీరములందు నదీతీరము లందు వసించువారు గోరిన రూపముల ధరింపఁ గలవారును, గఠిన దేహములు గలవారును ఉఱుములవంటి కంఠ ధ్వనిగలవారును అడవులందుఁ దిరుగువారును నగు కపులు నిండిరి.

క. తరుణారుణవర్ణులు సిత,కిరణాచ్ఛులు నీరజాత ♦ కేసరదీప్తుల్
హరులు పదివేలకోటులు, సరభసముగఁ గొలువ వచ్చె ♦ శతవలి యటకున్.

తరుణారుణవర్ణులు = బాల సూర్యునికాంతి గలవారు, సితకిరణాచ్ఛులు = చంద్రుని వలెఁ దెల్లనివారు. నీరజాత కేసరదీప్తుల్ = తామర యకరులవంటి కాంతి గలవారు.

తాత్పర్యము.

బాలసూర్యునివలె నెఱ్ఱని దేహకాంతిగలవారు - చంద్రునివలెఁ దెల్లనికాంతి గలవారు, అకరులవలెఁ బచ్చని శరీరముగలవారు నగు క్రోఁతులు పదివేలకోట్లు గొలువఁగా శతవలి వచ్చెను.

క. భీషణరోషుఁడు శాత్రవ,దూషణుఁ డగు తారతండ్రి ♦ తోతెంచెను సం
తోషంబుతో సుషేణుఁ డ,శేష ము పదివేలకోట్ల♦ సేన భజింపన్. ౧౦౦౭

తాత్పర్యము.

భయంకరమైన కోపముగలవాఁడు శత్రువుల సంహరించువాఁడు తారకుఁ దండ్రియగు సుషేణుఁడు పూర్ణముగఁ బదివేలకోట్ల సేన గొలువగా వచ్చెను.

సీ. కోటిసహస్రముల్ ♦ క్రోఁతులతో రుమ,తండ్రి యేతెంచెను ♦ దారుఁ డపుడు
కమల కింజల్కసం♦కాశుండు తరుణార్క,వదనుండు ప్రాజ్ఞుండు ♦ వరతరస్వి
హనుమంతుతండ్రి స♦హస్ర మనీకముల్, భజియింపఁ గేసరి ♦ వచ్చె వేగ
శిక్షితభీమవి♦పక్షుగవాక్షుండు, కోటివేల్, కపులతోఁ ♦ గొలువ వచ్చె
తే. రెండుకోటులు సేవింపఁ బుఱుకువరులు,ధూతపరిపంథి యరుదెంచె♦ధూమ్రుఁ డటకుఁ
బనసుఁడును మూఁడుకోటులు ♦ ప్లవగవరులు, బలియఁ బొడచూపి వానర♦ప్రభుని [మ్రొక్కెల.

కమలకింజల్క సంకాశుండు = తామరలయకరులవంటివాఁడు, తరుణార్కవదనుండు = బాలసూర్యుని వంటి ముఖముగలవాఁడు, వరతరస్వి = మిగులవేగముగలవాఁడు, శిక్షితభీమవిపక్షుండు = శిక్షింపఁబడిన భయంకర శత్రువులు గలవాఁడు, ధూత = ఎగురఁగొట్టఁబడిన, పరిపంథి = శత్రువులు గలవాఁడు.

తాత్పర్యము.

రుమతండ్రియగు తారుఁడు కోటిసహస్రముల క్రోఁతులతో వచ్చెను. కమలముల యందలి యకరువులవంటివాఁడును బాలసూర్యునివంటి ముఖముగలవాఁడును బుద్ధిబలముగలవాఁడును మిగుల బలవేగముగలవాఁడును హనుమంతుని తండ్రియు నగు కేసరి వెయ్యి యనీకములు గొలువఁగా వచ్చెను. భయంకరశత్రువుల శిక్షించినవాఁడగు గవాక్షుండు కోటివేలకపులతో వచ్చెను. రెండుకోట్ల యెలుఁగులతోడ శత్రుభంజనుఁడు ధూమ్రుఁడు వచ్చెను. పనసుఁడు మూఁడుకోట్ల కపులతో వచ్చెను.

క. నీలాంజనచయకాయుఁడు, నీలుఁడు పదికోటు లగు వ♦నేచరములతో
శైలాటు లైదుకోటులు, వాలఁగ గవయుండు నటకు ♦ వచ్చిన యంతన్. ౧౦౦౯

తాత్పర్యము.

నల్లకాటుక ప్రోవువంటి దేహముగల నీలుఁడు పదికోట్ల క్రోఁతులతోను గవయుఁడైదుకోటుల వానరులతోను వచ్చెను.

ఉ. కోటిసహస్రసంఖ్య గల♦క్రోఁతులతోడ దరీముఖుండునున్
గోటులు మూటితో గజుఁ డ♦కుంఠిత తేజులు కోటికోటి వేల్
పాటిగఁ గొల్వ నశ్విజులు ♦ బాఢబలుల్ ద్వివిదుండు మైందుఁడున్
గోటి దశాచ్ఛ సేవితుఁడు ♦ గొబ్బున వచ్చెను జాంబవంతుఁడున్. ౧౦౧౦

తాత్పర్యము.

వేయికోట్ల క్రోఁతులతోడ దరీముఖుండును, మూఁడుకోట్లతో గజుఁడును వేయికోట్లకోఁతులతో నశ్వినీదేవతల కుమారులు ద్వివిదుఁడు మైందుఁడనువారును బదికోట్ల భల్లూకములతో జాంబవంతుఁడును వచ్చిరి.

క. వింతబలుల్ శతకోటులు, చెంతలఁ గొలువంగఁ గపులు ♦ శీఘ్రగతి రుమ
ణ్వంతుండు వచ్చె వానర,కాంతు నిదేశమున భూమి♦కాంతునిఁ గొలువన్.

తాత్పర్యము.

ఆశ్చర్యకరమైన బలముగల కపులు నూఱుకోట్లు తన్నుఁబ్రక్కల సేవింపఁగా రుమణ్వంతుఁడనువాఁడు సుగ్రీవు నాజ్ఞప్రకారము రామచంద్రుని సేవింపవచ్చెను.

ఆ. కోట్లు నూఱువేలు ♦ క్రోఁతులు గొలువంగ, గంధమాదనుండు ♦ కదలి వచ్చె
నైదుకోట్లు గొలువ ♦ హరివరుల్ తారుండు, తారకావిభావి♦హారి వచ్చె. ౧౦౧౨

తాత్పర్యము.

నూఱువేలకోట్ల క్రోఁతులతో గంధమాదనుఁడు వచ్చెను. నక్షత్రకాంతిగల తారుఁ డైదుకోట్ల క్రోఁతులతో వచ్చెను. వీఁడు రుమతండ్రి కాక వేఱొక్కఁడు.

క. చనుదెంచెను దారేయుఁడు, జనకనిభపరాక్రముండు ♦ చయ్యన నటకున్
దనుఁ బద్మసహస్రంబులు, వనచరశతశంకువులును ♦ వలనుగఁ గొలువన్. ౧౦౧౩

తాత్పర్యము.

తండ్రి పరాక్రమమువంటి పరాక్రమముగల తారకొడుకు ఆంగదుఁడు వేయి పద్మములు నూఱుశంకువులు సంఖ్యగల కోఁతులతోడ వచ్చెను.

క. వీరుఁ డగునింద్రజానుఁడు, కూరిమిఁ దనుఁ బదునొకొండు♦కోటులు వనసం
చారులు గొలువఁగ వచ్చెను, సారతరజవంబు మెఱయ ♦ జనపతి కడకున్.౧౦౧४

తాత్పర్యము.

ఇంద్రజానుకూరుఁడు తన్నుఁ బ్రేమతోఁ బదునొకండు కోటులు వానరులు గొలువఁగా మిగులవేగముగ రామచంద్రునికడకు వచ్చెను.

క. కుంభివిపక్షద్రవిణా,రంభుఁడు రంభుండు వచ్చె ♦ రవితేజుఁడు వి
స్రంభార్హులు దోర్విభవో, త్తంభులు లక్షాయుతము ల♦దంభతఁ గొలువన్.౧౦౧౫

కుంభివిపక్ష = సింహముయొక్క, ద్రవిణారంభుఁడు = బలప్రయత్నము గల వాఁడు. విస్రంభార్హులు = నమ్మఁదగినవారు, దోర్విభవోత్తంభులు=భుజబలముయొక్క నిలుకడగలవారు. ఉత్ + స్తంభ = ఉత్తంభ, అదంభతన్ = వంచనలేక.

తాత్పర్యము.

సింహములవంటి బలముగలవారును, నమ్మఁదగినవారును, భుజబలము నిలుకడగాఁ గలవారును, నగువారలు నిర్వంచనముగఁ బదివేల లక్షులు గొలువఁగా రంభుఁడు వచ్చెను.

క. దుర్ముఖుఁ డను ప్లవగుండు న,హర్ముఖమార్తాండతేజుఁ ♦ డరుదెంచెను బ
ర్హిర్ముఖవంశజకీశులు, కూర్మిని దనుభక్తి రెండు♦కోటులు కొలువన్. ౧౦౧౬

అహర్ముఖ మార్తాండతేజుఁడు = ప్రాతఃకాల సూర్యునివంటి కాంతిగల వాఁడు, బర్హిర్ముఖ వంశజకీశులు = దేవతలవంశములఁబుట్టిన కోఁతులు.

తాత్పర్యము.

ఉదయకాల సూర్యుని తేజస్సుగలవారు దేవతలవంశములఁబుట్టినవారు నగు కోఁతులు రెండుకోట్లు తన్ను సేవింపఁగా దుర్ముఖుఁడు వచ్చెను.

క. కైలాసశిఖరిశిఖరో,త్తాలాకారులు బలిష్ఠ♦తరుచరకోటుల్
వేలు దనుఁగొలుచుచుండఁగ,గాలితనూజాతుఁడటకుఁ ♦ గ్రచ్చఱ వచ్చెన్. ౧౦౧౭

కైలాసశిఖరి = కైలాసపర్వతముయొక్క, శిఖర= శిఖరములవలె, ఉత్తాల= ఎత్తైన, ఆకారులు = రూపములు గలవారు, బలిష్ఠ = మిగుల బలముగల, తరుచర= వానరుల, కోటుల్, వేలు = వేయికోటులు.

తాత్పర్యము.

కైలాసపర్వతశిఖరముల వలె నెత్తైన రూపముగలిగి మిగుల బలవంతులైన కోఁతులు వేయికోట్లు సేవింపఁగా హనుమంతుఁడు వచ్చెను.

చ. నలుఁ డరుదెంచె వీరులు వ♦నాటవరుల్ శతలక్షకోట్లు దగ
గొలువఁగఁ, గొల్వఁగా దధిము♦ఖుండును వే పదికోట్లు కీశనా
థులు చనుదెంచె, వహ్నికుము♦దుండును దారుణరంహుఁ డైన దో
ర్బలి యలరంహుఁ డుగ్రశర♦భప్రముఖ ప్లవగోత్కరంబులున్.    ౧౦౧७

తా త్ప ర్య ము.

నలుఁడు వీరులైన వానరులు శతలక్షకోటులతోడను దధిముఖుఁడు పదికోట్లు వానరులతోను, వహ్నికుముదుఁడు భయంకరవేగము భుజబలముగల రంహుఁడు నుగ్రశరభుఁడు మొదలగు వానర సమూహములు.

క. వచ్చెను వెండియు శైలస,ముచ్చయముల నదుల వనుల ♦ నుండెడివారల్
వచ్చిరి వారలసంఖ్యల, నిచ్చలముగఁ జెప్పవచ్చు♦నే యెవ్వరికిన్.    ౧౦౧౯

నిచ్చలము = నిశ్చయముగ, శైలసముచ్చయములు=కొండల సమూహములు. వచ్చెను. వీరుగాక కొండల సమూహములందు నదులయొడ్డులందు నడవులందుండు వారు వచ్చిరి. వారి సంఖ్య యింత యని నిశ్చయించి చెప్పసాధ్యముగాదు.

ఉ. మ్రొక్కిడి పోవువారుఁ గపి♦ముఖ్యులు కొందఱు కేలుమోడ్పులన్
బ్రక్కల నిల్చువారును బ్ల♦వంగచయంబులు గర్జలాశలన్
బిక్కటిలంగ నించుచు ♦ బెంపు రహింపఁగ దూఁకులాడుచున్
గ్రిక్కిఱియన్ ఘనావృతహ♦రిం దలఁపించె హరీంద్రుఁ డయ్యెడన్.    ౧౦ ౨౦

ఘన + ఆవృత + హరిన్ = మేఘములు క్రమ్ముకొన్న సూర్యుని, తలఁపించెన్ = స్మరింపఁజేసెను.

తా త్ప ర్య ము.

ఇట్లు వచ్చినవారిలోఁ గొందఱు నమస్కరించి పోవుచుండిరి. కొందఱు చేతులు జోడించుకొని ప్రక్కల నిలుచుండిరి. కొందఱు దిక్కులు పిక్కటిల్ల సింహనాదములు చేసిరి. కొందఱు దుముకుచుండిరి. ఇట్లు మిక్కిలి యిఱుకగునట్లు వారు చుట్టుకొనఁగా సుగ్రీవుఁడు మేఘములు చుట్టుకొన్న సూర్యునివలె నుండెను.

తే. బాహువిక్రమశాలులౌ♦ ప్లవగవరులు
కిలకిలారావములతోడఁ ♦ గెరలి వచ్చి
తమ్ము నెఱిఁగించుకొనుచును ♦ దరణిజునకు
శిరము వ్రాలిచి మ్రొక్కుచు ♦ నరిగి రంత.    ౧౦౨౧

తా త్ప ర్య ము.

భుజబలపరాక్రమ వంతులగు వానరులు కిలారింపులతో వచ్చి తాము వచ్చితి మని సుగ్రీవునకుఁ దెలియఁజెప్పి నమస్కరించి పోయిరి.

క. ఉచితం బగు పద్ధతి సం,కుచితాంబరముఖ్యు లగుచు ♦ గొందఱు కీశుల్
రచితాంజలులై నిలిచిరి, ఖచరాత్మజునొద్ద వినయ♦గరిమ రహింపన్.    ౧౦౨౨

సంకుచిత = ముడుచుకొనిన, అంబరముఖ్యులు = వస్త్రములులోనైనవి కలవారు. రచితాంజలులై = అంజలి జోడించినవారై. ఖచరాత్మజునొద్దన్ = సూర్యుని పుత్రుఁడయిన సుగ్రీవు సమీపమున.

తా త్ప ర్య ము .

కొండఱు ప్రభువులయొద్ద నుండవలసినరీతిని వస్త్రములు ముడిచి కట్టుకొని యుత్తరీయము నడుమునకుఁ జుట్టుకొని చేతులు జోడించి విశేషవినయముతో సుగ్రీవు నొద్ద నిలఁబడిరి.

క. వారల నెల్లర రఘుపతి, కారఁగ నెఱిఁగించి వారి ♦ నారసి తగునై
లారణ్యంబుల మీ పరి,వారంబుల నరసికొంచు ♦ వర్తిలుఁ డనుచున్. ౧౦౨౩

తా త్ప ర్య ము .

వచ్చినవారి నందఱను సుగ్రీవుఁడు వీఁ డిట్టివాఁడని రామచంద్రుని కెఱింగించి వారి కుశలములు విచారించి మీ మీ సేనలతోఁ దగిన యడవులందుఁ గొండలయం దుండుఁ డని.

—♦ ౪౦-వ సర్గము-సుగ్రీవుఁడు శ్రీరామునకు దనసేనల నివేదించుట. ♦—

సీ. ముదలఁ గావించి రా♦మునిఁజూచి సుగ్రీవుఁ,డనియె మద్విషయస్థు ♦ లైన కపులు
కామరూపులు మద♦సామజతుల్యులు, విక్రమవంతు ల♦వక్రగతులు
దైత్యసంకాశులు ♦ దారుణాకారులు, సంజితక్లములు ప్ర♦శస్తబలులు
ఖ్యాతపరాక్రముల్ ♦ వ్యవసాయపరులు భూ,మ్యంబుచారులు గహ♦నాలయులును
ఆ. గోట్లకొలఁది వచ్చి ♦ కూడి యున్నా రిదె,నీదుకింకరులను ♦ నెమ్మిఁ గనుము
స్వామికార్యపరులు ♦ జవ దాఁట రాజ్ఞను, నీదుపనుపు సేయ ♦ నేర్పు గలరు.

ముదల = ఆజ్ఞ, మద్విషయస్థులు = నాదేశములం దుండువారు, కామరూపులు = కోరినరూపము ధరించువారు. మదసామజతుల్యులు = మదపుటేనుఁగునకు సమానులు, దైత్యసంకాశులు = దైత్యులతో సమానులు, దారుణాకారులు = భయంకరరూపములు గలవారు. సంజితక్లములు = ఎంత శ్రమమైన నోర్చువారు- వ్యవసాయపరులు=నిశ్చయముగఁ గార్యములు చేయువారు. భూమి+అంబుచారులు= భూమియందు నీళ్లయందుఁ దిరుగువారు- గహనాలయులున్ = అడవులందుండువారు.

తా త్ప ర్య ము .

ఆజ్ఞ చేసి రామచంద్రునిఁజూచి సుగ్రీవుఁ డిట్లనియె. నేనెఱింగిన దేశముం దుండు వారును గోరిన రూపముల ధరింపఁగలవారును మదపుటేనుఁగులతో సమానులును, బరాక్రమవంతులును జిక్కని నడవడి గలవారును, దైత్యులతో సమానులును భయంకరమైన యాకారములు గలవారును, నెంత శ్రమమైన నోర్చువారును, ప్రసిద్ధి కెక్కిన బలము గలవారును, పేరుగొన్న పరాక్రమము గలవారును, ప్రయత్నము

చేసి కార్యము సాధించువారును, భూమియందు నీటియందుఁ దిరుగ గలవారును, నడవులయం దుండు వారును కోట్లకొలఁది వచ్చియున్నారు. ఈ నీ కింకరులను బ్రేమతోఁ జూడుము. వీ రందఱు స్వామికార్యము చేయ నాసక్తిగలవారు. ఆజ్ఞ మీాఱరు. నీ వెట్లు చెప్పిన నట్లు చేయ నేర్పుగలవారు.

చ. ఇది భవదీయసేన, చరి♦యించు భవద్వశ మౌచు నింక, నె
 య్యది యుచితంబు సేయ నది ♦ యానతి యి, మ్మిటనున్న క్రోఁతులన్
 విదితము నాకుఁ బూనినప♦నిన్ నెఱవేర్ప సమర్థులైన నీ
 మదిఁ దలపోసి యుక్తమగు♦మార్గమునం బనిఁ గొమ్ము వీరిచేన్. ౧౦_౨౫

భవదీయసేన = నీసేన, భవద్వశము = నీ యాజ్ఞకు లోబడినది.

తాత్పర్యము.

ఈ సేనయంతయు నీయదియే ; నీయాజ్ఞకు లోబడి నీయాజ్ఞాప్రకారము నడచును. ఇఁక నేమి చేయఁదగునో సెలవిమ్ము. ఇచ్చట నున్నవానరులు పూనిన పని నెఱవేర్చ సమర్థులు, వీరిని నే నెఱుఁగుదును. అయినను నీ వాలోచించి తగిన విధముగ వీరిచేఁ బని చేయించుకొమ్ము.

క. అనవుడు రాఘవుఁ డిట్లను, నినజునిఁ గౌఁగిటను గ్రుచ్చి ♦ పృథ్వీసుత దా
 మనియున్నదొ లేదో యిం, దనుకను దశకంఠుపీటఁ♦దగుఁ దెలియంగన్. ౧౦_౨౬

తాత్పర్యము.

అని యిట్లు చెప్పఁగా రామచంద్రమూర్తి యాయనను గౌఁగిలించుకొని యిట్లనియె. దశకంఠునింట సీతాదేవి బ్రతికియున్నదో లేదో యది మొదటఁ దెలియవలెను. ఆమె మరణించి యుండెనేని మన మే ప్రయత్నము చేయవలసినది లేదుకదా.

ఉ. రావణువాసదేశము, ధ♦రాసుత యుండెడిభంగి, మున్ను సు
 గ్రీవ! యెఱుంగవచ్చినను ♦ గేరుచు నావలికార్యభంగులన్
 నీవును దోడ్పడన్ సరగ ♦ నే విధియించెద, దీనిఁ దీర్పఁగా
 నీవె సమగ్రశక్తుఁడవు ♦ నేరము నేనును నాదు తమ్ముఁడున్. ౧౦_౨౭

మని = జీవించి. తాత్పర్యము.

కావున రావణుఁ డుండు దేశము సీతాదేవియుండు చందము బ్రతికియున్నదా లేదా - బ్రతికియుండిన నే విధముగానున్నది. ఇది తెలిసినపిమ్మట నావలఁ జేయవలసినకార్యము నీవు సహాయపడఁగాఁ జెప్పెదను. ఈ సమాచారము తెలియఁజేయ నీవే సమర్థుఁడవు - నేను గాను - నా తమ్ముఁడు గాఁడు.

ఉ. ఇంతకు గార్య మెల్ల ఘటి♦యింపఁగ మా కిట నీవె దిక్కు, వృ
 త్తాంత మెఱుంగు దంతయు, య♦థాక్రమ మారఁగఁ బంపు మీావ, వి
 క్రాంతుఁడ వర్థవేదివి స♦కాలవిదుండ! ద్వితీయమిత్రుఁడున్
 స్వాంతమునందు మా హితము ♦ వాంఛ యొనర్చెద వే నెఱుంగుదున్. ౧౦_౨౮

విక్రాంతుఁడవు=పరాక్రమము గలవాఁడవు, అర్థవేదివి = కావలసిన ప్రయోజనము తెలిసినవాఁడవు, సకాలవిదుండవు = ఏకాలమున నేకార్యము చేయవలయునో యదియు నెఱుంగుదువు. ద్వితీయమిత్త్రుఁడు = రెండవ స్నేహితుఁడు, మొదటివాఁడు లక్ష్మణుఁడు, రెండవవాఁడవు నీవు.

తా త్ప ర్య ము .

జరగవలసిన కార్యమంతయు నాలోచింపఁగాఁ గార్య మంతయు నెఱవేర్చు నిచ్చట మాకు నీవే దిక్కు. ఏలన జరిగినది జరుగవలసినది నీ వెఱుంగుదువు. కావున నెవరెవరి నెచ్చటికిఁ బంపవలయునో నీవే పంపుము. నీవు విక్రమవంతుఁడవు. కావలసిన కార్యముఁ దెలిసినవాఁడవు. దానిని జేయుటకు సరియైన కాలము దెలిసిన వాఁడవు. మైత్రియందు మా లక్ష్మణునకు రెండవవాఁడవు. మాకు మేలు చేయవలయునని మీ మనస్సునందుఁ గల దని నే నెఱుంగుదును.

—♦ తూర్పున సీతను వెదక సుగ్రీవుఁడు వినతునిఁ బంచుట ♦—

చ. అనవుడు రామలక్ష్మణస♦మక్షమునంద గిరీంద్రతుల్యునిన్
ఘననిభ ఘోషునిన్ వినతుఁ ♦ గ్రచ్ఛుఱఁ బిల్చి వచించె దేశకా
లనయయుతుండ వెల్లపను♦లన్ విహితాహితతత్త్వవేదివిన్
వనచరనాథ! సోమరవి♦వంశ్యులు లక్షలు గొల్చుచుండఁగన్. ౧౦-౨౯

గిరీంద్రతుల్యునిన్ = గొప్ప పర్వతముతో సమానుని, ఘననిభఘోషునిన్ = మేఘధ్వనితో సమానమైన కంఠధ్వని గలవానిని, క్షిప్రమున్ = శీఘ్రముగ, దేశకాలనయయుతుండవు= దేశము, కాలము, నీతి తెలిసినవాఁడవు. విహితాహిత తత్త్వవేదివిన్= ఏది హితమో యేది యహితమో వాస్తవము తెలిసినవాఁడవు. సోమరవి వంశ్యులు = చంద్రునివంశమున, సూర్యునివంశమునఁ బుట్టినవారు.

తా త్ప ర్య ము .

అని రామచంద్రమూర్తి చెప్పఁగా రామలక్ష్మణులయెదుటనే పెద్దపర్వతముతో సమానుఁడును, మేఘధ్వనివంటి కంఠధ్వనిగలవాఁడును నగు వినతుని శీఘ్రముగఁ బిలచి యిట్లు చెప్పెను. నీవు దేశము కాలము నీతి తెలిసినవాఁడవు. సమస్త కార్యములందు మేలేదో కీడేదో తెలిసినవాఁడవు. కావున వానరేంద్రా! నీవుసూర్యచంద్రవంశములఁ బుట్టిన వానరులు లక్షలకొలఁది నిన్ను సేవించుచుండఁగా.

ఉ. తూరుపుదిక్కు నీ వరయఁ ♦ దూర్ణమ యేగుము రావణాసురా
గారము భూమిపుత్త్రికయి ♦ కాననశైలనదీనదంబులన్
వారక రోయుమీ సరయు♦వాహిని గంగను గౌశికిన్ మనో
హారిణి సింధు సూర్యజను ♦ యామునభూధరమున్ సరస్వతిన్. ౧౦౩౦

తూర్ణము = త్వరగా- రావణాసురాగారము = రావణాసురునియిల్లు, కానన శైల నదీనదంబులన్ = అడవులు కొండలు తూర్పుముఖముగాఁ బడమటి ముఖముగాఁ బాఱు నేర్లు. శోధయుమా = వెదకుము. సరయువాహిని = సరయూనది, సరయూ శ్శరయూశ్చాపి- సరయు శ్శరయు స్తథా ద్విరూపకోశము. సూర్యజ = యమున, యామునభూధరమున్ = యమునా ప్రాంత పర్వతమును,

తా త్ప ర్య ము .

తూరుపుదిక్కున రావణాసురుఁ డుండు స్థలము వెదకుటకు నీవు త్వరగాఁబొమ్ము. ఆ దిక్కునఁగల యడవులను గొండలను నదులను నదములను వెదకుము. మఱియు సరయూనదిని గంగను కౌశికిని మనోహరమైన సింధువును యమునను దాని ప్రాంత పర్వతమును సరస్వతిని వెదకుము.

సందేహము- ఓయూ కిష్కింధకు గంగా సరయువు లోనగునవి యన్నియు నుత్తరమున నున్న వే. సుగ్రీవుఁడు తూర్పున నున్నట్లు చెప్పఁ గారణ మేమి ?

సమాధానము— భూమికి మధ్యప్రదేశము కిష్కింధగాదు. కిష్కింధనుండి చెప్పెనేని యుత్తరము వారికి విశేషదేశము దక్షిణము వారికిఁ గొంచెము దేశము భాగమునకు వచ్చును. అందఱకు సుగ్రీవుఁ డిచ్చినది నెల గడువే. కావున నట్టి విభాగము సరిగాదు. మన సిద్ధాంతులు ఉజ్జయిని మధ్యముగాఁ దీసికొని జ్యోతిశ్శాస్త్రము సిద్ధాంతీకరించిరి. అంతకుఁ బూర్వము శరావతి యనునది భూమధ్య ప్రదేశముగా లెక్కించుచుండిరి. ఇప్పు డాంగ్లేయులు గ్రీనిచ్ నుండి లెక్కించునట్లే. ఆకారణమున నాలుగు దిక్కులవారికి సమభాగములుగా వచ్చునట్లు శరావతినుండి దిగ్విభాగముచేసి చెప్పెను. ఈ నది వింధ్యమునకు హిమాలయమునకు నడుమ నార్యావర్తంబునఁ గలదు ఈ విషయ మమరకోశమం దిట్లు వ్రాయఁబడియున్నది. 'శరావత్యాస్తు యోఽవధేః । దేశః ప్రాగ్దక్షిణః ప్రాచ్యః । ఏతస్మింశ్చ భారతే శరావతీ నామ నదీ ఈశాన్యా దిశస్సకాశాత్ పశ్చిమసముద్రగామినీ వహతి, తస్యా అవధేః యః ప్రాగ్దక్షిణో దేశః సః ప్రాచ్య ఇత్యుచ్యతే॥ ఈ భారతవర్షమునందు శరావతి యనెడు నది ఈశాన్యదిక్కునుండి నైఋతిమూలకుఁ బాఱి పడమటిసముద్రమునఁ గలియుచున్నది. అదియే యెల్లగాగల తూర్పుతోఁగూడిన దక్షిణదేశము ప్రాచ్యము (తూర్పుదేశము) అనఁబడును. అనియు- "ఉదీచ్యః పశ్చిమోత్తరః తస్యాః శరావత్యాః అవధేః యః పశ్చిమోత్తరః, స ఉదీచ్య ఇత్యుచ్యతే.' ఆనదియే యెల్లగాఁగల పడమరతోఁ గూడిన యుత్తరపుదిక్కునుండు దేశము ఉదీచ్యము (ఉత్తరదేశము) అనఁబడును.

దీనివలన శరావతీనదికిఁ దూర్పుగ దక్షిణముగ నుండు దేశము తూర్పుదేశమనియు ఆ నదికి నుత్తరము పడమరనుండు దేశ ముత్తరదేశమని సంజ్ఞను బూర్వులు గ్రహించినట్లు తేర్పడుచున్నది. ఈ విషయమును క్షీరస్వామి యిట్లు వ్రాసియున్నాఁడు. "ప్రాగుదంచౌ విభజతే హంసః క్షీరోదకం యథా । విదుషాం శబ్దసిద్ధ్యర్థం సా నః

పాతు శరావతీ॥" హంస పాలు, నీళ్లు వేఱుపఱిచినట్లు శరావతీనది తూర్పుదేశ మిది ఉత్తరదేశ మిది యని విభజించుచున్న దని భావము.

కావున సుగ్రీవుఁడు తూర్పుదేశమని యుత్తర దేశమని చెప్పినది పై ప్రమాణములఁబట్టి గ్రహింపవలయును. గాని సుగ్రీవుఁ డున్న స్థలమునకుఁ దూర్పని యుత్తర మని కాని మేరువునకుఁ దూర్పు, ఉత్తర మనికాని గ్రహింపరాదు.

కౌశికి = ఇప్పటివారు దీనిని "కోసి" (Coosi) యందురు. ఇది మిథిలకుఁ దూర్పుగాఁ బాఱి కోహల గ్రామము (కోల్గాంగు)న కెదురుగ గంగలోఁ గలియుచున్నది. గంగ కిది యుపనది. విశ్వామిత్రుని సోదరి సత్యవతి, యీ నదిగ నయ్యెను. (బాలకాండము.)

సింధువు, "దేశే నద విశేషేఽబ్ధౌ సింధు ర్నా సరితి స్త్రియామ్, సింధు ర్గజ మదేపి స్యాత్" అమరకోశము. త్రి. శేషము. సింధువనఁగాఁ బ్రవహించునది. సామాన్య నదికిని నదీవిశేషమునకును పేరు. ఇది సుప్రసిద్ధ సింధునది కాదు. అది ౧౦౭౯ వ పద్యమునఁ జెప్పబడినది. ఇది యమునానదిశాఖ, ఇప్పటికి సింధువనియే పిలువఁబడుచున్నది. దీనియొద్దుననే నార్వార్ నగర మున్నది.

కోసలము. రామాయణమున నుత్తర కోసలము, దక్షిణకోసలము- రెండే చెప్పఁబడినవి. భారతమునఁ బ్రాక్కోసలముకూడఁ జెప్పఁబడినది. ఇందు గోసలకు దూర్పున "జలధిలోపల నున్న శైలపత్తనము" లని చెప్పఁబడెను. ఇప్పు డట్లు లేదు. ఇప్పుడు వంగ (బంగాళ) దేశములో గొలభాగము సముద్రమయమై యుండెను. ఒకానొక కాలమున హిమవత్ప్రాంతమువఱకుఁ గూడ సముద్ర ముండెనఁట. హిమవంతమే కొన్నిదినాలు సముద్రమున మునిఁగియుండెనుగదా. గంగానదీ ప్రవాహము వలన వచ్చు మట్టిచే సముద్రము పూడిపోయి నేల యేర్పడినది. ఇట్లులే సింధునదియు సముద్రములోనున్న భూమిని నిప్పుడు దేశము చేసినది. కావేరి తామ్రపర్ణులు నిట్లే చేసినవి. ఈ విషయము పురాతన భూగోళ మను గ్రంథమున 72 పుటయందు 5వ అనుబంధముగ నిట్లు వ్రాయఁబడినది.

An interesting account of the effects of the silting up of the Indus is given in a recent article in the *Indian Forester*. The writer states that "the present tract of alluvial country extending from the Bhangar lands in the Punjab to Ketty Bunder at the mouth of the Indus has all been reclaimed from the sea by deposits from the river Indus, and the process of reclamation is still going on" He calculates that its "deposits probably are equal in amount to those of the Ganges, regarding which it has been calculated that at 500 miles from its mouth it carries 577 cubic feet of solid matter a second, its annual discharge being equal in weight to the 60 great pyramids of Egypt, and so great in bulk that if accumulated upon Ireland it would raise the surface of the whole island one foot in 144 years." Vide pp 22 & 48.

Prof. Max Muller in a recent article on *kutho daw* near Mandalay observes: "Most, if not all, of the monuments in that part of the world are Buddhist, but there is more and more evidence coming forth, which shows that Indian civilization had reached Trans-Gangetic India in an earlier, and as yet purely Brahmanic form. There is a stratum of customs still prevalent in Burmah and Siam which cannot be accounted for except as a remnant of the old Brahmanic Samskar, i. e. domestic institutions. The very names that are given to the kings, the princes and nobility in Burmah and Siam are taken from Sanskrit and not from Pali; and the same applies to many of the names of the old towns and rivers. There is an abundance of inscriptions both ancient and modern, some of them in ancient Gupta characters, going back to A. D 416, and recording the foundation of new Hastinapura by Gopala, who had come from the old Hastinapura on the Ganges. There is a Burmese chronicle, the "Mahayazean", which records the arrival of an Indian King at Manipura in the Sixth Century B. C. Here there is still much to be done by Burmese scholars, and it is not impossible that the history of the Trans - gangetic Kingdoms may in time reflect new light on the history and chronology of the ancient Gangetic Kingdoms of India.

I am indebted to Mr. Kedar Nath Basu for the following information on the ancient Hindu Kingdoms in the far East.

"From the recent researches of M M. Aymonier and Garnier in Cambodia and Annam we learn that the region was under Hindu Kings in ancient times and that there are ruins of Hindu temples, towers, sculptures etc. with inscriptions both in Sanskrit and ancient Khmer, the former language of the country. Dr. Rehatsek has an elaborate paper on the subject in the journal of the Anthropological Society of Bombay (Vol. I No. 8) in which he describes minutely the Hindu ruins of Angkor Wat, Bakong etc. in Cambodia and Annam. The same authority mentions that there are also Hindu ruins in a Ayuthia (a corruption of Ajodhya) in Siam. It will thus appear that not only Java and Bali but portions of Burmah, Siam, Cambodia, and Annam also, were Hindu Kingdoms in ancient times. The ruins in Cambodia, Annam and Java speak of the former splendour of these ancient Hindu Kingdoms. M. Desire Charnay in his *Ancient Cities of the New World* says that the ancient civilization of *Mexico* and *Cambodia* and *Java* is of the same origin, and Col. Hamilton Smith in his Natural History of the Human Species says that the ancient religious beliefs, architectural monuments, colossal idols, etc. of the New and the Old worlds have connecting links in the scattered islands of the Pacific and they bespeak Caucasian reasoning and Caucasian skill. Both of the two last authorities are of opinion that the resemblances in architectural remains, religious belief etc in the two worlds are more than mere Coincidence, something better than fortuitous analogies. (For descriptions and pictures of Hindu ruins in Java See Stamford Raffle's History of Java) Vide note page 58.

సీ. మహీధరవనయుత♦మహీ కాలమహీ బ్రహ్మ,మాల విదేహముల్ ♦ మాళవంబు
కాశికాపురము మా♦గధమహాగ్రామముల్, కోశకారులపురి ♦ కోసలంబు

నిన్నియు వెదకుఁడీ ♦ యిందీవరాక్షిని, దశరథస్నుష రాము♦దయిత సీత
జలధిలోపల నున్న♦శైలపత్తనములు, మొగి మందరస్థులౌ♦ముక్కుఁడులును
ఆ. నోష్ఠకర్ణకులును ♦ నుగ్రలోహముఖులు, నేకపాదకులు న♦హీనజవులు
భూరిబలులు నరుల ♦ పురుషాదకులు గర్ణ,చూడు లుండు స్థలులు♦ చూడవలయు.

మహీధరవనయుత = కొండలతో నడవులతోఁగూడిన- మహీ= ఇది యొకనది- స్నుష = కోడలు- ముక్కుఁడులు = ముక్కులేనివారు- ఓష్ఠకర్ణులు = పెదవులంటు చెవులు గలవారు- లోహముఖులు = లోహమువంటి ముఖము గలవారు- పురుషాదకులు = మనుష్యులఁ దినువారు- కర్ణచూడులు = చెవులందు జుట్టుగలవారు.

తాత్పర్యము.

కొండలతో వనములతోఁగూడిన మహీనది, కాలమహి, బ్రహ్మమాల, విదేహము, మాళవము, కాశికాపురము, మగధదేశగ్రామములు, కోశకారులను జాతివారుండు పురము కోసలము. వీనియం దన్నిట మీరు దశరథుని కోడలి రాముభార్యను సీతాదేవిని వెదకవలయును. ఇవి దాఁటిపోయి సముద్రములో నుండు కొండలను బత్తనములను మందరమం దుండు ముక్కిడులను పెదవులంటు చెవులుగలవారిని లోహముఖులను ఒంటికాలివారిని మిగుల వేగముగఁ బోవు బలవంతులను మనుష్యులను దినువారు చెవులందు వెండ్రుకలుగలవా రుండు స్థలములను జూడవలయును.

మహీనది:—

'This is said to be the river *Mahi* which rises in Malwa and falls in the Gulf of Cambay after a westerly course of 280 miles. *Griffith.* The mention of this river is out of place here and is probably due to erroneous transposition of the Verses.' An. Geo. of India.

మహీనది మాలవదేశంబునఁ బుట్టి ౨౮౦ మైళ్లు పాటి కాంబే సింధు శాఖయందు (Gulf of Cambay) గలయుచున్నది. ఈనది యిక్కడఁ జెప్పఁదగినదికాదు. లేఖకుల దోషమువలన నిందుఁ జెప్పఁబడినది. ఈ కాండమందుఁ బెక్కు శ్లోకములు తాఱుమాఱయినట్టు వ్యాఖ్యాతలు వ్రాసియున్నారు.

బ్రహ్మమాల = ఈ పేరుగల జాతివారిచే నాక్రమింపఁబడిన దేశము. వీరు తూర్పుదేశమువారు. హిమవంతమునకు వింధ్యమునకు నడుమ వీ రుండిరి.

విదేహము=ఇదియే మిథిల, ఇప్పు డిది (Tirhoot) తిరుహూట్టందురు. మగధ=(South Behar) ఈ దేశమున కుత్తరమున గంగానది పడమటఁ గాశి మండలము తూర్పున హిరణ్యపర్వత (మాంఘీర్)ము, దక్షిణమునఁ గిరణసువర్ణ - సింగభూమి యున్నట్టును దీని రాజధాని కుసుమపుర (పాటలీపుత్ర) మనియు (Huen Thsong) హూవన్‌సాంగు అనువాఁడు వ్రాసియున్నాఁడు.

ఆ. సరవిగాఁ గిరాత♦చయములు కనకాంగ,వారములును ద్వీప♦వాసులైన
యామమీనభుజులు ♦ నంతర్జలాటులు, నరవ్యాఘ్రాకు లుండు♦ధరణు లరసి.౧౦౩౨

సరవిగా = వరుసగా, కనకాంగవారముల = బంగారువంటి దేహములు గల వారి సమూహము, ఆమమీనభుజులు = వండని పచ్చిచేఁపలను దినువారు, అంతర్జలాటులు = నీళ్ళలోపలఁ దిరుగువారు, నరపృదాకులు = సగము మనుష్య శరీరము సగము పులిశరీరము గలవారు. పృదాకుశబ్దమునకు పులి, తేలు, పాము అనునర్థములు గలవు. ధరణులు=భూములు, ద్వీపవాసులు=ద్వీపములం దుండువారు

తా త్ప ర్య ము .

వరుసగాఁ గిరాత సమూహములు పైఁడివన్నె దేహముగలవారు, ద్వీపములం దుండువారు, పచ్చిచేఁపలఁదినువారు, నీళ్ళలోఁ దిరుగువారు, నరవ్యాఘ్రము లుండు చోటుల వెదకవలయును.

చ. చని యటఁ బర్వతంబులను ♦ సారపునౌకల లంఘనంబులన్
గనఁ దగునేడుఖండములఁ ♦ గ్రాలు యవాఖ్యము స్వర్ణరూప్యకం
బనఁబడు ద్వీపముల్ గడచి ♦ యావలఁ బుష్కరచుంబిశృంగకం
బును శిశిరాఖ్యశైలమును ♦ భూరిగుహావనవాటి రోయుఁడీ. ౧౦౩౩

యవాఖ్యము=యవమను పేరుగలది. దీని నిపుడు జావాద్వీపమందురు. పుష్కరచుంబి = ఆకాశమును దాఁకు, శృంగకంబు = శిఖరము గలది. శిశిరాఖ్య శైలము =శిశిర మను పేరుగల కొండ.

తా త్ప ర్య ము .

ఆవలఁబోయి సముద్రమధ్యమున నుండుటచే నేల నడచిపోవ సాధ్యము గాదు. గనుక పర్వతముల మీఁదుఁగను పడవలమీఁదుగను ఎగిరి దాఁటుటచేతను జూడ సాధ్యమై యేడుఖండములతోఁగూడిన యవద్వీపము స్వర్ణరూప్యక మను దీవులఁ గడఁచి యావల నాకాశమంటు శిఖరము గల శిశిరమను పర్వతమును గొప్ప గుహలను నడవులను వెదకుఁడు.

ఏడు ఖండముల యవద్వీపము, సంస్కృతమున యకారము తద్భవమున జకార మగును కావున యవద్వీపము జవద్వీప మయ్యెను.

Jawa Dwipa - The island of Java. "Besides, the image of *Ganesha* in stone has been found in many parts of *Java* and in the island of *Bali*. Mr. Bucke, in his, "Beauties, Harmonies and Sublimities of Nature" writes that of all the Asiatic islanders, this race (Javanese) is the most attractive to the imagination. *They* still adhere to the *Hindu* faith and worship"; and in speaking of the inhabitants of *Bali*, he says that they were divided into 4 castes, having much of the Hindu, not only in religion but in manners. K. Basu's "Hindu Civil. in Anc. America."

The reader may note here that *Java Dwipa* described as consisting *of 7 Kingdoms* was probably the group of islands now called the Indian Archipelago, of which Java was at that time the most powerful. The chief islands of this group are Sumatra, Java, Bali, Borneo (Varuna) and Celebes.

Mr. Cush, in his Linguistic and Oriental Essays writes: "In the third group, that of *Java,* we come once more on traces of the great Aryan civilization of India; for many centuries ago, some adventurous Brahmans from the Telugu coast conveyed to Java their religion, their sacred books and their civilization...........Together with the ruins of magnificient temples, an archaic language has come down to our times, known as the Kawi understood to be of the Malayan family and an archaic Javanese heavily charged with Sanskrit loan-words."

K. Basu's "Hindu Civil. in Anc. America"

సీ. అది దాఁట రక్తజ♦లాన్వితంబు నగాధ, మతిశీఘ్రగమనంబు ♦ నైన శోణ
నదము వర్తిల్లు ను♦దధికిని నద్దరి, నచ్చటి రమ్యతీ♦ ర్థాదికముల
వైదేహితోడ రా♦వణు మీరు నెమకుఁడు, పర్వతప్రభవముల్ ♦ బహుళరమ్య
వాహినుల్ తోఁటలు ♦ వాహినీశాంతర,ద్వీపముల్ దప్పక ♦ వెదకవలయు
తే. నచట నంబుధిలోన మ♦హాపఘనులు, చిరబుభుక్షితు లసురులు ♦ సరసిజాత
భవువరంబున ఛాయలఁ♦ బట్టుచుంద్రు, దాని దీర్ఘపథమునన ♦ దాఁటి పోయి.

రక్తజలాన్వితంబు = ఎఱ్ఱని నీటితోఁ గూడినది- అగాధము = మిక్కిలి లోఁతుగలది, అద్దరిన్ = ఆవలియొడ్డున- నెమకుఁడు= వెదకుఁడు. పర్వతప్రభవముల్= పర్వతములందుఁ బుట్టినవి- బహుళరమ్యవాహినుల్ = మిగుల మనోహరములైన యేళ్లు- వాహినీశాంతరద్వీపముల్ = సముద్రములోనుండు ద్వీపములు; మహాపఘనులు = పెద్ద దేహములుగలవారు; చిరబుభుక్షితులు = దీర్ఘకాలముగ నాఁకలి గొన్నవారు; సరసిజాతభవు వరంబునన్ = బ్రహ్మవరముచేత; ఛాయలన్ = నీడలను; దీర్ఘపథమునన = చుట్టుత్రోవయందే.

తాత్పర్యము.

జంబూద్వీపమునకు సంబంధించిన లవణసముద్రము నందలి ద్వీపములను జెప్పి ప్లక్షద్వీపమును గుఱించి చెప్పుచున్నాఁడు.

అది దాఁటిపోవ నెఱ్ఱని నీళ్లు మిక్కిలి లోఁతు మహా వేగముగల శోణనద ముండును. ఇది సముద్రమున కావలి యొడ్డున నుండును. అచ్చటనుండు రేవులు మొదలగు వానియందు సీతను రావణుని వెదకుఁడు. ఒకరిని మాత్రము వెదకినఁ బ్రయోజనము లేదు. రావణునిఁ జంపి సీతను దేవలెను. సీత లేదేని రావణుఁ జంపి లాభము లేదు. కొండలలోఁ బుట్టిన మిగుల రమ్యములైన యేళ్లు తోఁటలు సముద్ర మధ్యముననుండు ద్వీపములు, మీరు వెదకవలయును. అచ్చట సముద్రములోఁ బెద్ద దేహములు గలవారు దీర్ఘకాలముగ నాఁకలి గొన్నవారు నగు రాక్షసులు బ్రహ్మచే వరము పొంది నీడలను బట్టి జంతువులను నిలువవేసి పట్టుకొని తిందురు. కావున మఱి యే మార్గమునఁబోవక చుట్టయినను రేవుమార్గముననే సముద్రము దాఁటి పొండు. లేనియెడలవారి వాఁతఁబడుదురు.

The reader will see from the above description, that reference was probably made here to the vast ocean with gulfs and bays studded

with an infinity of islands, which separates the old from the so called New world, I mean, the "Pacific." "The independent nature of the three-fold development of Pre-historic art in America and the migration of 3 groups of humanity there, prove that the civilization of America was neither autochthonous nor gradual, but was a foreign element transported there by the Hindus, inhabiting the islands of Java and Bali......... The facsimile of Ganesha among the paintings of the ancient Mexicans is a very strong evidence towards this conclusion." K. Basu's Hindu Civ. in Am. An. Geo.

ఉ. లోహితవారియుక్త మగు♦లోహితవారిధిఁ జూచుచుం గపి
వ్యూహములార మీ రరిగి ♦ భూరితరం బగు కూటశాల్మలిన్
లోహమణీద్ధముఁ ♦ విషమ♦లోచనశైలనిభంబుఁ బక్షిరా
డ్గేహము దేవశిల్పివర♦కీలితముం గనుఁ డందు రాక్షసుల్. ౧౦౩౫

ఆపై శాల్మలీద్వీపమును దానిఁ జుట్టియున్న సురాసముద్రమును జెప్పుచున్నాఁడు.

లోహితవారియుక్తము=సారాయమువలె ఎఱ్ఱనినీళ్ళతోఁ గూడినది, లోహితవారిధి =ఎఱ్ఱసముద్రము, సురాసముద్రమును కూటశాల్మలిని జూడుఁడని భావము. ఇచ్చటఁ గ్రమవివక్ష లేదు. భూరితరంబు = మిక్కిలి గొప్పది, కూటశాల్మలిన్=కొండబూరుగును, లోహమణీద్ధముఁ = బంగారు లోహముచేతను, రత్నములచేతను బ్రకాశించునది, విషమలోచనశైల = బేసికన్నులుగల శివుని పర్వతమగు కైలాసముతో, నిభంబు = సమానమైనది, పక్షిరాట్ + గేహము = గరుత్మంతుని గృహము, దేవశిల్పివర = విశ్వకర్మచే, కీలితము = కట్టబడినది, అందు = ఆ శాల్మలీద్వీపమందు, పై పద్యముతో నన్వయము.

తాత్పర్యము.

ఎఱ్ఱని నీళ్లుగల సురాసముద్రమును జూచుచుఁ బోయి కపులార! మీరుకొండబూరుగుచెట్టును బంగారుతోను మణులతోను బ్రకాశించునదియుఁ గైలాసముతో సమానమైనదియు విశ్వకర్మ నిర్మించినదియు నగు గరుత్మంతుని గృహముఁ జూడుఁడు. అందు రాక్షసులు.

సీ. మందేహనామకుల్ ♦మహితభీమాకృతుల్, వివిధరూపులు పృథ్వీ♦ధరాళి
శృంగాగ్రతలముల ♦ వ్రేలాడుచును బ్రహ్మ, తేజంబునను బ్రతి♦దినము భాస్క
రోదయవేళల ♦ నుదకంబులను వారు, వినిహతులై మఱి ♦ వ్రేలుచుందు
రచ్చట ధవళాభ్ర ♦ మనుకరించుచు నున్న, క్షీరోద మనెడి కూ♦పార మొప్పు
తే. నదియు నూర్ముల మౌక్తిక♦హారవితతి,సమభిలంకృతమైనట్లు ♦ సరస మగును
బరమదుర్ధర్ష మది యందుఁ♦ బార్థివేంద్ర,తరుణి రోయుఁడు రావణా♦సురునితోడ.

మందేహనామకుల్ = మందేహులను పేర్లు గలవారు. మహితభీమాకృతుల్ = మిగుల భయంకరమైన యాకారము గలవారు, వివిధరూపులు = నానావిధ

ములైన యాకారములు గలవారు, పృథివీధరాళీ = పర్వతముల వరుసలయొక్క, శృంగాగ్రతలములఁ = శిఖరముల కొనల ప్రదేశములందు, వినిహతులై = కొట్టఁబడినవారై, ధవళాభ్రముఁ = తెల్లమేఘమును, అనుకరించుచు = పోలుచు, క్షీరోదము = క్షీర + ఉదము = క్షీరమువంటి ఉదకముగలది, పాలసముద్రము, సాగరము = సముద్రము, సారాయి సముద్రము లోనైనవి నీళ్ళ సముద్రములే, వాని వాని రంగునుబట్టి కొన్ని రుచినిబట్టి యీ పేర్లు గలవయ్యెను. ఇప్పుడు Red sea, Black sea, Milky Bay ఇత్యాదులు కలవుగదా. అధ్యాత్మవిచారమందు వీనికి వే అర్థములు దేహమున వేఱు ప్రదేశములు గలవు. ఇందొకటి సత్యము మఱియొకటి యసత్యముగాదు. రెండును సత్యములే. ఊర్మ్మలఁ - అలలచేత, మౌక్తికహారవితతిఁ = ముత్యాలసరముల సమూహముచే, పరమదుర్ధర్షము = మిగుల సాధింపరానిది.

తాత్పర్యము.

మిగుల భయంకరమైన యాకారములు గలవారును నానాకారములు గలవారును నగు మందేహులు అను వారు కొండల శిఖరములపై వ్రేలుచుండి సూర్యుని నుదయవేళలఁ బట్టుచుందురు. ఆ సమయమున బ్రాహ్మణులు విడుచు నర్ఘ్యజలములస్త్రరూపములై వారినిఁ బడఁగొట్టఁగా వారలు మరలఁ గ్రిందఁబడి మరల వ్రేలుచుందురు. అచ్చటఁ దెల్లని మేఘములవలెఁ బాలసముద్రము గలదు. అది మిగుల నసాధ్యమైనది. అచ్చట రావణునితో సీతాదేవిని వెదకుఁడు.

చ. విమలపయోధిమధ్యమున ♦ విశ్రుతమై ఋషభాఖ్యపర్వతం
　బమరు సితప్రభాలసిత ♦ మై నవదివ్యసుగంధయుక్తమౌ
　సుమముల నొప్పు హేమమయ♦సుందరభూరుహపూర్ణమై యటఁ
　శ్రమహరదర్శనీయసుస♦రస్సు రహించు సుదర్శనం బనన్. ౧౦౩౭

పయోధిమధ్యమునఁ = పాలసముద్రము నడుమ, సితప్రభాలసితమై = తెల్లని కాంతిచేఁ బ్రకాశించునదియై, హేమమయ = బంగారు స్వరూపముగల, సుందర = అందమైన, భూరుహపూర్ణమై = చెట్లతో నిండినదై, శ్రమహర = బడలికను, బోఁగొట్టు, దర్శనీయ = చూచుటకు రమ్యమైన, సుసరస్సు = మంచికొలను.

తాత్పర్యము.

నిర్మలమైన పాలసముద్రము నడుమఁ బ్రసిద్ధమైన ఋషభ పర్వతము గలదు, అది తెల్లని కాంతిగలదై దివ్యమైన పరిమళముగల పువ్వులతోడ నొప్పు బంగారు చాయగల చెట్లచే నిండియుండును. అచ్చటఁ జూడఁగానే బడలిక పోఁజేయు సుందరమైన కొలను గలదు. దాని పేరు సుదర్శనము.

తే. రజతకేసరరంజిత♦రాజతాబ్జ, మైన యాకొలనఁ రాజ♦హంసతతులు
　పోలెఁ గిన్నరచారణ♦బుధగణంబు, లచ్చరలుఁ గేళిఁ దేలంగ ♦ నరుగు దెంత్రు.

రజత = వెండివలెఁ దెల్లనైన, కేసర = అకరువులచే, రంజిత = మనోహరమైన, రాజతాబ్జము = తెల్లకమలములు గలది.

తాత్పర్యము.

ఆ కొలనియందుఁ దెల్లని కింజల్కములు గల తెల్లకమలములు గలవు. వాని నిమిత్తమై రాజహంసలు గుంపులుగా వచ్చునట్లు కిన్నరులు చారణులు దేవతలు వీరి సమూహములు అప్సరసలు జలకేళి నిమిత్తమై వచ్చుచుందురు.

శా. ఆ క్షీరాంబుధి దాఁటినం గలదు భూ♦తాత్యంతభీత్యావహం
బక్షీణౌర్వమహాక్రుధాజనితఘో♦టాస్యస్ఫురద్వహ్నిసం
లక్షీభూతము నౌ జలాబ్ధి లయవే♦ళన్ సర్వలోకంబు లా
సాక్షాద్బాడబవహ్నివాతఁబడి భ♦స్మంబౌ సమూలంబుగన్. ౧౦౩

క్షీరాంబుధి= పాలసముద్రము, భూత= జంతువులకు, అత్యంతభీత్యావహంబు= మిగుల భయముగలిగించునది, అక్షీణ=అధికమైన, ఔర్వ=ఔర్వుఁడను ఋషియొక్క, మహాక్రుధా = మిగుల కోపముచే, జనిత = పుట్టిన, ఘోటాస్య స్ఫురత్ = గుఱ్ఱపు ముఖముచేఁ బ్రకాశించు, వహ్ని = అగ్ని, బడబాగ్ని, సంలక్షీభూతమునౌన్ = కానవచ్చును, జలాబ్ధి = మంచినీళ్ళసముద్రము, లయవేళన్ = ప్రలయకాలమందు. సాక్షాత్ బాడబవహ్ని=ప్రత్యక్షముగ నాఁడు గుఱ్ఱమువంటి యాకారముగల యగ్ని,

తాత్పర్యము.

ఆ పాలసముద్రము దాటిపోయితిరేని ప్రాణికోటికి మిగుల భయము గలిగించునట్టి యౌర్వమహర్షి క్రోధమువలనఁబుట్టి గుఱ్ఱమువంటి యాకారముగల యగ్ని కానవచ్చును. ప్రలయకాలమందు నా యగ్నివాతఁబడి సకలలోకంబులు నాశంబు లగును.

ఔర్వాగ్ని - ఔర్వుఁడు, ఈయన తల్లిపేరు అదృశ్యంతి. ఆరుషియనియు నొకచోటఁగలదు. ఈమెను రాజులు చంపవచ్చినపుడు తన గర్భమును ఊరువునందు (తొడయందు) దాఁచెను. వారు చంపవచ్చినపు డీయన తొడనుండి బయలువెడలి వచ్చుటచే ఔర్వుఁడను పేరొందెను. తనపూర్వుల నందఱ క్షత్రియులు చంపినారనిన కోపముచే నిట్టి ఘోరకార్య ముపేక్షించిన లోకమునే దహింప మిగులఁ గోపము వహించి లోకము నాశముచేయఁ బ్రారంభించెను. అప్పు డాయన పితరులువచ్చి శాంతి పఱిచి నీ కోపమును జలమునందు వైవుమని యుపదేశించిరి. ఆయన దాని సముద్రమునందు వైచెను. అది యశ్వాకారము వహించి జలములందుండును. దానినే యౌర్వాగ్ని యని బడబానలమని యందురు. ఇది భారతము ఆదిపర్వంబునఁ గలదు.

This evidently refers to the *Submarine, Volcanic fire*, which so often changed the aspect of the Indian Archipelago and the groups of islands lying in the Pacific

The Volcanic belt from Sumatra through Java, Bali, Lom-Bok, Sumbawa, Flores, Timor, Flores Sea, Banda Sea, Moluca Passage to the Philip-

pine groups is evidently meant. In speaking of the Volcanic eruptions of this region at various times, Mr. Wallace notes:—"More recently in 1883, the Volcanic island of Krakatoa was blown up in a terrific eruption, the sounds of the explosions being heard at Ceylon, New Guinea, Manilla, and West Australia, while the ashes were spread over an area as large as the German Empire. The chief destruction was effected by great sea-waves which entirely destroyed many towns and villages on the coasts of Java and Sumatra, causing the death of between 30,000, and 40,000 persons. The atmospheric disturbance was so great that air waves passed three and a quarter times round the globe and the finer particles floating in the higher parts of the atmosphere produced remarkble colours in the sky at sunset for more than two years afterwards in all parts of the world." Malay Archipelago. p. 5, (Mac. Colonial Library) K. Basu. An. Geog. p. 58. Foot Note 2. para.

కం. ఎంతసమర్థము లగు జల, జంతులు బడబాగ్నిఁ జూచి ♦ సాధ్వసవేగా
క్రాంతము లయి కూపెట్టఁగఁ, జెంతల వినవచ్చుఁ బ్లవగ ♦ శేఖరులారా! ౧౦౪౦

సాధ్వసవేగాక్రాంతములు = భయాతిశయముచే నాక్రమింపఁ బడినవి. కూపెట్టఁగన్ = అఱవఁగ.

తా త్ప ర్య ము.

ఎంతటి బలముగల జంతువులయినను బడబాగ్నిని జూచి భయపడి కూఁతలు పెట్టఁగా నా ప్రక్కనుండువారి కవి వినవచ్చుచుండును.

చం. అల జలసాగరంబునకు ♦ నావలఁ బోఁ బదుమూఁడు యోజనం
బులు గల జాతరూపశిల ♦ పొల్చు సువర్ణనగంబు దానిపై
లలితశశిప్రకాశుని ని♦లాధరుఁ బద్మదళాక్షు వే శిరం
బుల ఫణిరాజు నీలపట♦మోదితుఁ జూడుఁడు మీ రనంతునిన్. ౧౦౪౧

జాతరూపశిల = బంగారు రాయి గలది, ఇలాధరుఁ = భూమిని ధరించిన వానిని, వే = వేయి, నీలపటమోదితుఁ = నల్లవస్త్రముఁ గప్పుటచే సంతోషించు వానిని, అనంతునిఁ = ఆదిశేషుని.

తా త్ప ర్య ము.

ఆ శుద్ధోదక సముద్రమును దాఁటి యావలఁబోఁగా నచటఁ బదుమూఁడు యోజనంబులు గల బంగారు రాయి గల బంగారు కొండ గలదు. దానిమీఁదఁ జంద్రునివంటి కాంతిగలవాఁడు భూమిని మోయుచుండువాఁడును బద్మములవంటి కన్నులుగలవాఁడును నీలవస్త్రము ధరించినవాఁడు నగు ననంతుని జూడుఁడు.

*Ananta* (the infinite) is the great serpent God, who is said to hold the universe on his hoods and was the symbol of the Sky or *infinite space* studded with the starry and planetary systems. Allusion has probably been made to the region of the serpents, of whom the *Dragon* is symbolic of *China*, and the largest species, known as the Boa, abound

in the tropical parts of *America*, believed to be the abode of the *antipodes* or *Nagaloka*, the country of serpents. *Serpent*-worship was known in *Ancient America* as in *India*. Mr. Squier in his "Serpent Symbol" observes that the idea existed in America. The great century of the *Aztecs* was encircled by a *serpent grasping its tail*, and the great calender stone is intwined by serpents bearing human heads in their distended jaws. The principal god of the Aztecs was *Tonac-atl coatle* which means the *Serpent-son*. The Mexican Quet Zal Coatle was represented in the form of a serpent."

K. Basu. An. Geo. P. 59. Foot Note

ఆ. ఆ మహాత్మునకును♦నమరుచుఁ గేతు వై, కనకతాలకేతు ♦ వొనరి యుండు
త్రిశిర మదియు శైల♦శృంగస్థితంబు పూ,ర్వావధిగను దేవ♦తాళి నిలిపె. ౧౦౪౨

కనకతాలకేతువు = బంగారు తాటిధ్వజము, పూర్వావధి = తూర్పుదిక్కునకు నెల్ల.

తా త్ప ర్య ము.

ఆ మహాత్మునకు బంగారు తాలధ్వజము గలదు. అది మూఁడు తలలు గలది. కొండశిఖరముమీఁద నున్నది. దానిని దూర్పున కెల్లగా దేవతలు నిలిపిరి.

సీ. అటమీఁదఁ గనకమ♦యం బగు నుదయాద్రి, కొమరారుఁ దచ్ఛైల♦కోటియందు
నాకస మొరయుచు ♦ హాటకమయ మయి, శతయోజనవితర్ది ♦ జానుమీఱు
సాలతాలతమాల♦జాలకర్ణికా,రమ్ములు సూర్యతే♦జమ్ము లగుచుఁ
బుష్పవంతమ్ము లై ♦ పొలుపారు • నయ్యెడ, యోజనవిస్తార ♦ ముచ్ఛ్రితంబు
తే. యోజనదశంబు గలశృంగ ♦ మొప్పు చుండు
సౌమనస మనఁబడు నందు ♦ వామనుండు
మును త్రివిక్రముఁ డగువేళ ♦ నునిచి పదము
నొలిపె రెండవ యది మేరు♦కూటమునను. ౧౦౪౩

శతయోజన వితర్ది = నూఱామడ యరుఁగు, ఉచ్ఛ్రితంబు = ఎత్తు.

తా త్ప ర్య ము .

ఆవల బంగారుమయమయిన తూర్పుకొండ గలదు. ఆ పర్వతసమూహమందు నాకాశముఁదాఁకుచు బంగారుమయమై నూఱామడ విస్తీర్ణముగల యరుఁగు నందముగా నుండును. అచ్చట మద్దిచెట్లు, తాటిచెట్లు, చీఁకటి మ్రాఁకులు, కొండ గోఁగులు సూర్యుని కాంతిగలవై పూచియుండును. అచట యోజనము వెడలుపు పదియామడ యెత్తుగల పర్వతశిఖరము గలదు. దానిపేరు సౌమనసము. దానియందు బూర్వము వామనుఁడు త్రివిక్రముఁడైనపు డొకపాద ముంచి రెండవది మేరువునందు నిలిపెను.

క. దినపతి జంబూద్వీపం,బున యుత్తరభాగమునను ♦ మొగిఁ దిరుగుచు ద
ధ్ఘనశైలశృంగగతుఁడై, కనవచ్చుఁ దక్షిణంపుఁ♦గడవారలకున్. ౧౦౪౪

దినపతి = సూర్యుఁడు తత్ + ఘనశైల శృంగగతుఁడై = ఆ గొప్పపర్వతము శిఖరమును బొందినవాఁడై, దక్షిణంపుఁగడ = మేరువు దక్షిణదిశ.

తాత్పర్యము.

సూర్యుఁడు జంబూద్వీపముయొక్క యుత్తరభాగమునఁ దిరుగుచు నా కొండ మీఁదికి వచ్చినపుడు మేరువు దక్షిణదిక్కువారికిఁ గానవచ్చును.

Here is an interesting reference to the physical phenomena of the apparent diurnal motion of the sun, which sets in the West (America) and reappears again in the East (Jambu dvipa) the central continent, Asia. (Vide Williams Vishnu Purana. II)

తే. అందు భాసిల్లు చుండుదు ♦ రర్కవర్ణు, లమిత తేజులు వాలఖ♦ల్యాఖ్యమునులు
కర్కశవ్రతు లైనవై♦ఖానసులును, దాని ప్రక్కనియదియ సు♦దర్శనంబు. ౧౦४౫

అర్కవర్ణులు = సూర్యునివంటి వన్నెగలవారు, కర్కశవ్రతులు= కఠినవ్రతము గలవారు, వాలఖిల్యులు = వైఖానసులు, వీరినిగుఱించి యరణ్యకాండమున వ్రాయఁ బడెను.

తాత్పర్యము.

అచ్చట సూర్యకాంతిగలవారు వాలఖిల్యులు వైఖానసు లను మునులుందురు. దాని ప్రక్కది సుదర్శనము, (వాలఖిల్యులు అఱువదివేలమంది గలరు.)

స్తువంతి మునయః సూర్యం గంధర్వై ర్గీయతే పురః । నృత్యంత్యప్సరసో యాంతి సూర్యస్యాను నిశాచరాః । వాలఖిల్యా స్తథైవైనం పరివార్య సమాస తే.

వి. పు. ౨. అంశము.

తే. ఇమ్మహాద్వీపమునయందు ♦ నెల్లప్రాణి,సంఘములకును నేత్ర తే♦ జంబుఁ దూర్పు
భూరితేజంబు వెలుఁగుఁ ద♦త్పూర్వకుధర,వనగుహాశృంగములరో యవలయుసతిని.

పూర్వకుధర = తూర్పు కొండయొక్క, వన, గుహా శృంగములన్ = అడవు లందు, గుహలందు, కొండ పేటులందు.

తాత్పర్యము.

ఈ గొప్ప ద్వీపమందు సమస్తప్రాణి సమూహములకు నేత్రకాంతి గలిగించు గొప్ప తేజము సూర్యుఁడు ప్రకాశించుచుండును. ఆ తూర్పు పర్వతమునందలి యడవులలో గుహలలో శిఖరములందు సీతను వెదుకవలయును

కం. అరుణాంశుద్యుతి చామీ,కరకుధరమహాప్రభాని♦కాయము తనపైఁ,
బరఁగుటను బూర్వసంధ్యయుఁ, గరము విరాజిల్లు రక్త♦కాంతులచేతన్. ౧౦४౭

అరుణాంశు = సూర్యునియొక్క, ద్యుతి = కాంతియు, చామీకర కుధర = బంగారుకొండ యొక్క, మహాప్రభానికాయము = గొప్ప కాంతుల సమూహము.

తాత్పర్యము.

సూర్యకాంతి బంగారు పర్వతకాంతి తనమీఁద వ్యాపించుటచేఁ బూర్వసంధ్య యెఱ్ఱని కాంతులచేఁ బ్రకాశించును.

చ ధరణికి లోకపాళికిని ♦ ద్వారముగాఁగను దొల్తఁ జేయుటన్
సరసిజసంభవుండు, మఱి ♦ సారసమిత్రు ప్రచారపద్ధతిన్
ఒరఁగుట, నాద్య మాచు నది ♦ ప్రస్తుతమయ్యెను బూర్వదిక్కనా
నరయుఁడు సీత నందు గహ♦నాంతరనిర్ఝరకందరంబులన్. ౧౦౪౮

సరసిజ సంభవుండు = బ్రహ్మ, ద్వారము = తలవాకిలి, తొల్తన్ = సృష్ట్యాదియందు, సారసమిత్రు = సూర్యునియొక్క, ప్రచారపద్ధతిన్ = సంచారముచేయు మార్గమందు, ఆద్యము= మొదటిది, గహనాంతర నిర్ఝరకందరంబులన్=అడవులలో, వంకలయొడ్డుల, గుహలందు.

తాత్పర్యము.

బ్రహ్మదేవుఁడు భూలోకమునకుఁ దక్కిన లోకములకు ద్వారముగాఁ జేసిన కారణముచేతను, సూర్యుఁడు సంచరించుటకు మొదట నచ్చటనుండి బయలు దేఱుటను దానిని బూర్వదిశ యనుచున్నారు. అందు నడవులలో, నేళ్ల యొడ్డుల, గుహలలో సీతాదేవిని వెదకుడు.

ఉ. ఆ యుదయావనీధరము♦నావల దేవత లుండు చోటు, ప్రా
లేయకరార్కదీప్తు లట ♦ లేశముఁ గాఁనమి నిర్లు నిండు, నా
చాయ నగమ్య మందనుక ♦ సాధ్యము పోవఁగఁ గాన మీర లా
యామొడ నోక్తదేశముల♦యందును రోయుఁడు భూమికన్యకన్. ౧౦౪౯

ఉదయావనీధరము = పుట్టుమల, తూర్పుకొండ, ప్రాలేయకర+అర్క+దీప్తులు = చంద్రసూర్య కాంతులు, ఇర్లు = చీఁకటులు; అగమ్యము = పోవ సాధ్యము గానిది, నోక్తదేశములు = న+ఉక్త+దేశములు = నాచేఁ జెప్పఁబడని దేశములు, నోక్తము = నైకము మొదలగు శబ్దములవలె గ్రహించునది, న శబ్దముతో సమాసము.

తాత్పర్యము.

ఆ తూర్పుకొండ కావల దేవత లుందురు. అచ్చటఁ జంద్ర సూర్య కాంతులు లేవు. చీఁకట్లు వ్యాపించియుండును. అంతదనుకఁ బోవచ్చునుగాని యావలఁ బోవ సాధ్యముగాదు. కావున నా లోపల నేను జెప్పిన స్థలములందే కాక చెప్పని ప్రదేశములందును సీతను వెదకుఁడు. నేను జెప్పలేదని మానవలదు.

చ. చని యుదయాద్రిదాఁక మహీ♦జాతను రావణువాసదేశముల్
గని నెలలోన నియ్యెడకుఁ ♦ గ్రమ్మఱుఁడీ యట మున్ను రాక ద
క్కినయెడ మీరు వధ్యులరు ♦ కీర్తి గడింపుఁడు సిద్ధకార్యులై
జనకజ నెట్టులేని కని ♦ చయ్యన రండు సుఖింపుఁ డావలన్. ౧౦౫౦

వధ్యులరు = చంపఁబడదగినవారు, గడింపుఁడు = సంపాదింపుడు.

తాత్పర్యము.

తూర్పు పర్వతముదాఁక మీరు సీతను రావణుఁ డుండు ప్రదేశమును వెదకి నెలలోపలఁ గ్రమ్మఱి రండు. అట్లు రాలేని మీరు చంపఁబడుదురు. కార్యసిద్ధులై వచ్చి కీర్తి సంపాదించి హాయిగ సుఖింపుఁడు.

—♦ ౪౧-వ సర్గము· సుగ్రీవుఁడు హనుమదాదులను దక్షిణదిక్కున రోయఁ బనుచుట. ♦—

సీ. పురుహూతదిశ రోయ ♦ హరివీరులను బంచి, దక్షిణదిశ రోయ ♦ దక్షులైన
యగ్నిసంభవు నీలు ♦ హనుమంతు సారస,సంభవతనయుని ♦ జాంబవంతు
గజుని సుహోత్రుని ♦ గవయు శరారిని, శరగుల్మని సుషేణు ♦ వరబలాఢ్యు
ఋషభు గవాక్షుని ♦ ఋభుభిషగ్జాతుల, మైందద్వివిదుల న♦మందబలుల
తే. గంధమాదను విజయు ను♦ల్కాముఖాఖ్యు, నంగదాదుల విదితబ♦లాతిజవులఁ
బంపఁ దలపోసి యొక కొంత♦బలము మున్న,పనిచె వెంట నెయామ్యది♦గ్భాగమునకు.

పురుహూతదిశ = ఇంద్రునిదిక్కు, తూర్పు, అగ్నిసంభవు = అగ్నికుమారుఁడు నీలుని, సారస సంభవ తనయుని = బ్రహ్మకొడుకును, ఋభుభిషక్ = దేవవైద్యులు, అశ్వినీకుమారులు.

తాత్పర్యము.

తూర్పుదిక్కు వెదక వానరశ్రేష్ఠులను బంపి దక్షిణదిక్కు వెదుక సమర్థులయిన యగ్నికొడుకు నీలుని, హనుమంతుని, బ్రహ్మకొడుకైన జాంబవంతుని, గజుని, సుహోత్రుని, గవయుని, శరారిని, శరగుల్మని, మిగులబలముగల సుషేణుని (ఇతఁడు తార తండ్రిగాఁడు) ఋషభుని,గవాక్షుని, అశ్వనీ దేవతల కుమారులగు మైంద ద్వివిదులను, గంధమాదనుని, విజయుని, ఉల్కాముఖుని, అంగదుఁడు మొదలయిన ప్రసిద్ధబలులను బంప నెంచి కొంతసేన వారికంటె ముందుగానే దక్షిణ దిక్కునకుఁ బంపెను.

ఉ. వారలఁ జేరఁ బిల్చి సమ♦వర్తిదిశాగతదుర్గశైలకాం
తారవిధంబు నిట్లను న♦నంతలతాద్రుమయుక్తముఁ సహ
స్రోరుశిరఃప్రకీర్ణ మగు♦నుగ్రధరంబువరంబు వింధ్యముఁ
భూరిభయంకరాహిచయ♦పూర్ణము నర్మద యఁ మహానదిన్. ౧౦౫౨

సమవర్తిదిశా = యమునిదిక్కు, దక్షిణమునందు, గత = ఉండెడి, దుర్గశైల కాంతారవిధంబు = చొరరాని ప్రదేశములు, కొండలు, అడవులు, వీనివిధము. అనంతలతాద్రుమయుక్తముఁ = అంతములేని తీఁగలు, చెట్లు గలది. సహస్రోరుశిరః ప్రకీర్ణము = వెయ్యిశిఖరములచే వ్యాపించినది. ఉగ్రధరంబువరంబు = భయంకర మైన పర్వతశ్రేష్ఠము, భూరి భయంకరాహిచయపూర్ణము = గొప్పవై మిగుల భయమును గలిగించు పాములగుంపులచే నిండినది. వింధ్య మనఁగా నిపుడు తూర్పు

కనుమలని (Eastern ghats) పడమటి కనుమలని (Western ghats) చెప్పఁబడు పర్వతముల వరుసలు వింధ్యమునకు శాఖలనియు వింధ్యపర్వతమనియే వ్యవహరింపఁబడుననియుఁ దెలియుచున్నది. ఇట్టులే కాశ్మీరము పడమటికొండ కొనమొదలు బోటదేశము (Bhutan) తూర్పుకొనవఱకు హిమాలయ మనియే పేరు. ఇట్టులే హిందూకోశము (Hindu kush) అను పర్వతమునకుఁ బేరు. ఇట్టివి పెక్కులు గలవు. కావున వింధ్యమనఁగా నర్మదా ప్రాంత పర్వత మని మాత్రమే గ్రహింపరాదు.

తా త్ప ర్య ము.

వీరి నందఱను దగ్గఱకుఁ బిల్చి దక్షిణ దిక్కునందు కొండల గుట్టల యడవుల విధ మిట్లనెను— అనేక వృక్షములు, లతలు, వేయు శిఖరములు గల పర్వత శ్రేష్ఠము వింధ్యమును, పెద్ద పెద్ద పాములు గల నర్మదను.

ఈ ద్వితీయ లన్నియు సప్తమ్యర్థమున ద్వితీయ లని యెఱుఁగ వలయును.

సీ. విపులగౌతమిఁ గృష్ణవేణి మహానది, గురుఫణిసేవిత ♦ వరదనదిని
మేఖలోత్కలలను ♦ మేలిదశార్ణోరు, పట్టనముల నశ్వ♦వంతియందు
మఱి యవంతి విదర్భ♦మహిషిఋషికముల, వంగకాశీకళిం♦గాంగతలుల
ధరనదీకందరో♦ద్ధురదండకాటవి, గోదావరి నొకింత♦కొదవ లేక
తే. పొలఁతి నరయుఁడు మఱి యంధ్ర♦పుండ్ర చోళ
పాండ్య కేరళవిషయాళి♦బహుళచిత్ర
పుష్పితాటవి చందన♦భూజయుత మ
యోముఖం బగు సహ్యాద్రి♦సీమఁ గనుఁడు. ౧౦౫౩

గౌతమిన్ = ఇది వింధ్య పూర్వభాగమునఁ బ్రవహించు గోదావరి, పాఠాంతరము, భోగవతి, కృష్ణవేణిన్ = కృష్ణానదిని, మహానది = ఇది ఓఢ్ర దేశము (Orissa) నందుఁ బాఱునది, ఇచ్చటఁ గ్రమ మపేక్షింపలేదు. గురుఫణి సేవితన్ = గొప్పపాములు గలది, ధరనదీకందరోద్ధురన్ = పర్వతములు నదులు గుహలు విశేషించి గల - గోదావరి = దండకారణ్యమునఁ బాఱునది.

తా త్ప ర్య ము.

విశాలమైన గౌతమియను పేరుగల నదీతీరమందును, కృష్ణ, మహానది, వరద, మేఖల, (ఇదియే యమరకంటక పర్వతము, దీనియందే నర్మద యుదయించును. ఇది యాంధ్రంబున మేఖల యని కవర్గ ద్వితీయాక్షరముతో వాడఁబడుచున్నది. గాని సంస్కృత గ్రంథములందు మేకల యని వర్గ ప్రథమాక్షరమే వ్రాయఁబడి యున్నది. ఉత్కలము (ఇది ఇప్పుడు ఓఢ్ర (Orissa) ఒరిస్సాదేశమందురు.) దశార్ణము, అశ్వవంతి, అవంతి, విదర్భ, మాహిషి, ఋషికములు, వంగ, కాశీ, కళింగ, అంగ దేశములందును కొండలు గుహలు నదులు గల దండకారణ్య మందును గోదావరియందుఁ గొంచెమైన విడువక సీతాదేవిని వెదకుఁడు. మఱియు ఆంధ్ర, పుండ్ర, చోళ, పాండ్య, కేరళ

దేశము లందును మిగులఁ జిత్రముగఁ బుష్పించిన చందన వృక్షములు నినుపగనులు గల సహ్యాపర్వతమును జూడుఁడు.

క. ఏహారికిని నవారిగ, నే వారి శివప్రదంబు ♦ హితనిర్మల మా
కావేరిని జలనిధిపతి, దేవేరిని గనుఁడు సురస♦తీవిహితంబుౙ. ౧౦౫౪

అవారిగ = దండిగ, వారి = నీళ్లు.

తా త్ప ర్య ము.

ఎట్టివారికైనను నే తీర్థము విస్తారముగ సుఖము నిచ్చునో, హితము నిర్మలము నగునో యట్టి కావేరిని సముద్రమునకుఁ బట్టపుదేవియగుదానిని దేవతాస్త్రీలచేఁ బూజింపబడుదానిని జూడుఁడు.

ఉ. ఆ మలయాద్రి రాజులు మ♦హౌజసు దివ్యఋషీశ్వరుౙ ఘనుౙ
గామితముల్ ఫలింపఁగ న♦గస్త్యునిఁ గాంచి నమస్కరించి మీ
రా మహనీయు నాజ్ఞఁ గొని ♦ యావల నేగుచుఁ దామ్రపర్ణి ను
ద్దామఘుళీకుళీరకవి♦తానయుతంబును నక్రజుష్టముౙ. ౧౦౫౫

మహౌజసుౙ = గొప్ప తేజస్సుగలవానిని, ఉద్దామ= అధికమైన, ఘుళీ= తాబేళ్ళ యొక్కయు, కుళీర=ఎండ్రకాయలయొక్కయు, వితాన=సమూహములచే, యుతంబు= కూడినది, నక్రజుష్టముౙ = మొసళ్లచే సేవింపఁబడునది.

తా త్ప ర్య ము.

ఆ మలయపర్వతమునందు మహాతపశ్శక్తిగల దివ్యఋషీశ్వరుఁడైన యగస్త్యుఁ డుండును. ఆయనను జూచి నమస్కరించితిరేని మీ కోరికలు ఫలించును. ఆయన యనుజ్ఞ దీసికొని యావలఁ బోయి తాఁబేళ్ళు ఎండ్రికాయలు మొసళ్లు విస్తారముగాఁ గల తామ్రిపర్ణీనదిని.

"In the seventh century of our era, Ceylon was known by the name of Seng-kia-lo or Simhala which was said to be derived from the lion-descended Sinhala, whose son Vijaya is fabled to have conquered the island on the very day of Buddha's death, in B. C. 543...its existence was first made known to the European World by the expedition of Alexander, under Taprobane... The true form however would appear to be Ta'mba panni or red leaved from the sanskrit T'amprani- Ptolemy calls the island Salike (corrupt form Sinhalaka) Ammianeis calls its Serendivus, which is the same as the Sieladıba of Kosmas, derived from Sihala-dipa, the pali form of Simhala dvipa—Abu Rihan gives form of Singal-dib or Sirindib, which the Serindib of European sailors. From the same source came the Arabic Tilan and our own Ceylon." Cun-Geo-An-India P. 557

(An. Geogr. P. 42 Foot Note)

క. తిలకింపుఁడు చందనవన,కులసంఛన్నంబు ద్వీప♦కోటియుతం బై
యెలప్రాయపుటాలు పతిం, గలయఁగఁ జను రీతి జలధిఁ ♦ గలయఁగఁ జనెడిన్.

చందన వన కుల సంఛన్నంబు = చందన వన సమూహాములచేఁ గప్పఁబడి నది- ద్వీపకోటియుతము = అనేక ద్వీపములతోఁ గూడినది.

తాత్పర్యము.

శ్రీగంధ వనములతోఁ గప్పఁబడి యనేక ద్వీపములు గలిగి లేఁబ్రాయపు టాఁడుది భర్తను గూడుటకుఁ బోవునట్లు సముద్రమును గలయఁ బోవుచున్నది. అట్టి దానిని జూడుఁడు.

క. ఆవల దివ్యము నవము,క్తావారవిభూషితంబుఁ ♦ గనకాంచితమున్
శ్రీవిలసితపాండ్యకవా,టావనిఁ బరికింపుఁడీ వ♦నాటవరేణ్యుల్. ౧౦౫౭

నవముక్తావారవిభూషితంబు = క్రొత్తముత్తెముల సమూహాముచే నలంకరింపఁబడినది. కనకాంచితమున్ = బంగారు రేకులచేఁ బ్రకాశించునది, శ్రీవిలసిత = సంపదచేతను, శోభచేతను బ్రకాశించు, పాండ్యకవాటావనిన్=పాండ్యనగరము గవని తలుపులు గల ప్రదేశము, వనాటవరేణ్యుల్ = వానరశ్రేష్ఠులారా, పాండ్య శబ్ద మిందుఁ బ్రయోగింపఁబడుటచే నా దేశమునకు నగ్జునుని సంబంధముచే నా పేరు వచ్చె నను వాదముయొక్క సత్యత్వము చింత్యము.

తాత్పర్యము.

వానరులారా ! దాని కావల దివ్యమై క్రొత్త ముత్తెములచే నలంకరింపఁబడి బంగారు రేకులచేఁ బ్రకాశించు శోభావిలసితమైన పాండ్యనగరి తలవాకిలిని జూడుఁడు.

చ. వననిధితీరమున్ గదిసి ♦ వానరులార! తరించుమార్గముం
గనుఁగొనుఁ డబ్ధిలోపల న♦గస్త్యుఁడు మున్ను మహేంద్ర శైలముం
బొనరఁగ నిల్పె నయ్యదియు ♦ మున్గినయట్టులు దోఁచుచుండెడిన్
గనకమయంబు సర్వలతి♦కాంచితరంబు సురర్షి సేవ్యమున్. ౧౦౫౮

తాత్పర్యము.

సముద్రతీరముఁ జేరి దాని దాఁటు మార్గ మాలోచింపుఁడు. సముద్రము లోపలఁ బూర్వ మగస్త్యుఁడు మహేంద్రపర్వతము నిల్పెను. అది నీళ్లలో మునిఁగి మునుఁగనట్టులు కానవచ్చుచుండును. అది బంగారుమయము. అన్నివిధములైన తీగలు గలది. దేవర్షులు దానిని సేవింతురు.

క. వినుఁ డందు యక్షచారణ,జనములు సిద్ధులును త్రిదశ♦సతులును గుములై
యునయం బుందురు శక్రుఁడు, చనుదెంచెడు నెల్లపర్వ♦ సమయములందున్.౧౦౫౯

తాత్పర్యము.

ఆ పర్వతమందు యక్షులు, సిద్ధులు, దేవతాస్త్రీలు గుంపులై యెల్లవేళల నుందురు. పర్వదినములందు నింద్రుఁడు స్నానార్థమై యచ్చటికి వచ్చును.

క. వననిధిమధ్యతలంబున, మనుజులకు నగమ్యమగుచు ♦ మానుగ శతయో
జన మాయత మై ద్వీపము, దనరెడి నందెల్ల సీతఁ ♦ దగు నెమకంగన్. ౧౦౬౦

తా త్ప ర్య ము .

సముద్రమధ్యమున మనుష్యులకుఁ బోరానిదై నూఱామడ విస్తారముగలదైన ద్వీపముగలదు. అందు మీరు సీతాదేవిని వెదకవలయును.

చం. అదియు తలంబు వధ్యుఁడు దు♦రాత్ముఁడు శక్రసమప్రభుండు నా
నదితిసుతారినేత వసు♦ధాత్మభవాపహృతిరోధి రావణుం
డదయుఁడు గ్రాలు పట్టన మ ♦ చోటను మిక్కిలిజాగరూకు లై
వదలక యింతమాత్రమును ♦ వారక రోయుఁడు మర్కటాగ్రణుల్. ౧౦౬౧

వధ్యుఁడు = వధకు యోగ్యుఁడగువాఁడు, శక్రసమప్రభుండు = ఇంద్రునితో సమానమైన కాంతిగలవాఁడు, అదితి సుతారినేత = దేవతలకు విరోధియైన రాక్షసులకుఁ బ్రభువు, వసుధాత్మ భవాపహృతిరోధి = సీతాదేవిని నిర్బంధమున నుంచినవాఁడు.

తా త్ప ర్య ము .

ఆ ద్వీపమందు వధ్యుఁడును, చెడు మనస్సు గలవాఁడును, ఇంద్రుని తేజస్సుతో సమానమైన తేజస్సుగలవాఁడును రాక్షసరాజును సీతాదేవిని చెఱయం దుంచిన వాఁడును దయలేనివాఁడును నగు రావణుఁడుండు పట్టనము గలదు. కావున వానరులారా! మీరు జాగరూకులై కొంచెమైన విడువక వెదుక వలయును.

వాలివలనఁ దార, తారవలన సుగ్రీవుఁడు తెలిసికొనెనని తలఁచి రామచంద్రమూర్తి యింత తెలిసిన వాఁడవు నాకేమి తెలియదని యెట్లు చెప్పితి వని ప్రశ్నింపలేదు.

సీతాదేవిని హరించిన రావణుఁడు లంకయం దుండుట స్పష్టముగాఁ దెలిసియు నేల నానాదిక్కుల వెదుక వానరులను సుగ్రీవుఁడు పంపెను? దొంగవాఁడు దొంగసొత్తును దనయింటియందే దాఁచియుంచు నని నమ్మరాదు. ఎందైన నితర స్థలముల దాఁచి యుంచవచ్చును. అట్టులే రావణుఁడు చేసియుండవచ్చును. కాలహరణము లేకుండుటకై నలుప్రక్క లొక్క సారిగ వెదకిన నెం దుండినను బయలుపడును.

కం. దక్షిణజలనిధినడుమను, రాక్షసి యంగారకాఖ్య ♦ గ్రాలెడు నదియుః
రూక్షత భూతవ్రాతము, భక్షించును ఛాయ నొడసి♦పట్టి కడంకన్. ౧౦౬౨
రూక్షతన్ = కోపముచే.

తా త్ప ర్య ము .

దక్షిణసముద్రము నడుమ నంగారక యనెడు రాక్షసి కలదు. అది యాకాశమునఁ బోవు వారినీడను బట్టుకొని నిలువవేసి వారిని భక్షించును. కావున దాని

వాతఁ బడకుండఁ దప్పించుకొనవలయును. ఇదియే సింహికయని సుందరకాండమునఁ జెప్పఁబడెను. ఒకదానికే రెండుపేర్లును.

సీ. ఆయెడ జానకి ♦ నరసి హెచ్చరిక మై, నట లేమి నిస్సంశ♦యంబ యనుచుఁ
దోఁచిన నావలఁ ♦ దూర్ణంబ చనుఁ డొక్క,యోజనశత మంను ♦ నొప్పుచుండు
సిద్ధచారణచయ♦సేవిత మై చంద్ర,సూర్యాంశుతులిత మై♦సొబగుమీఱి
యంబుధినీరస♦మావృతమై మింటి, నొరయుకూటములచే ♦ నొఱపు వెలసి
తే. పుష్పితకనామగిరి యొండు ♦ భూధరంబు
కనకశృంగంబు రాయుచుఁ ♦ గమలహితుఁడు
దక్షిణాయనమున వచ్చు ♦ దానిరజత
శిఖరమును గొల్చు శశి కపి♦శ్రేష్ఠులార! ౧౦౬౩

తూర్ణంబ = త్వరగా, తులితమై = సమానమై, కూటములు = శిఖరములు, భూధరంబు = పర్వతము, కమలహితుఁడు = సూర్యుఁడు, రజతశిఖరము = వెండిశిఖరము ఆద్వీపమునందు సీత లేదని మీకు నమ్మకముగాఁ దోఁచినయెడల=సుగ్రీవుఁడు చూచి నపుడు రావణుఁడు లంకయం దుండుట నిజమే. ఇప్పుడును నచ్చటనే యున్నాఁ డని యేమి నిశ్చయము? కావున సుగ్రీవుఁడు రామునితో స్నేహము చేసినపుడు రావణు డుండు స్థలము నాకుఁ దెలియ దనెను. సందిగ్ధవిషయమును స్నేహితునితో నిశ్చయమని యెట్లు చెప్పవచ్చును? అట్లు చెప్పిన నది యెంత యనర్థమునకుఁ గారణ మగును? అయినను ఆ ద్వీపము రావణు వాసస్థాన మగుటను వాని బలమంతయు నక్కడనే యుండుటను సీత నందే యుంచుకొని యుండు నను ప్రబల సందేహము గలదు. ఆ కారణమున నొక్కి చెప్పెను.

తా త్ప ర్య ము .

ఆ ద్వీపమందు సీతాదేవిని రావణుని హెచ్చరికతోఁ జక్కఁగా వెదకి యక్కడ వారు లేరనుట నిశ్చయ మని తోఁచెనేని యావలఁ ద్వరగా నొక్క నూఱా మడ పోయితి రేని యచట సిద్ధులు చారణు లుండు నట్టి సూర్యచంద్ర కిరణములతో సమానమై యందమై సముద్రజలముచేఁ జుట్టబడి యాకాశము దాఁకు శిఖరములు గలిగి పుష్పితక మను పర్వతమొకటి కానవచ్చును. దాని బంగారు శిఖరమును రాచు కొనుచు సూర్యుఁడు దక్షిణాయనమున దాని వెండిశిఖరమునకు వచ్చును. (Tropic of Capricorn అందురు.) దక్షిణాయనమందు దీనికి దక్షిణముగ సూర్యుఁడు పోఁడు.

క. మేలును మఱచినవారలు, కూళలు నాస్తికులు నల్ల♦కుధరముఁ జూడం
జాలరు మీరును శిరములఁ, శైలంబు నమస్కరించి చను♦రోయ నటఁ. ౧౦౬౪

తా త్ప ర్య ము .

పరులు తమకుఁ జేసిన మేలు మఱచినవారు, నాస్తికులు, వంచకులు ఆ పర్వత

మును జూడలేరు. వారి కది కానరాదు. మీరు శిరములచే నా పర్వతమునకు నమస్కరించి యావల వెదకఁబొండు.

సీ. అప్పర్వతము దాఁటి ♦ యరుగఁగఁ బదునాలు,గామడ దుర్ధర్ష ♦ మైనసూర్య
వంత మన గిరి యొప్పు ♦ వైద్యుత మావల, నందు మూలఫలాదు ♦ లారగించి
తేనె లాస్వాదించి ♦ తీరఁ బథిశ్రమ, మావలఁ గుంజర ♦ మనెడిగిరిని
గాంచుఁ డమ్మల విశ్వ♦కర్మ యగస్త్యున, కొక్కమందిరము నిం♦పొదవఁ గూర్చె
తే. నదియు నామడవెడలుపు♦నంతకుఁ బది,యంత లెత్తును గలిగి హే♦మాంచితంబు
దివ్యరత్నోజ్వలం బయి ♦ తేజరిల్లు, దానిఁ గనుఁగొనుఁ డమ్మహా♦ధరమునందు.

వైద్యుతము = విద్యుత్సంబంధమైనది, ఆస్వాదించి = త్రావి, హేమాంచితంబు = బంగారువలెఁ బ్రకాశించునది, ధరము = పర్వతము, పదునాలుగామడ = ఆచ్ఛికద్విగువు కావున నేకవచనము.

తాత్పర్యము.

ఆ పర్వతము దాఁటి పదునాలుగామడ పోఁగా వైద్యుతమైన సూర్యవంత మను కొండ గలదు. అందు మీరు మూలములు పండ్లు తిని తేనెలు త్రావి ప్రయాణశ్రమము దీర్చికొని యావలఁ గుంజర మను పర్వతము చూడుఁడు. ఆ కొండయందు నగస్త్యునకు విశ్వకర్మ బంగారువలెఁ బ్రకాశించుచు నామడ వెడల్పు పది యామడ యెత్తు గలిగి దివ్య రత్నములచేఁ బ్రకాశించు నిల్లు నిర్మించి యిచ్చెను. దానిని జూచుచు నా మహాపర్వతమునందు.

క. భోగిపవాసుకి నిలయము, భోగవతీనామ మొనరి ♦ పురుదుర్ధర్షా
భోగమహాకక్ష్యం బయి, నాగావిత మగుచు నొండు♦నగరం బమరున్. ౧౦౬

భోగిప = సర్పరాజైన, పురు = గొప్పదై, దుర్ధర్ష = సాధింపరానిదై, ఆభోగ విశాలమైన, మహాకక్ష్యము = గొప్ప తొట్టికట్టుగలది, నాగావితము = నాగులచే రక్షింపఁబడినది.

తాత్పర్యము.

గొప్పదియు నితరులకు సాధింపరానిదియు విశాలమైనదియు గొప్ప తొట్టికట్టు గలదియు సర్పములచే రక్షింపఁబడునదియు నగు భోగవతి యను పేరుగల నగరము సర్పరాజైన వాసుకి వాసస్థానము గలదు.

క. అయ్యహినగరాంతరమున, నయ్యెడఁ గలవుచూడు ర♦హస్యతలంబుల్
చయ్యన నవియన్నియు మీ,రొయ్యన నెమకుచును జనఁగ ♦ నురురూపం బై.

తాత్పర్యము.

ఆ పాముల నగరములోపల నందందు రహస్యస్థలములు గలవు. అవి యన్నియు మీరు వెదకుచుఁబోఁగా, గొప్ప యాకారము గలదై.

క. ఋషభాకృతిఁ గన నయ్యెడి, ఋషభాఖ్యధరాధరం బహీనమణిశ్రీ
విషయము దివ్యజ్వలనత్విష మగు గోశీర్షకంబు దీప్తిగలదియున్. ౧౦౬౮

ధరాధరంబు = పర్వతము, అహీనమణి శ్రీవిషయము = గొప్ప రత్నముల కాంతి గల ప్రదేశము, దివ్యజ్వలన త్విషము = దేవతా సంబంధమయిన యగ్ని కాంతి గలది, గోశీర్షకంబు = గోరోచనముయొక్క, దీప్తి = కాంతిగలది.

తాత్పర్యము.

వృషభముయొక్క యాకారము గలిగి గొప్ప మణుల కాంతిగల ప్రదేశము గలదై దేవతాసంబంధమై యగ్ని కాంతిగలదై గోరోచన కాంతిగలదై ఋషభమను పర్వతము గలదు.

సీ. పద్మకశ్యామలవర్ణ మా చందనం, బచ్చట నగ్గిరి వాని నవధరింపుఁ
డంతియకాని మీ రంటఁ బోకుఁడు వానిఁ, గ్రూరగంధర్వులు రోహితాఖ్యు
లార రక్షించెద రనవరతంబును, బభ్రుశైలూషులు శుభ్రశిగ్రు
వులును గ్రామణి నాఁగఁ గలరు గంధర్వేంద్రు, లేవురు సూర్యసమిద్ధతేజు
తే. లందు రవిచంద్రవహ్నిసమాంగు లైన, పుణ్యకర్ములు నివసింతు భూమిగరుసు
గాఁగ రాజిల్లు నగ్గిరిఁ గలరు స్వర్గ,జితులు దుర్ధర్షు లనఘులు సిద్ధకృతులు.

పద్మకశ్యామలవర్ణము = తామర రేకులయు నలుపునైన రంగుగలది, అవధరింపుడు = చూడుఁడు, గరుసు = ఎల్ల, పొలిమేర, స్వర్గజితులు = జయింపఁబడిన స్వర్గము గలవారు.

తాత్పర్యము.

తామరరేకులవన్నె, నీలవర్ణముగల చందనంబా కొండమీఁదఁ గలదు. వానిని మీరు చూడుఁడు. అంతియకాని తాకవలదు. ఏలన వానిని క్రూరులైన గంధర్వులు రోహితు లను గంధర్వులు సర్వదా రక్షించుచుందురు. బభ్రువు, శైలూషుఁడు, శుక్రుఁడు, శిగ్రుఁడు, గ్రామణి యను గంధర్వులైదుగురు సూర్యకాంతి గలవారు సూర్యచంద్రాగ్ని సమానశరీరులు పుణ్యకర్ములు నందు వసింతురు - అది భూమికిఁ బొలిమేర - అనఁగా నావల సముద్రమని భావము - ఆ కొండయందుఁ దమ తపస్సుచే స్వర్గమును జయించినవారు. అలక్ష్యము చేయరానివారు - పాపరహితులు - ఫలించిన కర్మముగలవారు నుందురు.

ఉ. దానిని దాఁటి పోవఁగ సుదారుణమై పితృలోక ముండెడిఁ
గాన మనుష్యకోటికి నగమ్యము నౌ యమరాజధాని య
ద్దానిని జుట్టియుండు భయదం బగుచీఁకటి యంతదాఁకనే
వానరులార! మీరు చనవచ్చును బోవ నసాధ్య మావలన్. ౧౦౭౦

తాత్పర్యము.

దానిని దాఁటిపోయితిరేని యావల భయానకమైన యమలోక ముండును.

కావున మనుష్యుల కా యమరాజధానికిఁ బోవ సాధ్యముగాదు. ఆ నగరము చుట్టు కొని భయంకరమైన చీఁకటి వ్యాపించియుండును. వానరులార! మీ రంతదాఁకఁ బోవచ్చును. ఆవల నసాధ్యము.

క. ఈ నిఖిలము మఱి యిఁక నే, వేనియుఁ దోఁపవలను దోఁప ♦ నేమియు విడకే
మానవపతికాంతను నవ,ధానంబున రోయవలయుఁ ♦ దత్పరమతులై. ౧౦౭౧

తా త్ప ర్య ము.

ఇప్పుడు నేను జెప్పిన సర్వము నేను జెప్పనిది దోవలందుఁ గానవచ్చిన వానిని వేనిని వదలక సీతాదేవిని హెచ్చరికతో వెదకవలయును.

ఉ. మానములోనఁ గంటిని క్షమాసుత నంచు వచించువాఁడు సౌ
ఖ్యాసమభోగవైభవచ♦యంబుల నెప్పుడు మత్సమానుఁడై
వాసిఁ జెలంగుచుండు మఱి♦వానికి నన్యము మత్ప్రియంబు లే
దీ సకలావనిన్ మిగుల ♦ నెక్కుడు దోషియుఁ జుట్ట మయ్యెడిన్. ౧౦౭౨

క్షమాసుతన్ = సీతాదేవిని, సౌఖ్య+అసమభోగ+వైభవచయంబులన్ = సౌఖ్యమునందు, అసమానమైన భోగములందు, వైభవ సమూహములందు, మత్స మానుఁడై = నాతో సమానుఁడై, వాసిన్ = కీర్తిచే.

తా త్ప ర్య ము.

ఒక్క నెలలోపలఁ జూచితిని సీతాదేవి నని వచించినవాఁడు సౌఖ్యములందు అసమాన భోగములందు వైభవములందు నాతో సమానుఁడై కీర్తిచే వెలయును. వానికంటెఁ బ్రియమైనది నా కీ సమస్త భూమండలంబున లేదు. వాఁడిది వఱకు నెట్టి దోషము చేసియుండినను బంధువగుచున్నాఁడు.

క. మీరలు విక్రమసత్త్వో,దారులు సద్వంశభవులు ♦ తతవిపులగుణా
ధారులు జనకసుతామణి, నే రీతిగ నైనఁ గనుఁడు ♦ కృతయత్నుల రై. ౧౦౭౩

విక్రమసత్త్వోదారులు = విక్రమమందు బలమందు గొప్పవారు.

తా త్ప ర్య ము.

వానరులార! మీ రందఱు బలపరాక్రమములందు గొప్పవారు. గొప్ప వంశములఁ బుట్టినవారు. విస్తారమైన మంచి గుణములుగలవారు. కావున నెంత ప్రయత్నము చేసియైన నే విధముననైన సీతాదేవిని వెదకవలయును.

—♦ ౪౨-వ సర్గము. సుగ్రీవుఁడు సుషేణాదులఁ బశ్చిమదిశ రోయఁ బనుచుట. ♦—

తే. హనుమదాదుల నిటు దక్షి♦ణాశ కనిచి, భీమవిక్రముఁడును దన♦మామ యైన
తారతండ్రిని జలదాభుఁ♦జీరి కేలు, మోడ్చి వినయంబు దోఁపఁగ ♦ మ్రొక్కి యనియె.

దక్షిణాశకున్ = దక్షిణదిక్కునకు, జలదాభున్ = మేఘమువంటి కాంతి గల వానిని, చీరి = పిలిచి.

తాత్పర్యము.

హనుమంతుఁడు మొదలగువారిని దక్షిణదిక్కునకుఁ బోవనాజ్ఞాపించి భయంకర పరాక్రమవంతుఁడును దనకు మామయుఁ దారకుఁ దండ్రియునగు సుషేణుని బిలిచి నమస్కరించి యణకువతో నిట్లనియె.

ఉ. ఏచిన భీమవిక్రముని ♦ నింద్రసమద్యుతియుక్తు భూరిధై
ర్యాచలు శౌర్యదర్పగహ♦నాటపరీతు మరీచిపుత్రు మా
రీచుని శేముషీలసద♦రీణచరిత్రు ఖగేంద్రతుల్యు మా
రీచుల శూరులం గపివ♦రిష్ఠుఁడు గాంచి వచించె నీగతిన్. ౧౦౭౫

ఏచిన = అతిశయించిన, భీమ = భయంకరమైన, విక్రమునిన్ = పరాక్రమము గలవానిని, ఇంద్రసమ = ఇంద్రునితో సమానమైన, ద్యుతి= కాంతితో, యుక్తున్ = కూడినవానిని, భూరిధైర్య = విశేష ధైర్యమందు, అచలున్ = పర్వతమువంటివానిని, శౌర్యదర్ప గహనాటపరీతున్ = శౌర్యగర్వముతోఁగూడిన కోఁతులచేఁ జుట్టబడిన వానిని, శేముషి = బుద్ధిబలముచే, లసత్ = ప్రకాశించు, అరీణచరిత్రున్ = ఋజువైన నడవడిగలవానిని, ఖగేంద్రతుల్యున్ = గరుత్మంతునితో సమానుని.

తాత్పర్యము.

అతిశయించిన భయంకర పరాక్రమము గలవానిని ఇంద్రుని కాంతివంటికాంతి గలవానిని విశేషధైర్యమందుఁ బర్వతమువంటి వానిని, శౌర్యగర్వముగల వానరులచేఁ జుట్టఁబడిన వానిని, గరుత్మంతుని వంటి వేగముగలవానిని మరీచి మహర్షి కుమారుని మారీచుఁడను వానిని తక్కిన మారీచు లను శూరులను జూచి సుగ్రీవుఁ డిట్లనియె.

సీ. చనుఁడు సుషేణాది♦వనచరులార, మీ, రెల్లరు శ్రీరాము♦నింతి వెదక
రెండులక్షలు క్రోఁతి♦కాండంబుతోఁ బశ్చి,మముగ సురాష్ట్రంబు ♦ మహితబాహ్లి
కంబు శూరంబు భీ♦మం బను దేశముల్,విపులపురాణజ♦నపదచయము
పున్నాగగహనంబుఁ ♦ బొగడవనంబును, మొగిలికాంతారముల్♦ మొగిని గనుఁడు
తే. పశ్చిమంబుగఁ బోఁ బో నా♦పగలు మునుల
కాననంబులు కొండలు ♦ గహనములును
మరుతలంబులు ఘనశిలా♦మండలములు
వెదకుచును బశ్చిమాంబుధిఁ ♦ గదియఁ జనుఁడు. ౧౦౭౬

జనపదచయము = గ్రామ సమూహము.

తాత్పర్యము.

సుషేణుఁడు మొదలగు వానరులారా! మీ రందఱు శ్రీరామచంద్రుని భార్యను సీతాదేవిని వెదకఁ బోవలయును. మీతోడ రెండు లక్షల కోఁతులను దీసికొనుఁడు, పశ్చిమముగఁ బొండు. అచట సురాష్ట్రము, బాహ్లికము, శూరము, భీమ మను దేశములు విశాలములై చిరకాలమునాఁటి వగు పల్లెలు పున్నాగమను నడవి

పొగడవనము మొగిలియడవులు చూడుడు. పడమరగా బ్రవహించునదులు మును లుండు నడవులు కొండలు అడవులు జలములేని స్థలములు పెద్దతాల దేశములు వెదకుచుం బోయి పశ్చిమ సముద్రముం జేరబొండు.

క. తిమినక్రాయుత మక్షో.భ్యము నీరధిఁ గాంచి తీర♦బహు కేతకిషం
డములం గానుగుఁదోఁపుల, రమియింపుడు నారికేర♦రాజితవనులన్. ౧౦౭౭

తిమినక్రాయుతము = తిములతోను మొసళ్ళతోను విశ్లేషించికూడినది. అక్షోభ్యము = మిగుల లోఁతైనది కావునఁ గలఁపరానిది, కేతకిషండములన్ = మొగిలివనముల గుంపులను, నారికేర = టెంకాయచెట్లచే, రాజిత = ప్రకాశించు, వనులన్ = అడవులను.

తా త్ప ర్య ము.

విశేషముగఁ దిములను చేఁపలచేతను మొసళ్ళచేతను వ్యాపించినదై మిగుల లోఁతుగల సముద్రమును జూచి దాని తీరమం దుండు మొగిలివనంబులందును గానుగ తోఁపులందును టెంకాయ తోటలందును సంతోషముతో సంచరింపుఁడు.

ఉ. అం దనుకూలసంగత మ♦హాద్రివనీనిచయంబులందు శ్రీ
సుందరి జానకిన్ బలని♦షూదనవైరిని రావణాసురున్
బొందుగ రోసి దాఁటి చని♦పూనికమై మురచీపురంబునన్
సుందర మా జటీపురిని ♦ జూడుఁ డవంతిని నంగలోపనున్. ౧౦౭౮

అనుకూల సంగత = ఒడ్డు ననుసరించుకొని యుండు, మహాద్రివనీనిచయంబు లందు = పెద్దకొండలు, అడవులు, వీనియందు.

తా త్ప ర్య ము.

తీరము ననుసరించుకొనియుండు గొప్ప పర్వతములందు అడవులందు సీతాదేవిని నిందవిరోధి యగు రావణుని వెదకుఁడు. అది దాఁటిపోయి మురచీపట్టనము జటీపురము అవంతిని అంగలోపను జూడుఁడు.

సురాష్ట్రము నిప్పుడు సూరత్తందురు (Surat)

చ. పురములు రాష్ట్రముల్ జనులు ♦ పోవఁగరాని వనీతలంబులున్
దొరి తొరి చూచి సింధునది ♦ తోయధిఁ జేరెడు చోటఁ జూడుఁడీ
ధరము మహాద్రుమాళికలి♦తం బురుకూటశతంబు గల్గు నం
బరపరిచుంబి హేమగిరిఁ ♦ బక్షక కేసరియుక్తసానువున్. ౧౦౭౯

తొరితొరి = లెస్సగా, ధరము = పర్వతము, మహాద్రుమాళికలితంబు = పెద్దచెట్లతోఁగూడినది. ఉరుకూట శతంబు = నూఱుగొప్ప శిఖరములతోఁ గూడినది, అంబర పరిచుంబి = ఆకాశమునంటు, పక్షక కేసరియుక్త = ఱెక్కలుగల వానివలె నెగురుచున్న సింహములతోఁగూడిన, సానువున్ = చఱియలుగల దానిని.

తా త్ప ర్య ము.

పట్టనములు, రాష్ట్రములు, మనుష్యులు పోవఁ గష్టములైన యడవులు చక్కఁగా శోధించి చూచి సింధునది సముద్రమునందుఁ బడెడిచోటఁ జూడుఁడు. (ఇది సింధునది దక్షిణపు లోయల వెంటనుండు హాల పర్వతమునకు (Hala Range) సరిపోవుచున్నది.) అచట పెద్ద మ్రాఁకులు అనేక శిఖరములు గలిగి యాకాశము నంటు హేమగిరిని తెక్కలుగల వానివలె నెగురు సింహములు గల చఱియలు గల దానిని చూడుఁడు.

క. తిములన్ మత్స్యంబుల నా,గములం గుధరాగ్రకూట♦గతనీడములన్
గుములుగఁ గొని చని యా సింగము లుంచును దిరుగు దృ ప్త♦కరు లచ్చోటన్.

కుధరాగ్రగత = పర్వతము కొన లందుండెడి, నీడములన్ = పక్షిగూండ్ల యందు.

తా త్ప ర్య ము .

తిములను, చేఁపలను, ఏనుఁగులను దీసికొనిపోయి యా సింహములు కొండ కొనల నుండు గూండ్లయం దుంచును. అచ్చట మదించిన యేనుఁగులు గలవు.

చ. అనఘచరిత్రులార! గిరి♦యంతయు నారసి వేగ నూఱుయో
జనములు గల్గి చూడఁగ న♦సాధ్యతరం బగు పారియాత్రకాం
చనగురుశృంగముం గనుఁడు ♦ స త్త్వగరిష్ఠులు కామరూపులం
దనలసమాను లుందురు ని♦రంతర మిర్వదినాల్గుకోటులున్. ౧౦౮౧

తా త్ప ర్య ము.

పాపరహితమైన నడవడి గల వానరులారా! మీ రా పర్వతము నంతయు వెదకి త్వరగా నూఱామడ పోయి చూచుటకే యసాధ్యమగు పారియాత్ర పర్వతముయొక్క గొప్ప శిఖరమును జూడుఁడు. అందు మిగుల బలవంతులు కామరూపులు అగ్నితో సమానమైన తేజస్సు గలవార లిర్వది నాల్గు కోటు లుందురు.

పారియాత్ర పర్వతము. ఇది పశ్చిమ రాజపుత్ర స్థానమున నుండు పారియాత్రము గాదు. ఇది యిప్పటి (Sulaiman Range) సోలెమాన్ పర్వతములై యుండవలెను.

క. గంధర్వులు దృఢవిక్రమ,సింధురశాత్రవులు వారిఁ ♦ జేరకుఁ డీరల్
బంధురఫలమూలములు మ,దాంధతఁ గాచెదరు వార♦ లంటకుఁ డెవియున్.

దృఢ విక్రమ = విశేష పరాక్రమమందు, సింధుర శాత్రవులు = సింహములవంటి వారు, మదాంధత = మదముచేఁ గన్నులుగానక.

తా త్ప ర్య ము .

సింహముల పరాక్రమము వంటి పరాక్రమము గలవారు గంధర్వులు కలరు. వారిని మీరు సమీపింపవలదు. అందలి పండ్లను మూలములను వారు గర్వాంధులై

కాచియుందురు. ఇతరులను దీసికోనీయరు. గంధర్వులు=వీరు మనుష్య గంధర్వులు, వీరి దేశము గాంధారదేశము. ఇది యిప్పటి (Afghanistan) ఆఫ్ఘనిస్థానము. ఇందు గాంధారము కాండహారే, (Candahar) అను పేరువలనఁ దెలిసికొన వచ్చును.

క. సీతాపతి నట రోయుఁడు, భీతిలఁ బని లేదు మీా క♦పిత్వమువలనన్
పూతవిదూరజవర్ణా,భా తతసద్వజ్ర దృఢము♦హాగిరి యొప్పన్. ౧౦౨౩

పూత = పవిత్రమైన, విదూరజ = వైడూర్యముల, వర్ణాభ = కాంతితో సమానమైన కాంతిగలదియు, ఆతత = విస్తారమైన, సద్వజ్ర = మంచి వజ్రములచే.

తా త్ప ర్య ము .

అచ్చట మీారు సీతను వెదకుఁడు - ఆ ప్రక్కకు బోవలదంటిరే, ఇఁక సీత నెట్లు వెదకవలయు నని సందేహింపకుఁడు - మీారు కోతులు వనములందు సంచరించువారు కావున వారు మి మ్మేమియు ననరు. పవిత్రమైన వైడూర్యకాంతిగలదై మిగుల వజ్రములచే దృఢమైన పెద్ద కొండగలదు.

క. నానాద్రుమలతికాసం,తానం బది దాని వజ్ర♦ధర మండ్రు సుఁడీ
మానుగ శతయోజనసమ, మైనేల యెసంగుచుండు ♦ నతిచిత్రముగన్. ౧౦౨౪

తా త్ప ర్య ము .

దాని పేరు వజ్రధరము - అది పెక్కులు చెట్లగుంపులు తీఁగలగుంపులు కలది - అందుఁ జిత్రమై నూఱామడ చదరమైన నేలగలదు.

సీ. ఆవలఁ గల గుహ ♦ లన్నియు వెదకి పోఁ,వంగఁ గంధిని జతుర్థ ♦ భాగమునను
జక్రవంతం బను♦శైలవరం బుండు, నందుఁ దోఁచెడి సహ♦స్రారచక్ర
మది విశ్వకర్మజం ♦ బది గాచు దానవ,వర్యు హాయగ్రీవుఁ ♦ బంచజనునిఁ
జంపి మురారి త♦చ్చక్రంబు శంఖంబుఁ, గైకొనె నా సాను♦కందరముల
ఆ. వెదక వలయు సీత ♦ విబుధారి నావల, షష్టియోజనముల వి♦శాల మైన
రజతశృంగయుతవ♦రాహాఖ్యపర్వతం,బుండు వార్ధిలోన ♦ గండు మీారు. ౧౦౨౫

కంధిని = సముద్రమందు.

తా త్ప ర్య ము .

దాని కావలఁ గల గుహాలన్నియు వెదకి పోఁగా సముద్రమునందు నాలవభాగమునఁ జక్రవంతమను పెద్ద పర్వతముగలదు. అందు విశ్వకర్మ రచించిన సహస్రారచక్రముగలదు. దానికి వేయంచులు గలవు. దానిని రక్షించు హాయగ్రీవుని బంచజనుని జంపి విష్ణువు హాయగ్రీవుని చక్రమును పంచజనుని వెన్నెముకయగు శంఖమును గైకొనెను. పంచజనుని వలనఁ గలిగినది కావుననే పాంచజన్య మని శంఖమునకుఁ బేరు గలిగెను. ఆ చఱియలయందుఁ గల గుహాలయందు సీతను రావణుని వెదకవలయును. ఆవల నఱువది యామడ పోయితిరేని సముద్రమందు విశాలమై వెండి శిఖరములతోఁ గూడిన వరాహ పర్వతము గలదు.

క. ఆతతకుధరంబునఁ బ్రాగ్జ్యోతిషపుర మొప్పు నందుఁ ♦ గ్రూరాత్ముండై
దైతేయుఁడు నరకుఁడు ని,ర్భీతిన్ వసియించుఁ దద్గి♦రీకటకమునన్. ౧౦౨

తా త్ప ర్య ము.

విశాలమైన యీ పర్వతమందు బ్రాగ్జ్యోతిషమను పట్టనము గలదు. అందుఁ గ్రూరమైన మనస్సుగల నరకుఁడను రాక్షసుఁడు నిర్భయముగ వసించుచుండును. ఆ గుహాప్రదేశ మందును,

ఈ నరకుఁడు కృష్ణమూర్తి చంపిన నరకుఁడు కాఁడు. వీని వంశమునఁ బుట్టిన మఱి యొకఁడు.

ఈ ప్రాగ్జ్యోతిష మిచ్చటఁ జెప్పఁబడి యుండరాదు. ఇది లేఖకకృతదోషము. ప్రాగ్జ్యోతిష మనునది తూర్పున నున్నది. దీని కిప్పటి పేరు ఆసాము. (Assam)

సీ. కలయఁజూచుచుఁబోవఁ ♦ గాంచనాంతరనిర్ద,రంబును మఱియుఁబ్ర♦స్రవణయుతము
నగు సర్వసౌవర్ణ ♦ మనుకొండ గల దందు, జలపాతమునకు మా♦ఱెలుఁగు లిచ్చు
కరిసింహశార్దూల♦కిరివితానంబులు, హరిహయు నెచ్చట ♦ నమరు లెల్ల
నభిషిక్తుఁ జేసి రా ♦ యవనీధరంబచ్చో, మేఘవంతం బని ♦ మెప్పు గాంచె

ఆ. నదియు దాఁటి పోవ ♦ నఱువదివేలభూ,ధరము లుండు నందుఁ ♦ దరణివర్ణ
కనకమయకుజాళి ♦ గ్రాలుఁ బుష్పితమయి, చూడఁజూడ నింపు ♦ సొంపుఁగూర్చు.

కాంచనాంతర నిర్దరంబు = బంగారు మయమైన లోపలి రాలసంధి భాగములు గలది. ప్రస్రవణయుతము = సెలయేళ్లతోఁ గూడినది. జల పాతమునకున్ = నీళ్ల దూఁకుడులకు, కిరి = అడవిపందుల, వితానంబులు = సమూహములు, హరి హయున్ = ఇంద్రుని, అవనీధరము = కొండ, తరణివర్ణ =సూర్యకాంతిగల, కనకమయ= బంగారుమయమైన, కుజాళి = చెట్ల వరుసలు, పుష్పితములు=పూచినవి.

తా త్ప ర్య ము.

కలయఁ జూచుచుఁ బోవఁగా బంగారుమయమైన లోపలిరాల సంధి భాగములు గలదియు సెలయేళ్ళుగలదియు సర్వసౌవర్ణమను పేరుగల కొండగలదు. అందు నీళ్ళదూఁకుడుల ధ్వనికి నేనుఁగులు సింహములు పులులు పందులు ప్రతిధ్వను లిచ్చుచుండును. ఇంద్రుని దేవతలెల్ల నెచ్చట నభిషిక్తునిజేసిరో యీ పర్వతము మేఘవంత మని పేరొందెను. దానిని దాఁటిపోయితి రేని అఱువదివేల కొండలు గలవు. అందుఁ జూచుట కందమై సూర్యకిరణముల కాంతిగలిగి బంగారుమయమైన చెట్లు పూచి యుండును.

ఉ. వానికి మధ్యభాగమున ♦ వాలెడి నుత్తర మేరుపర్వతం
బా నగరాజు జూచి కమ♦లాప్తుఁడొసంగె వరంబు బ్రీతుఁడై
మానితులై త్వదాశ్రయులు ♦ మాపును జేపును గాంచనాంగముల్
పూనుచు మత్ప్రసాదమునఁ ♦ బొల్చుచు నుందురు శైలసత్తమా! ౧౦౩

కాంచనాంగముల్ = బంగారువంటి దేహములు.

తాత్పర్యము.

ఆ పర్వతముల మధ్యప్రదేశమందు నుత్తరమేరుసావర్ణి యను పర్వతముగలదు. ఆ కొండను జూచి సూర్యుఁడు పర్వతోత్తమా! నిన్నాశ్రయించినవారు ఉదయమున సాయంకాలమున నా యనుగ్రహమున బంగారు కాంతిగల దేహముగలవా రగుదురు.

క. నీపయి వసించు దేవక, లాపము గంధర్వముఖులు ♦ లలితప్రభచే
దీపితతను లై శుభర, క్తాపఘనస్ఫూర్తి నుందు ♦ రద్రివతంసా. ౧౦౮౯

కలాపము = సమూహము. దీపితతనులై = ప్రకాశించు దేహము గలవారై, శుభ = బాగైన, రక్త = ఎఱ్ఱని, అపఘనస్ఫూర్తి=దేహకాంతి గలవారై, అద్రివతంసా=పర్వత శ్రేష్ఠమా.

తాత్పర్యము.

నీ మీఁద వసించుచున్న దేవసమూహము గంధర్వులు మొదలగు వారు మనోహరకాంతిచేఁ బ్రకాశించు దేహములు గలవారై పర్వతోత్తమా! యెఱ్ఱని దేహకాంతి గలవారై యుందురు.

శా. విశ్వాదిత్య మరుద్వసుప్రముఖులుౕ ♦ విఖ్యాతులౌ నిర్జరుల్
శశ్వద్భక్తి ద్వితీయసంధ్య దినముం ♦ జామీకరాద్రిస్థు స
హస్రాంశుం గొల్తురు భూతకోటికి సహ♦స్రాంశుం డదృశ్యాంగుఁడై
విశ్వంబెల్లను జీఁకటిన్ మునుఁగఁ దా ♦ వేంచేయు నస్తాద్రికిౕ. ౧౦౯౦

విశ్వ = విశ్వదేవతలు. వీరు పదుముప్వురు- ఆదిత్యులు = వీరు పండ్రెండుగురు, మరుత్తులు = వీ రేడుగురు, వసువులు = వీ రెనిమిదిమంది, ప్రముఖులు = మొదలగు వా రనుటచే నేకాదశ రుద్రులును గ్రహింపనగు, ద్వితీయ సంధ్య=సాయంకాలమున, రాత్రి పగలు కలియు కాలములు రెండే, మొదటిది ప్రాతస్సంధ్య, రెండవది సాయంసంధ్య, శశ్వత్+భక్తిౕ = పలుమాఱు మీఁద మీఁదఁ గలిగెడి భక్తిచే, చామీకర+అద్రిస్థుౕ = బంగారు కొండయం దుండువానిని, సహస్రాంశ్వౕ= సూర్యుని, సహస్రాంశుఁడు = వేయి కిరణములు గలవాఁడు, సూర్యుడు. అదృశ్యాంగుఁడై = కానరాని దేహముగలవాఁడై, అస్తాద్రికిౕ= క్రుంకుమలకు, వేంచేయును= పోవును, ఇది మిశ్రగ్రామ్యము, రూ. విజయముచేయు, విజయంచేయు, విచ్చేయు, "తన వేంచేయు పథంబుఁ బేర్కొనఁడు" ఇత్యాది ప్రయోగములు గలవు. ఈ శబ్దములకు రాక పోకలయందు రెంట నర్థముగలదు. పూజ్యులయందు మాత్రమే ప్రయుక్తము.

తాత్పర్యము.

విశ్వులు - ఆదిత్యులు - మరుత్తులు - వసువులు మొదలైన వారును బ్రసిద్ధులైన దేవతలును సాయంకాలమందు భక్తితో బంగారు కొండమీఁదనుండు సూర్యుని సేవింపవత్తురు. ప్రాణుల కందఱకుఁ గానరానివాఁడై సూర్యుఁడు లోకమంతయుఁ జీఁకటిలో మునుఁగునట్లు పడమటి కొండకుఁ బోవును.

సీ. పదివేలయామడ ♦ భాస్కరుం డర్ధము,హూర్తంబు పోయి శి♦లోచ్చయంబుఁ
జేరు నా పర్వత♦శృంగాగ్రమున సూర్య,సన్నిభ మైన ప్రా♦సాదనిచయ
భరితమహాదివ్య♦భవనంబు రాజిల్లు, విశ్వకర్మకృత మై ♦ వివిధపక్షి
సంకలితం బయి ♦ చారుభూజాతశో,భిత మయి వరుణని♦వేశ్మ మొనరు

తే. న స్తగిరిమేరుగిరులకు ♦ నంతరమున, శ్రీసువర్ణమయంబును ♦ జిత్రవేది
కంబు దశశిరమును నయి ♦ క్రాలు నొక్క, తాలవృక్షంబు లోచనో♦త్సవముగాఁగ.

అర్ధ ముహూర్తంబు = ఒక గడియ, శిలోచ్చయంబుర్ = అస్తాద్రిని, ప్రాసాద నిచయ = మేడల సమూహముతో, భరిత = నిండిన, మహాదివ్యభవనము = గొప్ప దివ్యమైన యిల్లు.

తాత్పర్యము.

ఒక గడియకుఁ బదివేల యామడ వంతున పోయి సూర్యుఁడు పడమటికొండఁ జేరును. ఆ పర్వత శిఖరము కొనయందు సూర్య కాంతి గల మేడలతో నిండిన దివ్యమైన గొప్ప యిల్లు గలదు. అది విశ్వకర్మ నిర్మితము. నానావిధ పక్షులు గలది, అందమైన చెట్లచేఁ బ్రకాశించు వరుణుని గృహ మొప్పును. అస్తపర్వతమునకు మేరుపర్వతమునకు నడుమ బంగారు మయమై చిత్రములైన యరుఁగు కలిగి పది తలలుగల యొక తాలవృక్షము చూడఁ గన్నులకు సంతోషకరమై కానవచ్చును.

సీ. అతులతపోనిష్ఠుఁ డధికధర్మిష్ఠుఁడు, మేరుసావర్ణినా ♦ పేరఁ బరఁగు
బ్రహ్మతుల్యుం డందు ♦ రాజిల్లు నొక ఋషి,నాతనిఁగని మ్రొక్కి ♦ యంబుజాక్షి
వార్త మీ రడుగుఁడు ♦ వానరులార ని,శాంతంబునను నీర♦జాతహితుఁడు
తిమిరంబు నిండాఁకఁ ♦ దేజంబునను జోపి, య స్తశైలంబున ♦ కరుగుచుండు

ఆ. నెఱుఁగ రాదు మనకు ♦ నే మున్నదో యట,పై నభాస్కరంబు ♦ పరఁగు నిరులు
నస్తశిఖరి దాఁక ♦ నరిగి రావణు నిల,యంబుఁ గాంచి సీత ♦ నరసి రండు.౧౧౯-౨

నిశాంతంబునను = ఉదయమున, తిమిరంబునర్ = చీఁకటిని; జోపి = తఱిమి, అభాస్కరంబు = సూర్యసంచారము లేనిది, ఇరులు = చీకట్లు.

తాత్పర్యము.

అచ్చట నసమానమైన తపోనిష్ఠగలవాఁడును మిగుల ధర్మాత్ముఁడును బ్రహ్మతో సమానమైనవాఁడు మేరుసావర్ణియను ఋషియుండును. ఆయనకు మీరు నమస్కరించి సీతాదేవి వార్త యడుగుఁడు. సూర్యుఁ డుదయకాలమునఁ దన తేజస్సుచేఁ జీఁకట్లు నింతవఱకుఁ దఱిమి పడమటికొండకుఁ బోవుచుండును. ఆవల సూర్యరశ్మిలేదు. కావున నే మున్నదో తెలియరాదు. చీఁకట్లు వ్యాపించియుండును. అంతవఱకు సీతను వెదకిరండు.

The reader should notice here that Valmiki makes mention of a few places only, most of which are mountains, in the West and ends with the poetic land of the setting sun. This shews that little was known at the time of famed nations of the west, in spite of the great antiquity claimed by Egypt, Assyria and Greece and one might be led to think that these nations had not yet risen to power in the time of Valmiki, or if they existed at all, communication was not yet opened between them and the Indian Aryans. An. Geo. P. 63 Note

చ. ఒక నెలలోన రావలయు ♦ నుండఁగ రా దటమీఁద నెవ్వఁడేన్
వెకలితనంబునన్ సిలిచె♦ నేనియు వధ్యుఁడు వాఁడు మీరలుం
బ్రకటపరాక్రమాఢ్యులరు ♦ మామ సుషేణుఁడు వచ్చు వెంట నా
వికటబలాఢ్యు నాజ్ఞమెయి ♦ వే చనుఁడీ గురుఁ డీతఁ డెల్లకున్. ౧౦౯౩

వెకలితనంబునన్ = తెలివిమాటలచే, ఎల్లకున్ = ఎల్లరకు, అందఱకు, ఎల్ల! వినఁగన్- ఎల్ల శిష్యులు లోనగు ప్రయోగములు గలవు.

తా త్ప ర్య ము.

ఒక నెలలోపల రావలయును. అంతకుమీఁద నెవ్వఁడేని తెలివిమాలి రాక పోయెనా వాఁడు చంపఁబడును. మీ రందఱు ప్రసిద్ధ బలపరాక్రమ సంపత్తిగలవారు. మీ వెంట మా మామ సుషేణుఁడు వచ్చును. ఆ ప్రసిద్ధబలుని యాజ్ఞప్రకారము మీరు వర్తింపుఁడు. మీకందఱకు నాయనయే పెద్ద.

క. ఈతని ముఖ్యునిఁగాఁ గొని, సీతాసతి వెదకి కార్య♦సిద్ధుల రయినన్
భూతలమునఁ బ్రతికృతిచే, ఖ్యాతిం గనవచ్చుఁజుఁడీ కృ♦తార్థుల మగుచున్.

ప్రతికృతి = ప్రత్యుపకారము- కృతార్థులము = చేయవలసిన కార్యములఁ జేసినవారము.

తా త్ప ర్య ము

ఈయనను మీరు పెద్దగా గ్రహియించి కార్యము సాధించితిరా, మనము ధన్యులమై భూతలమున రామకార్యనిర్వాహకులను గీర్తి సంపాదింపఁగలము.

తే. చెప్పినది గాక యింకేమి ♦ చేయఁ దగిన, యట్టి దున్నను దేశకా♦లార్థహితము
గాఁగ యోజించి చేయుఁడీ ♦ కపివరేణ్యు,లార! పశ్చిమదిక్కుగా ♦ నరుగుఁ డీరు.

తా త్ప ర్య ము

నేను జెప్పినంతమాత్రము గాక దేశము కాలము ప్రయోజనము మేలు యోజించి సందర్భానుసారముగఁ జేయవలసిన దంతయుఁ జేయుఁడు. మీరు పశ్చిమ దిశగాఁ బొండు.

—♦ ౪౩-వ సర్గము. సుగ్రీవుఁడు శతవలిని నుత్తరమున రోయఁ బనుచుట ♦—

క. తనమామఁ బశ్చిమంబుగఁ, బనిచి వనచరేశ్వరుండు ♦ బలసంపన్నున్
ఘను శతవలిఁ గని తనకును, నినకులునకు హితముగాఁగ ♦ ని ట్లని పలికెన్. ౧౦౯౫

తా త్ప ర్య ము.

తన మామయగు సుషేణుని బశ్చిమంబుగాఁ బంపి మిగుల బలవంతుఁడైన శతవలి యనువానిని జూచి రామచంద్రమూర్తికిఁ దనకు మే లగునట్లు వచించెను.

సీ. ప్రాలేయకుధరంబు ♦ రాజిల్లు నుత్తర, దిక్కుగా శ్రీరాము♦దేవి వెదక
నీ యట్టివానరుల్ ♦ నినుఁ గొల్వనూఱువేల్, యమతనూజులతోడ ♦ నరుగవయ్య
యీకార్యమును దీర్చి♦ధర్మాత్మకాంతునకుఁ బ్రియం, బొరఁజేసితి మేని ♦ యప్పువలన
విడువంగబడియర్థ♦విదులందుఁ గృతకృత్యు,లందు నుత్తముల మై♦యమరఁ గలము
ఆ. మనకు మున్ను ప్రియము ♦ జనకజాపతిగూర్చెఁ, బ్రతిహితంబు సేత ♦ ప్రథయొసంగ
జన్మ మగచరేంద్ర! ♦ సఫలంబు నొనరింప, వెరవుగాదె శుభవి♦వేకధుర్య! ౧౯౭

ప్రాలేయ కుధరంబు = మంచుఁగొండ, హిమవత్పర్వతము. అర్థవిదులు = కార్య ప్రయోజనము తెలిసిన వారియందు, కృతకృత్యులందుఁ = చేయవలసిన దానిని జేసిన వారియందు, ప్రథ=కీర్తి.

తా త్ప ర్య ము.

ఉత్తరమున హిమవత్పర్వతము గలదు, నీ వా దిక్కుగా నీవంటి వారిని నూఱువేల వానరులను యమపుత్రులతోడ సీతాదేవిని వెదకఁ బొమ్ము. ఈకార్యము సాధించి రామచంద్రమూర్తికి నిండు సంతోషముఁ గలిగించితి మేని ఋణము దీర్చుకొన్న వారమై చేయవలసిన కార్యము తెలిసిన వారియందును జేయవలసిన కార్యము జేసినవారలందు నుత్తము లను కీర్తిగల వార మగుదుము. మనకు రామచంద్రమూర్తి మేలు చేసెను. కీర్తి గలుగు నట్లు, మన జన్మము సార్థకమగునట్లు బదులు మేలు సేయఁదగిన యుపాయ మిదికదా.

క. ఉపకారి గానివానికి, నుపకారముఁ జేయ జన్మ ♦ మొప్పు సఫలమై
యుపకారికి నుపకారముఁ, గపివర్యా! చేయఁ జెప్పఁ♦గా వలయు నొకో. ౧౯౮

తా త్ప ర్య ము.

ఉపకారము చేయని వానికే యుపకారము చేసిన జన్మము సఫలమగును. ఇఁక నుపకారము చేసిన వాని కుపకారము చేయుట యావశ్యక మని చెప్పవలయునా?

చ. ఇది మది నుంచి రాము జల♦జేక్షణ జానకి యేమిపద్ధతిన్
విదితగ నొనో యట్టిగతి ♦ పీడక మీరు చరింపఁగాఁ దగున్
సదమలచిత్తులార! యశ♦శంబు హితైషుల కొట మీరలే
చదురున నైన నీ నృపతి♦సత్తము కార్యముఁ దీర్పఁ బోడి యా. ౧౯౯

విదిత = తెలియఁబడినది, హితైషులు = నామేలు కోరువారు, చదురున = నేర్పున, చతుర శబ్దభవము.

తాత్పర్యము.

ఈ విషయము మనస్సునం దుంచుకొని యే విధముగ జరించిన సీత కాన వచ్చునో యా విధమున మీరు వర్తింపవలయును. నిర్మల మనస్సు గలవారలారా! ఎల్లవేళల నామేలు మీరు గోరు వారగుటచేత మీ నేర్పంతయుఁజూపి రామచంద్రమూర్తి కార్యము నెరవేర్ప ధర్మమగును.

ఆ. ఎల్లభూతములకు ♦ నీతండు పూజ్యుండు, రాముఁ డహితజనపు♦రంజయుండు
మహితకరుణ గలఁడు ♦ మనమీఁదఁ గావున, వనుల గిరుల వెదక ♦ వలయు సీత.

అహిత + పురంజయుండు = శత్రువులపాలికి రుద్రుఁ డగువాఁడు, త్రిపురాసురుల దహించినవాఁడు. శివుఁడు పురంజయుఁడు.

తాత్పర్యము.

ఈ రామచంద్రమూర్తి మనకు మాత్రమే కాదు, సమస్త ప్రాణులకుఁ బూజింపఁదగినవాఁడు- శత్రువులపాలికి రుద్రునివంటివాఁడు. మిత్రులగు మనయందు మిగుల దయ గలవాఁడు. కావున సీతాదేవిని నడవులందుఁ గొండలందు వెదక వలయును.

సీ. మెలపునఁ జని మీరు ♦ మ్లేచ్ఛదేశంబున, శూరసేనపుళింద♦ధారిణులను
బ్రస్థర మద్రక ♦ భరత కురూర్వులఁ, గాంభోజ యవన శ♦కంబులందు
నారట్ట బాహ్లీక ♦ పౌరవ టంకణ, ఋషికంబునను జీన♦విషయములను
బరమచీన నిహార ♦ దరద తలంబులఁ, బ్రాలేయపర్వత♦భాగములను
తే. దేవదారు వనంబులఁ ♦ దేజు మిగుల, లోధ్రపద్మక షండాళి ♦ లోలనేత్ర
సీత వెదకంగ వలయు దు♦ర్నీతుఁ డైన, పంక్తికంఠునితోఁ గపి♦ప్రముఖులార!

తాత్పర్యము.

హెచ్చరికగాఁబోయి మ్లేచ్ఛదేశమునందు శూరసేన, పుళింద, ప్రస్థర, మద్రక, భరత (హస్తినాపుర) దక్షిణ కురుభూములందుఁ, గాంభోజ, యవన, శక దేశంబులందు ఆరట్ట (Herat), బాహ్లీక (Balkh), పౌరవ, టంకణ ఋషిక దేశములందుఁ జీన దేశమందు బరమ చీనయందు (Manchuria-Mangolia) నిహార దరద ప్రదేశములందు హిమవత్పర్వత ప్రాంతంబులందుఁ గల దేవదారు వనములందు లొద్దుగలు పద్మకాష్ఠములు నుండు వనములందు సీతాదేవిని దుర్నీతి పరుఁడైన రావణుని వెదుకవలయును.

మ్లేచ్ఛదేశము = ప్రత్యంతో మ్లేచ్ఛదేశస్స్యాత్ అని యమరకోశము, భారత వర్షము యొక్క తుదనుండు శిష్టాచార రహితమైన కామరూపాది దేశము మ్లేచ్ఛదేశమనంబడును. 'చాతుర్వర్ణ్య వ్యవస్థానం యస్మిన్ దేశే నవిద్యతే మ్లేచ్ఛదేశస్సవిజ్ఞేయ ఆర్యావర్తస్తతంపరః' ఆర్యావర్తదేశమున కావల చాతుర్వర్ణ్య విభాగములేని దేశము మ్లేచ్ఛదేశము.

'గోమాంస భక్షకో యస్తు విరుద్ధం బహుభాషతే సర్వాచార విహీనశ్చ మ్లేచ్ఛ ఇత్యభిధీయతే॥' బోధాయనుఁడు. ప్రస్థలులు, మద్రిలు, గాంధారులు, ఆరట్టుభాసులు, వసాతులు, సింధులు, సౌవీరులు, పరమనీచాతినీచాచారములు గలవారుగ భారతమునఁ జెప్పఁబడినారు. ఈ జాతుల స్త్రీలు కలియుదురుకొలఁది మన దేశంబునఁ బుట్టఁగల స్త్రీలకంటెఁ బరమ నీచలుగాఁ జెప్పఁబడినారు. వీరి విషయము భారతంబునఁ గర్ణపర్వంబునఁ గర్ణుని రెండవనాఁటి యుద్ధమునఁ గర్ణశల్య సంవాదంబున రెండధ్యాయంబుల గననగు రెండధ్యాయంబుల నందుదానిని తిక్కన రెండు పద్యములలో ముగించెను. వానివలన వారి నడవడి యెట్టిదో యూహింపవచ్చును.

సీ. విను పాపదేశసంజనితుండ వగునీకు, దుర్బుద్ధిగాక సద్బుద్ధిగలదె
క్షత్రియాధమ! నీచ! కలదు లోకంబున, నాబాల గోపాల వాక్యమైన
మతి కుటిలుండు సంగతుఁడు గాఁడేమిటఁ, జెలికి గీడొనరించుఁ జెట్టవలుకు
దుష్టాత్మకుఁడు గడుఁ గష్టుఁడు మద్రకుం, డనునంతవట్టుఁ బ్రత్యక్షమయ్యె
ఆ. వావిలేక యెల్ల వనితలుఁ బురుషులు, గలయ మీకు నెగ్గుగాకయుండు
మున్నుగల్గు పినపఁజన్నుఁబాలై పెను, గుదుకు సెప్పనేల గుణము లింక.
కం. పలువురకుఁ బుట్టి నిచ్చలుఁ గలు ద్రావుచుఁ బెరిఁగి యెట్లు గఱతురు శీలం
బులు నుచితము లగు భాషణములు నీ విమ్మాటలుడిగి పొదపొద మనికిన్.
—భార. కర్ణ. ద్వితీ. 47-48 ప.

కాంభోజులు = The Kambhojas are said to be the people of Arachosia famous for their horses. Kambhoja was probably situated somewhere north of the Hindu Kush and Kashmere. Prof. Lassin surmises that this name is etymologically connected with Combyses which in the cunciform inscription of Bhistan is written within Ka (m) bujia, Anci. Geo.

యవనులు, శకులు :—

The *Javanas* probably migrated westwards and spread over Asia Minor and Greece in ancient times.

According to Greek history' *Ion*, King of Helice aided the Athenians in their war against *Elesinians* and defeated them. "The Athenians sensible of his services invited him to come and *settle among them*, and the more strongly to show their attachment to him, *they assumed the name Ionians*." (Vide Lempriere's Class. Dict). The *Ionians* were subsequently driven out of *Aegialus* by the *Acheans* and migrated into Asia-minor, 60 years after the return of the *Herachidae*, (B. C. 1044). The Confederacy of *Ionia* in Asia-Minor consisting of 12 states *among which were Priene, Miletus, Ephesus, Phocia, Samos* and *Symrona* flourished for long time till their subjugation by Crasus, King of Lydia" Ibid.

It is thus evident that the *Javans* were originally an Asiatic people, who migrated from the East and at length came to be known as the Greeks under the generic name of *Ionians*. *The Sakas*—They were

according to Schlegel, nomad tribes, inhabiting Central Asia, the *Scythes* of the Greeks.

They were a remarkable people who overran and extended over Northern Asia and Europe. "Scythians made several eruptions upon the more southern provinces of Asia especially B. C. 624 when they remained in possession of Asia-Minor for 28 years," and we find them at different periods extending their conquests in Europe and penetrating as far as Egypt. Lempriere.

"These people, the *Sakas* and *Sacae* of classical writers, the Indo-Scythians of Ptolemy, extended along the west of India from Hindu Kush to the mouths of the Indus." Wilson. They invaded and settled in the north-west territories of India, and were thus known as Indo-Scythians. They were encountered and kept back by king *Vikramaditya* of Ojien (*Ujjayani*) the victor city, known as *Sakari* the Vanquisher of the *Sakas*, in the first century before Christ. Their progress was further effectually checked in the tine of King Salivahana, whence the *Sakavda* era. (A. D. 78) was started. (Conningham and Dawson)

The Varadas--The Bengal recension has Daradas instead. They are said to be the *Dards*, whose name is still retained in modern Durdistan along the course of the Indus, above the Himalayas, just before it descends to India." Griffith An. Geo. P. 65

కైలాసంబు. The *Kailasa* mountain believed to be the abode of Siva, the tutelary God of the Snowy Range of Central Asia, and the wealth God Kubera, was to the north of the Himalayas. It would appear to correspond with the Kwenlun range, which extends northwards and connects with the Altai chain. The route indicated must have been by the south skirts of the desert, towards the west, to pass by the Kailas Range. An. Geo. P. 66 Note.

క. సోమాశ్రమంబుఁ గనుఁగొని, భూమీధరవరముఁ గాళ♦మును గని యవలన్
భూమిజను జక్క వెదకుఁడు, ధీమసమునఁ దటదరీప్ర♦దేశములందున్. ౧౧౦౨

తాత్పర్యము.

సోమాశ్రమము గాళపర్వతము నావల ధీరులరై యేళ్ళయొడ్డుల గుహల సీతను వెదకవలయును.

సీ. ఆ పర్వతము దాఁటి ♦ యటపోవఁగ సుదర్శ, నాఖ్యపర్వత ముండు ♦ నది తిరింప
నానాశకుంతవి♦తానసమాకీర్ణ, దేవసఖాద్రియుఁ ♦ దేజరిల్లు
నావల శతయోజ♦నాయత దేశ మ,గ్రావశైవాలినీ♦క్ష్మాజ మగుచు
సత్వశూన్యం బయి ♦ సాగుచు నుండు నా, కాంతారమును వేగ ♦ గడిచి చనినఁ
తే. దోఁచుఁ గైలాసశైలంబు♦తోలఁచు వెతల,నచటఁ బాండుర మేఘాభ♦మతులకనక
మండితము శ్రీదభవనంబు♦పాండురాభ్ర,కాంతిఁ బొలుపారెడిని విశ్వ♦కర్మకృతము.

అట=ఆవల, నానా=అనేకవిధములైన, శకుంత = పక్షులయొక్క, వితాన= సమూహముచే-సమాకీర్ణ =వ్యాపించియుండు, అగ్రావశైవాలినీక్ష్మాజము= కొండలు,

నదులు, చెట్లు లేనిది. (Gobi desert) సత్త్వశూన్యంబై=జీవజంతువులు లేనిదై -కాంతారము=ఇచట మరుభూమియనియే గ్రహింపవలయును. పాండురమేఘాభము=తెల్లని మేఘముతో సమానమైనది. కనకమండితము=బంగారుచే నలంకరింపఁబడినది. శ్రీద = కుబేరుని, భవనంబు=గృహము, పాండురాభ్రకాంతిన్ = తెల్లని మేఘకాంతిని.

తా త్ప ర్య ము.

ఆపర్వతము దాఁటి యావలఁబోఁగా సుదర్శన మను పర్వతము గలదు. అది దాఁటిపోవ ననేక పక్షిసంఘములచే నిండిన దేవసఖ మను పర్వతము గలదు. దానికావలఁ గొండలు నదులు చెట్లు జీవజంతువులు లేని నూఱామడపొడవు గల దేశమున్నది. దీనిని గోబి, షాము ఎడారియందురు. ఆ మరుభూమిని దాఁటిపోయితిరేని కైలాసపర్వతము గానవచ్చును. ఇప్పుడు హిమాలయమున కుత్తరమున టిబెట్టుదేశమందున్నది. దానిని జూచిన మీబడలికలు దీరును. అచ్చట తెల్లని మేఘముతో సమానమైబంగారుచే నలంకృతమై తెల్లని కాంతిగల కుబేరుని యిల్లు గలదు. దానిని విశ్వకర్మ నిర్మించెను.

క. ఆహ్లాదనిదానం బయి, కహ్లారేందీవరాబ్జ♦కైరవయుత మై
సుహ్లాసదండజ మై దే,వహ్లీకావతులు గొలువ ♦ వఱలును గొలనన్. ౧౧౦౪

ఆహ్లాదనిదానము = సంతోషకారణము, కహ్లార = కొంచెమెఱుపును దెలుపును గలిగి సువాసన కల కలువలతోను, ఇందీవర = నల్లకలువలతోను, కైరవ = తెల్లకలువలతోను, యుతమై = కూడినదై, సు + హ్లాసత్ + అండజమై = ఇంపుగా శబ్దించుచున్న హంసపక్షులుగలది, హ్లాసశబ్దే యని ధాతువు, దేవహ్లీకావతులు = దేవతాస్త్రీలు, హ్రీశబ్దరూపాంతరము హ్లీ, హ్రీకావతి, హ్లీకావతి = లజ్జావతి యని యర్థము. 'అండజ మనఁగా హంస యనుటకు "అండజయాన నీ వొసఁగునట్టి సపర్యలు మాకు వచ్చె" అని మనుచరిత్ర.

తా త్ప ర్య ము .

సంతోషకారణమై కహ్లారములు నల్లకలువలు కమలములు తెల్లకలువలు గలదై ధ్వనించుచున్న హంసలు గలదై దేవతాస్త్రీలు సేవించు కొలనుకూడ నందుఁ గలదు. ఈ కొలని పేరు వస్వౌకసార.

ఉ. అచ్చరమచ్చెకంటులు వి♦హారము సల్పెదు దానిపొంత వై
యచ్చరజాతి యక్షనిచ♦యంబులు గొల్వఁ గుబేరుఁ డెప్పుడున్
ముచ్చట దీరఁ గ్రీడలను ♦ మోదితుఁ డయ్యెడు మీరు రావణున్
సచ్చరితాగ్రగణ్య యగు♦జానకినిన్ వెదుకుండు తత్పురిన్. ౧౧౦౫

అచ్చరమచ్చెకంటులు = అప్సర స్త్రీలు, మత్స్యశబ్దభవము మచ్చెము. దానివంటి కన్నులు గలవారు మచ్చెకంటులు, స్త్రీలు, వైయచ్చరజాతి=దేవతాజాతి,

వియత్ + చరులు = ఆకాశమున సంచరించువారు, వియచ్చర సంబంధము వైయచ్చరము. నెమకుడు = వెదకుడు.

తాత్పర్యము.

ఆ కొలని సమీపమందు దేవతాస్త్రీలు విహరించుచుందురు. దేవతలు యక్షులు గొలువఁ గుబేరుఁడు సర్వదా యందు వినోదముగాఁ గ్రీడించుచుండును. ఆ ప్రదేశమందు రావణుని శీలవతి యగు సీతాదేవిని వెదకుఁడు.

క. ఆవలఁ గ్రౌంచాద్రిని గనుఁ, డా వివరము దుష్ప్రవేశ ♦ మందుఁ బ్రమాదా
భావమ్మునఁ జొరుఁ డుందురు, దేవార్చితు లర్కసములు ♦ దివ్యమహర్షుల్. ౧౧౦౬
దుష్ప్రవేశము = ప్రవేశింపఁ గష్టమైనది, ప్రమాదాభావమ్మునన్ = జాగరూకతతో.

తాత్పర్యము.

దాని కావలఁ గ్రౌంచపర్వతము గలదు. దానియందుఁ బూర్వము కుమారస్వామి శక్తి ప్రయోగముచేఁ గావించిన బిలము గలదు. ఆ త్రోవనే హంసలు మానససరస్సునకుఁ బోవుచు వచ్చుచుండును. ఆ బిలము సులభముగాఁ జొరరానిది. జాగరూకులరై దానియందుఁ బ్రవేశింపుఁడు. దానియందు సూర్యకాంతిగల దేవర్షులు మహర్షులు నుందురు.

క. తక్కిన గుహలును జఱులును, లెక్కకు మిగిలిన దరీస్థ ♦ లీకటకములున్
జక్కఁగ వెదకుఁ డవృక్షం, బక్కడఁ గల కామశైల ♦ మా మానసమున్. ౧౧౦౭

తాత్పర్యము.

అదిగాక తక్కినగుహలును చఱులును గుహలు కొండక్రింది నేలలు కొండ నడిమి ప్రదేశములు చక్కఁగ వెదకుఁడు. అందు అవృక్షము కామశైలము మానస మను పర్వతములు గలవు.

క. చొరరాదు మానసాహ్వాయ,గిరి సురదానవుల కేని ♦ గిరిపార్శ్వములం
దరయుఁడు క్రౌంచము దాఁటినఁ, బరఁగెడి మైనాక మనఁగఁ ♦ బర్వతవరమున్.

తాత్పర్యము.

దేవదానవులకైనను మానస మను పర్వతము చొరసాధ్యముగాదు. కావునఁ గొండ ప్రక్కల వెదకుఁడు. క్రౌంచ పర్వతము దాఁటిన మైనాక మను పర్వతము గలదు.

క. అందు మయదానవుఁడు దా,నందంబుగఁ గట్టుకొనిన ♦ యాలయ ముండున్
గందరసానుతలంబుల, సుందరి వెదకంగ వలయుఁ ♦ జండీ మీరల్. ౧౧౦౯

తాత్పర్యము.

ఆ పర్వతమందు మయుఁడను దానవుఁడు కట్టుకొనిన సుందరమైన గృహము గలదు. అందు గుహలందును, జఱులయందును సీతను వెదకవలయును జండు.

క. ఘోటకముఖు లగుయువతుల, వాటంబులు గలుగు వాని ♦ వడిఁ గడచినచో
మేటు లగు వాలఖిల్యుల, కోటులు సిద్ధులును దపము ♦ గూడెద రెప్పుడున్. ౧౧౧౦

తా త్ప ర్య ము .

గుఱ్ఱముల ముఖమువంటి ముఖములుగల స్త్రీలయిండ్లం దున్నవి. వానిని దాఁటిపోయిన వాలఖిల్యులు సిద్ధులు తపస్సు చేయుచుందురు

తే. వందనీయులు వారలు ♦ పరమతపము, పేర్మి గతకల్మషాత్ములై ♦ పేర్చుచుంద్రు
మిగులు వినయంబుతోడుత ♦ మిథిలకన్య, వార్త వారల నడుగుఁడు ♦ ప్లవగులార!

వందనీయులు = నమస్కరింపఁ దగినవారు. గతకల్మషాత్ములు = పాపము పోయిన మనస్సులు గలవారు.

తా త్ప ర్య ము .

వారు నమస్కరింపఁ దగినవారు. గొప్పతపముచేతఁ బాపములేని మనస్సులు గలవారు కావున నణఁకువ గలిగి సీత వార్త వారల నడుగుఁడు.

క. ఆ సిద్ధాశ్రమతలమున, భాసురకనకాబ్జపిహిత♦వైఖానసనా
మాసమసరస్సు గల దట, భాసిలు బాలార్కనిభవి♦భాహంసంబుల్. ౧౧౧౨

భాసుర = ప్రకాశించు, కనకాబ్జ = బంగారు కమలములచే, పిహిత = కప్పఁబడిన, వైఖానసనామ = వైఖానస మను పేరుగల, అసమ=సమానములేని, సరస్సు= కొలను, బాలార్క = బాలసూర్యునితో, నిభ = సమానములైన, విభా = విశేష కాంతిగల, హంసంబుల్ = హంసలు.

తా త్ప ర్య ము .

ఆ సిద్ధు లుండు ప్రదేశమందుఁ బ్రకాశించుచున్న బంగారు కమలములచేఁ గప్పఁబడిన వైఖానస మను సరస్సు గలదు. అచ్చట బాలసూర్యుని కాంతిగల హంస లున్నవి.

తే. ఐలబిలుప్రియవాహనం ♦ బనఁగఁబరఁగు, సార్వభౌమాఖ్యనాగంబు ♦ సంతతంబు
వచ్చు నచ్చోటికిని వశా♦వళులు గొల్వఁ, దత్సరఃప్రాంతముల మీరు♦దగును వెదక.

ఐలబిలు = కుబేరునియొక్క, నాగంబు=ఏనుఁగు, వశావళులు = ఆఁడేనుఁగుల గుంపులు- తత్ + సరః + ప్రాంతములన్=ఆ సరస్సు సమీప ప్రదేశములందు.

తా త్ప ర్య ము.

అచ్చటికిఁ గుబేరునకుఁ బ్రియమైన వాహనము సార్వభౌమ మను పేరుగల యేనుఁగు ఆఁడేనుఁగుల గుంపుతో వచ్చును. ఆ కొలని సమీప ప్రదేశములం దంతట మీరు వెదకవలెను.

సీ. ఆసరోవరమున ♦ కావల నష్టచంద్రదివాకరంబు స♦తారకంబు
నిష్పయోదము మిన్ను ♦ నిశ్శబ్ద మగు మును, లందు స్వయంప్రభు ♦ లరుకనట్లు

వెలిఁగించు చాస్థలి ♦ విశ్రమించెదరు మీ, రది దాఁట శైలోద ♦ యనెడియేఱు
పాఱు నానది రెండు♦ప్రక్కలఁ గీచకా,ఖ్యాత వేణుకుడుంగ♦గణము లుండు
తే. నవియ యాధారముగ సిద్ధు♦లై నవార, లావ లవలఁ బోవ రా ♦ నమరియుండుఁ
బుణ్యపురుషావళికి నెల్ల ♦ భోగభూము, లుత్తరపుఁ గురుదేశంబు♦ లొప్పియుండు.

నష్టచంద్రదివాకరంబు=చంద్రుఁడు సూర్యుఁడు లేనిది. అతారకంబు=నక్షత్రములులేనిది, నిష్పయోదము = మేఘములు లేనిది, మిన్ను=ఆకాశము, స్వయంప్రభులు=స్వతేజస్సుచే వెలుఁగువారు, కీచకాఖ్యాత=కీచకము లని పేరుగల ఏవెదుళ్లలోనుండి గాలిపోయిన ధ్వనించునో యవి కీచకములు, వేణు=వెదుళ్ల-కుడుంగ గణములు=పొదల గుంపులు - పుణ్యపురుషావళికిన్=పుణ్యముచేసిన పురుషులకు.

తా త్ప ర్య ము.

ఆ సరస్సున కావల సూర్యకాంతి చంద్రికాంతి నక్షత్రకాంతి లేదు. అందు మేఘములు లేవు. ఆకాశము శబ్దము లేనిదై యుండును. అచ్చట మునులు సూర్యునివలె వారివారి తేజస్సుచే నాస్థలమును వెలుంగఁ జేయుదురు. మీరది దాఁటిపోయిన శైలోదమను శిలానది గలదు. దానికీవల నావలఁ గీచకములను పేరుగల వెదుళ్లపొదలుండును. ఆయేటినీళ్లలో దిగినవారు రాలైపోదురు గావున నానదిదాఁటవలయు ననిన నా పొదలవెదుళ్లు పట్టుకొని పోవలయును, రావలయును. ఆదరివి యీదరివి వెదుళ్లు కలిసికొని యల్లుకొని యుండును. అది సిద్ధులకు సాధ్యమే కాని యితరులకు సాధ్యముగాదు. ఆయుత్తర కురుభూములు పుణ్యముచేసిన పురుషులకు భోగస్థానములై యుండును.

క. చంచద్వైడూర్యదళో,దంచిత మై నవ్యకాంచ♦నాంబుజయుత మై
మించినమనోజ్ఞనళినీ,సంచయములతోడ నదులు♦చాలఁగ నొప్పున్. ౧౧౧౫

చంచత్ = తళతళ ప్రకాశించు, వైడూర్యదళ = వైడూర్యవర్ణముగల యాకులచే, ఉదంచితమై = వెలుఁగునవియై, నవ్య = మనోహరమైన, కాంచనాంబుజయుతమై = బంగారు కమలములతోఁ గూడినదై, మనోజ్ఞ = ఇంపైన, నళినీ సంచయములతోన్ = తామరతీఁగల గుంపులతో.

తా త్ప ర్య ము .

అం దనేక నదులుగలవు. వానియందు వైడూర్యవర్ణముగల యాకులు గలిగిన బంగారుకమలములు గల తామరతూండ్లు గలవు.

తే. అచట రక్తోత్పలముల వ♦నాళి గలుగు, నచటినీరాకరంబులు ♦ హాటకాభ
ములును దరుణార్కసన్నిభ♦ములును నగుచుఁ,బటిమమీఱును గన్నుల♦పండువగుచు.

రక్తోత్పలముల = ఎఱ్ఱకమలములయొక్క, నీరాకరంబులు = సరస్సులు, హాటకాభములు = బంగారు కాంతిగలవి, తరుణార్కసన్నిభములు = లేఁతసూర్యునితో సమానములైనవి.

తా త్ప ర్య ము.

అచ్చట ఎఱ్ఱకలువలుగల వనములు గలవు. అచటి సరస్సులు బంగారువన్నె బాలసూర్యునివన్నె కలవై యుండును. చూచుటకు మిగుల సంతోషకరములై యుండును.

తే. మేలి నల్లని రతనాల♦మిసిమిఁ తేకు, లచ్ఛమౌ నపరంజి డా♦లకరువులును
గలుగునల్లని కలువలఁ గలుకులైన, కొలఁకు లెల్లెడ సొబగారుఁ ♦ గొమరు మిగిలి.

మేలి = శ్రేష్ఠములైన, నల్లనిరతనాల = ఇంద్రనీలమణులు, మిసిమితేకు = కాంతిగలతేకులు, అపరంజిడాలు = బంగారుకాంతిగల, అకరువులు = కింజల్కములు, కలుకులు = ఒప్పిదములు, 'కలికి యొప్పిదంబు కాంత యర్యో' నిఘంటువు.

తా త్ప ర్య ము

జాతినీలముల కాంతిగలతేకులు, అపరంజి బంగారుకాంతిగల కింజల్కములుగల నల్లని కలువలచే నొప్పిదములైన సరస్సు లచ్చట నందమైయుంౘును. ఇది యచ్చ తెనుఁగుపద్యము, ఇందు సంస్కృతపదములేదు.

తే. ఆణిముత్యాల రతనాల♦రాణ మీఱు, నిసుకదిబ్బలతో నీళ్ళు ♦ పస నెసంగు
నగ్గి కీడయి జాళువా♦నిగ్గు దేఱు,కొండ లెల్లెడఁ జెన్నారు ♦ దండి బలిసి. ౧౧౮

ఆణిముత్యాల = గుండుముత్తెముల, ముత్తియము, ముత్తెము, ముత్యము రూపాంతరములు, ఇయుశబ్దంబునం దికారలోపంబు ముత్తియాదులం దగు సు. వ్యా. ఆచ్ఛిక ౩౧. సూ. ఇదియు నచ్చ తెలుఁగు పద్యము.

తా త్ప ర్య ము.

గుండు ముత్యాలచేతను రత్నములచేతను నందమైన యిసుక దిబ్బలతో నీళ్లు కాంతులు దేఱుచుండును. అగ్నితో సమానమై బంగారు కాంతిగల కొండలన్ని చోట్టుల దండిగఁ గలవు.

క. ఎల్లప్పుడుఁ బూలు పండ్లును, బెల్లుగ నై పులుఁగుగములు ♦ వేలకొలఁదులై
మొల్లపుఁదావులు సోఁకును, గొల్లలు నై కోర్కు లెల్లఁ ♦ గురియుం జెట్టుల్.

పులుఁగు గములు = పక్షుల గుంపులు, తావులు = వాసనలు, ఇదియు నచ్చ తెనుఁగు పద్యమే.

తా త్ప ర్య ము.

సర్వకాలములందుఁ బూవులు పండ్లు కొల్లలుగాఁ గలిగి వేలకొలఁది పక్షుల గుంపులుం గలదై మంచివాసనలు గొట్టుచు నచటి చెట్లు కోరిన కోర్కు లొసఁగుచుండును.

ఉ. అచ్చటి కొన్నిగుంట్లు వివి♦ధాకృతి చేలము లీనుఁ, గొన్ని శై
లోచ్ఛ్రయముల్ సతీపురుష♦యోగ్యములుౕ నిఖిలర్తు సేవ్యముల్
ఇచ్చకు వచ్చు సత్ఫలము ♦ లెంతయుఁ గూర్చును, వెండి కొన్నియుౕ
మెచ్చగు రత్నసంతతుల ♦ మేలివిభూషల నిచ్చుఁ బెచ్చుగన్. ౧౧౨౦

శైలోచ్చయములు = పర్వత సమూహములు, గుట్లు = పర్వతములు.

తా త్ప ర్య ము.

అచ్చటి కొన్ని పర్వతములు నానావిధములైన వస్త్రములిచ్చును. కొన్ని పర్వతములు స్త్రీ పురుషులకు యోగ్యములై, యన్ని ఋతువులందు సేవింపయోగ్యములై యిష్టము వచ్చిన మంచి ఫలముల నిచ్చును. కొన్ని మెచ్చఁదగు రత్నసమూహముల శ్రేష్ఠములైన సొమ్ము లిచ్చును.

సీ. అనుపమచిత్రహై♦మాసనశయనాళి, గ్రావోత్తములు కొన్ని ♦ కాచు నచట
భక్ష్యపానంబులు ♦ బహుమనఃకాంతమా,ల్యంబుల నీను ద్రు♦మంబు లచట
నయ్యెడఁ దోయ్యలుల్♦హారిణుల్ యౌవన,భ్రాజితల్ సుగుణసం♦పన్న లుందు
గంధర్వసిద్ధనా♦గవ్యూహకిన్నర, విద్యాధరసమితి ♦ వేడ్క మీఱఁ
తే. దరణితేజస్కు లై తమ♦తలిరుఁబోండ్ల,తోడ విహరింతు రామముల్ ♦దోరములుగ
రతిపరాయణ మగుచు సు♦కృతకలాప, కర్మ మగుచుండు నట జన♦కాండమెల్ల.

అనుపమ=సమానములేని-చిత్ర =ఆశ్చర్యకరములైన-హైమ = బంగారుతోఁ జేయఁబడిన, ఆసన+శయన+ఆళి=పీఁటలు - మంచాలగుంపులు - గ్రావోత్తములు= పర్వత శ్రేష్ఠములు-బహు = విశేషముగ, మనఃకాంత = మనస్సునకు రమ్యమైన - మాల్యంబులు=పూలసరములు-ఈను = కలిగించును. ద్రుమంబులు=చెట్లు-తొయ్యలుల్ = స్త్రీలు, హారిణుల్ = మనస్సును హరించు సుందరులు, యౌవనభ్రాజితల్= ప్రాయముచేఁ బ్రకాశించువారు, తరణి తేజస్కులు = సూర్యుని తేజస్సుగలవారు. తలిరుఁబోండ్లు, చిగుళ్లవలెఁ గోమలములైన దేహములు గలవారు. తోరము = అధికము, రతిపరాయణము=సంభోగకేళియే ప్రధానముగాగలది,సుకృత కలాపకర్మము= పుణ్యము కలిగించు కార్యములు గలది, జనకాండము = జనసమూహము, కాచు = కాయలుకాచును, ఎండలుకాయునని రూపములు గ్రహింపనగు, ఎండలుకాచెను కాయలు కాసె ననరాదు.

తా త్ప ర్య ము.

ఆ యుత్తరకురు భూములందుఁ గొన్నిపర్వతము లసమానమైన యాశ్చర్యకరమైన పీఁటలు మంచాలు కాచును. కొన్నిచెట్లు భక్ష్యములను పానంబులను మిగుల మనస్సున కింపైన పూలసరములఁ గల్పించును. అచట సుందరులు యౌవనవతులు సుగుణసంపత్తిగల స్త్రీ లుందురు. అచ్చట గంధర్వులు సిద్ధులు నాగసమూహములు కిన్నరులు విద్యాధరులు సూర్యునివంటి తేజస్సుగలవారై తమ స్త్రీలతో వినోదముగఁ గోరికలుదీరఁ దిరుగుచుందురు. అచ్చటి జనము పుణ్యకర్మములు చేయుచు రతిప్రధానముగ భోగించుచుందురు.

తే. అఖిలభూతమనోహర ♦ మగుచు నందు, మందహాసయుతంబుగ ♦ మగునగములు
నించు సంగీతవాదిత్ర♦నిస్స్వనంబు,జానుమీఱఁగ వినవచ్చు ♦ సంతతంబు.౧౧౨౨

తాత్పర్యము.

చిఱునవ్వులతోడ స్త్రీలు సంగీతవాద్యముల ధ్వనులు నిండునట్లు చేయఁగా సమస్తప్రాణికోటులకు మనస్సు హరించునవియై యెల్లప్పుడు వినవచ్చుచుండును.

క. ముదితుండు కానివాఁడును, ముదితను లేనట్టివాఁడు ♦ ముచ్చట కేఁగన్
మెదలుట లే దట గుణములు, పొదలు మనోరమతఁ బూఁట♦పూఁటకుఁ బ్రజలన్.

తాత్పర్యము.

ఆయుత్తర కురుభూములందు సంతోషము లేనివాఁడు ముచ్చటకైన భార్య లేనివాఁడులేఁడు. ప్రజలందుఁ బూఁటపూఁటకు మనోహరములైన గుణములు వృద్ధి యగుచుండును.

తే. దానిని దరించి పోయి యు♦త్తరము గాఁగఁ
జూడుఁడు పయోధి దానిలో ♦ సోమశైల
మనఁగ హేమమయం బగు♦నచల ముండు
నింద్రవిధిలోకవాసులు ♦ గంద్రు దాని. ౧౧-౨౪

తాత్పర్యము.

దానిని దాఁటి యుత్తరముగఁ బోఁగా సముద్రములో సోమశైలమను పేరుగల బంగారు మయమైన పర్వతము గలదు. దానిని జూడుఁడు. దాని నింద్రలోకవాసులు; బ్రహ్మలోకవాసులు చూతురు.

క. తపనుఁడు గల దేశంబులఁ, దపనుని తేజమున వస్తు♦తతివలె నచటన్
దపనుఁడు వెలుంగకయుఁ ద, త్తపనీయరుచిఁ బదార్థ♦తతి గానఁబడున్. ౧౧-౨౫

తపనుఁడు = సూర్యుఁడు, తపనీయరుచిన్ = బంగారుకాంతిచే.

తాత్పర్యము.

సూర్యుఁడు ప్రకాశించు దేశములందు సూర్యునికాంతిచే నెట్లు పదార్థములు గానవచ్చునో యట్లా ప్రదేశమున సూర్యకాంతి లేకయున్నను నాబంగారు కాంతిచే వస్తువులు కానఁబడుచుండును.

క. భగవంతుఁడు విశ్వాత్ముఁడు, తగ నేకదశాత్మకుండు ♦ దర్పకహరుఁడున్
జగతీస్రష్ట విధాతయు, నగచరవరులార! యుందు ♦ రావాసముగన్. ౧౧-౨౬

భగవంతుఁడు = జ్ఞానశక్తిబలైశ్వర్య వీర్యతేజస్సులనెడి యాఱుశక్తులు గలవాఁడు, విశ్వాత్ముఁడు = ప్రపంచమును దనకు దేహముగాఁ గలవాఁడు, లేక చేతనాచేతనములగు జీవప్రకృతులకు నాత్మయైనవాఁడు, విష్ణువు, "ఏవ మేవ మహాన్ శబ్దో భగవానితి పరమబ్రహ్మభూతస్య వాసుదేవస్య నాన్యగ" యను విష్ణుపురాణవచనము ప్రకారము భగవచ్ఛబ్దము విష్ణువునందే యన్వయించును. తక్కినవారియందు గౌణార్థమున నన్వయించును. ముఖ్యార్థమున నితరుల కన్వయింపదు, ఏకదశాత్మకుండు = పదునొకండు స్వరూపములుగలవాఁడు, దర్పకహరుఁడు = మన్మథవిరోధియగు

శివుఁడు, జగతీస్రష్ట = ప్రపంచమును సృష్టించినవాఁడు, విధాత = బ్రహ్మ, ఇందుఁ ద్రిమూర్తులు చెప్పఁబడినారు, ఒకరొక్కరికి రెండువిశేషణములు చెప్పఁబడినవి, ఆవాసముగ = కాఁపురముగ. తాత్పర్యము.

అందు షాడ్గుణ్య పరిపూర్తి గలిగి ప్రపంచస్వరూపుఁడైన విష్ణువు, ఏకాదశమూర్తులు ధరించి మన్మథవిరోధియగు శివుఁడు ప్రపంచము సృష్టించిన బ్రహ్మ కాఁపురముందురు.

క. ఉత్తరకురుభూములకును, నుత్తరముగఁ బోకుఁడీ సు♦రోత్కరమేనిఁ
సత్తంబు గాదు సోమకు,భృత్తును జేరంగ మీర ♦ లీక్షించి గిరిఁ. ౧౧౨౭
సత్తము = శక్తము = శక్తిగలది.

తాత్పర్యము.

ఉత్తర కురుభూముల కుత్తరముగ మీరు పోవలదు. దేవతాసమూహమైనను సోమపర్వతము చేరఁబోవ శక్తిగలదికాదు. మీరు దూరమునుండి చూచి,

Here we have a glimpse of the *Arctic regions* with the Aurora Borealis to the north of the *Ultara Kuru* realms. The original text is,

"త మతిక్రమ్య శైలేంద్ర ముత్తరః పయసాన్నిధిః
తత్ర సోమగిరి ర్నామ మధ్యే హేమమయో మహాన్॥
సతు దేశో విసూర్యోపి తస్య భాసా ప్రకాశతే,
సూర్య లక్ష్మ్యాభి విజ్ఞేయ స్తపతేవ వివస్వతా॥
సహి సోమగిరి ర్నామ దేవానా మపి దుర్గమః,
తమాలోక్య తతః క్షిప్ర ముపావర్తితు మర్హథ॥
ఏతావద్వానరైః శక్యం గంతుం వానరపుంగవాః,
అభాస్కర మమర్యాదం జానీమ స్తత్పరమ్॥" కిష్కి- ౪౩ స.

"The Uttara Kurus, it should be remembered, may have been a real people, as they are mentioned in the Aitareya Brahmana VIII-14 wherefore the several nations who dwell in this nothern quarter beyond the Hymavat, the Uttara Kurus and the Uttara Madras are consecrated to glorious dominion and people term them glorious." Mouirs Sanskrit Texts. Vol. I. An. Geo. P. 67. Note. ఇది యిప్పటి సైబీరియా దేశమున కుత్తర దేశము. అందుండి ఆర్యులు ఆర్యావర్తమునకు వచ్చి రని కొంద అందురుగాని యది సరియైన యూహగాదు.

క. మరలుఁడమర్యాదంబును, నరవిప్రభ మవల నెఱుఁగ ♦ మట నే ముందుఁ
హరులార! మీరు నాచేఁ, బరికీర్తిత మగదితంబు ♦ వసుధయుఁ గనుఁడీ. ౧౧౨౮

అమర్యాదము = కట్టుపాటులేనిది, గ్రామము లని నగరములని యేర్పాటు లేనిది. అరవిప్రభము = సూర్యకాంతిలేనిది. పరికీర్తితము = చెప్పఁబడినది. అగదితంబు = చెప్పఁబడనిది.

తా త్ప ర్య ము.

మరలి రావలయును. ఆవలి దేశము కట్టుపాటు లేనిది. సూర్యకాంతియు లేదు. అం దేమున్నదో యెవ్వరెఱుఁగరు. వానరులార! నేను జెప్పిన స్థలములు చెప్పని స్థలములు వెదకవలయును.

క. భామామణిఁ గాంచుటచే, రామునకుఁ గడుం బ్రియంబు ♦ రామునకంటెన్
నామదికి నధికమోదం, బో మరుదనలాభులార ♦ యొదవిం తీర్రల్. ౧౧౭౯

తా త్ప ర్య ము.

అగ్నిహోత్రునితో సములారా! సీతాదేవిని మీరు చూచుటచే రామచంద్రమూర్తికిని నంతకంటె నాకును నెంతో సంతోషము కలిగించిన వారగుదురు.

క. అంత మదర్చితులై యే, కాంతము హితబాంధవాళి ♦ కడు నలర ధరన్
శాంతవిరోధులరై మీ, స్వాంతంబున కెక్కుఁ దిరుగుఁ ♦ డనుచును మఱియున్.

మదర్చితులై = నాచేఁ బూజింపఁబడినవారై, ఏకాంతము = మిక్కిలి, అలరన్ = సంతోషింపఁగా, శాంతవిరోధులరై = పగవారు లేనివారై, స్వాంతంబున కెక్కున్ = మీ యిచ్ఛకొలఁది.

తా త్ప ర్య ము.

అట్లు చేసిన తరువాత మీరు హితులు బంధువులు మిక్కిలి సంతోషింపఁగా విరోధులు లేనివారై మీ యిష్టానుసారము స్వేచ్ఛగా విహరింపుఁడు.

—♦ ౪౪-వ సర్గము, సుగ్రీవుఁడు కార్యభారము హనుమంతుపై మోపుట, ♦—

చ. హనుమను జూచి వానరకు♦లాగ్రణి యాతఁడె కార్యసాధకుం
డని మది నిశ్చయించి యని♦లాత్మజు విక్రమవంతుఁ గాంచి యి
ట్లను ముదమార నో వనచ♦రాగ్రణి! యప్పుల నిప్పులన్ సురా
వని గగనంబునందు నని♦వార్యము నీగతి నే నెఱుంగుదున్. ౧౧౩౧

తా త్ప ర్య ము.

ఈ ప్రకారము చెప్పి హనుమంతుని జూచి యీయనవలన నీకార్యము సాధ్యము. ఇతఁడే యీ కార్యము సాధింపఁగలవాఁడని యాలోచించి నిశ్చయించి పరాక్రమశాలియగు హనుమంతుఁ గాంచి యిట్లనెను. ఓ వానరసత్తమా! నీళ్ళలో నిప్పులలో స్వర్గమందు ఆకాశమందు నీగమన మనివార్యము. నీవు పోఁదలఁచిన చో నడ్డము రాఁగలది యాటంక పఱుపఁగల దేదియు లేదు. నిశ్చయము నాకుఁ దెలియును.

క. సాసురము సగంధర్వము, సాసురరిపుసర్వమనుజ♦సంఘము సధరం
బో సామీరి! ససింధువు, నా సకలధరిత్రి నీకు ♦ నవిదిత మున్నే. ౧౧౩౨

సాసురము = రాక్షసులతోఁ గూడినది, సగంధర్వము = గంధర్వులతోఁ గూడినది. సాసుర రిపు సర్పమనుజసంఘము = దేవతలయుఁ బాములయు మనుష్యులయు గుంపులతోఁ గూడినది, సధరంబు=పర్వతములతోఁ గూడినది, ససింధువు=సముద్రముతోఁ గూడినది, సామీరి = సమీర నందనా, అవిదితము = తెలియరానిది.

తాత్పర్యము.

అసురులతో గంధర్వులతో దేవతలతో సర్పములతో మనుష్యులతోఁ గొండలతో సముద్రముతోఁ గూడిన నీసమస్త భూమండలమందు ఆంజనేయా! నీకుఁ దెలియరానిది కలదా.

క. జవమునఁ దేజంబున లాఘవమున గమనంబునందుఁ ♦ గడిమిగరిమలన్
బవమానతనయ! పిత యగు, పవమానునితోడ నీడు ♦ వత్తువు నీవున్. ౧౧౩౩

జవమునన్ = వేగమున, కడిమిగరిమన్ = పరాక్రమాతిశయములందు, పిత = తండ్రి.

తాత్పర్యము.

వేగమునందుఁ దేజమునందుఁ దేలికయందుఁ బోవుటయందు బలాతిశయమందు ఆంజనేయా! నీవు నీతండ్రితో సమానుఁడవు.

ఉ. ఓకపిలోకనాథ! భవ♦దున్నత తేజముచేతఁ జూచినన్
నీకు సమంబు భూత మవ♦నిస్థలి లేదు, బలంబు, బుద్ధి, య
స్తోకపరాక్రమంబు గుణ♦దోషవిచారణశక్తి దేశకా
లైకసదానువృత్తియు న♦యజ్ఞ! తిరంబుగ నుండు నీయెడన్. ౧౧౩౪

భవదున్నత తేజము = నీగొప్పకాంతి, దేశకాలైక సదానువృత్తి = ఆ యా దేశమునకు ఆ యా కాలమునకుఁ దగినట్టు లెల్లప్పుడు ననుసరించి చరించుట,నయజ్ఞ = నీతి తెలిసినవాఁడా, తిరంబుగన్ = స్థిరముగ.

తాత్పర్యము.

ఓకపీశ్వరా! నీయతిశయించిన తేజస్సును బోల్చిచూచినను నీకు సమానమైన ప్రాణి భూమియందునలేదు· దేహబలము, బుద్ధిబలము, అధికపరాక్రమము, ఇది గుణము ఇది దోషము ఇటుచేసిన కార్యమగును ఇటుచేసినఁగాదు అని యాలోచించు శక్తి, ఏ దేశమందు నేకాలమందు నెట్లు ముఖ్యముగాఁ బ్రవర్తింపవలయునో యట్లనుసరించిపోవుట, నీతిమంతుఁడా! యివన్నియు నిలుకడగా నీయందుఁ బాదుకొనియున్నవి.

హనుమంతుఁ డింతటి గొప్పవాఁడని సుగ్రీవునకుఁ దెలియునుగదా! ఏల వాలి మీఁది కతనిఁ బంపలేదు? హనుమంతుఁడు తానై యేల వాలిని నిరోధింపలేదు. ఇంతటి బలవంతుఁడు సహాయుఁడుగా నుండి యేల కష్టపడెను?

హనుమంతుఁడు సుగ్రీవుబంటు, స్వామి యాజ్ఞలేక యేదియుఁ జేయరాదు. నేను వాలిని జయింపలేను నీవు పోయి జయించి రమ్మని ప్రభువు తనబంటుతోఁ

జెప్పుకొనుట సుగ్రీవుఁ డవమానకరముగ నెంచుచుండెను. హనుమంతుఁడో తానై ముందుపడి వాలిని నిరోధించిన సుగ్రీవుని నవమానించి నట్లు లగునని జంకుచుండెను. కుంభకర్ణుని విషయమున నిట్టులేకదా వర్తించెను. హనుమంతుఁడు సుగ్రీవుని పక్షమున యుద్ధమునకు దిగెనేని వాలిపక్షమున నాతనివారందఱు దిగుదురు. ఈ పోరు ముగియున దెప్పుడు ? కావున నన్నదమ్ములే కొట్టుకొని చావనీ యని తక్కిన వారంద ఱూరకయుండిరి. ఇంతకు హనుమంతునకుఁ దన బలము తనకుఁ దెలియదు స్వయముగ దేనికి సాహసింపఁడు. జాంబవంతునివంటి వారుండవలెను. హనుమంతునకు వెఱచియే వాలి సుగ్రీవుని భయపెట్టుచుండెనే కాని చంప యత్నించిన వాఁడు కాఁడు.

క. కావున హనుమా! రాఘవు, దేవిని సాధించి మరలఁ ♦ దేర నుపాయం
 బీవే చేయఁగ వలయును, నా విని రాముండు యోజ♦నను జల్పె నిటుల్. ౧౧౩౫

తా త్ప ర్య ము.

కాఁబట్టి హనుమంతా! రామచంద్రమూర్తి భార్యను సాధించి మరలఁ దెచ్చు నుపాయ మేదో యది నీవే చేయవలయును. నీవు తప్పిన మఱి యితరుల కది సాధ్య మగునదికాదు, అని చెప్పఁగా రామచంద్రమూర్తి యిట్లు లాలోచించెను.

—♦ శ్రీరాముఁడు హనుమంతుచేతికిఁ దనముద్రిక నిచ్చుట. ♦—

ఆ. కార్యభారమెల్లఁ ♦ గపినేత హనుమంతు, నందు నిడియె నిశ్చి♦తార్థుఁ డితఁడు
 కార్యసాధనమున ♦ గాడుపుపట్టియు, నిశ్చితార్థకరుఁడు ♦ నిశ్చయంబు. ౧౧౩౬

కార్యభారము = పనిని సాధించు బరువు, కపినేత = వానరరాజు, ఇతఁడు = ఈ సుగ్రీవుఁడు = నిశ్చితార్థుఁడు, ఈ కార్యమీతఁడు చేయఁగలఁడని నిశ్చయింపఁ గలవాఁడు, కార్యసాధనమునన్ = కార్యముసాధించుటయందు, గాడుపుపట్టియు = వాయుకుమారుఁడు, నిశ్చితార్థకరుఁడు = నిశ్చయించిన కార్యము చేయఁగలవాఁడు.

తా త్ప ర్య ము.

సుగ్రీవుఁడు కార్యము నిర్వహించు భార మీ హనుమంతునం దుంచుచున్నాడు. కార్యసాధనమందు నితఁ డెవ్వఁడే కార్యము చేయఁగలఁడో నిశ్చయింప శక్తిగలవాడు. ఈ యాంజనేయుఁడో నిశ్చయించిన కార్యము చేయ శక్తిగలవాఁడు ఇది నిశ్చయము.

ఆ. పూర్వకృతములైన♦భూరికార్యములచేఁ, బేరు నమ్మకంబుఁ ♦ గూరి మిగుల
 భర్త నచ్చినట్టి♦బంటు గావునఁ గార్య, ఫలము వీనివలనఁ♦గలుగు నిజము. ౧౧౩౭

పూర్వకృతములు = ముందుచేసినవి, భూరికార్యములచే = గొప్పపనులచే = పేరు = కీర్తి, నచ్చినట్టి = నమ్మినట్టి.

తా త్ప ర్య ము.

పూర్వము గొప్పపనులు నిర్వహించి కీర్తివిశ్వాసము సంపాదించి భర్త నమ్మిన బంటు గావున వీనిచే నిజముగా నీ కార్యము కాఁగలదు.

క. వ్యవసాయోత్తరుని హరి, ప్రవరునిఁ గని మానసమునఁ ♦ బరిహృష్టుం డై
యవనీపతి తన్నుఁ గృ త, న్యవలెఁ భావించి పైఁడి♦యుంగర మొందున్. ౧౧౩౭
వ్యవసాయోత్తరునిఁ = ప్రయత్నము చేయుటయందు గొప్పవానిని, పరిహృష్టుఁడు = మిగుల సంతోషించినవాఁడు.

తా త్ప ర్య ము.

కార్యసాధనమందుఁ బ్రయత్నము చేయువారిలో గొప్పవాఁడగు వానరశ్రేష్ఠుని హనుమంతునిఁజూచి యీతనివలన నీపని కాఁగలదు. అని మిగుల సంతోషించినవాఁడై రామచంద్రమూర్తి తన్నుఁ గృతకృత్యుఁడని యెంచి బంగారుటుంగరమును.

మ. తన పేరుంగలయట్టిదానిఁ గొని సీ♦తాభర్త ప్రీతిఁ మరు
త్తనయుం గాంచి కపీంద్ర! దీనిఁ గొనుమీ ♦ ధాత్రీజకుఁ దీనిఁ జూ
పిన నమ్మున్ సతి నాదు దూత వని ని♦ర్భీతిన్ నినుం, గీశనే
తనియుక్తంబును నీవ దీర్తువని యా♦త్మం దోఁచె వీరాగ్రణీ! ౧౧౩౮
కీశనేతనియుక్తము = సుగ్రీవునిచే నియోగింపఁబడిన కార్యము, తీర్తువు = చక్కఁజేయుదువు.

తా త్ప ర్య ము.

తన పేరు చెక్కఁబడిన దానిని దీసికొని రామచంద్రమూర్తి హనుమంతుని జూచి, వానరశ్రేష్ఠా! దీనిని నీవు తీసికొనిపొమ్ము. సీతకుఁ జూపుము. దానిని జూపితివేని నిజముగా నా దూతవని భయము విడిచి నిన్ను నమ్మి మాటలాడును. సుగ్రీవుఁడు చెప్పిన కార్యమును నీవే నిర్వహింపఁగల వని నాకును దోఁచుచున్నది. ఈ కారణముచే నీ యొద్ద దీని నిచ్చుచున్నాను.

రామచంద్రమూర్తి కీయుంగర మెక్కడిది ? సర్వము త్యజించిన వానప్రస్థుఁ డుంగరము ధరింపవచ్చునా ? రామచంద్రమూర్తి వానప్రస్థాశ్రమ స్వీకారము చేయలేదని యయోధ్యాకాండమందే వివరింపఁబడెను. కైకేయి కోరిన ప్రకారము నారచీరలు ధరించెనే కాని తక్కిన యాశ్రమచిహ్నము లనుష్ఠించినవాఁడు కాఁడు. ఆ కారణముచే నుంగరము ధరించుటవలన వ్రతభంగములేదు. కాఁగల కార్యమాలోచించి సుబాహుతోడ మారీచునేల చంపలేదో యా కారణముచేతనే యీ యుంగరమును బరిత్యజింపలేదు. గాని సొగసునకై కాదు. ధనాశచేఁ గాదు. అదియునుగాక యీ యుంగరము సీత రామచంద్రమూర్తి కిచ్చినది. వివాహకాలమున వధూవరు లుంగరములు మార్చుకొను నాచారము నేఁటికిని గలదు. దాని విలువ మాత్రమే చెడినది. ఈ యుంగరములను భర్త జీవించి యుండు వఱకు భార్యయు, భార్య జీవించియుండు వఱకు భర్తయు విడనాడరాదు. స్త్రీలకు మంగళసూత్ర మెట్టిదో భర్తల కీ యుంగరమట్టిది. తక్కిన సర్వము కాలవశమునఁ ద్యజించినను దీనిని మాత్రము త్యజింపరాదు. దానిని ద్యజించుట భార్యను ద్యజించినట్లే.

ఆకారణముచే రామచంద్రమూర్తి దానిని విడనాడక ధరించియుండి, సీతాదేవిని నమ్మింపఁగలది మఱి యేదియు లేదు, ఇది తా నిచ్చినది రాముని వ్రేల నుండఁగాఁ జూచినది కావున దీని నిచ్చెను.

మఱియొక విధముగ నైన యోజింపవచ్చును. రావణాసురుఁడు రాకముం దొకప్పుడు పరిణయమున సీతాదేవి వ్రేలి యుంగరమును రామచంద్రమూర్తి ధరించి యుండవచ్చును. కాదేని యిది వివాహమున వరవరణ సమయమున జనకుఁ డిచ్చినదిగా నైన నుండవచ్చును.

క. నీ విక్రమసంపదయును, నీ విపులం బైనబలము ♦ నీయత్నము సు
గ్రీవుని సందేశముఁ గన, నీవలననె కార్యసిద్ధి ♦ నిక్కముగ నగున్. ౧౧౪౦

తా త్ప ర్య ము.

నీ పరాక్రమ సమృద్ధి, నీ విస్తార బలము, నీ యత్నము సుగ్రీవుని నియోగము ఇవన్నియుఁ జూచిన నీ వలననే యీ కార్యము నిజముగ నగును.

చ. అతిబలసింహవిక్రమ! య♦నల్పపరాక్రమ మూని జానకీ
సతి నెటు గాంచ నో నటులు ♦ నల్పము కార్యము, నేను నీ బలా
శ్రితుఁడ న టన్న నుంగరముఁ ♦ జేకొని మూర్ధమునన్ ధరించి స
మ్మతిఁ గరముల్ మొగిడ్చి పద♦మంజరులన్ నతి చేసి నిల్చినన్. ౧౧౪౧

అతిబల సింహవిక్రమ = అతిబలుఁడును సింహవిక్రముఁడు నైన వాఁడా! యని విశేషణోభయపద కర్మధారయముగా గ్రహింపవచ్చును, లేక అతిబల, సింహవిక్రమ యని వేఱువేఱు సంబోధనములుగ నైన గ్రహింపవచ్చును. అనల్ప పరాక్రమము = అల్పముగాని పరాక్రమము, మూర్ధమునన్ = శిరస్సునందు, పద మంజరులన్ = పాదములను పూలగుత్తులను, పూలగుత్తులవంటి పాదములను.

తా త్ప ర్య ము .

మహాబలమును సింహవిక్రమము గలవాఁడా! నీవు గొప్పపరాక్రమము పూనినవాఁడవై యల్పకార్యమని యసడ్డ సేయక యే విధముగఁ గార్యముచేసిన సీతాదేవిని జూచుట కలుగునో యా విధముగఁ గార్యము చేయుము. నేను నీ బలము నాశ్రయించి యున్నాఁడను, అని చెప్పఁగా నుంగరమును దీసికొని శిరమునందు ధరించి రెండు చేతులు జోడించి రామచంద్రమూర్తి పాదమంజరులకు నమస్కరించి నిలచెను.

## —♦ ౪౫-వ సర్గము. వానరులు సీతను వెదకఁ బోవుట. ♦—

క. ప్లవగర్షభుండు సర్వ, ప్లవగులఁ దిలకించి రాము♦పని సిద్ధింపన్
జవమునఁ జని నా చెప్పిన, యవనీతల మెల్ల వెదకుఁ ♦ డన నక్కపులున్. ౧౧౪౨

తా త్ప ర్య ము .

వానరేంద్రుఁడైన సుగ్రీవుఁడు వానరుల నందఱఁజూచి రామచంద్రమూర్తి

కార్యము సఫలముగఁ జేయ మీ రందఱు వేగముగఁబొండు, నేను జెప్పినస్థలము లన్నియు వెదకుండు అని చెప్పఁగా నా కోతులును.

చ. ఎడలని భక్తిచేతఁ దమ♦యేలినవాని నిదేశ మూని పె
న్మిడుతలదండువోలె నవ♦నీస్థల మెల్లను నాక్రమించుచున్
గడువడిఁ బోయి రందు హరి♦కాండముతో వినతుండు తూర్పుగాఁ
బడమరగా సుషేణుఁ డను ♦ వానరవర్యుఁడు పోయె నర్మిలిన్. ౧౧౪౩

ఎడలని = వదలని, నిదేశము = ఆజ్ఞ, అర్మిలిన్ = ప్రీతితో.

తాత్పర్యము.

వానరు లందఱు భక్తిని విడక తమ ప్రభువు నాజ్ఞ ప్రకారము పెద్ద మిడుతల దండు వోలె భూమి యంతయు నాక్రమించుచు మిగుల వేగముగఁ బోయిరి. అందు వానర సమూహముతో వినతుఁడు తూర్పుగా, సుషేణుఁడు పడమరగాఁ బోయిరి.

చ. శతవలి యుత్తరంబుగను ♦ సాగెను దక్షిణ దిక్కుగా మరు
త్సుతుఁడును దారుఁ డంగదుఁడు ♦ తోడుగ రాఁ జనుచో సతారమున్
గతజలదంబు శుద్ధ మగు ♦ ఖంబునఁ జంద్రుఁడువోలెఁ బొల్చె వ్యో
మతలమునందు వానరస♦మాజములుం దనుఁ జుట్టి కొల్వఁగన్. ౧౧౪౪

సతారమున్ = నక్షత్రములతోఁ గూడినది. గతజలదంబు = మేఘములు లేనిది. ఖంబునన్ = ఆకాశమున, వ్యోమతలమునందు = ఆకాశమునందు.

తాత్పర్యము.

శతవలి యుత్తరముగఁ బోయెను. దక్షిణ దిక్కుగాఁ దారుఁడు, నంగదుఁడు తోడరాఁగా నాంజనేయుఁడు నక్షత్రములతోఁగూడి మేఘములు లేక నిర్మలమైన యాకాశమునందలి చంద్రునివలె వానరుల గుంపు తన్నుఁజుట్టుకొనిరాఁగా బోయెను.

నక్షత్రములు కానవచ్చుచున్నవి. మేఘములు లేవు. ఆకాశము శుద్ధ మని చెప్పుటచే మార్గశిరము ప్రారంభించె నని సూచితము. ఇదియే యుక్తకాలము.

మార్గశీర్షే శుభే మాసి యాయాత్ యాత్రాం మహీపతిః 7-182.

తే. తరణిసూనుండు కపుల య♦థాతథంబు,గా ననిచి సంతసించె సు♦ఖంబుఁ గాంచి
రామలక్ష్మణు లంతఁ బ్ర♦స్రవణమునను, గాచియుండిరి మాసంబు ♦గడువు దీఱ.

యథాతథంబు = ఎవ రెవ రెట్లు పోవలయునో యట్లట్లు.

తాత్పర్యము.

సుగ్రీవుఁడు వానరుల నెల్ల వారివారిని బంపవలసిన విధముగా వారివారిని బంపి సుఖముగ మనమిపుడు చేయవలసిన పని చేసితిమిగదా యని సంతోషించెను. రామలక్ష్మణులు నెల గడు వెపుడు దీరునా యని ప్రస్రవణాద్రియం దుండిరి.

క. తెచ్చెద నేనే సీతను, వ్రచ్చెద రావణునిఁబట్టి ♦ రయమున నని గా
ఢోచ్చావచోక్తులను గీ,శోచ్చయములఁ గూయఁదొడఁగె ♦ నొక్కఁడొకండున్.

గాథ + ఉచ్చావచ + ఉక్తులను = అధికమయిన నానావిధములైన మాటలను, 'ఉచ్చావచం నైకభేద'మ్మని యమరుఁడు. కీశోచ్చయములన్ = వానరసమూహములందు.

తా త్ప ర్య ము .

నేనే సీతను దెచ్చెదను, రావణుని నేనే బట్టి చీల్చెదను, అని నానావిధములుగ వానరులందొక్కఁడొక్కఁడు కేకలువేయ నారంభించెను.

క. అఱచుచు బిగ్గఱ రదములు, గొఱుకుచు దెసలెల్ల నదుర్వఁ గూయుచుఁ దోఁకల్ చఱచుచు సింహారవంబులు, నెఱపుచుఁ బరువెత్తుచున్ వనేచరు లుండన్. ౧౧౪౭

అదుర్వన్ = అదరునట్లు, ఇందు అకారము లఘువు, చఱచుచున్ = కొట్టుచు.

తా త్ప ర్య ము .

గట్టిగా నఱచుచుఁ బండ్లుగొఱుకుచు దిక్కు లదరునట్లు తోఁకలు నేలమీఁదఁ గొట్టుచు సింహనాదములు సేయుచు వానరులు పరువెత్తుచుండఁగా,

క. నేనే రావణుఁ గిట్టి మ,హానీకమునందుఁ బట్టి యణఁగఁగ గొట్టన్ జానకి భయమున వణఁకం,దే నేర్తును మీర లింద నిలువుఁడు కోృతుల్. ౧౧౪౮

కిట్టి = సమీపించి, మహానీకమునందు = గొప్పయుద్ధమునందు

తా త్ప ర్య ము .

ఓ కోృతులారా! యీ చిన్నపనికి మీ రందఱేల? నిలువుఁడు. నేనొకఁడనే పోయి రావణు సమీపించి యుద్ధమున వాని నణఁగఁ ద్రొక్కి భయముచే సీతాదేవి వణఁకుచుండఁగా దేగలను.

క. అంచు నొకరుండు పల్కినఁ, దుృంచెద వృక్షముల గిరులఁ దూలించెద నెం డించెద సింధువు ధరఁగా,రించెద జానకిని వే హరించెద నేనే. ౧౧౪౯

తా త్ప ర్య ము.

అని యొకఁడు చెప్పఁగా మఱియొకఁడు చెట్లను బడఁగొట్టెదను, కొండల నూఁచెదను, సముద్రము నెండించెదను, భూమిని బాధించెదను, జానకిని నేనే తెచ్చెదను, అని యనెను.

క. అనవుడు నొక కపి నే యో,జనశతమున్ దాఁటువాఁడ జవమున ననఁగా విను నే దాఁటుదును జివ్వ,క్కన నంతకు నెక్కుడనుచుఁ గోృతి యొకఁడనున్.

తా త్ప ర్య ము .

మఱియొకఁడు నేను వేగమున నూఱామడ దాఁటెద ననఁగా నూఱామడ యేమిలెక్కరా, నే నంత కెక్కువ దాఁటెద నని వేఱొకరుఁ డనెను.

క. భూమిని బాతాళంబున, భీమమహీధరములందుఁ బెనుఁ గోనల ని స్సీమాబ్ధి నడ్డులేకు,న్దామగతిం జనుదు ననుచుఁ దరుచరు డొకఁడున్. ౧౧౫౧

తాత్పర్యము.

భూమియందుఁ బాతాళమునందుఁ బెద్దకొండలందుఁ బెద్దకోనలందుఁ బారము లేని సముద్రమందు నేనడ్డములేక మిగుల వేగముగఁ బోఁగలనని మఱియొక కోఁతి యనెను.

క. ఇటు లొక్కొక్కఁడు తన తన, పటుజవసత్త్వములు దెలియఁ ♦ బలుకుచు దర్పో
ద్భటుఁ డై కపిరాజేంద్రు ని,కటతలమునఁ బలికె నధిక ♦ గర్వ మెలర్పన్. ౧౧౫ ౨

తాత్పర్యము.

ఈ ప్రకార మొక్కొక్కవానరుఁడు తన తన వేగము బలము తెలియఁబలుకుచు గర్వాధిక్యమున సుగ్రీవుని సమీపమునఁ బలికిరి.

— { ౪౬-వ సర్గము. సుగ్రీవుఁడు శ్రీరామునితోఁ దాను భూమండలముఁ జూచిన విధానముఁ జెప్పుట. } —

సీ. వానరవరు లిట్లు ♦ పయనించి చనఁ గీశ, రాజనస్యునితోడ ♦ రాముఁ డనియె
నీ కెట్లు దెలియు నీ♦నిఖిలభూవలయంబు, చెప్పుమా యన భక్తిఁ♦ జెప్పఁదొడఁగె
దుందుభిదైత్యుండు ♦ దున్నయై రా వాలి, మలయంబు దాఁకఁ ద♦ఱ్మంగ నతఁడు
తద్గుహాబిలమును ♦ దరమునఁ జొచ్చిన, వానిఁ జంపఁగఁ జొచ్చె ♦ వాలి దాని
తే. నే గుహాద్వారమునను వి♦నీతి నుంటిఁ, గడచె సంవత్సరం బన్న ♦ క్రమ్మఱండు
నెత్తురవఱదల బిలమెల్ల ♦ నిండె నంత, వాలి హతుఁడయ్యె నని చాల♦వగపుచెంది.

తాత్పర్యము.

వానరు లంద ఱీ ప్రకారము ప్రయాణమైపోఁగా సుగ్రీవునిఁజూచి రామచంద్రమూర్తి యీ సమస్తభూచక్రము నీ కెట్లు తెలియును చెప్పుమని యడుగఁగా భక్తితో నతఁ డిట్లు చెప్పఁదొడఁగెను. దుందుభి యను దైత్యుఁడు దున్నపోతై వాలిమీఁదికి యుద్ధమునకు రాఁగా వాలి యతనిని మలయపర్వతముదాఁకఁ దఱిమెను. వాఁడును భయపడి యా పర్వతమందలి గుహను బ్రవేశించెను. వానిఁ జంపవలయు నని వాలియు వెంటనే ప్రవేశించెను, నేను వినయముతో గుహాద్వారమున నుంటిని, ఒక్కసంవత్సర మాయెను. అన్న మరల రాలేదు. నెత్తురువఱదలు బిలమంతయు నిండెను. అది చూచి వాలి చచ్చెనని వ్యసనపడి,

క. కొండనుబోలిన యొక పెను,గుండుం గొనివచ్చి యిడితి ♦ గుహవాకిట దై
త్యుండును వెడలఁగ నేరక, చండాంశుతనూజుఁ జూడఁ ♦ జనుఁగా కనుచున్.

చండాంశుతనూజున్ = యముని.

తాత్పర్యము.

కొండవంటిపెద్దగుండు నొకదానిని దెచ్చి గుహలోనుండి దైత్యుఁడు వెలికి రాలేక లోపలనే చావ నిమ్మని దాని వాకిటి కడ్డముగా నుంచితిని.

తే. అంతఁ గిష్కింధకును వచ్చి ♦ యన్న చచ్చెఁ
గాక యని నిశ్చయించి నా♦కాంతలుగను
దారరుమను గ్రహించి వి♦స్తారరాజ్య
భార మేను వహించితి ♦ బంధుయుక్తి. ౧౧౫౫

తాత్పర్యము.

అంతఁ గిష్కింధకు వచ్చి యన్న చచ్చెనని నిశ్చయించి తారను రుమను నా భార్యలుగ గ్రహించి బంధువులతోఁ గూడి విస్తారరాజ్యభారమును వహించితిని.

చ. పదపడి వాలి దానవునిఁ ♦ బట్టి వధించి పురంబుఁ జేర నే
ముదమున గౌరవంబునను ♦ మ్రొక్కి భయంబున రాజ్య మిచ్చితిఁ
మదలుళితేంద్రియుం డగుచు ♦ మచ్చర మూని దురాత్ముఁడై నను
సదనముఁ బాయఁగొట్టి మఱి♦చంపఁగఁ బూనె నితాంతకోపియై. ౧౧౫౬

మదలుళితేంద్రియుండు = మదముచేఁ జలించు నేత్రములు గలవాఁడై, సదనము = ఇల్లు, దానవుని = మాయావిని.

తాత్పర్యము.

ఆవల వాలి దానవునిఁ బట్టుకొని చంపి పురంబుఁ జేరరాఁగా నేను సంతోషముతోను గౌరవంబునను మ్రొక్కి భయముతో రాజ్యమిచ్చితిని వాలియు మదముచే గ్రుడ్లు ద్రిప్పుచు మచ్చరము వహించి దుష్టమనస్సుగలవాఁడై నన్నిల్లు వెడలఁగొట్టి మిగులఁ గోపమున నన్నుఁ జంపఁబూనెను.

ఇక్కడఁ జెప్పిన యీ చరిత్రమే ముందు సుగ్రీవుఁడు రామచంద్రమూర్తికిఁ జెప్పెను. అప్పుడు మాయావి దుందుభి యనువారు మయుని పుత్రులనియు మాయావి యన్నయనియు దుందుభి తమ్ముఁడనియు (౨౩౩ ప) మాయావిని దఱుముకొని వాలిసుగ్రీవులు పోయినట్లును వాలి మాయావిని గుహలోఁ జంపినట్లును అప్పుడు సుగ్రీవుఁడు గుహాద్వారమున గుండు వేసి వచ్చినట్లు అది మొదలు విరోధము వచ్చినట్లు చెప్పఁబడెను. తరువాత దుందుభి దున్నపోతై వచ్చినట్లును వాలి వానిని కిష్కింధ యొద్దనే చంపి వాని శరీరమును విసరివైచినట్లును జెప్పఁబడెను.

ఇచ్చట గుహలోఁ జంపఁబడిన ట్లర్థమగుచున్నది. ఈ స్వోక్తివ్యాఘాతమునకు సామరస్యమెట్లు?

కొందఱు మాయావికే దుందుభియనియుఁ బేరుగలదని యనిరి.ఇది నిరాకరము. వారి యిరువురి చరిత్రమును వేఱువేఱుగఁ జెప్పఁబడెను. ఒకఁడు గుహలోఁ జచ్చెను. ఒకఁడు కిష్కింధ యొద్దఁ జచ్చెను.

కొందఱు దుందుభి కొడుకు మాయావి గనుక తండ్రి కొడుకుల కభేదముగ నిట్లు చెప్పె నందురు. అదియు సరిగాదు. దుందుభి కొడుకు మాయావి యనుటకు నిస్సందిగ్ధ ప్రమాణము లేదు - "మాయావీ నామ తేజస్వీ పూర్వజో దుందుభేస్సుతః"

అను వాక్యమునకు "దుందుభేః పూర్వజః అగ్రిజః సుతః మయస్యేతి శేషః, వక్ష్యతు త్తర కాండే మయః - మాయావీ ప్రథమస్తాత దుందుభి స్తదనంతరం ఇతి" అని గోవింద రాజీయమునఁ గలదు.

కం. ఇరువురు కొడుకులు నాకు న,మరసుందరి యందుఁగలరు ♦ మాయావి యనఁ
బరఁగెను జ్యేష్ఠుఁడు దుందుభి, వరబలుఁడు ద్వితీయుఁడగుచు ♦ వర్తిలు జగతిన్.'
ఉత్తర ౨౫-౨ ప.

వాల్మీకి శైలిని బట్టి సామరస్యమిట్లు కల్పింపవచ్చును. మాయావి దుందుభు లిరువురు తొలుత యుద్ధమునకు వచ్చినవారే, వాలి యొకఁడే వచ్చునేమో యిరువురు గలసి చంపుద మని వారాలోచించి యుండవచ్చును. వాలి సుగ్రీవు లిరువురు వారి వెంటఁ బడుటచే భయపడి పరువెత్తి గుహలో దూఱిరి. అందు నే విధముగనో దుందుభి తప్పించుకొని పోయియుండి యావలఁ బూర్వ వైరము స్మరించి మరల దున్నయై వాలి మీఁదికి వచ్చి చచ్చి యుండవలెను.

అటుగాకున్నఁ జెప్పినదే మరలఁ జెప్పినట్లగును. అందు సారస్య మేమి గలదు. అచ్చటఁ దారను సుగ్రీవుఁడు దాను గ్రహించినట్లు చెప్పలేదు ఇక్కడఁ జెప్పెను.

ఇరువు రొక కార్యముఁ జేసినపు డొకరి నొకచోట మఱియొకరిని మఱియొక చోటఁ జెప్పుట వాల్మీకి శైలి. సుందరకాండమున రావణుఁడు సీతను జంపఁబోయి నపుడు ధాన్యమాలిని మండోదరి యిరువురు నడ్డము రాఁగా నొకరి నొకచోట మఱి యొకరిని మఱియొకచోటఁ జెప్పెను గదా.

క. నా సచివులతో నేనును, వేసరక పవళ్లు రేలు ♦ వే పరువిడఁగన్
రోసంబున నాతండును, గాసి గనక వెంట నంటెఁ ♦ గలహప్రియుఁడై. ౧౧౫౨
సచివులతోన్ = మంత్రులతో

తాత్పర్యము.

నా మంత్రులతో నేను విసుఁగు వేసట లేక రేయింబగళ్ళు వేగముగఁ బరు గెత్తఁగాఁ గోపముతో నతండును గలహకాంక్షచే మమ్ము వెంట నంటెను.

తే. కొఱవిచక్రంబు రీతిని ♦ గొఱలుదాని, గోష్పదం బన నొప్పఁగఁ ♦ గుతల మెల్ల
నద్దమునఁ జూచినట్టుగ ♦ నపుడు గంటిఁ, బఱచి పఱచి పదంబులు ♦ వాఁపుచూప.

గోష్పదము = ఆవుగిట్ట, కుతలము = భూప్రదేశము, కొఱవి చక్రంబురీతిని = కొఱవి కట్టెను ద్రిప్పిన గుండ్రముగాఁ దోఁచు నిప్పు చక్రమువలె, చక్రవాళ పర్వతము చుట్టియుండుటచే నిట్లు చెప్పఁబడెను.

తాత్పర్యము.

కొఱవి కట్టె ద్రిప్పినఁ దోఁచు చక్రమువలె గుండ్రముగా నుండు దానిని నా ముఖము నా కద్దములోఁ గనఁబడినట్లు స్పష్టముగ గోష్పదమువలె భూమండల మంతయుఁ గాళ్లు వాఁపు చూపఁ బరువెత్తి పరువెత్తి చూచితిని.

సీ. తూరుపుగా నేగి ♦ తోరంపుద్రుమములు, సరసులు నదులును ♦ శైలములును
నుదయపర్వతము క్షీ♦రోదముఁ గనుఁగొని, వెనుకకు మరలితి ♦ వీఁకఁ దెగవ
నంత దక్షిణమున ♦ హరివింధ్యాద్రివృ,క్షాళిని జందన♦పాళిఁ గంటి
నది వీడి వరుణది♦శాభిముఖుండ నై, యస్తాద్రిలోనగు♦నవి యుఁ గంటి
తే. యక్షపతిదిశ కేగి హి♦మాచలంబు, మేరువు సముద్రమును గంటి ♦ శూరవర్య
తలను దాఁపఁగ జేనెఁడు ♦తలముఁ లేద, యంత హనుమంతుఁ డిట్లనె♦నాదరమున.

ద్రుమములు = చెట్లు, క్షీరోదము=పాలసముద్రము, ఎగవక = తెలియమఁగా, వరుణదిశ = పడమర, యక్షపతిదిశ = కుబేరదిక్కు, ఉత్తరము.

తాత్పర్యము.

తూరుపు దిక్కుగాఁబోయి పెద్దచెట్లు, సరస్సులు, నదులు, కొండలు తూర్పుకొండ పాలసముద్రమును జూచి వెనుకకు మరలితిని - వాలితఱుమఁగా దక్షిణపువైపుపోయి వింధ్యపర్వతమునందలి వృక్షములను జందనములను జూచితిని - పశ్చిమముగాఁబోయి యస్తాద్రి మొదలైనవి గంటిని-ఉత్తరముగఁ బోయి హిమాలయము మేరువు సముద్రముఁ జూచితిని- ఎక్కడకుఁ బోయినను దలను దాఁచుటకు జేనెడు స్థలము దొరకలేదు. అప్పుడు హనుమంతుఁ డిట్లనెను.

చ. మున్ను మతంగమౌని హరి♦ముఖ్యు నెడాటమునన్ సమన్యుఁడై
యిన్నగ మెక్కునేనియు మ♦హీస్థలి వాని శిరంబు వ్రక్కలై
క్రన్నన కూలు నంచనియె ♦ రాజవరా! యది నాకు నిప్పు డా
త్మ న్నెఱిదోఁచె నన్న విని ♦ తద్విధిఁజేసి సుఖించితిం జుమీ. ౧౧౬౦

ఎడాటమునన్ = విషయమున, "నెపమేమియును లేక నీ యెడాటమ్మునఁ బాడిదప్పఁడుగదా భైరవుఁడు" భీమేశ్వర ౨. ఆ. సమన్యుఁడై = కోపముగలవాఁడై.

తాత్పర్యము.

పూర్వము మతంగమౌని వాలివిషయమునఁ గోపించి యీ పర్వతమెక్కునేని వాని తల వ్రక్కలై నేలఁ గూలు నని శపించెఁగదా. అది నాకు రాజా! యిప్పుడు స్మృతికి వచ్చినది యనిన నిచటికి వచ్చి సుఖపడితిని.

క. ఈ వసుధాధరగుహకు నృపా! వాలియు రాఁడు శాప♦భయమున; నే ధా
త్రీవలయము ప్రత్యక్షము,గా వాసవతేజ! నాఁడు ♦ గంటి ననంగన్. ౧౧౬౧

ఈ వసుధాధర గుహకున్ = ఈ ఋశ్యమూక పర్వతగుహకు, సీతాభరణములు దాఁచియుండు గుహకు.

తాత్పర్యము.

శాపమువలని భయమున వాలి యీ ఋశ్యమూక పర్వత గుహకు రాఁడు. ఆనాఁడు భూమండలమంతయుఁ గన్నులారఁ జూచితిని.

ఇప్పుడు రామచంద్రమూర్తి నీవు ప్రత్యక్షముగ నింత దేశముఁ జూచితివి గదా. లంక యెం దున్నదని నే నడిగినప్పుడు నాకుఁ దెలియదని యేల చెప్పితి వని యేల ప్రశ్నింపలేదు.

ఇప్పుడు సీతాదేవిని వెదకుటయందు సుగ్రీవుఁడు చేసిన ప్రయత్న బాహుళ్యముఁ జూచి యప్పుడు తనకు లంకా వృత్తాంతముఁ జెప్పకుండినదే బుద్ధిమంతుని లక్షణ మని తోఁచి యడుగలేదు. అప్పుడు చెప్పియుండిన నిచట సుగ్రీవుని కార్యము చెడి యుండును. సీతాదేవి యెం దున్నదియు జీవించి యుండునది లేనిది తెలియక రామ లక్ష్మణు లిరువురు మాత్రము లంక యొద్దకుఁ బోయి యేమి లాభము? ఇది యాలోచించి సుగ్రీవుఁడు చేసిన యాలోచనయే బాగని తోఁచి ప్రశ్నింపలేదు. కావుననే "స్వాంతమునందు మా హితము వాంఛ యొనర్చెద వేనెఱుంగుదుర్" (౧౦౨౮ ప.) అని వచించెను.

—♦ ౪౭ వ సర్గము. వినతాదులు సీతను గానక వచ్చుట ♦—

సీ. అట సీత వెదకంగ ♦ నర్కతనూభవుం, డానతిచ్చినయట్లు ♦ హరివరులును
నరిగి దుర్గంబులు ♦ నద్రులు నగరముల్, నదులు సరస్సులు ♦ నభము పొదలు
కాననతలములుఁ ♦ గడు హెచ్చరిక మీఱఁ, బగళుల రోసి మా ♦ పగుడు నొక్క
యెడఁ జేరుచుండిరి ♦ హితఫలద్రుమములఁ,లోఁ జూచి తత్ఫలా♦ళులు భుజించుచు
తే. యామినుల నందఱును జేరి ♦ యాత్మచరిత
ములను జెప్పుచు నిద్దుర♦పోదు రవల
నఖిలభూమండలం బిట్లు ♦ నెమకు చుండ
మాస మగుడును వానరుల్ ♦ మగిడి రందు. ౧౧౬౨

నభము = ఆకాశము, యామినులన్ = రాత్రులందు, నెమకు = వెదకు.

తాత్పర్యము.

ఆ ప్రకారము సీతాదేవిని వెదకుటకై సుగ్రీవునిచేఁ బంపఁబడిన వానరులాయన యాజ్ఞ చేసినట్లు పోయి దుర్గములు కొండలు పట్టనములు నదులు సరస్సులు ఆకాశము (బయళ్ళు) పొదలు అడవి ప్రదేశములు మిక్కిలి జాగరూకులై పగటి వేళలందు వెదకి రాత్రి కాఁగానే యంద ఱొక్కచోటఁ జేరుచుఁ బండ్లచెట్లలోఁ దమకు బాగని తోఁచిన వానిని దినుచు వారువారు చూచినవి చెప్పుచు నిద్దురపోవు చుండిరి. ఈ ప్రకారము భూమండల మంతయు వారు వెమకఁగా నెల గడువు కాఁగానే తిరిగి వచ్చిరి. ఇట్లు చెప్పుటచేఁ బగటి వేళలందు వారికి నాహారము గాని విశ్రాంతి గాని లేదని భావము.

ఉ. తూరుపుదిక్కు రోసి వినతుం డరుదెంచెను వ్యర్థుఁ డౌచుఁ, గా
బేరదిశం జరించి హరి♦విక్రముఁ డా శతవల్యభిఖ్యుఁడున్

వారుణదిక్కుఁ జూచి వెస ♦ వచ్చె సుషేణుఁడు మాసమైన, వా
రా రవివంశయుక్తుఁ బ్లవ♦గాధిపుఁ జూచి వచించి రీ గతిన్. ౧౧౬౩

తా త్ప ర్య ము .

తూర్పుదిక్కు పోయిన వినతుఁడు వ్యర్థుఁడై వచ్చెను. ఉత్తర దిక్కుపోయిన శతవలియుఁ బడమటఁబోయిన సుషేణుఁడు నెలకాఁగానే వచ్చి రామచంద్రమూర్తితో నున్న సుగ్రీవునితో నిట్లనిరి.

ఈ నెలదినములు సుగ్రీవుఁడు రామచంద్రమూర్తితోడనే యుండెను గాని కిష్కింధకుఁ బోయినవాఁడు కాఁడు.

చ. వెదకితి మెల్లయూళ్ళుఁ బృథి♦వీధరముల్ వనముల్ గుహాళులున్
వెదకితి మెల్ల పల్లియలు ♦ నిమ్నగలున్ విషమస్థలంబులున్
మదవతిఁ గాన మెందు వన♦మండలి భీతిదసత్త్వకోటులన్
జిదిమితి మెందు లేదు సతి ♦ సీత నిజం బిది వానరేశ్వరా! ౧౧౬౪

నిమ్నగలు = ఏళ్ళు, విషమస్థలంబులున్ = మిట్టులు పల్లములు, మదవతి = స్త్రీ, సీతాదేవి, భీతిద = భయము కలిగించు, సత్త్వకోటులన్ = మృగ సమూహములను, చిదిమితిమి = చంపితిమి.

తా త్ప ర్య ము .

సమస్తములైన పల్లెలు, ఊళ్లు, కొండలు, వనములు, గుహాలు, ఏళ్ళు, మిట్టులు, పల్లములు పోవుటకుఁ గష్టమైన స్థలములు వెదకితిమిగాని యెందును సీత గానరాలేదు. అడవులందలి భయంకరజంతువులఁ జంపితిమిగాని సీత యెందును లేదు. ఇది నిజము.

ఉ. ధీరుఁ డుదారసత్త్వకుల♦దీపకుఁ డద్రిచరేంద్రరత్న మా
మారుతసూతి రామవిభు♦మానిని యుండెడి దక్షిణాశకై
శూరజనంబుతోఁ జనియెఁ ♦ జూచియ వచ్చును భూమికన్య నే
తీరున నైన నంచును బ్ర♦తీక్ష యొనర్చిరి వాయుజాదులన్. ౧౧౬౫

ధీరుఁడు = (౧) ఎంత సాహసమైనఁ జేయఁగలవాఁడు, (౨) పండితుఁడు, గ్రుడ్డిసాహసముగాక జ్ఞానముతోఁగూడిన సాహసముగలవాఁడు, ఉదారసత్త్వ = గొప్ప బలముగల, కుల = వంశమునకు, దీపకుఁడు = దీపమువలెఁ బ్రకాశింపఁజేయువాఁడు, ఉదారసత్త్వుఁడు = మహాబలుఁడని పేరు గన్న వాయుదేవుఁడు, ఆయన వంశమును వెలిగించువాఁడు, అద్రిచరేంద్రరత్నము = వానరశ్రేష్ఠులలో శ్రేష్ఠుఁడైనవాఁడు. మారుతసూతి = వాయుపుత్రుఁడు, కావున వాయువువలె ప్రతిహతగమనము, చొరరానిస్థలము లేనివాఁడు, ప్రతీక్ష యొనర్చిరి = వేచియుండిరి. హనుమంతుఁడు సీతాదేవిని జూచియే వచ్చుననుటకు సన్నియుఁ గారణము లే.

తా త్ప ర్య ము .

హనుమంతుఁడు స్వభావముననే సాహసి - కార్యార్థమై యెంతకైనఁ దెగించువాఁడు. అందుఁ బండితుఁడు కావున నాలోచించి కార్యములు చేయువాఁడు (౨) మహాబలవంతు లని పేరుపొందిన వంశమునకుఁ బ్రకాశము గలిగించువాఁడు. కావున వంశమునకుఁ గీర్తి తెచ్చునే కాని యపకీర్తి తేఁడు (౩) వానరశ్రేష్ఠులలో రత్నము వంటి వాఁడు. వీరి కందఱకు నసాధ్యమైనది యీయనకు సుసాధము. (౪) వాయు కుమారుఁడు కావునఁ దండ్రివంటి వేగము బలము అప్రతిహతగమనము గలవాఁడు. దుష్ప్రవేశమైన స్థలము లేనివాఁడు. కడుపులో దాఁచినను దెలిసికొనఁగలవాఁడు. ఆయన పోయినదా సీతాదేవి యుండు దక్షిణ దిక్కునకే. కూడఁ బోయినవారా మహాశూరులు. కావున సీతాదేవిని దప్పక చూచియే వచ్చునని యీయన రాకకై యందఱు వేచియుండిరి. ఈయన యిట్టివాఁ డనియేకదా హనుమంతుని గడపటఁ బ్రత్యేకముగాఁ బిలిచి నీవీ కార్య మెటులైన సాధింపుమని సుగ్రీవుఁడు చెప్పెనే కాని గడువునకుఁ బ్రాధాన్య మీయలేదు. కార్యము ప్రధానముగాని కాలము ప్రధానము గాదు.

♦ ౪౮-వ సర్గము. హనుమంతుఁ డంగదాదులతో వింధ్యంబున సీతను వెదకుట. ♦

క. తారాంగదసంయుతుఁడై, మారుతి రవిసంభవోక్త♦మహీమండలముఁ
జేరంగ నరిగె నిటు గడు,దూరంబుగ నరిగి క్రోతి♦తుటుములు వింధ్యన్. ౧౧౬౬

రవిసంభవ = సూర్యపుత్రుడైన సుగ్రీవునిచే, ఉక్త =చెప్పబడిన, తుటుములు సమూహములు.

తా త్ప ర్య ము .

తారుఁడు అంగదుఁడు వీరితోఁ గూడినవాఁడై హనుమంతుఁడు సుగ్రీవుఁ డెచ్చట మీరు ప్రారంభింప వలసిన దని చెప్పెనో దూరమున నుండు నా ప్రదేశమునకు వింధ్య పర్వతమునకుఁ బోయి క్రోఁతుల గుంపులు, దానును.

చ. గహనములుఁ నగాగ్రములు ♦ కాననసీమలు భూరివృక్షముల్
గుహలును బర్వతంబులును ♦ ఘోరభయంకరదుర్గదేశముల్
సహనముతోడ నన్నియు ది♦శల్ పరికించెను గాని యెయ్యెడన్
మహిసుత లేద వెండియును ♦ మర్కటముల్ ధృతి నేకచిత్తతన్. ౧౧౬౭

సహనముతోడన్ = ఓర్పుతో, ఏకచిత్తతన్ = ఒక మనస్సుతో.

తా త్ప ర్య ము .

దుర్గములు, కొండకొనలు, శిఖరములు, అడవిప్రదేశములు, పెద్ద వృక్షములు గుహలును కొండలు మిగుల భయంకరములైన కోటలు లోనగునవి తొందర లేక

రూర్పుతో నన్నిదిక్కులందుఁ జూచెను గాని సీతాదేవి యెక్కడఁ గానరాలేదు. మఱియును వానరులు ధైర్యవంతులై యేకమనసుతో.

క. కందరబృందంబులచేఁ, దుందిల మై చొరఁగరాని ♦ దుస్సహ దేశం
బందు శ్రమంపడి వెదకుచు, నందంద వసించి మెక్కె ♦ నమలఫలాదుల్. ౧౧౬౮-

కందర బృందంబులచేఁ = గుహల సమూహములచే, తుందిలమై = నిండినదై.

తాత్పర్యము.

గుహల సమూహములచే నిండి ప్రవేశింపరాని, సహింపరాని ప్రదేశములందు మిగులఁ గష్టపడి వెదకుచు నచ్చట నచ్చటనే యుండుచు నిర్మలఫలములఁ దినెను.

క. నిర్జల మై శూన్యం బై, నిర్జనమై గహన మగుచు ♦ నిఖిలమృగాళీ
గర్జనల మించు నా వని, వర్జించియు నెమకి యట్టి ♦ వానిని గొన్నిన్. ౧౧౬౯

నిర్జలమై - నీళ్లులేనిదై, శూన్యంబై = చెట్లు చేమలు లేనిదై, నిర్జలమై = మనుష్యులు లేనిదై, గహనము = చొరరానిది, నెమకి = వెదకి.

తాత్పర్యము.

జలము - చెట్లు - మనుష్యులు లేనిదై చొరరానిదై సమస్తమృగముల ధ్వనులు గలదైన యడవిని వదలియు నట్టివానిని గొన్ని వెదకి.

సీ. అకుతోభయులు కపు ♦ లన్యదేశం బొంది, ఫలములుఁ బూలు నా ♦ కులును లేని
వృక్షముల్ గలదాని ♦ హీనతోయములైన, యేళులు గలదాని ♦ మూలములును
దొరకనిదానిని ♦ గరులు మృగంబులు, వ్యాఘ్రముల్ దున్నలు ♦ భవ్యములగు
వనగోచరంబులు ♦ పక్షులు గనరాక, పాడిడినట్టులు ♦ పరఁగుదాని

తే. తృణ్మజములుగాని పొదరులు ♦ గాని యోష, ధీసమూహంబులునుగాని ♦ తీఁగె గాని
లేద యచ్చట స్నిగ్ధసా ♦ మోదవికసి, తస్థలీపద్మినులఁ దమ్మె ♦ దలును గనవు. ౧౧౭౦

అకుతోభయులు = భయమెట్టిదో యెఱుఁగనివారు, స్నిగ్ధ = నునుపైన, సామోద = వాసనతోఁగూడిన, వికసిత = వికసించిన, స్థలీపద్మినులు = మెట్టతామరలు.

తాత్పర్యము.

భయమెఱుఁగని యా కోఁతులు మఱియొకప్రదేశము పండ్లు, పూలు, ఆకులు లేని చెట్లుగలదానిని, నీళ్లులేని యేళ్ళుగలదానిని, వేళ్ళుకూడ దొరకనిదానిని, ఏనుఁగులు, మృగములు, పులులు, అడవిదున్నలు, అడవులందుఁ గానవచ్చు మంచిపక్షులు లేనిదానిని పాడుపెట్టినట్లుండుదానిని చెట్లుగాని, పొదలుగాని, యోషధులుగాని, తీఁగగాని లేనిదానిని నొక ప్రదేశమును జూచిరి. అందు నునుపై వాసనగలిగి వికసించిన మెట్టతామరలందుఁ దుమ్మెదలును లేవు.

తే. సత్యవాది తపోధన ♦ సత్తముండు, కండుఁ డను వాని తనబాల ♦ కుండు పోడ
శాబ్దగుఁడు తన్మహారణ్య ♦ మందుఁ దప్పి, కానరాక నశించిన ♦ కారణమున. ౧౧౭౧

తా త్ప ర్య ము.

సత్యసంధుఁడును తపస్వులలో శ్రేష్ఠుఁడు నగు కండుఁ డను మహర్షి పదు నాలేండ్ల ప్రాయముగల తన కుమారుఁ డా యడవిలోఁ దప్పిపోయి కానరాకుండిన కారణమున.

క. ఆ ధర్మాత్ముఁడు దాని దు, రాధర్షము పక్షిమృగనిరస్తము విజనం
బై ధర నశరణ్యముగా, నేధితకోపమునఁ దిట్ట ♦ నీగతి పట్టెన్. ౧౧౨

దురాధర్షము = జనుల కసాధ్యమైనది, పక్షిమృగ నిరస్తము = పక్షులచే మృగములచే విడువఁబడినది, విజనంబు = జనములేనిది, అశరణ్యము = ప్రాణిరక్షకము గానిది, ఏధితకోపమునన్ = వృద్ధిమైన కోపముచే.

తా త్ప ర్య ము.

ఆ ధర్మాత్ముఁడు జనులు చేరరానిదిగను పక్షులు మృగములు లేనిదానినిగను జనహీనమైనదిగాఁ బ్రాణి రక్షణమునకుఁ గావలసిన దేదియు లేని దానిఁగా మిగులఁ గోపముచేఁ శపించిన కారణమున నా యరణ్య మీగతి పట్టెను. నీటి తామరలుకూడ మెట్టతామర లయ్యెను.

క. ఆ నగకందరములలో, నా నదులను గాననముల ♦ హరిసంఘము ల
బ్జాననను గాని హర్తను, దానవపతిఁ గాని కనక ♦ దానిన వెదకన్. ౧౧౩

అబ్జాననను = కమలము వంటి ముఖముగల సీతనుగాని, హర్తను = ఆమెను హరించినవానిని గాని.

తా త్ప ర్య ము.

ఆ పర్వత గుహలలోను నదులందును నడవులందును వానర సమూహములు సీతాదేవిని గాని యామెను హరించిన రాక్షసునిఁ గాని కానక యందే వెదకఁగా.

క. భీమంబుగ లతికాచయ,దామసమావృతుని నొక్క ♦ దానవుఁ గ్రౌర్యో
ద్దాముని సురనిర్భయుఁ గని, దీమసమునఁ గీశులెల్ల ♦ దృఢపరిహితులై. ౧౧౪

లతికాచయదామ = తీఁగల గుంపుల హారముచే, సమావృతుని = చుట్టఁ బడిన వానిని, క్రౌర్యోద్దామునిన్ = క్రూరత్వమందు గొప్ప వానిని, సురనిర్భయున్ = దేవతల భయములేనివానిని, దీమసమునన్ = ధైర్యముతో, దృఢపరిహితులై = గట్టిగా వస్త్రములు బిగించి కట్టుకొన్నవారై.

తా త్ప ర్య ము.

భయంకరముగఁ దీఁగల గుంపులను దేహమునకుఁ జుట్టుకొని మహాక్రూరుఁడైన యొక దానవుఁడు దేవతలకును భయపడనివాఁడు కానఁబడఁగా వానరులు ధైర్యముచే యుద్ధమునకు సన్నద్ధులై వస్త్రములు గట్టిగా బిగించి యెగఁజెక్కి.

క. నిలువంబడ వారలఁ గని, యలుకక చచ్చితిరి పొండ ♦ టంచును ముష్టిన్
బలియుఁడు గొని పై కుఱికినఁ,దలచుచు నా రక్కసుండె ♦ దశముఖుఁ డనుచున్.

అలుకక = జంకక.

తాత్పర్యము.

నిలువఁబడఁగా భయపడక యారాక్షసుడు చచ్చితిరి పొండని పిడికిలి పట్టుకొని వారిపై పడిరాఁగా వానరులు వాఁడే రావణుఁడని తలఁచిరి.

ఆ. అంగదుండు వాని ♦ నఱచేతఁ గొట్టిన, నెత్రు గ్రక్కి వాఁడు ♦ నేలఁగూలెఁ
గొండ గూలినట్లు ♦ క్రోఁతు లంతటఁ దత్ప్ర,దేశ మెల్ల వెదకి ♦ రిటుమ మీఁఱి.

నెత్రు=నెత్తురు, ద్విత్వాక్షరంబు సంయుక్తంబగుచో ద్విత్వంబునకు లోపంబు నిత్యంబు. అంబఁగ్గాఁచి, పందిక్ష్వేసి. సూత్రమువలన వచ్చిన ద్విత్వమునకు లోపము లేదు. ముక్తోఁగ్రివ.

తాత్పర్యము.

అంగదుఁడు వానిని నఱచేతఁ గొట్టఁ నెత్తురుగ్రక్కి వాఁడు కొండ గూలినట్లు కూలెను. అంత నా ప్రాంతముల సీత యున్నదని తలఁచి యా దేశమెల్ల వారు వెదకిరి.

తే. అన్యగహనంబు నొక్కటి ♦ యరసి యందు సీతఁ గానక ఖిన్నులై ♦ చేరి యంద
ఱొక్కచో నొక్కవృక్షంబు♦నొద్దఁ జేరి, కూరుచుండిరి దీనత♦గూరు మదుల.

తాత్పర్యము.

వేఱొక యడవివెదకి యందును సీతను గానక శోకాక్రాంతులై యందఱు నొకచోట నొక చెట్టుక్రిందఁ జేరి వ్యసనపడుచుఁ గూరుచుండిరి.

—♦ ౪౯-వ సర్గము. అంగదుఁడు కపుల నుత్సాహపఱుచుట. ♦—

క. అపుడు మహామతిమంతుఁడు, సుపరిశ్రాంతుఁడు వాలి♦సుతుఁ డిట్టు లనెఁ
గపులను మెల్లన నూరా,ఱుపఁ జూచుచుఁ దా శ్రమం బ♦ఱు న్వాక్యములన్.

సుపరిశ్రాంతుఁడు = మిగుల బడలినవాఁడు, శ్రమంబఱు న్వాక్యములన్ = శ్రమము పోఁజేయు మాటలను.

తాత్పర్యము-

అప్పుడు మిగుల బుద్ధిమంతుడును మిగుల బడలినవాఁడును నైన యంగదుఁడు తనవలెనే శ్రమపడిన వానరుల శ్రమముఁ బాపు వాక్యములచే వారిని నూరార్ప నిట్టు లనెను.

ఉ. కంటిమి దుర్గసంఘములు ♦ గంటిమి ఘోరదరీగిరీంద్రముల్
గంటిమి గహ్వరంబులను ♦ గంటిమి భూరిధునీవనీతతుల్
కంటఁబడంగ లేదు సుర♦కన్యకఁ బోలెడి సీత యేని వా
ల్గంటిని గొంచుఁ జన్న సుర♦కంటకుఁడౌ దశకంఠుఁ డేనియున్. ౧౧౭౯

దరీ = గుహలు, గిరీంద్రముల్ = పెద్దకొండలు, గహ్వరములు = పొదలు, ధునీ = నదులు, వనీతతుల్ = అడవుల సమూహములు,

తాత్పర్యము.

దుర్గములను జూచితిమి, గుహలు కొండలు చూచితిమి. పొదలు చూచితిమి. పెద్ద నదులను నడవులను జూచితిమి. దేవతాస్త్రీవంటి సీతగాని యామె నెత్తికొని పోయిన రావణుఁడు గాని కానరాలేదు.

క. మన మరుగుదెంచి కాలము, చనియెం బెద్దయు మహోగ్ర♦శాసనుఁడు సుఁడీ
యినజుండు గాన గుమిగా, మన మండలి మరయ వలయు ♦ మహిళామణినిన్.

మహోగ్రశాసనుఁడు = మిగుల భయంకరమైన యాజ్ఞ కలవాఁడు.

తాత్పర్యము.

మనము బయలుదేఱి చాలఁ గాలము గడచెను. సుగ్రీవుఁడా యాజ్ఞ మీఱిన వానిని క్షమించువాఁడు కాఁడు, కఠినముగా దండించును. కావున మన మండలము గుంపుగాఁ జేరి సీతను వెదకవలెను.

క. అలసత నిద్రయు శోకముఁ, దొలఁగఁగ విడి రోయవలయుఁ ♦ దోయజగంధిన్
దెలివియు నుత్సాహము వ్యథఁ,దలఁగుట యివి కార్యసిద్ధిఁ ♦ దప్పక కూర్చున్.

అలసత = సోమరి తనము.

తాత్పర్యము.

సోమరి తనము లేక జాగుచేయక నిద్ర, శోకము వదలి సీతను వెదకవలెను. తెలివి యుత్సాహము వెతలు లేకుండుట యివి కార్యసిద్ధిని దప్పక కలిగించును.

క. చనఁ ద్రోవ లేకయును నివ్వనసీమను వెదకవలయు ♦ వనజదళాక్షిన్
మనమున విసువక వదలక, పనిచేయుచు నున్న ఫల మ♦వశ్యము గలుగున్.

తాత్పర్యము.

ఈ యడవియందుఁ బోవఁ దోవలేక యుండినను సీతను వెదకవలయును. మనస్సునందు విసుగుకొనక విడువక పని చేసితిమేని కార్యము తప్పక ఫలించును.

ఆ. చాలు నింతసేపు ♦ సంతసించుటయును, గనులు మూసికొనుచుఁ ♦ గడపుటయును
మనకుఁ దగదు మఱియు ♦ మార్తాండపుత్త్రుండు, తీక్ష్ణదండుఁ డగుట ♦ తెలియలేర?

తాత్పర్యము.

ఇంతసేపు మనము సీత కానరాలేదని పరితాపపడుటయుఁ జాలును. పరితాపముతో నే కార్యము కాఁగలదు. ఎంతకాలము పోయినది యాలోచింపక గ్రుడ్డివారి వారివలె బనులు చేసినది చాలును. ఇట్టిది మనకుఁ దగదు. సుగ్రీవుఁడు తీక్ష్ణముగ దండించువాఁడని మీఱెఱుఁగరా యేమి?

క. మహితాత్ముఁడు రామునకును, సహిమకరతనూజునకు భ♦యంపడవలయున్
సుహిత మిది యనుచుఁ జెప్పితి, గహనచరుల్ సల్పుఁ డిచ్చ ♦ గలదేని యటుల్.

తాత్పర్యము.

గొప్ప మనస్సుగల రామచంద్రునకు సుగ్రీవునకు మనము భయపడవలసి

యున్నది. కార్యము చేయమేని యిరువురును గోపించి దండింతురు. ఇది మీకు మిగుల హితమైనదని చెప్పితిని. మీ యిష్టమున్న యెడల మీరట్లు చేయుఁడు.

క. కాకున్న మనకు సేమం, బౌ కార్యముఁ జెప్పుఁ డన్న ♦ నంగదువాక్యం
బాకర్ణించి పిపాస స,మాకులమతి యైన గంధ♦మాదనుఁ డనియెన్. ౧౧౫

తాత్పర్యము.

నేను జెప్పినది సరిగాదని తోఁచెనేని చేయవలసిన కార్యమేమో చెప్పుఁడు. అనిన యంగదు మాటలు విని దప్పిచే బాధపడు గంధమాదనుఁ డిట్లనెను.

క. అంగదు వాక్యము మీకు సు,సంగతము హితంబు మేలు ♦ సమకూర్చును గా
నం గావింపుఁడు సతి నా,భంగిని వెదకుదము దుర్గ♦పర్వతగుహలన్. ౧౧౬

తాత్పర్యము.

అంగదు వాక్యము మిగులఁ బొసంగియున్నది. మేలైనది కావున నా ప్రకారము పర్వతములందు గుహలందు వెదకుదము.

క. తరణితనూజుఁడు చెప్పిన,సరణిని గిరిదుర్గవితతి ♦ సకలము మహియుం
దరయఁగఁ దగు నన వెస లే,చిరి కీశులు దక్షిణమున ♦ సీతను వెదకన్. ౧౧౭

తాత్పర్యము.

సుగ్రీవుఁడు చెప్పిన మార్గమున దుర్గములందు గుహలందు సమస్త భూమి యందు వెదకఁ దగును, అనఁగానే యందఱు దక్షిణమున సీతను వెదక లేచిరి.

ఆ. చనుచు శారదాభ్ర,సన్నిభంబును దరీ,మంత మతులశృంగ♦వంత మైన
రజతశైల మెక్కి ♦ రమ్యలోధ్రవనంబు, సప్తపర్ణవనము ♦ సకల మరసి. ౧౧౮

శారదాభ్రసన్నిభంబు = శరత్కాలమేఘముతో సమానమైనది, దరీమంతము = గుహలు కలది అతుల శృంగవంతము = అసమానమైన శిఖరములు గలది, రజతశైలము = వెండివంటి తెల్లనికొండ, సప్తపర్ణవనము = ఏడాకుల యరఁటి చెట్ల తోఁపు.

తాత్పర్యము.

ఇట్లు పోవుచు శరత్కాల మేఘమువలెఁ దెల్లనైన గుహలు శిఖరములు గలిగిన తెల్లనికొండ యెక్కి లోధ్రవనమును నేడాకుల యరఁటులవనమును సకలము వెదకి,

క. విపులపరాక్రమయుతు లా,కపివీరులు తిరిగి తిరిగి ♦ కందరయుత మా
విపులాధరమెల్లను రో,సి పరిశ్రాంతాత్ములై వి♦చేతసు లగుచున్. ౧౧౯

విపులాధరము = పర్వతము, పరిశ్రాంతాత్ములు = బడలిన దేహములు గలవారు, విచేతసులు = వికలమైన మనస్సులు గలవారు, ఆగమశాస్త్ర మనిత్య మగుటచే కప్రత్యయమునకు లోపము.

తాత్పర్యము.

విస్తారపరాక్రమము గల యా కపివీరులు తిరిగి తిరిగి గుహలతోఁగూడిన పర్వత మెల్ల వెదకి గాసిపడినవారై వికలమనస్కులై.

తే. బడలి పర్వతమును డిగ్గి ♦ బయల నొక్క వృక్షమూలంబునందు నొ♦క్కింత నిలిచి
శ్రమ మొకించుక పాయంగ♦ నెమకఁదొడఁగి రల్లవింధ్యాద్రి నలుప్రక్క♦హరులుపూని.

తాత్పర్యము.

అలసి కొండ దిగి బయలందు నొక చెట్టుక్రింద కాసేపు నిలిచి కొంచెము బడలిక తీరఁగానే మరల వింధ్యపర్వతము నలువైపుల వెదకఁదొడఁగిరి.

—♦ ౫౦-వ సర్గము. హనుమదాదులు ఋక్షబిలంబుఁ బ్రవేశించుట. ♦—

సీ. అనిలసుతుండు తా♦రాత్మజతారసం,గతి సింహశార్దూల♦యుతతలాళి
నాపగల్ శిలలు మ♦హాఝరులను రోసి, కొండప్రైఁ గోణప♦కోణమునను
గపులతో నుండ స♦గ్గడువును గడచెల్లె, హనుమంతుఁ డంత స♦న్యోన్యనికట
తలవర్తులుగను మైం♦దద్వివిదాంగద, గజసుషేణగవాక్ష♦గవయశరభ

తే. గంధమాదనులను నిల్పి♦క్రమముగాఁగ, శైలజాలావృతం బగు♦శమనదిశను
గలుగు దేశంబు రోయంగ ♦ బలిత మైన, క్షుత్పిపాసలకును జిక్కి♦సొమ్మసిలుచు.

అనిలసుతుండు = హనుమంతుఁడు, తారాత్మజ + తారసంగతిన్ = అంగద తారులతోడ, ఆపగల్ = నదులు, ఝరులు = ప్రవాహములు, కోణపకోణమునను= నైఋతిమూలయందు, నైఋతిమూల యని చెప్పుటచే వీరిపుడు పడమటి కనుమల (Western Ghats) దక్షిణపువైపు పల్లని గుట్టలందు (Paline Hills) నున్నారని తోఁచెడిని. గడువును గడచెల్లె=నెలగడువును ముగిసిపోయినది, మార్గశిరమాసమందు వానరులు బయలుదేఱిరి. కావున నిది పుష్యమాసమై యుండవలెను. ఒక నెల స్వయంప్రభ గుహయందుఁ బోయెను. (చూ: ౧౨౩౪ పద్యము.)

కొండలిది మొదటినెల గడచెననియుఁ గొండలు రెండవనెల గడచె ననియు నభిప్రాయపడియున్నారు. మొదటినెల యనుటయె సరియని తోఁచెడిని- (౧౨౩౪ ప). దండకారణ్య మంతయు నడవులు కొండలు గావున నెక్కువకాలము పట్టెను.

నికటతలవర్తులు = సమీపప్రదేశమందున్నవారు, శమనదిశను = దక్షిణమున, శైలజాలావృతంబు = పర్వతసమూహములచే నావరింపఁబడిన, క్షుత్ + పిపాసలకు = ఆకలి దప్పులకు, సొమ్మసిలుచున్ = సోలిపోవుచు.

తాత్పర్యము.

ఆంజనేయుఁడు తారునితోడను - అంగదునితోడను గూడి సింహములు పులులు గల ప్రదేశములు నదులు కొండలు పెద్ద ప్రవాహములు వెదకి వింధ్య పర్వతముమీఁద నైఋతిమూలయందుఁ గోతులతో నుండఁగా సుగ్రీవుఁడు పెట్టిన

గడువు గడచిపోయెను. అంత హనుమంతుఁ డొకరి సమీపమం దొక రుండు వారినిగ మైంద ద్వివిదులను అంగద గజ సుషేణ గవాక్షు గవయ శరభులను గంధమాదనుని నిల్పి వరుసగాఁ బర్వత సమూహములచే నావరింపఁబడిన దక్షిణ దిక్కునఁ గలుగు దేశంబు వెదకుచు బలిష్ఠమైన యాఁకలి దప్పులకుఁ జిక్కి సొలి పడుచు.

నైఋతినుండి దక్షిణ దిక్కుగాఁ బయనించి రనుటచేఁ దూర్పుగాఁ దిరుగవ్రేల్లి యా ప్రాంతములకు వచ్చిరని యేర్పడుచున్నది.

తే. నీరములు రోయ వల్లికా♦వారవృతము, దనుజసంరక్షితం బైన♦ఘనబిలంబు
ఋక్షబిల మనుదానిని ♦ వృక్షచరులు, గాంచి రందుండి యార్ద్రప♦క్షాంచితములు.

వల్లికావార వృతము = తీఁగల గుంపులచేఁ జుట్టుకొనఁబడినది. దనుజసంరక్షితంబు = మయుఁడను దానవునిచే రక్షింపఁబడినది. ఆర్ద్రపక్షాంచితములు = తడిసిన ఱెక్కలచే నొప్పునవి.

తా త్ప ర్య ము.

నీటికై వెదకగ నొకచోటఁ దీఁగల గుంపులచేఁ జుట్టఁబడి మయుఁ డను దానవునిచే రక్షింపఁబడు ఋక్షబిల మను పేరుగల యొక పెద్ద బిలమును వానరులు చూచిరి. ఆబిలమునుండి తడిసిన ఱెక్కలు గలవి.

తే. అంబుజాతపరాగర♦క్తాంగకములు, క్రౌంచసారసహంసచ♦క్రములు రాఁగఁ
జూచి సురభిత మగుచును ♦ జొరఁగరామి, విస్మయవ్యగ్రచిత్తు లై♦వీరు లెల్ల.

అంబుజాత పరాగ రక్తాంగకములు = కమలముల పుప్పొడిచేత నెఱ్ఱనైన దేహములు గలవి. సురభితము = మంచివాసన గలది, విస్మయ వ్యగ్రచిత్తులై = ఆశ్చర్య పడిన మనస్సుగలవారై.

తా త్ప ర్య ము.

తామరల పుప్పొడి సోఁకుటచే నెఱ్ఱనైన శరీరములు గల క్రౌంచములు బెగ్గురులు హంసలు చక్రవాకములు రాఁగాఁ జూచి మంచివాసన గలదై యున్నను లోపలికిఁ బోవ మార్గము లేమికి నాశ్చర్యపడుచు, నా వీరు లందఱు.

క. నానాసత్త్వాకీర్ణము, దానవనిలయోపమంబు ♦ తతభీతిద మా
దానిని బిలముం గని తమ, మానసముల ముదము లేక♦మఱుకువ చెందన్. ౧౧-౪

నానాసత్త్వాకీర్ణము = నానా జంతువులచే వ్యాపించినది, దానవ నిలయోపమంబు = రాక్షసులయింటికి సమానమైనది, తతభీతిదము = మిగుల భయము కలిగించునది, మఱుకువ = సంతాపము.

తా త్ప ర్య ము.

అనేక మృగములచే నిండి రాక్షస గృహమునకు సమానమై మిగుల భయంకరమైన బిలమును జూచి తమ మనస్సుల సంతోషము లేక (లోపలికిఁ బోవుటకు నీళ్లు త్రాగుటకు వలను పడమిచే) సంతాపింపఁగా.

సీ. వనకోవిదుండు పా♦వని యిట్టు లను దక్షి,ణంబునఁ గలుగు వ♦నంబు లెల్ల
వెదకితి మెందును♦బృథివీజ గనరాదు, పెల్లు గాసిలినార ♦ మెల్లవార
మీా బిలంబున నుండి ♦ యిదె నీటఁ దడిసిన, జక్కనల్ క్రౌంచ లం♦చలును సార
సంబులు వెడలెడి సత్య ♦ మియ్యది సలి,లంబులు గలుగు కూ♦పంబొ మడుఁగొ
తే.బిలము వాకిటఁ బచ్చ చె♦ట్టులును గలవు, గానఁ జొత్తమటంచనఁ ♦గపు లచంద్ర
తపనమును గాఢతిమిరావృ♦తంబు రోమ,హర్షణం బగుదాని ధై♦ర్యంబు వూని.

వనకోవిదుండు = అడవుల విధము జక్కఁగ దెలిసిన వాఁడు, పెల్లు = మిక్కిలి, అచంద్రతపనము = చంద్రకాంతి సూర్యకాంతి లేనిది, గాఢ తిమిరావృతంబు = దట్టమైన చీఁకటిచే నావరింపఁబడినది, రోమహర్షణంబు = గగ్గురుపాటు గలిగించునది.

తా త్ప ర్య ము.

అడవుల లక్షణములు చక్కఁగాఁ దెలిసిన యాంజనేయుఁ డీ ప్రకారము చెప్పెను. దక్షిణదేశంబునఁ గలుగు వనము లెల్ల వెదకితిమి. సీతాదేవి కానరాలేదు. మనమందరము చాల బడలియున్నారము. ఈ బిలమునుండి నీటఁదడిసిన చక్రవాకములు క్రౌంచములు హంసలును బెగ్గురులును వెలుపల వచ్చుచున్నవి. ఇందు నీళ్లు గల బావియో మడుఁగో యుండుట నిజము. అంతియకాక బిలము వాకిటఁ బచ్చని చెట్లు లున్నవి. నీళ్లులేనిచోటఁ బచ్చని చెట్లు లెట్లు లుండఁగలవు? కావున లోపలికి బోద మనఁగా సూర్యచంద్రకాంతి సోఁకనిదియు దట్టపుఁ జీకటిచే నిండినదియు భయముచే గగ్గురుపాటు గలిగించునదియు నగుదాని ధైర్యము తెచ్చుకొని.

క. చొచ్చెడుచో మృగపక్షిస,ముచ్చయముల వ్యాఘ్రహలిస♦ముత్కరములఁ దా
రచ్చెరువుగఁ గాంచిరి కడుఁ, బొచ్చెము పడఁ దేజు కనులు ♦ పురుశౌర్యంబున్.

చొచ్చెడుచోన్ = ప్రవేశించునపుడు, అచ్చెరువుగన్ = ఆశ్చర్యకరముగ పొచ్చెముపడన్ = వ్యర్థమై పోఁగా.

తా త్ప ర్య ము.

ఇట్లు వారు ప్రవేశించునపుడు మృగముల, పక్షుల, పులుల, సింహముల గుంపులను వా రాశ్చర్యమగ్నులై చూచిరి. వారి తేజస్సు, కన్నులు, గొప్ప శౌర్యము వ్యర్థముకాఁగా.

సీ. నిజవాయువేగంబు ♦ నిష్ఫలం బయ్యును, బిరబిర పోవుచు ♦ భీమవివిధ
వృక్షసంకుల మైన♦వివరంబునం దొక్క, కపి కేలి నింకొక్క♦కపి గ్రహించి
యాఁకలి దప్పుల ♦నలసట మతి చెడి,జీవితాశలు వాసి ♦చేవ యెడలి
సలిలార్థు లగుచు యో♦జనమెుండు పోయి ప్ర,కాశాభిరామమా♦దేశమెుండు
తే. కపులు తిలకించి రటఁ బావ♦కప్రభములుఁ,గాంచనచ్ఛాయములు నై న♦కర్ణికార
సాలతాల తమాలముల్ ♦ చంపకములు, నాగ వంజుళ కకుభ పు♦న్నాగతరులు.

వివరము = బిలము, కేలిఁ = చేతిని, సలిలార్థులు = దప్పిచే నీరు కోరినవారు, ప్రకాశాభిరామము = కాంతిచే మనోహరమైనది, తిలకించిరి = చూచిరి, పావక ప్రభములు = అగ్నికాంతిగలవి, కాంచనచ్ఛాయములు = బంగారు కాంతులు గలవి.

తా త్ప ర్య ము.

చీఁకటి వలనను మార్గము దెలియకపోవుటచేతను తన వాయువేగము వ్యర్థమయ్యును ద్వరత్వరగాఁ బోవుచు భయంకరమై నానావృక్షములచే నిండిన యా బిలము నందొక కోఁతిచేతిని మఱియొక కోఁతిపట్టుకొని యాఁకలి దప్పులచేతను నలసట చేతను మనస్సు చెదఱి బ్రదికెద మను నాశచెడి బలహీనులై దప్పిచే నీళ్లు గోరుచు నొక యామడపోఁగా వెలుతురుగల ప్రదేశ మొక్కటి కపులు చూచిరి - అందు నగ్ని కాంతిగలవి బంగారు వర్ణము గలవియు నైన మద్దులు తాటిచెట్లు చీఁకటిమ్రాఁకులు చంపకములు పొన్నలు పొగడలు ఏఱుమద్దులు పున్నాగములు వీని గుంపులను.

సీ. రాజతస్తబకముల్ ♦ రక్తకిసాలముల్, లతిక లాపీడముల్ ♦ లలితరుక్మ
భూషణభూషితం♦బులు విదూరజకృత, వేదికల్ బాలార్క♦విభ్రమములు
నైజవపుర్ద్యుతి♦భ్రాజమానంబులౌ,పూతహిరణ్మయ♦ భూజములును
తరుణార్కసన్నిభ♦తపనీయనీరజ,యుతము లై నీడజా♦వృతము లగుచు

తే. నీలవైడూర్యపద్మినీ♦జాల మెలయఁ, బసిఁడిచేఁపలు తాఁబేళ్ళు ♦ బలిసి యుండ
నిర్మలంబైన జలముల ♦ నెఱి వహించి, తమ్మికొలఁకులు రాజిల్ల ♦ నెమ్మిఁగనిరి.

రాజతస్తబకముల్ = వెండివలె నున్న పూవుల గుత్తులు, రక్తకిసాలముల్ = ఎఱ్ఱని చిగుళ్లు, 'కిసాలయం కిసలయం కిసాలం కిసలం కిస'మ్మని ద్విరు. కో. లతికలు= తీఁగెలు, ఆపీడముల్ = శిరోభూషణములు, ఈ వృక్షములకని శేషము. లలిత, రుక్మ, భూషణ భూషితంబులు = అందమైన బంగారు సొమ్ములచే నలంకరింపఁబడినవి. ఇవి వానియందుఁ బుట్టిన వని భావము. విదూరజ కృతవేదికల్ = వైడూర్యములఁచేఁ జేయఁబడిన యరుఁగులు, బాలార్క విభ్రమములు = బాలసూర్యునివంటి కాంతిగలవి. నైజవపుర్ద్యుతి భ్రాజమానంబులు=తమ దేహకాంతిచేఁ బ్రకాశించునవి. హిరణ్మయ భూజములు=బంగారు చెట్లు, తరుణార్కసన్నిభ = బాలసూర్యునితో సమానమైన, తపనీయ నీరజయుతములు = బంగారు పుష్పాదులతోఁ గూడినవి. నీడజావృతములు=పక్షులచే నావరింపఁబడినవి.

తా త్ప ర్య ము.

వెండివంటి పూలగుత్తులు ఎఱ్ఱని చిగుళ్లు తీఁగెలు వృక్షములకు శిరోభూషణములు బంగారు సొమ్ములునై తూర్పుటరుఁగులు లేఁతసూర్యకాంతిగల తమ దేహకాంతిచేఁ బ్రకాశించు బంగారుచెట్లను లేఁతసూర్యునితో సమానమైన బంగారు పుష్పాది గలవై పక్షులచే నిండి నీల వైడూర్య పద్మలతలు గలిగి బంగారు చేఁపలు

తాఁబేళ్లు నిండియుండగా నిర్మలమైన నీళ్ళచే నందమైన తామర సరస్సు లుండఁగా సంతోషముతోఁ జూచిరి.

క. ముత్తెపుజాలరులను నెఱి, హత్తిన యుపరంజిమేల్ ♦ గవాక్షంబులు నై
చిత్త మిగిరింపఁ జేసెడి, కొ్రొత్తపసిఁడి వెండి మణులఁ ♦ గొమ రగు నిండుల్.

తాత్పర్యము.

ముత్తెముల జాలరులు నందమైన యుపరంజి గవాక్షములు గలిగి చిత్తము సంతోషింపఁ జేసెడి క్రొత్త బంగారు వెండి మణులు వీనిచే నందములైన గృహములు.

క. పవడముల దొరయఁ బూచిన, యవనీజంబులును గాంచ ♦ నాళులు మణిహే
మవిచిత్రశయాసనములు, హవణించెడు యానములును ♦ హరిచయము గనెన్.

దొరయన్ = సమాన మగునట్లు, హవణించు = ప్రకాశించు,

తాత్పర్యము.

పగడములతో సమానముగఁ బూచిన చెట్లను బంగారు తుమ్మెదలు మణులచే బంగారుచేఁ జిత్రింపఁబడిన పానుపులు పీఁటలు ప్రకాశించు పల్లకులు మేనాలు మొదలగు వానిని వానరులు చూచిరి.

సీ. స్వర్ణ రాజత కాంస్య ♦ భాజనచయములు, నగరుచందనపదా ♦ ర్థావళులును
నిం బగు భక్ష్యమూ ♦ లంబులు ఫలములుఁ, బానీయములుఁ దియ ♦ తేనియలును
దివ్యాంబరంబులు ♦ దివ్యకంబళములు, నజినసమూహంబు ♦ లందు నందు
నగ్నిహోత్రసమాన ♦ మగు తేజముం గల, కాంచనరాసులఁ ♦ గపులు గనిరి

తే. వెండి నందందు వెదకుచు ♦ వీరవరులు
చీరకృష్ణాజినాంబర ♦ స్త్రీ నొకర్తుఁ
దాపసిని గాంచి యొక్కెడఁ ♦ దస్తహృదయు
లగుచు వెఱగున నిలిచిరి ♦ యచట నచట. ౧-౨౦

స్వర్ణ రాజత కాంస్యభాజన చయములు = బంగారు వెండి కంచుతోఁ జేయఁబడిన పాత్రముల సమూహములు; అగరు చందన పదార్థావళులు = అగరు చందనము లోనగు సువాసనగల వస్తువుల సమూహములు, భక్ష్యమూలంబులు = భుజింప యోగ్యములయిన వేళ్లు, దివ్యాంబరంబులు = దేవతాసంబంధమయిన వస్త్రములు, అజిన సమూహంబు = జింకచర్మము, పులితోలు మొదలయిన చర్మములగుంపు, కాంచన రాసులన్ = బంగారు తునుకుల కుప్పలను, చీరకృష్ణాజినాంబర = నారచీరలు జింకచర్మము వస్త్రముగాఁగలది, త్రస్తహృదయులు = భయపడిన హృదయముల గలవారు.

తాత్పర్యము.

బంగారు వెండి కంచుపాత్రములు అగరుచందనము లోనగు సువాసన పదార్థములు భుజింపఁదగిన మూలములు పండ్లు త్రావ యోగ్యములయిన పానకములు లోనైనవి, తియ్యని తేనెలు దివ్యవస్త్రములు దివ్యకంబళములు కృష్ణాజినము లోనైన చర

ములు అగ్నిహోత్రముతో సమానమైన కాంతిగల బంగారుతునుకల, కుప్పలు వాన రులు చూచిరి. మఱియు నందంను వెదుకఁగా నొకచోట నారచీరలు కృష్ణాజినము వస్త్రముగా ధరించి తపస్సుచేయు స్త్రీ నొకతెను గాంచి భయపడి యాశ్చర్యముతో సమీపింపక యచట నచట దూరమందే నిలచిరి.

—♦ ౫౧-వ సర్గము, హనుమంతుఁడు స్వయంప్రభతో సంభాషించుట. ♦—

క. హనుమంతుఁ డంత నమ్ముది, వనితం గని కేలు మోడ్చి ♦ భయభక్తుల ని
ట్లను నెవ్వతె వెవ్వరి వీ,కనకఁబులు బిలము మణు ల♦గారము చెపుమా.౧_౨౦౨
ముదివనితక్ = ముసలిస్త్రీని, అగారము = ఇల్లు.

తా త్ప ర్య ము.

అంతట హనుమంతుఁ డా ముసలిదానియొద్దకుఁ బోయి చేతులు జోడించి నమస్కరించి భయముతోను భక్తితోను నిట్లనియె- అవ్వా నీ వెవరిదానవు. ఈ బంగారు బిలము మణులు ఇల్లు ఎవరివి చెప్పుము-

క. అని మఱియుఁ బలుకుఁ దాపసి, ఘన మగు నాఁకటను డప్పి ♦ గాసిలి మేమె
ల్లను బెనుఁజీఁకటిఁ గన్నులు,గనరాని ధరాబిలంబుఁ♦ గని యిద్దానిన్. ౧_౨౦౩

తా త్ప ర్య ము.

అని మఱియు నిట్లనియె. మేమందఱ మాఁకట దప్పిని బడలి గాఢాంధకార మగుటచేఁ గన్నులు గానరాని భూమిలోని యీ బిలమును జూచి,

క. చొరఁబాఱి దీనఁ గల యు,బ్బరపుఁబదార్థముల పెల్లుఁ ♦బొడగని కడు న
చ్చెరువున దిగ్భ్రమ గొని వెత, దురపిల్లితి మెల్లర మెది♦తోఁపక చింతన్.౧_౨౦౪
దురపిల్లితిమి = దుఃఖించితిమి-

తా త్ప ర్య ము.

ప్రవేశించి యిందుఁగల యాశ్చర్యకరములైన పదార్థముల యతిశయమును జూచి మిగుల నాశ్చర్యపడి మరలిపోవుటకు దిక్కుతెలియక వ్యథచే నేమి చేయుటకుఁ దోఁపక దుఃఖించితిమి.

సీ. తరుణార్కసన్నిభ♦తపనీయవృక్షమ్ము, లీ శుచిభోజ్యంబు ♦ లీఫలాళు
లీ విమానంబులు ♦ నీ పెండిగృహములు, మణిజాలకగవాక్ష♦మండలములు
ఫలపుష్పవంతముల్♦పరిమళవంతముల్, కనకమయంబు లౌ♦ క్ష్మారుహములు
నమలజలంబుల ♦ హాటకపద్మముల్, గలిగె నెవ్వని తపో♦గరిమచేతఁ
తే. గనకఝుషములు కచ్ఛప♦కాండములును
గలసి విహరించెడి ని దెట్లు ♦ తెలుప వమ్మ
నిన్ను నీ మహిమయు నేరి♦నిరుపమాన
తపమునను గల్గె నిదియును ♦ జెపుమ దయను. ౧_౨౦౫

తరుణార్కసన్నిభ = బాలసూర్యునితో సమానమైన- తపనీయ వృక్షములు = బంగారుచెట్లు- శుచిభోజ్యంబులు=పవిత్రములైన యాహారవస్తువులు- మణిజాలక గవాక్షమండలములు = మణులచేఁ జేయఁబడిన చిన్నవి పెద్దవి కిటికీలు, హాటకపద్మముల్ = బంగారుతామరలు, కనకఝషములు=బంగారుచేఁపలు, కచ్ఛప కాండములు = తాఁబేళ్ళగుంపులు.

తా త్ప ర్య ము .

లేఁతసూర్యునితో సమానములైన బంగారుచెట్లు-పవిత్రములైన భోజన పదార్థములు- ఈ పండ్లు - ఈ విమానములు- ఈ వెండియిండ్లు- రత్నమయములైన రంధ్రములు-కిటికీలు-ఫలములు-పుష్పములు-పరిమళములు గల బంగారుచెట్లు-నిర్మలజలములు బంగారు కమలములు-నెవ్వరి తపోమహిమచేఁ గలిగెను? బంగారు చేఁపలు తాఁబేళ్ళు కలిసి తిరుగుచున్నవి - ఇదెల్లు? నిన్ను నీమహిమయు నెవరి యసమాన తపమునని వన్నియుఁ గలిగెనో దయచేసి చెప్పుము.

—♦ స్వయంప్రభ హనుమంతునకు ఋక్షబిలవృత్తాంతముఁ జెప్పుట. ♦—

తే. అనుచు నీ రీతి సామీరి ♦ యడుగుటయును, సర్వభూతహితాత్మిక ♦ సాధునిష్ఠ
యనియె నిట్లని మయుఁడను ♦ నసురనేత, మాయలాఁ డిది నిర్మించె ♦ మాయచేత.

సామీరి = హనుమంతుఁడు, సర్వభూత హితాత్మిక = సమస్త ప్రాణులకు మేలుగోరు మనస్సుగలది, మాయలాఁడు = మాయలు గలవాఁడు, మాయచేతన్ = తన యద్భుత శక్తిచేత.

తా త్ప ర్య ము .

అని యీ విధముగా హనుమంతుఁ డడుగఁగా సర్వప్రాణులకు మేలుకోరు సాధునిష్ఠ యగు స్వయంప్రభ యిట్లనియె. మాయలుగల రాక్షసప్రభువైన మయుఁడు తన యద్భుతశక్తిచేత దీనిని నిర్మించెను.

తే. రమ్య మీ స్వర్ణగృహము ని♦ర్మాత మున్ను,దనుజులకు విశ్వకర్మయా♦దనుజభర్త
యతఁడు వర్ష సహస్రికం♦బధికతపముఁ, గానలోఁ జల్పి నీరజ♦గర్భుచేత. ౧౨౦౭

తా త్ప ర్య ము .

రమ్యమైన యీ బంగారు గృహమును నిర్మించినవాఁడు రాక్షసులకు విశ్వకర్మ యగు దనుజశ్రేష్ఠుఁడు. అతఁడు వేయియేండ్లు అడవిలోఁ దపస్సు చేసి బ్రహ్మచేత;

విశ్వకర్మ యనఁగా నన్నిపనులు, కమసాలి పని వడ్రంగిపని లోనైన శిల్పపుఁ బనులు చేయువాఁడు. దేవతలకీ పని చేయువాడు విశ్వకర్మ. దేవతలకు విశ్వకర్మ యెట్లో యట్లు దానవరాక్షసులకు శిల్పపుఁబనిచేయువాఁడు, దానవ విశ్వకర్మ. వీఁడు మయుఁడు. వీఁడు దనశక్తిచే నద్భుతమైన పనులు చేయువాఁడు గనుక వీని శక్తికి మాయ యని పేరు గలిగెను. కనుక మాయ యనఁగా నద్భుతశక్తి యనియే యర్థము. ఆవల దానిచేఁ జేయుకార్యములకుఁ బదార్థములకు మాయ యని పేరు వచ్చెను.

కావున మాయ యనఁగా ననత్యమని యర్థము కాదు. మయ శబ్ద మొక్కని పేరు మాత్రముగాదు. దానవులకు రాక్షసుల కీ పని చేయువారి కందఱకు నీపేరే వచ్చుచుండును ఇది యుద్యోగనామధేయము వంటిది. ఏలన నీ మయుఁ డిచ్చట నింద్రునిచేఁ జంపఁబడెను. మయుఁ డనువాఁడే ద్వాపరంబునఁ బాండవులకు సభ నిర్మించి యిచ్చినట్లున్నది. దేవశిల్పికి విశ్వకర్మ యనినట్లు రాక్షస శిల్పికి మయుఁడని పేరు. త్రిపురములు కల్పించినవాఁడు మయుఁడే. అవి శివునిచే దహింపఁబడిన పిమ్మట నిచ్చటికి వచ్చి యీ గుహ యేర్పఱుచుకొనె నని మత్స్యపురాణంబునఁ గలదని వ్యాఖ్యాతలు వ్రాసి యున్నారు. వీఁడు దానవశిల్పి మయుఁడు కాఁడు.

తే. వరముగాఁ గొనె శుక్రుని♦స్వాపతేయ, మైన శిల్పంబు నెల్ల నా♦ యతులమహిమ
సర్వకామేశ్వరుం డయి♦చారువనముఁ, గల్పితమొనర్చి యం దుండ♦ వేల్పుఱేఁడు.

స్వాపతేయము = ధనము, ఇచ్చట శిల్ప విద్యాధనము, సర్వకామేశ్వరుండయి = సమస్త కామములకు నధిపతియై, శుక్రుండు శిల్పశాస్త్రము నిర్మించుటచే శిల్ప మాయన సొత్తని చెప్పఁబడెను.

తా త్ప ర్య ము

శుక్రుని సొత్తయిన శిల్ప విద్య నంతయుఁ దరముగాఁగొని యీ యసమాన మహిమచే నన్ని కోరికలు నెఱవేర్చుకొన శక్తిగలవాఁడై యీ మనోహరమైన వనము గల్పించి యిం దుండఁగా నింద్రుఁడు.

క. హేమాసక్తుని మయు సంగ్రామంబున వజ్రధార ♦ ఖండించెఁ జుమీ
హేమకు మయుఁ డొసఁగెనునీ, హైమగృహము వనము నిందు♦నమరును సుఖముల్.

హేమాసక్తుని = హేమ యను దేవతాస్త్రీతోఁ గూడి యుండు వానిని సంగ్రామంబునన్ = యుద్ధమందు.

తా త్ప ర్య ము.

దానవుఁడగు మయుఁడు దేవతాస్త్రీ యగు హేమతోఁ గలిసియుండిన కారణమున నింద్రుఁడు కోపించి వజ్రధారచే నతనిఁ జంపెను. ఆ మయుఁడు హేమకు నీ బంగారు గృహము వనము నిచ్చెను. ఇందు సమస్త సుఖములు గలవు.

తే. నృత్తగీతవిశారద ♦ హేమ నాదు, కూర్మిసఖి యామె దివ్యవ♦కూటవాటి
ప్రాప్తవర నయి నేను గా♦పాడు చుందు, వరతనూజను మేరుసా♦వర్ణి కేను. ౧ ౨౧౦

తా త్ప ర్య ము

హేమకు మయుఁ డిచ్చిన నీ విక్కడ నుండవలసిన కారణ మేమి యందువా ? ఆటపాటలయందు నేర్పుగల హేమకు నేను ప్రేమపాత్రమైన సఖిని, ఆమె దీ వనము, ఆమెచే దీనిని నేను వరముగాఁ బొంది దీనిని రక్షించుచుందును. నేను మేరుసావర్ణి పుత్రికను (అయోధ్య, ౨౦౭-౨ వ ప. చూడు)

క. పేరు స్వయంప్రభ కానన, చారీ! మీ రెవరు దుర్గ♦చయముల ఘనకాం
తారములఁ దిరుగ నేటికి?, నేరినిమిత్తంబు? కంటి ♦ రెట్టులు దీనిన్? ౧-౨౧౧

తా త్ప ర్య ము.

నా పేరు స్వయంప్రభ, ఓ వానరుఁడా! మీ రెవరు? ఈ దుర్గములందుఁ బెద్ద యడవులందుఁ దిరుగఁ గారణమేమి? ఎవరి నిమిత్తము దిరుగుచున్నారు. ఎట్లు దీనిని మీరు చూచితిరి? ఈ స్వయంప్రభ భారతమునఁ బ్రభావతి యని చెప్పఁ బడెను. రెండు పేర్లు సమానార్థకములే.

క. ఈ మూలంబుల ఫలముల, నీమహితపదార్థములను ♦ నీ పానీయం
బా మెతగాఁ గొని తీరఁగఁ, గామం బా మీఁదఁ బలుకఁ ♦ గడఁగుఁడు చరితన్.

తా త్ప ర్య ము.

ఈ మూలములు ఫలములు నీ గొప్ప పదార్థములును నీ పానీయమును దృప్తి దీరఁగ దండిగ గ్రహించి శ్రమము దీరిన పిమ్మట మీ చరిత్రమును జెప్పుఁడు.

— ౫౨-వ సర్గము. స్వయంప్రభ హనుమంతునిఁ గపులవృత్తాంత మడుగుట. —

క. అని తాపసి మఱియు ననెఁ, వనచరవరులార! మీకు ♦ ఫలభక్షణచేఁ
దనుఖేదము దీఱిన నే, వినఁదగిన భవచ్చరిత్ర ♦ వినిపింపుఁ డనన్. ౧-౨౧౩

తా త్ప ర్య ము.

అని చెప్పి యాతపస్విని వానరులార! మీరు ఫలములు భక్షించి బడలిక తీఱిన పిమ్మట నేను వినఁదగునేని మీ చరిత్రము వినిపింపుఁడు అని చెప్పఁగా.

క. కలది కలయట్లు మారుతి, పలుకం దొడఁగెఁ మహేంద్ర♦వరుణాభుఁడు భూ
తలపతి దశరథతనయుఁడు, సలలితచరితుండు రామ♦చంద్రుం డర్థిన్. ౧-౨౧౪

తా త్ప ర్య ము.

హనుమంతు డున్న దున్నట్లు చెప్పఁ బ్రారంభించెను. ఇంద్ర వరుణులతో సమానుఁడైన రాజు దశరథుని కుమారుఁడు, రామచంద్రుఁ డనువాఁడు ప్రీతితో,

ఉ. తమ్ముఁడు లక్ష్మణుండు నిజ♦దార విదేహతనూజ సీతయుఁ
సమ్మతిఁ దన్నుఁ గొల్వఁ జని ♦ సారసనేత్రుఁడు దండకాటవిఁ
గ్రుమ్మరుచుండ నా యనఘు♦కోమలినిం బ్రసభమ్ముచేతఁ జౌ
ర్యమ్మునఁ గొంచు నేగెఁ జమి ♦ రావణనామక రాక్షసేశుఁడుఁ. ౧-౨౧౫

ప్రసభమ్ము = బలాత్కారము, చౌర్యమునఁ = దొంగతనముగా,

తా త్ప ర్య ము.

తమ్ముఁడు లక్ష్మణుఁడు తనభార్య విదేహరాజు కూఁతురు సీతాదేవి నిండు మనస్సుతోఁ దన్నుఁ గొల్చుచుండఁగా దండకాటవియందుఁ దిరుగుచుండు సమయంబున రావణుఁ డను రాక్షసరాజు ఆమెను బలవంతముగా దొంగతనముగాఁ దీసికొనిపోయెను.

క. ప్రాణవల్లభుమిత్రుఁడు సు, గ్రీవుం డను వానరుఁడు ♦ కీశపతి మముఁ
రావణు సీతను వెదకఁగ, వైవస్వతదిశకుఁ బంప ♦ వచ్చితి మిట్టుల్. ౧౨౧౬
తాత్పర్యము.

ఆ రామచంద్రుని స్నేహితుఁడు వానరరాజు సుగ్రీవుఁ డనువాఁ డా సీతను రావణుని వెదకుటకై దక్షిణదిక్కుగాఁ బంపఁగా మేము వచ్చితిమి.

క. దక్షిణ మంతయు రోసి బు,భుక్షయు నీర్వట్టు మమ్ముఁ ♦ బోరి బాధింపన్
బ్రక్షీణజవుల మై యొక,వృక్షమునీడన్ వసించి ♦ వెత గొనుచు నటన్. ౧౨౧౭
నీర్వట్టు = దప్పి.
తాత్పర్యము.

దక్షిణమంతయు వెదకితిమి. ఆఁకలి, దాహము మమ్ము మిగుల బాధించెను. వేగ ముడిగినవారమై యొకచెట్టు క్రింద బాధపడుచుంటిమి.

కం. ఆననములఁ దెలివేదఁగ, ధ్యానపరాయణుల మగుచుఁ ♦ దడవుండియుఁ జిం
తానీరధి పారంబును, గానక యట నిటను వెదకఁ♦గా నొక చోటన్. ౧౨౧౮
తెలివేదఁగన్ = తెలివి క్షయింపఁగా. తడవు = దీర్ఘకాలము.
తాత్పర్యము.

ముఖములందుఁ గాంతి తొలఁగిపోఁగాఁ జాలఁ గాల మేమిచేయుటకుఁ దోఁపక యాలోచించుచుండి యిందు నందు వెదకఁగా నొకచోట.

క. ఇరులం గురియుచుఁ దీఁగెలఁ, దరువుల సంఛన్న మగుచుఁ ♦ దనరాఁ రెడి యీ
గురుబిలముం గనితిమి పు,ష్కరహంసకకురరతతులు ♦ సంక్లిన్నము లై. ౧౨౧౯
పుష్కర- హంసక- కురర తతులు = బెగ్గురులు హంసలు ఆఁడులకుముకులు.
సంక్లిన్నములు = తడిసినవి.

తాత్పర్యము.

చీఁకట్లు గురియుచుఁ దీఁగెలచేతను జెట్లచేతను గప్పఁబడిన యీ బిలముఁ జూచితిమి. దీనినుండి నీట దడిసిన బెగ్గురులు హంసలు లకుముకులు గుంపులు గుంపులుగా,

క. అంచితగతి వెడలఁగ నే, మంచిది యీ బిలములోన ♦ మనమెల్లఁ బ్రవే
శించుద మని యున ననుమా,నించి కపుల్ వల్లె యనుచు ♦ నిబిడతమమునన్.
వల్లె = సరి, నిబిడతమమునన్ = గాఢాంధకారమున.
తాత్పర్యము.

బయలు వెడలిరాఁగా నిది శుభలక్షణమే యని గ్రహించి యీ బిలములో మన మందఱము ప్రవేశింత మని యంటిని. కన్నులుగానని చీకటిలో బ్రవేశించిన నేమి యపాయము వచ్చునో యేమో యని సందేహించియు నిచ్చట నూరకుండి యాఁకలి దప్పులచేఁ జచ్చుటకంటె నపాయ మేమి రాఁగలదని సాహసించి యంద ఱంగీకరింపఁగా నా దట్టపుఁ జీఁకటియందు.

క. దీనఁ బరస్పరమును గే, లూనికఁ బట్టుకొని వచ్చి ♦ యుష్మన్నికట
స్థానముఁ జేరితి మిది మా, పూనినకార్యంబు భృశబు♦భుక్షాతృషలన్. ౧౨౧
యుష్మన్నికట స్థానము = నీ సమీపప్రదేశము, భృశబుభుక్షాతృషలన్ = అధికమైన యాఁకలి దప్పికలచే.

తాత్పర్యము.

ఈ బిలములో నొకరి చేతిని మఱియొకరు పట్టుకొని నీ సమీపమునకు వచ్చితిమి. ఇది మేము పూనిన కార్యము. మిగుల నాఁకలి దప్పులచే.

క. గాసిని మా ప్రాణంబులు, పో సమయం బయ్యె నీదు♦పుణ్యంబున మా
లాసమ ఫలములఁ దినుటం, బాసె శ్రమము మాకు నెల్లఁ ♦ బ్రాణము మరలెన్.

తాత్పర్యము.

బడలికచే మా ప్రాణములు పోవు సమయమయ్యెను. నీ పుణ్యమున నీ విచ్చిన ఫలమూలంబులు దినుటచే మా బడలిక దీఱెను. ప్రాణములు మరల వచ్చెను.

క. కోరెదరు కీశనాథులు, చారుగుణా! మాఱుమేలు ♦ సలుపఁగ నీకున్
గారియ మున్నను జెప్పుము, తీరుతు మిపు డనఁగఁ గపిత♦తిం గని ప్రీతిన్. ౧౨౩

తాత్పర్యము.

మా ప్రాణములు రక్షించితివి, కావున నీవు చేసిన మేలునకు మఱుమేలు చేయ నీ వానరులు కోరుచున్నారు. మేము చేయదగిన కార్యమున్నఁ జెప్పుము - ఆ పనిని నెఱవేర్తుము - అనిన నామె సంతోషించి.

తే. అనియె సర్వజ్ఞ యైన స్వ♦యంప్రభ యును, మీరు పలికిన పలుకుల ♦ మెచ్చువచ్చె
ధర్మచరి నౌట మీ చేయఁ♦దగినకార్య, మేది లే దన హనుమంతుఁ ♦ డింతి కనియె.

తాత్పర్యము.

సర్వముఁ దెలిసిన యా స్వయంప్రభ యిట్లనెను. మీరు పలికిన పలుకులు విని చాల సంతోష మయ్యెను. నేను ధర్మమందుండి పరుల కుపకారముఁ జేయుదానను. కావున మీరు నాకుఁ జేయఁదగిన కార్య మేదియు లేదనిన హనుమంతు డా స్త్రీ కిట్లనియె.

—♦ ౫౩-వ సర్గము. స్వయంప్రభ కపులను బిలమునుండి వెడలించుట. ♦—

ఉ. వృక్షచరాధినేత విధి♦యించిన మా సమయంబు మీఱె నీ
ఋక్షబిలంబునందుఁ జరి♦యింపఁగ, మమ్ము బిలంబునుండి సా
ధ్వీ! క్షమఁ జేర్పుమీ గడువు ♦ తీఱె గతాయువు లెల్లరున్ దయా
వీక్షణపంక్తులం బఱపి ♦ యుండఱఁ బ్రోవు భవత్ప్రపన్నులన్. ౧౨౫
వృక్షచరాధినేత = వానరరాజు, సమయంబు = గడువు, క్షమన్ = భూమియందు, గతాయువులు = ఆయుస్సు దీఱినవారు, భవత్ప్రపన్నులన్ = నీదాసులను

తా త్ప ర్య ము .

వానరరాజయిన సుగ్రీవుఁడు నియమించినకాలము మే మీ బిలమం దుండుటచే మించిపోయెను. మ మ్మిమ్మ బిలంబునుండి మరల భూమియందుఁ జేర్పుము. గడువుతీరెను గావున దానితోపాటు ఆయుస్సు తీఱినవారమే కావున మాయందు నీ కరుణాకటాక్షములు పఱపి నీ దాసులను రక్షింపుము.

తే. ధర్మచారిణి మాకుఁ గ♦ర్తవ్యమైన, కార్య మెంతయుఁ గలిగియు ♦ గహనమైన
యీ బిలంబునఁ జిక్కిన♦హేతువునను, జలుప లేమైతి మేమియు ♦ సత్యమమ్మ.

తా త్ప ర్య ము .

ఓ ధర్మాత్మురాలా! మేము తప్పక చేయవలసినకార్య మెంతో యుండియు, ప్రవేశింపరాని యీ బిలమందుఁ జిక్కిన కారణముచే నేమియుఁ జేయఁజాలమైతిమి. తల్లీ! ఇది సత్యము.

క. అనవుడు దీనిం జొచ్చియుఁ, దనువులతోఁ బోక యనఁగఁ ♦ దలఁతు నసాధ్యం
బని, కావున నియమ తపం,బున పెంపున నుద్ధరింతు ♦ మూయుఁడు కన్నుల్.

తా త్ప ర్య ము .

అని చెప్పఁగా నామె యిట్లనియె. దీనిలోఁ బ్రవేశించి మరల దేహములతో వెలికిఁ బోవుట యసాధ్య మని నాయభిప్రాయము. కావున మిమ్మ నా తపస్సు బలంబునఁ గాపాడెదను, కన్నులు మూసికొనుఁడు. మూయుఁడు ఆత్మనే పద మనిత్యము గావునఁ బరస్మైపదము ప్రయోగింపఁబడెను.

క. అనిమీలితలోచనులై, చనుట యశక్యం బనంగ ♦ సర్వప్లవగుల్
కనులన్ మూసిరి కరములఁ, బెనుబిలముఁ దరించుకాంక్ష ♦ పేరెమువాఱన్.

అనిమీలితలోచనులై = కన్నులు మూసికొనని వారై, పేరెము వాఱన్ = అతిశయింపఁగా.

తా త్ప ర్య ము .

కన్నులు మూసికొనలేని మీ రిందుండి వెడలి పోవుట యసాధ్యము అనఁగానే వానరు లందఱు బిలమునుండి వెడలి పోవు కోరిక యతిశయించుటచే నందఱు చేతులతోఁ గన్నులు మూసికొనిరి.

తే. హస్తరుద్ధాననములఁ గీ♦శాలి నెల్ల, నిమిషమున నుద్ధరించి యా♦నియతశీల
వారి నూరార్చి యిది వింధ్య ♦ ధారణీధ్ర, మిదియె ప్రస్రవణం బను ♦ పృథుధరంబు.

హస్తరుద్ధాననములన్ = చేతులతో మూయఁబడిన ముఖములు గలవానిని, కీశాలిన్ = కోఁతిమూఁకను.

తా త్ప ర్య ము.

చేతులతోఁ గన్నులు మూసికొన్న యా వానరుల నెల్ల నిమిషములో బిలము

నుండి దాటించి యా తపశ్శాలిని వారిని సమాధానపఱిచి వానరులారా! యిది వింధ్యపర్వతము. ఇదియే ప్రస్రవణ మను పెద్దకొండ.

క. వనచరులారా! యదియే, వననిధి మీకెల్ల శుభము ♦ వఱలుత నేనుఁ
జనియెద భవనంబున కని, చనియె స్వయంప్రభయు నాత్మ♦సదనంబునకున్.

తా త్ప ర్య ము.

వానరులారా! యిదియే సముద్రము. మీకు శుభము గలుగును గాక. నేను నా యింటికిఁ బోయెద నని స్వయంప్రభ తన యింటికిఁ బోయెను.

వింధ్యకు దక్షిణదేశమునఁ దూర్పు పడమర సముద్రముదాఁక నుండు కొండ లన్నియు వింధ్యపర్వతశాఖలే. వింధ్యపర్వత మనియే పేరు గల వని యెఱుంగ నగు.

"హిమవద్వింధ్య శైలాభ్యాం ప్రియో వ్యాప్తా వసుంధరా" యని భేషజకల్ప మునఁ గలదు. ఈ ప్రమాణ ప్రకారము హిమవంతము మొదలు వింధ్యమువఱకు హిమవంతమనియు, వింధ్యము మొదలు దక్షిణసముద్రమువఱకు వింధ్య మనియుఁ బే రని యెఱుంగ నగు.

ఈ స్వయంప్రభ సర్వజ్ఞ యని ౧౨౨౪ వ పద్యంబునఁ జెప్పఁబడెను. ఆ కారణముచే నామెకు భూతభవిష్యద్వర్తమానములు తెలియును. గనుక నెక్కడ వారిని విడిచిన నుత్తరకార్యము సుకరమో యచ్చట సముద్రతీరమున విడిచె నని యెఱుఁగ నగు.

క. ఘోరతరంగాభీల మ,పారం బభిగర్జితంబు ♦ వరుణాలయమున్
ఘోరం బగు సాగరముఁ, వీరవరుల్ విస్మయమున ♦ వీక్షించి రటన్. ౧౨౩౧

ఘోరతరంగాభీలము = పెద్ద యలలచే భయము కలిగించునది, అలలు భయంకరములే, సముద్రము భయంకరమే, అపారంబు = ఒడ్డుకానరానిది- అభిగర్జితంబు = మిగుల ఘోషించునది, వరుణాలయముఁ = వరుణునకు వాసస్థానమైనది- నాలవపాదంబున వృత్త్యనుప్రాసము-

తా త్ప ర్య ము.

భయంకరమైన యలలచే దిగులు పుట్టించునదియు నావలియొడ్డు కానరానిదియు విశేషముగ ధ్వనించునదియు వరుణునకు వాసస్థానమైనదియు నగు భయంకరమైన సముద్రమును జూచి వీరవరు లన్నియు నాశ్చర్యముగఁ జూచిరి.

—♦ అంగదుఁడు గడువు మీఱినందులకు విచారపడుట ♦—

చ. ఫలసిత పుష్పభారభృథి♦వీరుహసంచయ వింధ్యపాద స
త్తలమునఁ గూరుచుండి కపి♦దండము పూచిన తీఁగెలం గనుం
బొలిచిన మాధవాపనిజ♦ము లని డాసె వసంతవేళ యం
చళుకు వహించి నేలఁ బడె ♦ నయ్యెడ నష్టని దేశకాలమై. ౧౨౩౨

విలసిత = ప్రకాశించు- పుష్పభార= పూవులయతిశయముగల- పృథివీరుహా= చెట్లయొక్క,సంచయ=సమూహముగల, వింధ్యపాదస త్తలమునఁ = వింధ్యముయొక్క ప్రత్యంతపర్వతములయొక్క ప్రదేశమందు- ఇందుఁ బాదశబ్దము ౧౨౩౦వ పద్యమునఁ జెప్పఁబడిన యర్థమునే స్థాపించుచున్నది- కపిదండము=కపిసేన- మాధవానిజముల్ = వసంతకాలమున ఫలించు వృక్షములు - వసంతకాలమున ఫలించు మామిడిలోనైనవి ఫాల్గునమాసముననే పూచును- అళుకు = దిగులు- నష్టనిదేశకాలమై = మీఱి పోయిన గడువు కాలముగలదై-

తా త్ప ర్య ము .

విశేషముగఁ బూచినచెట్లుగల వింధ్యపాదప్రదేశమునఁ గూరుచుండి కపిసేన పూచిన తీఁగలను గాంతి గల వసంతకాలమున ఫలించు వృక్షములను జూచి సమీపించెరా వసంత మని గడువుమీఱుటచే భయపడి నేలఁబడెను.

తే. అప్పుడు సింహవృషస్కంధుఁ ♦ డతులపీవ,రాయతభుజుండు ప్రాజ్ఞుండు ♦ నైన యంగ
దుండు వృద్ధుల శిష్టుల ♦ దండఁజేరి, యిట్టులను వారి నూరార్చి♦ హితము దోఁప.

సింహ వృషస్కంధుఁడు = సింహముయొక్కయు వృషభముయొక్కయు, మూఁపులవంటి మూఁపులు గలవాఁడు, అతుల = అసమానమైన, పీవర = బలసిన, ఆయత = దీర్ఘములైన, భుజుండు = భుజములు గలవాఁడు.

తా త్ప ర్య ము .

సింహ వృషభములవంటి మూఁపులు గలవాఁడు బలసిన దీర్ఘములైన భుజములు గలవాఁడు బుద్ధిమంతుఁడు, నగు నంగదుండు గడువు మీఱిపోయెను, వచ్చిన కార్యము కాదాయెను. ఇఁక నేమిగతి యని భయపడి వ్యసనపడుచున్న వృద్ధులయు శిష్టులయు నొద్దకుఁబోయి వారి నూరార్చి హితము గలుగ నిట్టు లనెను.

చ. వెడలితి మిందఱుం బ్లవగ♦వీరవరేణ్యుని శాసనంబునన్
గడచెను మాస మొండు బిల♦గహ్వరమందు నెఱుంగ రొక్కరున్
గడఁగితి మాశ్వినంబునను ♦ గాలము సంఖ్య యతీతమై చనెన్
నుడువుఁడు మీఁదికార్యమును ♦ నూల్కొన మీరలు నీతికోవిదుల్. ౧౨౩౪

తా త్ప ర్య ము .

మన మందఱము సుగ్రీవుని యాజ్ఞాప్రకారము బయలుదేఱితిమి. ఒక నెల కాలము బిలమందే కడచిపోయెను. ఆశ్వయుజమందుఁ బ్రారంభించితిమి. కాలము మించిపోయెను. నీతికోవిదులారా ! యిఁకఁ జేయవలసిన కార్యము చెప్పుఁడు. ఆశ్వయుజంబునఁ బ్రారంభించితి మనునది సీతాన్వేషణ నిమిత్తమై ప్రయత్నమునకుఁ బ్రారంభించితిమి. అదిమొద లీ కార్యమందే యున్నార మని భావము. ఆశ్వయుజాంతంబుననే కదా తొలిసారి వానరులను బిలుచుకొనిరం డని పదునైదు దినములు గడు విచ్చుట. వీరు దక్షిణమున వెదకఁ బంపఁబడినది మార్గశిరమున - పుష్యమున రండని

సుగ్రీవాజ్ఞ. ఆనెల ముందే గడచినట్లు ౧౯౫౧-వ పద్యంబునఁ జెప్పఁబడెను. కావున నిది రెండవనెల. అదియును గడచె నని యర్థము. ఇది మాఘమాసాంతముగనో మధ్య భాగముగనో యుండవలెను. ౧౩౧౦ వ పద్యము చూచునది. ఒక నెల బిలమునందే పోవుటచే మాఘముపోయి ఫాల్గునము ప్రారంభించెను. ఆ కారణమున మించినదానికి వగచి ప్రయోజనములేదు. కావున జరుగవలసిన దేమో చెప్పుచున్నాఁడు.

ఉ. నమ్మినబంట్లు మీరు నిజ♦నాథహితాచరణుల్ సమస్తకా
ర్యమ్ములు దీర్ప నేర్పరులు ♦ ఖ్యాతపరాక్రమయుక్తులుం గదా
యమ్మెయి రాజునాజ్ఞ మెయి ♦ నందఱు వెల్వడి తీర్ప రాము కృ
త్యమ్మును సత్పురుస్సరుఁగ ♦ నాదటఁ జేసితి రింత చేసియున్. ౧౨౩౭

నిజనాథహితాచరణుల్=తమ భర్తకు హితము చేయువారు.

తాత్పర్యము.

మీ రందఱు రాజునకు విశ్వాసపాత్రులైన సేవకులు- మీ రెట్టులైనఁ గార్యము చేసెద రని సుగ్రీవుఁడు నమ్మియున్నాఁడు - మీరో యెటులైన రాజునకు హితము చేయువలయు నని వర్తించువారు- ఏకార్యమైనను సాధింప నేర్పుగలవారు- ప్రసిద్ధమైన పరాక్రమముతోఁగూడినవారు. ఇట్టివారు మీ రందఱు రాజు నాజ్ఞ ప్రకారము రాముకార్యము నెఱవేర్ప నాయుందలి ప్రీతితో నన్ను ముందుండు వానిఁగఁ జేసితిరి. మీ రెట్టులైన గార్యము నెఱవేర్పఁగలరు. మన కేమిభయ మని నేను ముఖ్యుఁడుగా నుండ నంగీకరించి మీవెంట వచ్చితిని. ఇంత చేసియును,

క. అకృతార్థుల మై మరలిన, శకలీకృతు లగుదు మేల ♦ శంకింపఁగ దీ
వ్రకరజుసందేశముఁ జే,యక యెవ్వఁడు మనఁగ నోపు ♦ హాయిగఁ జెప్రఁడా.

అకృతార్థులము = కార్యము చేయనివారము, శకలీకృతులు = తునుకలుగాఁ జేయఁబడినవారు.

తాత్పర్యము.

వచ్చినపని నెఱవేర్పక మరలిపోయితిమా, సుగ్రీవుఁడు మనలఁ దునుకలు దునుకలుగా నఱకును. ఇందు సందేహములేదు. సుగ్రీవాజ్ఞ నెఱవేర్పక బ్రిదికి సుఖపడువాఁ డెవ్వఁడు?

క. పోయెను నియమితకాలము, చేయంగల దేది లేదు ♦ చేద్పడి మనముక్
ప్రాయోపవేశ మొక్కటి, చేయం దగునదిగఁ దోఁచెఁ ♦ జిత్తమునందున్.

తాత్పర్యము.

నియమించిన గడువుకాలము మించిపోయెను. మనము వ్యసనపడి చేయఁదగినది యేదియులేదు. కాబట్టి మన కిప్పుడు చేయఁదగినది ప్రాయోపవేశ మొక్కటియే యని తోఁచుచున్నది. ప్రాయ+ఉపవేశము = కూడు, నీళ్ళు ముట్టక మరణింపవలయు నని పండుకొనుట. ప్రాయమనఁగా ఆహారములేని వ్రతము, ప్రాయో వయో మృత్యు తుల్య బాహుళ్యానశనేషు నా. నా నా. ర.

—♦ అంగదుఁడు భేదోపాయోక్తులు వచించుట. ♦—

చ. ఇనసుతుఁడో స్వభావమునఁ♦నే కడుఁదీక్ష్ణుఁడు, తాన యిప్డు రా
జును నయి యున్నవాఁడు, నృప♦సుందరివార్త యెఱుంగ లేక పో
యిన నపరాధముం దలఁచి ♦ హింస యొనర్చు, క్షమింపఁ డేమియుఁ
గనుక సుయుక్తి మిచ్చుటనె ♦ కాలము దీఱుట యంచు నెంచెదన్. ౧౨౩౮

తాత్పర్యము.

అనశనవ్రతమైన సాధించి ప్రాణము విడువ వలసినంత యేమి భయము వచ్చె నందురా? సుగ్రీవుఁడు స్వభావము చేతనే క్రూరుఁడు, దానికిఁదోడిప్పుడు రాజునై యున్నవాఁడు. అధికారబలము వచ్చినది. రాముని భార్య వార్త తెలియకపోయి తిమా, మనలఁ జంపునుగాని క్షమింపఁడు, గనుక నక్కడకుఁ బోయి చచ్చుట కంటె మనంతట మనమే యిచ్చటనే చచ్చుట మేలని నా యభిప్రాయము.

క. మన మెల్ల మరలిపోయిన, ధనదారసుతాలయాది♦తతి వీడ్వడఁ జం
పును ఘోరమరణ మచటికిఁ, జని చచ్చుటకంటె నిందె ♦ సమయుట మేలౌ.

తాత్పర్యము.

చచ్చువార మీ యడవులలో దిక్కులేని చావు చావనేల? అక్కడికే పోయి చత్తుమందురా, మన మెల్ల మరలిపోయితిమేని మన ధనములు, భార్యలు, బిడ్డలు, ఇండ్లు అనుభవింపవచ్చు నందురేమో, అంతదాఁకఁ బోనీయఁడు, పోయిన వెంటనే చంపును. అచ్చటికిఁబోయి యవమానము పడి ఘోరపుఁజావు చచ్చుటకంటె నిచ్చటనే చచ్చుట మేలుగదా.

తే. యౌవరాజ్యంబు నా కిచ్చి♦నట్టివాఁడు
భానుజుఁడుగాఁడు సద్గుణ♦భద్రుఁ డైన
రామభద్రుండు; పూర్వవై♦రంబుఁ దలఁచి
సమయ మిపు డబ్బఁ గపిరాజు ♦ చంపు నన్ను. ౧౨౪౦

తాత్పర్యము.

'అయ్యా! నీవు రాజు నంతటివాఁడవు, రాజకుమారుఁడవు, యువరాజవు. నిన్నుఁ జంపునా? పుత్రవాత్సల్యముచేఁ జంపఁడు. నిన్నుఁ జంపనపుడు మమ్ముఁ జంపఁడు.' అందురా. అట్టుగాదు. నాకు యౌవరాజ్య మిచ్చినవాఁడు సుగ్రీవుఁడు కాఁడు, రామభద్రుఁడు. ఆయన యాజ్ఞ మీఱలేక తన కిష్టము లేకున్నను నన్ను యువరాజుఁ జేసెను.

నాయందు సద్గుణభద్రుఁ డైన రామభద్రునకు దయగల దని నన్నప్పుడేమియుఁ జేయఁజాలకుండెను. ఇప్పుడు సమయము దొరికినది కావున నాజ్ఞ మీఱితి నని నెపము పెట్టి తప్పక చంపును.

క. జీవించియుండువఱకు గుహ,నా వనటం గనఁగ నేల ♦ నా మిత్రంబుల్
గావునఁ బుణ్యదమగు పారావారము రోధమునను ♦ బ్రాణము విడుతున్. ౧౨౪౧

తా త్ప ర్య ము .

అచ్చటికిఁబోయి చంపఁబడితినేని నా మిత్రులు యావజ్జీవము నాకై దుఃఖించు చుందురు. కావున నచ్చటికిఁబోయి చచ్చుటకంటెఁ బుణ్యస్థల మగు సముద్రతీరమున నిచటఁ జచ్చుట మేలు.

క. అని తారాసుతుఁ డాడిన, విని శాఖామృగవరేణ్య♦వితతులు దుఃఖం
బునఁ బొగులుచు నాతనితో, ననె నిటులు లోనఁ గరుణ ♦ యలముకొనంగన్.

తా త్ప ర్య ము .

అని యంగదుఁడు చెప్పఁగా వానరశ్రేష్ఠులు దుఃఖపడుచు దయతో నతనితో నిట్లు లనిరి.

—♦ కపు లంగదువాక్యంబుల నామోదించుట. ♦—

చ. ఇనసుతుఁడుర్ స్వభావమున♦నే కడు నుగ్రుఁడు రామభద్రుఁ డో
తన ప్రియురాలిమీఁది మమ♦తం దపియించెడువాఁడు కాన సీ
తను బొడగాన కేగినను ♦ దథ్యము రామునిఁ బ్రతుఁ జేయఁగా
వనజహితాత్మసంభవుఁ డ♦వశ్యము నిందఱఁ జంపుఁ గ్రూరుఁ డై. ౧౨౪౩

తా త్ప ర్య ము .

అంగదా ! నీవు చెప్పినట్లు సుగ్రీవుఁడు స్వభావముననే మిగులఁ గఠినుఁడు. ఇఁక రామభద్రుఁడో స్వభావమున మంచివాఁడే కాని తన భార్య యందలి ప్రేమచేఁ దపించు చున్నాఁడు. కావున సీత కానరాలేదని మనము పోయి చెప్పితిమా రామునిఁ బ్రీతునిఁజేయ సుగ్రీవుఁడు మనల నందఱఁ దప్పక చంపును.

క. అపరాధు లైనవారలు, నృపు డాయఁగ రాదు సీత ♦ నెమకి దొరకినర్
గపిరాజుఁ గనఁగఁ బోదము, విపరీతం బైన యముని♦వేశ్మంబునకున్. ౧౨౪౪

తా త్ప ర్య ము .

అపరాధము చేసినవారు రాజు నెదుటికిఁ బోరాదు. కావున సీత నింకను వెద కుదము. కానవచ్చెనా సుగ్రీవు నొద్దకుఁ బోదము. కానరాకపోయెనా యమలోకము నకుఁ బోదము.

చ. అనుడు భయార్దితావనిరు♦హాటుల వాక్యము లాలకించి యి
ట్లనియెను దారుఁ డేటికి మ♦హావ్యథ నొందెద రీ బిలంబునం
దున వసియింత మియ్యది సు♦దుర్గము నిర్భరవృక్షభోజ్యపా
వనవనశోభితంబు భయ♦వార్త వినంబడ దెట్లు చూచినర్. ౧౨౪౫

భయార్దిత= భయముచే బాధపడుచున్న, అవనిరుహాటుల=వానరుల, సుదుర్గము = మిగులఁ జొరరానిది. నిర్భర = అతిశయమైన, వృక్ష = చెట్లు, భోజ్య =

భుజింపఁ దగిన పదార్థములు, పావన వన = పవిత్రమైన వనము పేయకము = నీళ్లు గలది.

తాత్పర్యము.

వానరు లాప్రకారము చెప్పఁగా భయపీడితులైన వానరుల మాటలు విని తారుఁ డిట్లనెను. మీరేల దుఃఖపడెదరు. చావవలసిన పనిలేదు, మన మందఱు మీ బిలమున మరలఁ బ్రవేశింతము. మనకుఁ గావలసినవి చెట్లు, తినుటకు భోజ్యములు, కందమూల ఫలాదులు, పరిశుద్ధమైన వనము, పరిశుద్ధములైన నీళ్లు దానియందుఁ గలవు. అవియేకదా మనకుఁ గావలసినది, భయమను మాట కూడ నిందు వినరాదు.

క. అందు మన ముంటిమేని పు,రందరుఁడేఁ గాక కీశ♦రాజేనియు సం
క్రందననిభకౌసల్యా,నందనుఁడేఁ జెనక లేఁడు ♦ నగచరులారా! ౧౨౪౬

తాత్పర్యము.

అందు మన ముంటిమా, సుగ్రీవునిమాట యేల, ఇంద్రుఁడైనను నింద్రసమానుఁడైన రామచంద్రుఁడైనను మనలఁ జెనకలేఁడు.

క. అంగదువాక్యంబులకు సు,సంగత మగుతారు వచన♦సరణిని విని యే
భంగిని గీడొదవదొ య,బ్భంగియ తగు ననుచు నెల్ల♦ప్లవగులు పలుకన్. ౧౨౪౭

తాత్పర్యము.

కిష్కింధకుఁ బోవలసిన పనిలేదు. ఇక్కడనే యుండమని యంగదుఁడు చెప్పిన మాటల కనుకూలముగాఁ దారుఁడు చెప్పినమాట విని వానరు లందఱు నెట్లు చేసిన మనకుఁ గీడు గలుగదో యట్లే చేయుద మనిరి.

—♦ ౫౪-వ సర్గము. హనుమంతుఁ డంగదుని సమాధానపఱుచుట. ♦—

క. తారానందనుతోడుతఁ, దారాధిపతేజుఁడైన♦తారుం డిటు వ్యా
హారింపఁగ నంగదుచే, నా రాజ్యము హృత మటంచు ♦ హనుమ తలంచెన్.

తాత్పర్యము.

అంగదుఁడు తారుఁ డిట్లు మాటలాడుటయు వానరులు దాని నామోదించుటయు విని సుగ్రీవుని రాజ్యము నంగదుఁడు హరించెరా యని హనుమంతుఁడు తలచెను.

తారుఁడు చెప్పిన మాటలు నంగదుఁడు తక్కినవారు నిషేధింపలేదు. కావున నందఱు బిలముఁ బ్రవేశించి యందో వెలుపల నడవులందో వానరరాజ్య మొకటి యేర్పడును. ఇప్పు డేకముగా నున్న వానరరాజ్యమునందు ద్వైవిధ్యము పుట్టును. అప్పుడు సుగ్రీవురాజ్యము చెడును. సుగ్రీవునకుఁ గానివారు వాలి పక్షపాతులందఱు నిచ్చటఁ జేరుదురు. అదియునుగాక ప్రారంభించిన రామునికార్యము చెడును అని హనుమంతుఁడు వారిలో వారికి భేదము గలిగింప యత్నించుచున్నాఁడు. క్రొత్త

రాజ్యము స్థాపించు తెలివితేట లంగదునందుఁగలవా యనుట గుఱించి చెప్పుచున్నాఁడు.

క. పదునాలుగుగుణములు నెని,మిదియంగము లమరు శుద్ధ ♦ మేధయు బలసం
 పద నలువిధములు గలఁ డని, మది వాలితనూజు నెఱిఁగె ♦ మరుదాత్మజుఁడున్.

పదునాలుగు గుణములు = దేశకాలజ్ఞానము, దార్ఢ్యము, సమస్తకష్టముల నోర్చుట, సర్వజ్ఞత్వము, దాక్షిణ్యము, ఊర్జము, ఆలోచనను దాఁచుట, అప్రియమాటి కుఁడు గాకుండుట, శౌర్యము, స్వపరశక్తిజ్ఞానము, కృతజ్ఞత, శరణాగతవాత్సల్యము, కోపము, మనోనిశ్చలత యనెడి పదునాలుగు గుణములు.

"దేశకాలజ్ఞతా దార్ఢ్యం సర్వక్లేశసహిష్ణుతా
సర్వవిజ్ఞానితా దాక్ష్య మూర్జ స్సంవృతమంత్రితా
అవిసంవాదితా శౌర్యం, శక్తిజ్ఞత్వం కృతజ్ఞతా
శరణాగతవాత్సల్య మమర్షత్వ మచాలన"

మ్మను శ్లోక మిచట ననుసంధింపఁ దగును.

ఎనిమిది యంగములు = అన్నిటి నవగాహన చేసికొనెడి శక్తి-జ్ఞప్తి యుంచుకొనెడి శక్తి-స్మరించెడి శక్తి-పరులకు-బోధపఱిచెడి శక్తి- ఊహ - అపోహము- అర్థవిజ్ఞానము తత్త్వ మెఱుఁగుట-ఇవి యెనిమిది యంగములు 'గ్రహణంధారణంచైవ స్మరణం ప్రతి పాదనం ఊహాపోహార్థవిజ్ఞానం తత్త్వజ్ఞానం చ ధీగుణా' యను వాక్యము స్మర ణీయము- శుశ్రూషా శ్రవణంచైవ గ్రహణం ధారణమ్ తథా యని పాఠాంతరము. మేధ=బుద్ధి, నలువిధములు, నలువిధముల బలసంపద = బాహుబలము మనోబలము ఉపాయబలము, బంధుబలము, సామాద్యుపాయములైనఁ గావచ్చును.

తా త్ప ర్య ము.

అంగదుఁడు పదునాలుగుణములు, నెనిమిది యంగములు గల నిర్మలబుద్ధి, నలు విధములైన బల సంపదగలవాఁడని హనుమంతుఁడు తెలిసికొనెను.

తే. శుక్లపక్షాదిఁ గాంతిచే ♦ సొబగు మీఱు, చంద్రుఁ డన బలవిక్రమ♦ సాంద్రతేజ
 ములను నభివృద్ధి గనువాని ♦ బలమునందు, జనకతుల్యుని బుద్ధిని ♦ శక్రగురుని.

తా త్ప ర్య ము .

శుక్లపక్షమునఁ బాడ్యమి మొదలు వృద్ధిచెందు చంద్రునివలె బలము విక్ర మము అధిక తేజస్సు వీనిచే నభివృద్ధిఁ జెందువానిని బలమునందుఁ దండ్రితో సమా నుని బుద్ధియందు బృహస్పతిని.

తే. శుక్రనీతిని వినునట్టి ♦ శకున్రిఁబోలెఁ
 దారుపల్కులు విన శ్రద్ధ ♦ దాల్చు వాని
 సకల శాస్త్రవిశారదు ♦ స్వామికార్య
 మునఁ బరిశ్రాంతు నూరార్చ ♦ మొనసి హనుమ. ౧౨౫౧

శుక్రు నీతిని = ఇచ్చట శక్రపద సాహచర్యముచే శుక్రుఁడనఁగా బృహస్పతి యనిమైన జెప్పవచ్చును లేదా యొకప్పుడు శుక్రుఁడును నిందునికి నీతి యుపదేశించె

నని చెప్పవచ్చును. లేదా శుక్రనీతి యిట్టిదని యెవరైనఁజెప్పఁగా విను నింద్రుఁడనియైన జెప్పవచ్చును.

తా త్ప ర్య ము.

శుక్రనీతిని విను నింద్రునివలెఁ దారు మాటలు వినుటయందు శ్రద్ధగల వానిని, సకల శాస్త్రములు తెలిసిన వానిని, స్వామి కార్యమున మిగుల శ్రమపడిన వానిని, నూరార్చ హనుమంతుడు పూని.

తే. వానరులలోన వారిలో ♦ వారలకు ను
పాయముల నాలుగిటను మూఁ♦డవ యుపాయ
మును బ్రయోగించి భేదంబు ♦ పుట్టఁజేసి
వారిలో వారు భేదించి ♦ పలుకు చుండ. ౧౨౫౨

తా త్ప ర్య ము.

వానరులలో వారిలో వారికి భేదాభిప్రాయములు కలుగు నట్లు భేదోపాయము చేసి వారిలో నొకరు చెప్పినది మఱియొకరు కాదని వాదులాడుచుండఁగా.

క. కోపోపాయసమన్విత, మౌ పలుకుల భీషణముగ ♦ నంగదునకు భీ
త్యాపాదకుఁడై గంధవ,హాపత్యము పలికి మఱియు ♦ నను నాతనితోన్. ౧౨౫౩

గంధవహాపత్యము = వాయుపుత్రుఁడు, హనుమంతుఁడు, కోపోపాయ సమన్వితము= (౧) కోపరూపకమైన యుపాయముతోఁ గూడినది(౨) కోపముతోను నుపాయముతోను గూడినది, భీషణముగ = తీవ్రముగ, భీత్యాపాదకుఁడై = దిగులు పుట్టించువాఁడై,

తా త్ప ర్య ము.

ఏమియంగదా! నీ వీ వానరులను నీచేతికిందికిఁ దీసికొని ప్రత్యేక వానర రాజ్యము స్థాపింప నుపాయము వెదకుచున్నావా? ఎట్లు చేయఁగలవో నేను జూచె దనుగాక- వీరందఱు సుగ్రీవు నాజ్ఞాప్రకారము రామకార్యమని యల్పకార్యమని నీవెంట వచ్చిరి కాని నీతోపాటు కలకాల మిచ్చటఁ దమయిండ్లు వాకిండ్లు భార్యలు బిడ్డల విడిచి యీ యడవులలో నల్లాడుటకై వచ్చినారని తలఁచితివా? వీరందఱు నీకు లోబడి రనుకో, అయినను నేనిపుడే పోయి రామలక్ష్మణులను సుగ్రీవుని దక్కన సేనను మీ దురుద్దేశముఁ దెలిపి పిలుచుకొని వచ్చెదను. ఇప్పుడు మనము చేసినది యబుద్ధిపూర్వకాపరాధము, అప్పుడు మీరు చేయునది రాజద్రోహము, బుద్ధిపూర్వకాపరాధము. కావున నిప్పుడు దండము తప్పవచ్చును. అప్పుడు తప్పదు. అప్పుడు నీరాజ్యము నీవు నేమికాగలవో యాలోచింపుము అని యీ విధముగఁ గోపముతోను నుపాయముతోను భయముకలుగునట్లు చెప్పి మరల సామమార్గము నవలంబించి యిట్లనియె.

శా. తారానందన! తండ్రికంటెఁ గడు యు♦ద్ధక్రీడ విస్పారితో
ధ్యారం బౌ కపిరాజ్య మంతయు వహిం♦ప న్నేర్తువుం దండ్రియు

ట్లారన్ యోజన సేయుమీ కపులు ని♦త్యం బస్థిరస్వాంతగుల్
దారాత్మీయులఁ బాసి ని న్నిచట నే♦లా కొల్తు రెల్లప్పుడున్. ౧౩౫౪

విన్నాణివి = నేర్పరివి, అస్థిర స్వాంతగుల్ = స్థిరబుద్ధిలేని చపలులు, దారా+ ఆత్మీయులన్ = పెండ్లాలను బంధువులను.

తాత్పర్యము.

అంగదా! నీవు యుద్ధమునందు నీతండ్రికంటె నేర్పుగలవాఁడవు. కపిరాజ్య భారమంతయుఁ దండ్రి యట్లు భరింప నేర్తువు. అయినను నొకటి యాలోచింపుము. ఈ కోఁతు లెప్పుడు చపలచిత్తులు, ఇప్పుడున్న బుద్ధి యింకఁ గొంతసేపటి కుండదు. ఇట్టి వీరు పెండ్లాలను బంధువులను వదలి కలకాల మిచ్చట నిన్నేల కొల్తురు.

చ. ఎదుటన చెప్పెదన్ వినుము ♦ యెట్లు సుహోత్రుఁడు జాంబవంతుఁడున్
విదితముగాఁగ నీలుఁడును ♦ వీడరొ సూర్యజు నట్ల నేనునున్
వదలను, సామదానగుణ♦వర్గముచేతను దండపద్ధతిన్
గొదగొని యైన వీరలను ♦ గూర్చుకొనంగను జాల వేమిటన్. ౧౩౫౫

తాత్పర్యము.

ఇచ్చట నున్నవారందఱు నీకు లోపడి యుందు రని తలంచితివేమో! అది పొరపాటు. సుగ్రీవుని సుహోత్రుఁడు జాంబవంతుఁడు స్పష్టముగా నీలుఁడు నెట్లు వదలరో నేను నట్లే సుగ్రీవుని వదలువాఁడను గాను. నీ విచ్చట నీ ప్రయత్నము చేయఁగానే మేము సుగ్రీవు నొద్దకుఁ బోయి యంగదుఁ డిట్లు చేయుచున్నాఁడని చెప్పువారమే. వీరిని నీవు మంచిమాటలచేతఁగాని లంచ మిచ్చుట చేతఁగాని యితర గుణముల చేతఁగాని దండించిగాని విజృంభించి మఱి యే విధముగ నైన నీలోఁ గలుపు కొనఁజాలవు.

క. బలహీనుతోడఁ బగ గొని, బలియుఁడు మనఁ గలఁడు గాని ♦ వాలితనూజా!
యిల బ్రదుకవాంఛ గలిగిన, బలహీనుఁడు బలియుతోడఁ ♦ బగ గొనఁ దగునే?

తాత్పర్యము.

నీవు మఱియొకటి యాలోచింపకున్నావు. ఇక్కడ నీకుండు సేనకంటె నక్కడ సుగ్రీవున కెక్కువ సేన గల దని యాలోచించిన వాఁడవుకావు. మూఁడు భాగములందుండిన నొకభాగ మిందున్నది. బలహీనునితోడ విరోధించి బలవంతుఁడు బ్రతుకఁగలఁడు కావున నీ వలన సుగ్రీవునకు భయములేదు. బలవంతునితోడ విరోధించి బలహీనుఁడు బ్రదుకఁగలఁడా.

ఉ. చెప్పఁగ వింటి నిప్పుడు వ♦సింపఁగ వచ్చు బిలంబులోన మే
లొప్పఁగ నంచు లక్ష్మణుని♦యుగ్రశరంబుల కిద్ది లక్ష్యమే?
యెప్పుడొ కూల్పఁడే? పవి సు♦రేంద్రుఁ డలంతిపనిన్ ఘటించెఁ దా
గుప్పి శరాళి లక్ష్మణుఁడు ♦ గొబ్బునఁ జెక్కఁడె దీని దొప్పగన్. ౧౩౫౬

తాత్పర్యము.

ఇచ్చట నిప్పుడు బిలంబులో నుండుట మేలని చెప్పఁబడఁగా వింటిని. ఈ గుహలోఁ బ్రవేశించి యిందుడు వజ్రాయుధముచే మయుని జంపెనని స్వయం ప్రభ చెప్పఁగా మనము వింటిమిగదా, ఇంద్రుఁడు చేసినది స్వల్పకార్యము, రామ చంద్రమూర్తిదాఁకఁ బోవలసిన పని లేదు. లక్ష్మణుఁడే తీవ్రబాణములు ప్రయోగించి బిలముపై భాగ మెగిరిపోయి బిలము దొప్పవలెఁ గనఁబడునట్లు చేయలేఁడా? అప్పుడు వీరంద తెక్కడఁ బోదురు. బోనులోఁ చిక్కినట్లు చిక్కరా, వీరిందున్నారని వారికెట్లు తెలియునందురా, మేము పోయి చెప్పి తోడితెచ్చెదము.

క. కులిశాశనిసన్నిభములు, కులధరముల నేని చీల్చు ♦ గురుతీక్ష్ణశరం
బులు గలవు పెక్కు లా రఘు,కులదీపకుఁ డగు సుమిత్ర♦కొమరునియొద్దన్. ౧౨౫౮

కులిశ + అశని + సన్నిభములు = వజ్రాయుధములతోను బిడుగులతోను సమానములైనవి, కులధరములు = కులపర్వతములు.

తాత్పర్యము.

ఇంద్రునొద్ద నొక్క వజ్రాయుధమే కలదు. రఘువంశదీపకుఁ డగు లక్ష్మణునొద్ద వజ్రాయుధములవలెఁ బిడుగులవలె కులపర్వతములనైన భేదించు మిగుల తీక్ష్ణములైన బాణంబు లెన్నో కలవు. కావున నీ చిన్నగుహను భేదించుట యాయనకుఁ గష్టము కాదు.

క. బిలమున నుండితి వేనియు, బలమునఁ బినతండ్రితోడఁ ♦ బగ గొని తేరన్
నిలువక కృతనిశ్చయులై, వెలలి చనుదు రెల్లకపులు ♦ విమలమనీషా! ౧౨౫౯

తాత్పర్యము.

అంగదా! వీరి మాటలు విని నీవు బిలములోనున్నను వీరినినమ్మి నీవు పినతండ్రితోఁ బగపూనినను వీరేమో నీతోడ నిలువరాదని నిశ్చయించుకొని యందఱు వెడలి పోదురు, నీ వొక్కఁడవే మిగులుదువు, నీవు బుద్ధిమంతుఁడవు, ఆలోచించి చూడుము. వెలలి- రూపాంతరము, వెడలి.

క. ఆలుంబిడ్డలఁ దలఁచుచుఁ, జాలఁగ నాఁకట దినంబు ♦ శ్రమపడుచును దుః
ఖాలయశయ్యల వనరుచు, వాలిసుతా! నిన్నుఁగపులు ♦ వదలెదరు సుమీ.

తాత్పర్యము.

వానరులు నిలువరు, వెడలిపోయెదరంటివే, నీకెట్లు తెలియునందువా, భార్యలను బిడ్డలను దలఁచుచు నిక్కడఁదినుటకుఁ గందమూలములు త్రాగుటకు నీళ్ళులేక దినమొకగండముగా శ్రమపడుచు దుఃఖస్థానము లగు నీశయ్యలపై రాలపై అప్పలపై నేలపై గడ్డిపై నెండనక వాననక పండికొనుచు శ్రమపడలేక నిన్ను వదలిపోదురు, సుఖజీవనము సుఖశయ్యలు బంధువులు సుఖాహారములు వదలి యీ ఘోరారణ్యము లందు నెవఁడు నీకొఱకై దుఃఖము సహించును.

క. హితకాములైనబంధులు, హితులుఁ నిను విడిచి పోవ ♦ నెత్తిన భీతిఁ
మతిచెడి వణఁకెదవు సదా,గతికి వణఁకు తృణముకంటెఁ ♦ గడులాఘవమై.

తాత్పర్యము.

నీమేలుఁగోరు బంధువులు నీమిత్రులు నిన్ను వదలిపోఁగా నొంటరివాఁడవై భయముచే గాలికి గడ్డిపోఁచకంటె లాఘవమై నేవేళ కేమో యని వణఁకెదవు.

క. స్వామిక్రియావిముఖు నిను, భీమంబు దురాసదంబు ♦ వేగాన్వితమౌ
సౌమిత్రిశరస్తోమం, బేమిటికి వధింపకుండు ♦ నెంచుము నిన్నున్. ౧౨౯౨

తాత్పర్యము.

ఉత్తభయము మాత్రమే కాదు, నీకుఁ గీడును గలుగును. రాజు చెప్పిన కార్యమును జేయని నిన్ను భయంకరములై యణఁపరానివై వేగముతోఁ గూడిన లక్ష్మణుని బాణసమూహము నిన్నేల వధింపదో యాలోచింపుము.

ఉ. రమ్ము వినీతి మాబడిని ♦ రాజ్యమునన్ నిను నిల్పు నానుపూ
ర్వ్యమ్మునఁ నీ పితృవ్యుఁడు భ♦వద్ధితకాముఁడు ధర్మకాముఁడున్
జుమ్ము దృఢవ్రతుండు కడు♦శుద్ధుఁడు సత్యప్రతిజ్ఞుఁ డాట న
న్నమ్ము మొకప్పుడైన నిను ♦ నాశ మొనర్పఁడు సూర్యపుత్రుఁడున్. ౧౨౯౩

వినీతి = వినయవంతుడవై, మాఒడిని = మా వెంబడిని, ఆనుపూర్వ్యమ్మునఁ = క్రమముగ, నీపితృవ్యుఁడు = నీపిన్నతండ్రి, భవత్ + హితకాముఁడు = నీ మేలుకోరువాఁడు, ధర్మకాముఁడు = ధర్మకాంక్షగలవాఁడు, దృఢవ్రతుఁడు = పట్టిన వ్రతము విడువనివాఁడు, కడుశుద్ధుఁడు = మిగుల నిర్మలమైన మనస్సుగలవాఁడు, సత్యప్రతిజ్ఞుఁడు = ప్రతిజ్ఞను యథార్థము చేయువాఁడు.

తాత్పర్యము.

నీ విరోధబుద్ధి మాని వినయము గలవాఁడవై మా వెంటఁ గిష్కింధకురమ్ము, మునుపటివలెనే నిన్ను నీ పిన్నతండ్రి యువరాజుగ నుంచును. నీకెట్లు తెలియునందువా, నీమేలు కోరువాఁడేకాని కీడు గోరువాఁడు గాఁడు. నీ తండ్రి తనకుఁ గీడు చేయుటచే నతనితో విరోధించెనే కాని నీ యందాయన ద్వేషింపఁ గారణము లేదు. నిన్ను హింసించుటవలన నాయనకు రాఁగల లాభములేదు. ధర్మమందుఁ గోరిక గలవాఁడు కావున నధర్మమార్గమున నిన్ను వధింపఁడు. దృఢమైన వ్రతము గలవాఁడు, నిర్మలమగు మనస్సుగలవాఁడు. ప్రతిజ్ఞఁ దప్పనివాఁడు, నామాట నమ్ముము, నీ కెప్పుడును సుగ్రీవుఁడు కీడు చేయఁడు.

క. నీ తల్లియందు మిగులం, బ్రీతి గలుఁగువాఁడు తన్ని♦మిత్తము జీవో
పేతుండును సంతానా, పేతుఁడు యువరాజ! యచట ♦ కేగుట యొప్పున్. ౧౨౯౪

తాత్పర్యము.

ఇంతేకాదు, నీ తల్లియందు మిక్కిలి మక్కువగలవాఁడు. ఆమెకు దుఃఖము

కలుగు కార్యముఁ జేయఁడు. ఆమె నిమిత్తమై జీవించి యున్నాఁడు, ఆయనకు నీవు తప్ప సొంతకొడుకులు లేరు. నిన్నుఁజంపి వంశము నాశము చేసికొనునా? కావున యువరాజా! కిష్కింధకుఁ బోదము.

—♦ ౫౫-వ సర్గము. అంగదుఁడు సుగ్రీవుగుణముల నిందించుట. ♦—

తే. అనవుడును గంధవహసుతు ♦ వినయయుతము
రాజసత్కారయుతము ధ♦ర్మ్యంబు నైన
పలుకు లాలించి వచియించె ♦ వాలితనయుఁ
డాత్మగత మెల్ల నాప్లవ♦గాధిపునకు. ౧౨౬౫

గంధవహసుతు = హనుమంతుని యొక్క, వినయయుతము = అణఁకువతోఁ గూడినది, రాజసత్కారయుతము = రాజగౌరవముతోఁ గూడినది, ధర్మ్యంబు = ధర్మముతోఁగూడినది, ఆత్మగతము = మనస్సునందుండినది.

తా త్ప ర్య ము.

హనుమంతుఁడు సుగ్రీవుఁ బ్రశంసించి చెప్పఁగా వినయముతోను రాజగౌరవముతోను ధర్మముతోను గూడిన యాంజనేయుని వాక్యములను విని యంగదుఁడు తన మనస్సులో నున్నది యెల్ల హనుమంతున కిట్లనియె.

ఉ. స్థైర్యము నాత్మమానసిక♦శౌచము నార్జవ మానృశంస్యముౝ
ధైర్యము విక్రమంబుఁ గపి♦నాయకుపట్లను లేమి వింతయే?
యార్యను జీవయుక్తుఁ డగు ♦ నగ్రజుభార్యను మాతృతుల్యఁ దాఁ
గార్యము కాదటంచనక ♦ కైకొనువాఁ డెటువంటి నీచుఁడో. ౧౨౬౬

స్థైర్యము = బుద్ధినిలుకడ, ఆత్మమానసిక శౌచము = ఆత్మశౌచము, మనస్సు యొక్క పారిశుద్ధ్యము, ఆర్జవము = వక్రత్వము లేకుండుట, ఆనృశంస్యము = దయ, క్రౌర్యము లేకుండుట, ఆర్యను = పూజ్యురాలిని, మాతృతుల్యౝ=తల్లితో సమానురాలిని,

తా త్ప ర్య ము .

సుగ్రీవుని మంత్రివి కావున నీ వాయన నెంతైన మెచ్చుకొన వచ్చునుగాని బుద్ధినిలుకడ, ఆత్మపారిశుద్ధ్యము, మనస్సు పారిశుద్ధ్యము, ఋజుత్వము, దయ, ధైర్యము పరాక్రమము, ఇవి సుగ్రీవునందు లేకుండుట క్రొత్తవిషయముగాదు, ఎట్లనెదవా, తల్లివలెఁబూజింపవలసినదానిని దల్లితో సమానురాలిని నా మొగుడు జీవించియుండఁగానే యిది సరిగాదనక భార్యగా గ్రహించువాఁ డెటువంటి నీచుఁడో నీవే యూహింపుము. దీనివలన భర్త చనిపోయిన పిమ్మట సోదరుని భార్యను గ్రహించుట కుల ధర్మవిరుద్ధముగాదని యేర్పడు చున్నది.

క. వెలుపల వైరులు దాఁకిన, నిలువుము నీ వనుచు నన్న ♦ నిలిపినఁ దానే
బిలముఖము మూసినాతఁడు, తలఁపుడు దెలియంగలండె ♦ ధర్మపథంబుల్.

తా త్ప ర్య ము.

వెలుపలినుండి శత్రువులు రాకుండునట్లు నీవు కావలియుండుమని యన్న నిలుపఁగాఁ దానే యా బిలద్వారమును మూసిన తమ్ముఁడు ధర్మమార్గముఁ దెలిసినవాఁడా?

లోకము పాపవిషయమున ననుమానమును బ్రమాణముగా గ్రహించినంత సుళువుగా సత్యమును గ్రహింపఁజాలదు. తడిక తోసినవాఁ డెవడనిన నాలులేనివాఁడని తటాలున నంతురుగాని సత్యము విచారింపరు. సీతాలక్ష్మణభరతులు, నాలనవాఁడు సుగ్రీవుఁ డిట్టి నిందలకుఁ బాలుపడినవారే. ఈనలువు రనుమానముచే నిందింపబడినవారే కాని సత్యవిమర్శనముచే గాదు. రాజ్య మాశింపకుండిన నీ నింద సుగ్రీవునకుఁ దప్పియుండును. గాని మంత్రులు బంధువులు ప్రజలు రాజ్యమురాజకము గానిత్తురా? కావునఁ బరేచ్ఛాప్రారబ్ధ మనుభవింపవలసివచ్చెను. తండ్రిమాట కొడుకునకు నచ్చినట్టు లితరుల మాట నచ్చునా? ఇంతకు నెవరికైన భవితవ్యము విధి యనివార్యము తప్పునదికాదు.

క. పాణిం బాణిని వైచి ప్ర,మాణము గొని పనియుఁ దీర్చి ♦ మహితాత్ముఁడు దాఁ
బ్రాణముఁ గాచిన నట్టి యు,రీణమతిన్ మఱచె నెవరి♦కృతి మతఁ డెఱుఁగున్.

తా త్ప ర్య ము.

చేతిలోఁజేతినివైచి ప్రమాణముచేసియుఁ దనపనిఁ జక్కఁజేసి తన ప్రాణముఁ గాపాడిన ఋజుమనస్కుని రామచంద్రునే మఱచినవాఁ డెవరి మేలెఱుఁగఁగలఁడు? ఇది కృతఘ్నతకు దృష్టాంతము.

తే. అవనిజాతను వెదక వ♦నాటసమితిఁ, బంపుటయు లక్ష్మణుని భీతి♦వలనఁ గాని
ధర్మలోపభయంబును ♦ దాల్చి కాదు, తలఁచునే యిట్టివాఁ డెందు♦ధర్మవిధము.

తా త్ప ర్య ము.

సీతను వెదకుటకు వానరులను బంపుట లక్ష్మణుఁడు తన్నుఁజంపునను భయముచేతనేకాని పంపకుండిన ధర్మహానివచ్చునే యను తలఁపునఁగాదు. ఇట్టివాఁడు ధర్మమార్గమును దలఁచునా?

క. చలచిత్తుఁడు స్మృతిహీనుఁడు,కలుషాత్ముఁడు కృతముఁ దెలియఁ ♦ గానఁడు వానిన్
గులజుఁడు బ్రదుకఁగ నాశంగల యార్యుఁ డెవండు నమ్ముఁ♦గలలోనైనన్. ౧౨౦

తా త్ప ర్య ము.

ఈ విధముగఁ జపలచిత్తుఁడు స్మృతిలేనివాఁడు పాపాత్ముఁడు కృతఘ్నుఁడునగువానిని సద్వంశమునఁబుట్టి గౌరవముగా బ్రదుకఁగోరిన పెద్దమనుష్యుఁ డెవ్వఁడు స్వప్నమందైన నమ్మును.

తే. గుణముకలవాఁడు గాని నిర్గుణుఁడు గాని
పుత్రకుని రాజ్యమున నిల్పఁ ♦ బోలుఁ గాక
వైరితనయుండ నగు నన్నుఁ ♦ బ్రాణయుక్తి
నీరజాప్తసుతుం డేల ♦ నిలుపువాఁడు. ౧_౨౭౧

తా త్ప ర్య ము.

నిన్ను యువరాజుఁ జేయును. అతనికిని సొంతబిడ్డలులేరు, గావున నిన్నుహింసింపఁడు, అని హనుమంతుఁడన్న మాటకుఁ బ్రత్యుత్తర మిచ్చుచున్నాఁడు.

గుణవంతుఁడు గాని సుగుణములు లేనివాఁడు కాని తన కొడుకును రాజ్యమందు నిలుపును గాని విరోధికొడుకగు నన్నుఁ బ్రాణములతో నైన నేల యుంచును? వీఁడు బ్రతికిన రాజ్యమాశించును. నా కొడుకునకు రాజ్యము లేక పోవునని నన్నుఁ జంపును. ఇప్పుడు బిడ్డలు లేకున్న నికఁ బుట్టరని యేమి నిశ్చయము.

ఉ. వెల్లడి చేతిసిగ్గి హృదయ♦వీధిని గల్గినమంత్రి మల్ల నేఁ
దెల్లము సాపరాధుఁడను ♦ దీనుఁడ శక్తియులేని వాఁడ నే
నల్లపురంబులో ననద♦యట్లయి యుండఁగ నెట్లు నేర్తుఁ? ద
ద్వల్లభుఁడుగ్ రహస్యవిధి ♦ బద్ధుని దండితుఁ జేయు నన్నికేన్. ౧_౨౭_౨

తెల్లము = స్పష్టము, సాపరాధుఁడను = అపరాధము చేసినవాఁడను.

తా త్ప ర్య ము.

నామనస్సులోఁగల యాలోచన యంతయు నేను వెలిపుచ్చితిని. ఈ కారణముచే నేను స్పష్టముగా నపరాధము చేసిన వాఁడనే. దీనుఁడను. నారక్షణమందు శక్తి లేని వాఁడను. కావున నేను జీవించి దిక్కులేని వానివలె నెట్లా కిష్కింధలో నుండఁగలను. ప్రాణము తీపుగదా, అనాథుడుగనో సనాథుఁడుగనో యేదోయొక విధముగఁ బడియుండదమనిన జీవముతో నుండుటకు సాధ్యముగాదు, ఏలన మీరెవ్వరైన సుగ్రీవునకు మీవిషయమై యిట్టి దురభిప్రాయ మున్నదని చెప్పనే చెప్పుదురు. ఆకారణముచే నన్నతఁడు రహస్యముగ బంధింపనైన ?ంధించును. ఏవిధముగనైన దండింపనైన దండించును.

తే. క్రూరుఁడును వంచకుఁడు దయా♦దూరుఁడతఁడు
రాజ్యకారణమున నన్ను ♦ బ్రదుకనీఁడు
బంధనాత్మక మగు ఘోర♦బాధకంటె
వేగతుల మేలు ప్రాయోప♦వేశనంబు. ౧_౨౭౩

తా త్ప ర్య ము.

క్రూరకార్యములు చేయువాఁడు మోసగాఁడు. దయలేనివాఁడు కావున సుగ్రీవుఁడు రాజ్యమునకు నేనెక్కడఁ బ్రభువుగా వత్తునో యని నన్ను బ్రదుకనీఁడు.

అచ్చటికి వచ్చిచెఱసాలలోఁ బడెడు బాధకంటె నిచ్చటఁ బ్రాయోపవేశము చేయుటే మేలు.

క. హరివరులారా! యిండ్లకు, నరుగంగా వచ్చు మీకు ♦ నానతి యిడితిఁ
బురి కేను రాను నిందే,మరణముఁ గాంచుటయె భద్ర♦మార్గమునాకున్. ౧౨౭౪

తా త్ప ర్య ము.

వానరులారా! మీరు మీ యిండ్లకుఁ బోవచ్చును. ఆజ్ఞ యిచ్చితిని. నేను గిష్కింధకురాను. నేనిక్కడఁ జచ్చుటయే క్షేమము.

అంగదుఁడు చెప్పినమాటల హనుమంతుఁ డేల ఖండింపలేదు. అది సాధ్యము కానిపని. నా యభిప్రాయ మిది యున్నప్పుడు ఆ యనుమానము పోఁగొట్టఁగల ప్రత్యక్ష ప్రమాణమేమి హనుమంతుఁడు తీసికొనిరాఁగలఁడు. అది కాలాంతరమున ననుభవ ముచే దృఢపడవలసిన విషయము. సుగ్రీవుని యభిప్రాయ మిదిగా దిది యని యెట్లు యుక్తులచే సాధింపసాధ్యమగును గావునఁ బ్రత్యుత్తర మిచ్చినవాఁడుగాఁడు.

క. శుభబలయుక్తుల రఘువుల, నభివాదనపూర్వకముగ ♦ నడిగితి ననుఁడీ
ప్రభు సుగ్రీవుఁ బితృవ్యుని, నభివాదనపూర్వకముగ ♦ నడిగితి ననుఁడీ. ౧౨౭౫

తా త్ప ర్య ము.

శుభకరమైన బలముతోఁగూడిన రామలక్ష్మణులకు నమస్కరించి కుశలమడి గితినని చెప్పుఁడు. ప్రభువు పిన్నతండ్రియగు సుగ్రీవునకును నమస్కరించి కుశలమడి గితి నని చెప్పుఁడు.

క. మామాత రుమాదేవిని, సేమంబా యనుచుఁ బ్రశ్న♦సేయుం డట్లే
మామాతను దారను మీ, రోముఁడు దుఃఖాపనోది♦సూక్తులఁ గరుణన్. ౧౨౭౬

తా త్ప ర్య ము .

మాతల్లి రుమాదేవిని క్షేమమా యని ప్రశ్నింపుఁడు, అట్లులే మాతల్లిని దారాదేవిని దుఃఖము పోఁగొట్టు మంచిమాటలచే రక్షింపుఁడు, ఆమె తప్ప నాకై యేడుచువారు లేరని భావము.

తే. నాదుజనని సహజముగ ♦ నందను నెడఁ బ్రీతి గలయది తనపతి♦కై తపించు
నదియు సచ్ఛీల నా మృతి♦నాలకించి మడియుట నిజంబు దానెట్లు ♦ మనఁగఁగలదు.

తా త్ప ర్య ము.

తారాదేవి నన్నుఁగన్నతల్లి, కావున సహజముగఁ గొడుకునందుఁ బ్రీతిగలది, అందుఁ దనపతికై సంతపించునది, మంచినడవడిగలది, నా చావు విని యామెయుఁ జచ్చుట నిజము, ఈ రెండు దుఃఖములతో నెట్లు జీవించియుండఁగలదు. తారకు వాలివిషయమైన సంతాపము గలదనుట యౌపచారికముగాని వాస్తవముఁగాదు.

రెండవభర్తను గ్రహింపఁ గోరికగల స్త్రీకి మొదటిభర్త మరణానంతరము రెండవభర్త యింకను దొరకలేదే యను విచారముండునే కాని మొదటి మగఁడు

చచ్చినాఁడనిన వ్యసనముండదు. వేశ్యలకు అంకుటాండ్రి కెంతో వీరికి నంతే. అవ్యసన మేకపత్నీవ్రతస్థు లగు స్త్రీ పురుషుల విషయము.

— అంగదాదులు ప్రాయోపవేశంబు సేయుట. —

క. అని వృద్ధుల కెల్లను దా, వినయంబున మ్రొక్కి దర్భవితతులపై రో
దన మొనరించుచు, గడు దు,ర్మనుఁడై భూస్థలిని గపికుమారుఁడు పండెన్.

దుర్మనుఁడు = శోకముతోఁ గూడిన మనస్సుగలవాఁడు.

తాత్పర్యము.

ఇట్లు చెప్పి సవినయముగఁ బెద్దవారి కెల్ల మ్రొక్కి దర్భలు పఱచుకొని యేడ్చుచు శోకముతోఁ గూడిన మనస్సుగలవాఁడై నేలమీఁద నంగదుఁడు పండుకొనెను.

ఉ. ఆర్తిని వానిపాటుఁ గని హా యని గన్నుల నీరుగాఱ వై
కర్తను దూఱుచున్ శతమఖప్రభవుం గొనియాడుచుం బురా
వర్తనముల్ గణించుచును బ్రాయము గోరుచుఁ గీశకోటి త
ద్భర్తను జుట్టి యాతనిమతంబు నెఱింగి జలంబు నంటుచున్. ౧౨౭౯

వైకర్తను = సూర్యపుత్త్రుఁడగు సుగ్రీవుని, శతమఖప్రభవున్ = వాలిని, పురావర్తనముల్ = పూర్వపుఁ జరిత్రములను, ప్రాయము = మరణము, వైకర్తనుఁడు, వికర్తనుని కుమారుఁడు. అపత్యార్థక తద్ధితము.

తాత్పర్యము.

వానరులందఱు నంగదునకై వ్యసనపడి హాయని యేడ్చుచు సుగ్రీవుఁ దిట్టుచు వాలిని బొగడుచుఁ బూర్వ చరిత్రముల స్మరించుచు మరణకాంక్షచే నంగదునిఁ జుట్టుకొని యాతఁడు సమ్మతింపఁగాఁ గాలుసేతులు కడుగుకొని యాచమించి.

తే. అంబునిధి యుత్తరంపుఁదీరంబునందు దక్షిణాగ్రములై యొప్పు దర్భలందుఁ
బ్రాఙ్ముఖంబుగఁ గూర్చుండి ప్రాప్తమరణమగుట మే లని చింతించి యగచరాళి.

ప్రాక్ + ముఖంబుగ = తూర్పుముఖముగ, ప్రాప్తమరణము = మరణము ప్రాప్తించుట, దక్షిణాగ్రములు = దక్షిణమునకుఁగొనలు గలవి.

తాత్పర్యము.

దక్షిణ సముద్రము నుత్తరతీరంబునందు దక్షిణపు దిశకొనలుండు నట్లు దర్భలు పఱచి వానిపైఁ దూర్పుముఖముగఁ గూర్చుండి మరణమే మేలని నిశ్చయించి.

తే. రామవనవాసమును దశరథునిమృతియు, నల జనస్థానవధము జటాయువధము
భూమిజాహరణము శక్రపుత్త్రునిహతి, రామకోపంబు వానరస్తోమభయము.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి యడవులకు వచ్చుట, దశరథుమరణము జనస్థానమున

ఖరాదులఁ జంపుట, జటాయుమరణము, సీతాహరణము, వాలిచచ్చుట, రాముని కోపము, వానర సమూహమునకు గలిగిన భయము.

క. తలఁచుచును బేరెలుంగున, విలపింపఁగ శైలసిభక♦పిప్రవరతతుల్
జలదంబు లుఱుమఁ బ్రతిరవముల,నిడుగతి సగుహ మగుచు♦ మొరసెన్ గిరియున్.

తా త్ప ర్య ము.

తలఁచుచుఁ బెద్దధ్వనితోఁ గొండలవంటి కపు లేడువఁగా వారిధ్వనిచే మేఘము లురిమినఁ బ్రతిధ్వను లిచ్చునట్లు గుహలతోడి పర్వతము ధ్వనించెను.

—♦ ౫౬-వ సర్గము. సంపాతి యంగదాదులఁ జూచుట. ♦—

ఉ. ఏతలమందుఁ గీశచయ ♦ మిట్లు మృతీచ్ఛ వసించె నా స్థలిన్
ఖ్యాతబలప్రతాపుఁడు జ♦టాయువునన్న సుదీర్ఘజీవి సం
పాతి యనంగ గృధ్రపతి ♦ పర్వతకందరవాసి చేర సం
ప్రీతిని వచ్చి యిట్లనియె ♦ హృష్టమనస్కత నుల్లసిల్లుచున్. ౧౨౫౩

మృతి+ఇచ్ఛన్ = మరణమందలి కోరికచే, సుదీర్ఘజీవి = దీర్ఘకాలము బ్రతికినవాఁడు, గృధ్రపతి = గ్రద్దఱేఁడు, పర్వతకందరవాసి = పర్వతగుహలో నుండువాఁడు, హృష్టమనస్కతన్ = సంతోషించిన మనస్సుతో.

తా త్ప ర్య ము.

ఏస్థలమందు వానరులు చావఁగోరి వసించిరో యా స్థలమందే ప్రసిద్ధికెక్కిన బలప్రతాపములు గలవాఁడు జటాయువునకన్న దీర్ఘకాలము జీవించినవాఁడు గ్రద్దలకు రాజు పర్వతగుహ యందుండువాఁడు బయలవచ్చి వారినందఱఁజూచి సంతోషించుచు.

క. దైవంబు ప్రాణికోటికిఁ, గావించును రక్ష దగిన♦గతిఁ గానఁ గదా
యీవిధిఁజిరకాలమునకు, నావంకకుఁ దెచ్చి యిచ్చె ♦ నవ్యాశనమున్. ౧౨౫౪

నవ్యాశనము = క్రొత్తయాహారము,

తా త్ప ర్య ము.

ప్రాణికోట్లను దైవమే యాహార మిచ్చి రక్షించును. ఈకారణముచేఁగదా దీర్ఘకాలమునకు నే నున్నచోటికే దైవము క్రొత్తయాహారమును దెచ్చియిచ్చెను.

క. వనచరవరులను నొక్కొ,క్కనిఁగన్ దినదినముఁ దిందుఁ ♦ గ్రమముగ వీరల్
గన మరణం బనఁగా విని, హనుమకు నుద్విగ్నుఁడై న♦యంగదుఁ డనియెన్.

తా త్ప ర్య ము ·

ఈ వానరుల నొకరి నొకరిని దినమున కొకరివంతున వరుసగాఁ జంపి తినుచుందును. అనఁగా నా మాటలు విని భయపడినవాఁడై యంగదుండు హనుమంతున కిట్లనియె.

చచ్చిన తరువాతఁదిందు నని సంపాతిచెప్పి యుండినచో నంగదుఁడు భయపడ వలసిన కారణములేదు బ్రతికియున్నప్పుడే పీఁకి తినెద ననుటచే భయపడెను. ఈ కారణముచే యముడే యీ గతి నేగుదెంచెనని చెప్పఁబోవుచున్నాఁడు.

సీ. భక్ష్యలుబ్ధం బైన♦పక్షిని గంటివే, సీతాపదేశంబు♦చేత యముఁడె
ప్లవగమండలికి న♦పాయంబుఁ గావింప, నిచ్చోటి కీగతి ♦ నేగుదెంచె
శ్రీరాముకార్యంబుఁ ♦ జేసినయది లేదు, రాజాజ్ఞ మనము ♦ దీర్పఁగను లేదు
ఇంతలోఁ జనుదెంచె ♦ నీమహాపాయంబు, కపికోటి కెల్ల నా♦కస్మికముగ

తే. నవనికన్యకకును బ్రియం ♦ బారఁ గూర్ప,గా జటాయువు చేసిన♦కార్య మెల్ల
వింటిమే కద మనమెల్లఁ ♦ బిదప నట్టి, భంగి మనకెల్ల నిప్పుడు ♦ ప్రాప్తమయ్యె

భక్ష్యలుబ్ధము = తిండియందాశగలది, సీతాపదేశంబు = సీతాదేవినెపమున, ప్లవగమండలికి=వానరసమూహమునకు.

తా త్ప ర్య ము.

ఆంజనేయా! యాహారముపై నాశగల పక్షిని జూచితివా? సీతయను నెపమున యముఁడే వానరులఁజంప నీ రూపంబున వచ్చెను. మనమో శ్రీరాము కార్యము చేసినవారము కామైతిమి. రాజాజ్ఞ నెఱవేర్చినవారము కామైతిమి. నెలలోపలనే పోయి సీత కనఁబడలేదని చెప్పియుండిన రాజాజ్ఞనిర్వహించియుందుము. ఇంతలోఁ దటాలున నీ యాపద సంభవించెను. సీతాదేవికి మేలుచేయఁగోరి జటాయువు చేసినకార్యము తరువాత మన మందఱము వింటిమి గదా! అట్టిగతియే మనకు నిప్పుడు తటస్థించెను.

తే. స్నేహదయలను మనవలె ♦ జీవకోటు, లహహ పశుపక్షిజాత్యాదు ♦ లైన వేఱు
వేఱఁదమయంత శ్రీరఘు♦వీరునకును, బ్రియముఁగావించుఁ బ్రాణముల్♦విడిచియైన.

తా త్ప ర్య ము.

స్నేహముచేతను దయచేతను బశువులు పక్షులు మొదలైన ప్రాణులందఱుఁ బ్రత్యేక ప్రత్యేకముగ నొకరి నిమిత్తమె మఱియొక్కరు కాచుకొనక తమ ప్రాణములు విడిచియైన శ్రీరామచంద్రమూర్తికి సాహాయ్యము చేయునుగదా.

తే. అవనిజాపతి కుపకార ♦ మాచరింప
ధర్మవిదుఁడు జటాయువు ♦ తనువు దొఱఁగి
ప్రియము గావించెఁ గాదె యా♦రీతి, మనము
గాసిఁబడినార మా రాము♦కార్యమునకు. ౧౨౮౮

తా త్ప ర్య ము.

రామచంద్రమూర్తి కుపకారము చేయుటకై కదా ధర్మమెఱింగిన జటాయువు దేహము విడిచియైన ప్రియము గావించెను. ఆ విధముగ మన మడవులందు మిగుల శ్రమించితిమి. ధర్మమెఱిగిన ఆర్తుల నెట్టివారినైన రక్షింపవలయును, అందు స్త్రీల

నవశ్యము రక్షింపవలయును, అందు స్వామి యగు శ్రీరామచంద్రుభార్యను నవశ్యము రక్షింపవలయు ననుట ధర్మము.

క. కాంతారంబుల నన్నిటఁ, గాంతామణి వెదకి వెదకి ♦ కానము మఱి జీ
వాంతంబును బ్రాప్తించెను, జింతింపఁగ నేల మృతికి ♦ సిద్ధుల మగుటన్. ౧౨౮.

తాత్పర్యము.

సీతాదేవి నడవులందు వెదకి వెదకియుఁ జూడలేకపోయితిమి. మరణకాలము కూడఁ బ్రాప్తించెను. మనము చచ్చుటకు సిద్ధపడి యున్నాము. కావున నిఁక నీ గ్రద్ద మనలఁ దిను నని వ్యసనమేల?

క. ఖండితుఁ డై రావణుచే, భండనమున నీల్గి పరమ♦పద మేగె ఖగేం
ద్రుండు కపినాథభయము, క్తుం డయి ధన్యుం డతండె ♦ కువలయమందున్. ౧౨౯

ఖండితుఁడై=నఱకఁబడినవాఁడై, భండనమునన్=యుద్ధమునందు, ఈల్గి=చచ్చి పరమపదము=విష్ణులోక మగు వైకుంఠమునకు, "తద్విష్ణోః పరమం పదమ్" కపినాథ భయముక్తుండై=సుగ్రీవుఁడు చంపు నను భయములేక, కువలయమందున్= భూవలయ మందు.

తాత్పర్యము.

రావణాసురునిచే యుద్ధమందు నఱకఁబడి పక్షిరాజు జటాయువు చచ్చి పరమ పదమునకుఁ బోయెను. ఆయన మనవలె సుగ్రీవు భయముచేఁ జచ్చినవాఁడు కాఁడు. మనమో సుగ్రీవుఁడు చంపునే యని యాయనకు భయపడి మనము చావ నున్నారము. కాని యాయనవలె ధర్మార్థముగాదు, కావున నాయనయే పుణ్యాత్ముఁడు, నికృష్టపుఁ జావు చావఁ బూనిన మన కాయన వలెఁ బుణ్యలోక మెందుండి వచ్చును.

తే. దశరథేశుండు దా మృత్యు♦వశతఁ గనుట
బృథివికన్యక నసుర హ♦రించుకతనఁ
గృధ్రరాజు జటాయువు ♦ మృతుఁడు నగుటఁ
బ్లవగులకు జీవసంశయా♦పద ఘటిల్లె. ౧౩౦

జీవసంశయాపద=ప్రాణసందేహము గలిగించు నాపద.

తాత్పర్యము.

దశరథుఁడు చచ్చుట సీతను రావణుఁడు హరించిన కారణమున జటాయువు చచ్చుట వీనిచే మనకుఁ బ్రాణాపాయము సంభవింపఁ గలిగెను.

దశరథుఁడు చావకుండెనా మరల నెట్లైన శ్రీరామచంద్రమూర్తిని నయోధ్యకుఁ బిలుచుకొని పోయియుండును. అప్పుడును మన కీయాపద లేదు. రావణాసురుడు సీతను హరింపకుండినను మన కీయాపద లేదు, హరించెను బో జటాయువు వానిని జంపి

యుండినను మన కీ యాపద లేదు, మన కీ యాపద ఘటిల్లుట కీ మూఁడును గారణము లయ్యెను.

శా. త్రైమాకన్యామణితోడ రామవిభుఁడుర్ ♦ సౌమిత్రియుం గానకై
రాకల్ రాఘవతీవ్రబాణమున సు♦తారామాత్మజుం డీల్గుటల్
శ్రీకాకుత్స్థరుషోన్నతిన్ విబుధవై♦రివ్రాతముల్ గూలుటల్
కైకేయీవరదానకారణమునం ♦ గాఁగల్గె నీ కష్టముల్. ౧.౫౬-౨

తా త్ప ర్య ము.

సీతాదేవితో రామచంద్రుఁడు లక్ష్మణుఁడు నడవులకు వచ్చుట రాముని బాణమున వాలిచచ్చుట శ్రీరామునకుఁ గోపము వచ్చునట్లు చేసి రాక్షసులు చచ్చుట యిన్ని కష్టములు దశరథుఁడు కైకకు వరము లిచ్చుటచేఁగదా కలిగెను. దశరథుఁడనాలోచితముగఁ గైకకు వర మిచ్చి తాను జచ్చుటయేగాక యందఱచావునకుఁ గారణమయ్యెను.

—♦ ౫౭వ సర్గము - సంపాతి యంగదాదులతో భాషించుట. ♦—

క. ధరణీపతితులు కపులు స,కరుణం బగు వాలితనయు♦కథితకథ విన్
గురుచలితమతి ఖగేశుఁడు, పరితాపకరంబు గాఁగఁ ♦ బలికెన్ వారిన్. ౧.౫౭-౩

ధరణీపతితులు = నేలఁబడినవారు, సకరుణంబు = వ్యసనముతోఁ గూడినది, కథిత = చెప్పఁబడిన, గురుచలితమతి = మిగులఁజలించిన మనస్సుగలవాఁడు,

తా త్ప ర్య ము.

నేలఁబడి యుండిన వానరులు అంగదుఁడు చెప్పిన వృత్తాంతము వినుచుండఁగా సంపాతి మిగులఁ జలించిన మనస్సుగలవాఁడై వారిని జూచి పరితాపము కలుగ నిట్లనియె.

ఉ. ఎన్నిదినాలకో వినితి ♦ నియ్యెడఁ దమ్ముని పేరు, ప్రాణముల్
కన్నప్రియుండు వాఁడు, కడుఁ ♦ గంపిలె నా హృదయంబు తద్వధన్
విన్నను, దండకన్ దనుజ♦వీరున కాతని కేల యుద్ధ? మా
పన్నత యెట్లు గల్గె? నది ♦ పల్కెడ వెవ్వఁడ వీవు వానరా? ౧.౫౭-౪

కంపిలెన్ = చలించెను.

తా త్ప ర్య ము.

అయ్యో! యెన్నిదినాలకు నా తమ్ముని పేరు నేను వినుట కలిగెను. నా ప్రాణములకంటె వాఁడు నాకుఁ బ్రియుఁడు. వాని మరణము వినుటచే నా హృదయము చలించెను. దండకయందు రావణాసురున కాయన కేల యుద్ధము జరిగెను. అం దెట్లతఁడు చచ్చెను. వానరా! యీ కథ లన్ని చెప్పెడి నీ వెవ్వఁడవు?

క. గిరినుండి నన్ను దింపఁగఁ, బరమమతిన్ వేఁడువాఁడ ♦ బలియుఁడు తమ్ముం
డురుసుగుణజ్ఞుం డాతని, పరికీర్తన వినఁగఁ గల్గెఁ ♦ బహునాళ్ల కిటన్. ౧.౫౭-౫

తా త్ప ర్య ము.

మీరు గొప్ప మనస్సుచేసి నన్నుఁ గొండనుండి క్రిందికిదింప వేడుచున్నాను. నా తమ్ముఁడు మిగుల బలశాలి. మిగుల సుగుణము లెఱింగినవాఁడు, అతని మీరు పొగడఁగా సిన్నాళ్ళ కిచట వినఁ గలిగితిని.

క. సీతాపతిజనకుండగు, ఖ్యాతలపతి దశరథుండు ♦ సఖుఁ డె ట్లయ్యెన్
నా తమ్మునకును జెప్పుఁడా, ఖ్యాతయశోధన్యులార ♦ కాంక్షింతు వినన్. ౧౭౬

తా త్ప ర్య ము.

రామచంద్రమూర్తి తండ్రియగు దశరథరాజునకు నాతమ్ముఁడు మిత్రుఁడెట్ల య్యెను. ప్రసిద్ధికెక్కిన కీర్తిచేఁ బుణ్యులైన వానరులారా ! వినఁగోరెదను.

ఈప్రశ్నకుఁ బ్రత్యుత్తర మీ రామాయణమున లేదు.

క. ఖరకరుఖరకరములఁ గపివరులార ! నేను దగ్ధ♦పత్త్రుఁడ నగుటన్
గిరి డిగ్గఁగాల నన్నుం, బెరిమం గొనిపొండు మీ స♦మీపమున కనన్. ౧౭౭

ఖరకరు = సూర్యునియొక్క, ఖర = తీక్ష్ణములైన, కర = కిరణములచే, దగ్ధ పత్త్రుఁడను = ఱెక్కలు కాలినవాఁడను, పెరిమన్ = ప్రేమచే,

తా త్ప ర్య ము.

వానర శ్రేష్ఠులారా! సూర్యునికిరణములచే నా ఱెక్కలు కాలిపోవుటచే నేను గొండదిగఁజాలను. నాయందుఁ గనికరించి మీ సమీపమునకుఁ గొనిపొండు.

—♦ అంగదుఁడు సంపాతికిఁ దమవృత్తాంతముఁ జెప్పుట. ♦—

క. గొదకొను దుఃఖంబున గద్గదికం దడఁబడెడి గ్రద్ధ♦గళరవము వినిన్
మది నమ్మరైరి తద్భీతిదకర్మంబునకుఁ గపులు ♦ దిగు లుదయింపన్. ౧౭౮

గొదకొను = విజృంభించు, అతిశయించు, గద్గదికన్ = డగ్గుత్తిక, గొంతు తడఁబడుట, వినిన్=వినియును, తత్ =ఆగ్రద్దయొక్క, భీతిద = భయము కలిగించు, కర్మంబునకున్ = కార్యమునకు.

తా త్ప ర్య ము.

పొరలి పొరలి విశేషించి వచ్చు దుఃఖముచే మాటతడఁబడుచున్న గ్రద్ద కంఠ ధ్వని వినియును అది నిజమని వానరులు నమ్మినవారుకారు. ఏలన నది తమ్ముఁ జంపు నని భయపడిరి.

తే. మనల నెల్లర భక్షించు ♦ మానసిదియు, గాన వలదని కొందఱు♦కపులు పలుకఁ
జావ నాయత్తపడియును ♦ జఱు పిదేల?, యరిగి వేగంబ ధన్యుల ♦ మగుట తగదె.

తా త్ప ర్య ము.

ఇది మనల నందఱఁ జంపును. కావునఁ దీ వలదని కొందఱు పలుకఁగాఁ జచ్చు

టకు సిద్ధపడి యుండియును నీ భయమేల? పోయి తీసికొని వచ్చి చచ్చి ధన్యుల మగుట తగదా యని కొంద ఱనిరి.

చ. అని చని దాని నెత్తికొని ♦ యదిృని డింపఁగఁ గొంద ఱంగదుం
డనియెను దానితో విను వి♦హంగమవల్లభ! స్వర్ణగర్భుతో
నెనయు వలీముఖేంద్రుఁ డల♦ఋక్షరజుం డను విక్రమాఢ్యుఁ డా
యనకును బుత్రు లిర్వురు మ♦హౌఘబలుల్ గల రుగ్రవిక్రముల్. ౧౨౦౦

అదిృని=కొండనుండి, స్వర్ణగర్భుతో=బ్రహ్మతో, ఎనయు=సమానమగు, వలీముఖేంద్రుఁడు=వానరశ్రేష్ఠుఁడు. మహౌఘబలుల్=గొప్ప యోఘసంఖ్యగల జనుల కెంత బలమో యంతబలము గలవారు.

తా త్ప ర్య ము.

అట్లు చెప్పి కొందఱు పోయి దానిని గొండమీఁది నుండి క్రిందికిఁ దెచ్చిరి. అప్పు డంగదుఁడు దానితో నిట్లనియె. ఓ పక్షిశ్రేష్ఠా! వినుము బ్రహ్మతో సమాన మైనవాఁడు ఋక్షరజుండను వానరశ్రేష్ఠుఁడు గలఁడు, ఆయన కిరువురు కుమారులు ఓఘమంత బలముగలవారు. గొప్ప పరాక్రమము గలవారు.

క. వాలియు సుగ్రీవుం డన; వాలియ నా తండ్రి యతఁడు ♦ వర్ణితుఁ డయ్యెన్
వాలినవిక్రమమునఁ గా,ర్యాళు లనేకములు సలిపి ♦ యద్భుతరీతిన్. ౧౩౦౧

తా త్ప ర్య ము.

వారి పేర్లు వాలి సుగ్రీవుఁడు, ఆ వాలియే నా తండ్రి, అతిశయించిన పరాక్రమముచే నతఁ డద్భుతకార్యము లనేకములు చేసి కీర్తి సంపాదించినవాఁ డయ్యెను.

చ. సకలజగత్ప్రభుండు రఘు♦చంద్రముఁ డాజిసుతుండు రాముఁ డ
త్యకలుషవర్తనుండు తన ♦ దారను దమ్మునిఁ గూడి తండ్రియా
జ్ఞకు బదు లాడ నోడి కడు♦న్యాయ్యపథస్థుఁడు గాన ఘోరదం
డక నడ తెంచి చొచ్చె; వికటక్రియుఁ డౌ దశకంఠుఁ డయ్యెడన్. ౧౩౦౨

తా త్ప ర్య ము.

సకలలోకప్రభువు దశరథుకొడుకు,రఘువంశమునఁ బుట్టిన వారిలో శ్రేష్ఠుఁడు, నిర్మలమైన నడవడి గలవాఁడు, రామచంద్రమూర్తి తండ్రియాజ్ఞకు బదులుచెప్ప భయపడి తన భార్యతోను తమ్మునితోను గూడి న్యాయ్యమార్గమునం దుండువాఁడు గావున గాఢ్నడ భయంకరమైన దండకారణ్యము ప్రవేశించెను. ఆ సమయంబున విపరీతపు నడవడిగల రావణాసురుఁడు.

క. వారు జనస్థానమున వి,హారము సలుపంగ రాము♦నంగనను బలా
త్కారంబుగఁ గొని చనఁగా, శ్రీరాముని జనకుసఖుఁడు ♦ గృధ్రేశుండున్. ౧౩౦౩

తా త్ప ర్య ము .

ఆ ముప్పురు జనస్థానమునఁ దిరుగుచుండఁగా రామచంద్రమూర్తి భార్యను

సీతాదేవిని బలాత్కారముగఁ దీసికొని పోఁగా శ్రీరామచంద్రమూర్తితండ్రికి మిత్రుఁడగు గృధ్రరాజు.

రామచంద్రమూర్తికిఁ దండ్రికి సఖుఁ డనుటచే నా స్నేహకారణము తెలియదని సూచితము.

తే. అగు జటాయువు రాముని ♦ మగువఁజూచి
యామె విడిపింపఁ గోరి మే♦ఘాధ్వమునను
జనెడి రావణుఁ దాఁకి త♦త్స్యందనంబుఁ
గూల్చి ధరమీఁద నిలిపె న♦కుంఠవలయాక్షి. ౧౩౦౪

మేఘ + అధ్వము = మేఘములమార్గము, ఆకాశము. తత్ + స్యందనంబు = వాని రథమును.

తాత్పర్యము

జటాయు వా జానకీదేవిని జూచి యామెను విడిపింపగోరి యాకాశమునఁ బోవుచున్న రావణునిదాఁకి వాని రథమును విఱిచి యామెను భూమిమీఁదికి దించెను.

క. వెండియుఁ బోరునెడఁ శ్రాం,తుండును వృద్ధుండు నౌట ♦ దోషాటునిచే
ఖండితపక్షుండై పడె, భండనమున నిట్లు విహగ♦పతి మరణింపన్. ౧౩౦౫

శ్రాంతుఁడు = బడలినవాఁడు, దోషా + అటుఁడు = రాత్రియందు సంచరించువాఁడు, రాక్షసుఁడు, ఖండితపక్షుండై = నఱకఁబడిన ఱెక్కలుగలవాఁడై, భండనమునన్ = యుద్ధమందు, విహగపతి = పక్షిరాజు, జటాయువు.

తాత్పర్యము.

అంతతోఁబోక మఱియు యుద్ధముచేయు నపుడు బడలిన వాఁడును ముసలివాఁడును నగుటచే యుద్ధంబున రాక్షసునిచే ఱెక్కలు నఱకఁబడినవాఁడై పక్షిరాజు మరణించెను.

తే. జానకీభర్త యాతని ♦ సంస్కరించి, యుత్తమంబైన గతి గూర్చి ♦ హత్తఁ జేసె
నాదు పినతండ్రి సుగ్రీవ♦నాముతోడ, సఖ్య మొనరించి చంపె నా♦జనకుఁ బిదప.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి యతనికి నగ్నిసంస్కారాదు లొనరించి యుత్తమంబయిన గతి గలుగఁజేసెను. ఆవల నా పినతండ్రియగు సుగ్రీవుఁడను వానితో స్నేహము చేసి నాతండ్రిని జంపెను.

క. నాతండ్రితోడ సచివో,పేతుం డయి గోదగోదఁ వ♦హించెఁ బితృవ్యుం
డా తరణికులుఁడు వాలిఁ బ,రేతుం గావించి రాజ్య ♦ మిచ్చె హితునకున్. ౧౩౦౭

సచివోపేతుండు = మంత్రులతోఁ గూడినవాఁడు, గోదగోదఁ = విరోధమును, పరేతుఁ = మరణించినవానిఁగా.

తా త్ప ర్య ము.

సూర్యపుత్రుఁడైన నా పినతండ్రి నాతండ్రితో మంత్రులతోఁ గూడి విరోధించెను. ఆ కారణమున రామచంద్రమూర్తి వాలిని జంపి తన మిత్రునకు రాజ్యమిచ్చెను.

క. వానరపతిసుగ్రీవుఁ డ♦నూన విభుత్వప్రతిష్ఠ ♦ నొంది మహీజన్
గానఁగ మముఁ బంచెను రా,మానుమతిన్ మేము నచట ♦ నచట వెదకుచున్.

అనూన = కొఱఁతలేని, విభవ = ప్రభుత్వమందు, ప్రతిష్ఠ = స్థాపనము, మహిజన్ = భూపుత్రియైన సీతను, రామానుమతిన్ = రాముని యనుమతిచే.

తా త్ప ర్య ము.

వానరపతియగు సుగ్రీవుఁడు పూర్ణరాజ్యమునందు స్థాపింపఁబడినవాఁడై సీతను వెదకుటకై రాముని యనుమతిమీఁద మమ్ముఁ బంపెను. మేము నచట నచట నామెను వెదకుచు.

క. తిరిగితిమి కాని భాస్కర,కరముల రాత్రులను జూడఁ ♦ గాననిభంగిన్
ధరణిజఁ గానమ దండక,ఁ జరియించుచు హెచ్చరికను ♦ సతి నెమకెడిచోన్.

భాస్కర కరములన్=సూర్యకిరణములను, సూర్యకిరణములను రాత్రి చూడలేనట్లు, అనుటచే సీత యెందో యుండుట నిశ్చయము. ఆమె యొకచో నుండిన మేమొకచో వెదకుచున్నాము. ఆమె యెక్కడ నుండునది మాకుఁ దెలియలేదని భావము. రాత్రులందు సూర్యకిరణములు మన దేశమందు లేనంతమాత్రమున నత్యంతాభావమై పోవు. అవి యున్నచోటికిఁ బోయి చూచినఁ గాన వచ్చును. ఇచ్చట సూర్యాస్తమయ మగుచుండిన మఱియొకచో సూర్యోదయ మగుచుండును. మరియొకచో మట్టమధ్యాహ్న మగును.

తా త్ప ర్య ము.

తిరిగితిమి కాని సూర్యకిరణములు రాత్రులందుఁ గానరాని రీతి నామె మాకు గానరాలేదు. ఆమె యొకచో నుండిన మే మొకచో వెదకుచున్నట్లున్నది. ఇట్లు సీతను గనుఁగొనలేక దండకయందు హెచ్చరికగా వెదకు సమయంబున,

క. అజ్ఞానవశంబున ధ,ర్మజ్ఞా! వివృతము బిలమ్ము ♦ మహిగతము మయ
ప్రజ్ఞారచితముఁ జొరఁగా,నాజ్ఞయిడిన మాస మరిగె ♦ నచటనె మాకున్. ౧౩౦

వివృతము=తెఱవఁబడినది. మహిగతము=భూమిలోనుండునది. మయ ప్రజ్ఞారచితము=మయుఁడు తన బుద్ధిబలముచే నిర్మించినది, మయమాయారచిత మని మూలమందున్నది. మాయా శబ్దమునకు జ్ఞానమని యర్థము కలదు. కావున ప్రజ్ఞ యనిభాషాంతరీకరింపఁబడినది. మాయా శబ్దమునకు వాస్తవార్థ మిదియె. "మాయాతు మయునం జ్ఞాన" మ్మని నిఘంటువు.

తా త్ప ర్య ము.

తెలియని తనముచే ధర్మజ్ఞుఁడా! భూమిలో వివృతమై మయుఁడు తన

యద్భుత బుద్ధిబలముచే నిర్మించిన బిలమును బ్రవేశించితిమి. మా నెలగడువు అందే పోయెను.

మాకు సుగ్రీవుఁ డిచ్చిన నెలగడువందే పోయె ననఁగా మొదటినెల యని యర్థము గాదు. నెలకాల మందే పోయెనని యర్థము గ్రహింపవలెను. ఏలన మొదటి నెల గడువు పోయినట్లు ౧౯౧ వ పద్యంబునఁ జెప్పఁబడెను. ఒక నెల కాలము స్వయంప్రభాగుహాయందుఁ బోయినట్టు ౧౨౩౮ పద్యములోఁ జెప్పఁబడెను. మొదటి నెల యిది యగునేని వసంతకాల చిహ్నములు పుష్యమందుఁ గానరావు గదా. సుందరకాండమందలి చంద్రోదయ వర్ణనముఁబట్టి యిది ఫాల్గునాది యని యేర్పడుచున్నది.

క. రాజాజ్ఞాబద్ధుల మీ, యోజం గడు వెల్లఁ జనియె ♦ నూరక చనినన్
మాజీవంబులు దక్కవు, రాజితమతి! దానఁ జేసి ♦ ప్రాయము గనుటల్. ౧౩౧౧

తా త్ప ర్య ము.

బుద్ధి వికాసము గలవాఁడా! మే మందఱము రాజాజ్ఞచేఁ గట్టఁబడినవారము. ఈ విధముగ మాగడువు గడచిపోయెను. కార్యము సాధింపక యిప్పు డూరకపోయితిమా మా ప్రాణములు దక్కవు. కావున నిందే మరణింప నిశ్చయించుకొంటిమి.

క. రామునకును గపినేతకు, సౌమిత్రికిఁ గినుక పుట్టఁ ♦ జలిపితి మేనిన్
మామేనుల నును ఉండదు, నా మాట నిజంబు గృధ్ర♦నాథా! యనినన్ ౧౩౧౨

తా త్ప ర్య ము.

రామచంద్రమూర్తికి సుగ్రీవునకు లక్ష్మణునకు గోపమువచ్చునట్లు చేసితిమేని మా దేహములందు బ్రాణము లుండవు. గృధ్రరాజా! యీమాట నిజము, అని చెప్పగా.

—♦ ౫౮-వ సర్గము. సంపాతి కపులతో జటాయువు తనతమ్ముఁ డని చెప్పుట. ♦—

సీ. ప్రాయోపవిష్టులై ♦ ప్లవగులు దీనులై, కన్నీళ్ళతోఁ దమ♦కథ వచింప
సంపాతియును మహా♦స్వనమున నిట్లను, రావణుచేత ని♦ర్మథితుఁ డైన
యట్లు మీ రనిన జ♦టాయువు నాతమ్ముఁ డతనిపాటును విని ♦ యనదయట్లు
సైఁచెద దగ్ధప♦క్షతను వార్ధకమునఁ, బగ దీర్చుకొనునంత♦బలము లేమి
తే. వృత్రవధ పూర్వమునఁ బ్రవ♦ర్తిల్లుచుండ, నన్న దమ్ముల మాత్మజ♦వాలిశయము
దెలియ నన్యోన్యవిజిగీష♦దివికి నెగసి, చండకరమండలముడాయఁ ♦ జనఁగఁ దివిరి.

ప్రాయోపవిష్టులు = మరణముఁగోరి కూర్చుండినవారు. నిర్మథితుఁడు=చంపబడినవాఁడు, అనద = అసమర్థుఁగు, దగ్ధపక్షతను = ఱెక్కలు కాలిపోవుటచేతను, వార్ధకమునన్ = ముసలితనము చేతను, అన్యోన్యవిజిగీషన్ = ఒకరినొకరు గెలుచు కోరికతో, దివికి = ఆకాశమునకు, చండకర = సూర్యుని, తివిరి = ప్రయత్నించి.

తాత్పర్యము.

మరణము నిమిత్తమై కూర్చుండినవారై వానరులు కన్నీళ్లుగార దుఃఖించుచుండ మచరిత్రముఁ దెలుపఁగా సంపాతియు గట్టిగా నిట్లనియె. రావణునిచేఁ జంపబడిన జటాయువు నాతమ్ముఁడు. అతని మరణము వినియు ఱెక్కలు కాలిపోవుటచేతను ముసలివాఁడ నగుటచేతను పగతీర్చునంత బలములేకుండుటను బదులు చేయలేక యనాథునివలె సహించి యూరకున్నాను. పూర్వము వృత్రునకు నింద్రునకు యుద్ధము జరుగుచున్న సమయమున మేమిరువురము మావేగము తెలియుటకై యొకరినొకరు గెలుచుకోరికతో నాకాశమున కెగసి సూర్యమండలము సమీపింపఁ బోవుటకై ప్రయత్నించి.

క. వలయము లేర్పడఁ దిరుగుచు, జలధరమార్గమున మేము ♦ చనుచో రవియుఁ
దలమీఁదికి రా సరిగా, నలజడిఁబడె దమ్ముఁ డంత ♦ ననురాగమునన్. ౧౩౧౪
వలయములు=చక్రములు, అలజడి=బాధ. రూ.అడజడి.

తాత్పర్యము.

చక్రాకారముగ గాలిఁ దిరుగుచు నాకాశమున మేము పోవునపుడు సూర్యుఁడు నడినెత్తికి సరిగా రాఁగాఁ దమ్ముఁడా యెండవేఁడిమి సహింపలేక బాధపడెను. అప్పుడు ప్రేమచే,

క. ఆతని నా పక్షంబుల, చేతం గప్పితిని గాని ♦ చిత్రాంశుమయూ
ఖాతతరోచులఁ గమరుట, నా తనురుహయుగము వింధ్య♦నగమునఁ బడితిన్. ౧౩౧౫
పక్షంబులచేతన్=ఱెక్కలచే, చిత్రాంశు=సూర్యుని, మయూఖ=కిరణముల యొక్క, ఆతతరోచుల=విస్తారకిరణములచే, కమరుటన్=కాలిపోవుటచే, తనురుహయుగము=రెండుఱెక్కలు.

తాత్పర్యము.

ఆతనికి నెండ తగులకుండునట్లు ఱెక్కలచేఁ గప్పితిని గాని యెండవేఁడిమికి నా ఱెక్కలు కాలిపోవుటచే వింధ్యపర్వతముపైఁ బడితిని.

క. నే నిచ్చట వసియించుట, చే నా యనుజాతువార్త ♦ చెవిఁ బడదయ్యెన్
నా నతనిఁ గాంచి తారా, సూనుం డిట్లను జటాయు♦సోదరుఁ డైనన్. ౧౩౧౬
అనుజాతువార్త=తమ్ముని వృత్తాంతము.

తాత్పర్యము.

నే నిచ్చట నుండుటచే నా తమ్ముని వృత్తాంత మేమియు నేను విన్నవాఁడఁ గాను అని చెప్పఁగా నతనిఁ జూచి యంగదుఁ డిట్లనెను. నీవు జటాయువు నన్నవైనచో

క. నా వ్రాకుచ్చిన దంతయు, నీవును వినియుందు గాదె ♦ యెఱిఁగితి వేనిన్
ధీవర్జితుఁ డగు రావణు, నావాసము దవ్వొ దాపొ ♦ యాడు మటన్నన్. ౧౩౧౭

తా త్ప ర్య ము.

నేను జెప్పిన దంతయు వినియుందువుగదా. నీకుఁ దెలిసియుండిన రాఁగల కీడు తెలియలేని బుద్ధిహీనుఁడగు రావణుఁ డుండుచోటిక్కడికి సమీపమందున్నదా దూరమందున్నదా? చెప్పుము. అనగా,

క. తన కనురూపం బగు గతి, వనచరతతికిఁ ముదంబు ♦ వర్ధిల ననియెన్
వినుఁడీ శౌర్యవిహీనుం,డను గ్రద్దను దగ్ధపక్షుఁ♦డను నే నయ్యుఁ. ౧౨౧౮

తా త్ప ర్య ము

తనకుఁ దగినట్లు వానరులకు సంతోషము వృద్ధియగు రీతి నిట్లనియెను, నేను శౌర్యము లేనివాఁడను, గ్రద్దను, ఱెక్కలు గాలినవాఁడను, అయినను,

—♦ సంపాతి కపులకు రావణు నునికిఁ జెప్పుట. ♦—

సీ. రామకార్యం బిది ♦ ప్రథమకర్తవ్యమా, కార్యమైనను వార్ధ♦కమునఁ జేసి
బలము క్షీణించెను ♦ బ్రాణముల్ శిథిలముల్, గాన మిక్కిలి చేయ ♦ లేను గాని
మాటమాత్రము తోడు♦పాటు గావించెద, నెఱుఁగుదు వితలాది♦యెల్లలోక
ములును ద్రివిక్రమ♦మూర్తియై విష్ణుండు, జగములఁ గొలచిన♦చంద మెల్ల
తే. నిర్జరాళికి రాక్షస♦నిచయములకు,నైన సంగ్రామవిధముల ♦ నమృతమునకు
గాఁగ నంభోధిఁ ద్రచ్చిన క్రమము నేను,జక్క నెఱుఁగుదు కాంతార♦చారులార!

ప్రథమకర్తవ్యము = మొట్టమొదటఁ చేయదగినపని, వార్ధకమునఁజేసి=ముసలితనముచేత, వితలాద = వితల మొదలుగాఁగల, అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాళలోకములు, కాంతారచారులార = వానరులార.

తా త్ప ర్య ము.

వానరులారా! రామచంద్రమూర్తికార్యము మొట్టమొదటఁ జేయవలసిన పని. ఐనను ముసలివాఁడనగుటచేత బలముడిగినది. ప్రాణములుకూడ శిథిలములై యుందుమా పోదుమా యను స్థితిలో నున్నవి. కావున నేను విశేష సాహాయ్యము చేయలేను. మాట సాహాయ్యము మాత్రము చేసెదను. నాకు రావణాసురుని విషయమే కాదు. ఇంకను బూర్వవృత్తాంతములు కూడఁ దెలియును. వితలాదిలోకము లెఱుఁగుదును. విష్ణువు త్రివిక్రమావతారమునఁ బ్రపంచము గొలచిన విధము అప్పుడు దేవతలకు రాక్షసులకు జరగిన యుద్ధము, అమృతము నిమిత్తము సముద్రము తఱచిన విధము నే నెఱుఁగుదును.

ఉ. కంటిని రావణాసురుఁడు ♦ కైకొని పోవఁగ నింట నొక్కవా
ల్గంటిని బ్రాయపుంజెలిని ♦ గ్రమసమస్తవిభూషణాంచితన్
గంటను బాష్పముల్ దొరల ♦ గాత్రవిధూనన మాచరించుచున్
గెంటుచు మేనిసొమ్ములను ♦ గీడ్పడి యున్న త్రిలోకసుందరిన్. ౧౩౨౦

వాల్గంటిని = స్త్రీని, వాలు+కన్ను, బహువ్రీహి వాల్గంటి = నిడుపాటి కన్నులు గలది. ప్రాయంపుజెలిని = వయస్సుస్త్రీని, క్రమ = మనోహరములైన, సమస్తవిభూషణ = అన్నిసొమ్ములచే, అంచితన్ = ప్రకాశించు దానిని, ఋశ్యమూకమందు వేయఁగా మిగిలినవి. గాత్రవిధూననము = దేహము కదలించుట

తా త్ప ర్య ము .

రావణుఁడు తీసికొని పోవుచున్న నిడుపాటి కన్నులు గలదియు యౌవనవతియు సమస్త భూషణములచేఁ బ్రకాశించునదియుఁ గన్నీరు గార్చుచు దేహము కదలించుచు దేహమునందలి సొమ్ములను నొక్కొక్కదానినే పాఱవేయుచు బాధపడుచున్న త్రిలోకసుందరిని నొకస్త్రీని జూచితిని.

క. ధరణిధరాగ్రంబున భాస్కరుకాంతియొ కాక నీల♦జలదస్థతటి
ద్వరమో యన నా రమణీవరకౌశేయంబు దైత్య♦వరుపై వఱలెన్. ౧౩౨౦

ధరణిధరాగ్రంబునన్ = పర్వతము కొనయందు, నీలజలదస్థ = నల్లని మేఘమందున్న, తటిత్+వరమో = చక్కని మెఱుపో, కౌశేయంబు = పట్టుచీర.

తా త్ప ర్య ము .

పర్వతము కొనయందలి సూర్యకాంతియో నల్లనిమేఘ మందలి మెఱపో యనునట్లు లామె పట్టుచీర రావణాసురు మీఁదఁబడుచుండెను.

క. రామా యని లక్ష్మణ యని, యా మానిని యేడ్చెఁ గాన ♦ నామెయె సీతా
భామ యని తలఁతుఁ జెప్పెద, నా మనుజాశనునినిలయ♦ మాలింపరయా. ౧౩౨౨

ఆమె రామాయని లక్ష్మణా యని యేడ్చుచుండెను. గావున నామెయే సీతాదేవి యని తలంతును, ఆ రాక్షసుఁడుండుచోటు చెప్పెద వినుఁడు.

క. ఔరసుఁడు విశ్రవునకున్, గౌరీవల్లభుని మిత్రు♦నకు సోదరుఁడున్
బేరను రావణుఁడు మదం, బారఁగ వసియించు లంక ♦ యను నగరమునన్.౧౩౨౩

తా త్ప ర్య ము .

విశ్రవుని యౌరసపుత్త్రుఁడు, కుబేరునకుఁ దమ్ముఁడు, పేరు రావణుఁడు, లంకానగరమున నుండువాఁడు.

అరణ్యకాండమున ౧౧౯౭ పద్యము చూచునది. ఈ పద్యమునందలి తొలి సగము చెప్పి జటాయువు మరణించెను. ఆయన తక్కిన సగము చెప్పఁజాలినవాఁడు కాఁడయ్యె. ఆయన బ్రతికియుండినఁ జెప్పియుండుమాట లిందుఁ జెప్పఁబడెను.

వాల్మీకి శైలి, కవితాచమత్కృతి నిరుపమానము.

క. జలధిని నూఱామడలోఁ, గల దొకద్వీపంబు విశ్వ♦కర్మకృతం బై
చెలువం బయి యదియే చూఁడి, యిల లంక యనంగ రాక్ష♦సేశ్వరుపురియున్.

తా త్ప ర్య ము.

సముద్రమున నిక్కడికి నూఱామడలో విశ్వకర్మ రచించిన యొక్క ద్వీపంబు గలదు, అదియే రావణుఁడుండు పురము.

తే. పసిఁడివాకిండ్లు బంగారు♦పంచటరుగు, లమరి రవివర్ణ వప్రస♦మావృత మయి
తనరుఁ దత్పురి రావణాం♦తఃపురమున, క్షితిజ వసరుచు నుండు ర♦క్కసలు గావ.

రవివర్ణ = సూర్యకాంతిగల, వప్ర = ప్రాకారముచే, సమావృతమయి=చుట్టబడినదయి, రక్కసలు = రాక్షసస్త్రీలు

తా త్ప ర్య ము.

బంగారువాకిండ్లు బంగారు పంచటరుఁగులు గలిగి సూర్యకాంతిగల ప్రాకారముచేఁజుట్టఁబడి యున్నది. ఆ పురమున రావణుని యంతఃపురమున రాక్షసస్త్రీలు గావలి యుండఁగా సీత దుఃఖించుచున్నది.

తే. జలధి తనకుఁ దగ్గరగా ♦ సాగరమున, నొక్కశతయోజనము పోవ ♦ నుండు లంక
దక్షిణంబుగ నటు చని ♦ రాక్షసేంద్రుఁ, జూచి ఫలసిద్ధిఁ గని రండు ♦ శూరులార!

తా త్ప ర్య ము.

సముద్రమునందు మీరు నూఱామడ దక్షిణముగఁబోయితిరా యచ్చట సముద్రమే యగడ్తగాఁగల లంకయుండును. అచ్చటికిఁబోయి రావణునిఁజూచి ఫలసిద్ధి గని రండు.

క. త్వర సేయుఁడు మీరలు మీ,గురుతరవిక్రమము జూపఁ ♦ గుజచరులారా!
పరికింప జ్ఞానదృష్టిన్ మరలెద రీర్లెల్ల ఫలిత♦మహితార్థకులై.  ౧౩-౨౮

ఫలిత = ఫలించిన, మహితార్థకులై = గొప్పప్రయోజనముగలవారై.

తా త్ప ర్య ము.

మీ విస్తారపరాక్రమముఁ జూపఁ ద్వరసేయుఁడు ఆలస్యము చేయవలదు. నా జ్ఞానదృష్టిని జూచితిని, మీరు కార్యము ఫలింపజేసికొని మరలి రాఁగలరు.

సీ. ధాన్యంబుఁ దిను ఖగ♦తతులు కుళింగాది, పక్షుల కెల్లను ♦ బ్రథమగతియు
అవనీరుహాభవంబు ♦ లగుఫలాములు దిను,వాయసంబులకు ♦ ద్వితీయగతియుఁ
గ్రౌంచకురరభాస♦గతి మూఁడవది యగు, నాల్గవగతియు శ్యేనంబులకును
గ్రద్దల కైదవ♦గతి గల్గు బలవీర్య, యౌవనశాలి చ♦క్రాంగములకు

తే. నాఱవది గతి వైనతే♦యముల కవుల,వైనతేయుని సంతతి ♦ వార మేము
ఇచట నుండియ సీత లం♦కేశుఁ గందుఁ, గలదు సౌవర్ణదివ్యాక్షి♦బలము మాకు.

అవనీరుహాభవంబులు=చెట్లయందుఁ బుట్టినవి, కురర=లకుముకులు, భాస= నీటికాకులు, శ్యేనంబులు=డేగలు, వైనతేయములకున్=వినతవంశమునఁ బుట్టినవానికి వైనతేయుని=అనూరుని, సౌవర్ణ దివ్యాక్షిబలము=దూరము చూడఁగల దివ్యములైన దృష్టిబలము.

తాత్పర్యము.

మేము దివ్యవంశమునఁబుట్టినవార మగుటచే మాకు జ్ఞానదృష్టిఁ గలదు. ఎట్లన ఆకాశమున నేడు స్కంధములు గలవు. అందు మొదటిది భూమికి సమీపించి యుండునది. అందుఁ గుళింగములు లోనైనవి సంచరించుచు నేలఁబడిన ధాన్యముఁదిని జీవించును. రెండవస్కంధమునఁ గాకులులోనైనవి సంచరించును. ఇవి చెట్లయందుఁ బండిన ఫలములు దినును. పైస్కంధమునఁ జేరినవి క్రిందిస్కంధమునకు రాఁగలవు గాని క్రింది స్కంధమునకుఁ జేరినవి పైస్కంధమునకుఁ బోఁజాలవు. క్రౌంచములు లకుముకులు నీటికాకులు మూఁడవస్కంధమునకు, డేగలు నాలుగవ స్కంధమునకు, గ్రద్ద లయిదవస్కంధమునకు, నాఱవస్కంధమునకు బలవీర్యయౌవనములు గల హంసలు చేరినవి. ఏడవగతి వైనతేయమునకుఁగలదు. మే మావైనతేయుని సంతతి వారము, ఇచటనుండియే సీతను రావణాసురుని జూతును. అటువంటి దూరపుఁ జూపుచూచు కంటిబలము మాకుఁగలదు.

క. నైసర్గిక బలమునఁ దిను,గ్రాసము వీర్యంబుచేతఁ ♦ గనుఁగొందు మనా
యాసంబుగ యోజనశత, మో సాధుగుణాఢ్యులార ♦ యుత్తములారా! ౧౩౯

నైసర్గికబలమునన్ = స్వభావమున వచ్చిన బలముచేతను, గ్రాసము వీర్యంబు చేతన్ = ఆహారబలముచేతను.

తాత్పర్యము.

ఇట్టిశక్తి మాకుఁ గలుగుటకు రెండుకారణములు, స్వభావసిద్ధమైనది యొకటి రెండవది మేము తిను నాహారబలము. కావున నూఱామడ దూర మనాయాసంబుగఁ జూడఁ గలము.

క. దూరమున నుండుదానిని, జేరం జని తినుట మాకు ♦ సిద్ధం బగ్యోన్
ధారిణిఁ దమపాదంబుల,చేరువఁ గలవానిఁ గోళ్ళు ♦ చీరి భుజించున్. ౧౩౩౦

తాత్పర్యము.

మాకు స్వభావమున నిట్టి దృష్టి కలుగఁగారణ మేమన మేము దూరమున నాహార మున్నచోటికిఁ బోయి తినవలసియున్నది, మాకుఁ గావలసిన యాహారము సమీపమున దొరకదు. ఆ కారణముచే మాకు భగవంతుఁడు దూరపు దృష్టి నిచ్చెను. కోళ్ళు మొదలయినవి తమకాళ్ళయొద్దనుండు దానినే తినును. కావున వానికి దూరదృష్టితోఁ బనిలేదు.

క. గర్హిత మగు కార్యంబును, బర్హిర్ముఖవైరి చేసె ♦ బలిముఖులారా!
యర్హంబుగ మద్భ్రాతృని,బర్హణమున కయ్యెదుర్ భ♦వత్కృతి బ్రతిగన్. ౧౩౩౧

గర్హితము = నిందింపఁబడినది- బర్హిర్ముఖవైరి = దేవశత్రువు, రావణుఁడు. మత్ + భ్రాతృ + నిబర్హణమునకు = నాతమ్మునిఁ చంపిన దానికి- భవత్కృతి =

మీరుచేయు కార్యము- ప్రతి = బదులు- సదా సర్వాదాదులకు వలె దీనికిఁ బ్రత్యేక ప్రయోగము గలదు.

తా త్ప ర్య ము .

రాక్షసుఁడు లోకము నిందించు కార్యమును జేసెను. వానరులారా! దానికిఁ దగినట్టు మీరుచేయుకార్యము నాతమ్ముని౯ జంపినదానికి బదులగునుగాక.

క. రోయుఁడు జలనిధి దాఁటు న,పాయము వనధిం దరించి ♦ యవనీసుత మీ
రారయెడఁ గని ధన్యుల రై, జే యని కిష్కింధ పురలఁ ♦ జేరుఁడు సరగ౯. ౧33౨

జే యనునది జయశబ్దభవము- దీనికి రూపాంతరము జా యనియుఁ గలదు- "జా పరమేశ్వరా యనుచుఁ జక్రము ద్రిమ్మంగిన నోహటించితి౯" భీ.మే-పు.

తా త్ప ర్య ము .

సముద్రము దాఁటు నుపాయము వెదకుఁడు. సముద్రము దాఁటి లంకయందు సీతను జూచి ధన్యులరై జే యని కిష్కింధకు మరలిపొండు.

చ. వననిధి నేను నీళ్ళు విడు♦వ౯ వలయు౯ మృతిఁ గూరినట్టి నా
యనుజున కీరు తోయనిధి♦యంతికసీమను నన్నుఁ జేర్పుఁడీ
యనఁ గపు లట్లు చేసి పత♦గాధిపుఁ గ్రమ్మఱఁ దెచ్చి తొల్లిటి
తిని నట నిల్పి రాఘవుని♦ దేవి యుదంత మెఱుంగవచ్చుట౯. ౧33౩

తోయనిధి = సముద్రముయొక్క- అంతికసీమను = సమీప ప్రదేశమందు- పతగాధిపు౯ = పక్షిరాజును- ఉదంతము = వృత్తాంతము.

తా త్ప ర్య ము .

చచ్చిన నా తమ్మునికి సముద్రజలముచేఁ దర్పణము చేయవలయును కావున మీరు నన్ను సముద్రము నీళ్ళయొద్దకుఁ దీసికొనిపొండు, అనిన వారట్లు చేసి మరల నెప్పటిచోట నిల్పి సీతాదేవి వార్త తెలియనచ్చుటచే.

సంపాతి చరిత్రమువలన మనము నేర్చుకొన వలసిన విషయము.

౧. భక్తియు నధికారము లేక నిరాలంబోపాసనము చేయువారు సంపాతి వలెఁ జెడుదురు.

౨. మనము నిష్కల్మషముగ నిర్వంచన బుద్ధితోఁ బ్రతిష్ఠకుఁ దంభార్థము గాక స్వామికార్యము చేయఁ బూనితిమేని మనకుఁ బ్రతికూలురుకూడ ననుకూలురే యగుదురు. వానరులఁ జంపఁదలఁచిన సంపాతియే సాహాయ్యము చేసెఁగదా.

3. కేవల పౌరుషము నాధారము చేసికొని స్వతంత్రులై యహంకర్త్రుత్వాభిమాన ముండువఱకుఁ బ్రత్యక్షముగఁగాని పరోక్షముగఁగాని భగవత్సాహాయ్యము రాదు. స్వామికై ప్రాణత్యాగమైనఁ జేయ నిశ్చయించుకొని నపుడే భగవత్సాహాయ్యము గలుగును. వానరులు స్వప్రయత్నములు మాని స్వామికార్యము చేయ

లేని వారము జీవింప నేల యని ప్రాయోపవేశమునకుఁ బూని నపుడుగదా సంపాతి సాహాయ్యము లభించెను.

౪. సంపాతి వానరులకుఁ జెప్పినట్లు గురువు శిష్యుల కందఱకు సమానముగ నుపదేశించును. ఆ లక్ష్యమును సాధింపఁగలవాఁడే హనుమంతునివలె భగవదనుగ్రహ యోగ్యుఁడగును.

౫. లంకలో రావణు నంతఃపురమున సీతయున్నది. నాకుఁ గానవచ్చు చున్నది. మీరుపోయి చూడుఁడని సంపాతిచెప్పినట్టు లాత్మవిషయ ముపదేశించు గురువు ఆత్మసాక్షాత్కారము గలవాఁడై యుండవలెను, స్వానుష్ఠానములేక పరులకుఁ బుస్తకములలో నుండు మాటలను వినికిడిమాటలను, జెప్పువాఁడు గురువుగా నుండఁ దగఁడు.

—♦ ౫౯-వ సర్గము. జాంబవంతునితో సంపాతి సీతావృత్తాంతముఁ జెప్పుట. ♦—

క. సంపాతివాక్సుధారస,సంపాతంబునను మిగుల ♦ సకలకపుల్ హ
 ర్షింపఁగ భల్లుకనాథుం, డిం పెసఁగఁగ లేచి యనియె ♦ గృధ్రేశునకున్. ౧౩౩౪
 (ఇది మొదలు ౧౩౭౫ వఱకుఁగల పద్యముల మూలశ్లోకములు (౫ సర్గములు) ప్రక్షిప్తము లని పూర్వవ్యాఖ్యాతలు వ్రాసియు వ్యాఖ్యానించియున్నారు. ఇవియన్ని గ్రంథములందునులేవు, కొన్నిటమాత్రమేగలవు, ఇవిలేకున్నఁ గథకు లోపము లేదు. ఇందుఁబూర్వోక్తములైన వానికి విరుద్ధములు స్ఫురించుచున్నవి. అట్లుండియు వ్యాఖ్యానించెద మని సంస్కృతవ్యాఖ్యాతలు వ్రాసియుండుటచే నీ గ్రంథభాగమును గ్రంథకర్త తెనిఁగించెను. ఈ పద్యములందలి విషయములకుఁ బ్రామాణ్యమీయ వలసిన పనిలేదు.)

వాక్సుధారస + సంపాతము=మాటలనెడి యమృతరసము యొక్క వర్షముచే.

తాత్పర్యము.

సంపాతి మాటలనెడి యమృతవర్షముచే వానరులందఱు సంతోషింపఁగా జాంబవంతుఁడు లేచి సంపాతితో నిట్లనెను.

ఉ. ఎక్కడ నుండు సీత? సతి ♦ నెవ్వరు చూచిరి? హర్త రాక్షసుం
 డెక్కడివాఁడు? సర్వము ఖ♦గేశ్వర! తెల్పి వలీముఖాళికిన్
 దిక్కయి ప్రోవుమీ; రఘుప♦తి ప్రకటస్వరుతుల్యబాణముల్
 ముక్కడి యెవ్వఁ డొక్క మది♦లోఁ దలపోయఁ డొకింత యేనియున్. ౧౩౩౫

తాత్పర్యము.

సీతయెక్కడ నున్నది. ఎవరు చూచినారు. ఆమెను హరించిన రాక్షసుఁ డెక్కడివాఁడు, పక్షిరాజా! సర్వముఁ దెలిపి వానరులకు రక్షకుఁడవయి ప్రోవుము. వజ్రముతో సమానములయిన రామచంద్రమూర్తి బాణముల నే మూఢుఁడు లక్ష్యము సేయఁడయ్యెను?

ఇందలి ప్రశ్నలకన్నిటికి నిదివఱకే సంపాతి ప్రత్యుత్తర మిచ్చియున్నాఁడు. మరల నడుగుట యసంగతము, కావుననే యివి ప్రక్షిప్తములు. ప్రక్షిప్తము లనఁగా మొదట గ్రంథకర్త వ్రాసినదిగాక యిటీవల వారు వ్రాసి యతికించినది.

క. అనవుడు సీతాహృతి నే, వినినవిధము వక్త తెఱఁగు ♦ వికచాంబుజలో చన యుండు తావు మరలన్, వినిచెద విన రయ్య ప్లవగ♦వీరవరేణ్యుల్. ౧౩౩౬

సీతాహృతి = సీతాహరణము, వక్త = చెప్పినవాఁడు, ఇదివఱకు రావణాసురుఁడు సీతనెత్తికొని పోవుచుండఁ దాను గన్నారఁ జూచినట్లుచెప్పెను. ఇచ్చటఁదాను విన్నట్లు చెప్పబడెను. ఇదిపూర్వోత్తర విరుద్ధము కావునఁ బ్రక్షిప్తము-

తా త్ప ర్య ము.

అని యడుగఁగా సీతాహరణము గుఱించి నేవిన్నదియుఁ జెప్పినవానివిధము సీతయుండుతావు మరల వినిపించెద, వానరులారా! వినుఁడు.

క. ఱెక్కలు విఱుగుట దీనత, నిక్కొండన యుండువాఁడ ♦ నిట్టిఁడ నాపై నెక్కొనుభక్తి సుపార్శ్వుం, డక్కఱగొని భుక్తిఁ గూర్చు ♦ నాత్మజుఁ డగుటన్.

తా త్ప ర్య ము.

ఱెక్కలు విఱిగినవాఁడ నగుటచే నేనీకొండయందే యుందును. ఇట్టి నాపై పితృభక్తిచే నాకొడుకు సుపార్శ్వుఁడు ఆహారము తెచ్చి యిచ్చుచుండును-

క. అతికామము గంధర్వుల, కతివేలం బైన కోప ♦ మహిచయములకున్ అతిభయము మృగంబులకును, నతిమాత్రపు క్షుత్తు మాకు ♦ నగచరులారా!

తా త్ప ర్య ము.

గంధర్వులందుఁ గామము మెండు. పాములకుఁ గోపము మెండు. మృగములకు భయము మెండు. మా కాకలి మెండు.

సీ. అటులొక నొక్కనాఁ ♦ డాహారకాంక్షినై, యాకట నే నెంతో ♦ యటమటింప నరుగఁ డేగిన వెన్క ♦ నామిషహీనుఁ డై, నాపుత్రకుఁడు నాదు♦దాపుఁ జేర వృద్ధులు కోపస♦మృద్ధులు గావున, బదరితి వానిఁ బి♦పాసకతన నాతండు నన్ను స♦మాధానపఱిచి మ, హేంద్రాద్రి నరికట్టి ♦ మేను వనధి

తే. సత్త్వచయమును గుంపులై ♦ చనెడి త్రోవ నాఁగి తల వ్రేలగా వైచి ♦ తూఁగుచుండి కంటి భిన్నాంజనాద్రిసి♦కాశుఁ డొకఁడు కొంచుఁ జన సూర్యసమతేజఁ ♦ గోమిరె నొకతె. ౧౩౩౯

అటమటింప = బాధపడుచుండఁగా, ఆమిషహీనుఁడై = మాంసములేనివాఁడై- పదరితిని = తిట్టితిని = నిష్ఠురము లాడితిని- పిపాస = దప్పి, భిన్నాంజనాద్రిసికాశుఁడు = భిన్నమైన కాటుక కొండతో సమానుఁడు,కొమిరె=స్త్రీ.

తాత్పర్యము.

ఆకారణముచే నొకనాఁడాఁకలిగొని యాహారమునకై యెదురు చూచుచుండఁగా సూర్యాస్తమానమైన పిమ్మట నాహారము లేకయే నాకొడుకు నా యొద్దకు రాఁగా ముసలివారికిఁ గోపము మెండు కావున దప్పిగొని వాని నిందించితిని. అతండు నన్ను శాంతునిఁ జేసి యిట్లనియె. నేను మహేంద్ర పర్వతమునందు సముద్ర జంతువులు గుంపులై పోవు త్రోవ నడ్డగించి తల వ్రేలవైచి తూఁగుచున్నట్లుండితిని. అప్పుడు కాటుక కొండవంటి దేహము గలవాఁడు సూర్యునితో సమానమగు తేజస్సు గలదానిని స్త్రీ నొకర్తు తీసికొని పోవుచుండెను.

క. ఓరెంబు దొరకె నని మతి, నారఁగఁ గృతనిశ్చయుండ ♦ నైతిని వాఁడుఁ
గోరె ననుఁ దెరు వొసంగఁగ, సారమతీ! సవినయముగ ♦ సరిపొమ్మంటిన్. ౧౩౪౦

ఓరెంబు = ఆహారశబ్దభవము.

తాత్పర్యము.

ఆహారము దొరకెఁ గదా యని నిశ్చయించుకొని యుంటిని. వాఁడు నన్ను దోవ యిమ్మని వినయవంతుఁడై ప్రార్థింపఁగా సరి పొమ్మని చెప్పితిని. రావణుఁడాకాశమార్గమునఁ బోయిన వాఁడు, సంపాతికొడుకు జలజంతువులకై సముద్రపు టొడ్డునఁ గాచియుండినవాఁడు, వానికి వీఁడెట్లు లక్ష్యమయ్యెనో?

క. హేయగుణుఁడైనఁ దన్నుం, దాయం జని వేఁడఁ జంపఁ ♦ దలకొనఁ డనఁగా
నా యట్టి యాతఁడిస్సీ, చేయునె యటువంటిపనిని ♦ జిరజీవివరా! ౧౩౪౧

తాత్పర్యము.

గృధ్రరాజా! నీచగుణములు గలవాఁడైనను తన్నొకఁడు వేఁడుకొనెనేని జంపఁడుగదా, ఇఁక నాయట్టివాఁడట్టిపని జేయునా.

క. తన తేజంబున గగనమె, కొనిపోయెడి నేమొ యనఁగ ♦ గొబ్బున వాఁడుం
జన ఖచరులు ననుఁ గనుఁగొని, యని రన్నా! బ్రతికితి వహో! భాగ్యమునన్.

తాత్పర్యము.

తన తేజస్సుచే నాకాశమునే తీసికొని పోవుచున్నాఁడా యేమి యన్నట్లు వాఁడు పోయెను. అప్పు డాకాశ సంచారులు నన్నుఁ జూచి యన్నా! నీ వదృష్టముచే బ్రదికితి వనిరి.

క. ఎట్టెట్టో చనె నతఁ డిప్పట్టున సతితోడ నీకు ♦ భద్రం బిఁక నం
చిట్టు వచింపఁగ నాతని,పుట్టువుఁ గథ నడుగ సిద్ధపుంగం బనియెన్. ౧౩౪౩

తాత్పర్యము.

వాఁ డిప్పు డెట్లో యూరకపోయెను. నీవు క్షేమపడితి వనిరి. వారిట్లు చెప్పఁగా వాఁడెవ్వఁడని వాని పుట్టు వృత్తాంత మడుగగాఁ సిద్ధుల సమూహ మిట్లనెను.

ఉ. ఆతఁడు రావణాఖ్యుఁ, డసు♦రావళి కెల్ల విభుండు, జానకిన్
సీతను రామభార్య నవి♦నీతి బలాత్కృతిఁ గొంచుఁ బాఱెడిన్
భీతిని, రామలక్ష్మణులఁ ♦ బేర్కొని నేడ్చుచు భ్రష్టభూష యై
జాతమహావ్యథం బడెడి♦చారువిలోచన సీత యాఁ జుమీ. ౧౩౮౪

తాత్పర్యము.

వాఁడు రావణుఁడను రాక్షసనాయకుఁడు, దుర్నీతిపరుఁడై రాముని భార్యను సీతను బలవంతముగ హరించుకొని భయముచేఁ బరువెత్తుచున్నాఁడు. రామా! లక్ష్మణా! యని యఱచుచు నేడ్చుచు సొమ్ములు పాఱవేయుచు బాధపడెడి శ్రీ సీతాదేవి సుమా.

క. అని యని రనుచును గాలము,చని వచ్చిన నాసుతుండు ♦ సకలము నొడివెన్
వినియును నిది యసురునిపైఁ, జని శక్తిని జూప మనసు♦చాలద నాకున్. ౧౩౮౫

తాత్పర్యము.

ఇట్లు వారు చెప్పి రని నాకొడుకు చెప్పెను, ఇది వినికూడ రాక్షసునిపైఁ బోవుటకు మనస్సు చాలినదికాదు.

క. ఱెక్కలు విఱిగిన పక్షిని, నెక్కరణిని దేని నైన ♦ నెటు సేయుదు? నే
వాక్కును బుద్ధియు గుణమును, దక్కుట మీశక్తి కగువి♦ధంబు వచింతున్ ౧౩౮౬

తాత్పర్యము.

నేనా ఱెక్కలు విఱిగిన పక్షిని, ఏకార్యమైన నెట్లుచేయుదును, అయినను వాక్కు బుద్ధి గుణము చెడకయున్నవి. కావున మీ శక్తికిఁ దగినవిధము చెప్పెద వినుఁడు.

సీ. ఎదిరామకార్యంబొ ♦ యది నాదుకార్యంబు, సత్యమియ్యది, లేదు ♦ సందియంబు
మీరలు బలియురు ♦ మేధావులును గపి,పతిచేతఁ బంపంగఁ ♦ బడినవారు
సమరంబునను దురా♦సదులరు సురలకేన్, రామలక్ష్మణుల నా♦రాచవితతి
ముజ్జగంబులఁ బట్టి ♦ నజ్జునజ్జుగ జేయ, నైన రక్షింపఁగ ♦ నైనఁ జాలు
తే. నలవు తేజంబు గలఁడు ద♦శాస్యుఁడైన, గడుసమర్థులు మీకు దు♦ష్కరములేదు
జాగిఁ కేటికి బుద్ధిని♦శ్చయము తగును, బనుల వెనుదీయ రెపుడు మీ♦వంటి ఘనులు.

మేధావులు = బుద్ధిబలముగలవారు, దురాసదులరు = సాధింపరానివారు, అలవు = బలము.

తాత్పర్యము.

వానరులారా! యేది రామకార్యమో యది నా సొంతకార్యమే. ఇది సత్యమే, ఇందు సందేహములేదు, మీరు బలవంతులు, బుద్ధిమంతులు, అందు సుగ్రీవునిచేఁ బంపఁబడినవారు, దేవతలకైన మీరు రసాధ్యులు, రామలక్ష్మణుల బాణములు మూఁడు లోకములను బొడిపొడిగఁజేయుటకైనను రక్షించుటకైనను సమర్థ

ములు. రావణుఁడు బలపరాక్రమములు గలవాఁడు-మీరు సమర్థులు మీకు నసాధ్యము లేదు. కావున నేల యాలస్యము చేసెదరు- మీవంటివారు పనివడినప్పుడు వెనుకంజ పెట్టరు.

-♦ ౬౦-వ సర్గము. సంపాతి నిశాకరఋషితోఁ దనకు నైన సంభాషణంబుఁ జెప్పుట.♦-

క. అని వానరసంఘంబులు, దను జుట్టఁగ నున్న వాలి♦తనయుం గనుచున్
జనితప్రత్యయమతియై, యనియెను సంపాతి మఱియు♦హర్షం బెసఁగన్. ౧౩౮౮

జనిత ప్రత్యయమతియై = నిశాకరుఁ డను ఋషిమాటలయందు నమ్మకము గలవాఁడై -

తా త్ప ర్య ము .

ఇట్లు చెప్పి వానరులగుంపులు తన్నుఁ జుట్టుకొనియున్న యంగదునితో నిశాకరుఁడు తనతోఁజెప్పిన ప్రకారము వానరులను జూచుట తనకు ఱెక్కలు మొలచుట యను కారణములచే నతని మాటలయందు నమ్మకము గలవాఁడై సంతోషముతో సంపాతి యిట్లనియెను.

సీ. సద్దుచేయక మీరు ♦ శాఖామృగములార!, వినుఁడు సీతోదంత ♦ మనుచుఁ బలికి
యంగదుతోడ ని♦ట్లనియె నీ వింధ్యంబు, శిఖరంబునను రవి♦సెగకు దగ్ధ
పక్షుండనై మూర్ఛఁ ♦ బడియుండి యిరుమూఁడు, దినములా పిమ్మటఁ ♦ దెల్విరాఁగ
నలుదిక్కులను జూడఁ ♦ దెలియ రా దొక్కటి, చక్కఁగ మఱిచూడ♦ సాగరంబు
తే. శైలతటినీసరస్సులు ♦ జలధివేల, గోచరింపఁగఁ గందర♦కూటయుతము
నఖిలపక్షిగణాకీర్ణ ♦ మైన దక్షి,ణాబ్ధితీరస్థ మిది వింధ్య ♦ మనుచుఁ దోఁచె. ౧౩౮౯

తా త్ప ర్య ము .

వానరులారా! సీతావృత్తాంతము చెప్పెదను- మీ కిచకిచలు నుట్టుముట్టులు మాని చప్పుడు చేయక వినుండు, అనియంగదుతో నిట్లనెను. సూర్యుని వేఁడిమికి ఱెక్కలు గాలి యీ వింధ్యశిఖరంబునందు మూర్ఛపోయి యాఱుదినములు పడియుంటిని- ఆవలఁ దెల్వివచ్చి నాలుగు ప్రక్కలఁ జూచినను నేదియుఁ దెలియరాలేదు- మరలఁ జక్కఁగాఁ జూడఁగా సముద్రము, కొండలు, నదులు, సరస్సులు సముద్రతీరము కానరాఁగా నిది గుహలతోను శిఖరములతోను గూడినదియు సమస్తపక్షిసంఘములచే నిండినదియునై దక్షిణసముద్రతీరమున నుండు వింధ్య మని తోఁచెను.

క. మునుపిచట నిశాకరుఁ డను, మునియొక్కఁడు తపము ఘోర♦ముగఁ గావించెన్
జనె నెనిమిదివే లేఁడులు, జననుతుఁ డాతండు చేరి ♦ స్వర్ధామంబున్. ౧౩౯౦

స్వర్ధామము = స్వర్గము.

తా త్ప ర్య ము.

పూర్వమం దిచట నిశాకరుఁడను ముని ఘోరతపస్సు గావించుచుండెను. ఆయన స్వర్గముఁ జేరి యెనుఁబదివేల యేఁడు లాయెను.

సీ. ఆ ఋషీశ్వరుఁడు నా♦యనుజుని నన్నును, గడుమచ్చికను జేసి ♦ గారవించు
కతన నాతనిఁ జూడఁ ♦ గాంక్ష దలిర్పఁగ, నెగ్గుడు దిగ్గుడై ♦ యెంతయేని
వాఁడియైన ల్గల♦పరుసపుదర్భల, యవనికి విషమవిం♦ధ్యాద్రినుండి
దిగి గాసిమై నెక్కి ♦ బుగులువాసనగల్గి, పూచని కాచని♦భూరుహంబు
తే. లేక భాసిల్లు నమ్మౌని♦లోకచందు్ర, నాశ్రమాంతికమున నొక్క♦యగము నీడ
విశ్రమించితి మునిరాక ♦ వేచి యతఁడు, వచ్చె నీరాడి యుత్తర♦వదనుఁడగుచు.

కతనన్ = కారణముచే, అగము = చెట్టు, నీరాడి = స్నానముచేసి.

తా త్ప ర్య ము.

ఆ ఋషీశ్వరుఁడు నన్ను నా తమ్ముని మిగుల మచ్చికతో నాదరించుచుండెను. ఆ కారణముచే నాయనను జూడఁగోరి మిట్టపల్లమై మిక్కిలి పదునైన కఱకు దర్భలు గల భూమికి మిట్టయగు వింధ్యాద్రినుండి దిగి ప్రయాసపడి యెక్కి వాసనగలిగి పూచని కాచని చెట్టులేక యుండు నమ్ముని యాశ్రమసమీపమున నొక్కచెట్టు నీడ ముని రాకకై యెదురు చూచుచు విశ్రమించితిని. ఆయన సముద్రమందు స్నానము చేసి యుత్తరముఖముగా నాశ్రమమునకు వచ్చెను.

ఉ. ధాతను బ్రాణికోటివలెఁ ♦ దాపసవర్యుని వ్యాఘ్రసింహసం
వ్రాతసరీసృపాహిసృమ♦రంబులు నర్మిలి వెంట నంటుచున్
క్ష్మాతలవల్లభుండు నిజ♦సౌధముఁ జేర నమాత్యపంక్తియ
ట్లాతఁడు లోని కేగ నవి ♦ యన్నియు స్వేచ్ఛఁ జనె న్ముదంబునన్. ౧౩౫౨

ధాతను = బ్రహ్మను, వ్యాఘ్ర = పులులు, సింహసంవ్రాత = సింహ సమూహములు, సరీసృప = ప్రాకులాడు జంతువులు, అహి=పాములు, సృమరంబులు = పెద్ద చమర మృగములు, అర్మిలిన్ = ప్రేమతో, క్ష్మాతలవల్లభుండు = రాజు.

తా త్ప ర్య ము.

బ్రహ్మదేవుని వెంటఁబోవు జీవజంతువులవలెఁ దాపసశ్రేష్ఠుని వెంటఁ బులులు, సింహములు, సరీసృపములు, పాములు, చమర మృగములు వచ్చి రాజు తనమేడ లోనికిఁ బోఁగా మరలిపోవు మంత్రులు లోనగు సేవకులవలె నవి యన్నియు వాని యిష్టప్రకారము పోయెను.

ఉ. అమ్మౌని నన్నుఁ జూచి ప్రము♦దాతిశయంబున లోనఁ జొచ్చియున్
గ్రమ్మఱి కొంతసేపటికి ♦ నన్నుఁ గనుంగొని యగ్నిదగ్ధప
క్షమ్ములు మేన గాయములు ♦ గల్గుట ని న్గణుతింపఁ జాలఁ బూ
ర్వమ్మున గృధ్రముల్ గలవు ♦ వాయుజవమ్ములు గ్రిద్దఱేఁడులై. ౧౩౫౩

ప్రమదాతిశయంబునన్ = అధికసంతోషముతో.

తా త్ప ర్య ము.

ఆ ముని నన్నుఁ జూచి లోపలికిఁబోయి మఱల వెలుపలకు వచ్చి మిగుల

సంతోషముతో నన్నుఁ జూచి నీ ఱెక్కలు కాలుటచేతను దేహమున గాయము లుండుటచేతను నిన్ను నేను గుర్తింపఁజాల కున్నాను. పూర్వ మిచ్చట గ్రద్దలు రెం డుండెను, అవి వాయు వేగము గలవి.

ఉ. భ్రాతలు కామరూపగులు ♦ వారలలోపలఁ బెద్ద వైన సం
పాతివి నీవు, నీ యనుఁగు♦భ్రాత జటాయువు, మానుషాకృతిన్
స్ఫీతమతిన్ మదంఘ్రియుగ♦సేవ యొనర్చును, నీకు ఱెక్క లే
హేతువుచేతఁ గూలెఁ? గతి ♦ మెయ్యది? శిక్ష యొనర్చె నేఁ డొకో? ౧౩౫౪

తాత్పర్యము -

అవి రెండు నన్నదమ్ములు, కోరినరూప మెత్తఁగలవారు, వారిలోఁ బెద్దవైన సంపాతివిగదా నీవు. నీతమ్ముఁడు జటాయువు, మనుష్యాకారము దాలిచి నా పాదసేవ సేయును. నీకు ఱెక్కలుపడిపోవ నేమికారణము ? ఎవ్వఁడు నిన్ను శిక్షించెను?

—♦ ౬౧-వ సర్గము. సంపాతి తనకు ఱెక్కలు గాలినవిధము నిశాకరునితోఁ జెప్పుట. ♦—

సీ. అనవుడు నిట్లంటి ♦ నలజడిచేతను, వ్రణబాధ సిగ్గున ♦ వ్యాకులేంద్రి
యుండ నే నగుటఁ బ్ర♦త్యుత్తర మీఁజాల, గర్వాంధతను బరా♦క్రమము తెలియఁ
గోరి కైలాసాద్రి♦కూటస్థు లగు ఋషి,వర్యులసన్నిధి ♦ సూర్యబింబ
మస్తాద్రిఁ జేరెడు♦నంతలో దానిని, జేరఁగఁ బన్నిద♦మూరఁ బలికి
తే. యొక్కపరి మింటి కెగసి మే ♦ ముక్క మెఱసి
వింటఁ జనుచుండ నగరముల్ ♦ వేఱు వేఱు
బండికండ్లంతలై కానఁ♦బడియె నచట
నచట విననయ్యె వాద్యబ్ర♦హ్మస్వరములు. ౧౩౫౫

అలజడి = కష్టము, వ్రణబాధ = గాయముల వలన నొప్పి, గర్వాంధతను = పొగరువలనఁ గలిగిన గ్రుడ్డితనముచేత, పన్నిదము = పందెము.

తాత్పర్యము.

ఆయన యట్లులడుగఁగా నే నిట్లంటిని, మునీంద్రా ! పడినగాసిచేతను పుండ్ల నొప్పిచేతను, గలఁతనొందిన వాఁడ నగుటఁ బ్రత్యుత్తర మీయఁజాలకున్నాను. పొగరు వలనఁ గన్నులు తెలియక పరాక్రమము తెలియఁగోరి కైలాస శిఖరమం దుండు ఋషులయెదుట నేను నాతమ్ముఁడు సూర్యుఁడు పడమటికొండకుఁ బోవు లోపల నాయనయొద్దకుఁ బోవలయు నని పందెము పలికి యొక్కసారిగ నాకాశమున కెగసి మా బలము తెలియునటు లాకాశమునఁ బోవుచుండఁ బట్టనములు బండికండ్లంతలై కనఁబడెను. అచ్చట నచ్చట వేగస్వరములు వినవచ్చెను.

క. రంగుగ లోహితవాప,స్సంగత లగు నంగనలను ♦ సంగీతకళా
సంగలఁ గనుఁగొనుచును జేరం గలిగితి మిరుఁరమును ♦ రవిమార్గంబున్. ౧౩౫౬

తాత్పర్యము.

లోహిత + వాసస్ + సంగతలు = ఎఱ్ఱని వస్త్రము గట్టుకొన్న వారు.

చక్కఁగా నెఱ్ఱచీరలఁ గట్టుకొన్న వారిని సంగీతములఁ బాడువారిని స్త్రీలను జూచుచు సూర్యుని జేరఁబోయితిమి.

సీ. అచ్చట నుండి మే ♦ మాలోకనము సేయఁ,బచ్చికపట్టయ్యె ♦ వనతలంబు
కొండల నిండిన♦కుతలంబు గులకతాల్, నెఱప మఱింగిన♦నేల యయ్యె
నాపగావృత మగు♦నవని నూల్పోగులు, చుట్టినచెం డయి ♦ చూడ నయ్యె
మిహికాద్రి వింధ్యంబు ♦మేరువు మడువున, నాగంబులట్లు కా♦నంగఁ బడియె
తే. మేనఁ జెమ్మట దుఃఖంబు ♦ మానసమునఁ
గలిగె గిరగిర తిరిగెను ♦ గన్నుదోయి
యామ్య మిది పశ్చిమం బిది ♦ యనుచు దిక్కు
దెలియ దయ్యెను శూన్య మై ♦ దెసలు దోఁచె. ౧౩౫౭

కుతలంబు = భూప్రదేశము, మఱింగిన = చాటుపడిన, ఆపగావృతము = నదులతో వ్యాపించిన, మిహికాద్రి = మంచుఁగొండ, నాగంబు లట్లు=పాములవలె, యామ్యము = దక్షిణము. తాత్పర్యము.

అచ్చటినుండి మేము చూడఁగా నడవులన్నియుఁ బచ్చికపట్టులవలె నుండెను, కొండలచే నిండిన భూమి గులకరాలు పఱిచినఁ గనపడని నేలవలె నుండెను. నదులు గల భూమి నూలు దారము చుట్టిన చెండువలె నుండెను. హిమవంతము, వింధ్యము, మేరువు పర్వతములు మడుఁగులోఁ బాములవలె నుండును. దేహమునందుఁ జెమట, మనసునందు దుఃఖము గలిగెను. కన్నులు గిరగిర దిరిగెను. ఇది దక్షిణము ఇది పశ్చిమము అని దిక్కు తెలియదయ్యె. దిక్కులు శూన్యమై తోఁచెను.

నిరాలంబముగ నవ్యక్తోపాసనము చేయువారి యనుభవ మీ పద్యములందు వర్ణింపఁబడెను.

భగవంతుఁడు,

క్లేశోధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే॥ భ. గీ. ౧౨-౫.

అని చెప్పినప్రకారము నిరాలంబావ్యక్తోపాసనము మిగుల దుర్ఘటము. దానికి సాధనసంపత్తి పరిపూర్తిలేక యిట్లుపాసింప యత్నించుచో వాఁడు సంపాతివలె భ్రష్టుఁ డగుట సత్యము. యోగమునందుండు గండ మిదియే. పదికోట్ల కొక్కఁడు దీని సాధింపఁగలవాఁడు లేఁడు. అన్ని న్యర్బుదముల కపులలో హనుమంతుఁడు దక్కఁ గార్య సాధకు లెందఱు గలరు? ఆకాశమునఁ బోఁగలరు గాని సీత నెట్లు చూడఁగలరు.

అనుభవము లేనివారి కీ మాట లర్థముకూడఁ గావు. దెబ్బదిని నేలఁబడినపుడు తెలియును. ఈ విషయమున నీ వాక్యములు స్మరణీయములు.

The air of great height must be treated with caution. When all the Gods have been dethroned and nothing is left but the 'Self' beware of Vertigo. It was this that made Vivekananda careful in his ascent not to hurry the whole mass of souls as yet uninured to the precipices and the wind of chasms. He made each one climb by small stages leaning upon the staff of his own religion or of the provisional spiritual credos of his age and country. But too often his followers were impatient and sought to gain the sumimts without due rest and preparation. Hence it was hardly surprising that some fell and in their fall they were not only a danger to themselves but to those who knew themselves to be inferior.

క. లయసమయశిఖిశిఖాసం,చయముల నిర్దగ్ధమైన ♦ జగముల చందం
బయి తోఁచె లోకమంతయు, నయకోవిదవర్య మాకు ♦ నట నుండి కనన్. ౧౩౫౮

లయసమయ = ప్రలయకాలమందలి, శిఖిశిఖా = అగ్నిజ్వాలలయొక్క, సంచయములన్ = సమూహములచే, నిర్దగ్ధమైన = పూర్ణముగాఁ గాలిన, నయకోవిదవర్య = నీతివిద్యయందుఁ బండితశ్రేష్ఠుఁడా.

తాత్పర్యము.

ప్రలయకాలమందలి యగ్నిశిఖలచేఁ బూర్ణముగఁ గాలిన ప్రపంచమువలె లోకమంతయు నచ్చటనుండి చూడఁ బాడై తోఁచెను.

చ. కనుఁగొన సాధనంబు లగు ♦ కన్నులు దిగ్భ్రమఁ బొంది యుండుటన్
మనమును వ్యాకులంపడియె ♦ మానక మేము దృఢప్రయత్నతన్
గను లొకయింత విచ్చి గ్రహ ♦ కాంతునివంకఁ గనంగ భాస్కరుం
డును ధరణీప్రమాణము త ♦ నుం గొనియుండుట గంటి మంతటన్. ౧౩౫౯

గ్రహకాంతుని వంక = సూర్యునిప్రక్క, ధరణీప్రమాణము = భూమియంత, తను = శరీరమును.

తాత్పర్యము.

చూచుటకు సాధనములైన కన్నులు దిరుగుచుండుటచేత మనస్సుకూడ వ్యాకుల మయ్యెను. అక్కడికి మేము దృఢప్రయత్నముచే బలవంతముగఁ గన్నులు తెఱచి సూర్యునిచాయ చూడఁగా నాయన భూమియంత విస్తారదేహము గలవాఁడై కానవచ్చెను.

చ. ఒకపలుకైనఁ జెప్పకయె ♦ యుర్వికి డొల్లె జటాయు వయ్యెడన్
జకచక నేను వచ్చి యను ♦ జాతునిఁ గప్పితి నాదు ఱెక్కలన్
సెకలను వానిదేహ మటు ♦ చెక్కు చెమర్పద కాని యెట్లొ తి
గ్మకరమరీచిదీధితులఁ ♦ గాలెను నాయెఱకల్ క్షణంబునన్. ౧౩౬౦

చకచక = త్వరగా, అనుజాతునిన్ = తమ్ముని, సెకలను = వేఁడిమిచే, తిగ్మకరమరీచి = సూర్యునియొక్క, దీధితులన్ = కాంతులచే, ఎఱకల్ = ఱెక్కలు.

తాత్పర్యము.

ఒకమాటయైనఁ జెప్పకయే నా తమ్ముఁడు భూమిమీఁదికి దొరలెను. నేను శీఘ్రముగఁబోయి నాఱెక్క లతనికి నడ్డముగాఁ గప్పితిని గాని యది యెట్లో నా ఱెక్కలు సూర్యకిరణములచేఁ గాలెను.

క. అతఁడు జనస్థానంబునఁ, బతితుం డయి యుండు ననుచు ♦ భావించితి నీ
క్షితిధరమున నేఁ బడితిఁ, గతి చెడి యొక ముద్దు వోలెఁ ♦ గమరుట ఱెక్కల్.

పతితుండు = పడినవాఁడు, క్షితిధరమునన్ = కొండయందు, కమరుటన్ = కాలుటచే.

తాత్పర్యము.

నా తమ్ముఁడు జనస్థానంబునఁ బడె నని యూహించితిని. నా ఱెక్కలు గాలి పోవుటచే నొక ముద్దవలె నీ కొండమీఁదఁ బడితిని.

క. తమ్ముండును ఱెక్కలు రా,జ్యమ్ము పరాక్రమము పోవ ♦ సర్వగతుల జీ
వమ్మేల నిలుప నని యచ,లమ్మునుండి యిలఁబడఁ ద♦లంచితిఁ జావన్. ౧౩౬౨

తాత్పర్యము.

తమ్ముఁడు పోయెను. ఱెక్కలుపోయెను. రాజ్యముపోయెను. పరాక్రమము పోయెను. అన్నిపోఁగా నీప్రాణముమాత్ర మేల యని కొండమీఁదనుండి చావ భూమిపైఁబడఁ దలఁచితిని.

—♦ ౬౩-వ సర్గము. నిశాకరుఁడు సంపాతికి ఱెక్కలు మొలచు నుపాయంబుఁ జెప్పుట. ♦—

చ. అని వినిపించి యేడ్చుటయు ♦ ధ్యాన మొనర్చి ముహూర్త మత్తపో
ధనుఁ డనె నీకుఁ గ్రమ్మఱ ఛ♦దమ్ములు గల్గెడి వెండి సత్త్వముల్
గనులును విక్రమంబు తొలి♦లాగున లబ్ధము లౌను జుమ్మి, నే
వినితిఁ బురాణమం దొక భ♦విష్యముఁ గంటిఁ దపోబలంబునన్. ౧౩౬౩

ఛదమ్ములు = ఱెక్కలు, సత్త్వము = బలము, భవిష్యము = ముందు జరగఁబోవునది.

తాత్పర్యము.

అనిచెప్పి నే నేడువఁగా నా మునీశ్వరుఁ డల్పకాల మాలోచించి నీకు మరల ఱెక్కలు బలము కన్నులు పరాక్రమము మునుపటివలెనే వచ్చును. నేను బురాణమందు ముందు రాఁగల కార్యము వింటిని. నా తపోబలంబున దానిని జూచితిని.

సీ. ఇక్ష్వాకునందనుం ♦ డిల మించు దశరథుం, డను భూమిభర్త యా♦తని సుతుండు
ప్రకటతేజుఁడు రామ♦భద్రుండు జనియించు, నాతండు జనకవా♦క్యానుసారి

యయి లక్ష్మణుం డను♦ననుజునితో నరణ్యాళిఁ జరింపఁగ ♦ నతనిభార్య
దానవేంద్రుఁడు జన♦స్థానంబునందుండి, హరియించి యామె కా♦హారములను
తే. నాశ చూపును గాని యా♦యతులసాధ్వి, తాఁక దొక్కటియేని సి♦తాంతదుఃఖ
మగ్నయై యంత నిర్జర♦మండలికిని, దుర్లభం బగు నమృత మిం♦ద్రుం డొసంగు.
జనకవాక్యానుసారియయి = తండ్రిమాట ననుసరించినవాఁడై.

తాత్పర్యము.

ఇక్ష్వాకువంశమున దశరథుండనురాజు జనించును. అతనికి రామభద్రు డను కొడుకు పుట్టును. అతఁడు తండ్రి మాటప్రకారము తమ్ముఁడైన లక్ష్మణునితో నరణ్యముల సంచరించును. ఆ రామచంద్రుని భార్యను జనస్థానమునందుండి రాక్షసరాజు హరించి యామె కాహారము లిచ్చి యాశచూపును గాని యా పరమపతివ్రత మిగుల దుఃఖమున మునిఁగినదై యొకటియైనఁ దాఁకదు. అప్పుడు దేవతలకును దుర్లభంబయిన యమృతమును నింద్రు డిచ్చును.

ఉ. దానిని నింద్రదత్త మని ♦ తత్త్వ మెఱింగి తదన్న మందు నా
ద్యాంశమత యగ్రభాగమును ♦ గైకొని ప్రాణముతోడ నుండిరేఁ
గాని యమర్త్యభావమును ♦ గాంచిరఁ గాని సలక్ష్మణుండు నా
ప్రాణవిభుండు రామున క♦టంచును భూస్థలి నుంచు భక్తిమై. ౧౩౬౫

ఇంద్రదత్తము = ఇంద్రునిచే నీయఁబడినది, తత్త్వము = వాస్తవము.

తాత్పర్యము.

ఆ యమృత మింద్రుఁ డిచ్చిన దని వాస్తవ మెఱిఁగిసీతాదేవి దానిలో మొదటి భాగమును దీసికొని రామలక్ష్మణులు ప్రాణముతో నుండినను ప్రాణములు విడిచినను వారికిఁ జెందునుగాక యని భక్తితో భూమిపై నుంచును.

ఇది పతివ్రతల యాచారము 'భుక్తవత్యేవ భుంజీయాత్ స్వపత్యథశయీతిచ' మగఁడు భుజించినతరువాత భుజించును, మగడు నిద్రించిన తరువాత నిద్రించును, అని ప్రమాణము.

క. రాముని దూతలు కోతులు, వామాక్షిని వెదకికొనుచు ♦ వచ్చెద రిటకున్
భూమిజవృత్తాంతము శా,ఖామృగములకున్ వచింపఁ ♦ గలుగు శుభంబుల్.

తాత్పర్యము.

రామునిదూతలు కొందఱు క్రోఁతులు సీతాదేవిని వెదకికొనుచు నిచ్చటికి వత్తురు. వారికి నీవు సీతాదేవివృత్తాంతముఁ దెలిపితివా నీకు మే లగును.

క. ఎందును బో వలవదు నీ,విం దుండుము హీన మైన♦యిట్టిదశను నీ
వెం దరుగఁ గలవు? ఱెక్కలుఁ, బొందెద విట దేశకాల♦ముల నెదురు గనన్.

తాత్పర్యము.

నీ వీ ప్రదేశమును విడిచి యెందును బోవలదు. ఱెక్కలులేని యీ నీచదశ

యందు నీ వెందుఁబోఁగలవు? పోయి యేమిచేయఁగలవు. దేశకాలముల కెదురు చూచుచు నిందే యుంటివేని నీకు ఱెక్కలు మరల వచ్చును.

తే. నీకు ఱెక్కలు మొలపింప ♦ నేర్తుఁ గాని
యిపుడ యటు సేయఁగా నుత్స♦హింప నైతి
భువనహిత మైన కార్యంబుఁ ♦ బూని నీవు
పతగపుంగవ చేయంగ ♦ వలసి యుంట. ౧౩౬౮

తా త్ప ర్య ము.

నీ కిప్పుడే ఱెక్కలు మొలుచునట్లు చేయఁగలనుగాని యట్లుచేయ నుత్సహింపను. ఏలన నీ వింకనుండి జగమునకు మేలైనకార్యము చేయవలసియున్నది. ఱెక్కలనిచ్చితి నేని వారు వచ్చుసమయమునకు నీ వెందుందువో యేమో, కార్యహానియగును.

క. సురవరునకు మునులకు భూ,సురవరులకు నిర్జరులకు ♦ సుహితచరితు లా
ధరణీవరనందనులకుఁ, గరము ప్రియము నీవు సేయఁ♦గా వలయుఁ జుమీ. ౧౩౬౯

తా త్ప ర్య ము.

ఇంద్రునకు మునులకు బ్రాహ్మణులకు దేవతలకు రామచంద్రులకు నీవుమిగులఁ బ్రియమైనపని చేయవలసియున్నది.

తే. మహితకీర్తుల రామల♦క్ష్మణులఁజూడ, గలదు కొండంతయాశయుఁ ♦ గానియంత
కాల ముర్విని గాయంబుఁ ♦ గాచియుండఁ, జిత్త మొల్లదు గానఁ ద్య♦జింతు మేను.

తా త్ప ర్య ము.

విస్తారకీర్తిగల రామలక్ష్మణులఁ జూడవలయు నని విశేషముగ నాశగలదు గాని యంతకాలము భూమి దేహరక్షణము చేసికొనుచు నుండుటకు మన స్సంగీకరింప లేదు. కావున దేహము వదలెదను.

—♦ ౬౩-వ సర్గము. సంపాతికి మరల ఱెక్కలు మొలచుట. ♦—

సీ. అని పెక్కుగతులఁ ద♦త్త్వార్థదర్శనుఁ డెంతొ, నన్ను నాశ్వాసించి ♦ సన్నుతించి
పొ మ్మని చెప్పి తాఁ♦బోయె లోనికినంత, నీకొండమీఁదికి ♦ నెట్లొ మెల్ల
నెక్కి యందుండి నే♦నెదురు చూచుచునున్న, వాఁడ మీరాకకై ♦ప్లవగులార!
మొనిమిది వే లేండ్లు ♦ చనియె నే నోర్పుమైఁ, గాలదేశంబులఁ ♦ గాచి యుంటిఁ
తే. దపసినుడి నమ్మి యాతండు ♦ విపుల విడిచి, దివికి నేగిన నేనును♦ధృతి దొఱంగి
పెక్కువిధములఁ జింతచే ♦ స్రుక్కిస్రుక్కి, కాల్పఁబడుచున్నవాఁడ దుః♦ఖంబుచేత.

తత్త్వార్థదర్శనుఁడు = వాస్తవవిషయము తెలిసినవాఁడు. ఆశ్వాసించి = ఊరార్చి, నుండి = మాట, విపుల = భూమి.

తా త్ప ర్య ము.

వాస్తవార్థము తెలిసిన యా మునీశ్వరుఁ డనేకరీతుల న న్నోదార్చి పొగడి పొమ్మని చెప్పి తాను లోపలికిఁబోయెను. అంత నీ కొండమీఁదికి నే నతి

కష్టముమీఁద నెక్కి మీరాకకై యెదురు చూచుచున్నాను. ఎనిమిది వేలేండ్లు గడచి పోయెను. మునిమాట నమ్మి యోర్పుగలిగి యున్నాఁడు దేశకాలములఁ గాచియుం టిని. ఆయన దేహమును విడిచి స్వర్గ మేగెను. నేను ధైర్యము విడిచి నానావిధములఁ జింతచే స్రుక్కి స్రుక్కి దుఃఖముచేతఁ గాల్పఁబడుచున్న వాఁడను.

సీ. చత్తునా యంచును ♦ జతనంబుఁ గావింతు, మౌనివాక్యంబున ♦ మరలుచుందు
నేమి జీవన మని ♦ యెన్నుదు మునిబుద్ధి, తిమిరంపుదివియయై తెల్వి నిచ్చు
రావణు నెఱుఁగుట ♦ రామకాంతను నేల, కావవైతని పుత్రు♦గర్హ సేతు
దశరథు నెయ్యంబుఁ ♦ దలఁచి యైనను నొంటి, నేఁడు సీతను గావ♦నెంచఁ డయ్యొ

తే. నేమి పుత్రుండ టంచును ♦ నెంచుచుందు, ననుచు నీరీతి సంపాతి ♦ యగచరాళి
కెల్లఁ దనకథఁజెప్పంగ♦నింతలోనఁ,గపులు చూచుచునుండ ఱె♦క్కలును మొలచె.

జతనంబు = యత్నము, తిమిరంపుదివియ = చీఁకటికిదీపమై.

తా త్ప ర్య ము.

మరణింపవలె నని యత్నము చేయుదును గాని చావవలదు నీకు మేలుగలుగు నను మునివాక్యములను స్మరించి మరలుచుందును. ఈ పాడు బ్రదుకు బ్రతికి యేమి మేలని తలంతును గాని నా యజ్ఞాన మను చీఁకటికి మునిబోధ దీపమై తెలివిని గలి గించును. రావణు నెఱిఁగిన కారణమున నేలరా సీతను రక్షింపవైతి వని కొడుకును దూషింతును. దశరథు స్నేహంబు దలఁచియైనను సీతను రక్షింపనివాఁ డేమి కొడు కని తలంచుచుందును, అని యీ రీతి సంపాతి చెప్పుచుండు సమయంబున వానరులు చూచుచుండ సంపాతికి ఱెక్కలును మొలచెను.

చ. అరుణరుచిన్ వెలుంగు గఱు ♦ లట్లుదయింపఁగఁ బొల్చుమేనిఁ దా
నరుణసుతుండు చూచుకొని ♦ హర్షవికాసమనస్కుఁడై నిశా
కరమహిమంబుచేత నెఱ♦కల్ మొలదెంచెను వెండి కంటిరే
పరువపువేళఁ గల్గు బల♦పౌరుషముల్ గల వంచుఁ దోఁచెడిన్. ౧౩౨౩

అరుణరుచిన్ = ఎఱ్ఱని కాంతిని, గఱులు = ఱెక్కలు, అరుణసుతుండు = సంపాతి, హర్షవికాసమనస్కుఁడై = సంతోషముతో వికసించిన మనస్సుగలవాఁడై, ఎఱకల్ = ఱెక్కలు, పరువపువేళ = ప్రాయపుసమయమున, యౌవనంబున.

తా త్ప ర్య ము.

ఎఱ్ఱనికాంతితోఁ బ్రకాశించుఱెక్క లా ప్రకారము మొలచిన దేహమును సంపాతి చూచుకొని సంతోషించి నిశాకరముని ప్రభావముచే ఱెక్కలు మరల మొలచెను, చూచితిరా, యౌవనమందుఁగల బలము పౌరుషము గలవని తోఁచు చున్నది.

ఉ. ఎన్నివిధంబులన్ నెమకుఁ ♦ డీరు ధరాసుత నిష్టు నాకు ను
త్పన్నము లైనఱెక్కల వి♦ధంబుఁ గనంగను విశ్వసింప నో

నన్నవలాను గన్గొనుట ♦ యాజ్ఞ నొసంగుఁడు మింటిత్రోవ వే
గోన్నతి మున్నువోలెఁ జన ♦ నోపుదునో పరికింపఁ గోరెదన్. ౧౩౭౪

నవలాను = స్త్రీని, సీతను.

తాత్పర్యము.

ఏవిధముగనైన సరే, ఎంత కష్టించియైన సరే, మీరు సీతాదేవిని వెదకుఁడు. నాకు ఱెక్కలు పుట్టిన విధముఁజూడఁగా మీరాయన చెప్పినప్రకారము సీతనుజూడఁ గలుగుదు రని నమ్మవచ్చును. నేను మునుపటివలెఁ బోగలనో పోలేనో చూడవలసి యున్నది. నాకాజ్ఞ యిచ్చెదరేని యాకాశమార్గమునఁ బోయెదను.

ఇంతవఱకుఁ బ్రక్షిప్తమని ముందు వ్రాయఁబడెను. ఱెక్కలు రాకముందు సీత నేల విడిపింపలేదని కొడుకును దిట్టి తన శక్తి చాలమికిఁ దన్ను దూషించుకొన్న వాఁడు, తన ఱెక్కలు వచ్చిన పిమ్మట నా ప్రస్తావనయే లేక తన తిండికై తాను బోయెనఁట. నా వెంట రండు, నేను సీతను జూపెద నని యనినవాఁడు గాఁడు. కావున నిది యంతయుఁ బ్రక్షిప్తమే.

క. అని చన ముద మొదవఁగ న,వ్వానచారులు సంప్రల♦బ్ధపౌరుషు లగుచున్
జనకజ రోయఁగ నభిజి, త్తను మూర్తము వేచి చనిర ♦ యవనిజదెసకై. ౧౩౭౫

సంప్రలబ్ధ పౌరుషులు = చక్కఁగా లభించిన పౌరుషము గలవారు, అభిజిత్తు= మట్టమధ్యాహ్నము పండ్రెండు గంటల కాలము, ఉదయము మొదలు పదునాలుగు గడియలు గడిచిన పిమ్మట రెండు గడియలకాలము.

సూర్యాచ్చతుర్థకం లగ్నం, మభిజిత్పరికీర్తితం
సర్వదోషహరంచైవ, ప్రశస్తం శుభకర్మసు॥ జ్యోతిశ్శాస్త్రము.

అవనిజదెసకై = సీతాదేవి యున్న దిక్కుముఖము చేసి.

తాత్పర్యము.

అని చెప్పి సంపాతి వెడలిపోఁగా వానరులు మరల పౌరుషము గలవారై సీతాదేవిని వెదకుటకుఁ గాను అభిజిత్తను ముహూర్తమునకై యెదురు చూచుచు నామె యున్నదిక్కు ముఖముచేసి పయనించిరి.

—♦ ౬౪-వ సర్గము. వానరులు సముద్రతీరంబుఁ జేరుట. ♦—

ఉ. ఈగతి రావణక్షయము ♦ గృధ్రము చెప్పఁగ నాలకించి యు
ద్వేగము దక్కి యెల్ల ప్లవ♦వీరుహచారివరేణ్యు లంత నా
భోగముదంబునం గెరలి ♦ పొంగుచు గంతులు వైచుచున్ మహా
భాగను జూచు కోరిక న♦పాంపతితీరముఁ జేరి యయ్యెడన్. ౧౩౭౬

రావణక్షయము = రావణు గృహము; క్షయో రోగాంతరే కల్పాంతే గృహే ప్యపచయే ప్యథ. నానార. క్షయశబ్దమునకు గృహమనియు నాశమనియు నర్థముగలదు.

రావణక్షయమునకు రావణనాశమనియు నర్థము గలదు, వాని నాశమునకు నిదాన మిదియే కదా. ఉద్వేగము = భీతి, అపాంపతి = సముద్రము, ఇది అలుక్సమాసము. ఈ శబ్దసాధుత్వమునుగుఱించి యమరసుధయందలి సూచికయం దిట్లు వ్రాయఁబడినది. "బహుళకాత్ షష్ఠ్యా అలుక్॥ వాక్యేనైవ నామేతి సర్వధరః॥ ఇతి ముకుటః॥ సుగమమేవహి మధ్యమపాంపతేః॥ ఇతిదర్శనాత్ ఇతిస్వామీ.

తా త్ప ర్య ము.

ఈ విధముగ రావణుఁ డుండు స్థలమును సంపాతి చెప్పఁగా విని భయము విడిచి వానరు లందఱు విశేషసంతోషముచే విజృంభించి పొంగుచు గంతులువైచుచు నా పుణ్యాత్ముఁ రాలిని జూచు కోరిక సముద్రతీరముఁ జేరి యచ్చట,

తే. అన్ని జగముల ప్రతిబింబ ♦ మనఁగ నొప్పు, దక్షిణాంబుధి యుత్తర♦తటముఁ జేరి
సారబలులందు సన్నివే♦శంబు చేసి, పాఱఁ జూచిన మెయి గగు♦ర్పాటు పొదల.

అన్నిజగంబుల ప్రతిబింబము = అన్ని జగత్తులకు సమానమైనది, లోకములో నుండు వస్తువులన్నియు నిం దున్నవని భావము, సన్నివేశంబుచేసి = చక్కఁగాఁ గూర్చుండి.

తా త్ప ర్య ము.

అన్ని జగంబులలోని వస్తువులతోఁ బరిపూర్ణమైన దక్షిణసముద్రము నుత్తర తీరముఁ జేరి బలవంతులగు వానరు లొక్కచోటఁ జక్కగాఁ గూర్చుండి సముద్రమును బాఱఁజూచి దేహమునఁ బులక లెగయఁగా.

సీ. ఆస్యముల్ విచ్చిమ♦హాకాయములుదాల్చి, చరియించు వికృతంపు♦సత్త్వచయము
లమర దరంగస♦మాకులం బయి యొండు, స్థలమున నిద్రించు♦చందముగను
నొండెడఁ గ్రీడించు ♦ నొప్పిదంబును గాంచి మఱియొక్కచో గిరి♦మాత్రమైన
వారిచే దనరారి ♦ పాతాళతలవర్తి, దానవేంద్రులచేతఁ ♦ దటమటించి

తే. వారిదాధ్వమువోలె దు♦ష్పారమగుచు, రోమహర్షదమైన నీ♦ర్వామిఁ గాంచి
చింతలకుఁ జిక్కి యిఁక నేమి ♦ సేయవచ్చు, దీనినెట్టులు దరియింపఁ♦దీరుననుచు.

ఆస్యముల్ విచ్చి = నోళ్ళు తెఱచుకొని, వికృతంపు = వికారములైన, సత్త్వచయములు = జంతువులగుంపులు, తరంగ = అలలచే, సమాకులంబు = వ్యాకులంబు = తటమటించి = కలఁతపెట్టి, వారిదాధ్వము = మేఘమార్గము, ఆకాశము, దుష్పారము= అంతములేనిది, రోమహర్షదము=గగ్గురుపాటు కలిగించునది, నీర్వామి= సముద్రము.

తా త్ప ర్య ము.

పెద్ద దేహములు గలిగి నోళ్ళు తెఱచుకొని తిరుగు వికారజంతువులు గలిగి, యలలచే వ్యాకులపడి యొకచోట నిద్రించునట్లు నీళ్ళుకదలక, యొకచోట నాడునట్టు లెగిరిపడుచు నొక్కచోటఁ గొండెత్తులేచు నీళ్ళుగలదై పాతాళతలముననుండు దానవుల

చేతఁ గలత పెట్టబడినదై యాకాశమువలె నంతము లేనిదై గగుర్పాటు గలిగించు సముద్రమును జూచి విచారమునకులోపడి యిఁక నేమి సేయుదము దీని నెట్లు దాఁటుదము అనుచు.

క. ఘన మగుభయమున దుఃఖంబునఁ దట్టు వడంగఁ గీశ♦పుంజము తారా
తనయుఁడు మతిమంతుం డి,ట్లనియెన్ వారలకు ధైర్య♦మాత్మల నిలువన్.

తట్టుపడంగన్ = బాధపడఁగా, పుంజము _ సమూహము.

తాత్పర్యము.

అధికమైన భయముచేతను దుఃఖముచేతను వానరుల సమూహము బాధపడుచుండ వారిని జూచి బుద్ధిమంతుఁడైన యంగదుఁడు వారికి ధైర్యము గలుగ నిట్లు చెప్పెను.

చ. వలదు విషాదముం గొనఁగ ♦ వావిరిదోషము దుర్విషాద మా
బలితపుఁ గ్రుద్ధపన్నగము ♦ బాలునిఁ జంపెడిరీతిఁ బూరుషున్
నిలుగఁగఁ జేయు దుఃఖము వ♦సించరులార! పరాక్రమంబు వే
ళల నెతఁ గూరు క్షుద్రున క♦లబ్ధము పో పురుషార్థ మేదియున్. ౧౩౮౦

వావిరిదోషము = గొప్పదోషము, దుర్విషాదమా = చెడ్డ విషాద మవును, క్రుద్ధపన్నగము = కోపించిన పాము, నిలుగఁగఁజేయున్ = చంపును, నిలుగు రూ. నీలుగు, క్షుద్రునకు = స్నీచునకు, అలబ్ధము = లభింపనిది.

తాత్పర్యము.

వానరులారా! విషాదపడవలదు. చెడ్డవిషాదము. మహాదోషము. దుఃఖము బలిష్ఠమై కోపించినపాము బాలునిఁ జంపురీతిని బురుషునిఁ జంపును. పరాక్రమము చూపవలసిన సమయముల దుఃఖపడువానికి ధర్మార్థకామమోక్షములం దేదియు లభింపదు.

ఉ. రే యటు లేగ వానరవ♦రేణ్యులు వాలిజుఁ జుట్టి కొల్వఁగా
నా యనఘుండు నిర్జరస♦మావృతవాసవుమాడ్కిఁ బొల్పుచున్
జేయఁగలట్టి కార్యమును ♦ జింతనసేసె; నెవండు చాలుఁదా
రేయసమీరణాత్మజులు ♦ దిక్కఁగ నా కపిసేన నిల్వఁగన్. ౧౩౮౧

రే = రాత్రి, నిర్జర=దేవతలచే, సమావృత=చుట్టఁబడిన, వాసవుమాడ్కిన్= ఇంద్రునివలె, తారేయ = అంగదుఁడు. సమీరణాత్మజుఁడు = హనుమంతుఁడు, త్రిక్కఁగన్ = తప్ప.

తాత్పర్యము

రాత్రియంతయు నీ విచారముతోఁ బోఁగా వానరు లంగదుని జుట్టుకొని సేవింపఁగా నతఁడు దేవతలచేఁ జుట్టుకొనఁబడిన యింద్రునివలెనై చేయఁగల కార్యమెట్లు చేయవలెను. ఈ సముద్రమును దాఁటువాఁ డెవఁడు? అని యాలోచించెను.

చెదరిన యీ వానరసేనను గట్టుదిట్టములందుఁబెట్ట నంగద హనుమంతులకుఁ దప్ప మఱియెవనికి సాధ్యము ?

---♦ అంగదుఁడు కపుల సముద్రంబు దాఁటఁ బ్రేరించుట ♦---

క. హరివృద్ధులఁ దక్క చమూ, వరులం గని యూఱడిలఁగ ♦ వాలితనూజుం
డురుమతి నర్థవదుక్తులఁ, బరమముదం బెసఁగ నిట్లు ♦ పలికెన్ గరిమన్. ౧౭-౨

హరివృద్ధులన్ = వానరులందుఁ బెద్దవారిని, చమూవరులన్ = సేనాపతులను, ఉరుమతిన్ = గొప్పమనస్సుతో, అర్థవదుక్తులన్ = అర్థవంతములయిన మాటలచే, పరమ ముదము = మిగుల సంతోషము, గరిమన్ = గొప్పదనముచే.

తా త్ప ర్య ము.

ఈకార్యమెట్లు నెఱవేఱునా ? అసాధ్యముగ నున్నదే యని విచారపడుచున్న వృద్ధ వానరులును సేనానాయకులును సమాధానపడునట్లు గొప్ప మనస్సుగల యంగదుఁడు మిగుల సంతోషముతో నర్థవంతములయిన మాటలచే నిట్లనెను.

సీ. ఏ మహాతేజుఁడో ♦ యీ సాగరము దాఁటి, శైలాటపతి సత్య♦సంధుఁ జేయు
నే మహాబలుఁడో నూ♦ఱామడ లంఘించి ప్లవగులభయ మెల్లఁ ♦ బాప నోపు
నెవ్వని మహిమచే ♦ నిటనుండి చని యిట, నాలుబిడ్డలఁగూడి ♦ యలరఁ గలుగు
నెవ్వనికరుణచే ♦ నెలమి సుగ్రీవుని, రామలక్ష్మణులఁ జే♦రంగఁ గలమొ
తే. యట్టిసామర్థ్యమును గల♦హరివరుండు, సాగరంబును లంఘింపఁ ♦ జాలువాఁడు
గలిగె నేనియు నీసైన్య♦కాండములకు, నభయదక్షిణ నొసఁగుత♦ మాశుగతిని.

శైలాటపతిన్ = వానరరాజు, సుగ్రీవుని, అలరన్ = సంతోషింపఁగా, అభయదక్షిణ = భయములేదను దక్షిణ, ఆశుగతిని = శీఘ్రముగ.

తా త్ప ర్య ము.

సుగ్రీవుని సత్యసంధునిఁజేయ నీ సముద్రమును దాఁటు మహాతేజముగల వాఁడెవ్వఁడో, నూఱామడ సముద్రమును దాఁటి యీవానరుల ప్రాణభయముఁ బాపఁ జాలు మహాబలవంతుఁ డెవ్వఁడో, ఎవ్వని మహిమచే నిక్కడనుండి పోయి వారి వారి యింట వారు వారు వారి వారి భార్యలతో బిడ్డలతోఁ గూడి సంతోషింపఁగలుగునో, యెవ్వనిదయచే నిండఱము సుఖముగ సంతోషముగ మరల రామలక్ష్మణ సుగ్రీవులఁ జేరఁగలమో యట్టి సామర్థ్యము గల వానరశ్రేష్ఠుఁడు సముద్రమును దాఁటఁగలవాఁ డుండెనేని వాఁడు వానరులకెల్లఁ బ్రాణదానముచేయును గాక.

క. అని తారాతనయుఁడు పల్కిన నొక్కండేని సేనఁ ♦ గిమ్మనఁ డయ్యెన్
వనచరవాహిని యించుక, యును గదలక మెదల కున్న ♦ యువరా జనియెన్.

కిమ్మనఁడు = ఏమియనఁడు, వాహిని=సేన.

తా త్ప ర్య ము .

అని యంగదుఁడు పలుకఁగా విని యా యందఱిలో నొకఁడైన నేమి యని బదులనఁడయ్యెను. సేనయంతయుఁ గదలక మెదలక యూరకున్న యువరాజు మరల నిట్లనియె.

చం బలియురిలోన శ్రేష్ఠులరు ♦ బాఢపరాక్రమ కీర్తనీయులై
విలసిత సత్కులీనులరు ♦ విశ్రుతకార్యధురంధరత్వసం
కలితనమస్యులుం గద న♦గౌకసులార! చనంగరానితా
వులు ధర లేవు మీకు నెటు♦పోయిన నే సమయంబునందు నేఁ. ౧౩౮౫

బలియురలోనఁ = బలవంతులలో, బాఢపరాక్రమ కీర్తనీయులై=విశేష పరాక్రమముచేఁ గీర్తింపఁబడఁ దగినవారు, విలసిత = ప్రకాశించు, సత్కులీను లరు = గొప్పవంశమునందుఁ బుట్టినవారు, విశ్రుత = ప్రసిద్ధికెక్కిన, కార్యధురం ధరత్వ = కార్యనిర్వాహకత్వముచే, సంకలిత = పొందిన,నమస్యులై = నమస్కార యోగ్యత గలవారు, నగౌకసులార = వానరులార.

మూఁడవపాదంబున నిత్యసమాసయతి.

కం. లోకంబునఁ గర్ణాట వ, నౌకో ద్వీపాంతరీపనా స్తిపదార్థా
నేకాన్యోన్య జనార్దన నాకాదులు నిత్యసమసములండ్రు బుధుల్. అప్పకవి.

తా త్ప ర్య ము .

వానరులారా! మీరు బలవంతులలో నుత్తములరు, అధిక పరాక్రమముచేఁ బొగడఁబడు వారు. అట్టికీర్తిచేఁ బ్రకాశించు గొప్పవంశములఁ బుట్టినవారు. ప్రసిద్ధ కార్యముల నిర్వహించుటచే నమస్కరింపఁబడు వారుగదా, ఇట్టి మీకు నే విధముగఁ బోయిన నే సమయమందైనఁ బోరాని స్థలములు లేవు.

తే. కావునను మీరు కీశాగ్ర♦గణ్యులార!, యెవ్వ రెవ్వరు జలనిధి ♦ నెంతదవ్వు
దాఁటఁ గలవారొ మీశక్తి♦దలఁచి చెప్పుఁ, డనిన నాతని కనిరి వ♦నాటవరులు.

తా త్ప ర్య ము .

ఇదివఱ కందఱము గూడ సంచరించినట్లే యికను నందఱ మొకటిగ దాఁటి పోదమా యనిన నందఱు సముద్రమును దాఁటగలరో లేరో యని సందేహము తోఁచుచున్నది. కొందఱువిడిచి కొందఱు పోవుట సరిగాదు. అందఱము దాఁటగలమేని యందఱము కూడనే పోదము. కావున వానరులారా! యీ సముద్రము నెవ్వ రెంతెంత దూరము దాఁటగలరో వారివారిశక్తి నాలోచించి చెప్పుడు, అనిన వానరు లిట్లనిరి.

—♦ ౬౫-వ సర్గము అంగదునితోఁ గపులు వారివారి లంఘనశక్తిఁ జెప్పుట. ♦—

క. గవయ గవాక్ష సుషేణులు, ద్వివిదుఁడు మైందుండు గజుఁడు ♦ విధిసంభవుఁడుఁ
జవశాలి గంధమాదనుఁ, డవితథవిక్రముఁడు శరభుఁ ♦ డని రి ట్లలమిన్. ౧౩౮౭

తాత్పర్యము.

గవయుఁడు గవాక్షుఁడు సుషేణుఁడు ద్వివిదుఁడు మైందుఁడు గజుఁడు జాంబవంతుఁడు వేగముగఁబోఁగల గంధమాదనుఁడు వ్యర్థముగాని పరాక్రమముగల శరభుఁడిట్లనిరి.

సీ. పదియోజనంబులు ♦ వార్ధి దాఁటుదు నంచుఁ బలికె గజుం డను♦ప్లవగవరుఁడు
ఇరువదియామడ ♦ యరుగఁ జాలుదు నని, యనియె గవాక్షుండు ♦ హర్షమునను
ముప్పదామడదాఁట♦ మొనయుదునంచును,గవయుండు వాకుృచ్చెఁ♦గడిమిమెఱయ
నలువదామడ దాఁట ♦ నలవు నాకవు నని, శరభుండుపల్కెను♦త్సాహియగుచు

తే. నేఁబదామడ తరియింతు ♦ నే నటంచు,గంధమాదనుఁ డనియె ని♦ష్కంపమతిని
మైందుఁ డనునాతఁ డర్వదా♦మడ తరింప,నుత్సహించెద నని పల్కె ♦ నుల్లమలర

తాత్పర్యము.

గజుఁడు తాను బదియామడ సముద్రము దాఁటఁగలుగుదు ననియెను. గవాక్షుఁడిరువది యామడ గవయుఁడు ముప్పదామడ శరభుఁడు నలువదామడ గంధమాదనుఁడేఁబదియామడ మైందుఁ డఱువదియామడ దాఁట నుత్సహించెద మనిరి.

క. డెబ్బదియామడ ద్వివిదుఁడు, నిబ్బరముగఁ దాను దాఁట ♦ నేర్తు ననఁగఁ బె
న్నుబ్బున సుషేణుఁ డెనుబది, గొబ్బున లంఘింతు ననుచుఁ ♦ గోదుకక పలికెన్

తాత్పర్యము.

ద్వివిదుఁడు డెబ్బదియామడ దాఁటఁగల ననెను. సుషేణుఁ డెనుబది దాఁటఁగలనని నిస్సందేహముగఁ జెప్పెను.

సీ. అంతటఁ దన్మర్క♦టావళి నెల్లను, దగురీతిఁ బల్కి వృ♦ద్ధతముఁడైన
జాంబవంతుఁడు పల్కు♦శాఖామృగము లార!,గతివిక్రమము కొంత♦గలిగియుంటిఁ
గాని పూర్వం బిప్డు ♦ కడుముదుకఁడ నైతిఁ, బ్రాయంబుపారంబు♦ప్రాప్తమగుట
నది యటు లుండఁ గా ♦ కర్కవంశజులును, నర్కజుండును దమ♦యాత్మలందు

తే. నీమహాకార్యమును మన ♦ మెట్టులేని, చేయఁగలవార మని విశ్వ♦సించినారు
కాన దీన నుపేక్షింపఁ ♦ గాదు నాకుఁ, గాలభేదాన నిప్పటి♦కడిమిఁ దలఁప. ౧౩౯౦

వృద్ధతముఁడు = మిగుల ముసలివాఁడు, గతివిక్రమము = గమనమునందుఁ బరాక్రమము, కొంత = కొంచెము, ముదుకఁడను = ముసలివాఁడను, ప్రాయంబు పారంబు = యౌవనముయొక్క యంతము, కడిమిన్ = బలమును.

తాత్పర్యము.

అంతట నా వానరులనెల్ల వారివారికిఁ దగినరీతిఁ జెప్పి మిగుల ముసలివాఁడగు జాంబవంతుఁ డిట్లనియె. కపులారా! నాకుఁ బూర్వము కొంచెముగా గమనశక్తి యుండెను. ఇప్పుడు మిగుల ముసలివాఁడను, యౌవనముపోయెను. ఆ విచారమటుండ నిండు. దానిఁ దలఁచిన రాఁగల లాభమేమి. రామలక్ష్మణులు సుగ్రీవుఁడు మన

మేవిధముగనైన నీ కార్యమును సాధించెద మని నమ్మియున్నారు. కావున దీని నుపేక్షింపరాదు. కావున నిప్పటి నా శక్తి నాలోచించిన.

ఉ. తొంబదియామడల్ చనఁగ ♦ దోర్బలశక్తియెసంగు నంచుఁ జి
  త్తంబునఁ దోఁచె నా గమన♦దార్ఢ్యమ యింతియ కాదు సుందు పూ
  ర్వంబు మహాబలీంద్రుఁడు సవం బొనరింపఁ ద్రివిక్రమావతా
  రంబున నొప్పు విష్ణువును ♦ గ్రన్నన నేను బ్రదక్షిణించితిన్. ౧౩౯౧

దోర్బలశక్తి = భుజములయొక్క పటుత్వము, సవము = యజ్ఞము.

తా త్ప ర్య ము.

తొంబదియామడ దాటఁగల భుజశక్తిగలదని తోఁచుచున్నది. నీ శక్తి యింతమాత్రమా యనవలదు. పూర్వము బలిచక్రవర్తి యజ్ఞము చేయునపుడు విష్ణువు త్రివిక్రమావతార మెత్తఁగా నేను వేగముగ నాయనకుఁ బ్రదక్షిణము చేసితిని.

ఉ. యౌవనవేళ నప్రతిమ ♦ మైన బలంబు జవంబు గల్గె, నా
  కా వయసెల్లఁ జెల్లె, ముది ♦ యావహిలెన్, గమనంబు మంద మై
  చేవయుఁ బాసెఁ, గాన నెటు♦చేసిన నింతకు మించి వాఁడిమైఁ
  బోవఁగఁజాల, దాన ఫల♦ముం గనిపింపద, యేమి సేయుదున్. ౧౩౯౨

అప్రతిమము = అసమానము, జవంబు = వేగము.

తా త్ప ర్య ము.

నేను మీవలె వయస్సునం దున్నప్పు డసమానబలము, వేగముగలవాఁడనై యుంటిని. ఆ వయసు కడచిపోయెను. ముసలితనము వచ్చెను. గమనము మందమయ్యెను. బలము తగ్గెను. కాఁబట్టి నే నెంత యుత్సాహము ప్రయత్నము చేసినను నింతకు మించిపోవఁజాలను. తొంబదియామడ పోవుటచే రాగల లాభ మేదియుఁ గనఁబడలేదు. ఏమిచేయుదును.

క. అనవుడు భల్లూకాధిపుఁ, గొనియాడుచు ననియె వాలి♦కొడు కిటు నే యో
  జనశతము దాఁట నేర్తును, ఘనశక్తిని మరలి రాఁగఁ♦గలనో లేనో. ౧౩౯౩

తా త్ప ర్య ము.

తాతా! యింత ముసలివాఁడవై తొంబదియామడ దాఁటఁగల ననెదవే యేమి నీ శక్తి యని పొగడి యంగదుఁడు నేనూఱామడ దాటనేర్తునుగాని మరలిరాఁగలనో లేనో సందేహము.

ఈ వానరు లందఱు సుగ్రీవు నెదుట నొకరినిమించి యొకరు ప్రజ్ఞలుపలికినవారే కదా, యిప్పుడేల యిట్లు కార్యము చేయవలసిన సమయము వచ్చినపుడు వెనుకంజ పెట్టెరి. శక్తిసామర్థ్యములు లేకయా

శక్తిసామర్థ్యములు లేకకాదు రావణుఁడు నెల దినములు కిష్కింధయం దుండెను. (చూ: ఉత్తర. ప. ౭౮-౨)

ఆ కారణముచేతను వాని దిగ్విజయవార్తలు వినుటచేతను రావణు భుజబలము సేనాబలము దుర్గబలము లోనైనవి వానరు లందఱెఱుంగుదురు. సముద్రము దాఁటుటతోనే కార్యము గాదు. అది యల్పకార్యము. ఆవల రాక్షసులకుఁ దెలియకుండ సీతను జూచు టెట్లు? మాటలాడు టెట్లు? ఆమె వృత్తాంతము తెలిసికొనుటకు క్రొత్తవాఁ డెవఁడో వచ్చినాఁడని యే మాత్రము పొడబడి తెలిసినను రాక్షసులతో యుద్ధము తప్పదు. ఇందఱు రాక్షసుల జయించు టెట్లు? ఇదంతయు నొకనికి సాధ్యమగు పనియా- ఇంత కార్యము చేయఁగలవాఁడు హనుమంతుఁ డొక్కఁడే. కావున మన మెవ్వరము మావలనఁ గాదనిన నాయనకుఁ దప్పదు. ఆయన కార్యము సాధింపఁగలవాఁడని యోజించి యిట్లు చెప్పిరి. సేతువు నిర్మాణమైనను ననేకు లీఁది కొందఱు నాకాశమునఁ గొందఱు పోయినట్లు యుద్ధ. ౪౭౪ పద్యంబునఁ గలదు.

నీలోంగదో హనూమాంశ్చ జాంబవా నథ కేసరీ
సముద్ర తీర మాగమ్య నశేకు స్స్పందితుం పదం
రావణస్య బలం జ్ఞాత్వా తీరే నద నదీపతేః

అను స్కాంద శ్లోక మిట ననుసంధింపఁదగును.

ఉ. నా విని జాంబవంతుఁడు వ♦నాటవరేణ్యా! త్వదీయశక్తి సం
భావిత మెంత కైన విను♦మా శత మైన సహస్ర మైననున్
బోవఁగనేర్తు వామడలఁ ♦ బోయి జవంబునఁ గ్రమ్మఱంగనున్
లావు రహించు నీకు, నయి♦నన్ సరిగా దటు నీకు జేయఁగన్. ౧౩౯౪

వనాటవరేణ్యా = వానరశ్రేష్ఠా, లావు = బలము.

తాత్పర్యము.

వానరశ్రేష్ఠా! నీ శక్తి యెంతపనికైన సాధింపఁగలదే. నూఱామడ గాదు వేయామడయైనను బోనేర్తువు. మరల రానేర్తువు అయినను నీ వా పని చేయరాదు.

చ. పనిగొనువాఁడు తేఁడతనిఁ ♦ బంపఁగఁ జెల్లదు భృత్యకోటికిన్
బనిగొన నీకుఁ జెల్లుఁ బటి♦వారల వీరలఁ బంపి, నాయనా!
వనచరకోటి కింతటికి ♦ స్వామివి నీ వగుట న్నిరంతరం
బును గడు రక్షణీయుఁడవు ♦ పూనిక మాకుఁ గళత్రముం బలెన్. ౧౩౯౫

కళత్రము = రక్షింపఁదగిన వస్తువు.

తాత్పర్యము.

రాజు సేవకులచేఁ బనిచేయించుకొనువాఁడు. కావునఁ బని పడినపుడు సేవకులు తా మూరక కూర్చుండి దాని నెఱవేర్ప రాజును బంపరాదు. రాజూరక యుండి సేవకులఁ బంపి పనిచేయించుకొనుట తగును. ఈ వానరసేన కంతయు నాయనా! నీవు

స్వామివి. వీరందఱు నీసొమ్ము. సొమ్మును సొమ్ముగలవాఁడు వాని యిష్టప్రకార ముపయోగించుకొన వచ్చును గాని సొమ్ముయొక్క యిష్టప్రకారము స్వామి వర్తింప రాదు. సేవకులు స్వామిని రక్షించినసే వారికి క్షేమము గలదు. కావునఁ దమ క్షేమ నిమిత్తము స్వామిని సేవకులు తమ రక్ష్యవస్తువులను దాము రక్షించు కొనునట్లు రక్షింపవలెను.

క. సేనలకు నెల్ల నధిపతి, మానక రక్ష్యుండు లోక♦మర్యాద యిదాఁ
గాన నిను మేము గావం,గానగుఁ గా కొంటిఁ బంపఁ♦గా నర్హంబే. ౧౫౬

రక్ష్యుండు = రక్షింపఁబడ వలసిన వాఁడు.

తా త్ప ర్య ము.

రాజు సేవకులచే రక్షింపఁ బడవలసిన వాఁడు. ఇది లోకమర్యాద కావున మే మందఱ మిందుండి నిన్ను నొంటరిగాఁ బంపుట మాకు మర్యాదగాదు.

ఉ. అంతియ కాక కార్యమున ♦ కంతకు మూలము నీవ, యర్థమ
త్యంతము నర్థమూలమును ♦ నాదటఁ గావ నటంచు నీతి భా
షింతురు కార్యకోవిదులు ♦ చెట్టున మూలము లెస్స యున్నచో
నెంతయుఁ గల్గుఁగాదె ప్లవ♦గేశ్వర! దారుఫలప్రసూనముల్. ౧౫౭

అర్థమూలము = లాభకారణము, ఆదటన్ = ప్రీతితో, కార్యకోవిదులు = కార్యముల నెఱవేర్చు పండితులు, దారు ఫలప్రసూనముల్ = కట్టెలు పండ్లు పూలుఁ. అర్థాంతరన్యాసాలంకారము.

తా త్ప ర్య ము.

అంతియకాక యీ కార్యమున కంతయు నాధారము నీవు. కార్యలాభమునకు నేది యాధారమో దానిఁ గాపాడుట మిక్కిలి తగిన కార్యమని కార్యము నిర్వహించు పండితులు చెప్పుదురు. ఎట్లన, చెట్టువేరు బాగుగా నుండిన కట్టెలు పండ్లు పూలు లభించును. వేరును జెడఁగొట్టిన నేమైన నెట్లు గలుగును? వే రెండినఁ జెట్టంతయు నెండును.

చ. అనఘ సుధీసుధీరతల ♦ కాకర మై తగు నీవు కార్యసా
ధనమున కెల్ల మూలమవు ♦ తథ్యపరాక్రమ! మా గురుండవున్,
వనచరలోకనాథ గురు♦వర్యతనూజుఁడ వట్టు లౌట ని
న్నునుగొని కార్యము ల్పలుప ♦ నూల్కొనువారముచూ కుమారకా! ౧౫౮

సుధీ = చక్కని బుద్ధికిని, సుధీరతలకు = మంచి ధైర్యమునకు, ఆకరము = స్థానము, గని; మాగురుండవున్ = యువరాజ వగుటచే మాలో గొప్పవాఁడవు, మునుగొని = ముందుగా నుంచుకొని, నూల్కొనువారము = ప్రయత్నించువారము.

తా త్ప ర్య ము.

కుమారా! దోషరహితుఁడా! నీవు మంచిబుద్ధికి మంచిధైర్యమునకు స్థానమైన వాఁడవు. నీవే కార్యసాధనమునకు నాధారము. యథార్థమైన పరాక్రమము గలవాఁడా! మా ప్రభువు కుమారుఁడ వగుటచే నీవు మాకుఁ బ్రభువే కాఁబట్టి నిన్ను ముందుగా నుంచుకొని కార్యముచేయ మేము ప్రయత్నించుచున్నాము.

క. అనవుడుఁ దారాతనయుం, డను నేఁ బోకున్న నెవ్వఁ ♦ డరుగఁగ నోపున్
మనలోఁ గావున మనకుం, జనుఁ బో ప్రాయోపవేశ♦సంస్థితి మరలన్. ౧౩౯౯

సంస్థితి = మరణము.

తా త్ప ర్య ము.

అని జాంబవంతుఁడు చెప్పఁగా తాతా! నన్నుఁ బోవలదంటివి· వే ఱొకరు పోవువారు లేరైరి. కావున మరలఁ బ్రాయోపవేశము చేసి చావవలసినదే కదా యుపాయము.

చ. హరిపతియానతిం జలుప ♦ కయ్యెడ కేగిన మేనితోడ నుం
టరిది ఖరాంశుసూనుఁడు స♦మర్థు డనుగ్రహనిగ్రహంబులన్
బొరిగొను నిందఱన్ గడువు ♦ పుచ్చియు వ్యర్థుల మాచుఁ బోవ నే
కరణిని గార్య మొందుగతి ♦ గాదొ వచింపుమ నీవ తద్విధిన్. ౧౪౦౦

తా త్ప ర్య ము.

చావనేల యూరికిఁ బోదమందువా? సుగ్రీవు నాజ్ఞ నెఱవేర్పక యక్కడికిఁ బోయితిమేని దేహమునందుఁ బ్రాణము లుండవు. నిజము. సుగ్రీవుఁడు దండించుటయందు రక్షించుటయందు సమర్థుఁడు. కావున గడువుమీఱి కార్యము సాధింపక యూరక పోయితిమేని నిందఱిఁ జంపును. కాఁబట్టి కార్యమిదిగాక వేఱొకమార్గమునఁ జెప్పుము.

తే. అనిన భల్లూకలోకేశుఁ♦డనియె వాలితనయుతో నీదు నిక్కార్య♦మునకుఁ గొఱత
గలుగ నేరదు సుమి కార్య♦కరుని నిపుడు, ప్రభుతనూభవ! ప్రోత్సాహ♦పఱుచువాఁడ

భల్లూకలోకేశుఁడు = ఎలుఁగుగొడ్డుల ప్రభువు, జాంబవంతుఁడు, కార్యకరునిన్ = కార్యము సాధింపగలవానిని, ప్రభుతనూభవ = రాజకుమారా!

తా త్ప ర్య ము.

అనిన జాంబవంతుఁ డిట్లనియె. రాజకుమారా! నీ యీ కార్యమునకుఁ గొఱత గలుగనేరదు· ఈ కార్యము సాధించువానిని నే నిప్పుడు ప్రోత్సాహపఱిచెదను.

క. అని ప్లవగేంద్రుఁడు ప్లవగేంద్రుని లంఘనకేళికోవి♦దుని నేకాంతం
బున హాయిగఁ గూర్చుండిన, హనుమం బ్రోత్సాహపఱుప ♦ నారంభించెన్. ౧౪౦౨

ప్లవగేంద్రుఁడు = ౧ దాఁటువారిలో శ్రేష్ఠుఁడు, ౨ వానరులకు నెలుఁగులకు విశేష భేదము లేమిచే నీ పదము ప్రయోగింపఁబడె ననిసైనఁ జెప్పవచ్చును.

తాత్పర్యము.

ఈ ప్రకారము చెప్పి భల్లూకప్రభు వగు జాంబవంతుఁడు వానరముఖ్యుఁడును దాఁటెడు నాఁటయందుఁ బండితుని, నొంటరిగ సుఖముగఁ గూర్చుండినవానిని హనుమంతుని బ్రోత్సాహపఱుప మొదలుపెట్టెను.

అందఱికీ కార్య మెట్లగునా యని విచారపడుచుండ హనుమంతుఁడు హాయిగ నొంటరిగఁ గూర్చుండనేల? అందఱు చింతపడుటకు సీతాదేవి యున్నతావు తెలియక విచారపడుచుండిరి. అది నిశ్చయముగఁ దెలిసెను. కావున వీరందఱో కొందఱో యొకఁడో పూనుకొనిచేసిన సంతోషమే. ఎవరు తమచేఁ గాదనిన నాకుఁ దప్పినదికాదు. నాయందుఁగదా రామసుగ్రీవులు కార్యభారము మోపిరి. కావున నేను నాచేఁ గాదన రాదు అని నిశ్చయించుకొని నిర్విచారుఁడయ్యెను.

—♦ ౬౬-వ సర్గము. జాంబవంతుఁడు హనుమంతునిఁ బ్రోత్సాహపఱుచుట. ♦—

క. ఏమియుఁ జేయఁగఁ దోఁపక, మోముల దైన్యంబు ప్రేల ♦ ముది దొఱఁగిన శా
ఖామృగసహస్రములఁ గని, ధీమంతుఁడు వాయుతనయు ♦ దృష్టించి యనున్.

ముది = సంతోషము, గర్వము.

తాత్పర్యము.

ఏమి చేయుటకు నాలోచన తోఁపక ముఖములందు శోకము ప్రేలాడుచుండఁగా సంతోషము చెడిన వానరసమూహమును జూచి బుద్ధిశాలి జాంబవంతుఁడు హనుమంతునితో నిట్లనియె.

ఉ. ప్రాకటసర్వశాస్త్రచణ! ♦ వానరవీరవరేణ్య! పావనీ!
యేకత మిట్లు మౌనము వ♦హించి రమించుచు మాట లాడ వే
లా? కమలాప్తసూనునకు ♦ నా రఘువీరులకున్ బలంబునన్
వీకునఁ దేజునం బురుడు ♦ నీ వవు దెంతయు నెంచి చూచినన్. ౧౪౦౪

ప్రాకట సర్వశాస్త్రచణ = ప్రసిద్ధముగా సర్వశాస్త్రములందు సామర్థ్యము గలవాఁడా! వానర వీరవరేణ్య = వీరులగు వానరులలో శ్రేష్ఠుఁడా! పావనీ = పవనుని కుమారా! ఏకతము = ఒంటరిగా, రమించుచున్ = క్రీడించుచు, కమలాప్త సూనునకున్ = సూర్యపుత్రుఁడైన సుగ్రీవునకు, రఘువీరులకున్ = రామలక్ష్మణులకు, వీకునన్ = పరాక్రమమున, పురుడు = సమానము, చణశబ్దభవము జాణ.

తాత్పర్యము.

సర్వశాస్త్రములందుఁ బ్రసిద్ధమైన పాండిత్య సామర్థ్యము కలవాఁడా! వానర వీరశ్రేష్ఠుఁడా! పవననందనా! ఏమి యిట్టు లెవరితో మాటలాడక యొంటరిగా నాడుకొనుచున్నావే. రామకార్యముతో నీకుఁ బనిలేదా యేమి? నీవు బలమునందుఁ బరాక్రమమందుఁ దేజమునందు రామలక్ష్మణ సుగ్రీవులకు ముగ్గురికి సమానుఁడ

వని గదా యెంత యాలోచించినను దోఁచుచున్నది. ఆముప్పు రొక యెత్తు, నీవొకడవే యొక యెత్తని భావము.

సీ. వినతాతనూజుండు ♦ విదితమహాబలుం, డా కశ్యపుని సుతుం ♦ డండజాత
కాంతుండు గరుటాల♦మంతుండు నీరధిఁ, బాముల హరియించి ♦ పఱచుచుండ
నెన్ని మాఱులొ కంటి ♦ నన్నీడజేంద్రుని, పక్షంబులకుఁ గల♦బలము జవము
నీ బాహులకుఁ గల్గు ♦ నిక్కంబు వానికి, నీసమంబైనను ♦ దీసిపోవు
తే. తేజమున బుద్ధిబలమున ♦ ధృతిని జగతి
నెల్లవారలకంటెను ♦ నెక్కుడీవు
నిన్ను నీవేల యెఱుఁగవు ♦ నిర్మలాత్మ !
యేమి కత మిది యోజింపు ♦ మో మహాత్మ ! ౧౪౦౫

వినతాతనూజుండు = వినతకుమారుఁడు, విదితమహాబలుండు = ప్రసిద్ధికెక్కిన గొప్ప బలముగలవాఁడు, అండజాతకాంతుండు = పక్షులకుఁ బ్రభువు, గరుటాలమంతుండు=గరుత్మంతుఁడు, గరుడుఁడు, గరుడి, గరుటాలమంతుఁడు, ఇవి రూపాంతరములు, నీరధిన్ = సముద్రమునందు, నీడజ + ఇంద్రుని = పక్షి రాజుయొక్క, పక్షంబులకు = ఱెక్కలకు, జవంబు = వేగము, నిక్కంబు=నిజము.

తాత్పర్యము.

కశ్యప ప్రజాపతికి వినతాదేవియందు జనించినవాఁడును బ్రసిద్ధికెక్కిన గొప్ప బలము గలవాఁడును బక్షిరాజును నగు గరుత్మంతుఁడు సముద్రమందుఁ బాములను బట్టుకొని యెగిరి పరుగెత్తుచుండ నెన్నిమాఱులో చూచితిని. ఆ పక్షిరాజు ఱెక్కల కెంతబలము, వేగము గలవో నీ బాహువులకు నిజముగా నంతగలదు. గాని కొంచెమైనను గొఱఁతపడవు, లోకములో నుండు నందఱికంటెఁ దేజమునందు బుద్ధి బలమునందు ధైర్యమునందు నీవే యధికుఁడవు. నిర్మలమైన మనస్సుగలవాఁడా! నీ శక్తి సామర్థ్యములు నీవేల తెలిసికొనలేవు-దానికిఁ గారణ మో మహాత్మా! యోజింపుము.

—♦ జాంబవంతుఁడు హనుమంతుని జన్మవిధంబుఁ జెప్పుట ♦—

చ. ఇలపయి నంజనాఖ్య జని♦యించెను నచ్చరమిన్న పుంజిక
స్థల యను ఖ్యాతరూప యొక♦శాపముచేతను గీశకాంత యై
యల కపినేతకుంజరున ♦ కాత్మజయై నిజకామితాకృతిన్
గెలివి ధరింప నేర్చునది ♦ కేసరి యన్కపికాంతుపత్నియై. ౧౪౦౬

ఇలపయిన్ = భూమిమీఁద, అంజనాఖ్య = అంజన యను పేరుగలది, అచ్చరమిన్న = అప్సరసలందు శ్రేష్ఠురాలు, = మణిభవము మిన్న—ఖ్యాతరూప = ప్రసిద్ధికెక్కిన సౌందర్యముగలది, కీశకాంతయై = వానరస్త్రీయై, కపినేత = కపిప్రభువు, ఆత్మజ = కూఁతురు, నిజకామితాకృతిన్ = తనకోరిన యాకారమును, గెలివిన్ = సంతోషముతో.

తాత్పర్యము.

అప్సరసలయందు శ్రేష్ఠురాలగు పుంజికస్థల యను నొక ప్రసిద్ధసుందరి యొకానొక శాపముచే వానరస్త్రీయై యంజనాదేవి పేరఁ గుంజరుఁ డను వానరప్రభువునకుఁ గూఁతురై జన్మించి తన కోరినరూపము సంతోషముతో ధరించు నేర్పుగలదై కేసరి యను వానరవల్లభుని భార్య యయ్యెను.

చ. లలితసురూప యౌవనవి♦లాసిని యా కపికాంత యొక్కనాఁ
డెలమిని మానుషాకృతి వ♦హించి విచిత్రమనోజ్ఞభూష యై
కులుకఁగ మాల్యసంచయము ♦ కోమలచారుదుకూలరమ్య యై
జలదనికాశరోచి యగు ♦ శైలతటంబున సంచరింపఁగన్. ౧౪౦౭

లలితసురూప = మనోహరమైన సౌందర్యముగలది, యౌవనవిలాసిని= యౌవనముయొక్క విలాసముగలది, ఎలమిని = సంతోషముతో, మానుషాకృతిన్ = మనుష్య స్వరూపమును, విచిత్ర మనోజ్ఞభూషయై=ఆశ్చర్యకరములు, మనోహరములు నైన యాభరణములు ధరించినదై, కోమల = మృదువైన, చారు = మనోహరమైన, దుకూల = సన్నవస్త్రముచే, రమ్యయై = ఇంపైనదియై, జలదనికాశరోచి = మేఘముతో సమానమైన కాంతిగలది.

తాత్పర్యము.

మనోజ్ఞమైన సౌందర్యము గలదియు యౌవన విలాసము గలదియునై యా వానరస్త్రీ యొకానొక దినమందు సంతోషముతో మనుష్యస్త్రీ స్వరూపము ధరించి యందములై చిత్రములైన యాభరణములచే నలంకరించుకొని మెడయందుఁ బూలదండలు కదలుచుండఁగా మృదువైన సన్నని చీరెఁ గట్టుకొని మేఘవర్ణము గల పర్వత ప్రదేశమునఁ దిరుగుచుండఁగా.

ఉ. ఆ నళినాక్షి రక్తదశ♦మా శుభ పీతదుకూల మప్డు శై
లానిలకారణంబునను ♦ నల్లనఁ బాయుడు నుబ్బుగుబ్బలున్
మానగు వృత్తపీవరస♦మంచితసక్థులు సూక్ష్మమధ్యకాం
తాననముల్ పిఱుందులు శు♦భాకృతియుం గని మోహితాత్ముఁడై. ౧౪౦౮

రక్తదశమా = ఎఱ్ఱని యంచుకొంగుగలది, పీతదుకూలము = పచ్చని చీర, శైలానిల కారణంబునను = పర్వతమందలి వాయువు కారణముగ, అల్లన=మెల్లగా, వృత్త = వట్రువలై, పీవర = బలిసినవై, సమంచిత = ప్రకాశించుననైన, సక్థులు = తొడలు, సూక్ష్మమధ్య = సన్నని నడుము, కాంతాననము=మనోహరమైనముఖము.

తాత్పర్యము.

అప్పుడామె కట్టుకొన్న యెఱ్ఱని యంచుగల పచ్చని దువ్వలువ కొండగాలిచే మెల్లగాఁ దొలఁగిపోఁగా నుబ్బియుండు స్తనములు వట్రువలై బలిసిన తొడలు సన్నని

నడుము అందమైన ముఖము పిఱుదులుగల యందమైన యాకారము గని మోహము గలవాఁడై.

క. మారశరాహతి స్రుక్కి సమీరణుఁ డా సాధ్విఁ బొదివి ♦ మేలిభుజములన్
గూరిమిని గౌఁగిలింపఁగ, సారసదళనేత్ర యనియె ♦ సంభ్రాంతమతిన్. ౧౪౦౯

మారశరాహతిన్ = మన్మథుని బాణముల దెబ్బచే, స్రుక్కి = సోలి, సమీరణుఁడు = వాయుదేవుఁడు, సాధ్విన్ = పతివ్రతను, సంభ్రాంతమతిన్ = భయపడిన మనస్సుగలదై.

తాత్పర్యము.

మన్మథుని బాణములచే స్రుక్కినవాఁడై వాయుదేవుఁ డామెను భుజములచేఁ గట్టుకొని కౌఁగిలింపగా భయపడి యామె యిట్లనియె.

ఉ. ఎవ్వఁడు నా పతివ్రతము ♦ నిర్వ్యూడ నాశముఁ జేయఁ గోరె నా
నవ్విరిఁబోఁణికిం బవనుఁ ♦ డంగన నిపయిఁ జిత్తముంచి నే
నివ్విధిఁ గౌఁగిలించితిని ♦ నింతియ నీ కొక కీడుఁ గూర్పనో
జవ్వని భీతిలన్ వలదు ♦ స్పర్శనుఁడం జుమి నే యశస్విని. ౧౪౧౦

జవ్వని = యౌవనము గలదానా. స్పర్శనుఁడన్ = వాయుదేవుఁడను, యశస్విని = కీర్తిగలదానా.

తాత్పర్యము.

ఎవ్వఁడు నా పాతివ్రత్యమునకు హాని గూర్పఁదలఁచెను, అనఁగా నామెకు వాయుదేవుఁ డిట్లనియె. నీమీఁద మనస్సుఁగలవాఁడనై నేనుఁ గౌగిలించితిని. ఆమాత్రమున నీపాతివ్రత్యమునకు హానిలేదు. నీవు భయపడవలదు. నేను నిన్ను సర్వదా తాఁకుచుండు వాయుదేవుఁడనే, నీకు దీని వలనఁ గీర్తిగలుగును.

కం. ప్లవనంబున లంఘనమున, నవలా! మత్సముఁడు నీకు ♦ నందనుఁడు మహా
జవనుఁడు పరాక్రమాఢ్యుం, డవితథసత్త్వుండు ప్రాజ్ఞుఁ డంగన కలుగున్. ౧౪౧౧

ప్లవనంబునన్ = ఈఁదుటయందు, లంఘనమునన్ = దాఁటుటయందు, నవలా = ఓయంగనా, మత్సముఁడు = నాతో సమానుఁడు, మహాజవనుఁడు = మిగుల వేగముగలవాఁడు, పరాక్రమాఢ్యుఁడు = పరాక్రమ సంపదగలవాఁడు, అవితథసత్త్వుండు = వ్యర్థముగాని బలముగలవాఁడు, ప్రాజ్ఞుఁడు = బుద్ధిమంతుఁడు.

తాత్పర్యము.

ఈఁదుటయందు దాఁటుటయందు నాతో సమానుఁ డగు కొడుకు మిగుల వేగము పరాక్రమము వ్యర్థముగాని బలము బుద్ధిగలవాఁ డుదయించును.

కం. అనవుడు నీ జనయిత్రియు, మనమున ముద మంది యేగి ♦ మహీధరగుహాలోఁ
గనియె న్నినుఁ బ్లవగోత్తము! ననుపమయశ! నీవు నుదయ ♦ దర్కుని వనిలోన్.

తాత్పర్యము.

అని చెప్పఁగా నీ తల్లి మనస్సులో సంతోషించి పోయి యొక కొండగుహలో వానరశ్రేష్ఠుఁడ వగు నిన్నుఁ గనెను. అసమాన కీర్తి గలవాఁడా! నీ వా యడవిలో నుదయించుచున్న సూర్యుని.

చం. కనుఁగొని యొక్కనాఁడు ఫల ♦ కాంక్ష దివంబున కుద్గమించి యో
జనములు మూఁడునూర్లు చని ♦ చండకరాతపతప్తదేహి వై
నను మది నైనఁ గుందక ది♦నప్రభు డాయఁగవచ్చు నీపయిన్
ఘనతరకోప మూని శచి♦కాంతుఁడు వజ్రమువైచె ఁ జివ్వనన్. ౧౪౧౩

దివంబునకున్ = ఆకాశమునకు, ఉద్గమించి = ఎగిరి, చండకర = సూర్యుని యొక్క, ఆతప = ఎండచే, తప్తదేహివైనను=తపించిన దేహము గలవాఁడవైనను.

తాత్పర్యము.

చూచి యొక్కదినఁబునఁ బండను కోరికచే నాకాశంబున కెగిరి మూఁడు నూర్ల యోజనములు పోఁగా సూర్యుని కిరణముల వేఁడిమికి దేహము తపించినను లక్ష్యముసేయక సూర్యుని సమీపించి రాఁగా నింద్రుఁడు మిగులఁ గోపించి నీమీఁద జివ్వన వజ్రాయుధమును బ్రయోగించెను.

కం. ఆమహితవజ్రహతి నీ, వామహనువు భగ్న మగుట ♦ వఱలెను నీకున్
భూమిని హనుమంతుం డను, నామము నీపాటు గని ఘ♦నం బగు కినుకన్. ౧౪౧౪

మహిత వజ్రహతి = ఆ గొప్ప వజ్రము దెబ్బచే, వామహనువు = ఎడమ చెంప, భగ్నము = గాయపడినది, కినుకన్ = కోపముచే.

తాత్పర్యము.

ఆ గొప్ప వజ్రాయుధము దెబ్బచే నీ యెడమచెంప గాయపడఁగా నీకు హనుమంతుఁడను నామము గలిగెను. నీకుఁగలిగిన బాధ చూచి కోపముచే.

కం. ఇంచుకయు జగత్ప్రాణుఁడు, సంచారము గొనక యుండె ♦ జగములు మూఁడున్
సంచలిత మయ్యె వేగో,దంచితగతి వచ్చి సురలు ♦ వ్యాకులమతులై ౧౪౧౫

ఇంచుకయు = కొంచెమైనను, జగత్ప్రాణుఁడు = వాయుదేవుఁడు.

తాత్పర్యము.

వాయుదేవుఁడు కొంచెమైనను సంచరింపక స్తంభించి యుండెను. అప్పుడు లోకములు మూఁడు గడగడలాడెను. దేవతలు కలఁత చెంది త్వరగా వచ్చి,

చం. కినిసిన గాడ్పుఁ దేర్చుదును ♦ గీశవరా! నినుఁ గాంచి నీరజా
సనుఁడు వరం బొసంగె దయ ♦ శస్త్రములన్ మృతిలేక యుండ, వ
జ్రనిహతి నీవు నొవ్వమికి ♦ సంతస మంది మృతిస్వతంత్రతన్
గనికరమార నిచ్చె వెయి♦గన్నులవేలుపు ఱేఁడు పావనీ! ౧౪౧౬

తేర్చుడును = సమాధాన పఱుపఁగా, నీరజాసనుఁడు= బ్రహ్మ, నొవ్వమికి = నొప్పి చెందక యుండుటకు, మృతిస్వతంత్రతః = స్వచ్ఛందమరణము, కోరినపుడు మరణము కలుగుట, కనికరము = దయ, వెయి గన్నుల వేలుపుతేఁడు = ఇంద్రుఁడు.

తా త్ప ర్య ము .

కోపించిన వాయుదేవుని సమాధాన పఱుపఁగా వానరేంద్రా! నిన్నుఁ జూచి బ్రహ్మదేవుఁడు శస్త్రములచేత మరణము లేకుండ వరమిచ్చెను. ఇంద్రుఁడు నీవు కోరిన గాని నీకు మరణము రాకుండ వరమిచ్చెను.

తే. కేసరికి భీమవిక్రమా! ♦ క్షేత్రజుఁడవు, మారుతున కౌరసుండవు ♦ మహిత తేజ
మునను బ్లవనంబునను సరి♦పోలు దీవు, కన్నతండ్రికి నాయనా! ♦ కల్ల గాదు.

క్షేత్రజుఁడవు = భార్యయందుఁ బుట్టినవాఁడవు, తన భార్యయం దితరునకు జనించిన కొడుకు క్షేత్రజుఁడు, మారుతునకుః = వాయుదేవునకు, ఔరసుఁడవు = సొంతకొడుకవు, ప్లవనంబునను = దాఁటుటయందు, కల్ల = యసత్యము.

తా త్ప ర్య ము ·

నీవు కేసరికి క్షేత్రజుఁడవు, వాయుదేవున కౌరసుడవు, కావున గొప్ప తేజస్సుచే దాఁటులువేయుటయందు నీతండ్రియగు వాయుదేవునకు సరిపత్తువు. నాయనా! యిది యసత్యము గాదు.

ఉ. పోయెడి మాకుఁ బ్రాణములు ♦ పుణ్యమతీ! మముఁ గావ వయ్య ధై
ర్యాయతదార్ఢ్యవిక్రమము♦లందు ఖగేంద్రుని మాఱుమూర్తి వీ
వీ యచలాళికాననస♦మేతధరిత్రిఁ ద్రివిక్రమాకృతిః
వాయుజ! యిర్వదొక్కపరి ♦ వచ్చితిఁ జుమ్ము ప్రదక్షిణంబుగన్. ౧౪౧

ధైర్య+ఆయత+దార్ఢ్య+విక్రమములందుః = ధైర్యమునందును, విస్తార కార్యసాధక సామర్థ్యమునందును బరాక్రమము నందును, ఖగేంద్రుని మాఱు మూర్తి = రెండవ గరుత్మంతుఁడవు, అచలాళి = కొండలతోను, కానన= అడవుల తోను, సమేత = కూడిన, ధరిత్రిః = భూమిని.

తా త్ప ర్య ము .

నాయనా! మాకుఁ బ్రాణములు పోవుచున్నవి. పుణ్యాత్ముఁడా! మాకుఁ బ్రాణదానము చేసి రక్షింపుము. నీ వీ సమయంబున రక్షింప కుండిన మేమందఱము చచ్చిన వారమే, మేమే కాదు, మేము చచ్చినవార్త విని కిష్కింధ యందలి యందఱు జచ్చినవారే, రామ లక్ష్మణులు చచ్చినవారే, వారి నిమిత్తమున నయోధ్యయందలి వారు చచ్చినవారే,ఇందఱ ప్రాణములు నీయఱచేతిలో నున్నవి. నీవు ధైర్యమునందుఁ గార్యసాధక సామర్థ్యమునందు రెండవ గరుత్మంతుఁడవు. కొండ లడవులతోఁ గూడిన యీ భూమండల మంతయుఁ ద్రివిక్రమావతార సమయంబున నిరువదియొక్క మాఱు ప్రదక్షిణముగాఁ దిరిగితిని.

(౧) బ్రహ్మాండములో భాగమున బ్రహ్మాండములో భాగమునందే యీభాగమునంతయుఁ బ్రదక్షిణించి వచ్చితినని భా (౨) ధరిత్రి బరిపాలించెడి భూమియైనను జెప్పవచ్చును. అప్పుడు దీనికి వెలుపలినుండి దీనిని బ్రదక్షిణించితి నని భావము. (3) త్రివిక్రమమూర్తి లోకమును గొలిచిన పిదప నాయన విజయముఁ జాటించుటకై జాంబవంతుఁడు పంపఁబడినపుడు భూమినంతయు నతఁడు ప్రదక్షిణించె ననియైనఁ జెప్పవచ్చును.

క. అమృతంబుఁ దఱచు వేళను, నమరులశాసనముచే మ♦హౌషధిలతలన్
సమకూర్చితి నాతీఁగెల, నమృతం బుదయించెఁ జుమ్మ ♦ యమితప్రజ్ఞా. ౧౪౧

తా త్ప ర్య ము,

సముద్రము చిలికిన సమయమున దేవతల యాజ్ఞా ప్రకారము మహౌషధుల తీఁగలను నేను బోగ్రుచేసితిని, ఆ తీఁగలయం దమృత ముదయించెను.

తే. కలిగె నా కప్పు డసమాన♦బలము జవము, పోయె నా కాల మెల్లను ♦ బుణ్యశీల
వృద్ధుఁడను మఱి పరిహీన♦విక్రముఁడను, నిప్పు డీ స్థితిఁ జింతింప ♦ నేమిఫలము?

తా త్ప ర్య ము.

అప్పుడు నా కసమానమైన బలము వేగముండెను. నాకాలమంతయు సమసెను. ఇప్పుడు ముసలివాఁడను, పరాక్రమ హీనుఁడను, ఇట్లుంటిని. ఏమి విచారపడి యేమి ప్రయోజనము.

ఉ. ఈ వన సర్వసద్గుణస♦మేతుఁడ వో ప్లవగాగ్రణీ ! ధరన్
లావున దూరలంఘనక♦లావిభవంబున నీవ మేటివిన్
నీవలె నేగ నేదియును ♦ నేరదు భూతచయంబులందు; నే
దీ వెస నీ విజృంభణము♦నేపును జూపఁగదయ్య మారుతీ. ౧౪౨౧

సర్వసద్గుణ సమేతుఁడవు = సమస్తములైన మంచిగుణములతోఁ గూడిన వాఁడవు, లావునన్=బలమునందు, దూరలంఘన= దవ్వుదాఁటుట యనెడి; కలా విభవంబునన్ = విద్యాసమృద్ధియందు.

తా త్ప ర్య ము.

నామాట యటుండనిమ్ము, నీవో యిప్పుడు సమస్త సద్గుణములు గలవాఁడవు, భూమియందుఁ గలవారిలో బలమునందు దూరము దాఁటు విద్యయందు నీవే గొప్ప వాఁడవు. నిన్నుమించినవాఁడు లేఁడు. ప్రాణికోటియందు నీవలె నేదియుఁ బోలేదు. ఏదీ నీ విజృంభణము పరాక్రమము చూపుము. మా హనుమంతుఁ డింతటి వాఁడు గదా యని ప్రత్యక్షముగఁ జూచి సంతోషించెదము.

క. లెమ్మా హరిశార్దూలా, యిమ్మహితార్ణవము దాఁటు ♦ మీ ప్లవగాళీ
కమ్మలు యుష్మజ్జవవీ,ర్యమ్ములఁ గనుఁగొనెదునాసఁ ♦ గ్రాలెడి ననఘా. ౧౪౨౨

హరి శార్దూలా= వానరశ్రేష్ఠా, సింహము, వృషభము శార్దూలము నాగము లోనగు నవి యుత్తరపదములైనపుడు శ్రేష్ఠమను నర్థమును లుపును. మహార్ణవము = గొప్పసముద్రము, ప్లవగానీకమ్ములు = వానరసేనలు, యుష్మత్ = నీ యొక్క, జవవీర్యమ్ములు=వేగము, బలము, లెమ్మా హరి శార్దూలాయిమ్మహార్ణవము దాఁటుమీ యను వాక్యమునకు మూలమైన "ఉత్తిష్ఠ హరి శార్దూల లంఘయస్వ మహార్ణవ"మ్మను వ్యాకమును నాధారము చేసికొని రామాయణమహార్ణవము నీ గ్రంథకర్త దాఁటఁగలిగెను. చూడుము బాల, కాండము పద్యము ౮౭.

తాత్పర్యము.

వానరోత్తమా! లెమ్ము, ఈ సముద్రమును నీవుదాఁటుము, ఈ వానరసేనలు నీవేగము నీపరాక్రమము చూడ నాశపడియున్నారు. వీరి కోరికఁ దీర్పుము.

క. మున్ను త్రివిక్రముపోలిక, సన్నుత మగు నీదుశక్తి ♦ సరిలముఁ జూపన్
గన్నారఁ జూడఁ గోరెద, రన్నా కపివరు లుపేక్ష ♦ యర్హామె యనుచున్.౧౪౨౩

తాత్పర్యము.

పూర్వము త్రివిక్రముఁడు తనశక్తి చూపఁగాఁ జూచినట్లు నేఁడు నీశక్తి చూపఁగా జూడ వానరులు కోరికగలవారైయున్నారు. నీ వుపేక్షించుట తగునా?

క. ఋక్షధవుఁడు పెరరేపఁగ, నాక్షణమున హనుమ రేఁగి ♦ హరిసైన్యమ్ముల్
వీక్షింపఁగ హర్షంబున, నక్షయముగఁ దనదు రూప ♦ మప్పుడు పెంచెన్.౧౪౨౪

ఋక్షధవుఁడు = భల్లూకపతి, పెరరేపఁగన్ = ప్రేరింపఁగా, రేఁగి = విజృంభించి, అక్షయముగన్ = అభివృద్ధి చెందునట్లు.

తాత్పర్యము.

జాంబవంతుఁ డిట్లు ప్రేరింపఁగా నాక్షణమందే హనుమంతుఁడు విజృంభించి వానరులు సంతోషముతోఁ జూచుచుండఁ దన దేహముఁ బెంచెను.

—♦ ౬౭-వ సర్గము. జాంబవంతునివాక్యంబుల హనుమంతుఁడు విజృంభించుట. ♦—

చ. అలవున నూఱుయోజనము ♦ లంబుధి దాఁట విజృంభమాణుఁడై
చెలఁగు పరాక్రమాభ్యుదయు♦ సిద్ధుఁ బ్రసిద్ధుఁ బ్లవంగనాథుఁ గీ
శులు గని తత్క్షణంబ తమ♦శోకము వీడి ప్రహృష్టచిత్తులై
కలకలనాదముల్ నినిచి ♦ గంధవహాత్మజు సంస్తుతించుచున్. ౧౪౨౫

అలవునన్ = బలముచే, విజృంభమాణుఁడై = విజృంభించు చున్నవాఁడై, ప్రహృష్టచిత్తులై = మిగుల సంతోషించిన మనస్సుగలవారై, నినిచి = నిండించి, గంధవహాత్మజున్ = వాయుకుమారుని.

**తాత్పర్యము.**

నూఱామడ వెడల్పుగల సముద్రమును దాఁటుటకై బలము పెంపున విజృంభించుచున్న పరాక్రమ వృద్ధియందు సిద్ధుఁడైన ప్రసిద్ధుని వానరనాథుని వానరులు చూచి తమ శోకము వదలి సంతోషించి కిలకిల మను చప్పుడు నిండించి యాంజనేయునిఁ బొగడుచు.

ఉ. జే యని మున్ ద్రివిక్రముని♦చెల్వు వహించి యెసంగినట్టి నా
రాయణు లోకు లెల్లఁ గని♦నట్టులు వానరు లెల్ల విస్మయా
మేయముదంబులం గన స♦మీరసుతుండును మేను పెంచి య
త్యాయతసంప్రవర్ధితబ♦లాఢ్యత నల్లల నార్చె వాలమున్. ౧౪ ౨౬

జే = జయ, నారాయణుఁడు రూ. నరాయణుఁడు, నారాయణ నరాయణౌ అని ద్విరూపకోశము, విష్ణువు, విస్మయామేయముదంబులన్=ఆశ్చర్యముచేఁ గలిగిన కొలఁది చెప్పరాని సంతోషముచే, అత్యాయత = మిగుల విస్తారమైన, సంప్రవర్ధిత= మిగుల వృద్ధి చేయఁబడిన. బలాఢ్యతన్ = బలసంపత్తిచే, ఆర్చెన్ = ఆడించెను, రెండవ పాదంబున నుభయ యతి.

ఉ. పాయక పాకశాసనికి ♦ భారత ఘోరరణంబు నందు నా
రాయణునట్లు దానును ధ♦రామరవంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధు♦రంధరుఁడుం దనకిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడు నైనవాఁ డభిమ,తంబుగఁదోడయి నిర్వహింపఁగన్. భార. ఆది.

**తాత్పర్యము.**

జేయని పూర్వము త్రివిక్రముని విధమునఁ గాంతి వహించినట్టి నారాయణు లోకు లందఱుఁ జూచినట్లు వానరులందరు మితిమీరిన యాశ్చర్యముచే జూచు చుండఁగా నాంజనేయుఁడు దేహముపెంచి విస్తారబలసంపన్నుఁడై తోఁక జాడించి యాడించెను.

క. గిరిగహ్వరవర్ధితకే,సరిఁ బోలి ప్రభంజనాత్మ♦జాతుఁడు రేఁగన్
హరివరనుతుఁడై తేజో,విరళం బగురూపమునను♦ వెలయఁగఁ జొచ్చెన్. ౧౪ ౨౭

గిరి గహ్వరవర్ధిత కేసరి=కొండగుహయందుఁ బెరిగిన సింహము, కొండగుహ యందు దేహము ముడుఁచుకొని పండుకొని యుండినసింహము ఆహారనిమిత్తము వెలుపలఁ బోవునపుడు దేహము దీర్ఘము చేసినట్లు, ప్రభంజన + ఆత్మజాతుఁడు = వాయుకుమారుఁడు, రేఁగన్ = విజృంభింపగా, హరివరనుతుఁడై =వానరశ్రేష్ఠులచేఁ బొగడఁ బడినవాఁడై తేజస్+అవిరళంబు=తేజస్సు దట్టమైన.

**తాత్పర్యము.**

కొండగుహయందలి సింహమువలె నాంజనేయుఁడు దేహముపెంచి విజృంభిం

పఁగా వానరశ్రేష్ఠులు మేలు మేలని పొగడ దట్టమైన కాంతిచే నొప్పు నాకారమునఁ బ్రకాశించెను.

క. అప్పుడు పవనజువదనం, బొప్పెను నెట్టగను గ్రాఁగి ♦ యుండెడు పెనమున్
దెప్పుచుఁ గణకణ మని పొగ, కప్పని నిప్పుకలకుప్ప♦కాంతి రహింపన్. ౧౮౨౭

తా త్ప ర్య ము.

ఆసమయమున నాంజనేయునిముఖ మెట్టగఁ గాలిన పెనమో పొగలేక కణకణ మను నిప్పుల కుప్పయో యనునట్లుండెను.

ఉ. గగ్గురుపాటు మేనఁ జెలఁ♦గం గపిమధ్యమునుండి లేచి తా
దిగ్గున వృద్ధకీశులకు ♦ ధీరుఁడు మ్రొక్కి వచించె వీర్యస
మ్యగ్గతిఁ బర్వతాగ్రముల ♦ నైనను జిమ్ము నమేయశౌర్యభా
క్ఖగ్గగనప్రచారుఁడు హు♦తాశనమిత్త్రుఁడు శీఘ్రగామియున్. ౧౮౨౮

వృద్ధకీశులకున్ = పెద్దలగు వానరులకు, ధీరుఁడు మ్రొక్కియనుటచేఁ దానెంత సమర్థుఁడైనను గార్యార్థమై బయట పోవునపుడు పెద్దవారికి మ్రొక్కవలయు నని సూచన. వీర్య, సమ్యక్ గతి = వీర్యముచే నిండినగమనముచే, చిమ్ము = ఎగురఁ గొట్టు, అమేయ శౌర్యభాక్ =మితిమించిన శౌర్యముగలవాఁడు. గగన ప్రచారుఁడు= ఆకాశమున సంచరించువాఁడు. ఇవి వీని తరువాత వచ్చునవి ౧౮౩౦ లోని ప్రభంజను శబ్దమునకు విశేషణములు, హుతాశన మిత్త్రుఁడు = అగ్నిహోత్రుని స్నేహితుఁడు, శీఘ్రగామి = త్వరగాఁబోవువాఁడు.

తా త్ప ర్య ము.

దేహమునందు వెండ్రుకలు నిక్కపొడువఁగా వానరులనడుమ నుండి లేచి వానరులందుఁ బెద్దవారి కెల్ల నమస్కరించి వీర్యముతో నిండిన విధముగఁ గొండల నైనను జిమ్మునట్టి మితిమీఱిన శౌర్యము గలట్టియు నాకాశమున సంచరించునట్టియు నగ్నిహోత్రునకు మిత్త్రుఁడై నట్టియు వేగముగఁ బోఁగలట్టియు.

— ♦ హనుమంతుఁడు కపులతోఁ దన పరాక్రమంబుఁ దెల్పుట. ♦ —

ఆ. ప్రబలవేగుఁ డగు ప్ర♦భంజనునౌరస,పుత్త్రకుండు ప్లవన♦భూరికర్మ
మునను నాకు సములు ♦ గనరారు జగముల, నీడు వత్తుఁ దండ్రి♦తోడ వినుఁడు.

ప్రబల వేగుఁడు = మిక్కిలి బలమైన వేగము గలవాఁడు నగు, ప్రభంజను= వాయువు యొక్క, ప్లవన భూరికర్మమునను = దాఁటుట యను గొప్ప కార్యమునందు, వాయువునకు నీవిశేషణములఁ జెప్పుటచేఁ గారణ గుణము కార్యమందు సంక్రమించు నను న్యాయ ప్రకారముగ నిన్నిగుణము లితని కొడుకునందును గలవని తెలుపుటకే, ఎట్లన నాంజనేయుఁడు కూడ నమేయశౌర్యభాక్కనియు నాకాశమునఁ బోఁగల వాఁడనియు హుతాశనుతో సమానమైన తేజస్సు గలవాఁడై శత్రువుల దహింపఁ

గలవాఁడనియు వేగముగఁ బోగలవాఁడనియు మిగుల బలముతోఁ గూడిన వేగము గలవాఁడనియు నేర్పడు చున్నది.

తా త్ప ర్య ము.

బలిష్ఠమైన వేగము గల వాయుదేవునియొక్క కుమారుఁ డిట్లనియెను. దాఁటుట యను గొప్ప కార్యమునందు లోకములో నాకు సములు లేరు. నా తండ్రికి నేను సముఁడను.

సీ. వత్తునా వేమాఱు ♦ హత్తి మి న్నొరసెడి, తపనీయగిరికిఁ బ్ర♦దక్షిణంబు
ముంతునా సహ్రద♦కాంతారగిరియు క్త, భువిఁ గరోత్థాంబుధి♦పుష్కరములఁ
జిమ్ముదునా మింటి ♦ కెమ్మెగా నక్రియు,క్వనధి జంఘోరుజ♦వంబుగరిమ
వలగొందునా మింటఁ ♦ బఱచు ఖగాధిపు, వినతాతనూజుని ♦ వేయిమాఱు

తే. లుదయదర్కుని నిటనుండి ♦ కదిసికూడఁ, బాఱి యపరాద్రిఁ జేరి యా♦భాస్కరుండు
గ్రుంకకయమున్న యెదురేగి♦కూడువాఁడ,మండు చుండెడి మార్తండ♦మండలంబు.

మిన్ను+ఒరసెడి = ఆకాశముతో రాచుకొను, తపనీయగిరికిఁ = మేరు పర్వతమునకు, సహ్రద = మడుఁగులతోఁ గూడిన, కాంతారగిరియుక్త = అడవులతోను గొండలతోను గూడిన, భువిఁ= భూమిని, కరోత్థాంబుధి పుష్కరములఁ = చేతితో నెగురఁ గొట్టఁబడిన సముద్రపు నీళ్లచే, నక్రియుక్+వనధి = మొసళ్లతోఁ గూడిన సముద్రము, జంఘ+ఉరుజవంబు గరిమఁ = పిక్కల గొప్పవేగము యొక్క యతిశయముచే, వలగొందునా=ప్రదక్షిణింతునా, ఖగాధిపు = పక్షిరాజు, గరుత్మంతుని, ఉదయదర్కునిఁ = పుట్టుచున్న సూర్యుని, అపరాద్రిఁ = పడమటికొండను.

తా త్ప ర్య ము.

మేరు పర్వతమునకు వెయ్యి మార్లు ప్రదక్షిణముచేసి వత్తునా, సముద్రము లోని నీళ్ళు చేతులతో నెగఁజల్లి కొండలతో నడవులతో మడుఁగులతో నిండిన భూమిని ముంచివేయుదునా ? నేను బోవునపుడు నాపిక్కలవలనఁ గలిగిన వాయువు చేత మొసళ్ళతోఁగూడిన సముద్రమును నాకాశమున కెగఁజిమ్ముదునా ! ఆకాశమున వేగముగఁ బాఱుచున్న గరుత్మంతుని వేయిమార్లు ప్రదక్షిణింతునా ? ఇక్కడనుండి యెగసిపోయి పుట్టుచున్న సూర్యుని సమీపించి యాయన పడమటికొండ చేరులోపల నేను బడమటికొండకుఁ బోయి యాయన నడిమింట నుండఁగా నెదురుగా రాఁగలను.

తే. అచటనుండియు ధారణి ♦ నంటకుండ, వెండి యిచటికి రా నేర్తు ♦ వేగమునను
గగనగోచరముల నెల్లఁ ♦ గడిమిమెఱసి, దాఁటిపోవంగ నేర్తు ను♦త్సాహమునను.

తా త్ప ర్య ము .

అక్కడినుండి భూమిమీఁద దిగకుండ నిచటికి రాఁగలను. నా బలవేగముచే నాకాశమున సంచరించు వానినెల్ల దాఁటి పోఁగలను.

ఉ. ఇంతలు తున్కలై చెడఁగ ♦ నీయిలఁ జీల్తునొ, సాగరంబు నెం
డింతునొ, పర్వతంబులను ♦ నెట్టన చేతులఁ బిండి పిండిగా
దంతునొ, నూరువేగమున ♦ దారుణనీరధి నాదువెంట ర
ప్పింతునొ, యేమి యెంచితిరి ♦ భీషణకాయుని నాంజనేయునిన్. ౧౪౩౩

ఇంతలు=వ్రేలితోఁజూపి చెప్పిన మాట, అత్యల్పములు. ఇది యభినయముచే సందర్భానుసారముగఁ దెలియ నగును. "ఇంతలు కన్నులుండఁ దెరు వెవ్వరి వేఁడెదు" అన్న మనుచరిత్రప్రయోగమందుఁ జేరెఁ డని యర్థము.

తా త్ప ర్య ము .

నూవుగింజలంత తునుక లగునట్లు భూమిని జీల్తునా? సముద్రము నెండఁజేయుదునా? పర్వతంబులను జేతులతోనే పిండిపిండిగా దంతునా? తొడల వేగముచే భయంకరమైన సముద్రమును నా వెంట వచ్చునట్లు చేయుదునా? భయంకరమైన దేహము గల యాంజనేయుని నేమని తలంచితిరి? మనవంటి బక్క క్రోఁతియే యని యెంచితిరా?

ఉ. జివ్వునఁ గ్రీడపోలికఁ నె♦ఱ్ఱిఁ దివి నేగ లతాకుజంబులన్
బువ్వులు చివ్వున న్నెగసి ♦ పోణిమి నావెనువెంట వచ్చుచో
నవ్వినువీదిఁ దారకస♦మాయతమార్గమునట్లు దోచెడున్
దవ్వునఁ జూచుచూపఱకుఁ ♦ దథ్యము నా చను మార్గ మంతయున్. ౧౪౩౪

క్రీడపోలికన్ = ఆటవలె, లతాకుజంబులన్ = తీఁగలయందు, చెట్లయందు, నెగసి, ఎగసి రెండు రూపములు గలవు. "నీటిలోని నుండి నెగయుఁదెంచె" భార.ఆది. తారకసమాయత మార్గము = నక్షత్రములచే దీర్ఘమైన మార్గము, చూపఱకున్ = చూచువారికి.

తా త్ప ర్య ము.

జివ్వున నాటలోఁ దిరిగినట్లు చక్కగా నాకాశమునఁ బోఁగాఁ దీఁగలయందుఁ జెట్ల యందు నుండిన పువ్వులా వేగముచేఁ దటాలున నెగసి నావెనువెంట వచ్చునపుడు నేను బోవుమార్గము నక్షత్రములతో దీర్ఘమైన యాకాశమువలె జూచు వారికిఁ గానవచ్చుచుండును.

క. పై కెగయుచుఁ గ్రిందికి దిగు, చాకాశంబునను వేగ ♦ మరిగెడి నన్నున్
వీకాశంబుగ భూతా,నీకంబులు చూడఁ గలవు ♦ నివ్వెరగొనుచున్. ౧౪౩౫

వీకాశంబుగన్ = స్పష్టముగ.

తా త్ప ర్య ము.

ఆకాశమునందుఁ బై కెగయుచుఁ గ్రిందికి దిగుచు నేను బోవునపుడు ప్రాణికోటులన్నియు నాశ్చర్యముతో స్పష్టముగ నన్నుఁ జూడఁ గలవు.

క. ఆకాశమున మహాంబుద, నీకాశుఁడ నగుచుఁ గప్పి ♦ నింగిని మ్రింగన్
జేకొన్నరీతిఁ జనఁగ వ,నౌకోవరులార! కనెద ♦ రయ్యా నన్నున్. ౧౪౩౬

మహాంబుద సంకాశుఁడను = మహామేఘముతో సమానుఁడను, కప్పి = ఆవరించి, నింగిని = ఆకాశమును, చేకొన్నరీతిన్ = ప్రియత్నించు విధముగా, వనౌకోవరులార = వానర శ్రేష్ఠులారా.

తాత్పర్యము.

పెద్దమేఘ మాకాశమును గప్పినట్లు మేఘమునంత శరీరము గలవాఁడనై యాకాశము నావరించి దానిని మ్రింగువానివలెఁ బోఁగా వానర వరులారా! మీరే చూడఁగలరు.

క. నడికించుచుఁ బర్వతముల, నుడికించుచు సాగరంబు ♦ నుద్దవిడిన్ నే
నడఁగించుచు మేఘంబుల, గడలిని దరియింతుఁ గనుఁడు ♦ కపిసింహంబుల్.

నడికించుచున్ = వడఁకునట్లుచేయుచు, ఉడికించుచున్ = ఉడుకునట్లు చేయుచు. కపిసింహంబుల్ = కపిసింహములారా.

తాత్పర్యము.

పర్వతములను గడగడవడఁకఁజేయుచు సముద్రజలముల సలసల మని యుడుకఁజేయుచు మహావేగమున మేఘముల నడఁగఁగొట్టుచు వానరులారా! నేను సముద్రమును దాఁటెదను, మీరు చూచుచుండుఁడు.

క. బలమున వేగమున మహా,బలునకు వినతాత్మజునకుఁ ♦ బాటిగ వత్తున్
గల రే నాబడి రా గు,వ్వలతేఁడును గాడ్పు దక్కఁ ♦ బరు లెవ రేనిన్. ౧౪౩౮

తాత్పర్యము.

బలమునందు వేగమునందు వాయువునకు గరుత్మంతునకు సమానుఁడ నగుదును. నా వెంబడి పక్షిరాజగు గరుత్మంతుఁడు వాయువుదక్క మఱియెవ్వరు రాలేరు.

తే. మెఱుఁగు మెఱసిన రీతి ని♦మేషమాత్ర, నంబరంబున కెగిరి యా♦లంబ మేది
కడలి దాఁటఁ ద్రివిక్రమా♦కారుఁ డైన, విష్ణుభంగిని గ్రాలెద ♦ విస్మయముగ.

అంబరమునకు = ఆకాశమునకు, ఆలంబమేది = ఆధారములేక, కడలిన్ = సముద్రమును.

తాత్పర్యము.

మెఱుఁగు తళుక్కని మెఱిసినట్లు నేను నిమిషమున నాకాశమున కెగిరి నిరాధారముగ సముద్రము దాఁటునపుడు త్రివిక్రమావతారుఁడైన విష్ణువువలెఁ బ్రకాశింతును.

క. వీడుఁడు చింతల ముదముం, గూడుఁడు ప్లవగేంద్రులార! ♦ కోమలిఁ గాంతున్
వీడని బుద్ధిబలంబునఁ, గీడొదవదు మనసుచేష్ట ♦ కెరలెడి నట్టుల్. ౧౪౪౦

తాత్పర్యము.

సీతాదేవిని జూడలేక పోయితిమే యను వ్యసనము వదలిపెట్టుఁడు. సంతోషము గొనుఁడు, వానరులారా! సీతాదేవిని నేను దప్పక నాబుద్ధి బలముచేఁ జూచి వచ్చె

దను. అపాయములేదు. నా యంతఃకరణ మిట్టు లుత్సాహ పూరితమై యున్నది. ఈ కార్యమగునా కాదా? ఇది సరియా తప్పా యని సందేహము తోఁచినపుడు చిత్తశుద్ధిగలవారికి నంతఃకరణమే ప్రమాణము. అంతఃకరణము నిర్మలమై యుత్సాహ పూరితమై కార్యమగునని చెప్పినా యది తప్పక యగును.

"సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః" శాకుంతలము

చ. అనిలశకుంతనాయక సమాధికవేగము పేర్మి వేయి యో
జనముల నైన దాఁటగను జాలెద నంచుఁ దలంచెదన్ స్వయం
భుని పరమేష్ఠి హస్తమునఁ బొల్చినయోని సవజ్రిఁడైన యిం
ద్రుని కరమందు నున్న సుధ దోర్బలశక్తి హరించి తెచ్చెదన్. ౧౪౪౧

అనిల = వాయువుయొక్కయు, శకుంతనాయక = పక్షులకుఁ బ్రభువైన గరుత్మంతునియొక్కయు, సమాధికవేగము పేర్మిన్ = మిగుల నధికమైన వేగాతిశయముచే, స్వయంభుని = జననీ జనక సంయోగములేకయే పుట్టినవాఁడగు, పరమేష్ఠి = బ్రహ్మయొక్క, హస్తమునన్ = చేతియందు, సవజ్రిఁడైన = వజ్రముతోఁ గూడినవాఁడగు, సుధన్ = అమృతమును, దోర్బలశక్తి = భుజబలసామర్థ్యముచే.

తాత్పర్యము.

వాయువేగ గరుడవేగములకంటె నధికమైన వేగముతో వేయియోజనము లైనను దాఁటఁ గలనని తలంచుచున్నాను. ఇఁక నూఱు యోజనము లేమిలెక్క? స్వయంభువైన బ్రహ్మయు, వజ్రాయుధము ధరించిన యింద్రునియొక్కయుఁ జేతిలో నుండు నమృతమునైన నాభుజబలముచే బలాత్కారముగఁ దేఁగలను.

క. లంకను బాఁ తగలఁగ నక,లంకగతిం బెకిలి వెంట లాగుకొని చనన్
బింకమున నేర్తు నని ని,శ్శంకంబుగఁ దోఁచెఁ బ్లవగసత్తములారా! ౧౪౪౨

పాఁతు+అగలఁగన్ = పునాది (అస్తిభారము) పెల్లగిల్లునట్లు.

తాత్పర్యము.

పునాదితో లంకను బెకలికూడ నీడ్చుకొని పౌరుషముచే రాఁగల నని సందేహము లేకుండఁ దోఁచుచున్నది.

ఈవాక్యము లాత్మస్తుతిగాదా, అహంకారముచే దంభమునకై తన్నుఁ దాను బొగడుకొనరాదు గాని, కార్యార్థమై శత్రువులను భయపెట్టుటకో మిత్రుల కుత్సాహము కలిగించుటకో చెప్పు మాటలయం దాత్మశ్లాఘా దోషములేదు.

ఈ మాటలవలన దీనులైన వానరుల కుత్సాహము గలిగె నని ౧౪౦౨ పద్యము వానరుల స్థితిఁ దెలుపుచున్నది. ౧౪౪౩వ పద్యము నందలి వనచారుల్ ముదావాప్తిం జెలంగన్ అను వాక్యము 'బంధుజనశోకం బార్చి తా' నను పదము హనుమంతుని మాటల వారు సంతోషించుట తెలుపుచున్నవి. ఈ ధైర్యోక్తులు చెప్పుట బాగో యేమో జాంబవంతుఁడు చెప్పినాఁడు. నేను బోయెదను, నావలన నేమి

కాఁగలదు, అని దీనోక్తులఁ గన్నీరు కార్చుచుఁ బోవుట బాగో పురోభాగు లాలో చింతురుగాక.

మ. అని గర్జించెడి భూరితేజుఁ బ్లవగా♦ధ్యక్షుఁ న్నిరీక్షించి య
వ్వనచారుల్ కడు విస్మయంబున ముదా♦వాప్తిం జెలంగన్ మరు
త్తనయుం గన్గొని జాంబవంతుఁడు జగ♦త్ప్రాణాత్మజా! వీరలో
కనుతా! కేసరిపుత్ర! బంధుజన శో♦కం బార్చితే నాయనా! ౧౪౪౩

గర్జించెడి = ఘోషించుచున్న, ముదావాప్తిన్ = సంతోషలబ్ధిచే, జగత్ప్రాణాత్మజా = జగత్ప్రాణకుమారా! అనుటచే నీతండ్రి ప్రపంచజనుల ప్రాణములు రక్షించినట్లు నీవు మాయందఱ ప్రాణములు రక్షించితి వని భావము.

తాత్పర్యము.

ఈ ప్రకారము మేఘగంభీరధ్వనితోఁ జెప్పుచున్న వానరాధిపతిని మహాతేజుని జూచి వానరు లందఱు నాశ్చర్యపడి మిగుల సంతోషించిరి. అప్పుడు జాంబవంతుఁడు హనుమంతునిఁ జూచి జగత్ప్రాణకుమారా, వీరసమూహముచే స్తోత్రము చేయఁబడువాఁడా! కేసరిపుత్రా! చుట్టముల శోకము నార్చితివి, నాయనా! మేలు మేలు.

క. కావున నీమే ల్గోరెడి, యీవనచరచక్రవాళ ♦ మెల్లను దమిఁ గా
ర్యావాప్తికిఁ గావించు శు,భావహముగ నీకు మంగ♦ళాశాసనముల్. ౧౪౪౪

చక్రవాళము = సమూహము, 'చక్రవాళంతు మండల'మ్మని యమరకోశము, శుభావహముగన్ = మేలుగలుగుటకై, మంగళాశాసనముల్ = దీవనలు.

తాత్పర్యము.

కా బట్టి నీ మేలు గోరుచున్న యీ వానర మండల మంతయు నీకుఁ గార్యసాధకముగ నీకు మేలగుటకై నీకు మంచిదీవన లిచ్చుచున్నది.

దీవింపయోగ్యత లేనివారికి, యోగ్యతయున్నను దీవింపఁదెలియని వారికి నమస్కరింపరాదు. ఆంజనేయుఁడు నమస్కరించెఁ గావున జాంబవంతుఁడు దీవించుచున్నాఁడు.

క. తపసుల ప్రసాదమహిమం, గపివృద్ధుల మతిని గురుల♦కరుణాగరిమన్
గపివీరలోక నాయక, విపులమహార్ణవము దాఁటి ♦ వెలయుము కీర్తిన్. ౧౪౪౫

తాత్పర్యము.

తపసుల యనుగ్రహప్రభావముచేతను వానరవృద్ధుల యభిప్రాయమునను గురువులదయచేతను కపిశ్రేష్ఠా! నీ వీ మహాసముద్రము దాఁటి కీర్తిచేఁబ్రకాశింపుము.

నీవు చేయఁబోవు కార్యము తపస్వులగు సాధువులకు సంతోషకరమైనది. కావున వారు నిన్ననుగ్రహింతురు. కులమునకుఁ గీర్తి తేఁబోవుచున్నావు. కావునఁ గులవృద్ధులు నిన్ననుగ్రహింతురు. ఇటువంటి మహాత్ముఁడు మనకు శిష్యుఁడయ్యెఁ గదా యని గురువులు నీ యందు దయ దలఁతురు. ఈబలముచే నీవు సముద్రము

దాటుదుము. కీర్తి సంపాదింపుదుము. ఈ గ్రంథకర్తకు నిది యన్వయించును. వీరల యను గ్రహముచేతనే యీ కృతి యను సముద్రము దాటఁ గలిగెను.

—♦ హనుమదాదులు మహేంద్రాద్రి నెక్కుట. ♦—

చ. నిలిచెద మేకపాదమున ♦ నీ వరుదెంచెడుదాఁక నిందు నీ
బలిముఖయోధయూథముల ♦ ప్రాణము లెల్లను త్వద్గతంబు లం
చెలమిని బల్కె వానరుల ♦ కిట్లను గాడుపుపట్టి చాలదీ
యిలయు మదీయలంఘనమ♦హిష్ఠ రయంబు నోకింత సైఁపఁగన్. ౧౪౪౬

ఏకపాదమునన్ = ఒంటికాలిమీఁద, త్వద్గతంబులు = నీ యధీనములు, ఎలమిని = సంతోషముతో, ఇలయు = భూమియు, మదీయలంఘన = నాయొక్క దాఁటుటయందలి, మహిష్ఠ = మిగుల గొప్పదగు, రయము = వేగము.

తాత్పర్యము.

హనుమంతా! నీవు వచ్చుదాఁక మేమొంటిపాదమున నిలిచి కాచి యుందుము, ఈ వానరసేనాసమూహముల ప్రాణములన్నియు నీ యధీనమం దున్నవి. నీవు మరల వచ్చి యెవరి ప్రాణములు వారి కీయవలయును, అని సంతోషముతోఁ బల్కఁగా నాంజనేయుఁడు వానరుల కిట్లనియె, నేను దాఁటు వేగము భూమి కొంచెమైన సహింపలేదు.

సీ. ఆ మహేంద్రాద్రిమ♦హాశిఖరంబులు, చటులస్థిరశిలా♦సంకటములు
నానాద్రుమవికీర్ణ♦మానితముల్ ధాతు,నిష్యందకాంతముల్ ♦ నిష్ఠురములు
కావున నవి యోపుఁ ♦ గడలి నూటామడ, దాఁటంగ నేను న♦త్సాహ మొప్ప
నా పాదములఘట్ట♦నంబును దాళంగ, నని వానరులతోడ ♦ నద్రి యెక్కి
తే. వివిధవృక్షలతాగుల్మవృతము సకల, మృగనిషేవితశాద్వలం ♦ బగణితోరు
నిత్యపుష్పఫలద్రుమ ♦ నీరపూర, సంకులము సింహశార్దూల♦చరిత మగుచు.

చటుల = అందమైన, "ఇతి చటులచాటుపటుచారుమురవైరిణో రాధికా మధివచన జాతం" గీతగో ౧౦. స్థిర = కదలని, శిలా = రాలచే, సంకటములు = ఇఱుకైనవి. ద్రుమ = చెట్లచే, వికీర్ణములు = నిండినవి. ధాతు నిష్యందకాంతముల్ = ధాతువులవలన స్రవించు రసముచే మనోహరములు, నిష్ఠురములు = కఠినములైనవి. ఘట్టనము = త్రొక్కుడు, శాద్వలము = పచ్చికపట్టు.

తాత్పర్యము.

ఆ మహేంద్ర పర్వత శిఖరములు రమ్యములై కదలనివియైన రాలచే నిండి యున్నవి. అనేక వృక్షములచే నిండినవి కావున శ్లాఘింపఁదగియున్నవి. ధాతువుల నుండి స్రవించు రసముచే మనోహరములైనవి. కఠినములైనవి కావున సముద్రము నూటామడ దాఁటుటకై నేనుత్సాహముతోఁ గాళ్ళతోఁ ద్రొక్కినపుడు సహింపఁ గలవు. అని కొండమీఁదికి వానరులతోడఁ బోయి నానావిధములయిన చెట్లచేతను

పాదలచేతను గ్రిమ్ముకొనఁబడి సకల మృగములచే సేవింపఁబడు పచ్చిక పట్టులు గలిగి పెద్దవియు సర్వదా పుష్పములు ఫలములు గల లెక్కలేని చెట్లచేతను జల ప్రవాహముల చేతను గలఁత చెందినదై సింహములు పులులు తిరుగునదియై.

క. మత్తద్విజగణరణితము, మత్తమతంగజయుతంబు ♦ మహనీయం బౌ
నత్తలమున విహరించెను, జిత్తం బుప్పొంగఁ బ్లవగ♦ శేఖరుఁ డంతన్. ౧౪౪౭

మత్త = మదించిన, ద్విజగణ = పక్షి సమూహములచే, రణితము = ధ్వనింపఁ బడినది.

తాత్పర్యము.

మదించిన పక్షుల కోలాహలధ్వనులు గలదై, మదించిన యేనుఁగులతోఁ గూడి గొప్పదైన యా ప్రదేశమున వానరశ్రేష్ఠుఁడైన హనుమంతుఁడు ప్రచారము సలిపెను.

సీ. పవమాననందన♦ పాదపీడిత మయి, సింహాభిహతదంతి♦ చెలువుఁ దాల్చె
క్షితిధరంబును విప్ర♦కీర్ణ శిలోచ్చయ, మై వారిపూరంబు ♦ నట్టె గ్రక్కె
బెదరెడు మృగములు ♦. కదలెడుకుజములు, నెగిరెడి విహగము ♦ లెడయు పాన
సక్తులౌ గంధర్వ♦చక్షుశ్శ్రవోమిథు,నంబులు డాఁగు ఫ♦ణాధరములు

తే. దనరి దొరలెడిఱాలు ఢీ♦ దాఁకుచుండఁ, గరకు శాత్రిని నిట్టూర్పు♦ గాడ్పు లోలయ
నర్ధనిస్సృతఫణులచే♦ నా నగంబు, వెలసె సపతాకరీతిని♦ వెఱపు గొలుప. ౧౪౪౮

పాదపీడితము = కాలితొ్రొక్కుడుచే బాధనొందినది, సింహాభిహతదంతి = సింహముచేఁ బడఁగొట్టఁబడిన యేనుఁగు, విప్రకీర్ణ = తాఱుమాఱైన, చెదరిన, శిలోచ్చయము = ఱాలసమూహము, ఎడయు = వేఱైపోవు, పానసక్తులు = మధు పానమం దాసక్తిగలవారు, చక్షుశ్శ్రవస్ = కన్నులే చెవులుగాఁగల పాముల, మిథు నంబులు = దంపతులు, ఫణాధరములు = పాములు, అర్ధనిస్సృతఫణులచేర్ = సగము వెలుపలపెట్టఁబడిన పడగలచే, సపతాకరీతిర్ = పతాకముతోఁ గూడినట్లు.

తాత్పర్యము.

ఆంజనేయుని పాదఘట్టనచేఁ బీడింపఁబడి సింహముచేఁ గొట్టఁబడిన యేనుఁగు వలె నా పర్వత ముండెను. ఆ పర్వతము తాఱుమాఱై చెదరిన ఱాలుగలదై నీటివంక లను గ్రక్కెను. భయపడిన మృగములు కదలు చున్న చెట్లు ఎగిరిపోయెడి పక్షులు ఒకరినొక రెడఁబాసిపోయెడి మధుపానసక్తులైన గంధర్వనాగదంపతులు బొక్కలలోఁ దూఱు పాములు గలిగి దొరలుచున్న రాలొకదానితో నొకటి ఢీకొట్టుచుండ మిగుల బాధపడి నిట్టూర్పువాయువులు వ్యాపింప సగము పడగలు వెళ్ళఁబెట్టియున్న పాము లచే నా పర్వతము ధ్వజముతోఁ గూడినదానివలె భయము గలిగించెను.

తే. త్రాససంభ్రాంతమునిజన♦త్యజ్యమాన, తచ్ఛిలోచ్చయములు గాఁ్రిలె♦ దారుణోరు
కాననాంతరసార్థ వి♦హీనపాంథు, పోల్కిఁ దలఁపించుచును వాయు♦పుత్రుఁ డపుడు.

త్రాస = భయముచేత, సంభ్రాంత = భ్రమగొన్న, మునిజన = మునుల సమూహముచే, త్యజ్యమాన = విడువఁబడుచున్న, తచ్ఛిలోచ్చయములు = ఆ కొండలు, దారుణ = భయంకరమైన, ఉరు=గొప్పదైన, కాననాంతర = అడవిలో నున్న, సార్థవిహీన = బిడారు విడిచిన, పాంథుపోల్కిఁ = బాటసారి విధమున,

తా త్ప ర్య ము.

భయముచే వ్యాకులులైన మునులచే విడువఁబడిన యా పర్వతములు భయంకరమై గొప్పదైన యడవియందుఁ దోడవచ్చిన గుంపు వదలిపోవఁగా నొంటి చిక్కిన బాటసారివలె నుండెను.

క. రంహోర్పితచిత్తుఁడు కపి,సింహము జవనాధికుండు ♦ శ్రీమహిముఁడు ద్వి
ట్సంహారకుఁడు మనస్వి సు,సంహతమతి యయ్యె లంక ♦ జన నవ్వేళన్. ౧౪౫౧

రంహస్ + అర్పిత + చిత్తుఁడు = వేగముగఁ బోవుటయందు మనస్సుంచినవాఁడు- జవనాధికుండు = మిగుల వేగముగలవాఁడు, శ్రీమహిముఁడు = శోభయొక్క ప్రభావము గలవాఁడు. ఇది సీతాదేవి యనుగ్రహమును సంపాదించుకొన్న వాఁడని సూచితము. ద్విట్ + సంహారకుఁడు = శత్రువుల సంహరించువాఁడు. లంకయందుఁ జేయఁ బోవు కార్యము సూచింపఁబడుచున్నది. మనస్వి = దృఢమైన మనస్సు గలవాఁడు, సీతారామ సంయోగమందుఁ బట్టుదల గలవాఁడు, సుసంహతమతి= దృఢపఱుచుకొన్న మనస్సు గలవాఁడు.

తా త్ప ర్య ము.

వేగముగఁ బోవుటయందు మనసు నిలిపినవాఁడు వేగము నందు గొప్పవాఁడు శోభామహిమగలవాఁడు శత్రుసంహారకుఁడు దృఢమైన మనస్సుగలవాఁడునగు వానరశ్రేష్ఠుఁడు హనుమంతుఁడు లంకకుఁ బోవలయు నని మనస్సు దృఢపఱిచికొనెను.

—♦ కిష్కింధాకాండాంత పద్యములు ♦—

క. మాయాతీతా నిజగురు, మాయాకలితావతార ♦ మాయావిమహా
మాయాధఃకరణచణా, మాయామయదివ్యదేహ ♦ మాయామోహా! ౧౪౫౨

మాయా+అతీతా = ప్రకృతిని దాఁటినవాఁడా! "తమసః పరస్తాత్" అనునది యనుసంధించునది, నిజ = తనయొక్క, గురు = గొప్పదగు, మాయా = సంకల్పము చేత, కలిత = పొందిన, అవతార = రామకృష్ణాద్యవతారములు గలవాఁడా, 'సంభవా మ్యాత్మమాయయా' యని, భ. గీ. భగవదవతారము లాయన యిచ్ఛాకృతములుగాని కర్మబద్ధములు గావని భావము. మాయావి = మోసగాండ్రు = మహామాయ = గొప్ప మోసమును అధఃకరణచణా = అణఁగదొక్కు సామర్థ్యము గలవాఁడా, మాయామయ దివ్యదేహ- ఆశ్చర్యకరమై అప్రాకృతమైన శుద్ధసత్త్వమయ దేహము కలవాఁడా! మాయామోహా = మాయ యనఁబడు ప్రకృతితత్త్వముచే

లోకమున జీవతత్త్వమును మోహింపఁ జేయువాఁడా! 'మాయాంతు ప్రకృతిం విద్ధి' యని శ్రుతి. ఇందలి ప్రథమాక్షరము రామమంత్రములోనిది.

తా త్ప ర్య ము.

ప్రకృతి నతిక్రమించినవాఁడా! స్వసంకల్పానుసారముగ నవతరించువాఁడా! మోసగాండ్ర మోసముల నణఁచుటయందు సమర్థుఁడా! ఆశ్చర్యకరమై యప్రాకృతమైన దివ్యశరీరము గలవాఁడా! ప్రకృతితత్త్వముచే జీవతత్త్వమును మోహింపఁ జేయువాఁడా!

వనమయూరము. స్నిగ్ధజనపాలనవి♦శిష్టసుచరిత్రా! ముగ్ధతరజీవిచయ♦మోహపరితప్తా!
దుగ్ధనిధివాస బుధ♦తోషణవిదగ్ధా! దిగ్ధసరసీజసమ♦దృగ్ధర రమేశా!

స్నిగ్ధజన = మిత్రులను, పాలన = రక్షించుట యనెడి, శిష్టసుచరిత్రా = గొప్ప నడవడి గలవాఁడా, ముగ్ధతర = మిగుల జ్ఞానులైన, జీవిచయ = ప్రాణిసమూహముయొక్క, మోహ = అజ్ఞానమునకు, పరితప్త = పరితాపము నొందువాఁడా, దుగ్ధనిధివాస = పాలసముద్రమందు వసించువాఁడా! బుధతోషణ విదగ్ధా _ పండితులను సంతోషపఱచుటయందు నేర్పరీ! దిగ్ధ = పూచిన, సరసిజసమ = కమలములతో సమానములైన, దృగ్ధర = కన్నులుగలవాఁడా, రమేశా = లక్ష్మీపతీ.

వనమయూరవృత్తమునకు భ-జ-స-న-గగలు గణములు; తొమ్మిదవయింట యతి.

కాంతి. భామాఽభయదా కృ♦పాళువరా
భూమిరుహచారి♦పుంగవహా
రామైకశిలాపు♦రాశ్రయణా
సోమాననబింబ ♦ సోమనుతా.

భామాఽభయదా = స్త్రీకి నభయ మిచ్చినవాఁడా, శబరిని రక్షించినవాఁడా! కృపాళువరా=దయగలవారి యందు శ్రేష్ఠుఁడా, భూమిరుహచారి పుంగవహా=వానర శ్రేష్ఠుఁడైన వాలిని జంపినవాఁడా, ఈ మూఁడును గిష్కింధాకాండమందలి చరిత్రములు, రామ = మనోహరమైన, ఏకశిలాపురాశ్రయణా = ఏకశిలాపురమనఁబడు నొంటిమిట్ట నాశ్రయించియుండు వాఁడా, సోమానన బింబ = చంద్రునివంటి ముఖమండలముగలవాఁడా, సోమనుతా = ఉమాసహితుఁడైన శివునిచే స్తోత్రము చేయఁబడువాఁడా! మూఁడపాదంబున నఖండయతి.

కాంతివృత్తమునకు భజభగలు గణములు, ఏడవస్థానంబున యతి.

ఈ పద్యంబున భామాభయ యను నక్షరములు సాంఖ్యశాస్త్ర ప్రకారము ౧౪౫౪ యని యీ కాండమందలి పద్యసంఖ్యను దెలుపుచున్నది.

సీ. జానకీ రఘురామ ♦ చరణసేవాసక్త, చిత్తుఁడై తత్కృపా♦సక్తి కతన
వామలూరూద్భవు♦ పాదముల్ తలఁదాల్చి, ప్రత్యక్షబ్రహ్మాత్మ♦భవున కెరఁగి
యభివాదనము సల్పి♦యాచార్యులకు నెల్ల, వ్యాఖ్యాతలకును సా♦ష్టాంగ మెరఁగి
పరమ భక్తులును బ్రపన్నులు ముదమొంద, స్వాంధ్రవాల్మీకి రా♦మాయణమున
తే. ఘనతరంబైన వనచర♦కాండమునకు, వాసుదాసుండు రచియించి వ్యాఖ్య దీని
మందరమనంగ శ్రీరామ♦చంద్రవిభున, కర్పణముచేసె జన్మంబు♦సార్థకముగ.

సీ. తన పాదభక్తుల ♦ తనయునిగాఁజేసి, యనుకంప వీక్షించె ♦ జననమంద
ఆవలఁ దా లక్ష్మ♦ణార్యుఁడై రక్షించి, రామాయణం బను♦గ్రహముచేసె
స్వీయమంత్రంబును ♦ జేట్లూరి నరసింహ, దేశికుండై యుప♦దేశ మిచ్చె
ఏకశిలానగ♦రౌకుఁడై గ్రహియించి, యాంధ్రవాల్మీకిరా♦మాయణంబు
ఆ.వె. వ్యాఖ్య దాని కిపుడు ♦ వ్రాయించు కొనియెను, గరిమతో వనచర ♦ కాండమునకు
వాసుదాసుచేత ♦ స్వప్రభావంబును, బ్రకటపఱుప రామ♦భద్రవిభుఁడు.

గద్యము.

ఇది శ్రీమద్రామచంద్ర చరణారవింద మిళిందాయమాన, మానసత్వ మహావైభవ
వావిలికొలను రామచంద్రరాయతనూభవ సుజనవిధేయ, కవిసార్వభౌ
మాంధ్రవాల్మీకీత్యాది బిరుదాంకిత సుబ్బరాయ (వాసుదాస)
నామధేయ ప్రణీతంబైన మందరాఖ్య స్వయంకృత వ్యాఖ్యాన
సమేత శ్రీమదాంధ్రవాల్మీకిరామాయణ మను
నిర్వచనమహాకావ్యంబు నందు
కిష్కింధాకాండము.

శ్రీ రామార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ

శ్లో. నమోస్తు రామాయ సలక్ష్మణాయ, నమోస్తు దేవ్యై జనకాత్మజాయై
నమోస్తు వాతాత్మభువే వరాయ, నమోస్తు వల్మీకభవాయ తస్మై.

